ఓం శ్రీరామ, జయరామ, జయజయరామ.



# శ్రీ గాంధిమాహాత్మ్యము

(శ్రీమద్రామాయణ, మహాభారత భాగవతములవలె చంపూకావ్యముగ రచింపఁబడిన మహాత్ముని సమగ్రజీవితచరిత్ర)

## ప్రథమపంచకము




రచయిత:

అష్టావధాని, విద్వాన్, అంబటి, సుబ్బరాయగుప్త. M. A, B. O. L B.Ed.

(Retired Lecturer & Research Scholar)

12, Venkatesa Mudali Street, New Market Farm, New Washermanpet

MADRAS-21





తొలిముద్రణ.
జనవరి 1969.


మూల్యము.
మేలుప్రతి రూ 12/-
సాదాప్రతి రూ 10/-

## ప్రార్థనాదికము

శ్రీరామామణినిఁ, దదీయ రమణుఁ ♦ సేవింతుఁ దత్పుత్రు నా
శ్రీరామా స్నుషనుఁ శివాశివుల ప్రా♦ర్థింతుం దదీయాత్మజుఁ
శ్రీరామాంకితమైన గాంధిచరిత ♦ శ్రీ దివ్యకావ్యామృత
శ్రీరామామణినిం జిరాయురురు కీ♦ర్తి శ్రీలచే నోముఁగన్

వ్యాసవాల్మీకి కాళిదా♦సాద్య నేక
దేవభాషా కవుల నన్న ♦ తిక్క నెర్ర
నల్ల తిరువళ్ళువరు షేక్స్పి♦యరు రవీంద్ర
పోతన త్యాగరాజాది ♦ నీతిభక్త
దేశభాషా కవుల నను♦దినము దలతు

రామాయణముబోలె ♦ రమణీయభావార్థ, బోధకమ్ము మహాత్ము ♦ పుణ్యగాథ
భారతమ్మునుబోలె ♦ బహుధర్మ మర్మార్థ, బోధకమ్మగు గాంధి ♦ సాధుచరిత
భాగవతముబోలె ♦ భగవంతు లీలార్థ, బోధకమ్ము మహాత్ము ♦ పూతగాథ
ప్రాచీన భారతా ♦ ర్వాచీన పాశ్చాత్య, నీతిబోధకము గాం♦ధీ చరిత్ర
నిఖిలనిగమ సార♦నిధియును, సముధిక, శాస్త్రసమితి యుపని ♦ షత్పురాణ
ధర్మసూక్తి ధనని ♦ ధానమ్ముగాదె గాం, ధేయ కావ్యమెల్ల ♦ శ్రేయమీయ

తెలిసి గాంధిగాథ ♦ పలుకుట సాధ్యమే
నలువకైన మొదటి ♦ చిలువకైన?
గాంధి వాఙ్మయమున ♦ గన్నంత, విన్నంత
బుధులవలన వ్రాయ♦బూనె దిందు.

అర్థసౌలభ్య, లయలె మ♦దాశయమ్ము
లగుట గ్రాంధికమో వ్యవ♦హార భాష
ఆశ్రయింతును బ్రీతిగా ♦ నందరికిని
నాదు గాంధేయ కావ్యాబ్ధి ♦ నీదుటందు

కొందరు గ్రాంధిక భాషకు, కొందరు వ్యవహారభాష♦కు న్మడివడుటన్
కొందలమందెదు తెలుఁగున, నందరి కందమగు చంద ♦ మవలంబింతున్

ఆద్యంబు సకలభాషల, పద్యకవిత్వంబు గాన ♦ బద్ధము శ్రుతికిన్
హృద్యంబగు, ధారణకు సు,సాధ్యంబ నవద్యమగుచు ♦ సర్వప్రజకున్

తప్పు లేకుండ కవితనే ♦ చెప్పెదంచు
గుండెపై చేయివైచి యె♦వ్వండు చెప్పఁ
గలడు, విబుధులు కోవిదుల్ ♦ కరము కరుణ
తమను గల హంస లట్లుంట ♦ కశనగాని,

### స్వ వి ష య ము

శ్రీవేంకటేశ్వరు ♦ నావాసమునకుఁ గడపయైన కడపమం♦డలము మాది
శ్రీరంగనాథ వి♦హారభూమిగ గీర్తిఁగన్న పుల్వెంద్ల నా ♦ కన్నపురము
పురమునకుం బ్రాణ♦మును సంఘమునకు బ్రా. పైనట్టి యార్యవై♦శ్యాన్వయుండ
అర్థుల కహరహం ♦ బఁబలివోయుటఁగ, అంబటి యింటిపే♦రయ్యె మాకు

నాగమాంబ నాగయ్యలు ♦ నాదు తల్లి
దండ్రు, లెనమండుగురు నాకు ♦ తనయులు, సతి
సుబ్బలక్ష్మమ్మ దివికేగె ♦ సుతలు కావ్య
తతులె కీర్తిధనమ్ము సం♦తతముగూర్చె
సుబ్బరాయాహ్వయుండ య♦శోధనుండ

మును విశ్వావసు వత్సరమున ఫాల్గుణ పర్వదినము ♦ బుట్టితి నాంధ్రం
బున నాంగ్లంబున నందితి, ఘనపట్టము: లొజ్జవృత్తిఁ ♦ గడచనె వయసుఁగ

బాల్యమాదిగ హరికథా ♦ భజనలందు
సాహితీజ్ఞాన సంపదా♦ర్జనమునందు
సంస్కృతాంధ్రాంగ్ల వాఙ్మయ ♦ చరితలఁ బరి
శోధనములందు బైకొనఁ ♦ జొచ్చె ముదిమి

ఇక వేచియుంట తగదని, ప్రకటింపగ బూనుకొంటి ♦ రచనల బైపై
నొకటొకటిగ నిపుడీ గాంధి కథా మాహాత్మ్య చరితఁ ♦ దెరపై నిడితిన్.

---

## మనవి

భారతజాతి శ్రేయస్సునకును, దన్మూలమున విశ్వశ్రేయమునకు దన యావజ్జీవితము నిస్స్వార్థ కృషి చేసిన గాంధిమహాత్ముని కాది నీతిజ్యోతిగా పేర్కొనబడిన శ్రవణుపితృభక్తి నాటకగాథ 1963 లో శ్రవణచరిత్ర (పద్యకావ్యము)గా నా ప్రచురించినది గాంచిన నామిత్రులు పలువురు గాంధిమహాత్ముని జీవితచరిత్రను సమగ్రముగా మన మహాభారత రామాయణాదికావ్యములవలె వ్రాయమని ప్రోత్సహించిరి. వ్రాయుటకుమాత్రము సంసారవ్యాసంగములేని నాకెంతో యవకాశ మున్నను, ఆ వ్రాసినదానిని ప్రచురించుటకు వలయు నార్థికశక్తిలేమిచే వెంటనే తద్రచన కుత్సహింపనైతిని. ఇట్లుండ "పుస్తకప్రపంచం (జనవరి 1965వ సంచిక)లో మహాత్మా గాంధిజీవితాన్ని ఆయనసిద్ధాంతలనూ వివరిస్తూ గాంధీ ఆయనమంటూ రామాయణంలాగా, భారతంలాగా, ఒక మహాకావ్యాన్ని ఎవరువ్రాసినా, వారికి తాను స్వంతంగా 10 వేలరూపాయలు బహుమానంగా యిస్తానని బీహారు గవర్నరు శ్రీ అనంతశయనం అయ్యంగారు ప్రకటించారు" అను ప్రకటనఁ గాంచి, వ్రాసిన నాగ్రంథప్రచురణకు ధనాభావ ముండదుకదా అని రచన కుపక్రమించి 1965 ఏప్రిల్ 9వ తేది నీ బృహత్కావ్యమునకు శ్రీకారముచుట్టి 18 స్కంధముల గ్రంథము రచింప

సంకల్పించితిని. మూడువత్సరములు నిర్విరామకృషిఫలితముగా 15 స్కంధముల గ్రంథము పూర్తియైనది. మహాత్ముని శతజయంతి ప్రారంభమగునాటికి నీకావ్యప్రచురణ నారంభింపదలచి 1968 మేనెలలో నప్పటికి రిటైరయి తిరుపతిలోనున్న శ్రీ అనంతశయనం అయ్యంగారికి వ్రాసితిని. వారు 1965 లో తాముచేసినప్రకటన బీహారుప్రభుత్వపక్షమున హిందీలో రచింపబడుట కుద్దేశింపబడినదని బదులువ్రాసిరి. అయినను ఆంధ్రమహాశయులందు నాకుగల అచంచలవిశ్వాసబలమున, నా స్వల్పార్జితమునుండి వ్యయించి మొదటి అయిదుస్కంధములభాగము, ప్రథమపంచకమని ప్రచురించి బహుధనవ్యయ ప్రయాసలకోర్చి శ్రీ రామచంద్రమూర్తికృపచే నేటికి ప్రచురింపగలిగితిని. మిగిలినగ్రంథము ద్వితీయషట్కము, తృతీయసప్తకములుగా (అవిరెండును ఒక్కొక్కటి రమారమి ప్రథమపంచకమంతే యుండును) ఆంధ్రమహాశయుల ప్రోత్సాహాదర సహాయసంపత్తిచే త్వరలో ప్రచురింపబడగలవని ఆశించుచున్నాను.

ఈరచనయందు మహాత్ముని ఆత్మకథయేకాక, మహాత్మునిగూర్చి ఆంగ్లమందుగల యితర రచనల ననేకము ననుసరించితిని. చరిత్ర సమగ్రముగానుండుట కందందు స్కంధాంతములం దనుబంధ రచనగూడా జరిగినది.

మహాత్ముని అపురూపభావముల కనురూపమగుభాష ఆంధ్రమందు గానరామి, ఆంగ్లపదజాలము నాశ్రయించుట నివార్యమైనది. నా డార్యసంపర్కమున, ఆర్యభాషయగు సంస్కృతభాషాసంపర్కము గల్గినట్లే నేడాంగ్లజాతిసంపర్కమువలన వారి ఆంగ్లభాషాసంపర్కము మనకు తప్పని సరియైనది.

సాధ్యమైనంత శ్రద్ధాసక్తులతో నీకావ్యమున కీరూపమిచ్చిన శ్రీ చంద్రికాప్రెస్సు యజమానియగు శ్రీ పమ్మి పొన్నయ్యశెట్టిగారికిని, బైండరు సుబ్బరాయునకు నా యభినందనలు. చేతనైన ధనసహాయముతోబాటు నాకు సంసారభారబాధ్యతలనుండి విముక్తిగల్గించి, నా యీకావ్యరచనకు వలయు నవకాశముగల్గించిన నా కొడుకులకు, కోండ్రకు నా శుభాశీస్సులు. భారమనక, యీకావ్యమునకు పీఠిక వ్రాసిపంపిన సుప్రసిద్ధ దేశభక్తులును, ఆంధ్రమందు మహాత్మ గాంధిచరిత్ర మొదట రచించినవారును, శ్రీ గోవిందరామాయణకర్తలును, శ్రీరామభక్తుడు నగు శ్రీమాన్, ఆత్మూరి గోవిందాచార్యులవారికి నా నమోవాకములు. ఈగ్రంథముద్రణ కితోధికముగా ధనసహాయముచేసిన, చేసెదమని మాటయిచ్చినవారినామములు వచ్చేసంపుటియందు ప్రకటింపబడును. వారికందరికి నా శుభాకాంక్షలు.

నేటి గద్యయుగమునకు ప్రియంబుగా గద్యమువలె పద్యమును హృద్యముగా నడిపించుటకు, యతిప్రాసాదిక ఛందోనిబంధనలందును, సంధులు, శకటరేఫానుస్వారాదిక, వ్యాకరణపుముడులందును, కొంతమడి సడలింపబడినది. ముద్రారాక్షసములు చాలవరకు తప్పొప్పులపట్టికలో చేరినవి. చేరనివి సామాన్యులుకూడా సందర్భమునుబట్టి అర్థము చేసికోగలవి. ఇందుకు రసజ్ఞులగు చదువరులు క్షమింతురుగాక.

అపశబ్దంబుల గూడియున్ హరిచరిత్రాలాపముల్ సర్వపా
ప పరిత్యాగము సేయు........(భాగవతము - ప్ర. స్కం. 97 వ పద్యం).

మదరాసు
6-12-1968

అఖిలజనవిధేయుడు
అంబటి. సుబ్బరాయుడు.

# పీఠిక

## శ్రీమాన్, ఆత్మకూరి - గోవిందాచార్యులుగారు మహాత్మ గాంధిజీచరిత్ర, భారతదేశార్థిక రాజ్యాంగచరిత్ర, గోవిందరామాయణాది బహుకావ్యకర్త.

ఇది శుభదినము. గాంధీ శతజయంతి ఉత్సవమునాడు, పీఠికార్థమై విద్వాన్ శ్రీ సుబ్బరాయశాస్త్రిగారిచే పంపబడిన "శ్రీ గాంధి మహాత్మ్యము" అను చంపూకావ్యము నందుకొంటిని. ఆనందప్రదమైనది.

ఇతివృత్తము :—శ్రీ గాంధీమహాత్ముని చరిత్రమే యిందలి యితివృత్తము. గాంధీ సత్యాన్వేషణ జీవితగాథయే. మన శ్రీమద్రామాయణ మహాభారత భాగవతాదులవలె చంపువుగాననగా గద్య పద్యములు గల కావ్యముగా రచింపబడినది. 1920 వ సంవత్సరమునందే, నేనును గాంధీ జీవితమును వ్రాసినవాడనయ్యు, నీ కావ్యమును ఆమూలాగ్రముగా, జదువుదాక విడువజాలనైతిని. ఇందులో మూడువేల మూడువందలకు పైగా పద్య గద్యములు గలవు. ఇందు గాంధిజీ యాత్మకథ నాధారముగా రచించినందువలన, నీప్రథమపంచక సంపుటమునందు 1920 వరకుగల గాంధిజీ జీవితచరిత్రగలదు. ఇందలి స్కంధవిభాగము భాగవతపురాణమును స్మరింపజేయుచున్నది. భాగవతము శ్రీకృష్ణావతార గాథ. ఈ యుగపురుషుడైన గాంధీమహాత్ముడుగూడ అవతార పురుషుడే. కనుక నాయన జీవితగాథం దెలుపు గ్రంథమున స్కంధనామము వాడుట సమంజసము.

శ్రీరామకృష్ణా ద్యవతారములు దుష్టశిక్షణార్థము సంభవించినవి. రావణ కంసాది దుష్టాత్ముల రాజ్యభ్రష్టుల గావించి శిక్షించినవి. గాంధియో భారతావని యందలి, ఆంగ్లేయ సామ్రాజ్యాంతము గావించుట కుద్భవించిన అవతారపురుషుఁడు. అయితే రామకృష్ణా ద్యవతారములకును, మన గాంధీ యవతారమునకును సాధనవిధానముల జాల వ్యత్యాసము గలదు.

సాధనవిధానము :—"సుఖ దుఃఖములను, లాభా లాభములను, జయాప జయములను సమానముగాగొని, యుద్ధ మొనరింప హింసాపాప మంటదు" అను గీతావాక్యము ననుసరించి, రామకృష్ణా ద్యవతారములు, తమతమ యవతార ధర్మముల నిర్వహించినవి. గాంధి దుష్టుల శిక్షించుటకుమారు, వారిని శిష్టులుగ బరివర్తన మొనర్పగలుగు నహింసా సాధనమే సాధనముగా గొనినాడు. "ధిగ్బలం క్షత్రియబలం, బ్రహ్మతేజోబలం బలం" అని రామాయణమున వశిష్టునితో పోరుసల్పి, ఓడిన విశ్వామిత్రుని వాక్యముల సత్యము నిరూపించినవాడు గాంధి. 'అహింసా పరమోధర్మః' అను వేదవాక్యము, జీవితమునం దాచరణమందుంచి లక్షలకొలది తన దేశీయులచే నాచరింప జేసినవాడు గాంధి. బ్రహ్మశక్తి బలమెట్టిదో ఆచరణరూపమున బ్రదర్శించినవాఁడీ మన యవతారమూర్తియగు గాంధి. నేటి ప్రపంచము నంతయు నావహించి, యలముకొన్న హింసాప్రవృత్తి నెదుర్కొన గలిగినది 'అహింసాశక్తి'యే యని ఋజువుచేసినవాఁడీ యవతారమూర్తి. మారణాస్త్రబలమున విఱ్ఱవీగు ఆంగ్లసైనిక పశుబలమును, ఆత్మశక్తిచే నోడించినవాఁడీ యవతారమూర్తి. ప్రేమరూపమగు, సత్యాగ్రహాస్త్ర మీయన సాధనవిధానము. ప్రపంచ చరిత్రలో రక్తసిక్తములైన యుద్ధములవలన రాజ్యస్థాపన మొనర్చిన యుదంతము లెన్నియో కలవు. ఘోరసంగ్రామరంగముల, రాజ్యముల గోల్పోవుటలుగూర్చి చరిత్ర బోధించుచున్నది. అహింసాయుత సత్యవ్రతానుష్ఠానమున రవి అస్తమింపని మహాసామ్రాజ్యమును లొంగదీసి నటువంటి కథ నింతవరకు చరిత్రయందు చదివినది లేదు. ఇందువలననే మోహనదాసు కరంచందు గాంధీమహాత్ముడు భారతీయ దాస్యశృంఖలముల దెగగొట్ట నవతరించిన మహాత్కార్యావతారము. దైవాంశసంభూతుడు. జాతి, మత వ్యక్తిగతాదికముగు నెట్టి ద్వేషములేని, ఆత్మార్పణ యోగశక్తిచే విజయుడైనవాడు గాంధి.

శ్లో. "లౌకికానాంహి సాధునామర్థం వాగనువర్తతే ।
ఋషీణాం పునరార్యాణాం వాచ మర్థోనుపధావతి ॥

అనుభవభూతి మహాకవి వాక్యములు ఋజువైనవి. (లౌకికులైన సాధువులయొక్క యర్థమును వాక్కనుసరించుచున్నది. ఆర్యులైన ఋషులవాక్కు, అర్థము ననుసరించుచున్నది.) పొండు, పొండని దిశాంతములు మారుమ్రోగ మహాత్ముడు గర్జించినాడు (Quit India). మాట, ముల్లె గట్టుకొని తెల్లపులి, పిల్లియై సీమకు తరలినది. మహాత్ముని సత్యాగ్రహశక్తి దిగంతముల కావహించినది.

చరిత్రకు నూతనాధ్యాయము :—ఒక బక్కచిక్కిన గోచీపాతరాయుని వాక్కు ననుసరించి మూడువందల ఏండ్లు రాజ్యము సాగించిన మహాసామ్రాజ్యము క్షణమాత్రమునం దంతరించినది. అహింసచే హింసనోడించి యీ భారతదేశ స్వాతంత్ర్యము సంపాదింపగల్గిన అవతార పురుషుని జీవితగాథ చరిత్రమం దొక నూతనాధ్యాయమును వ్రాసినది. ఈమన అవతారమూర్తి పవిత్ర స్మృతి సువర్ణాక్షరములతో విశ్వమానవ స్వాతంత్ర్య చరిత్రలో శాశ్వతముగా లిఖింపబడినది.

బుద్ధుడు, ఏసు, గాంధి :—రాజ్యాంగ చరిత్రయందే గాక, మతప్రవర్తకుల చరిత్రమందు కూడ, మన యవతారమూర్తియగు గాంధి, యొక వినూతనాధ్యాయమున వ్రాసినవాఁడు. అహింసను, జీవకారుణ్యమును బుద్ధభగవానుడు బోధించెనుగాని యహింసావ్రతమునం దిమిడియున్న ప్రేమాస్త్ర మహత్తరశక్తిని జనసామాన్యమున ప్రసరింపజేయలేదు. క్రీస్తుప్రభువు, అహింసాతత్త్వప్రబోధ మొనరించినవాడే కాని, దానిని మారణాస్త్రముల నెదుర్కొనగలిగిన శక్తివంతముగ ప్రదర్శించినవాడు కాడు. రాజుల హింసచే మరణించెనేకాని, రాజ్యాధిపతుల నహింసా ప్రేమలచే లొంగదీసినవాడు కాడు. మన మహాత్ముడో బానిసయై, పౌరుషమును తేజమును గోల్పోయియుండిన, భారతావనియందు మట్టినుండి మహావీరుల సృష్టించినవాడీ మహాత్ముడు. లక్షలకొలది ప్రజల నహింసావ్రత దక్షులుగా నొనరింపగల్గినవాడీ మహాత్ముడు. ప్రేమాస్త్ర ప్రయోగమున, కార్యసాఫల్యము బొందినవాడీ మహాత్ముడు. హింసా ప్రవృత్తియందో అల్లాడుచున్న నీప్రపంచమున కహింసా సందేశ మొసంగినవాడీ మహాత్ముడు. ఇట్టి యవతార మింతవరకే పురాణకాలమందును అవతరించి యుండలేదు. అందువలననే నేటి విశ్వమం దెల్లయెడల గాంధిమహాత్ముని శతజయంతి ఉత్సవములు జరుపబడుచున్నవి. మహాత్ముని స్మృతిచిహ్నములు నెలకొల్పబడినవి.

ఈ కావ్యము :—ఈ మహాకావ్య మట్టిస్మృతిచిహ్నమే. శిలావిగ్రహములు, కట్టడముల వంటి స్మృతిచిహ్నములు కొంతకాలమునకు శిథిలములు గావచ్చును. కాని కావ్య మట్లుగాదు. ఆంధ్రవాఙ్మయమున శాశ్వతస్థానము, అమరత్వము నీకావ్యమునకు లభింపగలవు. వివిధ పద్య గద్య ప్రసన్న కవితా ప్రవాహమున, రసతరంగము లిందు పాఠకుల నోలలాడింపగలవు. తేటమాటలతో, పద్యభావము లన్నియు పాఠకుల హృదయాంతరాళములందు జొచ్చుకొనిపోవుచున్నవి. సరసమగు శైలి, సూటియగు మాట, ప్రసన్న భావప్రకటనములతో ద్రాక్షాపాకమున, ప్రతి పద్యము మధురముగ నున్నది. ఆర్ద్రహృదయమున భక్తిప్రపత్తులతో రచింపబడిన మహత్తర కావ్య మియ్యది. గాంధీజీ జీవితగాథయం దేయేఘట్టములనెం దెట్టిధర్మములు సముద్భవించినవో, ఆయా ధర్మము లన్నియు నాయా ఘట్టములందు వివరింపబడినవి. గాంధిభక్తులు సుకవితాప్రియులు భాషాప్రియులు నానందింప గలుగుటయేగాక, యీగ్రంథ మాబాలగోపాల మందరిని మహదానందభరితులుగా జేయగలదిగా వ్రాయబడినది.

విద్యార్థులు :—ఇట్టి యవతార పురుషుడగు గాంధిమహాత్ముని జీవితచరిత్ర, తరతరములుగా నాంధ్రుల స్మృతిపథంబునం దుండుట కీ కావ్య మెంతయో యుపయోగకరమైనది

ఆంధ్ర, ఉస్మానియా, వెంకటేశ్వర, మద్రాసు, మైసూరు మొదలగు విశ్వవిద్యాలయము లంద విద్యార్థులకు, పి. యు. సి. మొదలు బి. ఏ., ఎం. ఏల వరకీ కావ్యము పాఠ్యగ్రంథముగా నుండుట కెంతయో తగియున్నది. ఈ కావ్యము నిర్దుష్టము. ఇందలి యితివృత్తము లోకై పూజ్యుని సత్యాన్వేషణచరిత్ర. ఇందు విద్యార్థులు చదివి, మననము చేసికొనదగు ధర్మవ లెన్నియో ప్రబోధింపబడినవి. విశ్వవిద్యాలయము లీ గ్రంథమును బఠనీయ గ్రంథముగా నొనరి యువతీయువకుల హృదయసీమలందు గాంధి మాహాత్మ్యమును సుస్థిర మొనరించెదరుగాక. ఈ మహత్తర కావ్యమును రచించిన, శ్రీ సుబ్బరాయగుప్తగారు ధన్యులు. వీరి కవితయు ధన్య మము. ఈ సద్గ్రంథమునకు బీఠిక వ్రాసి, అస్మద్గురువర్యుల సంస్మృతిని బొందుటకు నాకు, అ కాశ మిచ్చిన శ్రీ గుప్తగారికి కృతజ్ఞుడను. ఆంధ్రలోకమున నీ కావ్యము చిరంజీవి యగుగాక మిగిలిన గాంధి చరిత్రమునుగూడ శ్రీ గుప్తగా రచిరకాలముననే ఆంధ్రుల కర్పింతురుగాక కృతి భర్త శ్రీ సీతారామచంద్రమూర్తి శ్రీ గుప్తగారి నాశీర్వదించుగాక! ఈ కావ్యము పఠించ వారికి నాలకించువారికిని సకలాయురారోగ్య భాగ్యముల ప్రసాదించుగాక!

6-1-911/1, ఖైరతాబాదు }
హైదరాబాదు - (ఆంధ్రప్రదేశ్) }

ఆత్మకూరి. గోవిందాచార్యులు.
శ్రీ సీతారామనిలయం

---

(తప్పొప్పులపట్టికలో 300 వ పేజీ తరువాయి)

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 267 | 30 | శోభానియుక్ | శోభానినిక్ |
| 267 | 27 | డోకనాడు | డొక్కదినమ్ము |
| 268 | 9 | కరువడి | కడువడి |
| 272 | 15 | నరిగిరైన | నరిగిరయిన |
| ,, | 23 | లేనియెడ | లేనియెడల |
| ,, | 26 | పురి | పురికి |
| ,, | 29 | జనమ్ములధి | జనమ్మధి |
| 273 | 2 | రేగవచ్చును | రేగవచ్చునని |
| 273 | 2 | రేగివచ్చును | రేగవచ్చునని |
| 278 | 11 | బొంబె | బొంబే |
| 280 | 4 | దీరికగును | దీరికగను |
| ,, | 32 | వాసరత్ | హసరత్ |
| 281 | 19 | వమున | నమున |
| 281 | 25 | హిందిలోని | హిందిలోన |
| 285 | 13 | రొుడ | యెడ |
| 286 | 5 | దాల్పు | దాల్చు |
| 290 | 6 | సాదువు | సాధువు |
| ,, | 23 | లేనియెడ | లేనియెడల |
| ,, | 29 | జనమ్ములధి | జనమ్మధి |
| 291 | 10-11 | యద్బృశ్యములగు | యద్బృశ్యమగు |
| 292 | 16 | చరి | చరిత |
| 294 | 12 | పూజ్యములగలు | పూజ్యముగను |

ఓం శ్రీరామ, జయరామ, జయజయరామ

# శ్రీ గాంధి మాహాత్మ్యము

## ప్రథమస్కంధము



రామా రాఘవ రా
జా రామా రామరామ ♦ జయజయరామా
కారుణ్యామృతధామా
శ్రీరవికులజలధిసోమ ♦ సీతారామా!

### పుట్టుపూర్వోత్తరాలు — 1869

శా. శ్రీమద్భారతదేశమందు మును శ్రీ♦కృష్ణుండు నిర్మింపసు
శ్రీమంతం బయినట్టి ద్వారవతి కీ♦ర్తిం గాంచె క్షేత్రాళినే
శ్రీమాన్యంబగు సీమ నాకధియ వా♦రే సర్వకాలంబులన్
శ్రీమానాథు దలంపఁజేయు పురుష♦శ్రేష్ఠుంగనెం బ్రీతిమై. 1

తే. ద్వారకాపురి నిండు ద♦ర్బారులోన
స్వాగతంబిచ్చి తన చిన్న♦వయసునాటి
తోడివిద్యార్థి యని ప్రేమ♦తోడఁ గాంచె
నే సుగుణధాము సుదాము శ్రీ♦కృష్ణమూర్తి. ౨

చ. కలిగినవాఁడ నేడనక ♦ గర్వముఁ బూనక తొంటినెయ్యముం
దలచుట ధర్మమంచు దయ♦దాపునఁ జేర్చి కుచేలు నెచ్చెలిం
బలెమునువోలె గాంచి తని♦వారగ నెవ్వని కిచ్చె మున్ను వే
కలుములఁ గృష్ణుఁ డాతని ని♦కాయమెసంగు సుదామ మప్పురిన్. 3

తే. ఆ సుదామపురంబున ♦ నవతరించె, పదియునెన్మిదివందల♦ర్వదియుఁదొమ్మి
దవ శరత్తు అక్టోబరు రెం♦డవదినమున, గాంధి శ్రీపుత్తలీభాయి♦గర్భమందు 4

ఆ. శుక్లవత్సరమున ♦ శుభదినమగు భాద్ర,పదమునందు కృష్ణ♦పక్షమందు
ద్వాదశి శనివాస♦రోదయమ్మున మఖ,యందు దులనుగాంధి ♦ యవతరించె. 5

సీ. వణిజులు చిల్లర - వర్తకుల్ కుటియాన, వాసులు మోహాను - వంశ్యులాది
కాలాన వారిలోఁ - గడు సాహసుం డగు, హరజీవన్ పోరుబం-దరున గొనియె

పదునేడునూర్ల డెబ్బదియేడవాబ్దమునందు గృహము నివా-సార్థమొందు
కొడుకులతోడ స్వ-కులవృత్తి వ్యాపార, మొనరించుచుండ నం-దుత్తమసుతు
గీ. డైన ఉత్తమచందు దివానుగాను. పోరుబందరు రాజ్యప్ర♦భుత్వమందు
నియమితుడుగాఁ ప్రఖ్యాతి♦ని డెగాంధి, వారల కుటుంబమునకు న♦వ్వారిగాను.
సీ. పుత్తలీబాయి ప-త్నుణ్యాంగనామణీ, పూర్వపుణ్యమ్ముల - ప్రోవనంగ
ఘూర్జరవైశ్యుల - నిర్జరేంద్రుండన, భారతీయులనోము - పంటనంగ
ఉత్తమగుణకంధి - యుత్తమచందు గాం,ధీపౌత్రు డగుచుఁ ద-దీయధీర
గౌరవోదారుడై - కడు కరుణాసాంద్రు,డగు కరంచందుకు - నాత్మజాతుఁ
గీ. డగుచు నాస్థైర్య సత్యగు♦ణాఢ్యుడగుచు. నవతరించెను గాంధీమ♦హాత్ముడవని
పోరుబందరుపుర్మందు ♦ నూరుజాత, కులమునందున బృందార♦కులు నుతింప. 7
చ. ఉత్తమనీతిమంతుడగు ♦ నుత్తమచందల పోరుబందరం
దుత్తమమౌ దివాన్ పదవి♦నుండి యొకప్పుడు రాజకీయమౌ
ఎత్తులనోడి వీడి పద♦వీపథముం జనె "జూనఘాడు" కం
దెత్తె సలామొనర్ప దద♦ధీశ నవాబుకు వామహస్తమున్. 8
క. ఇట్లమర్యాదగా నేల ♦ నెడమచేత, వందనం బిడెదంచందు ♦ ప్రశ్న వేయ
నాదు కుడిచేయి పోరుబం♦దరు వరునకె, మీాదుకట్టగ బడెనంచు♦ మేలిసాహ
సమున బల్కెను నియమ శీ♦లమునఁ జేసి 9
వ. అట్టి సాహసోదార చరితుం డగు నుత్తమచందు నందనుండు కరంచందు నా
బరగు నతఁడు. 10
ఆ. సత్యగుణుఁడు మిగుల♦సాహసధనుడు ము కొ్కపి స్వకులమునకు♦గూర్పువాఁడు
అర్థరన్న దమ్ము♦ఒందు నైదవవాడు, కరముచందొకింత ♦ కాముకుండు. 11
క. ఆతండాతని తమ్ముం,డౌ తులసీదాసు నిద్ద♦రైరి ప్రధానుల్
ప్రాఁతిగ పోర్బందరునకు. ఖ్యాతింగనెఁ గరముచందు ♦ కాబా పేరన్. 12
ఆ. అట్టి కరముచందు♦డయ్యెను మును రాజ,కోటవాంకనీరు ♦ మేటిమంత్రి
నీతిశాలియగుట ♦ నియతిరాజాస్థాన, కోర్టు మెంబరుగను ♦ గుర్తువడసె. 13
ద్వి. రాజకోటావనీ ♦ రమణులయెడల, రాజభక్తుండౌట♦చే జబర్దస్తి
.గా నాంగ్ల యేజెంటు ♦ కారుకూతలను, పోనాడనాకోట ♦ భూపతింగూర్చి
"సరికాదు మీాకంచు" ♦ సద్బుద్ధిగరపెఁ కరముచందాతని ♦ గదిసి ధైర్యమున
కినిసె యేజెంటైనఁ ♦ గీడ్వడకుండ, తనిసె గరంచందు ♦ ధర్మానుయాయి. 14
ఉ. ఉత్తమచందు గాంధికి స♦దుత్తమ పత్నుల నిద్దరం ధరన్
సత్తనయాఢ్యులార్థరను ♦ జన్మలనే పోరపొచ్చెముంటమిన్

పెత్తన మింట మొత్తముగఁ ♦ బెద్దలదేయగు నెవ్వరెవ్వరం
చత్తరినేరికిం దెలియ♦నట్లుగ నుండెఁ గుటుంబ మొద్దికన్. 15

గీ. తండ్రి యిద్దరఁ బెండ్లాడెఁ♦దనయుఁడైన, కరముచందు చేపట్టె♦నల్గురిని సతుల
నలుబదేండ్ల వయసుదాటి నం♦గలగక, కట్ట కామాతురుల కేది♦గానబడును. 16

సీ. పేరులేదైయునఁ గు-పేరులుగారు వే,హార మెరుంగని - ధీరులగుట
పేరులైనను వ్యవ-హారవిశారదు, లురు గభీరగుణ ప్ర-పూరులగుట
పురమున కాధార-భూతులౌ పేహారి, కులజులైనను పేర - గుణములేని
వైభవోదారులై - వరలుచు రాజది,వానులై మంత్రులై - పరగిరవని

గీ. గాంధి వంశాబ్ధి చంద్రులు♦కతియవారు,నందు 'శౌ రా'యనుచుఁ బ్రజ♦లభినుతింప
సకలసద్గుణసన్నుత♦ శాంతసత్య, శమదమాహింస సద్వ్రత♦శౌచులగుచు. 17

ఆ. అందు కరముచందు ♦ గాంధికి నాల్గవ, భార్యయైన పుతలి ♦ భాయిసంతు
నల్గురందు మొదట ♦ నాతియుఁ బిమ్మట, సుతులు ముప్వురొవపి♦సతులగుణులు.

క. ఆ ముప్వురఁ దుదిఁగొడుకై , ధీమహితుడు దివ్యగుణుడు ♦ దీనావనుఁడున్
ప్రేమార్ద్రహృదయుఁ డగుచును, శ్రీమోహనదాసుగాంధి ♦ క్షితిఁ బేరొందెన్.

క. లేదు కళాశాల చదువు, లేదొక్కింతయు చరిత్ర ♦ లేశము భూగో
ళాదిక శాస్త్రజ్ఞానము, సాధుగుణాఢ్యునికి గనము ♦ చందాఖ్యునికిన్. 20

క. తెలియవు మత కర్మమ్ములు, తెలియవు మర్మములు శ్రుతుల♦దెలియ వవేవిన్
తెలియకపోయిన నేమగు, దెలియఁగ నాచరణయోగ్య ♦ దిన ధర్మమ్ముల్. 21

మ. విమలాభ్యాస వినిర్మలానుభవముల్ ♦ విశ్వేశు నిత్యార్చనల్
నిపుణుల్ జ్ఞానులు సేయు బోధనములున్ ♦ నేర్పం బ్రసాదింప లౌ
క్యపురీతుల్ గమనించుచున్ గరముచంద్ ♦ గంభీర ధీరోద్ధతిన్
అపురూపంబగు జీవయాత్ర గడపెన్ ♦ యాదృచ్ఛికజ్ఞానియై. 22

క. కడపటి దినముల నాతఁడు, గడపెన్ గీతాపఠనము ♦ గావింపుచు, వి
ప్రుఁడును, కుటుంబ హితుండొక, డిడిన హితవు వినుటకతన ♦ దృష్టాత్ముండై.

గీ. జనకు డీరీతిలౌక్యవి♦జ్ఞానిగాగ, మాతపుత్తలిభాయి ప్ర♦పూతచరిత
దైవభక్తి సదాచార ♦ ధనగుణాఢ్య, భర్తసేవయు బిడ్డల ♦ పాలనంబె
అఖిల భాగ్యసౌభాగ్యము♦లని తలంచు. 4

క. శ్రీకృష్ణా యదుభూషణ, లోకాలోకన సమర్థ♦లోచన భక్తా
నీకవివేకదభాషణ, నాకొమరులఁ గరుణఁ గనుము ♦ నందకుమారా, 25

క. శ్రీకృష్ణా యదునందన, పాకారి ప్రముఖవినుత ♦ పాదాంభోజా
నా కొమరుల రక్షింపుము, ఆ కుంతీదేవి కొమరు ♦ లట్టుల నెపుడున్. a

క. మురహర సంతతసన్నుత, పురహర సకలాపదలను ♦ బోద్రోలి నిరం
తరముం దయనాహృదయేశ్వరుగాపుము కంటిరెప్ప♦వలె లోకేశా 25b

క. శ్రీసతి, భూసతి మరి నీళాసతి గొలువంగ వెలయు ♦ లక్ష్మీరమణా
ఈసుత, నాసుతపతులకు, వాసిగ రక్షకుఁడవీవ ♦ వసుధనటంచున్. 26

క. దైవధ్యానము లేనిదె, కావింపదు భోజనంబు ♦ గడపదొకదినం
బేవిష్ణ్వాలయమునకో, బోవక హరి గొలువకుండ ♦ భుక్తియుఁ జేడినన్. 27

మ. ప్రతి యేడాదియు నాల్గుమాసములు దై♦వధ్యానమాహార వ
ర్జిత మొక్కొక్కపు డేకభుక్తము సదా ♦ ప్రేమానురాగమ్ములన్
బ్రతిజీవిం దిలకించుటల్ వెలయగా ♦ భ కిం బ్రహ్మాత్మయై
పుతలీభాయి యొనర్చుచుండు వ్రతముల్ ♦ మోక్షార్థియై నిత్యమున్. 28

శా. చాతుర్మాస్యము యజ్ఞదీక్షమెయి నా♦పాధాన నారంభమున్
ప్రీతిం దప్పక జేయు నెప్పుడును కా♦ర్తీకంబుదాకన్ మహో
చేతోమోదముతోడ భక్తిమెయి నా♦సిక్యంబు బెంపార వి
ఖ్యాతిన్ మోహనుమాత పుత్రికుల క్షే♦మార్థంబు బ్రార్థించుచున్. 29

క. ఒకపరి చాంద్రాయణమను, సుకృతప్రదవ్రతమొనర్చు♦చో జబ్బుపడన్
సుకుమారి యైనఁజేసెను, ప్రకటితముగ నామెయంత ♦ రాయము లేకన్. 30

గీ. తండ్రితాతల గుణములు ♦ ధైర్యసాహ,సములు నీతిని జాయితి ♦ సత్యగుణము
లంబగుణములు వ్రతదీక్ష♦యుంబలిమి ని,రశననియమదక్షతయును♦బ్రాప్తమయ్యె
మోహనునికి సకలజగ♦న్మోహనునికి. 31

క. వరుసగ మూడుదినమ్ములు. నిరశనముగనుండుటొక్క ♦ నియమముగాగన్
పరిపరివిధముల నుండును, గరముపవాసమున వ్యాధి ♦ గడుపుచుభక్తిన్. 32

మం. ఒకవత్సరమ్మున నొక్క ప్రొద్దుండు♦ఒక యేటఁబూర్తిగా నుపవాసముండు. 33
నికనొక్క యేడాది నిసుబింబమరయ♦కొకపూటగూడ లేకుండుభోజనము.
వానకాలంబౌట వడిమబ్బులోన ♦ భానుండు దాకొని వంచింపనొకట.
అకట! ఆశించిన అన్నంబుదినక ♦ ప్రకటితమ్ముగ నుపవాసముండామె.
దైవసంకల్పమం చేవగింపకను ♦ భావమందు పుతలి బాయిసుశీల. 37

శా. లోకజ్ఞానమధీనమై వెలయమె♦ల్లున్ పుత్తలీభాయి సు
శ్లోకంబైన విశేషరాజ్య విషయా♦లున్ దెల్వియై గ్రాహ్యతన్
వీకంజోక నెరింగి రాజగృహిణుల్ ♦ వేడ్కన్ బ్రమోదింప న
స్తోకప్రజ్ఞల రాజమాత తనతో ♦ జొక్కంగ భాషించెడున్. 38

ఆ. అతులరాజమాత ♦ నరసిసంభాషింప, చనెడువేళ గాంధి ♦ జననితోడ
బాలుఁడగుటనేగెఁ♦బలుమారు రాణివాసమునఁ దెలయనచటి♦సంగతులును.

చ. ఇటు జనయిత్రినుండి హరి ♦ నెప్పుడు గొల్చెడు భక్తిరక్తియుఁ
చటులతరోపవాసముల ♦ సాహసదీక్ష వ్రతాళిమున్గుటల్
కుటిలమొకింతలేని జన♦కుంగని సత్యమతమ్ము పెంపునుఁ
జటిలసమస్యలన్మిగుల ♦ చాతురిఁ దీర్పుట గాంధి నేరిచెన్. 40

గీ. పుట్టినప్పటినుండి యా♦పోరుబంద, రందె కాపురముండుట ♦ నచటివీధి
బడినిఁ జదువుల కిడఁబడె ♦ బాలగాంధి, తప్పదెట్టివారలకు ♦ విద్యార్థులగుట
పిల్లదనమున రాజుకు ♦ బీదలకును, ద్రుపదకృష్ణులకు కుచేల♦ద్రోణులకును. 41

క. బడిలోఁ గడు కష్టమువడి, తడబడుచెక్కములు వలుక ♦ దప్పులతోడన్
నుడువగ నేరిచెనెట్లో, బడిపిల్లడుగాంధి యితర ♦ బాలురతోడన్. 42

గీ. అన్యబాలురతోఁ జేరి ♦ యయ్యవారి, నెల్లపేరులతోఁ బిల్చు ♦ టల్లరిగను
ఇమ్ముగా నేర్చెఁ జిన్నత♦నమ్మునందు, చదువులందున జక్కని ♦ శ్రద్ధలేమి
త్రోయజాలమి సహవాస ♦ దోషమేమి. 43

ద్వి. బడిలోనఁ జెప్పిన ♦ పాఠములింటి, కడబాగుగపఠించి ♦ గడగడబల్కు
బడిలోనుపాధ్యాయు ♦ డడుగుప్రశ్నలకు, వడివడిగజవాబు ♦ లిడుటకు జంకు
వడు, మందమతియౌట ♦ బాలమోహనుడు, మిడిమిడివిజ్ఞాన ♦ మేయందుగల్గె. 44

క. అల్లరిఁ బెల్లుగదిరుగుచు, ప్రల్లదముల గాలమెల్లఁ ♦ బడిలోగడుపన్
పిల్లలకే చదువులురా, వెల్లెడ గల్లరులునౌదు ♦ రెల్లిదమగుచున్. 45

## 2. బాల్యము, 1875–1888

సీ. ఏడువత్సరముల - వాఁడుగాఁ గొమరుండు, చనె రాజకోటకు - జనకుఁడందు
ప్రైమరీ స్కూలుకుఁ - బంపబడియెనందు, కూడపాఠములందు - ప్రౌఢగాదు
ఆపైనమధ్యము - హైస్కూలు చదువుల, కరిగెఁ బండ్రెండువ-త్సరములపుడు
ప్రాయమ్ము వచ్చినం - బాలురన్యులఁ జేర, జంకుచుఁ బరుగిడి - చనెడువాడు

గీ. స్కూలువీడిన నిలుఁ జేర ♦ బాలురెవరు, పలుకరించినఁ బల్కడు ♦ బాలగాంధి
ప్రల్లదముల నుబుసుపోక ♦ భాషణముల, గల్లకబురుల బుచ్చడు ♦ కాలమింత.

క. ఒకపరి 'హైల్సు'ను శిక్షా, ధికృతుండా బడికి తనిఖి♦దీక్షనొనర్పన్
ప్రకటితముగ వచ్చెం బాలకులఁ బరీక్షించెఁబదము♦లను వ్రాయంగన్. 47

గీ. "కెటిలు" అనునాంగ్లపదమున♦ కెటుస్పెలింగు, వ్రాతురని బాలకులనడ్గ♦ వారలెల్ల
చక్కగా వ్రాసి రొక్కగాంధి దక్కనతని, ప్రక్కబాలకుపలకలో పలికి జూడ
డయ్యె సైగ చేసినను నధ్యాపకుండె, పరమఋజుగుణ ధనుఁడౌట బాలగాంధి. 48

ఆ. 'కాఫి' జేయలేని ♦ కడుమూర్ఖుఁడనితిట్టె, అయ్యవారుగాంధి ♦ నయ్యొక్కపెద్ద
వారెతప్పొనర్ప ♦ బాలురెట్లుందురు?, కంచెచేనుమేయ ♦ గాతురెవరు? 49

ఆ. అయినఁదప్పుడుపను ♦ లాచరింపఁగలేదు, అట్లుజేయుమన్న ♦ నయ్యవారి
యెడల గౌరవమున ♦ కెడరుపెట్టగలేదు, బాలగాంధి సత్య♦భావుఁడగుట. 50

క. పెద్దలుచెప్పిన పనులను, బుద్ధినొనర్చుటయె యుచిత♦ముం బిన్నలకున్
పెద్దలఁదప్పులు పట్టుట, తద్దయుఁ దప్పనుచుగాంధి ♦ తలచెన్మదిలోన్. 51

సీ. చక్కఁగాఁ బాఠముల్ - చదువుచుపాధ్యాయు, వలననేమాటయు - బడకయొప్పు
డెందునధ్యాపకు - నేమార్చుటలులేక, బడిపాఠములలోనె - బడలు బాల
గాంధికన్యములు సద్గ్రంథమ్ములు పఠింప, నవకాశమింత లేదయ్యెనకట !
అయిననొండొక్కనా - డాతనిజనకుండు, కొనితెచ్చినట్టి గ్రొం-గ్రొత్తదైన

గీ. గ్రంథమొండుగాంచి ♦ గాంధి యాసక్తినా, గ్రంథమందలికథఁ ♦ గడకఁజదివె
శ్రావణపితృభక్తి ♦ జక్కనిరూపించు, గాథఁదెలుపు నాట♦కంబుదాని. 52

ఆ. స్కూలుపుస్తకముల ♦ బోలెగాకుండ శ్ర,ద్ధానురక్తిఁ జదివె ♦ దానిలోని
నీతినిగ్రహించి ♦ యాతీరునం దాను, గడగినడువ దలచె ♦ గాంధిమదిని. 53

ఆ. కేవలము పరీక్ష♦కై వత్తినిడికంట, నిదురమాని చదివి♦చదివి యాప
రీక్షయైనపిదప ♦ నెల్లయుమరచెడు, వానిపోలెగాక ♦ బాలగాంధి. 54

ఆ. "శ్రావణు పితృభక్తి" ♦ చదువుటేగాక, తద్గాథనాటకంబు♦గాంచి శ్రవణు
ననుసరింపవలయు ♦ ననుదినమని మది, సచ్చరితుఁడు గాంధి ♦ నిశ్చయించె. 55

క. శ్రావణువలె మాతాపితృ, సేవ నహింసావ్రతమును ♦ జేయగవలె నీ
జీవితయాత్ర నటించును, భావిచరిత్రకునుగాంధి ♦ వైచెఁ బునాదిన్ 56

క. ఆరీతి హరిశ్చంద్రుని, గారవమున గాంచెనాట♦కంబందు దక్
ఆరీతి నిత్యసత్యా, చారుడుగా బ్రదుకదలచె ♦ స్వాంతంబందున్ 57

ద్వి. శ్రావణుండును హరి♦శ్చంద్రుండును నతని, జీవితాంతము చిరం♦జీవులై యతని
బంచి సత్యాహింస♦పథమున నడువు,మంచుఁ బ్రబోధించు ♦నంచాత్మదలఁచు. 58
సచ్చరితుడుగాంధి ♦ సతమునేర్చినది, అచ్చమ్ముగానిదు ♦ నాచరణమున. 59
ఆచరింపగనోడు ♦ నట్టినీతులను. నీచులకేతగు ♦ నిపుణులై యాడ. 60

## 3. బాల్యవివాహం, 1882

వ. బాలగాంధి కీ లీల సదాచారసంపత్తును, విజ్ఞానవిత్తమును, గడించుకొనుచు, పదుమూడు వసంతాల ప్రాయంబువచ్చునాటికి కరంచందు గాంధియు, నాతని యన్నయు, తమకొమరులకు ముప్వురకు నొకేముహూర్తమున వివాహమహోత్సవములఁ జరుప నిశ్చయించిరి. 61

ఆ. కలసివచ్చు వ్యయము ♦ కనులపండువుగ మూ,డింతలుగను వింత ♦ గంతులిడగ
వచ్చు; పెండ్లిఁజేయ♦వలయుఁ బిల్లలకంచు, నిశ్చయించి రిచ్చ ♦ వచ్చినట్లు. 62

క. పిల్లలవయసుల వారల, యుల్లమ్ములఁగోర్కెలెట్టు ♦ లున్నవో యెదియున్
ఉల్లమ్మునఁదలపోయరు, పిల్లలవైవాహికముల ♦ బెద్దలు, కట్టా! 63

చ. తమకువయస్సు మళ్లెనని ♦ తల్లడమందుదు రంతెకాని యా
తమతనయుల్ కుమారితలు ♦ దద్దయుఁ పిన్నవయస్కులౌట ను
ల్లమునఁదలంప రింతయుఁ గ♦లంగరు కూడనికార్యమట్లు బా
ల్యమున వివాహముల్ జరుపు♦టంచని, పెద్దలుస్వార్థమూర్తులై. 64

ఉ. మూడుదినాల ముచ్చటకు ♦ మూర్ఖులమై యిటు, ముందువెన్కలన్
చూడకయే వ్యయించుటలు ♦ చొప్పడునేమని, యించుకెంచకే
పాడయిపోవ విత్తములు ♦ భారముగా బొగలంగఁ జిత్తముల్
మేడలువాడలమ్మి మిత♦మీరబడాయి లడాయికోడకే
వాడుదురెల్ల సొత్తులను ♦ వాంఛలు దీరవివాహవేళలన్. 65

సీ. ఇంటనుండెడువారు - కింటికినిండుగా, నిద్దురవోకుండ - సద్దురేపి
ఇరుగుపొరుగువార - లెంతయు విసుగంద, 'లౌడుస్పీకరులతో' - గోడుగుడిపి
వీధిఁ బోయెడువారు - వెగటునబెగడొంద, బాణసంచాతోటి - బాధమప్పి
ఊరిలో నుండెడు-వార లెల్లరికి ని,ద్రాభంగముగ మేళ-తాళములను

ఆ. మొరవడులను వడిగ ♦ మరిమరి జరిపించి, చుట్టపక్కములను ♦ చొక్కిమెక్కి
వెక్కసముగదిన్న ♦ దెక్కువై గ్రక్కుడు, రీతిజేతురెల్ల ♦ బ్రీతిఁబెండ్లి. 66

ఆ. బాలగాంధియిట్టి ♦ వైవాహికాచార,మునకు గట్టువడియె ♦ జనకునిర్ణ
యమున దనకు నిష్ట♦మైన గాకున్నను, పిన్ననాటిబొమ్మ ♦ పెండ్లికట్లు. 67

తే. అయిదుదినములబండి ప♦యనము మూడు,నాళ్ళలో జేయఁబోరుబం♦దరుకురాజ
కోటనుండి స్వపలుస్టేజి♦కోచి'యందు, వచ్చివడి' కోచి కూలుటం♦బడియుఁగ్రింద
గాయములతోడనొడలెల్లఁ♦గరముచందు,కొడుకు పెండ్లికెట్టులో చేరెఁ♦గుందడంచి.

క. మువ్వుర పెండ్లిండ్లగుటన్, ఎవ్వారలకేమి యయిన ♦ నెవ్వరువెలికిన్
నొవ్వక జరిపించిరి బలు, నవ్వులఁబెండ్లిండ్లు నైదు ♦ నాళ్ళున్ జెల్లన్. 69

ఆ. బాలుఁడగుటఁ గ్రొత్త ♦ బట్టలుఁ గట్టుట, అట్టహాసములను ♦ హాయిఁగనుట
క్రొత్తబాల యాడు♦కొన నొండుదొరుకట, గడపె గాంధి యుత్సు♦కతను తండ్రి
పడెడు నిడుమలకును ♦ బడకింతబాధయు, బాల్యసమముగలదె ♦ బాధమరువ.

క. తలిదండ్రులయెడఁ గాంధికి, గల దనురాగంబు మిగుల ♦ గామాతురతన్
కలదంత మిక్కుటముగా, బలమగు తమకమ్ము పిన్న ♦ వయసు కతమునన్. 71

తే. తల్లిదండ్రుల భక్తి శ్ర♦ద్ధలను బ్రేమ, సేవ సేయుటయందు, దృ♦ఢింపవలయు
సకలవిధసౌఖ్య సంతోష♦సమితినంచు, మోహనుఁడెరుంగడు నవీన♦మోహజలధి.

ఆ. కోరికలఁ ద్యజింప ♦ కుండ కేవలము వ, స్తువుల విడిచిపెట్ట ♦ నవునె త్యాగ
మట్టి త్యాగముండు ♦ నెట్టులెప్పటికైన, క్షణికమగునుగాక ♦ జనులకెల్ల. 73

క. గాయమ్ము లొడలినంతట, కాయమునడలంగఁ జేయ ♦ గడు బడలికచే
స్వీయాచారము పగిదిం, జేయక కొదువెదియుఁ బెండ్లి ♦ చేసెఁ గరంచంద్. 74

ఉ. క్రొత్తగనున్న నొండొరులు ♦ కూరిమి మిత్రులకన్న మిన్నగా
హత్తుకొనంగ సల్పుదురు ♦ యత్నములేకయె నూత్నదంపతుల్
చిత్తము పల్లవింప నవ ♦ చిత్తజుఁడెత్త పతాకముత్తరిన్
గుత్తకుగొండ్రు ప్రేముడిని ♦ గోరికలీరిక లెత్తగాదమిన్. 75

ఆ. ఆలుమగల కలయి ♦ కవ్వారి పూర్వజ, న్మానుబంధబాంధ ♦ వానురాగ
వేగబలము నగుట ♦ వేగమే గాంధి దం, పతులు పాలనీళ్ళ ♦ పగిదినైరి. 76

## 4 భర్తృపాత్ర అధికారము — 1882-1883

శా. భార్యాభర్తలు నిద్దరొక్కటగుటన్ ♦ ప్రాయాన నాదంపతుల్
కార్యంబందె మనమ్ములుంగలయ నే♦కంబైరి ప్రేమార్ద్రులై
ఆర్యాచార మతిక్రమింపమిని భా♦ర్యారత్నముల్ భర్తకున్
మర్యాదం గనబర్చె నిత్యవిధులన్ ♦ బాల్యంబునం దుండినన్. 77

తే. ఐన మోహను డనతికా♦లానభర్త, పదవియధికారముం బూని ♦ భార్యపైన
పురుషస్వాభావికమ్మైన ♦ కరుకుటాజ్ఞ, లప్పుడప్పుడు జారిచే♦యంగ దొడగె.

క. చిల్లరడబ్బుల కమ్మచు ♦ గొల్లగ నచ్చగుచుఁ బుట్ట ♦ గొడుగుల పగిదిన్
ఎల్లెడల నుండు పొత్తము, లుల్లసమునఁ జదివె గాంధి ♦ యుద్రేకమునన్. 79

క. ఆ చిన్ని పుస్తకములం, దోచెడు భావములు దనకు ♦ దోచెడురీతిన్
ఆచరణమందు నంపగ, వాచంచవి భార్యయెదుట ♦ వాంఛదలిర్పన్. 80

క. చేపట్టిన భార్యయెడన్, కాపట్యమ్ముండుటెల్ల ♦ కలుషంబనుచున్
ఆ పుస్తకములు గరపగ, నాపగిది మెలంగె జీవి ♦ తాంతమతండున్. 81

తే. అంతియేగాక నిత్యస♦త్యవ్రతుండు, నగుటఁ గపటంబనగనేమొ ♦ అంత చిన్ని
వయసునందింతయెఱుగమి♦వారిమనము, లమలమైయుండె నద్దమ్ము♦లట్టులెపుడు.

తే. కానినిష్కల్మషమ్ముగా♦దాను వెలయు, భాతిదనపత్నియునునుండ♦వలయునెడు
భావతీవ్రత నీర్ష్యాళు♦వగుట గాంధి, ఆజ్ఞలేకుండ పోరాద♦టంచుఁ బత్ని
కస్తురీభాయిపై జబ♦ర్దస్తిచేసి, గస్తుగావించె నాసతి ♦ కదలమెదల. 83

ద్వి. ఇటులనిర్బంధించు ♦ చీర్ష్యచేగాంధి, కటువుగావర్తింపఁ ♦ గస్తూరిబాయి 84
ఆయాజ్ఞబంధాల ♦ భరియింపలేక, పతిమీఁది నిర్బంధ ♦ గతులోర్వలేక.
పెడసరమ్ముగనిచ్చు ♦ వడుచోటనెవ్వొక్క, గడుసరియై తిరు ♦ గాడఁ గోపమున.
విరమించె మాటాడ ♦ విసువుతో గాంధి, కరగించెఁగస్తూరి ♦ కన్నీరునతని.
ఈలలిలోకమ్ము ♦ నెఱిఁగియు నెఱుఁగ, జాల బాలలా ♦ సతియును బతియు.
ప్రొద్దులఁబుచ్చిరి ♦ పెద్దకాలమ్ము, పెద్దగానెఱిఁగిరా ♦ పెడసరమైన.
బుద్ధులుతగవని ♦ బుధసూక్తి నెఱిఁగి, దిద్దింతట బ్రవ ♦ రించిరోరిమిని.
ప్రేమామృతమున వి ♦ రిగినచిత్తములు, కామమంత్రమ్ముల ♦ గడువడినతుకు.
కొనుచుండ మదిలోని ♦ కోర్కెలూరింప, తిసిసీరి దాంపత్య ♦ ధర్మమాయున్కి. 92

వ. ఎటులైననేమి! ప్రేమగుడ్డిదన్న పెద్దలసుద్దులకనుగుణముగానే ఆ నూత్నదంపతుల ప్రణయజీవన నౌక సంసారసాగరమున, మోహానుని దుందుడుకు తనము వలనగాని, కస్తూరి గడుసుపోకడల వలనగాని, యెట్టి యొడిదుడుకులు లేకయే పయనింపఁదొడగెను. 93

ఆ. మోహనుండఖండ ♦ మోహాతిరేకుండు చగుటపాఠశాల ♦ యందుగూడ
భార్యఁదలచి రాత్రి ♦ పడుకొప్పుపతినెప్పు డిరువాడనంచు ♦ జింతనుండు. 94

క. ఇంతటి కాంతాచింతా, క్రాంతుండై యుండి నిత్య ♦ కర్మాచరణ
మ్మంతయు జేయుచు నవ్రతము, సుంతయు నాడమినిగాంధి ♦ సుగుణుండయ్యెన్.

తే. అతురజ్ఞానమలవడ ♦ నతడుసతికి, గపసత్యము యత్నించె ♦ గాని కామ
దాహమధికమై విశ్రాంతి ♦ దరుచులేమి, అతినిజతనము లంతంత ♦ నంతమయ్యె.

ఆ. కామనిద్రనుండి ♦ కనుదెర్పుసరికి మో,హానుడు దేశసేవ ♦ యందుదగిలి
సావకాశమెందు ♦ జక్కగాలేనివా, డగుటనేర్ప జాల ♦ డయ్యెసతికి. 97

క. కామార్తిలేక శుద్ధ, ప్రేమాద్ధృంతదైన యెడలఁ ♦ బ్రేయసివిద్యా
ధామయయి యుంకునని చిం,తామానసుడయ్యెగాంధి ♦ తదుపరినెంతో 98

క. ఇద్ధరనసాధ్య మెందు వి.శుద్ధప్రేమార్థికెపుడు ♦ చొప్పడునొక్కో !
శ్రద్ధాసక్తులు కలిగిన, పిద్దెలబడు వెనుకనెవడు ♦ విద్యార్థియిలన్? 99

ఉ. ఈవిధిఁ గామకూపమున ♦ నీఁగిలంబడకుండఁ గాచె నా
దేవుఁడె మోహనున్, విమల ♦ ధీయుతుఁడౌట నతండు; పండుగల్
పావనమౌ వ్రతమ్ముల నె ♦ పమ్మునఁ గస్తురి తల్లియింటికిన్
బోవుచు నుండుటం దరుచుఁ ♦ బూనికఁదన్వ్యడనాడి యొంటిగన్. 100

క. ఏడాది కారునెలలా, కోడలయసునందు గడచెఁ ♦ గూరిమిపత్నిన్
వీడివసించుట ; తదుపరి, కూడునె యరుదయ్యె సతిని ♦ గురుజనసేవన్. 101

క. పదునెన్మిదేండ్లు జన పై, చదువుల కింగ్లాండు కతఁడు♦చనె మూఁడేండ్లా
చదువునఁబడగా సతితో, బ్రదుకే కరువయ్యెనొంటి ♦ బ్రతుకందగుటన్. 102

తే. చదువునై పోయి స్వీయదే♦శమున'బొంబె', పురిని'బారిస్టరుగ'నుంట♦తరుచుగాను
సతినిగలియుట కతని క♦సాధ్యమయ్యె, అరిగె నతడంతటన్ దక్షి♦ణాఫ్రికాకు.

ఆ. ఇటులగడవఁ గాల ♦ మిరువదినాల్గేండ్ల,వాడుగా నతండు ♦ వయసునాటి
వలపువఱదతగ్గ ♦ వావిరిశాంతమ్ము,గాను పాఱవోడగెఁ ♦ గాలనదము. 104

— 5. హైస్కూలులో — 1882-1886 —

గీ. అన్నలిరువురితోఁ బెండ్లి♦యవకముండె, గాంధిచదివెను హైస్కూలు♦నందు బెండ్లి
అయినపిమ్మట నాచదు♦వల్లసాగె, అన్న కొకనికె చదువుట ♦ లాగిపోయె. 105

ఉ. ఉన్నతపాఠశాల చదు♦వుల్ కొనసాగెను గాంధికందులో
సన్నుతయుక్ బహూకృతులు ♦ స్కాలరుషిప్పులుగల్గె మంచిసం
పన్నుడు యోగ్యుడంచనెడు ♦ పత్రములున్ లభియించె నెన్నియో
అన్నియుఁ బూర్వపుణ్య సము♦పార్జితమంచుఁ దలంచెగాంధియున్. 106

క. ప్రైజుల, స్కాలరుషిప్పుల, మోజున సుగుణములవిడక ♦ మోహనుఁడెపుడున్
రాజిలెఁ దనయధ్యాపక, రాజిప్రేమకునుపాత్ర ♦ రాజై రోజున్. 107

ఆ. బుద్ధికుశలుఁడన్న ♦ మొద్దన్న లెక్కింప, డెప్పుడైనఁ గాని ♦ తప్పుపనులఁ
జేసెనన్నఁ జాలు ♦ సిగ్గిల్లుచుండెను, ఉడుకనుల్లమెల్ల ♦ యువకగాంధి. 108

తే. అయినఁ గసరత్తులకుఁ గ్రికె♦ట్టాడబోడు, నైజలజ్జాభరుండౌట ♦ రోజతండు
హెడ్డుమాస్టరు నిర్బంధ ♦ మెడదఁగొనడు, చదువు కసరత్తుచే నింత♦సన్నగిల్లు
ననుచుఁ దప్పగనెంచి యా♦నాడతండు. 109

క. దైహికశిక్షణ మవసర, మైహికముగ గలదటంచు ♦ నవగతమయ్యెన్
మోహనుని కనంతరమున, బాహిర జీవితమునందు ♦ బాగుగ దెలియన్. 110

తే. మానసిక శిక్షణమువలె ♦ మానవునికి, దేహశిక్షణ మవసర♦మైహికమున
నంచనంతర జీవిత♦మందు దెలిసె, గాంధికైనను లోపంబు ♦ గల్గలేదు. 111

ఆ. ఆరుబయట నడక ♦ నాచరించుట చాల, మంచిదంచుజదివె ♦ మాన్యపుస్త
కముల నట్టుల నడ ♦ కలకలవడి జీవి,తమునుగడపె నడక ♦ దఱుచుఁ జేసి. 112

క. నడకల గడువడిసేయుట, దృఢకాయుండయ్యెగాంధి ♦ దీర్ఘమ్మగు గా
ల్నడకల వ్యాయామమ్ముగ, గడుపుట సమమాను గొప్ప ♦ కసరత్తులకున్. 113

చ. జనకుని సేవసేయదన ♦ స్వాంతమునందలి కోర్కెయౌట మో
హనుని కయిష్టమయ్యె బడి♦యాటలు సాములు; స్కూలుమానినం
తన చని యింటికిన్ సలుపు ♦ దండ్రి సపర్యల భక్తితోడ శ్రా

వణుడు మనంబునఁ మెలఁగ ♦ వావిరి ముక్తిదమంచు నెంచుచున్. 114

ఆ. జనకుసేవయందు♦శ్రవణస్వార్థత్యాగ, చరితమతని యెడద ♦ చెరగనట్టి
ముద్రవేసికొనఁగ ♦ బుద్ధిగా బడివీడఁ, జేరు గాంధి జనకు ♦ సేవయందు. 115

క. కలిగినదినముల లచ్చిమి, యలిగిననాళ్ళందుమిగుల ♦ నలసినవేళన్
కలిగినది మొదట దమబిడ్డలకిడు తలిదండ్రులెన్న ♦ దైవములెకదా! 116

క. తమబిడ్డల సౌఖ్యంబే, తమసౌఖ్యంబని తలంచి ♦ త్యజియింతురు స
ర్వము బిడ్డలకై జనకులు, గమనింపగ వారికన్న ♦ ఘనులెవ్వారల్. 117

క. అలసిన సొలసిన గలతం, గలగిన నలిగినను క్షేమఁ ♦ గని పెంచియు బు
ద్ధులఁగరపి పెద్దచేసెదు, తలిదండ్రుల సేవకన్న ♦ ధర్మంబున్నే! 118

చ. జనకులసేవయేవారికి ♦ సమ్మతమై తనరారు ధర్మమౌ
జనకులసేవయే సకల ♦ సన్నుతిగాంచి తనర్చు నర్థమౌ
జనకులసేవయే మిగుల ♦ సార్థక కామితదాయి యంచెదన్
జనకులసేవభక్తి మెయి♦పల్పి తరించె మహాత్ము డిద్ధరన్. 119

క. ప్రత్యక్షదైవమేయని, నిత్యముగొలువంగ జనును ♦ నిజజనకునటం
చత్యంత భక్తిరక్తుల, సత్యాత్ముడు గాంధిచేసె ♦ జనకునిసేవన్. 120

చ. జనకుని సేవలోమరచె ♦ సర్వ మొకానొక మందవాసరం
బున నుదయమ్మునందు బడి♦మూయగ నాపయి సంధ్యవేళకుం
జనవలె సాముకంచు; మరు ♦ నాడదిగాంచి గురుండు గాంధిపై
కినిసి విధించె 'ఫైను' కుదిఁ ♦ కించవహించెను దాన గాంధియున్. 121

మ. జరిమానా, విధియించుకన్న నిజమున్ ♦ సత్యంబుగా వెల్పినన్
కరుణంజూడక, తన్ను నమ్మక కథం ♦ గల్పించెనంచుం దనున్
గురుడానాడటు దూలనాడుటమదిం ♦ గ్రుంగెన్ వ్యథాస్వాంతుఁడై
పరిభూతాత్మకుడౌను మోహనుడు గా ♦ పట్నాభి యోగమ్మునన్. 122

మం. ఆదినంబుననుండి ♦ యాలస్యముగను, చనడు స్కూలుకునెప్డు♦జాగ్రత్తనుండు
సత్యసంధుండెందు♦జాగరూకుడుగ, నెసగుటధర్మమం ♦ చెరిగివర్తించె. 123

క. బడిపని ముగియగనే తన,కడఁ బనిగలదంచుఁ దెల్పి ♦ గాంధికి కసరత్
బెడదను మినహాయింపగ, వడినాతనితండ్రిలేఖ ♦ వ్రాసెనొకండున్. 124

ఆ. సాములేనిదాని ♦ కేమాత్రమాతండు, చింతనందకున్న ♦ మంతనమున
కుందె జేతివ్రాత ♦ నందంబుగానుండ, నభ్యసింపనైతి ♦ నంచునెపుడు. 125

ఆ. చిన్నతనమునందె ♦ చేవ్రాతబాగుగా, వ్రాయనభ్యసింప ♦ వలయు; లేని
యెడలకుదరదెపుడు♦పుడమిమొక్కఁగ వంగ,కున్న మ్రాకుసాధ్య♦మొక్కు వంగ.

ఆ. పూల, పండ్లవన్నె ♦ పులుగులరంగుల, అందచందములను ♦ అరసి పిల్ల
లెల్లచిత్రములను ♦ గొల్లగావేతురే, చేతివ్రాతనభ్య♦సింపరేల? 127

మం. పెండ్లిచేనొకయేడు ♦ వృథయాటచేత, కష్టించియొకటనే ♦ 'క్లాసు'లు రెండు.
దాటవేయగనందు ♦ దప్పనిసరిగ, కష్టమెక్కుడగుడు ♦ గర పెడిదాంగ్ల. 129
మందౌట, 'టీచరు' ♦ ననుసరింపంగ, కష్టమాయెమఱెంత ♦ గణితసంస్కృతము.
లందు సక్రమముగా ♦ నన్నికష్టములు, కడచి గట్టెక్కెను ♦ గష్టించిగాంధి. 131

వ. "ఆనాడామాత్రమైన సంస్కృత మభ్యసింపకపోయిన, హైందవ ధర్మశాస్త్ర ములఁ జదివి యందలి యర్థగ్రహణమునకు వలయు సామర్థ్య ముండెడిది కాదే" అని చింతించి, మోహనుఁడు ప్రతి భారతీయవిద్యార్థియు తనమాతృభాష తో పాటు బహువిధ భారతీయసంస్కృతికి ప్రతిబింబములగు సంస్కృత, పారసీకాది ప్రాచ్యభాషలనే కాకుండ, ప్రపంచ నాగరికతకు ప్రతినిధియనదగు నాంగ్లమును నేర్వవలయునని హెచ్చరించెను. 132

## 6. మాంసాహారం; విషాదాంతనాటకం–1783

ఉ. ఉన్నతపాఠశాల చదు♦వుల్ పఠియించెడు కాలమందు, నం
దున్నసఖాళిలోనొకని ♦ నూర్జిత సంస్కరణాభిలాషియై
ఉన్నతభావభాగ్య భరి♦తోత్తముగా నొనరింప మోహనుం
డెన్నిక యత్నముల్ సలిపె ♦ నింటసతీ జనయిత్రు లన్నయుగ్
తన్న పుడప్పు డెచ్చరిక ♦ దద్దయుఁ జేసిన గాసి చెందకన్. 133

ఆ. సంస్కరింపఁదలచు ♦ సఖునితో సంస్కర,ణాభిలాషి యెప్పు ♦ డధికముగను
సన్నిహితుడునగుచు♦నున్నచో మొదటికే, వచ్చుమోసమెంతో ♦ పెచ్చుమీర.

ఆ. అంతరంగభావ ♦ మైక్యమ్ముగలవారి, మధ్యమాత్రమలరు ♦ మైత్రియనెడు
పేరుసార్థకముగ ♦ బెంపున దెంపున, సత్యమైనయట్టి ♦ సౌహృదమ్ము. 135

ఆ. గుణములేకమైన ♦ మనములేకమ్మగు, మనములేకమైన ♦ మైత్రిపొసగు
అట్టిమైత్రిరొసగు ♦ నెట్టిదొసంగులు, విసుగులెవ్విలేక ♦ వేలయేండ్లు. 136

క. మనుజుడు దుర్గుణములలో, గొనుగతి సుఖముగనుంచి ♦ గుణములకన్నన్
అనుభవవేద్యంబగు నిది, కనుకఁగదు సన్నిహితము♦గా నుండెందున్. 137

ఆ. దైవసంగమమ్ము ♦ భావించువారలు, ఒగలసంగతమ్ము ♦ నెవపరెప్డు
లోకమెల్ల సఖవి♦లోకనమ్ములతోడ, గాంధ్రుకల్మపాప ♦ గతులునొచు. 138

ఆ. రాజకోట సంస్క♦రణతరంగితమౌట, నప్పుడాసఖుండు ♦ చెప్పెమాంస
మద్యసేవనమున ♦ నధ్యాపకులును తీర్గన్న పెద్దమనుజు ♦ లున్నతెరగు. 139

క. అదివిని చింతయు నభ్రము, గదురగ నిశ్చేష్టుఁడైన ♦ గాంధినిగనియా
యదయసఖుం♦డిటుపల్కెను, బుధవర్గ దూరుడయి ప్ర♦బుద్ధుడు వోలెన్. 140

క. పలలము దినకుండుట దుర్బలులుగ నుంటిమి పలాశు♦లై యాంగ్లేయుల్
బలవంతులగుట నిండియనులమగు మనవారి నేలు♦చుండిరిగాదే ? 141

ఆ. అంతయేలనేఁ బ♦లాశనుండగుటచే, గాదె పరుగులందు ♦ గట్టివాఁడ
గాను నుంటినన్ను♦గను మొండుపుండైన, గడ్డగాని మేనిఁ ♦ గలపదెపుడు. 142

క. మనఅయ్యవారలును మరి, మనపురి పెద్దలును పనికి♦మాలినవారే ?
తినుదురు మాంసము దాసను,గుణము లెరిగియుంట నీవు♦గూడ తినవలెన్. 143

క. తినిచూడు మెంతరుచిగల, తినుబండమ్మదియొ నీకు ♦ దెలియఁగవచ్చున్
తినయత్నించిన నొకపరి, దినమరుగుదు వెపుడుదానిఁ ♦ దీయనిదనుచున్. 144

తే. మోహనునియన్నయంతకు♦ముందె షేకు, మెహతబను నామహామదీయ♦మిత్రుబోధ
పలలముందిని జెందెను ♦ పతనముకట, కలసి రిద్దరు దీక్షగా ♦ గాంధిఁ జెరుప. 145

క. తనయన్నయు మిత్రుండును, దనకన్న దృఢంబుగాను ♦ ధైర్యబలముల౯
ఘనులుగనుండుటఁ గనిమోహనుడును దానట్లుజేయ ♦ నభిముఖుడయ్యెన్. 146

సీ. నైజమ్ముగా భీరు♦వైజడుపునను, మాపుల బయటికి ♦ దీపంబు లేక. 147
పోలేదునిద్దుర ♦ పోలేదు; దయ్యమ్ములను దొంగలను పా♦ములను దలంచి.
జడియుచుండును; దన♦సతి తనకన్న, ధైర్యశాలి యటంచు♦దలచి లజ్జించు.
చుండుమోహనుఁ డిట్టు♦లుల్లమందెంచి, మాంసమ్ముదినగాంధి♦మదినుత్సహించె.

క. "బలవంతుం డాంగ్లేయుఁడు, బలహీనుల నిండియనుల ♦బరిపాలింప౯
గలిగె౯ మహోన్నతుండయి, కలిలముదిని" యనెడుఁజెత్త♦కవితలు వినియెన్.

ఉ. నేరుపులిట్లుజేయ నవి ♦ నీతిపథంబున మానసంబు దా
నోరుపు బోవగా దిరుగ♦నోడ మహాంబుధి మధ్యమందునే
తీరునఁ జిక్కిమున్గునటు ♦ దీవ్రముగాఁ జలియింపఁ జిత్తము౯
మారుపుఁ జెందగాంధి దిన ♦ మాంసము గోరెను గీడునెంచక౯. 152

ఆ. మాంసభోజనమ్ము ♦ మంచిది మేనికి, ధైర్యబలములొసగి ♦ శౌర్యవంతు
జేయు మరియు నాంగి♦లేయు నోర్చెడుశక్తి, దేశమున కొసంగు ♦ దీప్తినంచు.

తే. మనమునందు దీర్మానించి♦మాంసముఁదిన, మొదలుఁబెట్టగ నొకదినము౯ రహస్య
మైనస్థలమును నిర్ణయ♦మయ్యెఁ దల్లి,దండ్రు లెరుగనిగతిఁజేయ♦దలఁచెగాంధి.

క. జైనమతప్రాబల్య మ,నూనమ్మగు వైష్ణవమ్ము ♦ నుడులాచారా
ధీనమనస్కులు నగుదన, నానకు నమ్మకును దెలియ ♦ నటుఁదినఁగోరెన్. 155

మం. రుచియున్న లేకున్న ♦ శుచిలేకయున్న, ధైర్యమ్ము శౌర్యమ్ము ♦ తనకుగల్గుటకు.
తరిమియాంగ్లేయులఁ ♦ తప్పక దేశ, స్వాతంత్ర్యమార్జింప ♦ వలయు; మాంసమ్ము
తినఁగఁదప్పదటంచు ♦ దిటవ్వూన మనము, మోహనుండు రహస్య ♦ ముగనిర్ణయించె.

క. నిర్ణీతమైన దినమున, దుర్ణయమని తలపకుండ ♦ దుష్టాలాపా
కర్ణనముచేత మేషప, లార్ణవమున గాంధిమునిగె ♦ నాత్మదలంకన్. 159

ఆ. ఏటియొడ్డునందు ♦ నేకాంత మగుస్థల, మ్మందు సఖునిచేత ♦ నరసె గాంధి
మేఁకపిల్లపలము ♦ 'భేకరు బ్రెడ్డు'ను, జీవితమున మొదటి ♦ చేష్టగాను. 160

ఆ. రెండునోట మోహ ♦ నుండు వెట్టెంగాని, యందు నెది రుచింప ♦ దాయె, గట్టి
గాను, మేకపిల్ల ♦ కలిలముండెను దోలు, బోలెఁదినక విడిచె ♦ మోహనుండు.

మం. ఆనాడు రేయిని ♦ ద్రాదేవియొడిని, నెమ్మదిగనడాయె ♦ నిదుర రాదాయె.
కడుపులోఁ జేయిడి ♦ కలచినట్లాయె, మేకపిల్ల యొకండు ♦ 'మే' యంచు లోన.
అరచినట్లయి లేచి ♦ యాత్మఁ జింతించు, తిరిగి దేశార్థమై ♦ తినఁగఁదలంచు.
నుయ్యాలవలె మన ♦ మూగెనిట్టట్టు. 164

ఆ. స్నేహితుండునంత ♦ "స్టేటుహౌసం"దున, నచటివంటశాల ♦ యాసనముల
వైభవమునఁ, బచకు ♦ వంటసాయమున స, మ్మోహితుగనొనర్చె ♦ మోహనసఖు. 165

క. ఫలితముగ గాంధిక్రమముగ, పలలాహారములఁదినిరొ ♦ ఫలములపగిదిఁ
కలుషముఁదలపక దుష్టస, ఖుల స్నేహఫలమ్ముకట్టి ♦ కుదుపఁగ నకటా. 166

తే. ఇటులగడచె నొక్క ♦ యేడాది; యాకాల, మందుమాంసము దిని ♦ నట్టిరోజు
ఇంటిభోజనము స♦హింపమి నాతఁడు, కల్లలాడనేర్చెఁ ♦ దల్లికడను. 167

క. అన్నముఁదిన వేలర యిటు, తిన్నగ మోహన! యటంచుఁ ♦ దిరిగి, తిరిగి తం
గన్నజనని ప్రశ్నింపగ, నెన్నోదబ్బరలనాడె ♦ నేమార్చుటకున్. 168

ఆ. తల్లియొద్దనిట్లు ♦ దబ్బరలాడుచు, మోసగింప నామె ♦ మోహనుండు
హృదయమందు కోత ♦ నెంతయో భరియింప, వలసెనందుకతఁడు ♦ వ్యథితుఁడయ్యె.

ఆ. కల్లలాడుచెపుడు ♦ దల్లి నేమార్చుట, తగని పనిగఁదలచి ♦ తల్లిదండ్రు
లున్నవరకువారి ♦ యుల్లంబు వ్యథగూర్చు, మాంసముదినుటెల్ల ♦ మానదలచి.

క. మోహనుఁడా నిర్ణయమును, స్నేహితునకుఁ దెలియఁజేసి ♦ నిలిపెఁదినుటమాం
సాహారమెరుగ రీసుతు, సాహసమొక్కింతనతని ♦ జననీ జనకుల్. 171

ఆ. తల్లిదండ్రులయెడఁ ♦ గల్లకపటముల, నడువఁగూడదనెడు ♦ న్యాయసరణి
గుర్తెరింగియట్టి ♦ కోర్కె శుద్ధమనమ్ము తోడ మోహనుండు ♦ వీడెనెఱచి. 172

క. వీడెనుమాంసమ్మైనను, కూడుట స్నేహితునివిడువ ♦ కుండెనుసతమా
వీడని స్నేహము మరియొక, పాడియుగానట్టిపనికి ♦ బఱచెఁగాంధిన్. 173

క. మోహానునొకనాడా చెడు, స్నేహితుడొక సానికొంపఁ ♦ జేరిచి తగుస
న్నాహమ్ములతో నందు స్మ, రాహవముం జేయఁబంపె ♦ నాదుస్త్రీతోన్. 174

ఆ. కానిమిన్నకుండె ♦ గాంధియా స్త్రీకడ, నంతనామె ద్రోసె ♦ నతనివిసుగు
జెంది యెంతకతడు ♦ చెనకమిఁదన్నాతఁ, డెంచెగాంధియదియు ♦ హితమెయంచు.

వ. ఆనాడట్లయినను మరి నాల్గుమూరు లిట్టియనుభవమునకే మోహానుడు గురియయ్యెను కాని యందెందును గాంధి కాలుజారలేదు. నైతికముగా, మానసిక వ్యభిచారముగూడ కూడనిదైనను, గ్రుడ్డిలో మెల్లగా గాంధి దైహికముగా నందుఁ బతనముగా కుండుట కెంతయు సంతసించి; యట్టి సంఘటనలెల్ల, దైవ సహాయముననే తటస్థించెనని, యాసర్వాంతర్యామి కిట్లు హృదయమునిండుగా నంజలించెను. 176

క. నిటలాక్షా, పరమేశా!, శఠమన్మథహారణదక్ష ♦ సర్వాత్మకవే
ఘటనాఘటన సమర్థా, ఇటులన్నుగావుమంజ ♦ లించెదనెపుడున్. 177

ఉ. మానవుఁడెంత నైజదృఢ ♦ మానసుఁడైన నొకప్పుడింద్రియా
ధీనమనస్కుడై చెడును ♦ దేవకటాక్ష మొకప్పుడాతనిన్
దానవ వర్తనాగ్నిబడి ♦ దగ్ధముగా నటనుండి కాచునే
జ్ఞానియు నీగతుల్ నెఱుగఁ ♦ జాలునొకో! యిదమిత్థమంచిలన్. 178

ఆ. ఎంతవరకు మనుజుఁ ♦ డిచ్ఛానువర్తి, మ. రెంతవరకు భువిప♦రిస్థితులకు
దాసుఁడెప్పుడగు స్వ♦తంత్రుడెప్పుడు నెట్లు, విధిబలీయమగునొ ♦ పృథివిలోన
నెఱుఁగఁ జాలడెవ్వ ♦ డిదియెల్ల మిస్టరీ, 'మిస్టరీల వెన్నొ ♦ హిస్టరీలొ! 179

క. ఆదుష్టమిత్రుఁడిటు దు, ర్బోధలచే భార్యపైనఁ ♦ బుట్టించెను శం
కాధీనుడుగాఁ బెక్కుప, వాదుల నామోహానుండు ♦ వడిఁదడబడగాన్. 180

ద్వి. విస్సన్న చెప్పించె ♦ వేదమంచెంచి, కస్సంచు భార్యను ♦ గస్తూరిభాయిఁ. 181
గద్దించి బాధించె ♦ గాంధిమోహానుడు, ముద్దులసతియను ♦ మోహాంబుచేత
తన్మె దేవివలె నోర్పు ♦ గలదౌట నామె, బాధలెల్ల సహించెఁ♦బరిభవమ్ములను

తే. అట్టియవమానములునెల్ల ♦ నంతరించె, నెల్లవిధులనహింస గ్ర♦హించినపుడు
బ్రహ్మచర్యమహిమ సిద్ధి♦బడసినపుడు. స్త్రీపురుషసహధర్మ♦చారిణిగఁ దెలియ.

మం. పెండ్లియాటకుముందు♦పెండ్లికిపిదప, మాంసాశనమ్ముందు♦మరిదానిముందు
స్నేహిత నిర్బంధ♦మోహితుండగుచు, మోహానుండెన్నియో♦మోసకృత్యములు
గావించె భావించి ♦ కడుగొప్పవంచు, అవికొన్ని వివరించె ♦ యడపక గాంధి.

## 8. దొంగతనము - పశ్చాత్తాపము — 1882-1885

క. బంధువొకనితోఁ గలసియు, గాంధిపొగం ద్రాగుకోరి ♦ కంగడునందా
వందంబు గలదటంచును, డెందంబునఁ దలఁచి యందు ♦ డిగెఁబొగఁద్రాగన్.

మం. మోహనుపినతండ్రి ♦ మోదంబుమీర, పొగద్రాఁగఁ జూచియా ♦ సిగరెట్లుతుండ్లు
ఏరికూరిచ్చిత్రాగి ♦ రెన్నియోమార్లు, కానిఁ దానంద్రప్తిఁ ♦ గనలేకవారు
క్రొత్తవి సిగరెట్ల ♦ గొనుటకుగాను, పనివానిజేబులఁ ♦ బైసాల దొంగి
లించిరా మీఁదట ♦ మించెడు పొగలు, వచ్చెడు నొక మొక్క ♦ వారలుద్రావి
రిచ్చవచ్చినరీతి ♦ స్వేచ్ఛమై దొంగ, తనముగాఁ బెద్దల ♦ కనులను గప్పి
డబ్బుల ముచ్చిలి ♦ తబ్బిబ్బు వడక, అట్లొనర్చుట దోష♦ముని యెంచకాత్మ. 194

ఉ. అంతటి దుష్ప్రవర్తకులు ♦ నయ్యు, స్వతంత్రముగా యథేచ్ఛమై
ఎంతలు జేసినందమర ♦ నెవ్వరు పెద్దల యాజ్ఞలేనిదే
కాంతురుగాక కోపమునఁ ♦ గాల్పనె, యీబ్రతుకంచు రోసి, ప్రా
ణాంతక మాత్మహత్యకు ద♦యారయి రాసహవాసు లిద్దరున్. 195

ఆ. ఆత్మహత్యకటుఁ ద♦యారయి రేకాని, అందుకత్యవసర ♦ మైనసాహ
సమ్ము లేమి విడిచి♦రమ్మిత్రులాత్మ హ, త్యాప్రయత్నములవి ♦ యగునెయంచు?

క. జీవితపోరాటమ్మున, నేవేవో వ్యథలుగలుగు ♦ నెడఁదయుఁ గలగున్
చావంగదలతు మప్పుడ, గావింతుము శపథములఁ మ♦గంటిమిగదురన్. 197

క. భావమ్ముల, భాషణములఁ, జావంగా వలతుమంతె ♦ చావగనగునే?
ఏవగనైనను భువిలో, నేవారలకైన నంచు నెంచిమనమునన్. 168

ఆ. ఆత్మహత్యనుండి ♦ యందుకుఁ గారణ, మైన పొగను ద్రాగు ♦ టందు కవస
రమ్ము లైన డబ్బు ♦ లిమ్ముగాఁ బనివారి, నుండి దొంగిలించు♦టుడిగిరంత. 199

క. పొగరుంబోతు తనంబునుఁ, బొగఁద్రాగుట వలనఁజేటు ♦ పొరయును బరులన్
పొగయించును బరిసరముల, నగుదుస్స్వహమైన మురికి ♦ నంతటఁ జిమ్మున్. 200

ద్వి. అట్టిపొగంద్రావ ♦ నక్కటా! జనులు, చుట్టల బీడీల ♦ కట్టలు, నట్ట
పెట్టెలలోసిగ ♦ రెట్టులు, నగ్గి పెట్టెలు, మరిపొగ ♦ గొట్టాల దగుల
బెట్టుచుందురు డబ్బు ♦ బెట్టిదమనక, బెట్టుసరికిగాను ♦ గట్ట! లోకమున. 203

వ. పదిరెండు, పదుమూడేడుల ప్రాయంబుననె, పొగత్రాగుడు కలవాటుపడి యందులకుగాను, బైసాల దొంగిలించు దోసంబుజేసిన మోహనదాసు పదునైదు వత్సరముల వయసున మాంసాశనుడైన తనసోదరుని చేతికాసెతునుండి యాసోదరు డొనర్చిన యిరువదైదు రూప్యముల అప్పుఁదీర్ప, కొంత బంగారమును దొంగిలించెను. 204

క. వంకాయల దొంగై యిటు, టెంకాయల దొంగయయ్యెఁ ♦ డెక్కులఁ బడుటన్
గొంకెన్ మోహనుఁడంతట, జంకెన్ చౌర్యమ్ము సలుప ♦ శపథము గొనియెన్. 205

సీ. జనకునకీయెల్ల ♦ సంగతుల్ దెలుపమో, హనుఁడు నిశ్చితుఁడయ్యె ♦ ననమనమున
అయినమాటాడగా ♦ నయ్యతో డగిన ధై, ర్యము లేదు గాంధికి ♦ యాత్మలోన
తనచౌర్యముంగూర్చి ♦ విసిగొట్టుఁ దనతండ్రి, యనుభీతిగాంధి కావంత లేదు
చేసినపాపమ్ము ♦ జెప్పుకొన్నంగాని, పాయదంచను నభి♦ప్రాయపడుట

గీ. దోసవిషయమ్ము నంతయు ♦ వ్రాసి కాగి, తమ్ముపైన క్షమింపగా ♦ దన్ను వేడు
కొంచు, నాపైనఁ జౌర్యము ♦ నించుకైన, సలుపనెప్పుడటంచు బాసఁ నొనర్చె.

గీ. అటుల వ్రాసిన కాగిద ♦ మతఁడె తండ్రి, చేతికిచ్చెను వడఁకెడు ♦ చేతదండ
నాధికారిని గనియప♦రాధి వడఁకు, పడువునన్ వంచసము పంటి♦ చెలఁగుగలదె!

క. తప్పొప్పుకొనుచు నీగతి, నప్పకడ న్నిలుచు పుత్రు ♦ నరసినయంతన్
చిప్పిలెఁ దండ్రికి ముత్తెపు, చిప్పంబలె గనులవారి ♦ చినుకులబోలెన్. 208

క. ఆబాష్పవారిస్నాతుఁడు, గాఁబాయఁగఁ బాపపంక ♦ కలుషము శుద్ధుం
డై బాలగాంధి దనరెను, బాబున్ సంతోషమందె ♦ బరికించి సుతున్. 209

చ. ఇదియొక వస్తుపాఠమె, య♦హింసపథమ్మన సంచు నెంచుచున్
మదిముదమందె గాంధి యిటు ♦ మానెను సర్వము తప్పుసేయుటల్
సదయుఁడు సజ్జనుండు, బుధ ♦ సమ్మతవర్తనుఁ డయ్యెనాతఁడా
సుదినము నుండి ప్రేమకెది ♦ చొప్పడ దీభువి నెప్పుడేదియున్? 210

ఆ. జనకునియనురాగ ♦ మినుమడించెను బుత్రు, నెడల నమ్మకమ్ము ♦ వృద్ధియయ్యె
తప్పు చేసినట్టి ♦ దొప్పుకొంచిక తప్పొ, నర్పనని శపథ♦ మొనర్చుకతన. 211

9. తండ్రిమరణము — 1885

మ. పదునారేడులవాఁడు మోహనుఁడు లేఁ♦ బ్రాయమ్మునం దుండఁగా
కదలంజాలక శయ్యయందె కడఁగం♦గాఁ జొచ్చెఁగాంబు, వ్యా
ధి దురంతవ్యథఁ గూర్ప గాంధి పిత; తం♦డ్రి న్నిత్యమున్ సేవచే
హృదయామోదము గూర్చి తేర్చె సుతుఁడున్ ♦ ప్రేమాఖ్య సార్థమ్ముగాన్. 212

ఆ. కడిగి, పుండుఁ గ్రొత్త♦ గాఁ గట్టులం గట్టి, వలయు మూలికలను ♦ గలయనూరి
ఔషధంబొసంగి ♦ యనవరతమ్ము మో, హనుఁడొనర్చె నతని ♦ జనకుసేవ. 213

క. ప్రతిరాత్రిఁ దండ్రికాళ్లను, సతతమ్మొంబట్టు నతఁడు ♦ చాలని, నిద్రా
మతియగు వరకుం భక్తిని, బితకన్న నెవండు సుతుని ♦ బ్రీతికి పొచ్చొ! 214

తే. తండ్రిసేవించు మోహాన ♦ దాసుయిట్లు, భక్తినెపుడుపేక్షింపక ♦ రక్తితోడ
తండ్రికన్నను వేరైన ♦ దైవమున్నె. యోగ్యుఁడైనట్టి పుత్రుఁడ♦కుర్వినంచు.

ఆ. తండ్రిసేవలోనఁ ♦ దన్మయుండై గాంధి, జనకునిపరిచర్య ♦ సలిపెమున్ను
చదివిచూచినట్టి ♦ శ్రావణుపితృభక్తి. చరితముఁగొస్మరించి ♦ సతతమతఁడు.216

ఆ. నిత్యవిధులఁదీర్చి ♦ సత్యాత్ముఁడై బడి, పాఠములను నేర్చి ♦ పనులొనర్చి
తక్కుసమయమెల్లఁ ♦ దండ్రినిసేవించు, టందె కడపెగాంధి యనవరతము.217

క. జనకుండనుమతినిచ్చినఁ, జనువాహ్యాళికినిగూడ ♦ జనడెటునెపుడున్
తనయునిభక్తింగనిమది, దనిసెఁగరంచందుగాంధి ♦ తండ్రిగమిగులన్. 218

తే. భక్తినాసక్తిశ్రద్ధాను ♦ రక్తిఁదన్ను, గొలిచి నిరతమ్ముసేవించు ♦ కొడుకొకండు
యోగ్యుఁడగువాఁడుచాలడే ♦ యుర్వినేల, పందిపిల్లలగతిసుతుల్ ♦ పలువురవని?

క. శ్రావణుఁడాదర్శముఁగా, సేవించెను జనకునైన ♦ జిస్నతనమునన్
గావించినకల్యాణము, చే వనితాసక్తిగాంధి ♦ చిక్కులఁజిక్కెన్. 220

ఆ. బత్తి జనకుపైన ♦ జిత్తమ్ముసతిపైన, హృదయమందుఁదండ్రి ♦ మదినిభార్య
ప్రేమనాన్నపైన ♦ ప్రియురాలిపై రాగ, మతిశయిల్లనూగు♦లాడెగాంధి. 221

ఆ. కరములందుఁదండ్రి ♦ కాళ్ళను మతిసతిన్, నోటిలోనస్కూలు ♦ పాఠములను
త్రికరణములనిట్లు ♦ త్రివిధానుసారియై, మునిగెమోహానుండు ♦ మోహజలధి.

తే. గర్భవతియైనసతిఁదాక ♦ గర్హ్యమనఁడు, తండ్రి పరిచర్యవీడుట ♦ ధర్మమనఁడు
స్కూలుపాఠాలచదువుల ♦ నుగుణమరయఁ,
డకట! కామాతురుండౌట ♦ నాతఁడాత్మ. 223

క. జనకుఁడికఁజాలుపోవ, చ్చనిపలికినఁజాలుఁదండ్రి ♦ కంజలినిడుచున్
జనుచుండెవెంటనేభా, ర్యనుగదియగభయములజ్జ ♦ లావలనిడుచున్. 224

క. బలముడుగనానాటికి, పలురకములవైద్యశాస్త్ర ♦ పండితులతనిన్
పలురకములపూతలపుం, దులఁగలచిరికరముచందు ♦ సుంగడువలసెన్. 225

వ. ఈకరణి ననేకరకముల వైద్యముసేయుచుండెడువారిలో నొకి ఆంగివేయుడు కూడ తనశక్తిసామర్థ్యములను వినియోగించి కడకు, శస్త్రచికిత్స చేసినఁగాని, గాయము మానదని చెప్పగా, కరంచందు అందుకువలయు వస్తువుల నన్నియు, బొంబాయినుండి తెప్పించి, సిద్ధముచేయించెను. అయినను వారి కుటుంబ వైద్యుఁడంత వయసు మళ్ళినవాడు శస్త్రచికిత్సబాధ భరింపనోపలేడని కూడ దనెను. దైవికేచ్ఛ మరియొకవిధముననుండ ఆపరేషను జరుగుటెట్లు? ఆపరేషనునిమిత్త మాయత్తపరచినవన్నియు వ్యర్థమాయెను. కరంచందును, నిరాశ

ఆవహించెను. క్రమముగా నాతనిదేహశక్తి పూర్తిగా నీరసించి, కాల్యా
దికములకుగూడ పడకనుండి లేవలేనంత దుర్బలస్థితికిఁ దిగజారెను. కాని,
యాతని వైష్ణవ మతాచారపద్ధతి ననుసరించి, భారమనక, నిత్యకృత్యములకు
కడవరకు లేచి పోవుచునేయుండెను. సామాన్యపరిస్థితులలో, బాహ్యశుద్ధిని
భారమనక బాహిరమందాచరించుట మంచిదైనను, శారీరకముగా నీరసస్థితి
నుండి, లేవలేనిపరిస్థితులలో, స్నానాదిక కాల్యకృత్యములన్నియుఁ బడక
యందే, బాహ్యశుద్ధి కేలోటును వాటిలకుండునటుల యాచరింపదగు నను
పాశ్చాత్యవైద్యశాస్త్రబోధన ననుసరింపదగు. 226

ఆ. అయినఁగరముచందు ♦ డాచారఛాందసు, డగుటసకలవిధుల♦కరుగుచుండె
పడకవిడిచికష్ట పడుచెంతసేపైన, పుత్రుడచ్చెరువడి ♦ పొగడమిగుల 227

క. హెచ్చెనురోగముక్రమముగ, నిచ్చెడునౌషధమువ్యర్థ ♦ మెల్లయునయ్యెన్
వచ్చెభయంకరరాత్రియు, దచ్చనలాడుచునుగాంధి ♦ తండ్రిగతింపన్. 228

క. అకటా! గాంధియదృష్టము, వికటించుటభాగ్యమీద♦విపరీతమ్మా
ప్రకటితకామాతురతం, గికురించెనుజనకుఁ, గాము ♦ కేళికినేగెన్, 229

తే. అగ్గనోలేదొసతికడ ♦ కంతలోనె, తలుపుపైకొట్టిలేపెనా ♦ తనివిపత్తు
గలిగెననిపరిచారకుఁ డెలుగుతోడ, మోహానుండంతనపగత♦మోహుఁడగుచు.

ఆ. పడకనుండి దుమికి ♦ బైటికిచచ్చిన, తెలుపనొకరుండు ♦ దెలిసికొనియు
లేడులేడుతండ్రి ♦ లేచెంకయనిబిట్టు, నేడు వంగనెల్ల ♦ రింటలోన. 231

ద్వి. కటకటావిపరీత ♦ కామార్తినకట, నిటురాకయున్నచో ♦ నిప్పటివరకు 232
జనకునిచరణాబ్జ ♦ సంవాహనమున, దనియనాచేతులం ♦ దననాదుతండ్రి
చనిపోయియుండునే ♦ యనివిలపించె, మనముచస్వీయ ధ♦ర్మమ్ముదలంచి. 234

ఆ. కరముచందుపరకు ♦ కాలమాసన్నమౌ, టెరుగుకతనదీసె ♦ నరుతనున్న
తులసిమాలఁజేత ♦ వెలయుతానొత్తుఁదుప, కర్మలకుఁదయారు♦గండటంచు
కలముతోలిఖించి ♦ కాగితమునన్నైన, వారికెల్ల దెలిపె ♦ వరుసగాను. 235

క. తనజనకునిమృతికన్నను, పనకామాతురతదన్ను ♦ దండ్రికెడముగా
జనఁజేసెనకట! జనకుడు, చనువేళనటంచుగాంధి ♦ సతిముఁదపించెన్. 236

ఆ. కన్నతండ్రికన్న ♦ నెన్నమిన్నయె భార్య, కన్నజనకుసేవ ♦ కన్నమిన్న
యగునెభార్యపొందు ♦ యనితనకామాతు, రతకు గాంధిధర్మ♦చ్యుతికివగచె. 237

ఆ. తండ్రిసేవఁదగులు ♦ ధర్మంబుదాటునే, దారయందుదవులు ♦ క్రూరకామ,
మకట! ఖరముపాల ♦ నాకట్రదావుట, దగునెగోవుపాలఁ ♦ దలఁగవైచి. 238

మ. మును పెద్దల్ నుడివమ్ముగాగ స్వసతీ ♦ మోహాతిరేకమ్మునన్
జనకున్ సేవనొనర్చు ధర్మమునకున్ ♦ చాలంగ లేనైతి నే
అనిబిట్టుం బరితాపతప్తహృదయుం ♦ డై సర్వకాలంబు మో
హానుదెప్పాడి విషయమ్ము నే తలచుల ♦ జ్ఞానస్వాంతుండౌచుంగదున్. 239

క. అతిసంగమెచ్చవలనన్, గతియించెం దండ్రి తనకు ♦ గాకుండ సతీ
సుతుఁడున్ మూడు దినంబులె, బ్రతికెం గదయనుచు గాంధి♦పలుమరు వగచున్. 240

చ. ఇటు ద్విగుణీకృతమ్మయిన ♦ హృత్పరితాపము చేత, లజ్జచే
పటుతరయత్నముల్ సలిపి ♦ భార్యగయొడంగల మోహాదాహమున్
కటువయి కష్టమైన పని ♦ గా మదిఁ దోఁచిన నెట్టకేలకున్
ఎటులొ యడంచి తప్పక జ♦యించెను గామము మోహమందెదన్. 241

మతదర్శనలేశము — 1882-86

శా. ఆరవయేటనుండి పదు ♦ నారవయేడును దాటుదాక వే
సారెదుదాకఁ బాఠములు ♦ చాలనుదాకను నూరిపోసి వే
మారులు టీచరుల్ బడిని ♦ మంచివి చెడ్డవి నేర్పిరెన్ని యో
నేరుపఁజాలరైరి మత ♦ నీతిపథమ్ముల రీతులింతయున్ 242

ఉ. కుక్కకుఁ గాళ్ళు నాలుగని ♦ కుమ్మరి కుండలు చేయునంచు, నీ
యక్కకు నీవు తమ్ముడని ♦ యారును మూడును దొమ్మిదౌనటం
చక్కర కెంత రాని విష ♦ యమ్ముల నేకము నేర్పిరెన్ని యో
అక్కట! నేర్పరైరి మత ♦ మన్న నదేమిటో మాష్టరుల్ బడిన్. 243

క. మతమన నీతి మెలంగుట, మతమన గానాత్మ యెరిగి ♦ మానవసేవన్
పితృదైవతముల గొలుచుచు, బ్రతుకుట యేయనుచు గాంధి ♦ బహుధా తలచెన్.

ఆ. తోడి మానవులకుఁ ♦ దోడ్పడి వారికష్టములయందు జీవ♦జాలమెల్ల
దేవుఁడుండెనంచు ♦ దెలిసి జీవించుటే, మతమటంచు గాంధి ♦ మతము సతము. 245

ఆ. ఆలయముల జరుగు ♦ నట్టహాసమ్ములు, వేడుకలను గనుచు ♦ విసుగుపుట్ట
నచ్చటి యవినీతి ♦ కచ్చెరువున గాంధి, మనమునందు రోసె ♦ మరలమరల 246

ఆ. ఆలయములఁ బాఠ♦శాల నలభ్యమౌ, మతవిచారవిమల ♦ మాన్యబుద్ధి
నొసగె గాంధికింట♦నూడిగమ్మొనరించు, రంభయనెడు నాపె ♦ రామజపము. 247

క. భూతమ్ముల, ప్రేతమ్ముల, భీతి తొలంగుటకు రంభ ♦ ప్రియమున నేర్పెన్
నీతిమతి రామనామము, ప్రీతిని మోహనుడు మదిజ ♦ పింపగ నెపుడున్. 248

మం. పసితనంబుననిట్లు ♦ పనిచేయుమునిషి, ప్రియమునవాటిన ♦ బీజంబు పెరిగి
వృక్షమ్ముగా గాంధి ♦ యక్షయమ్ముగను, దీక్ష రామజపంబు ♦ దక్షతఁజేయ
ప్రేతభూతపిశాచ ♦ పీడలుదొలుచు, ప్రీతిదివ్యౌషధ ♦ రీతినొప్పారె
ఖ్యాతిమోహనదాసు♦గాంధిజీవితము, నీతియుక్తంబుగా ♦ నెగడెలోకమున. 252

శా. ఆమధ్యన్ బఠియింప గాంధినిఁదదీ ♦ యాత్మద్వితీయాగ్రజున్
ప్రేమన్ నేర్వగ రామరక్షనుబొన ♦ ర్చెన్ జ్ఞాతియొక్కండు వా
రామోదంబున స్నానమాడగనె ని♦త్యంబున్ రతిన్ ప్రొద్దుటన్
నేమంబారజపించినేరిచిరి దా♦వింగంత పాఠమ్ముగాన్. 253

తే. రామనామజపమ్ముపో ♦ ర్బందరందు, గరచినది రాజకోటలో ♦ మరచె గాంధి
రామజపమందువిశ్వాస ♦ రహితుడగుట, నందుచేఁదగునభ్యాస♦మరయలేమి. 254

ఆ. రంభకన్న రామ ♦ రక్షకన్ననతని, తండ్రివ్యాధినున్న ♦ తరుణమందు
అతనికడఁబఠించి ♦ నట్టిరామాయణ, మధికభక్తిఁజేసె ♦ నందునతని. 255

ఆ. అలబిలేశ్వరాల ♦ యార్చిత బిల్వప, త్రములవేసి రామ♦జపముచేసి,
కుష్టురుజనుబాపు ♦ కొన్నలాడామహా, రాజుతులసిదాసు ♦ రామచరిత. 256

ఆ. చదువువాడుకరము ♦ చందురికడనను, దినముసంధ్యవేళ ♦ దివ్యమధుర
కంఠఫణితి బాల ♦ గాంధి యాలించిత, ద్రక్తుడయ్యెరామ♦భక్తుడయ్యె. 257

క. విద్యార్థిగనున్నప్పుడె, హృద్యముగా రామచరిత ♦ మెదనిండారన్
పద్యములఁజదువవిని యత, డధ్యాత్మికచింతనుఁడుగ ♦ నయ్యెన్ భక్తిన్. 258

మం. అరుదెంచె మోహనుఁ♦డాతరువాత, రాజకోటకునందు♦రామాయణంబు 259
లేదుపఠించుటే ♦ కాదశినాడు, భాగవతమ్మును ♦ బఠియించుటుండె
అయినఁబఠనమందు ♦ నాసక్తి భక్తి, పుట్టించురీతిగా ♦ మోహానుకద్ది
దోపకపోయిన ♦ వొడ్డణతాను, రక్తిగల్గించెడు ♦ గ్రంథమంచద్ది
పఠియించెఘూర్జర ♦ భాషలో భాగ,వతము మోహనదాసు♦వ్రతమాచరించు
గతిభక్తిఁరతిరక్తి ♦ నతులితాసక్తి, అయినప్పటికతని ♦ యమునైన యిర్వ
దొక్కదినమ్ముల ♦ ఉపవాసకాల,మందున మదనమో♦హనుడు పఠింప. 265
మూలమ్ముమోహను ♦ ముగ్ధుగావించె, సమ్మోహితుడుగనీ ♦ సద్గ్రంథపఠన
చేయగానైతినే ♦ చిన్నప్పుడంచు, మదిని విచారించె ♦ మరిమరిగాంధి
పిల్లలయుల్లముల్ ♦ తెల్లకాగితము, లవలీలనూత్నము♦ద్రాంకితమగును
బాల్యానగల్గిన ♦ భావరాజములు, వేరూనిచక్కని ♦ వృక్షమ్ములగును
స్వాదుఫలమ్ముల ♦ నందిచ్చుపెద్ద, కాలంబు వృద్ధాప్య ♦ కాలంబుదాక 270

చ. అయినను రాజకోట పుర♦ మందున దండ్రికి సేవచేయుచున్
నయమున నిత్యముంజనకు ♦ నంతికమందున జర్గునట్టి వే
జయినుమహాత్మదీయముఖ ♦ సాధుమతమ్ముల చర్చలన్ విన౯
స్వయముగ నామతాళియెడ ♦ సమ్మతిసహ్యత గాంధికేర్పడె౯. 271

తే. కాని క్రైస్తవబోధక ♦ గర్హితప్రచరణము హైందవులకూర్చి ♦ వారొనర్చు
తప్పుడుప్రచారకముసువిని♦ చెప్పరాని,అపహానము బెంచుకొనె క్రైస్త♦వాళియెడల.

ఆ. అట్టికాలమందె ♦ హైందవప్రముఖు డొ,కండు క్రైస్తవమున♦గలసి సూటు
హాటుబూటుతోడ♦ నారగించెను గోవు, మాంసమద్యములను♦హింసయనక. 273

ఆ. అంతెకాకతిట్టె ♦ నాక్రొత్తక్రైస్తవుం, డసహానమునంబూర్వ♦ హైందవమును
క్రొత్తవైష్ణవులకు ♦ గొట్టవచ్చినరీతి, నొడలపంగనాము ♦ ముంటగనమె. 274

క. ఇదియంతయువినికనగాం, హృదయమ్మున క్రైస్తవమ్ము ♦ నెడ ద్వేషమ్మ
ఉదయించె మోహనునికా, మృదులమ్మగు హృదయమందు ♦ మితమైనతము౯.

మం. ఇతరమతమ్ముల ♦ గొడపవానమ్మా, నగనమ్మకము దైవ ♦ మందు సజీవ
ముగనుండెననరాద ♦ మోహనునకపుడు, అమధ్యనేకాంచి ♦ అయ్యనకబ్బముల. 276
చదివెమనుస్మృతి ♦ నెదనాస్తికమ్ము, వైపుకుమొగ్గగా ♦ పడెజ్ఞాతినొకని
శంకానివర్తికై ♦ చక్కఁబ్రశ్నించె, ప్రశ్నకుబదులుగా ♦ బలికెనాతండు
వయసువచ్చియుంబెద్ద ♦ వాడవైనపుడు, తెలియంగవచ్చు సం♦దేహముల్ దీర
అన్నిసంగతులంచు ♦ సదయెల్లనంచు, మోహనుండుదలంచె♦ మొత్తమ్ముమీద
నీతియాధారమ్ము ♦ నిఖిలమ్మునకును, నీతికాధారమ్ము ♦ నిత్యసత్యమ్ము
సత్యమేధ్యేయైక ♦ సదమలాశయము, కీడొనర్చిన వాని♦కిని మేలొనర్చ
వలెనను గుజరాతి ♦ పద్యమొకండు. వినిమోహనుండు నా♦విధమున నడువ
వివిధప్రయత్నముల్ ♦ విసువకజేసె, నొనరించెవివిధప్ర♦యోగముల్ నతడు. 285

## ఇంగ్లాండుకు ప్రయాణసన్నాహము—1887-88

క. పదునెనిమిదివందల యెను,బది యేడవయేట గాంధి ♦ ప్యాస్ గా మెట్రిక్
చదువం గళాశాలనతండు, పదపడిచనెనయమటంచు ♦ భావనగరుకున్. 286

ఆ. అందుయెల్లగష్ట ♦ మగుటచేనొండర్థ, మవక తిరిగి యింటి ♦ కతడువచ్చె
మూడునెలలుగడపి ♦ ముచ్చటగానట, భావనగరునందు ♦ పఠన ముగిసె. 287

క. వెనువెంటమావజైదావే, యనునొక్కకుటుంబమిత్రు ♦ డాత్మసఖుండున్
తనుబ్రోత్సహింపఁదలచెను, జననింగ్లాండునకుగాంధి ♦ చదువఁగఁబైకి౯. 288

క. బ్యారిస్టరుగా ప్యాసయి, చేరవలె దివానుపదవిఁ ♦ జెచ్చెర వంశా
చారప్రకారమంచును, దీరుగ దనమదిని గాంధి ♦ దీర్మానించెన్. 289

ఆ. గాంధియన్న మిగులఁ ♦ గలగె డెందమ్మందు, దమ్ము నంపవలయు ♦ ధనముగూర్చి
యువకుడైన దమ్ము ♦ నొంటిగా నమ్మిపంపి చుటొప్పు నేయ ♦ టంచు నెంచి. 289 a

ఆ. గాంధియమ్మకతడు ♦ కడపటికొడుకౌట, విడువనతని నెడద ♦ వడలిపలికె,
తనయ ! మనకుటుంబ ♦ మున పెద్దపినతండ్రి, వారిసంప్రతింప ♦ వలదె మొదట. b

ఆ. అంతనన్నయనియె ♦ హక్కున్నదల్లపో, ర్బందరుపయి మనకు ♦ పాలకుడగు
లెలికిగౌరవమ్ము ♦ గలదెక్కువగమన, ఛంశెచుందుబాబు ♦ వారిసఖుడు. c

ఆ. అల్లప్రభుత్వసాయ ♦ మమర సిపారసు, సలుపగలడు నీకు ♦ చదువుకతడు
పొమ్మటన్న నేగె ♦ పోర్బందరుకు గాంధి, ఎడ్లబండి నొంటె ♦ నెక్కి చొక్కి. d

తే. పోరుబందరు చేరి బా ♦ బుకు ప్రణామ, మాచరించి తెలిపె విష ♦ యమ్మతంపు
స్వమతమునకు భంగము గాని ♦ సరణి మనగ, శక్యమగునె ఇంగ్లాండునన్ ♦ శంకపొడము.

మం. ఇంగ్లాండు చదువుల ♦ కేగి క్రమ్మరిన, బ్యారిస్టరుల వేష ♦ మైరోపియనుల
వేషమ్ము వలెనుండె ♦ నీరియాహార, మాచారమైరోపి ♦ యనులదె నోట
సిగరెట్టు లెపుడుండు ♦ సిగ్గులేదింత, మనసాంప్రదాయాని ♦ కనువుగా దిద్ది
అరుగుచుంటివి నీర్థ ♦ యాత్రశీఘ్రముగ, చాల కాలము మన ♦ జాలనేనింక
చనిపోవు సమయాన ♦ సంద్రముల్ దాట, నెట్లనుమతినిత్తు ♦ నింగ్లాండు కేగ
నైననీపోకడ ♦ కడ్డు నేరాను, నీతల్లి యనుమతిం ♦ చిన చాలు నాదు
దీవన లెపుడుండు ♦ దేవుండు నీకు, దయగూర్చుగాత సం ♦ తతము శుభమ్ము. f

క. అనితనబాబయు ♦ పలుకగ, ననె మోహనుడిదియ బాబ ♦ యా చాలికనా
జనయిత్రిసమ్మతింగొనెఁ, దనువన్ను లెలికిసిపార్సు ♦ దగ జేయవొకో. g

క. ఏతీరున నేనాపని, నేతు? నతడు మంచివాడు ♦ చేసి మనవిమున్
దాతనిగతియును తెలుపుము, నీతీరు న్నీకుటుంబ ♦ నిజరూపమ్మున్. h

ఆ. లేఖవ్రాసిగాంధి ♦ లెలినాతనిగృహమ్ము, నందుగలిసె నాత ♦ డనుమతించి
నట్లు "మొదట బి. ఎ ♦ ప్యాసైనగనుము న, న్నిప్పుడే సహాయ ♦ మీయబడదు.

ఆ. అనుచు మెట్లనెక్కి ♦ యరిగెనాతడు మేడ, మీదికేమి సేయ ♦ నేదిలేక
రాజకోటకరిగె ♦ క్రమ్మరనన్నయ, మ్మలకు దెలిపె విషయ ♦ ములను గాంధి.

క. అందుకువలయు ధనమ్ముల, బొందననేక ప్రయత్న ♦ ములఁజేసి ఫలం
బొందమి తనసతి మెడనగ, లందె గనమ్మంగ మది ద ♦ లంచెనతండున్ 290

ఆ. కానిగాంధియన్న ♦ గారెట్టులో కష్ట, పడి సమీకరించె ♦ వలయు ధనము
ఆంగిలేయభూమి ♦ కరుగఁబై చదువుల, కనుజుకైన మోహ ♦ నునికిదీక్ష. 291

ఆ. అగ్రజుని సహాయ ♦ మందించె ధనమైన, అమ్మ సమ్మతి నెటు ♦ లందనగును
ఎట్టులా విదేశ ♦ మేగుట చదువుక, టంచు మదివిచార♦మంది గాంధి. 292

క. అమ్మా నాపై చదువుల, కిమ్మా సమ్మతిని బోవ ♦ నింగ్లాండునకం
చమ్మ లిక వేడ మరిమరి, నెమ్మెయి నినువీడియుందు ♦ నిందుకు మారా! 293

క. కొడుకా ఆపర దేశము, కడు చెడు నడవడుల వీడు ♦ గద రాయటనీ
వెడపచెడకుండ మనెదవె ఆడలేదు నాయెడదం జూడు ♦ మన్నా! యిటులన్ 294

క. ముట్టక యుందువె మద్యము, పొట్టకు మాంసంబు దినక ♦ పోఁగలుగుదువే
కట్టా! ఆపర దేశము, నెట్టుల పోఁగలుగుదుందు ♦ వెట్టులనందున్ 295

క. కామినుల కామవహ్నిని, వ్యామోహముతోడ జిక్కి ♦ యాత్మసతిన్నీ
వేమరుపాటున మరచెద, వో! మోహాన నమ్మమందు♦వో చెపుమన్నా! 296

క. నినుఁ నమ్మగల్గుదెనను, మనమున ననుమానమొందు ♦ మసలుచునుండెన్
మనఁగలుగు దేవి దేశపు, చెడు నడతలఁ బడక కడక ♦ చెప్పుమా చిన్నా. 297

వ. ఈరీతి నా వృద్ధమాత తనతనయుని పరదేశప్రయాణము గూర్చి ప్రశ్నించుచు
లెస్స యోచించి. 298

క. వినఁ బిలిపించె తిమకుల, జైన గురుని శ్రీ బెచార్జి ♦ స్వామిన తండున్
మానుగ మోహానువలన న,నూనమ్ముగ గొనియె మూడు♦నూత్న ప్రతినల్. 299

తే. మద్యమును గాని యేయము ♦ మధ్య నేని, మాంసమిం కేని ముట్ట♦నేమాత్ర మంచు
నొట్టులం బెట్టుకొనె మూడు ♦ యువకి గాంధి, తల్లి తల్లడపా టెల్లఁ♦దలగఁ జేయ.300

చ. ఇటు తన తల్లి యుల్లమునఁ ♦ దృప్తిగ సంగొని బాపలన్ హుటా
హుటి పయనంబు గానతని ♦ కుత్సుకతన్ బడి యందుమాందు ని
చ్చపుటకటతోడి బాలకులు ♦ చొక్కి యొనర్పగ నేరుపాటు న
చ్చపుటఁబలు కాడగా వెరచె ♦ సమ్మతి మోహాను వంత నెమ్మదిన్. 301

క. తదుపరి నన్నయుఁ డానును, గదలేరి బొంబాయిఁ జేర♦గాఁజనిరందున్
చెదరంగ మదిస నేక, మ్మొదవెన్ విఘ్నములు పయన ♦ మొనరించుటకున్. 302

## సంఘబహిష్కారము—1888

తే. అమ్మ సమ్మతి దీవన ♦ లందిగాంధి, సతిని పసినిసుంగు మవీడి ♦ చనియె సంత
సమున బొంబాయి కన్నతో ♦ చదువుకై వి, దేశమున కేగును ద్దేశ♦మాశ గొలుప.303

సీ. అయిన "జూన్ జూలయి" ♦ లందు హిందూమహా, సాగరమ్మందున♦శాంతి మిగుల
నిదియె గాంధికి కంది ♦ మొదటపై నష్టాట, నలనవంబరు దాక ♦ నిలుచుటొప్ప

వెనుగాలిస్టీమరు ♦ మునిగిపోయెనొకండు, సంద్రమందంచని ♦ సఖులువలుక
గాంధియన్న కుజాల ♦ గలిగెనశాంతియు, తక్కె యోచించె ♦ నుత్సాహమెల్ల. 304

ఆ. కంధిశాంతి లేదు ♦ గాంధియశాంతిచే, గుండె గాంధియన్న ♦ గుండె బెండు
పడియెనంత గాంధి ♦ పైనంబువాయిదా, పడియెఁబ్రకృతి కడిమి ♦ నడపఁదరమె.

క. విడిచి సహోదరు నొకసఖు, కడ నిడితన భావమరది ♦ కడ పయనధనం
బిడి మిత్రులకున్మోహను. డడిగిన సాయమ్మొనర్ప ♦ మనుచొండునుడిన్. 305

ఆ. గాంధియగ్రజుడరు♦గఁగ రాజకోటకు, గాంధి దినమొకేడు♦గాను గడపె
ఇంగిలాండుకేగు ♦ టెప్పుడాయని బొంబె, పురినిగలలగనుచు ♦ నిరతమతడు. 306

క. ఈగతి మోహనుడింగ్లాం, డేగుటకు నిరంతరము ని♦రీక్షించునెడన్
సాగరయానమొనర్చిన, చోఁ గులము బహిష్కరించు ♦ చొప్పుననుండెన్. 307

మం. కులపెద్దలందరు ♦ గూడిన సభను, పిలిపించె మోహనున్♦బిన్నవాఁడనుచు. 308
మతవిరుద్ధము మద్య ♦ మాంససేవనము, గతియగునీకునిం ♦ గ్లాండున, గాన
జనదగదంచుబ ♦ ల్కెనకులశ్రేష్ఠి, గనిభీతిలక యువ ♦ గాంధియిట్లనియె.
చదువులకింగ్లాండు ♦ జనుచుంటినందు, మదిరమాంసములంట ♦ మాయమ్మయొద్ద
బాసచేసితిగాన ♦ భయపడవలదు, దోసమ్ము లేదంచు ♦ దోసిలితోడ
వేడె మోహనుఁడైన ♦ వినిపించుకొనక, కూడిన పెద్దలు ♦ కులమునుండి
వెలివేసిరప్పుడె ♦ విపరీతమనక, అల మోహను నతని ♦ యన్న నిద్దరిని.

క. వెలివేయుటకించుకమది, నలుగక నలుకకయె నిలిచి ♦ యన్నయు దమ్ముం
డలవారలెల్ల మెచ్చగ, కులగోత్రములూపగలవె ♦ కులగోత్రములన్. 315

ఆ. అనుమతించెం దమ్ము ♦ డరుగ నింగ్లాండుకు, చదువనన్న, యంత ♦ సఖులుసాయ
పడగ వలయుధనము ♦ నుడుపులుదదితర, వస్తుతతులభించె ♦ నిస్తులముగ. 316

క. త్ర్యంబకరాయి మజుందార్, వెంబడిఁజనె మోహనుండు ♦ వెరగుపడిగి సె
ప్టెంబరునాల్గవ[illegible]న, ఇంబుగ పై చదువు గరప ♦ నింగ్లాండునకున్. 317

ఆ. అనుభవధనవంతు♦డైన త్ర్యంబకరాయి, తోడ నేగుకతన ♦ దొలగిచనిరి
కులముపెద్దలెల్ల ♦ వెలిమాటలకు హను,మంతు నెదుటకుప్పి ♦ గంతులొక్క

క. తనయన్నగారుదనకి, మ్మనుచుందనయనుగుబావ ♦ మనదికడందా
నునిచినధనమాతడుమది, తనికివెలికినీయడాయె ♦ తత్సమయమునన్. 319

ఉ. అయినను మిత్రులెందఱొ స ♦ హాయమొనర్చిరి డబ్బురొక్కముల్
బయనమొనర్పగావలయు ♦ వస్తుచయంబొడగూర్చిరంతియున్.
స్వయముగఁగష్టమంచనక ♦ సంతసమందుచునన్నెహితాళియే
నయము గదాయిలాతలిని ♦ జ్ఞాతులకన్న సహాయమీయగాన్. 320

## కడప అండనులో—1888

ఆ. గాంధియగుటనేమొ ♦ కంధియనారోగ్య, మతనిగలపఁజాల ♦ దయ్యెఁగాని
ఆంగ్లభాషమాట ♦ లాడఁదదాచార, మనుసరింప బిడియ♦మందె నతఁడు. 321

ఆ. కలుపుగోలుతనము ♦ కమ్మనిదౌమాట, కారితనము వలయు ♦ ఘ్మోతలమున
నెగ్గగావకీలు ♦ వృత్తియందని మజుం, దారు దారినంత ♦ నూరిపోసె. 322

తే. అయినస్టీమరులోగాంధి ♦ యానగింప, డాయెనెల్ల తోఁగూడి ♦ యందుమాంస
ముండునేమో యనుచుదన ♦ యుల్లమందు, తల్లికిచ్చినబాసను♦ లచిమదిని. 323

ఉ. మద్యముపీడఁగల్గినను ♦ మాంసము తప్ప దదెట్టివానికిన్
దథ్యమునాదుమాటవిని ♦ నంజొడుమెక్కుము లేనిచో జలిన్
సాధ్యముగాదుప్రాణములు ♦ చక్కగనిల్పుకొనంగ "బిస్కెబే"
మధ్యనటంచుఁబల్కెనొక ♦ మధ్యవయస్కుఁడు తోడివారిలోన్. 324

క. ఎవరెన్ని చెప్పినను దన, చెవిఁబెట్టక ముట్టకుండ ♦ చేమాంసమ్మున్
మవునమున వెంటఁదెచ్చిన, వెవిధోఫలభక్ష్యములను ♦ విసువక మెసవెన్. 325

మం. "బిస్కెబే"యందును ♦ విసుఁగందకుండ, ఫలభక్ష్యములతో నె♦పయనంబుచేసె
మాంసమంటకదాని ♦ మదినింతగొనక, మోహానుండేలాటి ♦ మోహమ్ముగనక
సుస్థిరచిత్తుఁడై ♦ సుగుణోత్తములను, జిహ్వాచాపల్యంబు ♦ చేరరావెరచు. 328

క. ముగియగ'స్టీమరు'సైనము, దిగెసౌథాంప్టనెడు రేవు ♦ దిన్నగలండన్
నగరము జేరెమజుందా, రగణితముగ వెంటనుండ ♦ గా మోహనుఁడున్. 329

తే. ఆనగరమందువిక్టోరి ♦ యాఖ్యవెలయు, హోటలందునదెల్లని ♦ యుడుపులొడల
దొడిగి విడిసెను యువగాంధి ♦ తోడివారు, దొరసులాడగనాతని♦దుస్తులరసి.

మం. డాక్టర్ పి. జేమెహ్తా ♦ దల్పతురాము, ప్రిన్సురంజిత్ సింహ్జి ♦ శ్రీదాదభాయి
నౌరోజిలకుగాంధి ♦ నాలుగుదెచ్చి, యుండెనుపరిచయ ♦ మ్మొనరించులేఖ
లందుమెహ్తాకుసౌ ♦ థాంప్టనందుండె, తంతినీయంగ నా♦తడువచ్చి గాంధిఁ
గలసెనుసాయంత్ర ♦ కాలమ్మునందు, ఎనిమిదిఘంటల ♦ కనువైనవేళ. 334

మ. మెహతాతెల్ప నెరింగెమోహనుఁడు ప్రా ♦ మిస్సుల్ బలేన్ యూరపం
దుహితాచారములం బరులవ ♦ స్తుస్తోమముందాకమిన్
బహిరంగంబుగ నెర్గినంతనెవరిన్ ♦ బ్రశ్నింపగారాదియున్
బహుళా 'సారనిభారతోర్వి'ఁబలె బి♦ల్వంగూడమిన్ గూర్చియున్. 335

క. హోటలునందుండుటసా, ధాటుకులండనునమిగుల ♦ వ్యయమగుటంబ్రై
వేటుకుటుంబము మనదగు, చోటనియువగాంధికతడు ♦ చొప్పడఁజెప్పెన్. 336

తే. తోడఁబయనించినట్టిసిం ♦ ధుసఖుఁడొకఁడు, సాయమొనరింపఁగల్గిన ♦ చక్కనిగది
చేరిమోహనుఁడామజుందారుతోడ, బెండువడి మండుహోటలు ♦ వెలలకెల్ల.

క. గదిలోనుండఁగ గాంధికి, మదిలో వెతగూరెనతని ♦ మాతాచింతన్
మెదలందొడగెన్ స్వగృహము, స్వదేశముగురించితలపు ♦ సమధికముగుచున్. 338

ఆ. తల్లిప్రేమగూర్చి ♦ తలఁపుకురానేడ్చు, నింటిస్మృతులు దెచ్చు ♦ గంటనీరు
తనవిచారమింత ♦ తనతోడఁబంచుకో, నంగనెవరు లేమి ♦ బెంగతోడ. 339

—— సా నిర్ణయము —— 1888 ——

తే. ఐనఁదప్పదులండను ♦ నందుమూడు, వత్సరమ్ములునెట్లోని ♦ వాసముండి
చదివిబారిస్టరై తిర్గి ♦ చనుటలెస్స, అనుచుదెలిసెనంతర్వాణి ♦ నతడెరుంగ. 340

క. తనుగానక హోటలునం, దున మెహతాగదికివచ్చి ♦ తోడ్తోఁగాంచెన్
తనుబాధపడుటఁదామఱఁ, గని 'యాసిటికాసి'డిచ్చె ♦ నంతటఁబూయన్. 341

సీ. కడలిలోఁబైనమ్ము ♦ గావించునెడగాంధి, సాగరజలమున ♦ స్నానమాడ
నపుడుపయోగించె ♦ ననుదినముంబోలె, సబ్బది సాగర ♦ జలములందు
కరుగమిదేహమ్ము ♦ గడుజిడ్డుగానయ్యె, తత్ఫలితమ్ముగా ♦ దామరంటె
అందుపై పూసిన ♦ 'యాసిడు'మంటచే, నేడ్చుట మటువలే ♦ దెప్పటికిని.

గీ. మెహతయాగదినొప్పక ♦ మిత్రునొకని, యొద్దఁజేర్చె మోహనునాంగ్ల ♦ పద్ధతులను
నేర్చియందనుభవమున ♦ నేర్పుతోడ, వ్యవహరించెడువిజ్ఞాన ♦ మలవడంగ. 342

క. ఆమిత్రుండాతనిసతి, యామోహనుగాంచిరెంతో ♦ యనురాగమునన్
ప్రేముడి నేరిపిరాంగ్లము, లోమాట్లాడుటకు నాంగ్ల ♦ లోకజ్ఞతయున్. 343

తే. ఎవరితోనెట్లు మెలగుట ♦ యెవరితోడ, నెటులమాట్లాడుటొప్పునాం ♦ గ్లేయసరణి
నెవరితోనెప్పుడెట్టుల ♦ వ్యవహరింప, లెస్సయగునెల్ల నేరిచె ♦ లెస్సగాంధి. 344

మం. అయినమాంసముదిన ♦ నాతనిజాల, బలవంతమొనరించి ♦ రలకుటుంబమున. 345
ఆతనికిచ్చుమి ♦ తాహారమతని, కడుపునింపమిచేతఁ ♦ గడుగుందెమదిని
కానిమాంసముఁదినఁ ♦ గా నిష్టపడడు, తల్లికిచ్చినమాట ♦ దలచి వేమారు
మిత్రుని బలవంత ♦ మేగాకయతని, కడుపునిండమిచేతఁ ♦ గుడువమాంసమ్ము
మనసులాగునొకప్డు ♦ మరిమరి యైన, తల్లికిచ్చినమాటఁ ♦ దప్పటకతని
ఆత్మయొప్పమి, "దైవ ♦ మా యెట్లనన్ను, ఈవిషమపరీక్ష ♦ నెట్లునెగ్గింతొ"
యనుచుఁబల్మరుభక్తి ♦ నాత్మవిశ్వాస, మడరనెడఁ హరి ♦ ధ్యానమొనర్చు
పాపభీతియు దైవ ♦ భక్తిలేకున్న, మానవమాత్రుడీ ♦ మాయాప్రపంచ
విషమపరీక్షల ♦ విషవలయమున, జిక్కియాచిక్కుల ♦ చెరనుండిముక్తి
పడసిచెలంగుట ♦ పుడమిసాధ్యమ్ము కాదటంచును దెల్పు ♦ గాంధిజీవితము. 354

ఉ. స్నేహితుఁడెన్ని యోగతుల ♦ నీతుల, గ్రంథములం బఠించుచున్
మోహనుమాంసమందుమది ♦ మోహితుఁ జేయఁగఁజూచెఁగాని, యా
స్నేహితు వాక్కుకించుకయుఁ ♦ జేకొనకాతడువల్కె 'మిత్రమా'
నాహితమానినీవిటుది ♦ నంబువచించెడి దెల్లనిక్కమే. 355

తే. అయిననాతల్లి కేఁ జేసి ♦ నట్టిబాస, వీడజాలను నీవున్ ♦ మూఢుడన్న
మాంసభోజనమును గూర్చి ♦ మంచిచెడ్డ; చర్చనీతోడ జేయగాఁ ♦ జాల నిజము.

క. నామీఁదిప్రేమ చేవిటు, వేమారుం బలుకుచుంటి ♦ వెటులైన ననునే
నేమార్పఁజాలనాజన, నీమణి నే నిస్సహాయు ♦ నిఁక యోచింపన్. 357

క. అనియిటు, నిష్కర్షగ మోహనుఁడాడఁగ సంభ్రమమున ♦ నామిత్రుండి
ట్లనె గాంధీమాంసమ్మిక, నినుదినమునిచర్చ సేయ ♦ నీతో నెప్పుడున్. 358

తే. ఇట్టులామిత్రునింట నే♦గించెనెట్లో, మాసకాలము దినకుండ ♦ మాంసమెపుడు
ఆగృహమ్మెంతో లండను ♦ కధికదూర, మగుట గాంధిమరొక్కగృ♦హమ్ము జేరె.

చ. అదియొకయాంగ్లోయిండియను ♦ దందు వితంతువౌ కామె యింటఁబె
ద్దదిగనివాసముండె దుహి ♦ తాద్వయమామెకు సంతు; గాంధి నె
మ్మదినెరిగించెవారలకు ♦ మాంసముఁ దాఁ దిననంచు వారలున్
కదిసి యొసంగు రొట్టెతున ♦ కల్ దినసాగెను గాంధినిత్యమున్. 360

ఆ. చాలవాయెనతడు ♦ సంతృప్తిపడడాయె, రొట్టెముక్కలకును ♦ కట్టబిడియ
మడుగకుండఁ జేసె ♦ నధికమ్ముగాదిన, నడుగకుండనిడునె ♦ యమ్మయైన? 361

తే. కానిక్రమముగ ధైర్యమ్ము ♦ బూనిచదివె, 'న్యూసుపేపరు' లొకగంట ♦ నూసుపోక
కరిగె వీధులఁ గలయంగ ♦ దిరిగెనేదో, హోటలుండు శాకాహార ♦ మొదవునంచు.

తే. హోటలొండు, "ఫారింగ్డను ♦ 'స్ట్రీటు' లోన,
అరసె" వెజిటేరియనుహోట ♦ లనగ 'బోర్డు'
కాంచి లోనికిఁజని, తినెఁ ♦ గడుపునిండ
కోరినట్టిశాకాహార ♦ పూరికలను. 363

ఆ. సాల్ట్ 'మహాశయుని ర♦చన పిలింగుకుగొని, చదివెగ్రంథమెల్ల ♦ చాలసార్లు
దానిలోనిసార ♦ మానెసమృద్ధిగా, మానె గాంధిబుద్ధి ♦ మాంసమందు. 364

ఆ. 'సాల్టు' పుస్తకమ్ము ♦ చదివినవాడిగా, మారెగాంధిమనసు ♦ మానె మాంస
భోజనాభిలాష ♦ పూర్ణశాకాహారి, యయ్యెనతడుహృదయ♦ మారఁగోరి. 365

క. ఆపుస్తకపఠనమ్మున, బ్రాపించెను మోహనునికి ♦ వరశాకాహా
రోపకృతిగూర్చిజ్ఞాన, మ్మాప్రథమానాటినుండి ♦ యవలంబించెన్. 366

సీ. అమ్మబెట్టించుకొ ♦ న్నట్టిరొట్టెమహిమ, నగు ద్దెరుంగగ మన♦సూర్తిగాను
పలలభోజనదుష్ట ♦ ఫలితమ్ములాద్యంత, మెరిగియందోదవగా ♦ నేవగింపు
పూర్ణశాకాహార ♦ భోజనమ్మునగల్గు, సత్ఫలితాదిక ♦ జ్ఞానగరిమ
తనదేశవాసులం ♦ దరునుశాకాహారు, లైనచోదేశదా ♦ స్యమ్ముపీడు. 367
ఆ. నంచు దనమనమ్ము ♦ నందుశాకాహార, ఫలితములనుగూర్చి ♦ ప్రజలెరుంగ
భూమినెల్లఁజాటఁ ♦ బూనెమహోదార, దీక్షగాంధిమిగుల ♦ దక్షుఁడగుచు.

## ఆంగ్లేయ, అభిజాత్యఅభినయం—1888-1891

మం. పొల్లుపుస్తకముదా♦చదువుకొలంది, అతనికిహెచ్చె శా♦కాహారవిషయ. 368
పఠనమందాసక్తి ♦ పదలురెయనక, హెచ్చుగాఁబఠియించె ♦ నెల్లగ్రంథముల
'హోవార్డువిలియమ్స్' ♦ ఉత్తమగ్రంథ, పఠనవల్ల నెరింగె ♦ పైథాగరస్సు
ఏసుమున్నగువార ♦ లెల్లరులోక, పండితుల్ మేధావు ♦ లందరుం దొల్లి
నెల్లశాకాహారు ♦ లేయంచుఁబేర్మి, డాక్టరాలిన్సను ♦ టకటొంకులేక
తా శాకములె తిని ♦ తానుచికిత్స, చేయురోగులకెల్లఁ ♦ జెప్పెశాకములె
పథ్యభోజనమంచుఁ ♦ బరమపవిత్ర, పద్ధతి యారోగ్య ♦ మిద్ధరఁబొంద
తినుడుశాకాహార ♦ మనుచురచించె, వ్యాసాలుగ్రంథాలు ♦ వ్యాసుభారతము
బోలె ధర్మమ్ములు ♦ బోలెడువ్రాసె. 375
శా. శాకాహారముఁగూర్చి వాఙ్మయ సమ♦స్తంబుం బఠింపంగఁ ద
త్పాకంబుల్ దినుచుం బరీక్షనొనరిం ♦ పంబూనె నారోగ్యమే
శాకమ్మేవిధిగూర్చునంచునిరముల్ ♦ శ్రద్ధన్ విశుద్ధాత్ముఁడై
లోకోద్ధారణబుద్ధిమోహనుడు సు ♦ శ్లోకాత్ముఁ డాసక్తిమై. 376
క. ఆరోగ్య చింతశాకా, హారములప్రయోగచింత ♦ నాసక్తిగడుం
గూరిచెమొదలా పిదపం, బూరితిగానయ్యెమతమె ♦ ముఖ్యమతనికిన్. 377
సీ. గాంధియీరీతి శా♦కాహారగుణపరీ, క్షాసక్తినుండంగ ♦ నతనిమిత్రుఁ
డీరీతియోచించె ♦ నిటుమోహనుండున్న, నాంగ్లసభ్యసమాజ ♦ మందు నర్హుఁ
డగుచుండానింగ్లాండు ♦ కరుదెంచినట్టికా, ర్యమెవిస్మరించునం♦చాత్మఁదలఁచి
యాంగ్లేయసభ్యస ♦ దాచారములగాంధి, కభిరుచినెటులనో♦యడరఁజేయ. 378
ఆ. వలయునంచునెంచి ♦ వాంఛమైయొకనాడు, నాసఖుండుబిలచె ♦ నరుగునాట్య
శాలకతనిగాంధి ♦ సమ్మతింపఁగఁబోయి, రిరువురరయనాట్య ♦ మెరుఁగఁబేర్మి
క. నాటకముముందు హోల్బోర్న్, హోటలులోనారగించు ♦ నుద్దేశమ్మం
జాటఁగమిత్రుండటఁజని, రాటకుబోవుటకుముందు ♦ నాచారముగాన్. 379

రగడ (హయప్రచార) :— 380

హోటలున మ♦హోన్నతాళి, కోటనడుమఁ ♦ గూయిడంగ,
మాటనోట ♦ మారుబలుక. నోటువడఁగ ♦ నూరకిడిన
పన్నిఁదినున ♦ టంచుఁదలఁచి, చిన్నగాను ♦ దీసుకేగె. 383

సుగంధివృత్తము :—

హోటలందు 'సూప'మంచు ♦ నొండిడంగ ముందరన్
ప్లేటి దేమియంచు గాంధి ♦ పిల్చె నౌకరంతటన్
ఘాటుగాను స్నేహితుండు ♦ గాంచి పల్కె నీవిటుల్
సాటివారిలోనఁ బల్క ♦ సభ్యతా విరుద్ధమౌ. 384

ఆ. కనుక నోరు మూసి♦కొను మిందుఁదిననిష్ట, మున్నఁ దినుము లేక♦యున్న వేరు
హోటలున భుజించి ♦ యుండు మించుకసేపు, పత్తుపంచుఁ గాంధిఁ ♦ బంపివైచె.

క. అంతట మోహనుడెంతో, సంతసమున బయటికరిగె ♦ శాకాహార
మ్మింతఁ దినుగోర్కె కాని ర,వంతయునది లేమినాడు ♦ పస్తతడుండెన్. 386

విజయభద్రము :—

తదనంతరము సఖో♦త్తమునితో నాట్యస
ద్మము జేరెగాంధి యా♦తం డేమి యనకుండె
మృదులహృదయుండైన ♦ మోహనుం డది సఖుస
హృదయతయె యని గౌర♦వించె మిత్రునినెప్డు. 387
అటులఁ దానమ్మకడ ♦ నాచరించిన బాస,
యందున న్విజయ ము♦ద్రాంకితుం డతఁడయ్యె
కటువైన స్నేహితుల ♦ కడను సిగ్గిలునట్టి
కర్మబట్టిన గాంధి ♦ కర్మయోగిగనయ్యె. 388

ఆ. అయిన వేషభాష ♦ లాదిగాగల యన్య,విషయవలయమందు ♦ వినుతసభ్యు
డైన యాంగిలేయుఁ ♦ డనిపించుకొన యుప, గాంధి యేవొ నేర్వఁ♦గష్టపడియె.

క. బొంబాయిలోనఁ గుట్టిం,పంబడినవి 'స్యూటు-కోటు'♦పనివడవను చ
న్యంబులు నవీన బాహ్యా,డంబర వేషాంబరముల ♦ డంబునకు గొనెన్. 390

క. ఆర్మి నేవిస్టోర్సు ♦ నందుఁ గ్రొత్తవిగొని, హ్యాటు యీవినెంగు♦స్యూటు బాండు
స్ట్రీటునందు విలిచెఁ ♦ బ్రీతినెక్టయి తానె, కట్టుకొనగ యువక♦గాంధి నేర్చె.

క. నెక్టయిఁ గట్టుకొనంగ క,రెక్టుగఁ బాటనుదీర్ప ♦ మృదువుగఁ గురులన్
అక్టరుపలె నిటునటు హ్యాట్, నెక్టయి నపుడపుడు సర్ద♦నేర్చె నతండున్. 392

పంచచామరము :—

ఇదెల్ల చాలదంచు నాంగి♦లేయ సభ్యు డౌటకున్
ముదాన నేర్చె డ్యాన్సు ఫ్రెంచి♦ఫ్రాన్సు వాక్పటుత్వముల్
మదిన్ మహానురక్తి గరపఁ ♦ బౌండ్లు మూడుకట్టియున్
పదంబువేయగా ఫిడేలునో♦పాట కంపశిక్షకై. 393

ద్వి. పాశ్చాత్యసంగీత ♦ పద్ధతి నింత, మచ్చికపడనెంచి ♦ మరి మూడుపౌండ్లు. 394
వెచ్చించె వయొలిను ♦ వేరుగా నేర్వ, ఇచ్చె వేరొక గినీ♦యొద వాక్పటుత్వ.
సాధనసేయంగఁ ♦ జక్కగానొక్క, బోధకునకు షేర్మి ♦ బోధింపఁ దనకు. 396

క. ఈగతి ధనముం గాలము,పోగా వ్యర్థముగ గనుల ♦ మూతలు వదలెన్
బాగయ్యె నాంగ్లవేషను, రోగము డబ్బులును వివిధ ♦ రుచులున్ వదలెన్.

తే. అంతదానెందు కింగ్లాండు♦కరుగుదెంచి, తంచుమదినెంచి యువగాంధియాత్మధర్మ
పద్ధతిఁ దలంచి చదువుల♦పఠనమునకు, పూనె విద్యార్థిగా నెలల్ ♦ మూడుగడవ.

## 16. మార్పులు—1889-1891

ఆ. మునిగియున్న డ్యాన్సు♦మున్న గువానిలో, మూడునెలలపాటు♦మోహనుండు
సైరవృత్తిఁబోక ♦ చక్కగా నానాఁటి, కాత్మశోధనమున ♦ నారితేరి. 399

క. ప్రతిదినముదయమ్మాదిగ, మితముగ వ్యయమాచరించె, మెలకువతోడన్
శ్రుతిమించిపోవకెందున, నతడు సతము బస్సుపోస్టు ♦ నన్నిటియందున్. 400

తే. నిత్యమొనరించు వ్యయముల ♦ గత్యముగను
లెక్కవ్రాయుచునుండెను ♦ నిక్కవముగ
నందుచే గాంధి యొల్లెడ ♦ వ్యయము మితము
జేయఁజాలెఁ గ్రమముగ న♦జేయుఁడగుచు. 401

వ. "అతిసర్వత్ర వర్జయే" తను నానుడికి లక్ష్యముగా ననుక్షణ మాత్మపరీక్ష నాచరించుకొనుచు, మోహనుడు నిర్మోహుఁడై, బహుళ వ్యామోహములకు దూరుఁడై కాలముఁ గడపెను. ఏతత్ఫలితముగా సకలోకముల వ్యయముఁ దొలగించుకొన గలిగినందున దన మధ్యతరగతి కుటుంబమువారి యార్థికస్థితి కనుగుణముగా, ననవసరముగా నన్యజనమ్ముల మెప్పులకొరకు, గొప్పలకుబోక, తప్పుదారులనుండి ఎప్పటికప్పటికిఁ దప్పుకొనుచు బ్రవర్తించెను

ఆ. అన్యజన కుటుంబ♦మందు వాసమ్మంట,వలన గలుగు మిగుల♦ వ్యయమునుండి
తప్పుకొనఁగ నొరుల ♦ మెప్పుల కొప్పుల, కడలకొంటి నుండె ♦ నద్దెగదిని. 403

క. తనకు బనియుండు నాస్థల ♦ మునకు సమీపమున వాస ♦ మును మార్చుటచే
దినమును బస్ చార్జీలకు, ధనమును వెచ్చించుటెల్ల ♦ తగ్గె నతనికిన్. 404

ఉ. ఈగతినిత్యము న్నడిచి ♦ యొస్మదితొమ్మిదిమైళ్ళదూరముల్
ఏగుటచేతమోహనుని ♦ కెప్పుడులేవెటువంటినొప్పులున్
రోగముఁరొష్టులెట్టివియు ♦ రోజులు సాజముగానె బాగుగా
సాగెను వేగిలేకవర ♦ సద్గుణసాగరుఁడై చరించుటన్. 405

తే. ఆంగ్లవిజ్ఞానమార్జింప ♦ నభిలషించి, దీక్ష లండను మెట్రిక్ ప ♦ రీక్షయందు
నెగ్గుటకుగానుజదువుల ♦ గృషియొనర్చె
విసుగును విరామమెల్లయు ♦ నీడ్వడిగాంధి. 406

క. లాటినులోఁదప్పెమొదటి, యేటన్ పాసయ్యెరెండ ♦ వేటం దనకై
పాటుపడునన్నఁదలచియు, పాటించెన్ వ్యయముతగ్గు ♦ పద్ధతులెల్లన్. 407

క. గదినొకటవాసముండెను, ఉదయము పాకసము దానె ♦ యొప్పుగవండెన్
పదిలముగరొట్టికోకోల్, ముదమునదినిగడపెకాల ♦ మున్ మోహనుడున్. 408

ఆ. ఈవిధమునఁగడపె ♦ జీవితమ్మును నిరా, డంబరముగఁదగ్గు ♦ వ్యయముతోడ
కానఁగలసివచ్చె ♦ కాలంబు గాంధికి, గ్రంథపఠనఁజేయ ♦ ఘనముగాను. 409

క. ఈరీతి జీవితము ని, స్సారముగాగడపకుండ ♦ జక్కఁగ నడచెన్
సారమపారముగా న, వ్వారినొసగుమంచిగ్రంథ ♦ పఠనంబందున్. 410

మహోదయవృత్తము :—

పైనడాబుతో లోనగృశింపుచు ♦ పైకిబడాయిగ లోలడాయితో
మానవతక్షణమ్మంచుబ్రాణము ♦ మానసమందున బోవుచుండినన్
లోనికష్టముల్ దాచుచుఁ గాలము ♦ లోకులకైయెటొపుచ్చుకుండ సు
జ్ఞానిగాన నానాడెమనోగతి ♦ సమ్మతిగాంధిమహోదయుఁడై
మానుగాస్వయంజీవితముంగుణ ♦ మండనుఁడైగడపెన్ మహాత్ముఁడై
జానుగాఁగుటుంబార్థికదుస్థితి ♦ స్వాంతమునన్ దలపోసియెంతయున్. 411

భత్యపరిశీలనము—1889–1891

ఆ. తనమనోగతికను ♦ గుణముగా నీరీతి, నిత్యజీవిత మ్మ ♦ నేకమైన
మారుపులకులోను ♦ గారచింపకముందె, మునిగేఁదినుపదార్థ ♦ గుణపరీక్ష. 412

క. శాకాహారముఁగూర్చి య, నేకవిధంబులఁదదీయ ♦ నీతిమతాద్య
స్తోకగుణమ్ములగూర్చి, ప్రాకటముగజేసిరెన్నొ ♦ రచనలుపెద్దల్. 413

తే. నైతికముగమృగాళిపై ♦ నరునిపాల, నమ్మదమ్మ గావళిభక్ష♦ణమునకవని
కాదు కాదు, తదీయర♦క్షణకటంచు, చాటిరెప్పుడో నీతిశా♦స్త్రజ్ఞులెల్ల. 414

క. ఈవసుధఁదినుటమనుజుఁడు, జీవించుటకొఱకెగాని ♦ జీవించుటలే
కేవలముఁదినుటకొఱకెపు, డేవగగాదనిరిశాస్త్ర ♦ మెరిగినవిబుధుల్. 415

గీ. అట్టిబుధవరేణ్యు ♦ లవనిజీవించిరి, మాంసమొకటెకాక ♦ హింసయనుచు
పాలుగ్రుడ్లుకూడ ♦ భక్షించుటలుమాని, చెప్పినంతబుధులు ♦ చేయుచుండ్రు.

చ. సలిపిరిశోధనల్మిగుల ♦ శాస్త్రములన్నియు శాస్త్రవేత్తలున్
పలికిరిమానవుండు ఫల ♦ భక్షణకుం దగు దేహధర్మమున్
కలిగినవాఁడు; త్రావఁదగు ♦ గన్నప్రియాంబికపాలు; దంతముల్
మొలచినదాదిగా దినఁగ ♦ మోదముగూర్చు ఘనాశనంబులన్. 417

క. వాసనదినుసులను దినం, దోసంబొనగూడునంచు ♦ నుడివిరివైద్యుల్
మోసమ్మటు సేయనిదని, శాసించిరి మంచిదంచు ♦ శాకాశనమున్. 418

క. ఈరీతినన్నిగతుల వి,చారణగావించి గాంధి ♦ శాకములనె యా
హారముగ వండితిన నిం,పారమనోనిశ్చయుఁడుగ ♦ నయ్యెను వరుసన్. 419

క. ఆకాలమునందుండెను, శాకములభుజించువారి ♦ సంఘమొకండున్
ప్రాకటముగ నింగ్లాండున, చౌకున 'వెజిటేరియను సొ♦సైటి'యనంగన్. 420

ఆ. ఆ 'సొసైటి' నడుపు ♦ వాసరపత్రికన్, నిత్యమును బఠించె ♦ నియతిసభ్యుఁ
డయ్యెనాసొసైటి♦యందు గార్యని,ర్వాహసంఘసభ్య ♦ పదవినందె. 421

క. తనయింటినుండిపంపిన, తినుబండములెల్లవీడెఁ ♦ దినుటన్ నామో
హనుడు మనోనిశ్చయుఁడై, ఘనముండినమండదొక్కొ ♦ మార్గంబొందున్.

ఆ. మనసు వేరుమార్గ♦మును ద్రొక్కుటఁజేసి, రుచులఁ బచనల నభి♦రుచిహరించె
మోహనునికిగల్గె ♦ మోజువాఁజవి నుడు,కంగ వేయు కూర♦గాయలందు. 423

క. స్వానుభవమ్మున నెరిగె ని,దానముగా రుచులకెల్ల ♦ స్థానము మనసే
కాని నిజమ్ముగఁగాదెపు, డీనాల్కయటంచు గాంధి ♦ యిమ్ముగఁదెలిపెన్. 424

శా. 'టీ కాఫీ' మొదలైన త్రాగుడులచే ♦ దేహానికౌ హానియం
చే 'కోకో' నలవాటుచేసికొని మా♦నెం ద్రాగుటల్ కాఫి తే
యాకుం బానముసేయుటల్ విడిచె, దే ♦ హార్థంబగత్యంబుగా
లోకంబందెవి ముఖ్యమో, యవియె యా♦లోచించుచున్ వాడుకన్. 425

క. శాకాహారముదినుటొక, టేకాకమితంబుగాగ ♦ డించివ్యయమున్
లోకువగనె తిని మోహను, డాకాలముగడపె యువకుఁ♦డయ్యును బేర్మిన్. 426

క. పిండిపదార్థములొకపుడు, పండుల్ రొట్టెలనొకప్డు ♦ పాల్మీగడ గ్రు
డ్లొండో, రెండో తినుచతఁ,డుండె నొకప్పుడు పరీక్ష♦నొనరుచు చెపుడుర్. 427

తే. ఈపరీక్షా ప్రయోగము ♦ లేపుమీఱ, జరిపినన్నాళ్లు నెన్ని యో ♦ జరిపి కడకు
జనని చెప్పినరీతిగా♦జను టె లెస్స, యనిమదిని నిశ్చయించెమో♦హనుఁడుఘనుఁడు.

తే. జననికడఁదాను బాసచే♦సినవిధమ్ము,తఁలఁచి విడనాడె గాంధి, మాం♦సాన్యండములను
దినుట; తనయిచ్ఛవచ్చిన♦ తెరఁగుఁజనుద, సత్యదూరమ్మనితలంచి♦ స్వాంతమందు.

ఆ. చేసినట్టిబాస ♦ లేసమయంబున, నైన స్వానుకూల ♦ మైన భావ
మునకు బలియొనర్చి ♦ తనయిచ్ఛవచ్చిన,రీతిఁ జనుట లెపుడు ♦ నీతిగాదు. 430

ఉ. బాసలఁగూర్చిభావములు ♦ పల్వురు పల్విధముల్ నొసంగుచుం
ద్రాసమయానుకూలముగ ♦ నక్కట! యీ జగతీతలంబునన్
మోసమొనర్పనయ్యలకు ♦ మోదముమీఱగ సత్యదూరులై
వాసిగ బాసలన్నిటికి ♦ బాసలగొన్నటువంటివారలా
యా సమయంబులందొసఁగి ♦ నట్టిసదర్థము గొంటయేతగున్. 431

తే. భావభేదమ్ము లెసఁగెడు ♦ పట్టులందు, బలియురగువారు దుర్బల ♦ పక్ష భావ
ఫణితిఁజనుటయె చక్కని ♦ బాటయగును,
లేనియెడలోకమందున ♦ లేనిపోని, వాదులకుదారితీసి ప్ర♦మాదమొదవు. 432

ఆ. తలఁచిమోహనుండు ♦ దనమదినిటుఁదన, జనని మనముబట్టి ♦ తనదుబాస
భావమనుసరించి ♦ వదలెఁజేపలు గ్రుడ్లు, తినుటనిత్యసత్య ♦ ధనికుఁడగుట.433

మ. ఇటులాహారపరీక్ష లెల్ల మునుపా ♦ యింగ్లాండునం జేసె ప్ర
స్ఫుటమైనట్టి మితవ్యయంబు కొఱకున్ ♦ శుభ్రంబుగానుంటకున్.
కటువైనట్టి మతిప్రసక్తను పరీ♦క్షల్ దీక్షతో గాంధి చే
యుట పంటంగన దక్షిణాఫ్రికభువిన్ ♦ హాహాకావనిన్విత్తిడెన్. 434

తే. క్రొత్తగావైష్ణవము బుచ్చు♦కొన్నవాఁడు, నిడివి గాఁబంగనామాలు♦నిడెడుపగిది
ఉత్సహించెశాకాహార♦ముత్తమమని, చాటగాగాంధి మొదలిడె♦ సంఘమొండు.

ఆ. బాగుగానెనడచె ♦ బాహాటముగనె యా, 'క్లబ్బు'కొన్నినాళ్లు ♦ గాంధియుండు
నంతదాక నాతఁ ♦ డాప్రాంతమును వీడి,పోవ నతనితోడఁ ♦ బోయె'క్లబ్బు'.

తే. అయినతత్స్వల్పకాలాబ్ధి ♦ తానుభవము, చక్కనొసంస్థనిర్మాణ♦చాతురియును
అట్టిసంస్థలనడుపుట ♦ కవసరమగు, నోర్పునేర్పులశిక్షణ ♦ నొసగెమిగుల. 437

—— సిద్గే శ్రీరామరక్ష —— 890 ——

క. శాకాహారుల సంఘము,పై కమిటీమెంబరగుచుఁ ♦ బరగెడు నపుడున్
ఆకమిటి సభల నన్నిట, మూకత్వము గాంధి బిడియ♦మునఁ బూనెఁగటా! 438

క. ప్రతిసభ్యుండేదోయొక, టతిగా వాగుచును మాట ♦ లాడుచునున్నన్
మితభాషియగుట మోహను, డితరులవలె నెపుడు వాగు ♦ టెఱుగడు సభలన్. 439

తే. స్వాంతమున బొంగిపొరలెడు ♦ భావములకు, తగినయక్షరరూపమి ♦ య్యఁగసమర్థుఁ
డయ్యు మోహనుఁడక్కటా! ♦ ఆదినాఁ, బలుకలేఁడయ్యె నెపుడొక్క ♦ భావమైన.

తే. ఎన్నియోమార్గ్లయత్నించె ♦ నెడదలో వి, హారమొనరించు భావక ♦ న్యాలలాము
నుం గరముపట్టికొనిరాగ ♦ రంగమునకు, అయిన నడ్డముదగిలె సి ♦ గ్గనెడు తెరలు.

తే. అయిన 'డాక్టరు' ఆల్లిన్స ♦ నాహ్వయుండు, 'బర్తుకంట్రోలు' గూర్చి యుపన్యసింప
తగదటన్న 'హిల్స'ననెడు ♦ ధనికునెదిరి. గాంధివాద మొనర్పగా ♦ గడఁగెనెట్లొ

ఆ. కానికడకు నోడె ♦ గాంధివాదమతండు, వీడెనా సొసైటి ♦ పాడుబడియె
క్రమముగాను గాని ♦ గాంధినివిడఁ డాయె, బిడియమతని వెంటఁ ♦ బడియె విడక. 443

క. ఆహారనీతినియమము, లోహో! యనఁజాటు గ్రంథ ♦ మొందు రచించెన్
శ్రీ 'హావార్డా'తడు శా, కాహారముగూర్చి పలుక ♦ గాంధిం గోరెన్. 444

క. వ్రాసికొనిపోయి యచ్చట, వ్యాసముగాఁ జదువ గాంధి ♦ యనుమతిబొందెన్
దోసంబేమందున నని, వాసింజేయంగ నట్లు ♦ బల్వురు జగతిన్. 445

తే. అట్లు దా వ్రాసికొనిపోయి ♦ నట్టిదైన, నాయుపన్యాసమింత స ♦ భాంతరమున
చదువగాఁ జాలఁడయ్యెను ♦ జక్కగాను, కట్ట? మోహనుడతిసభా ♦ కంపమంది. 446

వ. ఇటుల మాటల తడబాటున సభయెదుట నిలువఁబడ నోటువడుటచే నతని యుపన్యాస మాతని స్నేహితుఁడగు మజుందారనునతండు వడివడిగాఁ బఠించెను. ఉపన్యాసము చాలా బాగున్నదని సభికులు తమ కరతాళధ్వనులచేఁ గొనియాడిరి. కాని గాంధిమాత్రము దన యశక్తతఁగూర్చి మిగుల ఖేదమ్మున మిన్నకుండెను. 447

మం. కడకు విద్యాపూర్తి గావించి గాంధి, విడుచుచో నింగ్లాండు ♦ విందునకాప్త
సఖులనాహ్వానించె ♦ శాకముల్ వండు, హోటలులో గాక ♦ హోల్బర్న్ రెస్ట
రెంటు మేనేజరుతో ♦ బ్రీతిమాట్లాడి, ఆహోటలందె యే ♦ ర్పాటుగావించె
'వెజిటేరియను'విందు ♦ వెలితిలేకుండ, అట్టివిందులనన్ని ♦ టందున జరుగు
పాటకచ్చేరి యు ♦ పన్యాసములను, జరిపించె గాంధి యె ♦ ల్లరును మాట్లాడి
రైన లజ్జం గంప ♦ మందె నాతండె, నోటనొండైనను ♦ మాటరాదయ్యె
మనమున ననుకొన్న ♦ మంచిభావములు, మఱపునబడిపోయెఁ ♦ గరము యోచించి
కష్టించిసిద్ధంబు ♦ గావించుకొన్న, దొక్కవాక్యముముందు ♦ కూడిరాదయ్యె
చివర "నాయాహ్వాన ♦ మవధరించి యిటు, లరుదెంచినందుల ♦ కందరికిదియె
వందనశతమం"చు ♦ గాంధి కూర్చుండె. 456

ఆ. కడకు దక్షిణాఫ్రి♦కా దేశమున ప్రజా, భ్యుదయమునకుగాను ♦ బోరుసలుపు
కాలమందు వదలె ♦ గాంధి సభాకంప, మొందుటయును బిడియ♦మందుటయును.

ఉ. అప్పటికైనముందుగఁ ద ♦ యారవకుండ సభాంతరమ్ములం
దొప్ప నుపన్యసింపదగు ♦ నున్నతచాతురి గాంధి కబ్బలే
దెప్పుడు నూతనస్థలి న♦నేకులు శ్రోతలు గూడుచోటులన్
జొప్పడఁబల్కనేరడు వ♦చోద్ధతి బల్కడు చొప్పనంటులన్. 458

తే. ఆప్తమిత్రులఁ సభలయం ♦ దైనఁ బనికి,మాలినట్టి ప్రసంగముల్ ♦ మాటవరుస
కైనఁ జేయంగనాసక్తి♦బూనడెపుడు, మౌనమే శరణ్యమ్ముగా♦మనెను గాంధి. 459

తే. అయిననేమాయె నీబిడి♦యంబుకతన, నప్పుడప్పుడు నవ్వుపా♦లైన గాంధి
మితములగు వాక్కులంగల ♦ నుతగుణమ్ము, లలఘుభావమ్ములం దెల్పు ♦ నట్టినేర్పు.

వ. "నాయొకనాటిమాటలాడుటయందలి తడబాటు నాకు కష్టమనిపించినను, నే డెంతయో నా కిష్టమైనది. ఇందువలన నే నధికప్రసంగింగాక, మితభాషినగుటచే నా కలమందుగాని, నా పలుకులందుగాని, యనాలోచితమైన పదమొందును బొరబాటుననైన జారిపడదని, నిరాఘాటముగా జాటఁగలనని, నాకు నేనై యోగ్యతాపత్రము సమర్పించుకొనగల"నని గాంధి తన యాత్మకథయందు వ్రాసెను. 461

ఆ. కష్టనిష్ఠురములఁ ♦ గడగండ్ల కాలమ్ము, వ్యర్థమగుట నెఱుఁగ ♦ ననుభవమున
నాత్మసాధనమున ♦ కవసరమైనది, మౌనమనుచు నెఱిఁగి♦తే నటంచు. 462

క. ఉన్నది లేనిదిగా లే, కున్నది నున్నదిగ, సత్య♦ముండెడు రూపుం
గ్రన్నన మార్చుచుఁ బలుకుట, యెన్నఁగ సహజాప్తగుణము ♦ లీ నరజాతిన్. 463

క. ఈనైజస్థితిఁ దాటఁగ, మౌనమె శ్రీరామరక్ష ♦ మహి మితభాషా
జ్ఞాని సుభాషితముల నుచి,తానుచితమ్మెఱిగి నుడువు♦లాడుచుఁ గడిమిన్. 464

క. అనుమతికోఱకు సభాధ్య,క్షుని జేపుకతిందురే దొ ♦ కూయఁగ సభలం
దనయము బెక్కురు లోక,మ్మున కేలాభమ్ము లేని ♦ మోటగుమాటల్. 465

ఆ. అట్టి పనికిమాలి♦నట్టి కాలమ్ము వ్య,ర్థమ్మొనర్చు సార ♦ రహితభాష
ణమ్ములాడకుండ ♦ ననుగాచె నాబిడి, యమ్మె యనుచుగూడ ♦ ననియె గాంధి. 466

## అసత్యశోకము — 1888-1891

సీ. గాంధిపై చదువుల♦కై పోయినప్పుడిం, గ్లాండునఁ గొందరే ♦ యిండియనులు
విద్యార్థులుండిరి ♦ వీరు వివాహితు,లై యవివాహితు♦లని నటించు

చుండుటవాడుకై ♦ యుండెనానాడాంగ్ల, బాలబాలికలు వి♦వాహమునకు
విద్యకు పొంతన ♦ వెలయదంచవివాహి,తులుగానె యుండుట ♦ కలదుగాన
గీ. భారతీయవిద్యార్థు లం♦బద్ధమాడి, రందరవివాహితులమటంచకట! నిజము
చెప్పవెనుకాడిరెంతయో ♦ సిగ్గుపడిరి, పలుకగాఁ బెండ్లియైనట్టి ♦ వారమనుచు.

క. ఇంతియొగాకటువారట, సంశేవాసులుగనుండు♦టావాసములం
దింతులతోఁ గులుకుటకై, ఇంతయుఁజింతిలకపల్కు ♦ రెంతయు గల్లల్. 463

క. పశ్చిమదేశములందు య,థేచ్ఛగ యువతులును యువకు ♦ లిష్టాగోష్ఠిన్
పెచ్చుగదిరుగుటవాడుక, మెచ్చుచుఁ బ్రోత్సాహమీయ ♦ మేకొని పెద్దల్. 469

క. యువకులు తమమది మెచ్చిన, యువతుల యువతులను దమ్ము ♦ నుబ్బించెడునా
యువకులవివాహమాడుట, కవసరమిటుఁగలసిమెలగు ♦ టాంగ్లేయులకున్. 470

ఆ. భరతభూమిఁగూడ ♦ ప్రాచీనకాలాన, బ్రహ్మచారులుగనె ♦ పరగుచుండి
రల్లయువజనమ్ము ♦ లందరువిద్యార్థి, కాలమరుగువరకు ♦ గఠినముగను. 471

ఆ. కానిగాంధిగారి ♦ కాలాన బాల్యవి,వాహపద్ధతులె ప్ర♦బలముగాను
వెలసియుండె సకల ♦ కులములందున భార,తీయులందు నేటి ♦ తీరువేరు. 472

క. సాత్వికభోజనమును మత, తాత్త్వికచింతనము నీతి ♦ ధార్మికబోధల్
సాత్వికజీవనగతులు స,మత్వముతో నాటియువజ♦నాళి మెలంగెన్. 473

ఆ. బ్రహ్మచర్యమనఁగ ♦ బ్రహ్మసాక్షాత్కార, సాధనమునకైన ♦ సత్ప్రవర్త
నమును జ్ఞానగరిమ ♦ యమనియమాది ని,ష్ఠాగరిష్ఠకామ ♦ సంయమనము. 474

ఆ. చదువుముగియువరకు ♦ సంయములై బ్రహ్మ, చారులగుచుఁబిదపఁ♦జక్కగా గృ
హస్థులగుచునుండి ♦ రనురూపయువతులఁ, బెద్దలేర్పరింపఁ ♦ బెండ్లియాడి. 475

తే. ఇట్టిచక్కనిపద్ధతు ♦ లెపుడొ మధ్య, కాలమందున మార్పులఁ♦గాంచి బాల్య
మందెకల్యాణములు జర్గ♦టయ్యెయిట్టి, పద్ధతికిమోహనుఁడుగూడ♦బలిగనయ్యె.

క. కాలానుగుణముగా నెపు, డీలోకమునందుమార్పు ♦ లేర్పడుచుండున్
చేలములు ప్రాతపడగా, లీలంగ్రొత్తవిధరింప♦రే మనుజులిలన్. 477

ద్వి. ప్రాతపద్ధతులందు ♦ రోతజనింప, నూతనమైనట్టి ♦ రీతులేపారు. 479
కల్యాణరీతులం ♦ గాలానుసరణి, బాల్యవైవాహిక ♦ పద్ధతి మాసె
యువకవైవాహిక ♦ యుగముగామారె, యువజనులధిక కా♦మోద్రేకులగుట
నేడనర్థమ్ము ల♦నేకముల్ గలిగె, ప్రౌఢవివాహాల ♦ పద్ధతిసంచు
కాలేజిచదువుకు ♦ కల్యాణమైన, మేలిప్రాయమువారె ♦ మేలంచుఁ జిత్రి
కారాజములు ప్రాయు♦టారంభమయ్యె, మారుపుల్ జరుగు టే♦మానితమయ్యె.

ఉత్సాహము. కాలమొక ప్రవాహమందు ♦ గలజలమ్ము పారగా
జాలువారియందు జేరు ♦ జలము నూతనమ్ముగా
పాలిపోవు చర్మమూడ ♦ బరగ మొల్చు క్రొత్తగా
మేలి క్రొత్తపద్ధతులకు ♦ మేను వ్రాల్చు ప్రాతలై. 484
ప్రాతమేను నాశమంది ♦ పడగ నాత్మ దాలుచున్
నూతనమగు దేహమొండ ♦ నూనతేజ సంపదన్
రోతననుచు ప్రాతవెల్ల ♦ రోసి జనులు క్రొత్తవౌ
రీతులకెగ బ్రాకుచుంద్రు ♦ ప్రీతితోడ వింతగాన్. 485

ఆ. ప్రాతవాని రోసి ♦ ప్రీతి క్రొత్తవిడాసి, నప్పటికిని ప్రాత ♦ దైన దేదొ
నంటిపెట్టుకొనియె ♦ ననుసరించును బూర్వ,జన్మ వాసన లిల ♦ జనునిబోలె. 486

తే. ప్రాతక్రొత్తల కలయిక ♦ పడుగుపేక, లట్లు వెలయును సకలమీ ♦ యఖిలలోక
మందు నెల్లెడ నన్నింట ♦ నవని నేదియు, స్థిరముగా నుండ దేమార్పు ♦ చెందకుండ.

క. గాంధియు నీరకమగు కా,మాంధుండై కల్లలాడె ♦ నవివాహితునం
చందుండు నెల్లయువకుల, చందంబున నచటి స్త్రీల ♦ సంగతికొరకై. 488

ఆ. కానికపటనాట♦కమున మనోశాంతి, సుంతయైన లేమి ♦ స్వాంతమందు
గాంధి శీఘ్రమనన్య ♦ కామినీమోహకూ,పమున గ్రుంకకుండ♦బయటఁబడియె.

తే. సహజమగు లజ్జవలన వే♦షముల వేయు,టందు నేరుపు లేకుంట ♦ గాంధినైజ
మౌనమె శరణ్యమై కాచె ♦ మలినకామ, వనధిలోబడి మడియక♦మును పెనతని.

ఉ. కోమలు లెవ్వరుం బలుక♦కుండెడు వారలపైన నెట్టులుం
బ్రేమను జూపఁజాలమి ల♦భించవకాశము జారిపోవగా
నేమియు మాటలాడమిని ♦ నేమని పోవుదు రెవ్వరైన కాం
తామణు లాతనిం గలసి ♦ యంతయు మంచిదెయయ్యె గాంధికిన్. 491

ఆ. వెంటనారలోని ♦ విడిదికుటుంబనా, యకి కుమారి వెంట ♦ యచటిజనులఁ
దోడుకొనుచుబోవు ♦ వేడుక వాహ్యాళి, కచటవాడుకయది ♦ యగుటచేత. 492

క. ఆవెంటనారు కందము,గా వెలసిన చుట్టుగుట్ట ♦ గాంధియు నెక్కం
గా వెంట దోడుకొని తా, పోవంగా నామెయొక్క ♦ ప్రొద్దునఁబోయెన్. 493

క. చెంగున నెగురుచు దూకుచు, పొంగుచు నాగుట్టనెక్కెఁ ♦ బొలతియు దనవెం
టంగొని మోహానునాతం, డుంగొనమోహమ్ము నేవౌ ♦ డొంకలమీదన్. 494

చ. పకపకనవ్వు, నవ్వుచునె ♦ పల్కులముల్కుల నాటుధాటిగా
చకచకనేగు బర్విలిడి ♦ సాగును పైకెగబ్రాకిపోవగా
వికవికలం బకాపకల ♦ విచ్చల నిచ్చల ముచ్చటించుచున్
టకటక లెత్తుజోళ్ళిడుచు ♦ తక్కునలాగుచు గాంధిచేతులన్, 495

ఆ. గుట్టమీఁదినుండి ♦ ఛట్టునదిగె నమ్ము, పగిదినాపడంతి ♦ పగలబడుచు
నగుచు నిలుచు మోహ♦నా! రమ్మనుచుఁ దన, వెనుకబడిననతని ♦ వెంటనీడ్చు.

క. ఆపడఁచుతోడ సమముగ, నే పలుకాడంగలేక ♦ యింతికి బదులున్
ఆపగిది నడువలేమికి, నేపుగ సిగ్గిల్లె గాంధి ♦ యెదమదిగదియన్. 497

వ. 'వెంటనారు'వంటి 'బ్రైటన'ను మరొక 'వాటరింగ్' స్థలమందు గాంధి కందలి హోటలునందొకట నొక వితంతువుతోఁ బరిచయమేర్పడెను. ఆ పరిచయము మైత్రిగా మారి, యామె తన లండను పురమందలి కాపురముందు గృహంబునకు మోహను నాహ్వానించెను. ప్రతిభానువాసరమాయింట జరుగు విందునందు బాల్గొన విధిగా గాంధి పోవుచుండెను. అందొక సుందరీమణితోడఁ బరిచయమయ్యెను. తత్పరిచయము చనువుగాను తదుపరి ప్రణయమ్ముగాను మారి క్రమముగా శ్రుతిమించి రాగానపడుట తటస్థించెను. ఇదియంతయు దాను వివాహితుఁడనని తెలుపమిచే జరుగుచుండెనని, నిజమెరిగింప నుద్యుక్తుఁడై మోహనుడావితంతువున కీ క్రిందివిధముగా నొక లేఖ లిఖించెను. 498

సీ. బ్రైటనుపురమందు ♦ హోటలందుమనము, కలసినప్పటినుండి ♦ చెలిమిఁదల్లి
కొడుకునుగనురీతిఁ ♦ గడునాదరమునసం, గాంచుచుంటివనేక ♦ కన్యకలకుఁ
బరిచయమొనరించి ♦ పరిణయసన్నాహ, మునసుండునటుఁదోచె ♦ గనుకనిజము
తెలుపఁ దలచి నేడు ♦ కలము బట్టితినమ్మ, అన్యభారతయువ ♦ కాళిఁబోలె.

తే. చెప్పితినిగాను నీకు నా ♦ చిన్నతనము, నందె పెండ్లైనవిషయమ్ము ♦ ముందెనీకు
నేటికైనను హరికృప ♦ నిజము నిట్లు, పలుకఁగలిగితి క్షమియింప♦వలయునమ్మ.

క. అవివాహితుఁడననియొక, యువతినిఁబరిచయమొనర్చు ♦ టుచితమెయైనన్
భవితవ్యదోషమెంచియు, వివరించితిఁబెండ్లియైన ♦ విషయము నిజమున్. 500

క. అని సత్యముఁదెలుపుచు మోహనుఁడంపిన కమ్మకామె♦యంపె బదులుగాఁ
గనితిమి నిజమిప్పుడు నీ, యనృతము క్షంతవ్యమనుచు ♦ నాదరమారన్. 501

క. నీవెప్పటివలెనిచటికి, రావచ్చును విందుగుడుప ♦ రవివారములన్
నీవైవాహికవిషయము, యావత్తుందెలుపమాకు ♦ హర్షము నిండన్. 502

క. తొయ్యలిఁగూరిచి నీతో, నెయ్యమువియ్యముగమార్ప ♦ నేరమిఁదలఁపన్
చయ్యనఁదెలిపితినిజమున్, నెయ్యమునకు లోటులేదు ♦ నీకెప్పటికిన్. 503

మతపరిచయము — 1889-90

క. రెండవవత్సరమున నిం,గ్లాండున దాజడుపునపుడు ♦ గాంధికిఁగల్గెన్
నిండగుదివ్యజ్ఞానా, ఖండల సోదరులతోటి ♦ ఘనమగు మైత్రిన్.

క. ఆసోదరులిరువురితో, "దిసాంగ్ సెలిషయ"లనంగ ♦ దిశలఁ యశముఁ
వాసిగల గీతనింగ్లీసు, బాసఁ మూలమ్ముతోడ ♦ బఠనమొనర్చెఁ. 505

ఆ. ఆంగ్లమందు 'ఎడ్విను ♦ నార్నాల్డు' గీతాను, వాదముత్తమాను ♦ వాదముగను
గాంచిదానిఁజదివె ♦ గాంధియాపిమ్మట, నిత్యమునుబఠించె ♦ సత్యదృష్టి. 506

ఆ. చెదరగామనమ్ము ♦ నెదురుగాగనిరాశ, చదుఁ గీతవ్యాకయు ♦ శాంతియొదవు
నంచెరింగె గాంధి ♦ స్వానుభవమ్మున, జీవయాత్రసేయ ♦ సేయగాను. 507

క. ఆసోదరులసిఫారసు,పై సదివెను శ్రద్ధ బుద్ధ ♦ భగవాను కథఁ
వాసింగాంచిన "లైటా, ఫేసియ"యను గ్రంథమందు ♦ విడువక పేర్మిఁ. 508

క. ఆసోదరద్వితయమే, వాసి సిఫారసునొనర్చ ♦ బరగం బ్లావే
ట్స్కీసతి వ్రాసిన "కీటుథి, యాసఫి"నిం గాంధిచదివె ♦ సత్యాసక్తిఁ. 509

క. ఆరచనఁజదువఁ గలిగెఁ, కోరిక హైందవమతమ్ము ♦ గూరిచి రచనల్
పేరిమిఁజదువననేకము,గా రక్తిని హిందుమతము ♦ ఘనతయుఁ దెలిసెఁ. 510

క. తనబాల్యమ్మున క్రైస్తవు, లను దినముఁ వినిచినట్టి ♦ హైందవమత దు
ర్గుణములగూర్చియపోహల, దునిమెఁ తద్ఘనతగూర్చి ♦ దొడ్డగఁ దెలియఁ. 511

మం. ఆకాలమందెమో ♦ హానుఁడొక్క మంచి, క్రైస్తవుఁగలనె మాం ♦ చెస్తరునందు
'బైబిలా'తనికడ ♦ పణమిచ్చి విలిచి, అతడుచెప్పినరీతి ♦ నంతయుంజదివె
అందు 'ఓల్డుటెస్టుమెం' ♦ టంచు తనతని, కాసక్తిగలుగలే ♦ దాపైనఁజదివె
న్యూటెస్టుమెంటందు ♦ నున్నతమైన, 'సర్మనాందిమౌంట్' ♦ చదివె నత్యధిక
భక్తితో శ్రద్ధ నా ♦ సక్తితోనందు, 'నుడిచెంపపైనిన్ను ♦ గొట్టినవారి
కెడమచెంపనుజూపు ♦ మెదిరింపకనెను, నీతి గీతఁబఠించి ♦ నేర్చినరీతి
బుద్ధజీవితగాథ ♦ భోధించునీత, శ్యామలభట్ చెప్పి ♦ నట్టు "లింపైన
భోజనమ్మిడుము చెం ♦ బుజలమ్ము"కన్న, నుడిముల్లనీతులం ♦ దడవినదంత
నరయంగజేయ మో ♦ హనుడెవనెరిగె, త్యాగమ్మెయుత్తమో ♦ త్తమమతమంచు.

మ. పఠనాసక్తిగడించె నన్యసుమతో ♦ పాధ్యాయులం గూర్చి వే
పఠియింపంగ దదీయబోధనల నే ♦ కర్వంగా నఖుల్ వ్రేసెనఁ
కటువైనట్టి "హీరోస్ హీరోవరిషిపఁ" ♦ కార్లైలు గ్రంథంబునం
దెటులోకొంత పఠించె గాంధి వ్యథచే ♦ యింతైన లేకుండినఁ. 521

క. డగ్గర బరీక్షలందుకు, బెగ్గడిలెఁ జదువవలసి ♦ పెద్దవిగ్రంథాల్
నెగ్గఁగ బరీక్షలందున, తగ్గెఁ దదన్యములపఠన ♦ తప్పని సరిగాఁ. 522

తే. కాని కాలక్రమమ్మునఁ ♦ గాంచవలయు, సకలమతములగ్రంథముల్ ♦ జదువవలయు
ముఖ్యమతములసారాంశ ♦ మునుగ్రహింప, వలయునని గాంధితనమది ♦ వ్రాసికొనియె.

క. ఆస్తికమతములగూరిచి, నిస్తులముగ గ్రంథరచన ♦ నేర్చినరీతిన్
నాస్తికమతమునుగూర్చి ప్రశస్తమగు పుస్తకమ్ము ♦ జదివెనొకండున్. 524

ఆ. అయిననాస్తికమున ♦ నాసంతరుచిలేమి. గాంధియట్టిపుస్త ♦ కమ్ము పేరె
విస్మరించెనాడు ♦ పేరందినట్టి బి,సెంటుగూడ దైవ ♦ చిత్తయయ్యె. 525

ఆ. అట్టికాలమందె ♦ నందెచావుసునాస్తికప్రవక్త 'బ్రాడ్లా' ♦ సుప్రశస్తు
లౌ మతానుయాయు ♦ లందఱుగొందఱుతని యంత్యకాలకర్మ ♦ కరుగుదేర. 526

క. అందొక్క మతాచార్యుల, సందతనంబునను జేరి ♦ ప్రశ్నించెను నీ
వుం దేవుడుగలఁడని యిపు,డందువె నమ్మికననంగ ♦ నౌనని సతఁడున్. 527

వ. అంతనానాస్తికప్రవరు "ఈభూమిచుట్టుకొలత 25000 మైళ్ళు అని నీకు తెలియునుగదా" అని ఆ మతాచార్యుని బ్రశ్నించెను. అతడును నిజమే, తెలియకేమియని బదులిడెను. 'అట్లయినచో, మీ దేవుని యాకృతి యెంతటి పరిమాణముగలది? ఆ దేవుడెచ్చట నున్నారో, ఎట్లున్నారో దయచేసి తెలియచేయండి" అని తిరిగి ప్రశ్నించెను. అందులకు ప్రత్యుత్తరముగా నా మతాచార్యులు "మనకు సత్యముగా నా దేవుని యునికిని దెలిసికొనవలెననే అభిప్రాయముంటే ఆయన నీ. నా హృదయములందే నివసించుచున్నవారని పలికెను. అదివిని, యా నాస్తిక మతభక్తుడు 'ఏమండీ నేనొక చంటిబిడ్డడనను కొంటిరి కాబోలు, యిటువంటి కబుర్లను వినడానికి" అని బడాయిగా బలుకాడ నా మతాచార్యులకు మౌనమే శరణ్యమయ్యెను. ఈ సంభాషణమంతయు వినుచున్న మోహనునకానాటినుండి నాస్తికమతమన్న మరింత యేవగింపుఁ కలిగెను. 528

నిర్బలునకు బలము శ్రీరామచంద్రుఁడే—1890-91

మ. మతవిజ్ఞానముమాత్రమెవ్వరికి సం♦పాదింపగాఁజాలదా
తత కష్టంబులఁ ద్రెళ్ళనిల్వఁగల చి♦త్తస్థైర్య శాంతమ్ములన్
ఇతరాధారములెల్ల వీడి, మది ధ్యా♦నింపంగ సర్వేశ్వరున్
"గతినీవే"యనివేడ రక్షణము మో♦క్షమ్మబ్బునెవ్వారికిన్. 529

ఆ. ఆంగిలేయదేశ♦మందలిచదువుల, గలిగెచిత్రరీతి♦ గాంధికొక వి
చిత్రసంఘటనము ♦ చేరితదనుభవ, మతనిజీవితమున ♦ నరిదితలప. 530

క. పదునెనిమిదివందలతొం,బదియవయేడందు 'పోర్ట్స్♦మత్' రేవుపురిన్
సదమలశాఖాహారులు, పదిలముగా జేసిరొక సం♦ఘము జర్పలకున్. 531

ఆ. పాల్గొనంగనాస♦భం బోయిగాంధియు, సఖుఁడొకండుతోడు ♦ జనగనందు
నీతిలేనిస్త్రీ ల♦నేకులుండంగ నం,దొకరియింట వార♦లుండదిగిరి. 532

ఉ. ఆయవినీతి మందిరము♦లందలి స్త్రీలగురించి కాని యా
మాయలమారులం దగిలి ♦ మంచిజనంబులు మట్టిపాలుగా
బోయనివారిగూర్చి స♦భాధిపులెవ్వ రెరుంగ రింతయున్
బోయిరివాసముండనట ♦ మోహనుఁడాతని మిత్రవర్యుఁడున్. 533

తే. ఆదినాంతమునన్ గాంధి ♦ యతనిసఖుఁడు, నరుగుదెంచిరిసభపను♦లైనపిదప
వారుదిగినట్టియింటికి♦నేరుగాను, భోజనములారగించిరి ♦ ముక్కువరకు. 534

ఆ. పిదప 'రబ్బరాపు♦బ్రిడ్జి'యనెడుక్రీడ, నాడఁజొచ్చిరి సఖు♦లందుఁబాల్గొ
నంగజేరె యింటి ♦ యజమానురాలును ఆంగ్లదేశరీతి ♦ ననుసరించి. 535

క. ఆడుచునాటనుమెచ్చుట, లాడుచునేవేవొ 'జోకు♦ల'న్యోన్యమ్మా
క్రీడల నాడుటవారికి, వాడుకయైయుండె నాడు ♦ వారలకెల్లన్. 536

వ. ఆనాటి యాటలం దాబోటితోటి సయ్యాటలందగిలి, మోహనుఁడువడిన యిడి
దుడుకులం దతఁడీరీతి నాతని జీవితచరితయందు నుడివెను. 537

ఆ. "నాసఖుండునామె ♦ నర్మప్రలాపము. లాడుచటు లసభ్య♦మైనరీతి
'జోక్సు'విసురుకొనుచుఁ ♦ జొక్కుచునుండుట, గాంచినేనుగూడ♦గలసితందు.

ఆ. కాని మరచినన్ను ♦ నేనామెమోహాన, క్రమముగానుబడుట ♦ గాంచినాడు
సఖుఁడుహెచ్చరించె ♦ ఛా! నీకుదయ్యము, పట్టినట్టులుండెఁ♦బారిపొమ్ము. 539

క. అననంతసిగ్గువడినా, జననికడంజేసినట్టి ♦ శపథమ్మును నా
మనమున స్మరించి వెంటనె, చనితిని నాగదికి మదిని ♦ జడిసి వడకుచున్. 540

క. నామదినాగతియన్య, స్త్రీమీదన్మోహమొంది ♦ ప్రేమంగనుటల్
నేమమువీడుటయనునిది, యే మొదలుం దుదియునయ్యె♦నీబ్రదుకందున్." 541

క. ఆనాటిరేయియాతని,కే నిద్దురరానిదయ్యె ♦ నెంతప్రయత్నం
బూని యతఁడుగావించిన, మానసమునశాంతిలేక ♦ మనుజుడు మనునే? 542

ఆ. కలతనిదుర మదియు ♦ నలతచేఁజెదరగా, పొలతిదలఁపుగదుఁ ♦ పూర్తిబెదరి
నాటిరాత్రియెట్లొ ♦ దాటించిమరునాడె, 'పోర్ట్సుమత్తు'వీడె♦మోహనుండు. 543

మం. ఈయనుభవముతో♦నెడద మోహనుఁడు, తలచె "నన్నానాడు♦దైవమే కాచె
క్లిష్టపరిస్థితుల్ ♦ కష్టకాలముల, దాటశక్తుఁడనైతి ♦ దైవమ్మదయను. 544
న్యాయవాదిగవృత్తి ♦ నడిపించుటందు, ప్రజలసంస్థల బహు ♦ రాజకీయముల
దైవమ్మె నను సదా ♦ దయనురక్షించె, ఆశలంతంబై ని♦రాశలోఁబడిన
సఖులుచే విడిచిన ♦ సౌఖ్యముల్ విడిన, దారిద్ర్యదుఃఖాళిఁ ♦ దలముక్కలైన
దైవమ్మె రక్షించె♦దయనన్నుసతము, దైవపూజలును, ప్రా♦ర్థనలు ధ్యానములు
కావుమాధాచార♦భావము; లవియ,సత్యమన్యమ్ము ల♦సత్యమ్ము; లవియ
తినుట త్రాగుట, పండు♦కొనుటలకన్న, మిగులసత్యములైన♦వగణితమ్ముగను.

ఆ. ప్రార్థనము వినమ్ర♦భావమ్ముతోఁ జేయ, హృదయమునుఁ దొలంచు ♦ నెల్లకలుష
ములు దొలంగి భక్తి ♦ దలకొను దైవమ్ము, మీఁద రౌడఁద విమల♦మై దలిర్చు.

ఆ. ప్రార్థనమ్మనగ సు♦సన్న్యాసముం గాదు, ప్రార్థనమనఁ గాదు ♦ పలుకు నేర్పు
ప్రార్థనమ్మనంగ ♦ భక్తివినమ్రత, దైవమును మనమునఁ ♦ దలచు టెపుడు. 553

ఆ. ఉల్లమెల్ల విరియ♦నుబికి యూటజలమ్ము, బోలె ప్రార్థనమ్ము ♦ లీలవెలయు
కామచింతనమ్ము ♦ గలుగదావంతయు, నందువలన శుద్ధ♦మగు నఖిలము. 554

ఆ. పెదవు లదరుచుండ ♦ బిగ్గర "దేవుడా", నన్ను గావుమంచు ♦ మిన్నుముట్ట
అరచుటింతగాదు ♦ అర్థించుటయునైన, ప్రార్థనంబదెట్టు ♦ లవని నగును? 555

ఆ. ఎడఁదఁ బ్రేమ దక్క ♦ నితరమెల్లను గ్రక్క, త్రికరణముల భక్తి ♦ దేవదేవు
ప్రార్థనమునఁ జిక్క ♦ పరగు మానవునికి, దక్కకుండు నెద్ది ♦ ధరణియందు? 556

## నారాయణ హేమచంద్రుడు—1890-91

మ. అట్టి కాలంబందు ♦ నరుదెంచె గొప్ప, రచయితయైన నా♦రాయణ హేమ
చంద్రుఁడింగ్లాండుకు ♦ చక్కగా నెరుగ, డాంగ్లమాతనిదు స్త్రీ♦లతివికారములు.
పొడుగైన గడ్డమ్ము ♦ పొట్టిరూపమ్ము, ముఖముగుండ్రమ్మైన ♦ స్ఫోటకచిహ్న
ములతోడనుండెఁ జూ♦పరుకు వికారముగ, గాంధియాతనితోడఁ♦గలసి మాట్లాడ
హేమచంద్రుఁడు గోరె ♦ నింగ్లీషు గరపు,మంచు మోహాను నతం ♦ డించుకయైన
వ్యాకరణమెరుంగఁ ♦ డద్దాని నేర్వ, నిచ్ఛగింపండయ్యె ♦ మచ్చికతోడ. 561
వ్యావహారికపద♦భాషను గరవ, నేభాషనుండియే ♦ నేయన్యభాష
లోనికే గ్రంథమే♦నైన భాషాంత,రీకరణమొనర్చు ♦ వీకలభించు
ననుటకాతడె సాక్షి♦యను కీర్తిగాంచె, దేవేంద్రనాథుని ♦ దివ్యరచనల
సారమ్ము ఘూర్జర ♦ జనులకు దెలిపె, హిందీ వంగ మరాఠి ♦ ఇంగ్లీషుభాష
లన్ని నేర్చెను మాట♦లాడంగనందు
సారమెరుంగ, త♦త్సారమన్యులకు, తెలియరచింపంగ ♦ దిట్టయతండు. 567

ఉ. ఇంకను ఫ్రాంసు మున్నగు న♦నేక విదేశములేగి వారి భా
షాంకములన్ని నేరునగ ♦ స్వాంతమునందభిలాష మిక్కిలిన్
జంకును గొంకులేని సహ♦జంబును జౌకయునైన దుస్తులున్
బింకము గర్వముంగనక ♦ మేలిమి దాలుచు నాతడిచ్చలున్ 568

తే. రుచుల భావమ్ములందభి♦రుచులయందు, గాంధికెనయగు నాతండు♦గాన నిరువు
రనుదినమ్మొండొరుల వంట♦లనుభుజించు,చుండిరెంతయు బేర్మిని ♦ నోర్మికూర్మి.

సీ. కార్డినల్ మేనింగు ♦ కడువిరాడంబరు,డనుచు 'డిస్రాలి' వినుతిసేయ
విని హేమచంద్రుఁడా♦తని గలియఁగగోరి, గాంధి భాషాంతరీ♦కరణమునకు
గొనిపోవఁదనవెంట ♦ గోరెనారాయణుం,డతడు యెప్పటి దుస్తులందునుండ.
తే. గాంధి పరిహాసింపఁ♦గనలి నారాయణ, హేమచంద్రుఁడనియె ♦ నిట్లుగాంధి
నరసి నాగరికులు ♦ పిరికిపందలు వాక్కు,డంబములకు దాస♦దాసతములు. 570
క. పెద్దలుగుణములనగువా,రిద్ధర మెచ్చెదరు మనుజు♦నెడద విశుద్ధిన్
పెద్దగజూడరు పైతళు,కెద్దియయిన విబుధజనుల ♦ కిదె నీతియగున్. 571
వ. అని పలికి మోహనుని డాంబికవేషాచారవ్యామోహమును దృణీకరించి, కార్డినల్ మానింగునకుత్తరము గాంధిచేతనే వ్రాయించి ప్రత్యుత్తరముఁబడసి తన్నియమితదినమందాతని జూడఁబోయెను. మానింగును గాంధి, హేమచంద్రులకు స్వాగతమిచ్చి, ప్రియవచనముల సత్కరించి పంపెను. 572
మం. అటులుండనొక్కనా♦డాతండు 'షర్టు', ధోవతుల్ ధరియించి♦తోతెంచె గాంధి
బసకు తద్గృహిణియు ♦ వాకిలిఁదెరచి, అంతకుమున్నెప్పు♦డరయని వేష
మందున్న చంద్రుని ♦ నరసియు బెదరి పరుగెత్తి చనిగాంధి ♦ సరసకిట్లనియె
వెడగువాడెవ్వడో ♦ వింతవేషమున, నినుజూడ నేతెంచె♦ననిపల్కగాంధి. 573
వాకిటియొద్దకు♦వచ్చి యచ్చెరువు పిచ్చలింపఁగఁగాంచెఁ ♦ బిచ్చివేషమున
నున్న నారాయణుం♦డొప్పె నాతండు, మామూలు చిరునవ్వు♦మలయమోమందు
"గోలసేయక వీధి♦బాలురు నిన్ను, వీడిరే నీవింత♦వేషమ్ము గాంచి"
యని గాంధి పలుకఁగా ♦ నతఁడనె "నిజమె, బాలురొనర్చిరి ♦ గోలనే వారి
దిక్కుచూడనె లేదు ♦ లెక్కింపలేను, విసిగి వేసారి నా ♦ వింతవైఖరికి. 579
వారలేగిరి వారి ♦ దారి యేమనక", అనిపల్కగాంధియు ♦ నక్కజంబందె. 582
ఆ. లండనందు నిట్టు♦లుండెనాతఁడు గొన్ని, నెలలనంతరము చ♦నియెను 'ప్యారి'
సునకు నచట నేర్చి ♦ సులభమ్ముగా ఫ్రెంచి, భాషనందునుండి దోషవిరహి
తానువాదమెటులో ♦ జాగుగానొనరించి మోహనునికి చూపె ♦ మోదమంద.
క. తుదకతఁడు తలచినటు తన,మదిఁదీర్మానించుకొన్న ♦ మాడ్కిని జనియెన్
పదిలముగ 'డెక్కుటిక్కెటు', కుదిరింపగ నమెరికాకు ♦ గూరిమి మిత్రుల్. 584
తే. అమెరికాయందు నివసించు♦నప్పుడతడు, సహజముగ దానుధరియించు♦షర్టుధోవ
తులను దాల్చి చనగ వీ♦ధుల వికార, వేషమునకు బంధితుడయ్యె♦విడువఁబడియె.

## గొప్ప సంత — 1890

తే. పదియునెన్మిది నూటతొం♦బదవ యేట, గొప్ప వస్తుప్రదర్శ నొ♦క్కొండు జరుగు
నల్ల 'ప్యారిసు' నగరమం♦దట్టహాస,ముగ నటంచును దెలిసెను ♦ మోహనునికి.

క. ప్యారిసునగరమునరయఁగఁ, గోరిక తీవ్రంబుగాఁగఁ ♦ గూడిన తరుణం
బారయ ప్రదర్శనమ్మొక, సారిరా పయనించి గాంధి ♦ చనె నాపురికిన్. 587

ఆ. ఆ ప్రదర్శనమున ♦ నాశ్చర్యమెంతయో, కొలుపు "ఈఫిల"నెడు ♦ గోపురంబొ
కండు పూర్తియినుప ♦ కట్టడంబొక వేయి, అడుగులెత్తుదాని ♦ నరసె గాంధి. 583

మ. ఆ ప్రదర్శనమున ♦ నరసె మోహనుఁడ, నేకదృశ్యములందు ♦ భీకరాకార
గోపురమతనికి ♦ గూర్చె నచ్చెరువు, అతఁడెక్కెమూఁడుప ♦ ర్యాయముల్ దాని
చెల్లించి యందేడు ♦ షిల్లింగులతఁడు, పాహారమాయెత్తు ♦ 'ప్లాటుఫారమున'
సేవించె సంతృప్తిఁ ♦ జెంద మానసము, విహరించె ప్యారిసు ♦ వీధుల ముఖ్య
దృశ్యముల్ చూడ న ♦ వశ్యమౌచోట్లు, ఏడుదినంబులఁ ♦ బిచ్చమైయుండి
'మ్యాపాం'డు 'గైడం'డ ♦ దీపికల్ గాఁగ, కాంచె నెల్లస్థలాలు ♦ గాంధి ముచ్చటగ.

క. స్వైరవిహారాదులకిలఁ, జేరొందిన 'ఫేషనులకు'ఁ ♦ బెన్నిధి యౌచున్
ప్యారిసునగరమ్మెచ్చోఁ, జేరిన నవి విదితముగను ♦ జెలఁగుచు నుండెన్. 595

తే. అయినఁ గ్రైస్తవదేవాల ♦ యమ్ము లిట్టి, దృశ్యములకెల్ల దూరమ ♦ తీతమగుచు
నందు గాలిడువారల ♦ డెందములను, చందముల నెల్ల మార్చెడు ♦ శక్తిగలవి. 596

ఆ. ఆ పురాతనాల ♦ యములందు సుందర, శిల్పములకు గీర్తి ♦ చెందినట్టి
"నోత్రెడేము" నిత్య ♦ నూత్ననిర్మాణము, కాంచి యక్కజపడె ♦ గాంధి మిపుల.

మ. ఆ దివ్యదేవాల ♦ యముల నిర్మించు, టందు కోట్లధనంబు ♦ వ్యయమొనరించి
నట్టివారలెడంద ♦ యందున దైవ, భక్తులై యుండ్రని ♦ భావించె గాంధి
అటుగాక ప్రోన్నత ♦ మైన గోపురము, పొగడినవారుండఁ ♦ దెగడినవార
లందు టాల్స్టాయి ఇ ♦ ట్లనిపల్కె "మనుజు, తెలివిలేమికి గురు ♦ తిది నిజమ్ముగను.
పొగ త్రాగుడెక్కువై ♦ పొగరుబోతగుచు, మతిసెడి తిరుగాడు ♦ మానసులిట్టి
గాలిమేడం గట్టఁ ♦ గాంక్షించుచుండ్రు", దివ్యమౌ ♦ క్రైస్తవ ♦ దేవాలయములు
పావనప్రార్థనా ♦ పాత్రమ్ములగుట, నందు వర్జిన్ విగ్ర ♦ హము ప్రోలమోక
రిలువారిఁ గాంచిన ♦ యెట్టివారలకు, ఉప్పొంగు భయభక్తు ♦ లు వ్యోత్తుగాను. 605

వ. మరియు నా క్రైస్తవదేవాలయములందలి ప్రణామప్రార్థనాచరణలు మూఢ విశ్వాసములుగావనియు నవి కేవలము స్వార్థపోషణములకుగాక తదర్థమ్ములగు భగవంతుని కల్పితములైనవనియు, నట్టి విగ్రహారాధనము భగవన్మహిమకు తద్భక్తికిని దోహదకారియేమనియు మోహనుడు గ్రహించెను. 606

## ——పట్టాచేపట్టాడు - అయితేమాత్రం——1891——

సీ. నాస్యముఖాస్త్రాధ్య ♦ నార్థముం గ్లాండున, కరిగిన మోహను ♦ డందుమూఁడు
సంవత్సరమ్ములు ♦ చదువంగవలయును, బారిస్టరుపరీక్ష ♦ పట్టమందు

వత్సరానికి నాల్గు♦ వంతునఁబండ్రెండు, టరములు మూడేండ్లు ♦ పైములోన
టగమొకటికివిందు ♦ లిరువదినాలుగం, దారువిందులకైన ♦ నరుగవలయు

గీ. నియతకాలపాలనమందు♦ నెగ్గవలయు, నచటి 'రోమను' 'కామను' న్యాయశాస్త్ర
ములపరీక్షల వత్సర♦మునకు నాల్గు,మారులును జర్గుచుండె నే♦మార్పులేక. 607

వ. ఆ పరీక్షలం దారి తేరినవారు 100 కి 9 మంది యుండునంత సులభతమములై యుండుటచేత నా పరీక్షల కేవిద్యార్థియు నంతదీక్షతోఁ బఠింపఁడు. కేవలమే 'నోట్సులో' చదివి 'ప్యాస'య్యేవారు కాని, మోహనుని అంతరాత్మ అట్టి నామమాత్ర పరీక్షావిజయముం గోరుకొనదయ్యె. పాఠ్యగ్రంథములనెల్లఁ బరిపూర్ణముగాఁ బఠించినఁగాని వాని యంతరాత్మ సంతృప్తిఁ జెందమివలన నానాటి యట్టి యాత్మవంచన విధానమునకు బాల్పడక, రేబవళ్లుఁ గష్టించి పాఠ్యగ్రంథముల నన్నియు సొంతము బఠించి పరీక్షలందు నెగ్గెను. 608

క. పదునెన్మిదివందలతొంబదియొకటవయేట 'జూను'♦ మాసమ్మందున్
పదియవతేదిన 'బారు'బి,రుదముంగొని, యిండియాకు ♦ రూఢిం జేరెన్. 609

## నా నిస్సహాయస్థితి లేక భంగపా—1891

క. బిరుదము సులభమె బ్యారి,స్టరుగా నందుటలరింది ♦ సలుపం బ్రాక్టిస్
కరమొప్పచదివెచట్టము, లరుదయ్యెన్వానిబలుక ♦ నాచరణమునన్. 610

క. బిరుదమ్మందుటసులభమె, అరుదగునోర్విప్పిపలుక ♦ న్యాయములునగన్
సరియనమెచ్చఁగఁగోర్టుల, పరువుప్రతిష్ఠలును వెలయ ♦ బ్యారిస్టరుగాన్. 611

ఆ. న్యాయధర్మశాస్త్ర ♦ మఖిలమధ్యయనమ్ము, దీక్షఁజేసెగాని ♦ దక్షతమెయి
వాదమొప్పఁజేసి♦ వ్యాజ్యమ్ముల జయంబు, గాంచు తెరవు గాంధి♦ గాంచడయ్యెఁ.

మం. పరధనమ్ములకే య♦పాయంబు రాని, లాగున ధన ముప♦యోగమ్మొనర్చు
మనుధర్మవచన మె♦ట్లాచరణమున, కక్షిదారుకు లాభ♦కరమగునటు ప్ర
యోగించుటాతని ♦ యోచన కంద, దాయె దద్వచనమ్ము♦పై యెల్ల కేసు
లను బఠించెనుగాని ♦ యనుదినాచరణ, మందది యుపయోగ♦మగుననునమ్మ
కమ్మాతనికి సుంత ♦ గల్గలేదకట, ఎమ్మెయినెంత యో♦చించినఁగాని. 617

వ. ఇంతియేగాక. 618

సీ. భారతదేశ సం♦బంధ హైందవ ముస్లి,ముల న్యాయశాస్త్రాల ♦ పొంతఁబోవ
లేదింతనాతండు♦ లేశమే "నర్జిలు", వ్రాయుపద్ధతియు నే♦ర్వంగలేదు
కడలిలో సుడివడు ♦ పడవకైవడిని దల్లడపడెనతడు కా♦లమ్ము మహిమ
సింహాంబురీతి గ♦ర్జించుచు 'లాకోర్టు'లందు వీరవిహార♦మాచరించు.

ఆ. సర్ఫిరోజిషా ప్ర♦శస్తిని విని యత,డట్టి దిట్టగాఁగ ♦ నెట్టు నేర్చె
నాంగ్లదేశమంద♦టంచు వింతందన, కట్టి ప్రజ్ఞగలుగ ♦ దెట్టులంచు. 619

ఆ. అయిన న్యాయవాది ♦ వ్యాపారమునఁ బొట్ట, కన్నము నిడగల ధ♦ నార్జనంబు
తనకు నౌదవు నొకొ♦యని మనమ్మున సంది,యమ్ము చెందె గాంధి♦ సఖులెఱుంగ

క. అంతట సఖుఁడొకఁడాతని, చింతంగని దాదభాయి ♦ చెంతకుఁ జనుమం
చెంతయు బోధింపఁగ మతి,మంతుఁ డతని కడకుఁ బోయె ♦ మంతనమాడన్. 621

మ. ఆంగ్లదేశమ్మున ♦ కరుగుచో గాంధి, తనవెంటఁగొని చనెఁ♦ నగు పెద్దలకును
పరిచయలేఖలఁ ♦ బలువురకం దొ,కండు దాదాభాయి ♦ కుండె, మోహనుడు
నది గొంచుఁ జని యత♦డనసె దాదాను,నౌరోజి యును గాంధి♦ నారసి, ప్రేమ
"వలసినప్పెల్ల రా♦వచ్చును నీవు, నా సలహాను గొ♦నంగ నాకడకు"
అని గారవించి మో♦హాను నంపెఁగాని, గాంధిమాత్ర మతని♦కడకు పోలేదు.

సీ. స్థాపించె విద్యార్థి♦సంఘమొండు తదీయ, కష్టసుఖమ్ముల♦ గాంచు కొఱకు
ఆ సంఘసభ లప్పు♦డపుడు సమావేశ, మగుచుండు నరుగు మో♦హానుడునందు
కనులపండువుగాను♦గాంచి దాదాభాయి, వీనులవిందుగా ♦ వినుచు నతని
సదమలోపన్యాస ♦ సరణియు, నాతని, విద్యార్థులును గౌర♦వించువిధము

తే. అతఁడు వారలయెడ జూపు ♦ నాతురతయు
గాంచి ముదమందుఁ గాని త♦క్షనగుణాఢ్యుఁ
దొందరింపఁగఁ బలుమారు ♦ గాంధి జంకి
పోవఁడయ్యెను దన కష్ట♦ములను దెలుప. 627

తే. అయినఁ దన్మిత్రు నుపదేశ ♦ మనుసరించి, సుప్రసిద్ధాంగ్ల న్యాయవా♦దప్రవీణుఁ
డైన ఫ్రెడరికు పిక్కటు♦నరసి తెలిపె, తన మనోగత సందేహ ♦ తతులగాంధి.

క. గౌరవపురస్సరముగ ను,దారచరితుఁడతఁడు గాంధి ♦ దనియఁ దెలిపె సా
ధారణ లాయరుగా నతి, నేర్పునవశ్యమ్ము గాన♦వియు మరి పలికెన్. 629

ఆ. శ్రద్ధతోడఁ జిత్త♦శుద్ధితోఁ బనిచేయఁ, జాలుఁ జక్కనఁగఁ ♦ జాలుధనముఁ
గడన సేయవచ్చుఁ ♦ గడు క్లిష్టముగనుండ, వెల్ల 'కేసు' లంచు ♦ నెఱుఁగగాంధి.

తే. పాఠ్యపుస్తకములుగాక ♦ పైననేవి, శేషమగు గ్రంథములఁ బఠిం♦చితివి చెప్పు
టంచు నడిగిన మోహనుం♦డతని యలతి,పఠనఁ గూర్చి వచించెఁ ♦ బ్రాజ్ఞుడతఁడు.

క. నీకష్ట మర్థమయ్యెను, లోకజ్ఞానార్థపఠన ♦ లోపింపగ రా
దే కరణిన్యాయవాదికి, లోకమ్మున గడన కెంతొ ♦ లోటగు దానన్. 632

మం. పఠియింపవలె నీదు ♦ భారతదేశ, చరితమ్ము పాఠ్యపు♦స్తకము గాకున్న
పాఠ్యపుస్తకమొండె ♦ పఠియించువాడు, పాఠ్యేతర గ్రంథ ♦ పఠనమ్ములేని
వారలల్పజ్ఞుల ♦ వ్వారి జీవితము, కూపస్థమండూక ♦ గుణమునసుండు
కనుక వకీలుగా ♦ గడియింప జయము, చదువుము నీదేశ ♦ చరితాదులెల్ల
ప్రతిభారతీయుడు ♦ పఠియింపవలయు, భరతదేశచరిత్ర ♦ బాగుగా దెలియ
నరులనైజము వకీ ♦ లెరుగుటవలయు, తన్ముఖదర్శమా♦త్రమున నెల్లపుడు
నీవకీల్ వృత్తికి ♦ నీదేశమందు, జరిగె సిటీవల ♦ సైన్యవిప్లవము
చదువంగవలె దాని ♦ చరితమ్ము; మరియు, చదువుసాముద్రిక ♦ శాస్త్రద్వయమ్ము
నరుల నైజగుణము♦లెరుగుటకొరకు; అనుచాతఁ డొసగె మో♦హనునికా గ్రంథ
నామముల్ పట్టిక ♦ ప్రేమతో గాంధి, కొని పఠించెను మరు♦దినమున లావె
టరు ముఖశాస్త్రంబుఁ ♦ బరమానురక్తి, నైన నందలి సార♦మవగతమింత
గాకున్న 'పిన్కట్టు' ♦ కావించినట్టి, హితబోధ చేఁ దన ♦ కెంతేని నున్న
చిత్తశుద్ధియు శ్రద్ధ♦చే దోడుగాగ, పనిచేయ ధనము సం♦పాదింపవచ్చు
వడి వకీలుగనంచు ♦ బరగ విశ్వాస, మాశానిరాశ లి♦ట్లాతని మనము
నుయ్యాల లూగింప ♦ నోడ బైనించి. చేరె బొంబాయిని ♦ చెచ్చెరగాంధి. 647

క. రామా వింటివె, యిది నీ, ప్రేమాంచితభక్తుసచ్చ♦రిత్రమ్మగు శ్రీగాం
ధీమాహాత్మ్యంబందలి, దొ మొదటిది స్కంధమమల ♦ మమరము రామా." 648

ప్రథమస్కంధము, సంపూర్ణము.

---

ఓం శ్రీరామ, జయరామ, జయజయరామ

# శ్రీ గాంధి మాహాత్మ్యము

## ద్వితీయస్కంధము



—— రాయచంద్ భాయి —— 1891 ——

మన్నామా, జలద
శ్యామా, సుగుణాభిరామ ♦ జయజయరామా
ప్రేమామృతధామ యశ్శ్రీ
స్సీమా, పాతకవిరామ ♦ సీతారామా!

తే. శ్రీలఁ బెంపారు బొంబాయిఁ ♦ జేరవచ్చు,నప్పుడ 'ఁ జెబియా' కడలి ♦ ఉ
జబ్బుపడునట్లు నౌక త♦బ్బిబ్బుగాఁగ, గాలివానలు జృంభించె ♦ గాంధియొకఁడె
జబ్బుపడకుండ నిబ్బర♦ముబ్బ కలిచె, నౌకపై [illegible]ంచు ♦ జోకతోడ. 1

క. బాహిరపుటలజడింబలె, మోహనుని మనోంతరంగ♦మును నలజడికే
యూహాందావీయమి ట్యా, మోహితుఁడుం గాకయుండె ♦ ముదమున నతఁడున్. 2

సీ. కులబహిష్కారపు ♦ గొడవ తప్పనిసరి,యగునంత వినెదురొ్క♦నగ నొకండు
న్యాయవాదిగ జీవ♦నంబు ప్రారంభించి, ధనము గడనబాటు ♦ మసలనొండు
తాను సంస్కరణలఁ ♦ దత్పరుఁడౌటచే, సంఘాచరణ యోగ్య♦మైన వెట్లు
మొదలిడఁదగునంచు ♦ హృదయమునారత,మాందోళనమ్మందు ♦ డిందనొండు.

గీ. కలతి వెట్టుచునుండెను ♦ గాంధిగారి చేతయుంతియు నలజడి ♦ గానఁడాత
డైన నతనికి చెప్పిన♦వానికన్న నెక్కుడగనుండె కష్టమ్ము ♦ లెదురుకొనఁగ. 3

మం. మోహనునన్న ప్ర♦మోదంబు [illegible] కలియంగఁ ♦ దరలియే తెంచె
రేవుఁ జేరనతండు ♦ ప్రియమార మెహతా, నాతియన్నయు ♦ నంతకుమును పె
కలిసియుండిరి వారిఁ ♦ గలియుటకతన, గాంధిజీయన్నకుఁ ♦ గానసందరును
మెహతకొర్కె నతని ♦ గృహమునకేఁగెను ఇంగ్లాండు నం♦దైన పరిచయ
మిరుకుటుంబమ్ముల ♦ నెంతయుఁ గలిపె, నిత్యనిర్మలమగు ♦ స్నేహితబంధ
మందెప్పుడేలాటి ♦ యరమరికలును, పొసగని మైత్రి నా♦ప్తులుగాఁగ సతము.9

శా. అమ్మా! నీనిడినట్టియొట్టుల మదీ♦యాత్మన్సదా, జ్ఞప్తితో
సమ్మోదమ్ము నదాల్చి లండనున మాం♦సాహారముం, మద్యపా

నమ్మన్ సేయక స్త్రీలనంటకయె నా ♦ నావిద్యలన్నేర్చితే
నన్మాయంచును బగ్గెలంబలుకఁ జి♦న్నప్పుంబలెం దీవ్రతన్, 10

క. ఎపుడెపుడిల్లుం జేరుదొ, నెపుడమ్మపదమ్ములందు ♦ నెరగుదు నా ని
ష్కపటమనమ్ముం దెరచుదు, నెపుడెపుడంచుం దపించె ♦ నెద మోహనుడున్. 11

తే. అటులమదిదీవరించు మో♦హనుని దరిసి, చల్లగా దెల్పెనాతల్లి ♦ చావుకబురు
అన్యదేశములందు విద్యార్జనమున, నుండఁదగదంచు నెరిగింప♦కుంటినంచు. 12

క. ఇటులన్నయమ్మచావను, కటువార్తన్వినిచినంత ♦ గాంధి మనము లం
పటవడె తండ్రిమరణమ,ప్పటికన్న న్మిగుల బొగిలెఁ ♦ బరిపరిగతులన్. 13

క. అయినను స్థితమతితానిపు,డయినందున గాంధి బిట్టు♦నరవకయె మనో
మయదుఃఖమెల్ల నడచుకొనియె దుఃఖాశ్రువులు కంట♦నిగుడకనుండన్. 14

తే. ఎదియుజరుగని గతిఁదన♦మదిని ద్రొక్కి,పట్టి జీవనవృత్తి సం♦బంధమైన
పనులఁ జేపట్టి చేయను♦పక్రమించె, మోహనుఁడు సుఖదుఃఖ ని♦ర్మోహుఁడగుచు.

సీ. డాక్టరు మెహత సో♦దరుడు రేవాశంక,ర జగజీవనుడును ♦ రాయచందు
డను మెహతాగ్రజు ♦ నల్లుడు మొదలగు, పలువురమిత్రుల ♦ పరిచయంబు
గలిగె డాక్టరు మెహ్తా♦గావించుటం జేసి, యందు రాయ్ చందు స♦త్యప్రవృత్తి
అతనియమోఘశ♦తావధానప్రజ్ఞ, వేదాంతవిజ్ఞాన ♦ విమలగుణము. 16

గీ. ఆత్మజిజ్ఞాసఁగని గాంధి ♦ యబ్రమందె, సతతమారాజచందు ప్ర♦సన్నవదన
మందు వెడలుముక్తానందు♦విమలగేము, పరవఁగని గాంధియాతని♦భక్తుడయ్యె.

ఆ. ఈశ్వరు గనినపుడ♦యేనునానిత్యకృ.త్యముల ధన్యుడనని ♦ దలతుమదిని
సత్యముననతండె ♦ నిత్యముక్తానందు, సుఖమయమగుబ్రతుకు♦సూత్రధారి. 17

క. రాయచందుభాయి ♦ రత్నాలముత్యాల, నేర్ప ంపగలుగు ♦ నేర్పుగల్గు
నిపుణుడంచుమివుల ♦ విపులయశమ్మును, గన్నవాఁడు వర్త♦కమ్మునందు. 18

ఉ. ఆతనివర్తకమ్ము వ్యవ♦హారములెప్పుడు వేల లక్షలం
దాతతమైతనర్చు నపు♦డైనస్మరించుచునుండు నీశ్వరుం
జేతమునన్వినీతమతిఁ ♦ జేగలకార్యము పూర్తిచేయుచున్
వ్రాతను ముస్గునెప్డు భగ♦వానుచరిత్రముగూర్చి వ్రాయుచున్. 19

తే. పనులయొత్తిడినిన్ స్థిత♦ప్రజ్ఞుఁడతఁడు, మతి గలంగడు వ్యాపార♦మధ్యమందు
నిత్యమును దైవభక్తి ధ్యా♦నించుచుండు, సత్యశీలియునై రాయి♦చందుభాయి.

ఆ. అందువలన రాయి♦చందునందున భక్తి,గలిగి మతముగూర్చి ♦ గాంధి చర్చ
చేయుచుండె పనులు ♦ చేతినిండుగలేని, న్యాయవాదియగుట ♦ నతనితోడ. 21

క. ఎందరో మతాధికారులు, విందుంగూరిచిరి గాంధి ♦ వీనులకే రాయ్
చందువచోమృతమిడియెనె,డందకు నందంగ నిష్ఠ♦ానందమ్ముల్. 22

క. ఆతని మేధోసంపద, యాతని నీతి ప్రవర్త♦నాధ్యాత్మగాంధిక్
ప్రీతిల్ లోఁగొనె నయ్యనల్, ఖ్యాతగురుస్థానమాయఁ♦డాయె నతనికిన్. 23

ఆ. ఆత్మసిద్ధినడయ ♦ హైందవసిద్ధాంత,మనుసరించి గురుని ♦ యవసరంబు
మోహనుండెరుంగు ♦ ముక్తిదమగుజ్ఞాన,మందగురుడు వలయు ♦ నంచు దెలియు.

ఆ. ఐహికములకంత ♦ యవసరముండదు, జ్ఞానపూర్ణుండైన ♦ సత్యగురు స
హాయమైన పార♦మార్థికవిజ్ఞాన,పూర్ణుడైనగురుని ♦ పొందవలయు. 25

క. యోగ్యతఁబట్టియె సద్గురు,భాగ్యము లభియించు గానఁ ♦ బరిపూర్ణంబౌ
యోగ్యత సతము శ్రమింపక, మృగ్యము శ్రమియింపఁగన్ను ♦ నీశ్వరుకృపయున్.

మం. ఈగతి యోచించ ♦ నెంత యోగాంధి అయిన నాతనిహృ♦ద్యాసనమందు
గురునిగా రాయ్‌చందుఁ ♦ గూర్చుండబెట్ట, జాలడయ్యె ననేక ♦ సందర్భములను
అతనిసాయము సల♦హాలుగోరినను అఖిలమీశ్వరుదయ♦యని నమ్మెనతడు. 29

ఆ. ముగ్గురాధునికులు ♦ ముగ్ధుఁజేసిరి గాంధి,నందు స్వీయపరిచ♦యమున రాయి
చంద్ స్వకీయకృతుల♦జక్క 'టాల్స్టాయియు','రస్కిను'అనునాంగ్లరచయితయును.

వ. "ది కింగ్డమ్ ఆఫ్ గాడ్ ఇస్ విదిన్‌యూ" అనగా "ఈశ్వరసామ్రాజ్యము నీయందేగలదు" అను పేరున "టాల్స్టాయి"అను బహుళప్రఖ్యాతిఁబడసిన రష్యనురచయిత రచించిన యుద్గ్రంథమును, "అంటుదిలాస్టు" అను యశోవిశాలుడగు 'రస్కిను'అను నాంగ్లకవి రచనయు, మోహాను నలౌకికభావము లందు ముంచివైచెను. 31

## జీవనారంభము—1892

సీ. మోహనునన్న త♦మ్మునిగూర్చి గొప్పయా,శాసాధనిర్మితో♦త్సాహమునను
పేరుప్రతిష్ఠలఁ ♦ జేరాస ధనకాంక్ష, ప్రేరేప నతడింటి ♦ వెచ్చములకు
వెచ్చించుటలు చాల ♦ హెచ్చుగావించె నా,డంబరమ్మునకు పై ♦ డాబుసరికి
మృదులవిశాల సు♦హృదయుడౌ నాతడా,కర్షించెను సుహృత్ప్రకాండకాండ
మవ్వారిమూలాన ♦ నవ్వారిగా వ్యాజ్య,ములను గూర్పదలంచె♦ మోహనునకు.

ఆ. తమ్ముడమితముగను ♦ ధనముసంపాదించు, న్యాయవాదవృత్తి♦యందు నూపి
రాడకుండవచ్చు♦వ్యాజ్యమ్ములని మది,తలచె నతడు మిగుల♦ నమకమునను.

మం. ఆతని పరదేశ♦యాత్రకుగనలి, కుల బహిష్కారమ్ము ♦ గూర్చి రాతనికి. 33
కులపెద్దలందొక♦కొందరు కొంద,రాతడు నాసిక ♦ యాత్రగావించి

గోదావరీనదిం ♦ గ్రుంకి రాజ్కోట, యందు విందొనరింప ♦ నాతనిందిరిగి
కులమందుంజేరుచు♦కొనిరి మోహనుని, కిటు జేయుటెల్ల న♦యిష్టమైయైన
అన్నయందలిభక్తి ♦ నంగీకరించె, నతఁడు జెప్పినరీతి ♦ నాచరింపంగ. 37

సీ. కులమందు దనుజేర్చు♦కొననిష్టపడనట్టి వారి జేరంగనింత ♦ వాంఛగనడు
ఆతెగపెద్దలం ♦ దొకంతమదనాగ్ర,హమ్ముజెందడు స్వప్న♦మందునైన
తన్ను ద్వేషించు కొం♦దఱు పెద్దల కయిష్ట మొదవు జేయగనెప్పు♦డీయకొనడు
కులబహిష్కార విధు♦లనెల్ల సంపూర్ణ,గౌరవమ్మున మది♦గాంచెనతడు. 38

ఆ. కులమునుండి వెలికి ♦ నలయొగ్గియుంగూడ, గౌరవ్యముగను జేర్చు♦కొనదలంచు
నత్తమామల ననుజాదిబాంధవవర్గ,మూర్ధ్నులకు గాంధి ♦ మనసునిడడు. 38

క. ఏయదిబహిరంగమ్ముగ, జేయుటకెంతైన నెగ్గు ♦ సిగ్గుం గనునో
ఆయది బుజాగుణువెప్పుడు, నేయుండని గాంధితలచి ♦ 'ఛీ'యని తలగెన్. 39

క. ఇటునెవ్వరినొప్పింపక, కుటిలమతింబోక కొనక ♦ కులముందలంపునన్
పటుసద్వర్తనమోహను, డటునెల్లరిప్రీతిపాత్రుం♦డయ్యెంగులమునన్. 40

క. అప్రతిఘటనాకుశలుడు, సుప్రకటుండగుచెల్లరికిని ♦ సూనృతమతియై
అప్రియమొనరికిం జేయమి, నప్రతిఘుండయ్యెగాంధి ♦ యందరికెందున్. 41

ఆ. కాదుగూడదేను ♦ గలయుంగవలె గుల,మందటంచు నతము ♦ గాంధిపెద్ద
లులుకునట్లొనర్చి♦యున్న నాందోళనం, బ్రతిఘటించియుండ్రు♦పలువురందు. 42

క. ఏతత్ఫలితమ్ముగందన, జాతియుఃగత్తులెన్నొ ♦ జననంబైదా
చేతస్సున గుందగ నపి,సీతింగపటనటనలందు ♦ నిండుగ మునుగున్. 43

వ. బైటివారితోటి సంబంధములందట్లున్నను. 44

సీ. తనభార్యతోటి బాం♦ధవ్యసంబంధముల్, దానుగోరినరీతి ♦ దనరకుండె
ఆంగ్లదేశనివా♦సంబు [illegible] గనుమాయ,నుండి విమోచన యొదవలేదు
ప్రతిచిన్నవిషయ [illegible] ♦ [illegible]నుమానమం, దసహించుకొనుటయు♦నటులెయుండె
అతడుగోరినరీతి ♦ నామెవ్రాయుట చదు,వుటనేర్వనలెనంచు ♦ నోర్మివీడి

తే. పటుబలాత్కారమొనరించె♦బలుమారామె, చెంత నావేదనముమన♦మందునకట!
తనవివేకవిహీనత [illegible] ♦ [illegible], గాంధి కస్తూరిభాయిని ♦ గష్టపెట్టె. 45

ఆ. పఠనసేయవలయు ♦ వ్రాయుటనేర్వగా,వలయునతని పడక ♦ వాంఛగోరి
నట్లు దీర్పవలయు ♦ నతడుచెప్పినరీతి, నాడ యంత్రమొక్క♦యామె యకట!

వ. ఇటులంతులేని కోర్కెలతోడను, కుశంకలతోడను బింకమువహించి యామె ననేకవిధములైన యాపేక్షలపాల్జేసి, కడకొకపరి నామెను యామె యమ్మగారింటికి పంపివైచెను. ఆమెనం దెంతయో దురంతచింతాక్రాంతయైన యనంత

రంబే తన యంతికమునకు రా నంగీకరించెను. తదనంతర మిదియంతయుఁ దన
పనికిమాలినతనమని మోహనుడు గ్రహించెను. 47

మం. పిల్లలచదువులవిషయమై మార్పు చేయఁగదలఁచె నదిఁ జింతించి గాంధి
తననాలుగేడుల తనయునితోడఁ, తనయన్నబిడ్డలకును దానె చదువు
నేరుపందలపోసి నేర్పెవారలకు, వ్యాయామమునుగట్టి వడవారియెడలు
తనస్వానుభవఫలితమనుసరించి, దనయన్న యామోదమునుబొంది గాంధి
చాలవరకు గాంచె జయమందు నాటి, దొట్టిపిల్లలతోడ జట్టుగూడి
వారితో జోకతోఁ బరువెత్తుచుండ, నలవాటుయయ్యె మోహనునికి సహము.
అప్పటినుండి తానధ్యాపకుడుగ, గట్టివాడనటంచు గాంధి తలంచె. 54

సీ. ఆహారవిషయకుంబనవసరముగ మార్పులొనరించె 'కాఫీ'టీలును వెలయగఁ
తోడు కోకోగూడ వాడనారంభించె, 'ఓటు'ధాన్యాన్నంబు సూట్లు బూటు
లాదిగాగలుగు నాంగ్లాచారములనెన్నొ టిక్కో యన్నసమ్మతి ననుసరించె
వేషభాషలయందు నింతపోకడలవలంబించె నెన్నియో యతనియింట. 55

గీ. అందువలన వ్యయమునధికంబుగాజొచ్చె, దినమునేదొక్రొత్త కనుసుగొనుట
వాడుకగబడాయి బ్రతుకుజెల్లుట కెన్నొ, పాట్లుపడగవలసెఁ బాపమతడు. 55

క. అధికవ్యయమునకుందగునధికాదాయము గడింప నతనిప్రయాసం
బధికముగా నతనికి నిర,వధికముగా ధనములొసగు వారలు లేమిన్. 56

వ. రాజకోటయందు దన న్యాయవాదవృత్తికి నలయు ననుభవజ్ఞానము లేకున్నను
అట్టి సామాన్యమైన అనుభవవిజ్ఞతగల న్యాయవాదికన్న పదిరెట్లుగా దనకు
రుసుమొసగుచున్న నెట్టి నిసుగుకడనైన పొసగదు. అట్టివాడెవండైన దన
డాబుసరివేషమునకు మెచ్చుకొనిపోయి యందుకు సమ్మతించినను, మోహనునికి దన
యజ్ఞానమునకుదోడు [illegible] హంకారముతోటి దగాకోరుతనమునకు
బొల్పడుటకు మనసొప్పకుండెను.

తే. అట్టితరి స్నేహితులగొందఱ [illegible]
సఖుఁడ! హైకోర్టు [illegible]
చదువ 'సిండియన్ లా'కు [illegible] లసాధ్య,
మగునవిగడింప బొంబాయి [illegible]. 58

ఉ. మిత్రులుచెప్పగా [illegible] మోహనుడేగి బొంబయిన్
పాత్రతయింతలేని [illegible] వంటలవానిగాఁగొనెన్
రాత్రులునుంబ [illegible] వంటవండుచుం
బాత్రలతో [illegible] నాతడున్. 59

క. జందెము నాగలి సంధ్యా,వందన మేపారబట్టి ♦ వడిద్రవ్వుట నా
కుం దెలిసినదెల్లయు బొల,యుందున్నటయనియెనతడు ♦ ముసిముసి నగుచున్.

వ. అట్లు వ్యవసాయేతర కార్య మెందుం దెలియని రవిశంకరుడను నా బ్రాహ్మణ నాముడు ‘మీ దయ, నా యదృష్టము’ని మోహానునికి విన్నవించుకొన గాంధి యా బాపని కధ్యాపకుడై సగమువంట దానే వండుకొనుచు శాకపాకములం దాంగ్లవిధానప్రయోగములం గావించుచు గాలముం గడుపసాగెను. ఇతర కులజులతో కలిసి భుజించుటయందు గాంధి చందంబున నెట్టి శంకలు లేనివాడైనను రవిశంకరుండు శుచిగానుండుటయు, శుభ్రముగా నాహారముంచుటయు నించుకేని నేరనివాడు. ఇట్లు నాలుగైదు నెలల కాలము గడుచుసరికి వ్యయమునకు దగిన ఆదాయము లేమి తెలియవచ్చెను. బారిస్టరు పట్టా పటాటోపమునకుదప్ప మరెందుకును బనికిరానిదిగా భావింపబడెను. 61

—పెండటికేసు—1892—

మం. బొంబాయినుండు నప్పుడె యొక్కవైపు సాగించెనిండియన్ ♦ చట్టంబు జదువు,
వీరచంద్ గాంధియన్ ♦ వేరొక్క సఖుని, కలిసి వేశాక పా♦కములం బ్రయోగ
ములను వేరొక్కవై♦పున జేసె గాంధి, ఆతనియన్న ప్ర♦యత్నించుచుండె
తనతమ్మునికి సత♦తము శక్తికొలది, వ్యాజ్యము లెట్టులో ♦ వడిని జేకూర్ప. 65

క. ‘ఇండియనులా’పఠనమున. బండగ మోహానుని సహాన ♦ బలమెల్లయు నా
తండు ‘సివిల్ ప్రొసిజర్ కోడ్’, బండింద్రోలంగ లేక ♦ బడలికంబడియెన్. 66

క. ‘ఎవిడెన్స్ ఆక్ట్’ అటుగా లే,దవగాహనమయ్యె గాంధి♦ కాతని సఖుడున్
వివరించి తెల్పెం బలుప్రము,ఖ వకీలుల విపులవిజయ♦గాథానిధులన్. 67

వ. ‘సర్ ఫిర్ జ్ షా’ సామర్థ్యమాతని యపరిమితమగు చట్టవిజ్ఞానమందుండెననియు, బదురుద్దీన్ త్యాబ్జీయొక్క యక్కజమగు వాదనాపటిమ న్యాయాధిపతులకు సంభ్రమాశ్చర్యముల గొల్పునదియనియు, సాధారణముగా ప్రతి బారిస్టరు కనీసమయిదారేండ్లు కష్టించినంగాని కడతేరి గట్టెక్కుటే కష్టమనియు, నందు వలననే తాను సొలిసిటర్ పరీక్షకు చదువుచుంటిననియు వీర్చంద్ గాంధి కరంచంద్ గాంధికి చెప్పి, “నీవునీవై నీపడవను నడుపకొనగల్గు ప్రథిమ నీకు మూడేండ్లకైన నీవు గడింపగలిగినచో నీవొక అదృష్టవంతుడవుగా పరిగణింప బడగలవని నొక్కిపల్కెను. 68

సీ. నెలనెల నింటికొ♦సెలవులు పెరిగెను, తగినరాబడి లేక ♦ తరిగెనెలకు
పనికిలోన దయారు♦పడుచునుండుచు బైట, బారిస్టరుగ బల్ల♦నడుట తగునె

అని మనమ్మ నగాంధి ♦ యాందోళనముఁ జెంది, శ్రద్ధఁ జూపక పోయె ♦ చదువులందు
'ఎవిడెన్సుఆక్టు'యం ♦ దిష్టమించుక గల్గె, "మెయిను'హిందూలా" స ♦ మేయరక్తి

గీ. చదివె మోహనుఁడైన వ్యా ♦ జ్యంబు నడుపు, ధైర్యమింతయు లేకనూ ♦ తనముగాను
అత్తవారింట నడుగిడు ♦ క్రొత్త పెండ్లి, కూతుగతి నోటమాటలే ♦ కుండెనకట ! 69

గీ. అట్టిసమయాన మామిభా ♦ యనెడునతని, వ్యాజ్యమునడుపుమంచును ♦ వచ్చి గాంధి
నడిగిరే జెంటుకిడఁ గొంత ♦ ముడుపు కాని, మోహనుండందులకు బెడ ♦ మోము వెట్టె.

మం. ఆబడాబారిస్ట ♦ రాబృహన్న్యాయ, వాదియు నిత్తుర ♦ వ్వారిగాఁ గమిష
నందుచే నీవునీ ♦ యగవలెనంచు, బలుకగా దనయన్న ♦ బదులిడె గాంధి. 71
"ఆలాయరులనేల ♦ ననుకరింపంగ, మూడుపందలరూప్య ♦ ములు చాలు నెలకు
అంతకుమించినా ♦ యనకు రాలేదు," ఆరోజులెప్పుడో ♦ ఒరిగెను నేడు
బొంబాయిలో సెల ♦ వులు జాస్తియగుట, వ్యాపారసరళినీ ♦ వనుసరింపవలె
అయినకమిషనీయ ♦ నతడొప్పలేదు, కానివ్యాజ్యము వచ్చె ♦ గాంధికే కేసు. 75
అంతకష్టము గాని ♦ దైన 'కోర్టు'ందు, కంపించె గాత్రమ్ము ♦ గాంధికి నోట
మాటరాదయ్యె నా ♦ మామిభాయంత, యేబదిరూప్యంబు ♦ లిచ్చివకేలు
నడుప 'కేసేర్పాటొ ♦ నర్చెనాతండు, కేసుజయంబందఁ ♦ జేసె కోర్టందు. 79

క. ఆనాటినుండి కోర్టుకుఁ, బోనోడెను వ్యాజ్యములను ♦ ముట్టుటె వీడెన్
మానుగ సౌత్రాఫ్రికకును, దానుజనినదాక గాంధి ♦ తడబడుచెపుడున్. 80

తే. అయిననొకపరిదా బుట్టి ♦ నట్టి పోరు, బందరందుండి యొక పేద ♦ వచ్చి వేడ
గాంధిసాయము భూమిత ♦ గాదగూర్చి, 'అర్జి'నొండధికారుల ♦ కతడు వ్రాసె. 81

క. 'అర్జీ'లు వ్రాయుటందిటు, నూర్జస్వలుడయ్యె గాంధి ♦ యూడక నెపుడం
దార్జనమేమియు లేమిని, తర్జనభర్జనలు సాగె ♦ దరుచుగ నింటన్. 82

వ. బొంబాయినగరమందీగతిని దినవెచ్చములకుగూఁడ సరిపడు రాబడిలేమి మోహనుఁడొక యాంగ్లేయభాషోపాధ్యాయుడుగా నుద్యోగముఁ జేయ నుద్యమించి, వార్తాపత్రికఁగల ప్రకటనమొండు గని నెలకు డెబ్బదియైదు రూప్యముల దేగల తదుపాధ్యాయోద్యోగమునకు వినతిపత్రముఁ బంపెను. కాని, యా పాఠశాలాధికారులు గాంధి గ్రాడ్యుయేటుగాకుండుటచే నాతని నియామకమునకా పాఠశాలాధికారు లీయకొనరైరి. ఇటులారుమాసములు గడుచుసరికి బొంబాయిపురనివాస మిక సాధ్యముగానిదని గ్రహించి, మోహనుడు మూటముల్లెతో రాజకోటకుఁ జేరెను. 83

క. కేసులనడపెడు నేరుపు, వీసము లేకున్న గాంధి ♦ విజ్ఞాపనముల్
వ్రాసియిడుటందుమిక్కిలి, వాసింగనె బొంబెనగర ♦ వాసంబందున్. 84

తే. కాని తగినంతపని లేక ♦ కాసురాక, అన్నదమ్ములు తమపుట్టి♦నట్టి రాజ
కోటం జేరిరి వ్యాజ్యాల♦వేటమాని, వాటమగు విన్నపమ్ములు ♦ వ్రాయబూని. 85

ఆ. రాజకోటయందు ♦ రాజిల్లె 'నర్జీ'లు, వ్రాయుటందు మూడు♦వందలను గ
డించె మాసమునకు♦మించి మోహనుదాసు, అన్న సాయపడగ♦ననుదినమ్ము. 86

సీ. బొంబాయిపుర వాస♦మున గాంధి 'గిర్గాము', నందుండి నడచి యే♦యరుగుచుండె
హైకోర్టునం గేసు♦లాలకింపంగ నిత్య, మందునసాగు వ్యా♦జ్యముల వాద
సారమ్ము గ్రహియింప♦జాలక కాలమ్ము, గడపెం దూగుచుం దోడి♦పడుచు న్యాయ
వాదులతోం గూడి♦వరుసలజ్జను వీడి, యదియె యప్పటి 'ఫ్యే'ష♦ననుచు నైన

ఆ. అనుదినమ్మున డక♦యారోగ్యమును గాచె, మిగిలె డబ్బు, వ్యయము♦మితము నయ్యె
నడక వాడుకయ్యె ♦ విడువక కడపటి, వరకు మోహనునకు ♦ బెరుకు లేమి. 87

క. అర్జి లేసపుడెట్టులో, అర్జనయున్నప్పుడును బ♦డాయిం బడుటల్
నిర్జించి నడక చేసము, పార్జించెను మోహనుండ ♦ నామయ ధనముల్. 88

మొదటిదెబ్బ—1892-93

క. ఏయవసరమందును బొంబాయినగ[illegible]ందు గాంధి ♦ పాల్పడలేదె
ట్టియు[illegible] 'దనకుఁ, వ్రాయగ నర్జీలనొసగు ♦ వారికెవరికిన్. 89

ఆ. అయిన రాజకోట ♦ యందీయ గానీయ, కొనియెదనకు వ్రాయు ♦ మనవులంపు
అన్న పాలికాపు ♦ యైన వకీలుకు, 'కమిష'నెంతొ గాంధి ♦ క్రమముగాను. 90

క. తనకిష్టముగా కున్నను, దననియతి కనిష్టమైన ♦ దన్నోడబరుపం
దనయన్న చేయు సలహా, విని యేమనలేక గాంధి ♦ విడిచె నియమముల్. 91

ఆ. ఎట్టులైననేమి ♦ యింటివెచ్చములకు, [illegible]యునంతధనము ♦ వచ్చుచుండె
న[illegible]కొండొ♦కానొక విషయమం, దన్నకుదను సాయ♦మరుగవలసె. 92

వ. ఇటుల [illegible] యశుభంగమున కీయకొనబూనిన మోహనుడు శీఘ్రముగనే యా
పంకమందుండి బయటపడినంగాని యాపిరాడక యొక్క యవమానమునకు గురి
గావలసివచ్చెను. అతనియన్న పోరుబందరు రాణాకడ నతడు గద్దెనెక్కుటకు
ముందు అతని కార్యదర్శిగాను, సలహాదారుగానుండి, యాతనికిం దప్పుడు
సలహానిచ్చియుండినందుల కాతనిపై నేరమొండు మోపబడియుండెను. ఆ
నేరము విచారణచేయుటకు "పొలిటికల్ ఏజంటు" అనునొక ఆంగ్లోద్యోగి
నియమితుడై యుండెను. ఆ యాంగ్లోద్యోగి గాంధి యగ్రజునిపైన నాగ్రహించి
యుండెను. ఆ యాఫీసరు గాంధి కాంగ్లదేశమందు దెలిసినవాడే. ఆ పరిచయ
మును బురస్కరించుకొని తనకిష్టము లేకున్నను, తనయన్న బలవంతమువలన
నాతని ప్రీతికొరకు మోహనుడా యాంగ్లోద్యోగిం గలిసి మాట్లాడెను. కాని యా

యాఫీసరు దురాగ్రహావేశుఁడై దుడుసుగా ప్రవర్తించెను. మోహనుఁడా యవమానమునకుఁ గినిసి యా యుద్యోగిపైన వ్యాజ్యము వేయ దలంచెను. కాని తత్సమయమున నేదో కోర్టుపనిమీఁద రాజకోటకు విచ్చేసియుండిన సుప్రసిద్ధ న్యాయవాదియగు సర్ ఫిరోజిషా మెహతా తన్ను సందర్శింప మోహనుఁడంపిన వారితో చెప్పి మోహను నాతలంపునుండి విరమింపఁజేసెను.

సీ. ఇటువంటియవమతు♦లెల్ల నీళ్ళకు, బారిష్టరులకును♦ భవమె నిత్య
మనుచు గాంధికిదెల్పె♦నతడు క్రొత్తగా వచ్చు కాబోలు నిచటికిం♦గ్లాండునుండి
ఉడుకురక్తమతని ♦ నూరకోనీయ దాంగ్లేయోన్నతోద్యోగు ♦ నెరుకలేదు
కాలమ్ము నెమ్మది♦గాబుచ్చు చార్జన లయిచో వ్యాజ్యమ్ము ♦ వదలమనుచు
గీ. అయిన యవమతి దిగమ్రింగు♦మనుచు నాభ, ముండదాంగిలోద్యోగుల♦యండలేక
బ్రతుకుటయొకష్టమని తెల్పె♦ దడిపించు, చెప్పినం పను 'మెహాత' నె♦చ్చెలులనలన.

క. ఈ మెహతా సలహా హితవగా మోహనుఁ డద్ది పనుల ♦ కరణిఁ గలంచెన్
ఏమైన నింకమీఁదట నేమాత్రము నేను గూడ♦ నిటులని తలచెన్. 95

తే. మైత్రి దుర్వినియోగ పే♦మాత్రి విట్లు, వాదిగాఁ బ్రవరింపఁగా ♦ పాడుపనుల
నంచు నిశ్చితమతియయ్యె ♦ నాత్మలోన, గాంధియానాటినుండి నిష్కపటవృత్తి
నిష్కళంకుండు నగుచును ♦ నెగడె నెపుడు. 96

ఆ. చేయరాని పనులఁ♦జేయఁడు పోరాని, పథములందు బోడు ♦ పాడిగాని
వాని చెంతఁజేర♦డేనాడు గాంధి యా, రోజునుండి మిగుల♦ ఋజుగుణుండు. 97

క. ఈ మొదటిదెబ్బ యీగతి నా మోహను మనము మార్చి ♦ యాతని బ్రతుకున్
నేమమ్మగు మార్గమ్మున బోమనిచెన్ మహాత్మ దేశ♦మును దా విడిచెన్. 98

దక్షిణాఫ్రికాప్రయాణసన్నాహం — 1898

వ. మీఁదుమిగుల నా యాంగిలేయాపోలీసు యించుకేని సహనశీలత లేనివాఁడనియు, మిగుల బొగరుబోతనియు, నసాంఘిక కార్యాంధుఁడనియు, దనకడకేదేని పనిమీఁద వచ్చువారి నూరకనే తిట్టిపోయువాఁడనియు గాంధికి దెలియవచ్చెను. ఇంతియే గాక గాంధికిగల కార్యాంతరమెల్లయు నా యాఫీసరు కార్యాలయమందే యగుటంజేసియు నానాటి కథియావారుప్రాంతమందలి చిట్టిపొట్టి రాజ్యముల యాంతరంగిక రాజకీయముల సంగ్రామరంగమగుటంజేసియు ఋజుగుణుఁడగు మోహనుని కందుండుట క్రమముగా దుస్సహము గాజొచ్చెను. ఆయున్నతోద్యోగి దయాదాక్షిణ్యములఁ గోరకాతని నౌకరునుగూడ సంతృప్తిపరుపవలసి యుండెను. ఆతని శిరస్తదారా ఆఫీసరుకు శిరస్సే యైయుండెను. ఆతని మాట

కడ్డులేదు. ఆతని రాబడి యాయాఫీసరు రాబడికన్న మిన్నయై యుండెనని జన
వాణి. ఇట్టి విషపూరిత వాతావరణమందుండి బయటపడుటకు గాంధి యుద్యోగ
ప్రయత్నము గావించెను. 'పొలిటికల్ ఏజంటు సరిపోనివాడగుటంజేసి ఆతని
న్యాయవాదవృత్తియందు బోలె యుద్యోగప్రయత్నమందును గాంధి విఫలు
డాయెను. ఉన్నత పదవులఁగల రాణాల కధికారము జేకూరుచుటందొకించుక
సఫలుడయ్యెంగాని పేదవారికావంతయు సాయపడుటకు మోహనున కవకా
శము లభింపదాయెను. ఇట్లుండ నొకనాడు పోరుబందరునుండి గాంధి యన్న
కొక లేఖ వచ్చెను. అదియొక వాణిజ్యసంస్థనుండి వచ్చియుండెను. అందిట్లు
వ్రాయబడియుండెను. 99

సీ. "సౌతాఫ్రికాయందు ♦ ఖ్యాతిగాంచినది మా, వాణిజ్యసంస్థ య♦వ్వారిగాను
నలువదివేలపౌం♦డ్లకు వ్యాజ్యమొక్కండు, కలదుకోర్టునఁ జాల♦కాలమందు
జరిగె బారిస్టర్లు ♦ చాలగొప్పవకీళ్లు, గలరు మావ్యాజ్యంబు ♦ కడిమి నడుప
వారికీకేసున ♦ వలసిన విషయముల్, మాకన్న మిగుల సా♦మర్థ్య మెనయ

గీ. దెలుప గలడు మీవాడందు♦వలన మాకు, నతనికింగూడ లాభించు♦నంపుడతని
క్రొత్తదేశము జూచుట♦గూడివచ్చు, క్రొత్తమిత్ర సంపాదన♦గూడ గల్గు." 100

మం. అగ్రజుఁడీలేఖ ♦ ననుజుండు చదువ,చూపి యాలోచన ♦ లోపికంజేసి. 101
రగ్రజుండా "దాద ♦ అబ్దుల్లకంపె, నీయందు భాగస్థుఁ♦డై యలరారు
సేటు అబ్దుల్ కరీం ♦ 'జవేరి'కడకు, తమ్ముఁగొంపోయి మం♦తనములు జరుప
అతడనె "మాకట ♦ నైరోపియనులు, గొప్పవారున్నారు ♦ కూర్చు మిత్రులుగ
అట్టివారి పరిచ♦యంబబ్బునీకు, మాపాపులో నాంగ్ల♦మందెల్ల వ్రాత
కోతలు జరుగు నీ♦చేతనైనంత, తోడుగానుండు మం♦దే డాదివరకు
నీకే వ్యయములేదు ♦ మాకడ నతిథి,వై యుండుమందుకు ♦ వందయునైదు
పౌండ్లనిత్తుము మరి ♦ 'ఫస్టుక్లాస్ ఫేరు', రానుపో నిచ్చెద♦మైనంత "ననగ
రెండేండ్లపాటాత♦డిండియాయందు, కష్టాల పడుచుంటఁ ♦ గాదనకుండ
సమ్మతించెను గాంధి ♦ సరియంచు నూత్న,నానుభవముగల్గు♦నరయుదుగ్రొత్త
సీమ నాయన్నకు ♦ జేరఁబంపుటకు, వందయుమరియైదు♦పౌండ్లుండునంచు. 107

ఆ. ఇటులసమ్మతించి♦యేగ సౌతాఫ్రికా,దేశమునకు గాంధి ♦ తేటి వలయు
సమధికమగునట్టి సన్నాహములతోడ, పైనమయ్యెను గతి♦పయదినముల. 112

క. పదునెనిమిది వందల తొం,బదిమూడవ క్రీస్తుశకపు ♦ వత్సరమందుఁ
ముద మొదవగ నేప్రిలునెల, వదలి చనియె రాజకోట ♦ బంబయిపురికిఁ. 113

—నెటాలుచేరుట—1898—

ఆ. ఆంగ్లభూమి కరుగు♦నప్పటి తనకన్న, తల్లి వీడియేగు♦తల్లడమ్ము
దక్షిణాఫ్రికాకుఁ ♦ దానేగునపుడు మో,హనుడుపొందడాయె♦నంబలేమి. 114

ఆ. ఆంగ్లభూమిఁ దదిత♦రానేక లోకప్ర,యాణముల గడించి♦నట్టి జ్ఞాన
దీపికాసహాయ♦తేజంబుచే వియో,గవ్యథ తమ మడపఁ♦గల్గె గాంధి. 115

ఆ. తరుచు రాజకోట♦పురినుండి బొంబాయి,కరుగుచుప్పుడున్న♦దైన నాత్మ
వనిత వీడి యొక్క♦వత్సరమేగుట, కష్టముగనెతోఁచె ♦ గాంధికపుడు. 116

ఆ. ఆంగ్లభూమినుండి ♦ యరుదెంచి రెండేండ్లు, నిండెమరియొకండు ♦ నిసుగుబొసఁగె
చదువుజెప్పుచు సతి♦సంస్కరించుచు నామె,బాయకుండనుండె♦బాళిగాంధి. 117

ఆ. అయిన దక్షిణాఫ్రి♦కాకర్షణమ్ముచే, నడపఁగల్గెఁ బడతి ♦ విడచిపోవు
నడలు కామరహిత♦మైనది తనప్రేమ, గాకయున్ననింక ♦ గాంధికపుడు. 118

క. వస్తాగద యేడాదికి, తెస్తాగద చీకలెన్నొ ♦ త్వ ప్పివడంగు
ట్టిస్తాకద రవికలు మరి, మస్తుగ బట్టలును వేయ ♦ మనబాబులకున్. 119

వ. అని తనభార్య నూరడ బల్కి మోహానుడు బొంబాయికి బయనమై పోయెను.

సీ. ఆనాడు 'ఫస్టుక్లా♦సందే ప్రయాణించె, బ్యారిస్టరగుట స♦నారతమ్ము
కాన దాదాబ్దుల్ల ♦ కంపెని ఏజంటు, చేకూర్చ 'ఫస్టుక్లాస్'♦చేసినట్టి
యత్నమంతయు వ్యర్థ♦మగుటఁదానై గాంధి, నౌకాధికారి సం♦దర్శనంబు
చేసి మాట్లాడ నా♦ఫీసరు తనతోటి, యాసనంబొసగె మో♦హనుని కందు

గీ. గాంధియానందమున నధి♦కారిఁగలసి,పయనమొనరించెను త్సాహ♦భరితుఁడగుచు
దక్షిణాఫ్రికాభూమికిఁ ♦ దనయదృష్ట, మెటులనుండెనో తిరిగి ప♦రీక్షసేయ. 121

సీ. దారిలో నౌకాధి♦కారితోఁ జదరంగ,మాడుచుఁబుచ్చె నా♦ళ్ళారునేడు
మోహానుండంతఁదాఁ ♦ బ్రోడగాకున్న నా,క్రీడలోనధికారి ♦ ప్రీతికొరకు
నంతట మొదటి నౌ♦కాశ్రయమగు 'లాము',నందున్నకొంతసే♦పందుగాంధి
తీరంబునకు జని ♦ చేరి "పోస్టాఫీసు,పని చూచుకొని తిర్గి పడవలోన

గీ. ఓడ నిచ్చెనఁజేరగా ♦ నోడు కతన, ఆదుకొనియధికారియే ♦ చేదుకొనియె
నోడపైకిని మోహాను ♦ వీడరేవు, నోడ తదితరులందరికి ♦ వీడియందె. 122

క. 'లామూ'కావల 'మొంబా,సా'మీదట జంజిబారు ♦ నటఁబడిదినముల్
'స్టీమరు' పైనమ్మాపెను, కామాత్రిం బాపుకొనుట♦కై వారలకున్. 123

సీ. జంజిబారున వారు ♦ రంజిల్లుచు విలాస,విహారణంబున కంచు ♦ వేడ్కజనిరి
పురమునందొక్కతా♦ర్పుడు కాడు గొంపోవ, నీగ్రోవిలాసినీ ♦ నిల్వారముల

కరిగిరి గాంధినం♦దరిబోలె నటనొక్క, గృహలోనికనుపంగా ♦ గలయ నొక్క-
కామినింగాని యా♦గాంధి సిగ్గిలి నిల్చె, కామారికిని లోను♦గాక వీక
గీ. పిలువ నౌకాధికారి త♦న్వెలికి వచ్చె, లోనికరిగినరీతిగా ♦ దానువారి
భంగిలేకుంటగాంచి స♦త్సంగవారు, ప్రథమమున లజ్జచేం దల♦వ్రాల్చె నైన
కామకలుషమ్ము దలపోయం♦గంపమడగె, రాముధ్యానించెం బాపవి♦రామునిట్లు.

క. రామా ఏకసతీవ్రత,నామా సుగుణాభిరామ ♦ నమగుణధామా!
కామాపగుణవిరామా, వ్యామోహాబ్ధినిదరింపం♦బడవవు గమ్మా! 125

క. నీకరుణచేత ముమ్మా,రీకామాఘమునంబడుచు ♦ నిడుములంజెడగా
బోకుండంగాపాడితి, వీకరణింగాంచుచుండు ♦ మెపుడో రామా! 126

క. ఇకమీదనింతకన్నను, అకలంకాత్ముండనగుచు ♦ నలరెదు దృఢమౌ
ప్రకటిత హృదయంబిమ్మా, సకలకలుషహరణనామ! ♦ సద్గుణధామా! 127

తే. భక్తివిశ్వాసములు దైవ♦శక్తియందు, నిటులదృఢపడ మోహనుం♦డెపుడు రామ
నామజపమును గావించెం ♦ బ్రేమగదుర, కపటలజ్జాభరంబును ♦ గదురనీక. 128

క. చిత్రములై ముల్లోకపవిత్రములై యఘలతాల♦విత్రములై స
న్మిత్రములై శ్రీరామచరిత్రామృతజపములీ ధ♦రిత్రి న్వెలయున్. 129

వ. అని తనమనమ్మున శ్రీరామచంద్రుని శ్రేయోదాయక నామస్మరణ మనవరతము
గావించుచు మోహనుండా మన మలబారున కెనయగు జంజిబారు నగరమున
నున్న వారమందున నా ప్రాంతభూములందిరుగాడుచు నచటి మహోన్నత
వృక్షములను ఫలములను వింతగా గాంచుచు గాలము గడపి తదనంతర
ప్రయాణమున మొజాంబిక్ రేవుం గడచి, 130

క. పదునెనిమిదినందలతోం,బదిమూడవవత్సరమ్ము ♦ మాసము 'మే'లో
తుదిదినము చేరె నోడన్. పదిలముగ నెటాలు రేవు ♦ పట్టణమునకున్. 131

## కొన్ని యనుభవములు—1893

సీ. అబ్దుల్లసేటు మో♦హనుని రేవు దింపుకొనియె నచ్చోటనే ♦ కనియె గాంధి
తెల్లమోములవారు ♦ తెల్లమొగాలు వే,యుంగ గాంచుచునిండి♦యనులనందు
అబ్దుల్లసేటట్టి ♦ యవహేళనాభావముల కలవడియుంటం ♦ గినియలేదు
కాని మోహను డక్షి♦మాంతుండౌట, నతనిమతి చివుక్కు♦మనియె నతని
తే. నరసి,రబ్బుపమురిమగా ♦ నశడుదాల్చి,నట్టి వేషవిలక్షణ ♦ మరసి దరిసి
ఇండియనులెవ్వరందున♦నెపుడు దాల్చ,నట్టి దుస్తుల వస్తువు ♦ లరసిరందు.
తే. 'ఫాకు'కోటును బెంగాలు ♦ పగ్గిబోలు, నట్టితలపాగ బిగువుగా ♦ గట్టినట్టి

కాలరుఁ 'టై'యు 'బ్యూట్స్' 'హ్యాట్' ♦ గ్రాల గాంధి,
పట్టులోపలఁ దులసిపూ ♦ సల ధరించె. 133

క. చేరిచి రబ్దుల్లా వ్యా,పారాగారమున నొక్క ♦ ప్రత్యేకముగా
నేరుపరచినట్టి గదిం గూరిచి రల మోహానునికి ♦ గూర్మి సుఖమ్ముగ. 134

సీ. గాంధి దాల్చిన 'డ్రెస్సు' గాంచి యబ్బురమంది, యక్కజపడితన ♦ యన్న శ్వేత
గజమునంపె దన ♦ కడకునొకండని, తలచెనబ్దుల్ల యా ♦ తని మనమున
మోహానువంటి య ♦ మోఘధీశాలికిఁ, జగినట్టిపను లేవి ♦ దానొసంగ
జాలనంచుఁదలంచి ♦ జాలిగాగని గాంధి, నిట్టూర్పులంబుచ్చె ♦ నిపుణుఁడయ్యు

తే. వణిజవృత్తిని నబ్దుల్ల ♦ మనసునను పహా,జానుమానాప్పదుండౌట ♦ నతఁడొకండు
రెండుదినములపిమ్మట ♦ ప్రీసిగొంచు,బోయె కోర్టుకు గాంధినా ♦ పురమునందు. 135

క. ఆనగరమ్మున న్యాయ,స్థానమ్మున సింజీయనులు ♦ తలపాగ నెవం
డేనిధరింపగరాదని, యానతిడగ గాంధి కోర్టు ♦ కావల కరిగెఁ. 136

ఆ. ఆదిలోనె యిట్లు ♦ హంసపాదేర్పడె, గాంధి దక్షిణాఫ్రి ♦ కానుగూడ
ఎదురుకొనగనకట! యీరీతినేయుండు, నొక్కనొకని రేఖ ♦ యుక్కుదక్క. 137

ఆ. రాజకోటలోన ♦ రాజకీయోద్యోగి, తోటివైరమునకుఁ ♦ దొలగివచ్చి
దక్షిణాఫ్రికాను ♦ దాక్షిణ్యహీనులౌ, శ్వేతజాతివారి ♦ చిచ్చునరికె. 138

సీ. ఆదేశమందిండి ♦ యనులు వెక్వేరుసం,ఘములు వారిగనుండి ♦ రములునందు
అందుముసల్మాను ♦ వ్యాపారులారబ్బు,లనబడుచుండిరి ♦ హైందవులును
పార్సీలు క్లార్కులై ♦ పరగుచునుండిరి, మూడుతెగలుగాను ♦ మూఢమతిని
వీరలొండొరు లేదొ ♦ విధమగు సాంఘిక,సంబంధముల మన్కి ♦ సాగనుండి

గీ. రందరినిమించియుండి ర ♦ త్యధికసంఖ్య, కార్మికులుగ నాదేశముం ♦ గడకవచ్చి
నట్టి యరవలాంధ్రులు నుత్త ♦ రాదివారు, 'సామి'లన 'కూలి'లనఁదెల్ల ♦ జాతివారు.

వ. ఇట్టి కార్మికులందొక తెగవారు అయిదేండ్లపాటు తెల్లవారికడఁబనిచేయ నొప్పు కొనివచ్చినవారు. ఆ అయిదేండ్ల 'అగ్రిమెంటు' అయిన అనంతరము వారలా నెటాలుప్రాంతముననే [illegible] డనే పొట్టబోసికొనుచుండిరి. వీరు సుమారు 150000 మంది [illegible] సంఖ్యలోఁ బైన చెప్పఁబడిన మూడుతెగల కార్మికేతర భారతీయు [illegible] త్యధికముగానుండుటచే నిండి యనులందరుగూడ [illegible] కార్మికులవలె కూలివారుగానే పిలువబడుచుండిరి. [illegible] 'కూలి' బారిస్టరనియే పరిగణింపఁ బడెను. భారతీయ వ్యాపారులుగూడ 'కూలి' వ్యాపారులనియే వ్యవహరింప బడుచుండిరి. ముసల్మానువర్తకుడంపు కాగ్రహించి "నేను కూలివాడనుగాను

అరబ్బు వర్తకుఁడ"నని బదులాడును. ఆంగ్లేయసంబోధకుడును మర్యాదస్థు
డైనచో క్షమాపణఁజెప్పుకొని వెడలిపోవును.

మం. ఇట్టిపరిస్థితు ♦ లెసగుచునుంట, తలపాగదాల్పు ప్ర ♦ ధానమై తనరె. 141
డర్బనుకోర్టులోఁ ♦ దలపాగఁదీయ,మని మెజిస్ట్రేటు మో ♦ హాను నాజ్ఞనిడగ
కుపితుడై గాంధి యా ♦ కోర్టునువీడి. 'న్యూసుపేపరులకు ♦ వ్రాసె నీవిషయ
వివరమ్ములంగూర్చి ♦ వింతగానవియు, చర్చించి చాల వి ♦ మర్శించివ్రాయ
వాసికెక్కెనుగాంధి ♦ వడి నంతవఱకు, భారతీయులకు నె ♦ వ్వరికిలేనట్టి. 145
పరిగణనలభించి ♦ పరగెమోహానుడు, పేపర్లతనిఁగొన్ని ♦ పెచ్చుగాఁబొగడ
మరికొన్నియతని వి ♦ మర్శించె "నెవ్వ,డీక్రొత్తమానిసి ♦ యిందేలవచ్చె
నెవరురమ్మనిపిల్చె ♦ రేనాడులేని వాదులాటల కప ♦ వాదుల కంచు
నెటులైననేమి యే ♦ యిండియనునకు,గలుగని ప్రఖ్యాతి ♦ గాంధికి గల్గె. 149

క. ఏతత్ఫలితమ్ముగ ని,ర్భీతిగఁ దలపాగఁదాల్చి ♦ వెడలుచునుండెన్
ప్రీతిగ గోర్టుకు గాంధియు, ఖ్యాతినతఁడు దక్షిణాఫ్రి ♦ కంగడ వఱకున్. 150

### ప్రిటోరియా ప్రయాణము—1893

సీ. గాంధి డర్బనులోని ♦ క్రైస్తవేండియనులౌ, కాథలిక్ పాలును ♦ గాడుఫ్రేను
అలప్రొటెస్టెంట్ మిష ♦ నధ్యాపకుని పార్సి, రస్టోమ్జి ఆడమ్జి ♦ ప్రముఖసుముఖ
భారతీయాధ్యుల ♦ పరిచయమార్జించు,చొక వారమందతఁ ♦ డుండునంత
నరుదెంచెను ప్రిటోరి ♦ యాలోని 'లాయరు',కడనుండి లేఖొండు ♦ గాంధి నచటి
గీ. కంపమని యబ్దులా సేట్ ♦ కంతనతఁడు, గాంధికాలేఖ జూప సా ♦ కల్యముగను
వ్యాజ్యవిషయమ్ము సకలమున్ ♦ వడిగఁ దెలియ,
కొఱకు లెక్కలబుక్కొండు ♦ గొనె నతండు. 151

క. పుస్తకమద్దిపఠింప స,విస్తరముగఁ దెలిసె గేసు ♦ విషయములెల్లన్
నిస్తులముగ లెక్కలనుగు,మస్తా వివరించిచెప్ప ♦ మనసునకెక్కన్. 152
ఆ. వ్యాజ్యవిషయమెల్ల ♦ నవగతమగుడు సం,సిద్ధుఁడయ్యెగాంధి ♦ చేరనరుగ
నాప్రిటోరియాకు ♦ నడ్వొకేటుకు వ్యాజ్య,మందొనర్పఁదగు స ♦ హాయమెల్ల. 153
ద్వి. హెచ్చరికనొనర్చె ♦ నెంతయో సేటు, పెచ్చుగాఁ బ్రతివాది ♦ యిచ్చకమ్ములకు
మోసపోవలదంచు ♦ మోహానునెపుడు, కేసువిషయములఁ ♦ గించిత్తుగూడ. 155
బయటఁబొక్కకుమంచుఁ ♦ బల్విధమ్ములుగ, నియమమ్ములవిధించె ♦ నియతిగాంధికిని.
ఉ. అందుకు గాంధి యిట్లనియె ♦ నయ్యరో! యుండెద నీదు లాయరే
నెందు వసింపమన్ననట ♦ నిందుగురించి కలంత నింతియేన్

బొందకు మేరహాస్యముల ♦ బొక్కఁగనీయ రవంత యేని నీ
బందుగుఁడేగదయ్య ప్రతి♦వాది తయేబ్ హాజిఖాన్ మహమ్మదుః. 157

ఆ. అతనికతఁడివారి ♦ యందరితోఁ బరిచయము పెంపుజేసి ♦ సాధ్యమైన
కోర్టుకవలకేసు♦కుంగూర్పగాఁ బరిష్కారయత్నమెల్ల ♦ సలుపువాఁడ. 158

క. అనిమోహనుండు పలుకఁగ, వినియబ్దుల సేటు మదిని ♦ వెరపుగదుర ని
ట్లనిపల్కె మేము నీనుడి, వినరీతిగ బంధువులమె ♦ వినుమట్లయినః. 159

క. ఏమాత్రమైన మనవా,రేమరుచో మనరహస్య♦మెల్లయు బొక్కం
గా మనలనాశ మొనరిం,చాకనిషి తయేబు కాన♦నారయుమెల్లః. 160

మం. అనుచునబ్దుల్ల సేటు ♦ తనమదిం గలుగు, అనుమానమెంతయు ♦ వినిపింప గాంధి.
"పొందకుమా వంత ♦ నాందోళనమ్ము, డెందమున్నం దేల ♦ సందేహమిందు
మాటలాడ 'తయెబు♦సే'టుతోగాని, సేటువారితోగాని ♦ పాటించిపాడి
నీతో సమాధాన ♦ మేతీరుగానో, ప్రీతిబొందుమటంచు ♦ నీతి సూచింతు
అనవసరమ్ముగా ♦ వ్యాజ్యమాడుటలు, ధనము నష్టమ్ముగా ♦ ఘనత దలంగ
అవమానమొదవించు ♦ నంతమందించు, అవనిలో శాంతి సౌ♦ఖ్యమ్ములటంచు
సలహానొసగుదెట్లొ ♦ సల్పుదు రాజి,కలగకుమని గాంధి ♦ పలికె సమ్మతిగ. 167

క. ఇటు సేటును సమ్మతిఁ బడ, నెటులో కావించి గాంధి ♦ యేడెనిమిది నా
ళ్ళట డర్బనునం గడపియు, ప్రిటోరియాకుఁ బయనించెఁ ♦ బ్రీతియొసంగః. 168

సీ. అల్ల ప్రిటోరియా ♦ కరుగుదారి నెటాలు,ప్రాంతమ్మునకు ముఖ్య♦పట్టణమగు
మారిట్జిబర్గునం ♦ బరికించి తోటిప్ర,యాణికుఁడొకఁడు మో♦హనుని మొదటి
తరగతి పెట్టెలో ♦ తగుదునమ్మాయంచు, పయనించుటలు గాంచి ♦ పలికెనిట్లు
శ్వేతజాతేతరు♦లీతీరుగ మొదటి,తరగతిపైనింప ♦ వగదటంచు

గీ. క్రిందికీడ్పించెనటనుండి ♦ గాంధినకట! రాత్రిపూటనికూడ యే♦మాత్రమనక
శీతకాలమెయని జాలి♦చెందకుండ, కటికగుండెలకెటనుండు ♦ కనికరమ్ము? 169

ఆ. కదలిపోయె రైలుతు ♦ గాంధి చీఁటిఁబ్రయాణ,శకులగదిని జలికి♦ నకట! వడకు
చెటులో కడపె రేయి♦నెల్లయుఁ దనదు వి,ధ్యుక్తధర్మమెంచి♦యుల్లమందు. 170

మ. అవమానమ్ములు నిట్టివెన్నియొ యస♦హ్యంబైన నన్నింటినిః
భువినాత్మన్ భరియించి యొంచిపనులం ♦ బోజాలుఁ లే ధర్మమా
దివిజాధీశసుతుండు రాముడెపుడుః ♦ దిక్కౌఁ తనాకంచు నే
లవలేశమ్ము జలింపకుండ చనె మ♦ర్నాడా ప్రయాణమ్మునః. 171

తే. దిక్కులేనట్టివారికి ♦ దిక్కుదేవుఁ,
డొక్కఁడేయని మదిలోన ♦ మ్రొక్కె రామ

చంద్ర కమనీయ కారుణ్య♦సాంద్ర రతిః,
తేంద్ర దయజూడుమనిగాంధి ♦ హృదయభక్తి. 172

వ. ఆ మరునాటిప్రొద్దుటనే ఆ రెయిల్వే మేనేజరుకును అబ్దుల్లా సేటుకును తన యనుభవములనెల్ల వివరముగా నొక తంతివార్తమూలమునఁ దెలిపెను. సేటు వెను వెంటనే 'జనరల్ మేనేజరు'ను గలిసికొని మాటాడెను. కాని యాతడు తన తాబేదారుల చేష్టలనే సమర్థించెను. అయినను మోహనుడాతని గమ్యస్థానము సురక్షితముగా జేరుటకు వలయు సౌకర్యముల గూర్పుమని స్టేషనుమాస్టరు నాజ్ఞాపించితినని తెలిపెను. అంత నబ్దుల్లాసేటు మారిట్జిబర్గ పట్టణమందలి తన ఇండియను వర్తకమిత్రులకు గాంధిని కలిసికొని యాతని క్షేమసమాచారముల నరయుమని తంతివంపెను. తద్వర్తకశిఖామణులును గాంధిని స్టేషనుకడనే కలిసికొని తమతమ స్వానుభవములనెల్ల ముచ్చటించి మోహనునికి జరిగిన యపచారములు మామూలుగా భారతీయుల కంపరి కనారతము జరుగునట్టివే యని యూరడఁబలికిరి. ఆనాటి నగరపూరయెల్ల నల్లవారల కన్నీటిగాథలఁ గూర్చి కొల్లగా నాలకించుటలోనె కాలమంతయు వ్యయమాయెను. ఆనాటి సాయంకాలము బండిలో దనకు నియమితమైనస్థానమందాసీనుడై గాంధి తిరిగి ప్రిటోరియానగరమునకు బయలుదేరెను. ఆ రెయిలు మోహనుని మరునాటి యుదయమున 'చార్లెస్‌టౌన్' అనునగరమునకు జేర్చెను.

## మరికొన్ని కష్టములు—1893

సీ. ఆనాడు చార్లెసు ♦ టౌను జోహాన్సుబర్గు, నడుమ రెయిలుబండ్లు ♦ నడువకుంట
స్టేజికోచినెక్కెడు ♦ జేరియందున గాంధి, పయనించెదారిలో ♦ 'పర్డికోపు'
అను చోట కోచినా♦యకుడు మోహను దన,పాదాలకడ కాలి♦పలకపైన
నాసీనుజేయ మో♦హనుడప్డు నిరసింప, క్రిందికాతడు ద్రోసె ♦ గాంధినంత
సంకుచితు కూర ప్ర♦యాణికుల్ వారించి,రాపైనవారలే ♦ రభసలేక
స్టేండర్టనుఁ పురి♦జేరిరారాత్రికి, శయనించి మరునాడు♦దయమునందె
గీ. పయనమైగాంధి జోహాన్సు♦బర్గుజేరె, నరిగి యానాటిరాత్రి కా♦పురిని గ్రాండు
నేషనల్ హోటలున శయ♦నించఁజనియె, కాని గాంధికచ్చట దిర♦స్కార మొదవె.
ఆ. అరిగెనాతఁడాన 'మ♦హమదు కాసంక్రమ్,దీనుషాపుకందు♦'గాని సేటు'
స్వాగతంబొసంగి ♦ బాగుగా మోహను,నాదరించెనతడు ♦ సేదదీర. 175
ము. మోహనుండు ప్రయాణ♦మునఁబడినట్టి,కడగండ్లనుగురించి♦కతలాలకించి.176
నవ్విన ర్తకుడిట్టి ♦ నగుబాట్లు మాకు, నిత్యానుభవమీ వి♦నింద్య దేశమున

మనుచున్న వారము ♦ ధనదాహామునను, నీబోంట్లకిందుంట ♦ నీచంబెయగును
అని పల్కి తాబడ్డ ♦ అగచాట్లగూర్చి, వివరంబుగ నెరుంగ ♦ వినిపించె నెల్ల. 179

తే. కాని మరునాడు 'అబ్దుల్ల ♦ గానితోడ, సంప్రతింపులుతగురీతి ♦ జరిపి 'ఫస్టు'
క్లాసుబండిని బయనించె ♦ గాంధిచేర, నల ప్రిటోరియా పట్టణ ♦ మలయకుండ. 180

సీ. బారిస్టరునువృత్తి ♦ ఫస్టుక్లాసందునె, పయనింపగా వల ♦ వాటు పడితి
నని ప్రవాసిముందుగా ♦ నాంగ్లేయదుస్తుల, ధరియించి యెదుట ప్ర ♦ త్యక్షమైన
గాంధిని గని యెట్లు ♦ గాదన జాలక, యిచ్చె స్టేషనుమాస్ట ♦ రిచ్చమెచ్చి
ఫస్టుక్లాస్ టిక్కెట్టు ♦ పయనింప గాంధికి, నల్ల ప్రిటోరియా ♦ కిపగుకొరకు

గీ. నేతు అబ్దుల్లగాని య ♦ చ్చెరుపడంగ, మార్గమధ్యంబునకు 'గార్డొ ♦ మరియొకండొ
శాంతిమననీయడంచు హె ♦ చ్చరిక జేసి, వీడుకోలీయగా నేతు ♦ వెడలెగాంధి.

వ. దారిలో గార్డు ప్రశ్నింప, గాంధి యిట్లు బదులిచ్చెను. 182

ద్వి. ఫస్టుక్లాసు టికెట్టు ♦ పరికింపుమిద్ది, కష్టపెట్టకమము ♦ గాంధి మారాడ. 183
ఎరుగుదునెల్ల నిం ♦ కెదురాడకుండ, అరుగుము మూడవ ♦ తరగతికంచు
గద్దింప నాపస్టు ♦ క్లాసులో జను ప్ర,బుద్ధుడాంగ్లుండొకండు ♦ పొమ్మంక చాలు
ఇతడు నాతో ప్రయా ♦ ణించుటకేను, మతి నిడనని చాల ♦ మందలింపంగ
పయనింపనీవిష్ట ♦ పడ 'కూలి'తోడ, స్వాయముగా 'నాకేమి' ♦ చనుమనె గార్డు
మరియేమి యొక్కటితోం ♦ పలులేకుండ, నరిగె ప్రిటోరియా ♦ కారాత్రి గాంధి. 188

## ప్రిటోరియా తొలినాడు—1893

సీ. అదిభానువాసర ♦ మగుటచే నబ్దుల్ల, 'అట్టార్ని' తనవారి ♦ నంపలేమి
గాంధిని స్టేషను ♦ కడకేగి తోడ్తేర, నందుచే మోహాను ♦ డచ్చెరువడి
అందునడిగినప్ర ♦ యాణికులందరుం, బోయినపిమ్మట ♦ మోహానుండు
అరిగి టికెటుకలె ♦ క్టరుకడ కతని వి,చారించుచుండ న ♦ చ్చుటనెయున్న

గీ. అమెరికానీగ్రొయుండు సా ♦ యంబువచ్చి, రమ్మెరుంగుదుచిన్ని వి ♦ శ్రాంతిగృహము
జాన్సనాహ్వయుండొకండు సం ♦ సారపరణి, నడుపునీరేయి నీవందు ♦ విడియవచ్చు.

క. అని మోహానుండనతోడో,డ్కొనిచనెనా నీగ్రొమనిషి ♦ కూర్మిని గాంధిం
గని హోటలుయజమానియు, వినిపించెను విశదముగను ♦ విషయము లెల్లన్. 190

మం. అమెరికావాడ నే ♦ నగుటనాకెట్టి, జాతిభేదములు ద్వే ♦ షములును లేవు. 191
అయిననాయీసాము ♦ లందరైరోపీయు,లగుటచేవారెట్టు ♦ లలుగని రీతి
నీకు వడ్డింపింతు ♦ నీగదియందె, రేయి కిచ్చటనుండి ♦ రేపు నీవారి
కడకేగుమనిపల్క ♦ గాంధియందులకు, సమ్మతింప నతండు ♦ చని తనవారి
కీసంగతిని దెల్ప ♦ నాసాములెల్ల, తమకెట్టి యాక్షేప ♦ ణములేదటన్న

గాంధి కా "డైనింగు" ♦ గదిలోన బెట్టి, భోజనమ్మును బ్రీతి ♦ మోహనుండెంతో
కడుపార భుజియించెఁ ♦ గడు దనివార, నాకలిదీర నా♦నందమ్ము మీఱ
యజమానికిఁ గృతజ్ఞ♦తాభివందనస,మర్పణంబొనరించె ♦ మనసార గాంధి. 198

క. మరునాటి యుదయముననే, అరయగ జనె మోహనుండు ♦ అబ్దుల్లాలా
యరు 'బేకర'నెడు క్రైస్తవు, సరసగుణాకరుడతండు ♦ స్వాగతమొసగెన్. 199

క. బారిస్టరుగా నీకిట, భారంబైనట్టిదేదియుఁ ♦ బనిలేదిట వాక్
శూరులగు న్యాయవాదులు, ధీరులు నియమింపఁబడిరి ♦ దిట్టలు నెట్టుల్. 200

క. నిక్కంబీ వ్యాజ్యంబున, చిక్కులుగల వెన్నో పెక్కు ♦ జెల్లగ మిగులన్
వెక్కసమగు నందరికిని, గ్రక్కున ముగియంగ బోదు ♦ కాలము పట్టున్. 201

ఆ. కాన నేటునుండి ♦ యేనాటి కానాడు, వలయు విషయజాల♦మలయకుండ
నేను బొందవలయు ♦ నీమూలమున నీస,హాయమెల్లగతులఁ ♦ జేయుమీవు. 202

ఆ. నీవు వచ్చినపుడె ♦ నీకుగావలసిన, విధిని గదిని దగిన ♦ విడిదియందు
ఏరుపాటొనర్ప ♦ నెంచితి నేనెగ్గి,నట్టి రొట్టెలకుమ్మ ♦ నామె నీట. 203

ఆ. పోదమచటికంచు ♦ మోహనుదోడ్కొని, అరిగెనతడు మాట♦లాడ నామె
తోడ ముప్పదైదు♦నాడెమ్ములకు వార,మునకుగొంచుఁ బెట్టె♦భోజనమ్ము. 204

చ. వాసము గ్రాస మావసతి♦వావిరిఁగల్గ వసించు చచ్చుటన్
వాసినిగన్న 'బేకరు' ని♦వాసమునంగల చర్చిలోన న
భ్యాసమొనర్పఁ బ్రార్థనల ♦ హాజరుగాఁజనుచుండె గాంధి యే
వేసము మార్చకుండ చది♦వెంవగు క్రైస్తవ పుస్తకావళిన్. 205

ఆ. అందు గ్రంథములకు ♦ నన్నింటికిని మేటి,గ్రంథమనఁగ వాసి♦గాంచినట్టి
'బైబి'లనెడు క్రైస్త♦వమతసూత్రాళి ప్ర,బోధనిధిని గాంధి ♦ పూర్తిచదివె. 206

వ. అనంతర మబ్దుల్లామిత్రుని గలిసికొని యతఁడు దెలుప, దక్షిణాఫ్రికాయందలి యిండియనులు పడు కడగండ్లగూర్చి విని, విస్మయవిషాదాకులహృదయుడై మోహనుడు సూర్యాస్తమానమగుడు తనబస కేతెంచెను. రాత్రి భోజనానంతరము పడకపై పరుండి తన యనుభవములనెల్ల సింహావలోకనముఁ జేసికొనఁదొడగెను. బేకరుమహాశయుడు చెప్పినట్లు తానందు ప్రిటోరియాలో నొనర్పవలసిన పని సాయముఁగూర్చి అబ్దుల్లాసేటుకు లేఖ వ్రాసెను. తదుపరి బేకరు తన యెడఁజూపిన యసాధారణానురాగాసక్తులంగూర్చి అనేకవిధములఁ దలపోయుచు నిద్ర కుపక్రమించెను. 207

మం. ఏలచూపెను బేక♦రిట్టి యాసక్తి రాలు నేమంతని♦ప్రార్థనల్ వలన. 208
క్రైస్తవమతబోధ ♦ గ్రంథాలనెంత, నిస్తులపఠనమ్ము ♦ నేఁజేయవలయు

హైందవమతవాఙ్మ♦యమ్మెట్లు నేను, పొందగగలనెట్లు ♦ ముక్తిగడింప. 210
నామతమ్మునుగూర్చి ♦ నయమారనెల్ల, నేమమ్ముగనెరుంగ ♦ నేరకిట్లెట్లు
అలక్రైస్తవమతము♦గలరూపమెరుగు,దనుచుయోచించి మో♦హనుడు పఠింప
మనమందు దలచెను ♦ దనచేతికందు, సకలపుస్తకములు ♦ సమబుద్ధి చదివి
అకలంకమతిదై♦మాత్మదన్నెట్లు, నడిపించునటు దాను♦జన నిర్ణయించె
కడకుస్వీయమతమ్ము ♦ గలరూపమెల్ల,నెరిగిన తరువాత ♦ నే గానిబోవ
బరమతస్వీకార♦భావనసంచు, మరిమరితలచి తీ♦ర్మానించె గాంధి. 216

క్రైస్తవ సంబంధములు—1893-94

క. మరునాడొకగంటకు బేకరు ప్రార్థనసభకుబోయిం♦కనె నచ్చట నం
దరుమోకరిలగ బాటి,త్కారణిక గాంధియునొనర్చె ♦ గడుభక్తిమదిక. 217

క. ఎల్లరుప్రార్థించిరి తమ,యుల్లంబునగలుగుకోర్కె ♦ లుత్తమ రీతిక
వెల్లుగగూర్పంగదవే, కొల్లగదేవా యటంచు ♦ గూయిడుచు నడిక. 218

ఆ. నేడుగడుచుగాక ♦ నెమ్మదిగానంచొ, దేవు నెడదతలుపు♦తెరువుమనియొ
ప్రార్థనములు నిత్య♦పద్ధతిగ జరుగు,చుండెనచటనెల్ల ♦ చోద్యముగను. 219

ఆ. మమ్ము నేడు నూత♦నమ్ముగా జేరిన, తమ్మునికినిగూర్ప ♦ మిమ్ము గాను
మాకుబోలె శాంతి♦మనమందనుచు గాంధి,కొరకుజేర్చిరొక్క♦క్రొత్తకోర్కె.

ఆ. భజనకీర్తనలెవి♦పాడుటలేదు సం,గీతమొండులేదు ♦ గేయఫణితి
ప్రార్థనసభలందు ♦ భక్తినొనర్చుటా, బేకరింటి చర్చి ♦ బృందమందు. 221

క. నిత్యమిమ్మగతినేదో, ప్రత్యేకాభీష్టమునకు ♦ ప్రార్థనములు వా
రత్యవసరగతిజేసిర,గత్యముగాంజనిరి కుడువ♦గ నుపాసనముక. 222

ఆ. మమ్ము నెల్లగాచి♦మనుచు నాజీసను,ప్రభువె కాచుగాత ♦ భక్తు నితని
ఏసుప్రభువునాను ♦ మెంచియే మేమెల్ల, నడిగితిమని మ్రొక్కు♦లిడిరివారు. 223

ద్వి. బేకరుచర్చి ప్ర♦వేశమ్ము నాడె, ప్రాకటముగ జేసె ♦ పరిచయ మతడు
గాంధికి 'హారిసు' ♦ గాబనువయసు, నందు వృద్ధులను క♦న్యకలనిద్దరిని. 225
తదితర సఖుల నెం♦దరినొ యందుండె, హృదయనిర్మలుడు వి♦బుధుడగు 'కోట్సు'
పరిచయమ్మాదిగా ♦ బడతులు బిల్చి, దరిగె టీ పానమ్ము♦కొ కువారింటి
కాదివారములనా♦యతిథిగలిద్దరు ని,వేదింపగా దమ ♦ వివిధానుభవము. 228
లలగాంధికోట్సుకు♦నరయగాదనదు, విలువైన డైరిజా♦పియును జర్చించె
తానుజదివిన గ్రం♦థమ్ములగూర్చి, తానుగ్రహించిన ♦ తత్సారమెంచి
మచ్చిక వారల♦మధ్యను పెరుగ,నిచ్చె గాంధికి కోట్సు ♦ యొన్నొ గ్రంథముల.

వ. ఆగ్రంథములందెల్ల మోహను సమ్మోహితుంగావించి చదువఁజేసినవి, డాక్టర్ పార్కర్, పియర్సన్ బట్లరు రచనలు. అవియైనను 'బేకరు' కోట్సు మొదలగు క్రైస్తవమిత్రు లుద్దేశించినట్లు గాంధిని క్రైస్తవమతమువైపు మరల్పఁజాలక పోయెను. 232

క. ఈవసుధ ఏసొకండే, దేవుని యవతారమనియు ♦ దెలియ నరునికిన్
దేవునికి మధ్యవర్తియు, నే వాదము గాంధికెటు రు♦చింపకపోయెన్. 233

సీ. ఇంతటితో 'కోట్సు' ♦ తృప్తిపొందక గాంధి, యరుతఁదులసిదామ♦మరసియనియె
వేయనేలిది మూఢ♦విశ్వాసమనినీవు. తలపవే నీకిది ♦ తగునె గాంధి
రమ్మిటు త్రెంపగా ♦ నిమ్ముదానినటంచు, తొందరింపగ'కోట్సు' ♦ గాంధిపలికె
ఇది నాజనని కాన్క ♦ నిచ్చెనాక్షేమంబు, కాంక్షించినామెడ ♦ గట్టెనామె

గీ. దీనిఁదాల్పకున్న ♦ హాని యంచని యెంచ,నైనఁదగినకార♦ణంబులేక
తీసివేయఁజాల ♦ దెగినచోజీర్ణించి, తెగునుగాక నేన ♦ త్రెంపఁబోను. 234

సీ. అని మోహనుడు పల్క♦విని 'కోట్సు' నీకిది, తగదజ్ఞతంబడి ♦ తలప వకట
క్రైస్తవమతమందు ♦ గలియనిచో మోక్ష, మలరదన్యమతంబు♦లందు సత్య
మున్ననుండునుగాక ♦ ప్రోన్నతసత్యమ,తంబగునట్టి క్రై♦స్తవమతమున
మన నిత్యపాపముల్ ♦ మాన్పి 'జీసస'గాచుఁ,గాకున్న మనమంచి♦కార్యతతులు.

గీ. వ్యర్థమగునంచు బలుమారు ♦ హెచ్చరించి,
ప్రోత్సహించెను మిగుల స♦మ్మోహపరిచె
మోహనుంగూర్చి క్రైస్తవ ♦ స్నేహితులను
పుస్తకములిచ్చి క్రైస్తవ ♦ బోధఁగూర్చి. 235

ఆ. కోట్సుగాంధికిట్లు ♦ గూర్చినమిత్రుల, మంచివారు చాల♦మందియుండి
రందుదైవభీతి ♦ నధికాధికము 'ప్లిమత్', సోదరులకుటుంబ ♦ మాదరమున.236

సీ. ఆకుటుంబమువారి ♦ కాత్మవిశ్వాసమ్ము, గల'ఏసు' తగుపాత♦కములనుండి
తమ్మురక్షించు నే♦తరినైన నని తాము, చేయుపాపముల కే♦చింతలేక
శాంతిమైయుండి ప్ర♦శస్తియొసర్చిరి, క్రైస్తవమ్మునుగూర్చి ♦ గాంధికైన
మోహనుడింత వ్యా♦మోహమ్ము జెంద కం,దులకిట్లొసంగెఁ బ్ర♦త్యుత్తరంబు

గీ. "వలదు పాపఫలానుభ♦వమ్ము నుండి, ముక్తి వలయును పాతక♦ముల తలంపు
నుండియె విముక్తినాకంచు" ♦ నుడివె గాంధి, ఇంచుకంతచలింపక ♦ యేసుఁగూర్చి.

సీ. గాంధియొఱుంగును ♦ క్రైస్తవులెల్ల రా,దారిఁబోయెడివారు ♦ గారటంచు
నిరతంబు దైవస♦న్నిధినుండువాఁడుగా, కోట్సువర్తించుట♦కూడ దెలియు

"గాబుహారిస్"కన్య♦కలును మెలంగిరి, భయభక్తి పరిశుద్ధ ♦ భావమెనయ
తానుజదివిన క్రై♦స్తవపుస్తకములు కొ,న్నింట భక్తియెయ్యుండె♦వింపుగాను.
గీ. కనుక స్లీమతుల క్రైస్తవ♦కలుషవాస,మున కొంకించుకబూనక ♦ కినుకగాంధి
క్రైస్తవమతమ్ముగూర్చియే♦కలతజెంద,కుండె నీరీతియేపల్కు ♦ కోట్సుతోడ. 238
ఆ. పాతకములవైపు ♦ బ్రాకకుండమనమ్ము, నడచివానిదైవ♦ముందు భక్తి
భయములొదవుదాక ♦ నియతినీతిఁ బరిశ్ర,మింపవలయు మనుజు♦ డెప్పుడుర్వి.
ఆ. తానొనర్చు పాప♦తతినుండి తనుగాచు, నేసుప్రభువటంచు♦నెల్లవేళ
పాతకములయెడల ♦ భీతిలేకుండయే, మానవునికి తగదు ♦ మహిని బ్రతుకు.

ఇండియనులతోటి పరిచయము—1893-94

సీ. డావఅబ్దుల్ల నె♦టాలునందెట్లొ సేట్, త్యాబ్జి ప్రిటోరియా ♦ నట్లు వెలయు
పల్కుబడి ప్రతిష్ఠ ♦ ప్రాభవంబులతోడఁ, గాననాతనిగాంధి ♦ గలసికొనియె
అటకేగనట్టి మొ♦దటి వాసరమ్మందె, ఆప్రిటోరియపుర♦మందు వెలయు
భారతీయులతోటి ♦ పరిచయమ్మున వారి, స్థితిగతులారసి ♦ తెలియగోరి
గీ. అభిలషింతును మీసహా♦యంబువలయు, ననుచునర్థింప నేటందఱ♦కనుమతింప
హాజియూసబు సేట్ గృహా♦మందుఁ గూర్చె,ఇండియనులసమావేశ♦ మొందుగాంధి.
తే. ఆసమావేశమునకు నే♦చ్చేసిరెల్ల, రందలి మెమనువర్తకుల్ ♦ హైందవులును
వారలకెరుంగబలికె ట్రాన్స్♦వాలు భార,తీయులగురించి తత్పరిస్థితినిగూర్చి. 242
సీ. ఈసమావేశాని♦కేగుదెంచిన సర్వ,భారతీయులకు సు♦స్వాగతంబు
మీరు మీ వ్యాపార♦ధోరణులందెల్ల, ఋజుగుణులగుచెప్డు ♦ నిజమెపల్కఁ
డనుచితంబగు నస♦త్యములాడుటలు పర,దేశమ్మునందు ప్ర♦త్యేకముగను
మనవారి యిచటి ప♦రవబట్టి మనయిండి,యనుజాతిగుణములఁ♦గణనజేతు
తే. రెల్లజను వర్తకిమ్మంద♦ఋజుగుణమ్ము, సత్యమునుబల్కుటెన్నన♦సాధ్యమంచు
తలఁపబోకుడటంచెంత♦పలకనుండ. మోహనుడు సభ్యులెల్ల స♦న్తోషితులుగ
పరగగంభీరభాషతి నుప♦న్యసించె. 243
సీ. ఇటువనంతశిక్ష ♦ ఋజుగుణమూర్జింప, బాహ్యశుద్ధి మీ ♦ పరిసరములు
శుభ్రమ్ముగానుండ ♦ జూడంగవలయు మీ, యలవాటులాచార♦ములను సకల
మెంత శుద్ధమ్మొనొ ♦ యంతదేహారోగ్య, మలవడు మీకెల్ల ♦ నరయుఁడెల్ల
తెల్లవారుండెడు ♦ తెరగెల్ల నారీతి, నైకమత్యంబున ♦ నలరవలయు
గీ. ఇండియనులెల్ల ముస్లిముల్ ♦ హిందువులును,
పార్సి గుజరాతులను భేద♦భావములను
వీడుడో యన్నలారంచు♦వేడుకొంచు,పాడి వాక్ప్రౌఢి గాంధి ♦ యుపన్యసించె.

సీ. ఈవిదేశమ్మున ♦ నిక్కట్టులెన్నియో, సాధారణమ్ముగా ♦ సంభవించు
టనుభవమ్మునమీర ♦ లరసియే యుందురా, యిబ్బందులు ప్రభుత్వ ♦ దృష్టికింత
కొనివచ్చుటకుమీరు ♦ కూడికగాఁజేరి, చర్చించి తీర్మాన ♦ సరణి బంపఁ
ననుకూలముగ నుండు ♦ నంద రిండియనులు, సంఘమొండుగ జేరి ♦ సభలగూర్చ

గీ. కలియుగమ్మున సంఘమే ♦ బలమటంచు, వినరె పెద్దలు నుడివిన ♦ విధమదెల్ల
కనరె తెల్లవారెల్ల రే ♦ గతిని గలసి,మెలసియుండిరటంచును ♦ బలికె గాంధి. 245

ఆ. ఇచటనున్న భార ♦ తీయసోదరులు నే,నుడివినటుల జేయు ♦ నెడల మనము
కుడుచు నిడుములెల్ల ♦ కడువడిగ ప్రభుత్వ,మునకు విన్నవింప ♦ ముందు నుందు.

క. నా వ్యవధియు నా విద్యయు, నావ్యవహారమునగల్గు ♦ నయవిజ్ఞతయు౯
మీ వ్యథలనడనయించుట,కై వ్యయమొనరించెదను సాధ్య ♦ మగు దాక ధర౯.

సీ. ఈరీతిగా దన ♦ యిచ్ఛ దైదవయేట. బహిరంగసభలో ను ♦ పన్యసింప
అందుగూడినవార ♦ లందరు చర్చించి,రందలి పలువిష ♦ యముల గూర్చి
అందింతుమనిరందుఁ ♦ గొందరందులకు గా,వలయుసమాచార ♦ వార్తలెల్ల
దాన మోహనుఁడు ప్రో ♦ త్సాహమందుచు నందు, నాంగ్లభాషనెరుంగ ♦ నట్టివార

గీ. లెందరోయుండుటంగాంచి ♦ యిందుగూడి,నట్టివారలలో నెవ్వ ♦ రైన గోర
నేర్పుదాంగ్లేయభాషను ♦ నేర్పుమీర, నేర్వవలెలోకవృత్తము ♦ దెలియఁదాని.

సీ. అనిమోహనుండాడ ♦ నందుముందుకుముప్వు,రరుదెంచిరిదొనేర్తు ♦ మాంగ్లభాష
పనులున్నవెన్నియో ♦ వ్యవధిగల్గదు కొంచె,మైన మాయింటికి ♦ నరుగుదెంచి
నేర్పబూనిన మేము ♦ నేర్చుకొందుమటంచు, ననసీయకొనెగాంధి ♦ తనియవారు
అముప్వురనొకఁడు ♦ హైందవవ్యాపారి, యిరువురుముస్లిముల్ ♦ కరచిరాంగ్ల

గీ. భాషనెనిమిదిమాసముల్ ♦ వరకువ్రాయు,నాంగ్లము౯ లెక్కలను లేఖ ♦ లనుదినమ్ము
కరచిరందిరువ్వు రెక్కువ ♦ గా గడింప, తగు సమర్థులుగానైరి ♦ తనిసె గాంధి. 249

క. ఆనాటినుండి నియమము,గా నెలకొకతూర తప్ప ♦ కయ సభగూడె౯
ఆనాడుగూడువారలు, మానసముం దనియగా స ♦ మాచారమ్ముల్. 250

ఆ. జంకుఁగొంకువీడి ♦ చర్చింతు రందఱు, చేయవలయు పనుల ♦ స్థితిగతులను
ఎల్లవారెరుంగ ♦ నెల్లవారల కష్ట, సుఖము లెల్లగూర్చి ♦ శుద్ధముగను. 251

ఆ. క్రమముగానెరింగె ♦ గాంధి ప్రిటోరియా,పురిని నిండియనుల ♦ పోలుపునెల్ల
అల్లవారి సాంఘి ♦ కార్థికరాజకీ,యాది జీవితవిష ♦ యముల నెల్ల. 252

సీ. ఈరీతిగాంధి ప్రి ♦ టోరియాపురినెల్ల. భారతీయులతోడి ♦ పరిచయంబు
గడియించె వారల ♦ కష్టసుఖముల వి,చారించి యా ♦ సమాచారమెల్ల

అల్లప్రిటోరియా♦యందుఁ డెను బ్రిటీషు, యేజెంటు కపుడప్పు♦డెరుగఁజేసె
ఆనాటి 'జాకొబస్'♦యనెడు ఏజెంటు యెం, తేనిండియనులపై ♦ సానుభూతి
తే. కలిగియుండినవాడౌట♦గాంధి కెపుడు, వలయు నప్పుడ నాతని♦కలిసి మంత
నములు జరుపుచుఁ దనచేత♦నైన రీతి, చేయుచుండెసాయము భార♦తీయులకును.
సీ. అంతగాంధి 'రెయిల్వే'♦అధికారులకు వ్రాసె, నిండియనులు ప్రయా♦ణించునెడల
పడుకష్టముల్ చట్ట♦బద్ధముల్ గావంచు, నధికారులును బదు♦లంపిరిట్లు
"దుస్తులబాగుగాఁ దొడిగిన భారతి, యులకెల్లరికి నీయ♦గలము వేష
మునసీఫస్టుసెకండు ♦ తరగతుల్ వారికి, స్టేషనుమాస్టరే♦టికెటులెల్ల"
గీ. అనుచు నందఁ లకించుకే♦నందడయ్యె, గాంధి సంతృప్తిదుస్తుల ♦ చందమరయు
నల్లస్టేషనుమాస్టర్లు♦ కెల్ల వార, లగుటఁ దోడేలు మేకపి♦ల్లట్టు లనుచు. 254
తే. బ్రిటిషుయేజెంటుచూపిన ♦ పేపరులును, త్యాబుసేటొసగిన కాగి♦దాలనరయ,
తెలిసె గాంధి కారెంజిఫ్రీ♦స్టేటునుండి, భారతీయబహిష్కార ♦ పథములెల్ల. 255
క. ఈపరిచయ మిా తెలివిడి, ఏపుగనుపయోగపడియె ♦ నెంతయుగాంధీ
కాపై సౌతాఫ్రికయం, దోపి ప్రభుతతోడ వాద♦ మొనరింపంగన్. 256
క. ఆవత్సరమ్ములోపల, పోవగ మోహానుడు జన్మ♦భూమికిఁ గోరెన్
ఆ వడివ్యాజ్యము ముగిసిన, దేవుని సంకల్పమొండు ♦ తెరగుననుండెన్. 257
ఆ. నరుడొకండు గోరు ♦ జరుగు వేరొం డాశ, రాజ్యమేలగోరు ♦ పూజ్యముగ న
దృష్టమెట్టులుండు ♦ దేవునిసంకల్ప, మెట్టులుండు నెవ్వ♦డెరుగు జగతి ? 258

## కూలి అనగా నేమి ?—1894-1896

వ. 'ట్రాన్స్‌వాల్', ఆరెంజ్ ఫ్రీస్టేటులందు వసించు భారతీయుల పాటులంగురించి వివరముగా నెరుగగోరువారు గాంధి రచించిన "దక్షిణాఫ్రికాలోని సత్యాగ్రహము"ను గ్రంథరాజమును పఠింపవలయు. 'ఆరెంజిఫ్రీస్టేటులో', 1888 వ సంవత్సరాత్పూర్వమే యొక ప్రత్యేక శాసనమువలన భారతీయులకుగల పౌర సత్వహక్కులెల్ల దొలగింపఁబడియుండెను. హోటలులందు 'వెయిటరులు'గానో అట్టివేయగు తదితర హీనవృత్తుల నాచరించుచు మాత్రమే ఆ రాష్ట్రమున భారతీయుల కుండనయ్యెను. వర్తకులైన భారతీయులకేదో కొంత నష్టపరిహారముగా ముట్టజెప్పి రాష్ట్రమునుండియే బహిష్కరించియుండిరి. వారి ఆక్రందనలు, ఆందోళనలు, అర్జీలు అన్నియు నరణ్యరోదనము లయ్యెను.

ఆరెంజి ఫ్రీస్టేటులోవలెనె ట్రాన్స్‌వాలులోగూడ 1885 వ యేట్టి నాటికే యిట్టి చట్టమొకటి అమలులో నుండెను. 1886 లో కొద్దిగా మార్పుచెందిన యీ నూతనశాసన మనుసరించి ట్రాన్స్‌వాలురాష్ట్రముఁ జొచ్చు ప్రతి భారతీ

యుడును మూడుపౌనులు తలపన్ను తప్పనిసరిగా గట్టవలసియుండెను. మీదు
మిగుల వారికి ప్రత్యేకింపబడిన ప్రాంతములందుమాత్రమే వారేదైన భూమి
గొను హక్కుండెను. అట్టి భూమిపైనగూడ వారికి యాజమాన్యము లేకుం
డెను. ఇంకను ఎన్నికలఁబాల్గొను హక్కుగూడ ఆఫ్రికనులకుబోలె ఆసియా
వాసులకు లేకుండెను. రాత్రి తొమ్మిదిగంటలకుపైన నిల్లువిడిచి పబ్లికుపథముల
పైన 'పర్మిటు'లేకుండ నడుచుటకు భారతీయుల కధికారము లేకుండెను. ఇట్టి
'పర్మిటు'నిచ్చు హక్కు పోలీసువారి యిష్టానిష్టములపై ఆధారపడియుండెను.

సీ. ఇట్టిశాసనముల ♦ కట్టడిచేగల్గు, కష్టా లనుభవించెఁ ♦ గాంధి మిత్రుల
'కోట్సు'తో వాహ్యాళి♦కొరకేఁగుచును రాత్రి,పదిగొట్టువఱకుంట♦వాడుకయ్యె
తననీగ్రొనొక్కఁడు♦కనయంబుదిరుగఁ బర్మిట్టునొసంగెను ♦ ప్రీతి'కోట్సు'
అట్టి పర్మిట్టు నొం♦దా ప్తమిత్రుండగు, మోహనుకొసగుట ♦ మోసమగుట

ఆ. 'స్టేటటార్నీ'యొద్ద♦చెప్పి యిప్పించె నిం,గ్లాండునందతండు ♦ గాంధితో జ
దివినవాఁడుగాన♦దెలిసియిచ్చెనతమ్ము, బయటఁదిరుగుహక్కు♦పత్రమొండు. 260

తే. గాంధి యాపత్రమెప్పుడుఁ♦గలిగియుండె, బయటికేగెడుచో నెప్పుఁ♦డయినదాని
నెవనికెప్పుడుజూపెడు ♦ నవసరంబొ,కండు లేకయొకడచనెఁ♦గాలమెంతొ. 261

ఆ. అట్టి'స్టేటటార్నె♦ఆఖ్య'డాక్టరు''క్రాసు', క్రాసుసోదరుండు ♦ గాంధికెంత
యొ ప్రయోజనమ్ము♦లొసగిరి తరువాతి, రాజకీయసమర♦రంగమందు. 262

ఆ. అట్టులుండగా నొ♦కానొకదినమున, గాంధివెడలె వాడు♦కగ విహార
మునకు రాత్రి ప్రొద్దు♦పోయిన ప్రెసిడెంటు, క్రూజరింటివైపు♦రోజుఁబోలె.

ఉ. ఆ ప్రెసిడెంటు క్రూజరు గృ♦హంబు తదన్యగృహాళివోలెనే
విప్రతిపత్తిలేనివిధి ♦ వేరుగ నుండమిజేసి యేగితిన్
నే ప్రతిరాత్రివోలె భయ♦మింతయులేకట నున్న పోలిసున్
అప్రతిపత్తిగాంచకయె ♦ యాతెడు నూతనుడౌట నాపనిన్. 264

ఆ. ఎవరవీవటంచు ♦ హెచ్చరికేమాత్ర,మీయకుండ నింత ♦ నెదిరి గాంధి
రెక్కబట్టిత్రోసి ♦ రిచ్చపడగఁదన్నె, వీధిలోనికెంతొ ♦ వింతయనక. 265

సీ. ఆదృశ్యమారసి♦నట్టి మిత్రుడు 'కోట్సు', గాంధి నేనంతయు ♦ గాంచినాడ
నే సాక్ష్యముండెద ♦ నీవీమనుజుమీద, వ్యాజ్యమ్ముకోర్టులో ♦ నాడునెడల
నీవిట్టులీరీతి ♦ నీచంబుగాదన్న, బడుటఁజూడ విచార ♦ మడరె నాకు
వదలగా దిటువంటి♦వారినంచును ప్రోత్స,హించెగాంధిని కోర్టు ♦ కేగుమంచు

గీ. కాని గాంధియనియెఁ ♦ గలఁగక యిసుమంత, పాపమీతడొక్క♦బంటుగాడె
యీతడేమెఱుఁగు ♦ నేనొక్కబారిష్ట,రగుట నల్లవార♦లంద రొకటె. 266

ఆ. అతనికై ననేను ♦ వ్యక్తిగతంబగు, దుఃఖహేతువులకు ♦ దుఃఖపడుచు
కోర్టుకేగుటెపుడు ♦ గూడదటన్న ని,ర్ణయమొనర్చుకొంటి ♦ నాదుమతిని. 268

క. అనిగాంధి పలుకగాఁ 'గో',ట్ఠును పోలీసువానిడాసి ♦ చూడ్కుల గోపం
బెనయంగ మందలించెను, సునిశితమగు తీవ్రవాక్యసూచీ పంక్తిన్. 269

మం. పోలీసుబంటంత ♦ మోహానుండొక్క, బారిష్టరని మదిఁ ♦ బాగుగాఁదెలియ
గాంధికడకువచ్చి ♦ క్షమియింపు డెడరు, తెలియకగావించి ♦ తలుగకు డంచు
నర్థించెనెంతయో ♦ యంతకుమున్నె, గాంధియాబంటును ♦ క్షమియించియుండె.

సీ. స్వానుభవమగు నీ ♦ సంభవమున గాంధి, గుండె మరింతగా ♦ నిండియనుల
దురవస్థనుగురించి ♦ దుఃఖమ్ముతోనిండె, సర్వదా సర్వత్ర ♦ స్వజనమునకు
సౌతాఫ్రికాయందు ♦ జరుగు నన్యాయ మే,గతి నరికట్టగాఁ ♦ గలుగునసుచు
మదిలోన, నెదలోన ♦ మరిమరియోచించి, భా[illegible]యులుపడు ♦ పాటులెల్ల

గీ. గూర్చి వినుచును, వినుచునుఁ ♦ బేర్చి పుస్త,కమ్ములందెల్లఁ జదువుచుఁ ♦ గాంధితోడి
యిండియనులతో బలుమారు ♦ గుండెకరుగ, మంతనమ్ములు సాగించెఁ ♦ జింతగదుర.

ఆ. ఎదియు నేమిరైన ♦ మొదట 'సేట్ అబ్దుల్ల' వ్యాజ్యమెల్ల పూర్తి ♦ యైనవరకు
దానియందె చూపఁ ♦ దగుఁదనశ్రద్ధాను,రక్తులెల్ల శక్తి ♦ యుక్తులెల్ల. 274

వ. అదియ తనప్రథమమును, బ్రధానమునగు కర్తవ్యముగా నిర్ణయించి మోహా
నుఁడా వ్యాజ్యమున విలీనుడాయెను 275

—— వ్యాజ్యసన్నాహము—1895 ——

మ ఒక యేడాది ప్రిటోరియాపురమునం ♦ దుండంగఁ జేకూరె గాం
ధి కమూల్యానుభవంబనేకవిధులన్ ♦ ధీశక్తి సత్కీర్తియున్
సకలంబభ్యుదయంబుగాఁ బ్రతుకుచున్ ♦ సాధ్యంబుగానెల్ల దా
నకలంకంబుగ జీవితంబుగడవన్ ♦ హాయిన్ సదా [illegible]. 276

సీ. అలప్రిటోరియ పురి ♦ యందె ప్రజాసేవ, చేయనేర్చెను దన ♦ సేవదెలియ
అల్లప్రిటోరియా ♦ యందె యాతనిలోని, యాత్మశక్తికి పదే ♦ [illegible] వెలసె
ఆప్రిటోరియపురి ♦ యందె తనదు న్యాయ, వాదవిజ్ఞాన [illegible]
తత్ప్రిటోరియపురిం ♦ దనదులాయరువృత్తి, విజ[illegible] ♦ [illegible]మొరింగె

గీ. 'సీనియరగు బారిష్టరు ♦ చెంత జూని,యరుగఁ దా[illegible] ♦ న[illegible]
జాలమెల్లనుగరచెఁ బ్ర ♦ శాంతమతిని, ఆత్మవిశ్వాస [illegible] ♦ [illegible] గాంధి.

సీ. నలువదివేలపౌం ♦ డ్లకు వ్యాజ్యమది జేర,సారమ్ము[illegible] ♦ జనితమయ్యె
లెక్కలచిక్కులు ♦ లెక్కకు మిక్కిలి,యైయుండె నిజముగా ♦ వ్యాజ్యమందు

చట్టసంబంధ వి♦షయము లనేకము, జరిగిన సంగతుల్ ♦ సమధికమ్ము
కలగూరగంపగాఁ ♦ గజిబిజిగా నెల్ల, వ్యాజ్యమ్ము విస్తార ♦ మగుడు నెగుడు

గీ. దిగుడులం దెల్లఁ జక్కఁగాఁ ♦ దెలియఁగోరి, అలజమాఖర్చు లెక్కల ♦ పొలుపుఁ దెలుపు
శాస్త్రపుస్తకములఁ గొని ♦ శ్రద్ధ జదివె, మోహనుం డెంతొ విజ్ఞాన ♦ మును గడింప.

క. కేసుకు సంబంధించిన, వేసంగతులు గుజరాతి ♦ వెలయుటచే నిం
గ్లీసునకనువాదము దా, జేసెను మోహనుడు నందు ♦ జేయిం దిరిగెన్. 279

క. ఇరుపక్షమ్ముల వారలు, వరమేధోనిధుల మిగుల ♦ వాసింగల లా
యరుల నియమించు కతమున, సరియగు నవకాశ మొదవె ♦ జ్ఞానార్జనకున్. 280

ఆ. వాదవాదమునకు ♦ వలయు సంగతు లెల్ల, సేకరించి వాని ♦ చిక్కులేని
గతి 'నటార్ని' వారి ♦ మతికెక్కఁ దెలిపెడు, కార్యమునకు గర్త ♦ గాంధియగుట.

ఆ. అటుల దాను దెలుపు ♦ నట్టి సంగతులందు, కొన్ని విడిచి కొన్ని ♦ గొనె 'నటార్ని'
అతడు సిద్ధపరచు ♦ నట్టి నివేదిక, యందుఁ గొంతె వాడె ♦ న్యాయవాది. 282

ఆ. ఇట్టిపనుల నిర్వ ♦ హించుటచే నెల్ల, స్వానుభవ మదెంతొ ♦ జ్ఞాన మెంతొ
కలిగె వ్యాజ్యగతుల ♦ గ్రహియించి వలయు సాక్ష్యమ్ము నేర్పరించు ♦ శక్తి గల్గె.

తే. కక్షిదారు లెరుగని సం ♦ గతులు చాల, తెలిసికొనె గాంధి రెండువై ♦ పుల వివాద
విషయ మెరిగించు కాగిదాల్ ♦ వివరముగను, కలిగియుండుట చేఁ దన ♦ కరములందు.

తే. వ్యాజ్యవివరమ్ము లెరిగిన ♦ వాడె రుంగు, వ్యాజ్యసంబంధ శాస్త్రోక్త ♦ వాదమెల్ల
వ్యాజ్యమున కెల్ల నాయువు ♦ పట్టు వ్యాజ్య, విషయవివరణ విజ్ఞాన ♦ విపులశక్తి.

వ. ఒకానొకప్పుడు తనకడకు వచ్చిన వ్యాజ్యమునందు న్యాయము తన కక్షిదారు పక్షమం దుండినను చట్టము ప్రతికూలించు లీల గాంధికి దోచి ఆనాటి దక్షిణాఫ్రికాయందుఁ జేరందిన 'లియోనార్డ్'తో సంప్రదింపగా నాతండు "కేసులోని విషయములగూర్చి మనము జాగ్రతపడినచో చట్టముగూర్చిన జాగ్రత్త నదియే తీసికొనగలదు. కనుక మరియొకపరి వ్యాజ్యమునకు సంబంధించిన విషయముల నెల్ల విశదముగా నపలోడన మొనర్చి నాకడకు రమ్మ"ని యాతడు సలహా నొసంగెను. గాంధి యందులకు వల్లెయని తిరిగి వ్యాజ్యవిషయముల నెల్ల విశదముగా జదివి పరీక్షింపగా నందులో క్రొత్త వెలుగు గోచరించెను ఆ వ్యాజ్యమందనూనవిజయము లభించెను. అబ్దుల్లా వ్యాజ్యమున సన్నద్ధపడునపుడు గాంధికి విషయప్రాధాన్యముగూర్చి యంతగా తెలివిడి లేదు. విషయము లనగా సత్యమనియు, సత్యము నాశ్రయించినవానికి చట్టము తానై వలయు సహాయము జేయగలదనియు నాతని నాటి యభిప్రాయము. ఇట్టి యభిప్రాయముతో విషయవివరణ మొనర్పగా దాదా అబ్దుల్లా వ్యాజ్యము చాలా అనుకూలముగా నుండెను.

కనుక చట్టము సహాయపడుననియు నిర్ధారించెను. ఆయనను వ్యాజ్యము త్వరలో బరిష్కారముగానిచో వాదినష్టము, ప్రతివాది మునగనష్టమగుట తథ్యము. కోర్టువారి యిష్టమనుసరించి ఎప్పటికేరీతిగా నెన్నాళ్ళకా వ్యాజ్యము పరిష్కృతమగునో యెవని కెరుంగనగు. ఒక వకీళ్ళకు మాత్రమే యదృష్టము పండుటయు, నిష్టబాంధవులైన యిరువైపులవారును గష్టనష్టములచే నెండి బెండగుట తప్పదనియు గ్రహించి శాంతిదూతయగు మోహను డిరువాగుల వారిని సమాధానపరచి శాంతిగూర్చుట తన విధ్యుక్తధర్మముగా భావించి మధ్యస్థమున కిరువాగులవారిని సమ్మతింపజేసెను. 286

సీ. ఇరుపక్షములవారి♦కిష్టుడౌ నొకమధ్య,వర్తి విచారించి ♦ వ్యాజ్యమెల్ల
తీర్పునొసంగెను ♦ 'తీయెబుసేటబ్బుల్ల,కీయవలయు ముప్ప♦దేసవేలు
పౌండ్లంచు నంతటి ♦ బహుళధనంబొక్క,పరినీయసాధ్య మ♦ౌరికినైన
కాదంచు బోధించి ♦ గాంధి యాధనమును, కంతులుగాఁగాఁగ♦ కాలము వర

ఆ. కీయ సమ్మతిగొనె ♦ నిరుపక్షములవారు. ప్రజల గౌరవమున్ ♦ బడసి యంత
వ్యాజ్యమెల్ల ముగియ ♦ వాదియుఁబ్రతివాది. యిరువురందరి పరుస♦మిచ్చమెచ్చి.

ఆ. అంమవలన గాంధి కంతమ్ము లేని యా,నంద మొదవె నట్టి ♦ చందమునను
న్యాయవాదవృత్తి ♦ ననుసరించుటె లెస్స,యనుచు నిర్ణయించె ♦ నాత్మనతఁడు.

క. మానవనైజమ్మగు సన్మా,నవతందాక దెలుప ♦ మానవులెపరేగా
మానుగనొప్పెదరు సమా,ధానమునడనెక్కుడునను వి♦ధానమును దలయిర్. 289

క. మదికెదురువాదులాడక, హృదయములోఁ గొనెడుకేరగు ♦ నెరిగియు దనయి
రువదివత్సరముల లాయరు, పదవిని వర్తించె నట్టి ♦ పథమున నతఁడుర్. 290

క. నూరారుకేసులందున, నోరుపుమెయి బోధసేసి ♦ యొక్కటిగాఁగూడం
జేరిచి కక్షీదారుల, గూరిచెనెటో సమ్మతింపఁ ♦ గూర్మిని జేర్చెర్. 291

మతప్రసక్తి—1895

సీ. బేకరుగొనిపోవ ♦ వెడలె'వెల్లింగ్టను' కన్వెన్షను కొకప్డు ♦ గాంధి యడియు
కొన్నేండ్లకొకతూరి♦కూడు ప్రొటస్టెంటు, క్రైస్తవ జనసభ ♦ ప్రార్థనముల
నాత్మశుద్ధికయి స♦మావేశమగునట్టి, దందు మహావేశ♦మంది గాంధి
మతమమార్చునటంచు♦మదినెంచెబేకరు, ప్రార్థనాప్రతిభా ప్ర♦భావఫలము

గీ, నందు విశ్వాసముంటచే♦నధికముగను, భక్తినాసక్తినొనరించు ♦ ప్రార్థనముల
దైవమైహికాముష్మికా♦ద్యావదవసరములొసగునంచు నతెడనా♦ఎరిఖ్య నమ్మె.

తే. ఇట్టినమ్మికఁగొనిపోవ ♦ నేగెగాంధి, యాప్తమిత్రుండా బేకరు ♦ ననుగమించి
భారతీయుండు దానొట♦దారియందు, కష్టనష్టమ్ములకు నసే♦కమున కోర్చి.293

సీ. క్రైస్తవభక్తులు ♦ గలసిన యాసమా,వేశమందున మతా♦వేశమంది
తనకుగానచట ప్రా♦ర్థనములొనర్పట, బెక్కుర మోహనుం ♦ డక్కరగను
ప్రార్థనలందు వా♦రర్థిపాడెడు కీర్తనముల మాధుర్యంబు ♦ విమలమతిని
గ్రోలి యానందించె ♦ లీల నాసభసాగి,నట్టి మూడుదినమ్ము♦లైన గాంధి.
గీ. మార్పుగానడయ్యె ♦ మతమందతఁడు స్వకీ,యాంతరాత్మబోధ ♦ ననుసరించు
నీతిమంతుడగుట♦ చేత నంతర్వాణి, పిలుపులేమి కతన ♦ నులుకకుండె. 294
క. క్రైస్తవమతముం గొనకలె, నిస్తులమోక్షమ్ము పొంద ♦ నేర్పట కనుటల్
ఆస్తికధనుడగు మోహనా, నేస్తులు నమ్మింపఁజాల ♦ నేరరె యెవరేన్. 295
ఆ. ఏసు క్రీస్తువాకడె ♦ యీశ్వరు నవతార,పుత్త్రుడంచు మదిని ♦ మోహనుండు
నమ్మజాలఁడతని ♦ నమ్మిననే చిరం,జీవియగుదు రనుట ♦ నేవగించె. 296
సీ. దైవమ్మునకె యున్న ♦ దనయులు మనమెల్ల, ఆయన తనయుల ♦ మనుట చెల్లు
ఏసు యీశ్వరుఁబోలు ♦ నీశ్వరుడేయన్న, మానవు లేసు స♦మానులెల్ల
లోకమ్ము పాతకా♦నీకమ్ము తనరక్త,పాతమ్ముచే 'నేసు' ♦ వాపెననుట
మానవజాతికి♦మాత్రమే కలదాత్మ, అన్యజీవుల కుండ ♦ దాత్మయనుట.
ఆ. విశ్వసింపఁడాయె ♦ విజ్ఞానఘనుడు మోహనుడు తలఁచె నేసు ♦ తనమతార్థ
మనువులొసఁగినట్టి త్యాగధనుఁడు దివ్య,బోధకుడని తన♦బుద్ధి నమ్మె. 297
క. ఆతఁడు శిలువన్ మృతుఁడగు,టాతత లోకమునకెల్ల ♦ నాదరణీయ
మ్మే తన్మాత్రమ్మున లో, కాతీతమ్మైన నీతి♦యుందే ముందేన్? 298
ఆ. తత్త్వగుణములందుఁ ♦ ద్యాగమ్ములందును, క్రైస్తవమతభక్త♦రత్నములను
తలనుదన్ను వారి♦తరమతస్థుల లోన,గలరు పెక్కురనుచు♦గాంధియెరుగు. 299
ఉ. క్రైస్తవమెట్టిలోపమును ♦ గ్రాంచని మేలిమిగల్గు మాన్యమౌ
నిస్తుల సన్మతంబనుచు ♦ నిర్వచనం బొనరించుటొప్పదే
శాస్త్రమతంబులన్నిటఁ బ్ర♦శస్తమతం బిదియేయటంచు నా
క్రైస్తవులాడుటల్ మదిని ♦ గాంధి సహింపఁడు విజ్ఞుఁడౌటచేన్. 300
ఉ. క్రైస్తవ మిత్రులంగలసి ♦ గాంధి యొనర్చు ననేక వాదముల్
ఆస్తికతంగురించియు మ♦హాసుహిమాస్వతులైన తొంటి య
భ్యస్తనిరస్తగర్వులగు ♦ భక్తుల గూర్చి ప్రశస్తి సేయుచున్
వాస్తవమాసఖుల్ నుడువు♦వాదము బోధము నేది నూదకన్. 301
మ. అవలంబింపడు క్రైస్తవమ్మటుల మా♦హాత్మ్యంబు నిండారునం
చవలంబింపడు స్వీయహైందవము సా♦హంకారుడై గాంధి యీ

భువిలో నిన్ని కులంబులేలగల వస్పృశ్యుల్ విశేషించి మా
నవులందుండుట హైందవానికె కళంకంబంచు నెంచెన్మదిన్. 302

చ. అలభగవానువాణియని హైందవ వేదములన్న నేల బై
బిలును ఖొరానులున్ భువిని వేదములం బలె దైవవాక్కుగా
వెలయగణింపరాదొ యని వేవిధులం దలపోతలందు ము
న్కలుగ దినంబులంగడపె గానక నావలి తీరమాతడున్. 303

క. చేరుప క్రైస్తవమతమం, దారసి క్రైస్తవసఖాలి యత్నించెను నా
తీరున మహామదుమతమునం, జేర్పంగా గోరి రపుడ సేటులు గాంధిన్. 304

తే. చదువు మిస్లాము గురించి శ్రద్ధతోడ, నంతగలయందమరయ నానంద మొదవు
నంచు నబ్దుల్లయును ప్రోత్సహించె గాంధి, నతని దన్మతమున జేర్చు యత్నమునను

శా. ఈ కష్టావళిఁ గూర్చి వ్రాసె సకలం బెంతేని రాయ్‌చందుకున్
లేకల్ వ్రాసె మతాధికారులకు సంశ్లేషించి యీ సంకటా
నేకంబెల్ల గురించి మోహనుఁడు వారీయంగఁ బ్రత్యుత్తరా
నీకంబెల్లఁ బఠించి మించె ధిషణాజ్ఞేయంబుగా నంతయున్. 306

ఆ. రాయిచందుబాయి వ్రాసె "గాంధి నీవు, చదువవలె మరింత శ్రద్ధతోడ
నింక నెక్కువగను హిందూమతముఁ గూర్చి, దాని గొప్పతనము తలకు నెక్క."

ఆ. "ఇతరమతములందు నెందేనిఁ గల్గునే, హైందవమున గల్గు నధిగభీర
సూక్ష్మభావగరిమ సుశ్లోకపరమాత్మ, దృష్టియును సుదార దివ్యవాణి." 308

ఆ. "నీదు మాతృమతము నీమాతృదేశము, నీదు మాతఁబోలె నీకు శుభము
గూర్చు నోర్చుమింత నేర్చెదు తెలియ హైందవము గూర్చి" యంచు నమ్ము దేను."

క. ఇటు రాయిచందు వ్రాసిన, కటువచనముఁ యుక్తసవ్వి గాంధిని శాంత
స్ఫుటమానసు జేయఁగ నాఁడటు నతఁడితర మతపుస్తకాళిఁ బఠించెన్. 310

వ. 'సేల్స్' అను నాంగ్లరచయిత వ్రాసిన 'ఖొరాను' ఆంగ్లానువాదమును మహమ్మ
దీయమతముఁ గూర్చి తెలుపు మరికొన్ని పుస్తకములను మోహనుఁడు శ్రద్ధతో
బఠించెను. ఇంకను నింగ్లాండునఁ గల తన క్రైస్తవ మిత్రులకు వ్రాయఁగా
నందొకడు 'ఎడ్వర్డుమెయిట్‌లాండ్' నెరుకపరచెను. ఆతడు 'అన్నా కింగ్స్
ఫర్డు'తో కలిసి రచించిన 'ది పర్ఫెక్టువే' అను ప్రస్తుత క్రైస్తవాచారఖండన
గ్రంథమొండును, 'ది న్యూ ఇంటర్ప్రెటేషన్ ఆఫ్ ది బైబిల్' అనగా బైబిలుకు
నవీనభావ వివరణమను గ్రంథమొండును గాంధి కంపెను. ఆ గ్రంథములు
రెండును హైందవమతమును సమర్థించునవిగా నుండెను. టాల్స్టాయి రచించిన
"ది కింగ్డమ్ ఆఫ్ గాడ్ ఇస్ విదిన్ యూ" అనగా పరమాత్మ సామ్రాజ్యము
నీయందే కలదు" అను గ్రంథము గాంధిని సంభ్రాంతముగా లోఁగొనెను. ఆ

గ్రంథమందలి స్వతంత్రాలోచనాశక్తియు, నిండైన నీతియు, సత్యము మొద
లగు సమున్నతభావముల యెదుట 'కోట్సు' యొసఁగిన పుస్తకములన్నియును
దినకరు నెదుట దివ్వెలవలె వెలవెలఁబోయెను. ఇవిగాక రాయ్‌చంద్‌బాయి
పంపిన పంచీకరణము, మణిరత్నమాల, యోగవాసిష్ఠమందలి ముముక్షు
ప్రకరణము, హరిభద్రసూరి విరచితమగు షడ్దర్శన సముచ్చయము మొదలగు
హైందవమత గ్రంథములు గూడ గాంధి పఠించెను. ఏతత్ఫలితముగా మోహ
నుని మనస్సు క్రైస్తవ మిత్రుల తలపున లేని మరియొక మార్గమునఁ బయనిం
చెను. అయినను దనలోని మతాసక్తిని రేకెత్తించిన ఆ మిత్రులతోటి సాంగ
త్యము నెప్పటికిని గాంధి తనస్మృతినుండి చెరిగిపోనీలేదు.

### కోర్కె, దేవుని తీర్పు—1896

ఆ. ముగియగానె కేసు ♦ మోహనుండు ప్రిటోరి,యా పురంబు విడిచి♦యరిగెఁ దిరిగి
డర్బనుకు స్వదేశ♦మార్చాట మెదలేక, చనఁ దయారు జేసి♦కొనగ నెల్ల. 312

ఆ. వెడలు నిచ్చునొక్కొ! ♦ వీడ్కోలు విందు లేకుండ నంత మేలు♦గూర్చినట్టి
అల్లగాంధిసెట్టు ♦ నబ్దుల్ల యొనరించె, గౌరవింప గాంధి ♦ నేరుపాటు. 313

ఆ. 'సిడెనుహాముకడను ♦ జేర్చె నెల్లర భార,తీయనోదరులను ♦ హాయిగాను
గడుపనాదినంబు ♦ గాంధితో వీడ్కోలు, విందునందు డెంద♦మందఁ దృప్తి. 314

సీ. అచ్చోటనున్న వా♦ర్తాపత్రికల్ కొన్ని, తిరుగవేయుచు గాంధి ♦ యరసెనందు
నొండొకచోమూల♦ 'నిండియన్ ఫ్రాంచైసు', అనెడు శీర్షికతోడ♦నదినెటాలు
శాసనసభకంప♦సభ్యుల నెన్నికొ,నెడు హక్కు లేకుండ ♦ నిండియనుల
కాపదగావించు♦నట్టి శాసనమంచు,దోప దాసిగురించి ♦ తోడివారి

గీ. నడుగ నబ్దుల్ల సేటిట్లు ♦ నుడివె "మాకు, తెలియుపనియెల్ల సరకుల ♦ వెలలగూర్చి
ప్రతిదినమ్మును వార్తల♦పత్రికలను, గాంచుచుందుము మావర్త♦కమ్ముకొరకు.

ఆ. అంతమయ్యెనెల్ల ♦ 'ఆరెంజిఫ్రీస్టేటు,' వర్తకమ్ము చూడ ♦ వ్యర్థమయ్యె
మేమెనర్చినట్టి ♦ మిడిమిడి యాందోళ,నమ్ములుగను శాస♦నముల తెరగు. 316

ఆ. శాసనములగూర్చి ♦ చక్కఁగాఁ దెలియని, వారమగుటనెల్ల ♦ నారయంగ
నగుచు గనులు వీను♦లై రోపియను న్యాయ,వాదు లొప్పుచుండ్రు♦వాదొనర్ప.

క. అని పలుకఁగ సేటుకు మో,హనుడనె నీగడ్డ జనన♦మై యుట విద్యా
ర్జనఁ జేసిన యిండియను యువ,జనులుండిరె వారు మీకు ♦ సాయము రారే? 318

క. వారాసాయము వత్తురు, కారే యవ్వారలెల్ల ♦ క్రైస్తవ జనులై
పోరే శ్వేతమతాధిప,చారులుగా దాసులు నను♦చరులుగ నెల్లన్. 319

ఆ. అమతాధికార♦ులన్ననో వారల, తెల్లదొరతనమ్ము ♦ జెల్లనెల్ల
యెడల సాయపడుచు ♦ నెడనెడ వారి దా,సానుదాసులగుచు ♦ ననుసరింత్రు.

ఆ. అనుచు నడలుచాను♦నబ్దుల్ల నుడుల మో,హనుడు కనుల దెరచి♦యకట! యిట్టి
మనుజులె మనయింటి♦యనులని వాపోయె, క్రైస్తవమతనైజ♦గతులఁ దెలిసి.

ఆ. క్రైస్తవమతమందు ♦ గలసినమాత్రాన, భారతీయతకును ♦ భ్రష్టులైరె?
ఇండియనులుగారె?♦యేనాటికైనను, మతముమార్పు మతిని♦మార్చునొక్కొ!

చ. అని మనమందు గాంధి వగ♦నందుచునైన, స్వదేశమేగుచో
పనివినుటెట్టు లిట్టులిట ♦ పైనము నాపుట సాధ్యమానొకో!
అని తన హృద్గతంబయిన ♦ యందర ముందరఁ బల్కనోడె, శా
సనమిది చట్టమైన మన♦జాతి సమూలము నాశనమ్మగున్. 323

క. అని మాత్రమ్మబ్దుల్లా, వినఁబలికెను గాంధి యబ్దు♦విని సేటానా!
వినుమీ మన 'ఫ్రాంచైస్క్లా,శ్చను' పుట్టుకగూర్చి యొల్లఁ♦జెప్పెద నీకున్. 324

సీ. ఈవిషయముగూర్చి♦యేమెఱుంగము మేము, 'అట్టార్ని' "ఎస్కొంబె"♦యనునతండు
గెలువఁగోరియు నెన్ని♦కలలోన మమ్మెల్ల, నోటర్లుగా నమో♦దొనరఁజేసె
ఈయగా మావోటు♦లెల్ల నాతఁడు గెల్చె, ఎన్నికలందింతె ♦ మేమెఱుంగు
వారమీ ఫ్రాంచైసు♦గూరిచి నీపల్కు, విలువనెఱుంగము ♦ తెలియఁబల్కు

గీ. మిప్పుడొనరింపఁదగునేమి ♦ చెప్పుమనెడు, సేటుపల్కులనాలించి ♦ చెప్పెనొక్క
డందుగూడినవారిలో♦నాపునీదు, పయన మొకనెల మేము నీ♦బంట్లమనుచు. 325

క. పోరాడెదమెల్లర మీ, కోరినగతినెట్టి జంకు♦గొంకులు లేకన్
మారాడమనగ నచ్చటి,వారెల్లరు మంచిదనిరి ♦ పైనమ్మాగెన్. 326

సీ. అనుభవవిజ్ఞాని ♦ యబ్దుల్ల యటుగూడి, నట్టివారలఁగూర్చి ♦ యనియెనిట్లు
మనమెల్ల యిపుడుఁ గో♦రినరీతి నిటనిల్చు, గాంధి బారిస్టరు♦గాన నతని
రుసుమునకేమందు♦రో చెప్పుమన నది. విని గాంధి మదినొచ్చి♦యనియెనిట్లు
ప్రజపని రుసుముల♦ పనిలేదు నిల్చెద, సేవకుడుంబోలెఁ ♦ జేతునెల్ల

గీ. నైనఁగావలె నిట్టికా♦ర్యములకధిక,ధన జనమ్ముల సాయమ్ము ♦ తంతులంప
ప్రచురణమొనర్పఁగాఁగర♦పత్రములను,కరము శోధింప 'లా' పుస్త♦కములగములు.

తే. ఏయొకండును జేయఁగా♦నిట్టిపనుల,వలను బడదంద రిందు రా♦వలయు మందు
కనగనే మోహనుం డేక♦కంఠముగను, పలికిరచ్చటి భారత ♦ ప్రజలు నిట్లు. 327

తే. దేవుడు దయామయుండు ప్ర♦భావయుతుడు, ఆయనన్నిమియాపనిఁ జేయమనకు
ధనజనమ్ములు వలయు వి♦ధానములను,కూడ గలవెల్ల కల్గదు♦కొదువయొండు. 329

క. దయచేసి సమ్మతింపుడు, పయనమ్మాపంగ మీరు ♦ పని వినుడింకన్
స్వయముగ సత్యముగా నంతయు శుభమ్మగును మరి శు♦భాంతమ్మాతన్. 330

క. అని పల్కుచు వీడ్కోలు స,భను మార్చిరి వారిక్రొత్త ♦ వర్కింగ్ కమిటీ
గను గాంధియు నపుడే చే,కొనె నిలువగ నిర్ణయంబు ♦ గూర్పగ మేలున్. 331

క. ఓటరుల పట్టికంగల, వోటరులందరివి నామ♦ములు గనుగొని మో
మోటము విడి వడిగా సా,పాటు ముగింపంగ గోరె ♦ వారలనెల్లన్. 332

ఆ. ఉద్యమవిధమెల్ల ♦ నుల్లమ్మునన్ సంగ్ర,హమ్ముగా గ్రహించి ♦ యదియునదుపు
తెరగుంగూర్చి యెల్ల ♦ తెల్లముగా నిర్ణ,యముల గొనియె గాంధి ♦ యపుడె వేగ.

ఆ. దైవమిట్లు లతని ♦ దక్షిణాఫ్రికజీవి,తమ్మునకు బునాది ♦ నెమ్మివైచె
అతని జాతిగౌర♦వార్థసంగరమున, కంకురార్పణమ్ము ♦ నపుడె జరిగె. 334

—— నెటాలున నెలకొనుట — 1893 ——

సీ. హాజిమహమ్మదు ♦ హాజిదాదా సేటు, నాటి నెటాలిండి♦యనుల మేటి
ఆర్థికమ్ముగ సేటు ♦ అబ్దుల్ల హాజి ఆ,డముమేటియైన సం♦దరును హాజి
మహమదుసేటుకే ♦ మంత్రాంగముల మేటి,స్థానమిచ్చిరి ప్రజా♦సంస్థలందు
అందుచే నాతని ♦ యాధిపత్యమ్మున, నబ్దుల్ల సేటు గృ♦హమున గూడె
గీ. సభయొకండందు నల్ల ప్రాం♦చైసు బిల్లు, నెదుర[illegible] పోరగా నిర్ణ♦యించిరెల్ల
రందుగూడిన భారతీ♦యప్రజాళి, మాతృదేశమ్ము [illegible] ♦ మనుప గోరి. 335

క. వాలంటీరుల గూర్ప నెటాలు జనన మలరు నిండి♦యును క్రైస్తవుల్
చాలామందిని యువకుల, నాలింపగ సభకువచ్చి ♦ రాహ్వానింపన్. 336

సీ. డర్బనుకోర్టుయిం♦టర్ప్రెటర్ 'పాలు' మి,షను స్కూలు హెడ్డుమా♦స్టరు 'సుభాను'
'గోడ్ఫ్రి' యనెడు వారు ♦ గూర్చిరా సభలోన, క్రైస్తవయువకుల ♦ నిస్తులముగ
వెంటనేవారు వా♦లంటీరులై రెల్ల, వ్యాపారులైనట్టు ♦ వారిం బోలె
వ్యాపారసంస్థల♦యందు గుమస్తాలు, నదితరోద్యోగస్థ ♦ లతులు గూడె
గీ. పాల్గొనంగ ప్రజాసేవ ♦ బాటుపడగ, సంఘమునకు వాటిలినట్టి♦సంకటముల
సమయుసేయగ సమకట్టి ♦ సమరమందు, కలసిరెల్లరు సకలసం♦ఘుజులు నాడు.

ఆ. హిందు ముస్లిములును ♦ సింధుఘూర్జరులును, పారసీలు క్రైస్త♦వాళి తమిళు
లెల్లవారు గూడి♦కల్ల భారతమాత, బిడ్డలెల్ల ఖేద♦భావ ముడిగి. 338

సీ. ప్రాంచైసు బిల్లట్లు ♦ పాస్యుగా శాసన,సభలోన గల్గెడు ♦ సభ్యులెల్ల
భారతీయులనుండి ♦ ప్రతికూలభావమ,ంచుకయు లేదొండు ♦ ప్రకటనమ్ము
చాలిడివారు 'ప్రాం♦చైసు' కనర్హులం,చని చాటగని యుక్తి♦న్యాసములను
సలిపి రీవిషయమ్ము♦ తెలిసి శాసనసభా,ధ్యక్షునికొండు ద్ర♦ఖాని కొండు
గీ. అబ్దులామిత్రు 'డెస్కాంబె'♦కల్లనొండు, తంతి వంపెను గాంధి య♦త్యవసరముగ
చర్చనాపుడీ బిల్లును ♦ గూర్చి కొంత, వ్యవధినిచ్చిన మాయభి♦ప్రాయమెల్ల
తెలియజేతుమటంచును ♦ దెల్లముగను. 339

క. వెనువెంటనె వచ్చెను శా,సనసభాధ్యక్షునుండి ♦ చర్చించుట బి
ల్లును రెండుదినములాపెద,మనుచు జవాబొందు రంద♦రానందింపన్. 340

ద్వి. శాసనసభకు వి♦జ్ఞప్తి దయారు,చేసె గాంధియు ప్రతుల్ ♦ చెచ్చెరనైదు. 341
వ్రాసిరి యనుచరుల్ ♦ రాత్రికిరాత్రే!, డాసియెల్లరివి సం♦తకములు గొనిరి
అనుకొన్న వ్యవధిక♦న్నను ముందె గాంధి, అనిపె శాసనసభా♦ధ్యక్షుని కద్ది
ప్రచురించె దాని వా♦ర్తాపత్రికలును, రచియించె ననుకూల♦వచనమ్ములెల్ల
శాసనసభను సం♦చలనమ్ము కలుగ, జేసె నైనను బిల్లు ♦ ప్యాసగాకుండను. 345

ఆ. జరుగు నిటులటంచు ♦ నెరుకపైయున్న నాం,దోళనమునగల్గె ♦ నూత్నజీవ
మెల్ల సంఘమునకు ♦ వెల్లుగా సభాధ్యక్ష,మరయ సంఘమంచు♦నెరిగిరెల్ల. 346

ఆ. వరుస నెల్లుల దమ♦వ్యాపారహక్కుల, కాపదించికటు ♦ రాచరికపు
హక్కులకును సమర ♦ మాచరించుట [illegible]విధిగ నెరిగిరెల్ల♦విధుల వారు. 347

ఆ. వలస మంత్రి రిఫను♦ప్రభువుకు విజ్ఞప్తి, నంపజేసె నిక్క♦మయ్యెకండు
గొప్పకార్యమగుట ♦ గూర్చి వాలంటీరు, లెల్లనును ప్రోత్సహించి♦రుల్లసమున. 348

తే. చాలగ శ్రమించె వ్రాయ వి♦జ్ఞప్తి గాంధీ, చదివెనెల్లరయు నెతద్వి♦షయముగూర్చి
ఎరుగఁజేయు వాఙ్మయమెల్ల♦నొందుకుపరకు, పరకుసేయక విశ్రాంతి♦కొరకొకింత.

ఆ. భరతదేశమందు ♦ బలెనెటాలునకూడ, ఊడ బయుహక్కు లిండియనుల
కోటు నీయననుచు ♦ మేటివాదములు విజ్ఞప్తియందు నిలి ♦ దీప్తిజేసె 350

ఆ. అవసరమగు నిండి♦యనుల కాహక్కు నె,టాలువారికిచ్చి ♦ మేలిరకపు
భారతీయజనులు ♦ బహుకొద్దిమందియై, యుంటననుచు వ్రాసె♦నొప్పబల్కి. 351

క. పదునాలుగుదినములలో, పదివేలజనమ్ము చేతి♦ప్రాలాక్షితసం
పదగల్గెను విజ్ఞప్తికి, పదిలమ్ముగ సత్ప్రచార ♦ భాగ్యమ్మొదవెన్. 352

సీ. రాష్ట్రమందెల్ల ప్రస్యటనగాపంచి యం,దరికి విజ్ఞప్తి సం♦గతుల దెల్పి
సంపూర్ణముగవారి ♦ సమ్మతిని బడియు సంతకమ్ములు గొంట ♦ జరిగె మరియు
భారతీయులు పల్లె♦పట్టణంబులనెల్ల, చెల్లాచెదరుగ వ♦సించియుంట
ఎల్లవాలంటీరు♦లుల్లాస ముత్సాహ, మొసనందుగా శ్రమ♦పడుటవలన

ఆ. అన్ని సంతకమ్ము♦లంతటి కొద్దికా,లమున గొనుటజరిగె ♦ విమలరీతి
నేటులెల్ల దిరిగి ♦ రోటుపడక మేటి,సంఖ్య సంతకములఁ ♦ జక్కగొనిరి 353

తే. ప్రతిఫలాపేక్షలేమి సం♦పదయె [illegible], సకలజనగుల క్షేమవాం♦ఛయె బలమ్ము
అమలనిష్కామయోగమ్మె♦యాశయమ్ము,గాగ శ్రమియించిరెల్లరు♦కడకవిడక.

క. తమసొంతపనుల విడిచియు, తమధనము వ్యయించియెల్ల ♦ ధనికుల్ వణిజ
ప్రముఖుల్ ప్రజలందరివలె, శ్రమియించిరి సంతకముల ♦ సంపాదింపన్. 355

క. నేటబ్బుల్లా గృహమొక, యోటుపడని సత్రమాయె ♦ నుత్సుకతఁ సా
పాటిడగ నెల్లపూటల, మేటిగ గార్యాలయమయి ♦ మిత్రులకెల్లన్. 356

క. పదివేలజనము చేర్వా,లొందవిన యాపిన్నపమున ♦ కుత్సాహమునన్
పదినూర్లచ్చయెఁ బ్రతులు, పదపడి ప్రజఁ బత్రికలకు ♦ బంచఁ బంపన్. 357

వ. "టైమ్స్ ఆఫ్ ఇండియా" అను నిండియాలోని బొంబాయి పత్రికారాజమును "లండన్ టైమ్స్" అను నింగ్లాండులోని మేటిపత్రికయు నీ విజ్ఞాపన కనుకూలముగా సంపాదకీయవ్యాసములు వ్రాసెను. తానెరింగిన ఆంగ్లపత్రికలకును, ఆంగ్లరాజకీయనాయకులందరికి నా విజ్ఞాపనప్రతుల గాంధి పంపగా నా విజ్ఞాపన విషయములు లోకమందెల్లెడల వెల్లడియై ప్రసిద్ధనాయకుల ఆమోదముద్ర బడసెను. ఫ్రాంచైసు బిల్లు త్రోసివేయబడునని యాశలు మోసులెత్తెను. ఇంత లోపల నెలగడువు ముగియవచ్చెను. మోహనుని ప్రయాణసమయము సమీపించెను. కాని దక్షిణాఫ్రికా యిండియను లాతని వదలజాలని పరిస్థితి యేర్పడెను. నడిసముద్రమున బ్రయాణికులను వారిపాటునకు వారిని వదలిపోవు నౌకాధికారి యెట్టి పాషాణహృదయుఁడై యుండవలయు? అట్టివాడుగా గాంధి యెటులఁ గాగలడు! 358

సీ. విడువ నెటాలు దా ♦ నెడద యొప్పుటయెట్లు?, తనునమ్మి యుద్యమ ♦ మునను దిగిన
సోదరభారతీ ♦ యాదరణమ్మును, వదలిపోవగ నెట్లు ♦ లెదసహించు
ప్రజలకార్యమున ఁ ♦ పాటుబడుచునున్న, ప్రజలడబ్బుతో దాను ♦ బ్రతుకుటెట్లు
తాను వేరుగ స్వతం ♦ త్రముగ బారిస్టరు,పదమునకుందగు ♦ బ్రతుకుగడుప
తే. వత్సరమ్మున కొకమూడు ♦ వందపౌండ్లు, ధనములభియించుటెట్లంచు ♦ దనమనమున
తలచి సంఘీయులెల్లరు దనకున్యాయ,వాదిగానంత ధనమిచ్చు ♦ వ్యాజ్యముల నొ
సంగు బాసను గొనగ దో ♦ చన మొనర్చి. 359

సీ. ఏనిందుసిల్పుట ♦ కీయుగావలయు మీ,కేసులన్నియు నాకె ♦ వాసిగాను
మీప్రజాసేవకై ♦ మీరాసవలయు డబ్బు,సేకరించుటకెట్టి ♦ చిక్కులేదు
ప్రజలకై నేచేయు ♦ పనికిగా బనిపైన, ననుపమిమ్ముల డబ్బు ♦ గొనగజాల
పైపెచ్చు డబ్బుకో ♦ వలసినప్పుడదెల్ల, పనుల డబ్బునుగోర ♦ బాధదోచు
తే. అవసరములేక డబ్బుమీ,నడుగరనుచు, తెలియుమాకెల్ల మిమ్మిట ♦ నిలుపవలయు
ధనముగూర్చుట మాకెట్లొ ♦ ధర్మమగును, సేకరించెదమెంతైన ♦ మీకుగాను. 360

సీ. అట్లందురిపుడు నా ♦ యందు మీకున్న ప్రే,మాతిశయమున నీ ♦ రీతిగానె
నిల్చునే యాప్రేమ ♦ నేనప్పుడప్పుడాడ,వలసివచ్చిన కటు ♦ వాక్కులందు
కొనజాలనెట్టివే ♦ తనము బ్రజాకార్య,ములకుగా మీవ్యాజ్య ♦ ముల నొసంగ
చాలు కుటుంబవె ♦ చ్చములకా యాదాయ,మదె నాప్రజాసేవ ♦ కందొదవిన

తే. ప్రతిఫలంబుగ భావింతుఁ ♦ బరిగణింతు, ననుచుఁ బలుకఁగ గాంధి కా ♦ క్షణమునందె
వణిజులొసగిరి కేసు లిం ♦ పొదవఁగ నట్లు, నిలిచె గాంధి నెటాలున ♦ గొలువఁ బ్రజల.
తే. అల్ల అబ్దుల్ల గాంధి కీ ♦ యంగ దలచి, నట్టి వసనమునకు మా ♦ రతని కింట
వలయు కుర్చీలు మేజాలు ♦ బల్ల లెల్ల, పిలిచి వేయించె విరివిగా ♦ విమలమతిని.

వర్ణవైరము — 813

వ. నిష్పక్షపాతియు, సూక్ష్మబుద్ధియు, నంధురాలునగు సుందరి సముముగా బట్టుకొన్న త్రాసు, న్యాయస్థాన చిహ్నముగా ప్రపంచమెల్లెడ నంగీకారము వడసినది. మానవుని బాహ్యాడంబరములను బట్టి కాక యాతని యంతరాత్మ ననుసరించి, పరిగణన నొనర్చుటకే, యా త్రాసు బట్టిన పడతి పుట్టు గ్రుడ్డిగా సూచింపబడుట జరిగినది. ఇట్టి మహోత్కృష్ట భావమునకు విరుద్ధముగాను, తదీయ చిహ్నమున కెట్టి విలువ లేకుండ చేయు నట్టి నెటాలులోని 'లా' సొసైటి వారు న్యాయస్థానము నపమార్గము పట్టించ బూనుకొనిరి. సుప్రీముకోర్టున నడ్వొకేటుగా ప్రవేశించు నధికారము కొరకు గాంధి విజ్ఞాపన పత్రము నంపుకొనెను. బొంబాయి హైకోర్టులో దాను సంపాదించిన ప్రవేశ యోగ్యతాపత్రము మాత్రమే గాంధి కడనుండెను. బొంబాయి హైకోర్టున నడ్వొకేటుగా జేర్చుకొనబడినపు డతని యాంగ్ల యోగ్యతాపత్రము బొంబాయి హైకోర్టునం దుంపవలసివచ్చెను. సుప్రీముకోర్టున నడ్వొకేటుగా జేరుటకు దన నడవడికను గూర్చి రెండు యోగ్యతాపత్రముల నంపవలసి యున్నందున గాంధి, దాదా అబ్దుల్లా యెరిగిన యిరువు రైరోపీయ వర్తక ప్రముఖులనుండి యా రెండు యోగ్యతాపత్రముల సంపాదించెను. దాదా అబ్దుల్లా కంపెనీకి సలహాదారుడుగా వ్యవహరించుచుండిన ఎస్కొంబిద్వారా, గాంధి తన అప్లికేషనును దాఖలు చేసెను. 363

ఆ. అట్టియెడల గాంధి ♦ అప్లికేషను త్రోసి, వేయవలయునంచు ♦ బీరములను
చాటుచట్లులా సొ ♦ సైటి నోటీసిచ్చె, మోహనునకతీత ♦ మోహమునకును
సీ. వారియా క్షేపణల్ ♦ వరుసగాంధి మసలు, నాంగ్లసర్టిఫికెట్టు ♦ అంపబడమి
అసలడ్వొకేటుల ♦ 'అడ్మిషన్' గూర్చిచే, సినశాసనమ్మెల్ల ♦ శ్వేతముఖుల
కగుట నెటాలట్టి ♦ యభివృద్ధియగు నెల్ల, తెల్లవారలకృషి ♦ నల్లనగుట
నల్లజాతులవారి ♦ కెల్ల ప్రవేశమం, దున్న చో గ్రమముగా ♦ మిన్నయగుదు
తే. రల్లవారల దెల్లర ♦ టంచు లా సొ, సైటివారలాక్షేపించి ♦ రోటువడక
పరుపాటొనరించిరి ♦ పేరుపొంది. నట్టిలాయరుందమపతు ♦ మందునిలువ. 365
మం. అబ్దుల్లసేటుతో ♦ నాయడ్వొకేటు. కుండుట సంబంధ ♦ ముత్తముఁడగుట
గాంధినిబిలిపించి ♦ కడునెయ్యమూర, ఎల్లవిచారించి ♦ హితవాడెనిట్లు

యూరోపియనులు నీ♦యూనెరుంగుదురె, వారిసర్టిఫికెట్లు ♦ వాంఛనీయములు
నీయూరివాడౌచు ♦ నీకుటుంబమ్ము, నెరిగినయబ్దుల్ల ♦ యిచ్చిన 'అఫిడ
విట్టును' దెచ్చిన ♦ నెట్టియాక్షేప, ముండదు నీకంచు ♦ నూరడబల్కె-
గాంధి కెంతటి యసం♦గతముగా గాన, పించిన నది యఫ్డి♦విట్టు నర్పించె
నైన లా సొసయిటి ♦ యందక తృప్తి, గాంధివిజ్ఞప్తినిఁ ♦ గాదం చెదిర్చె
కోరియాస్సుప్రీము ♦ కోర్టులో గాని, 'చీఫుజస్టిసు' తదా ♦ క్షేపణల్ ద్రోసి
వేసిమోహాను సర్టి♦ఫికెటు లేదనెడు, వాక్యమ్ములోపన ♦ లేదంచునతని
అఫిడివిట్టును సత్య♦మైనదేయంచు, శాసనసృష్టిలో ♦ జాతిభేదమ్ము
లేవియు లేదంచు ♦ నేర్పడఁబలికి, అనుమతించెనుగాంధి ♦ అప్లికేషనును
అంత గాంధియు జేరె ♦ నడ్వొకేటుగఁ బ్ర,మాణమ్ము గావించి ♦ మంచిగానెల్ల.

ఆ. అంతఁదత్ప్రధాన ♦ న్యాయమూర్తియు గాంధి, నరసి యింక నీదు♦శిరమునందు
వెలయు వేష్టనమ్ము♦తొలగింపవలె 'కోర్టు, రూల్సు' బట్టియని ని♦యూఢినాడె. 378

ఆ. హద్దుమీరి నడుచు ♦ టొద్దిక గాదని. వేష్టనమ్ము దీసి ♦ వేసెగాంధి
నిలిపి పెట్టె దనదు ♦ నేర్పుబలమ్ము ప్ర,యోగపడగ సత్ప్ర♦యోజనముల. 379

ఆ. అబ్దులాదిమిత్రు ♦ లందరు తలపాగ, తీయగూడదం చె♦దిర్చిరైన
'నడుపవలయు' రోము ♦ నఁ రోమనులవలె, నంచు వారినూర♦డించె గాంధి 380

ఆ. దేశకాల పద్ధ♦తిని దృష్టిసిడుకొని, వివిధవిధివిశేష ♦ విషయగతుల
వేరువేరు తీరు ♦ లోరుపు మెయిని బాటించుటొండె లెస్స ♦ ఎల్ల వేళ. 381

క. మనభారతదేశమ్మున, జనుని శిరోవేష్టనమ్ము ♦ సరియగునె నేటా
లున కోర్టాచారమ్ముల, కనుచితమగుగా దియంచు ♦ నను నయమాడెన్. 382

క. ఈవిధముగ దనమనమున, భావించియు గాంధి పలుకు ♦ పల్కులకా మి
త్రావళిసమ్మతిఁ బూర్తిగ, భావమ్ముల బ్రీతివాడమ ♦ బడియెనో లేదో! 383

తే. కాని తనయెల్ల జీవిత ♦ కాలమందు, గాంధి పాటించె నీదేశ♦కాలపాత్ర
ములకు ననుగుణమగురీతి♦పలు ప్రచుంట, మంచిదని యెడు నీతిస♦మంచితముగ.

తే. సత్యసంధత నెందున ♦ సందునీమి, గాంధిసమరస సద్భావ ♦ గరిమ నెరిగె
తనయసంతత సతత స♦త్యాగ్రహ ప్ర,ధాన భాగమ్ముగా గొనె ♦ దాని బ్రీతి. 385

తే. అట్లు పాటించుటం జేసి♦యప్పుడప్పు, డతని ప్రాణమ్ములకె యపా♦యము ఘటిల్లె
మిత్రజనముల కప్రీతి ♦ పాత్రుడయ్యె, నైనవిడనాడ డయ్యె స♦త్యమ్ము గాంధి.

ఆ. కఠినశిలలకన్నఁ ♦ గడుమించు కాఠిన్య, గరిమ సత్యలక్ష్మి ♦ గల్గివెల్గు
కుసుమబాలకన్న ♦ పసమించు కోమల,త్వమ్మునందు సత్య♦దైవతమ్ము. 387

ఆ. లాసొసైటివాదు ♦ వాసికెక్కఁగగాంధి, వాసిరాసియొక్కఁ♦వయొ మరింత
దక్షిణాఫ్రికాప్ర♦ధాన పత్రికలు ఖండించె లాసొసైటి ♦ యీసు రోసి. 388

ఆ. అప్రసిద్ధివలన ♦ నంతరాయమ్ములు, తరిగెఁబనులు సులభ♦తరములయ్యె
గాంధికరయ నిత్య♦కార్యమ్ములందున, క్రమముగాదొలంగెఁ ♦ గష్టముల్ల. 389

— నెటాలులోని యిండియన్ కాంగ్రెసు—1893 —

ఆ. న్యాయవాదివృత్తి ♦ చేయుటకన్నను, ప్రజలమేలుకొరకు ♦ పనులొనర్ప
తలచె మోహనుండు ♦ దననెటాలు నివాస, మొప్ప సార్థకముగ♦నప్పుడుండ. 390

తే. భారతీయుల ఓటధి♦కారమునకు, విన్నపములంపుటయె కాక ♦ వెలితిలేని
సంతతమ్ము నాందోళన♦జనుపుటవసరము ప్రభుత్వము ప్రజల మొ♦నర్పినంగ.

క. అడుగనియెడ నమ్మయునే, నిడునే కొడుకులకు గూడు ♦ నింపారంగా
కడునలజడి నిడి వెంబడి, బడక ప్రభుత్వమ్మిడగ నేది ♦ వడయగనగునే! 392

సీ. ప్రజ మొరవిన ప్రభు♦త్వము సంతతాందోళ, నమ్మవసరమట్లొ♦నర్చుటకును
శాశ్వతమ్ముగనుండు ♦ సంఘమ్మొకండు ని,ర్మాణ మగత్య మొ♦నర్పవలయు
అని యెంచి మిత్రుల♦నందర సభగూర్చి, సంప్రతింపులు పేర్మి ♦ సల్పిగాంధి
ఇండియన్ కాంగ్రెసు ♦ కెనవచ్చునటుల నెటాలిండియన్ కాంగ్రె♦సోలి సంఘ

తే. మొండు శాశ్వతపద్ధతి♦నుండునటుల, స్థాపనమ్మొనరించె బ్ర♦శస్తమైన
రీతి మేనెల యిరువది♦రెండవదిన, మందు సుస్థిరమగు సంఘ♦మై చెలఁగ. 393

వ. ఆ మేనెల 22 వ తారీఖున నెటాలు కాంగ్రెసు నిర్మాణము జరుగునాడు దాదా అబ్దుల్లా విశాలమగు మేడయందలి యావరణమంతయు నిసుకరాలనంతగా భారతీయుల సమావేశము జరిగెను హాజరైనవారందరు నత్యుత్సాహమున నా కాంగ్రెసు సంఘనిర్మాణము నామోదించిరి. సంఘనిబంధనలు సరళమైనను చందామాత్రము చాల యెక్కువే యైయుండెను. మాసమున కైదుషిలింగుల చందా చెల్లించువారుమాత్రమె సంఘసభ్యులుగా నుండిరి. ధనాఢ్యులైనవారు తమకు సాధ్యమైనంత యధికవిరాళమీయుటకుగూడ నీయకొనిరి. అబ్దుల్లాయు నతని మిత్రులిద్దరును మాసమున కొక్కొక్కరు రెండు పౌండ్లొసంగ సమ్మతించిరి. గాంధియు వెనుకాడక నెలకొక పౌండొసంగ సమ్మతించెను. ఇది యాతని శక్తికి మేర మీరినదైనను దైవముమీఁద భారమువేసి యతఁడట్లు ముందుకు వచ్చెను. దైవమందుగల విశ్వాసమువలన గాంధికివలయు సాయము నొసగ గూడెను. గాంధిననుసరించి పెక్కురు నెలకు పౌండిచ్చు చందాదారులైరి. 10 షిలింగుల విరాళమిచ్చు వారిసంఖ్య మరింత యెక్కువగానుండెను. ఇంతియే కాక గొప్ప మొత్తములుగా ధనము పలువురు నెటాలు కాంగ్రెసున కొసంగ

నది కృతజ్ఞతతో స్వీకరింపబడెను. అనుభవమున నారంభమందున్న నౌత్సుక్యత క్రమముగా సన్నగిలుటగాంచి నెలచందాపద్ధతి బోనాడి వార్షికచందాపద్ధతి యామోదింపబడి సంవత్సరమునకు మూడుపౌనుల చందాయిచ్చుట కందరును సమ్మతించిరి. 304

ఆ. తప్పుకూడదున్నైన ♦ నప్పుచేయుటకూడ, దెప్పుడైన దెచ్చు ♦ ముప్పటంచు
ఎరిగి ప్రజలపనుల ♦ కరువుదెబూనడు, మోహనుండు విగత ♦ మోహుడగుట. 395

ఆ. ప్రజలొసఁగు పెక్కు ♦ బాసలపైన విశ్వాసముంచవచ్చు ♦ వాసినైన
డబ్బువిషయమందు ♦ నిబ్బరమ్ముగ జేతి,ధనము నొండె నమ్ము ♦ కొనుటె లెస్స.

మ. ఇదిగో యిచ్చెదమంచు బాసలొసరిం ♦ త్రైనైన డబ్బియగా
హృదయంబొసగనిచ్చువారియిన నెం ♦ తే జాగొనర్పంగఁ బూ
నెదరీ సత్యమెఱంగి గాంధి పనులే ♦ వేనాడు పూనందు చే
సిద్ధులున్నంతవరకుదప్ప, నప్పొసరుపం ♦ డెప్పాటునం దెప్పుడున్. 397

తే. అందువలన నెటాలిండి ♦ యనుల కాంగ్రెసెప్పుడప్పులపాలుగా ♦ కొప్పియుండె
మహాత్ముల తప్పి వ్యా ♦ మోహ దాహమందు గ్రాగు ప్రజాసంస్థ ♦ లట్లుగాక.

తే. గాంధి యనుచరులెందరో ♦ కౌతుకాతిశయముచే కాంగ్రెసు కనేక ♦ సభ్యసంఖ్య
హెచ్చొనర్చిరి యదివారి ♦ కిచ్చమెచ్చు,నట్టి పని యాచొసగెనమూ ♦ ల్యానుభవము.

ద్వి. జనులెందరో చాల ♦ సంతోషమొప్ప, ధనవిరాళములిచ్చి ♦ రనయమ్ము దూర
మందల పల్లెజ ♦ నాళి కాంగ్రెస్సు,యందు జేర్పింపగా ♦ నధికకష్టమ్ము
సామాన్యజనులు ప్ర ♦ జాకార్యగుణము, నేమంత యనుభవ ♦ మెరిగినవారు
కాకున్న పట్టక ♦ గ్రామణుల్ పెక్కు, రాకొన్న వారట్టు ♦ లాహ్వానమంపి
పల్లగాంధిని రమ్మ ♦ టంచు దమదమ,పల్లెల దర్శింప ♦ పరము సంతృప్తి
ఆతిథ్యమొసగి చం ♦ దాదారులైరి, కౌతుకమ్మున నెటాల్ ♦ కాంగ్రెసునందొ
కానొకప్పడు టోను ♦ ఘాటసుచోట,మానుగా గాంధిని ♦ మన్నించినట్టి. 405
ధనికుడొకండు చం ♦ దా నాదుపౌండు,లని నమ్మిచిన నతె ♦ డక్కటా! మూడు
పౌండ్లకన్నను నెక్కు ♦ వగనీయనన్న, తిండ్లనుమాన గాం ♦ ధియు దోడివారు
కడకతండే తన ♦ కార్యమెల్ల, విడిచియెల్లరికిని ♦ విందొనరించి
ఒకగినాడుక పౌండ్ల ♦ నొప్పిదమార, పసదనంబు తదీయ ♦ ఫలితంబుగాను
కలిగె సంచలనమ్ము ♦ కడుదూరమందు, చెలగుచాల్లెసుటౌను ♦ స్టేంజరాదిగ న
నేకస్థలమ్ములం ♦ దెల్లెడ డబ్బు,సేకరింపగనయ్యె ♦ శీఘ్రంబుగాను
నిధిసేకరణమొండె ♦ నేర్పున జేయు, పనిగాదు గాంధికి ♦ ధనమెప్పుడవస
రమునకుమించి క ♦ రంబునసుంచ, కలరెదునియమంబె ♦ కలవాటుపడియె. 414

సీ. నెలకొకతూరి స♦భ్యులు వాడుకగ గూడు,చుండిరి వారాని♦కొక్కతూరి
సభలగూర్చుచు నవ♦సరమగునెడ ముందు, సభవిషయమ్ముల ♦ జదువుచుండి
రఖిలవిధప్రశ్న ♦ లన్నింటిపై చర్చ, జరుపుచుండిరి కాల♦హరణమునకు
బహిరంగ చర్చలం ♦ బాల్గొనుటయు సూటి,పలుకు తెరుగ రను♦భవమునందు
తెలియవారికి గాంధి ♦ పలికెను సభలందు, మాటలాడు తెరంగు ♦ మంచిచెడ్డ

తే. అదియెవారల కొక క్రొత్త♦చదువటంచు, చాలమంది గ్రహించిరి♦సభల యెదుట
నోరు తెరువగలేనట్టి ♦ వారుగూడ అల ప్రజాహితమగు విష♦యముల పైన
యోచనమొనర్చి మాట్లాడు ♦ నోర్మిగనిరి 415

తే. ప్రజలకు నియందు దెలియని ♦ న్యాయము లెన్నొ
ప్రింగుడబ్బెక్కువగ సంఘ♦కింగి గాంధి,
మొదలు మొదలు రసీదు రి♦పోర్టులెల్ల
సైక్లోస్టయిలు నకళ్ళతో ♦ జరిపెనెల్ల. 416

క. మెంబర్లధికంబగుచు క్రమంబుగ కాంగ్రెస్సునిధులు ♦ మరిమరి సంపూ
ర్ణంబైనపిదప ముద్రిం,పంబూనె నవెల్లపొదుపు ♦ నహియించుచునే. 417

తే. అడుగకున్న రసీదు లీ♦యంగబడియె, సభ్యులొసగిన ప్రతిపయి♦సాకు లెక్క
లెల్ల తేల్పంగ బడియెను ♦ దెల్లముగను, చక్కగా లెక్కలిడు టవ♦సరముసత్య
సంధతకెగాక, సంఘ య♦శమ్ముకొరకు. 418

వ. ఇంతియేకాక, ఆనెటాలిండియన్ కాంగ్రెసు యాజమాన్యమున నానెటాలు మొదలగు వలసప్రాంతములందు పుట్టి పెరిగి విద్యావంతులైన భారతీయుల సంఘమొండు 'ది కలోనియల్-బార్న్ ఇండియన్ ఎడ్యుకేషనల్ అసోషియేషన్' పేరుతో స్థాపింపబడెను. ఏదో కొంచెముగా నెలచందాలనిచ్చుచు దమ యవసరముల గూర్చియు, కష్టములను గురించియు లోకమునకు వెల్లడిగా దెలియజేయుచు, దమయందెల్లెడ నాలోచనాశక్తిని రేకెత్తించుచు, భారతీయవర్తకులతో సంబంధమును గల్పి, తమ తెలివితేటలను, వారి ధనప్రభావమును జోడించి, సమిష్టిసంఘ సంక్షేమమునకును పెర్పడం జేయుటయే యా సంఘోద్దేశమై యుండెను. 419

క. అదియొక చర్చాసంఘము, తదీయసభలం గ్రమంబు ♦ తప్పక గూడున్
చదువుదు రనేక విషయము, లదనున విషయములు వ్రాసి ♦ యందలి సభ్యుల్.

తే. చిన్న గ్రంథాలయంబుగా ♦ జేర్చి పుస్తకముల నేకము తత్సభ ♦ కాలిబాలి
విపులవిజ్ఞానకోశమ్ము♦లపలపుస్తకాలయమ్ములుగా వాక్కొ♦య వనినియందు.

తే. వానికాంగ్రెసుమూలవ్రో♦ద్దేశమాంగ్ల, లానసంపతుణాఫ్రికా♦యాంగ్లులకును
భారతీయులకు నెటాలు ♦ వారికష్టములు గురించి ప్రచారమ్ము ♦ సలుపుటయును.

వ. ఇట్టిప్రచారోద్దేశముతో గాంధి రెండుచిట్టిపుస్తకముల (Pamphlets) ప్రకటించెను. అందు మొదటిది "An appeal to every Britoin in South Africa" రెండవది "The Indian Franchise-An appeal." రెంటిలో మొదటిదానియందు నెటాలులోని యిండియనుల పరిస్థితినిగురించి చక్కని సాక్ష్యాధారములతో వర్ణింపబడియుండెను. రెండవదానిలోకూడ అట్టి యసమానాధారములతోడనే నెటాలులోని ఓటిచ్చు హక్కునుగూర్చి వ్రాయబడియుండెను. ఈ రెండు విజ్ఞప్తుల గూర్చుటలో మోహనుడు చాల కృషిచేసి, వలయువిషయములు సేకరణచేసియుండెను. కృషికిదగిన ఫలితముగూడ కల్గియుండెను. 423

క. ఈచిన్ని పుస్తకమ్ములు, ప్రచారకమున విస్తృత ప్ర♦పంచంబున సా
లోచనులుకాగ నెల్లరు, వాచనిబుట్టించునట్లు ♦ వ్రాయగబడియున్. 424

ఆ. ఇట్టిగాంధి విపుల ♦ కృషిచేతనగణిత, ఖ్యాతిజనంబుగల్గె ♦ నిండియనుల
కల్లదక్షిణాఫ్రి♦కా దేశమందు గ, ట్టిఫలితమటంచు ♦ చెప్పిరె బుధులు. 425

ఆ. గాంధిచేసినట్టి ♦ ఘనమైనకృషిచేత, గలిగె నిండియనుల ♦ కలక నెల్ల
రాజకీయపక్ష ♦ రక్షణ భారత, దేశమునను పరిప♦దేశములను. 426

ఆ. గాంధిరాత్రిపగలు ♦ కావించినట్టియా, కృషిమహత్త్వమలన ♦ నిండియనుల
కల్లదక్షిణాఫ్రి♦కాయందు రాచబాటొండుగల్గెముందు ♦ కురుక నెరుక. 427

—బాలసుందరము—

ఉ. నిందుమనమ్ముసందనరు ♦ నిర్మలవాంఛితమెల్ల వేళలన్
దండిగదీరగా గలదు ♦ ధర్మపథమ్మున నిల్చువారికిన్
పండువుగాగనం చనెడు ♦ ప్రాంమినుకోక్తుల సత్యమెంతయో
మెండుగ గాంచెగాంధి తన ♦ నిక్కలి స్వానుభవమ్మునందునన్. 428

ద్వి. పేదలసేవయే ♦ ప్రియమైనహృదయు, మేదురవాంఛితం ♦ బాదరమార
కష్టాలదొలగించి ♦ కష్టజీవులకు, ఇష్టాలుదీర్చుట ♦ భీష్టబుగాంధి
కట్టిపేదలసేవ ♦ నాచరణమునన, నెట్టనవారితో ♦ నిల్చుండుగాంధి
అల్లదరిద్ర నా♦రాయణసేవ, కెల్లప్పుడుముందడు♦గిడు మోహనుండు
వారిలో నొకడుగా ♦ వసియించు దరుచ, వారిగలీనమై ♦ వారితోగాంధి 433

తే. అలనెటాలిండియను కాంగ్రె♦సఖిలవలస, భారతీయులు సభ్యులై ♦ పరగవలసి
నట్టి సంఘంబదైన నమ♦కట సేవ్యులైన దినకూలికార్మికు ♦ లసలులేరు. 434

తే. కాంగ్రెసింకను వారిసం♦ఘంబుగాదు, లీలసభ్యత్వరుసుముచె♦ల్లించి ధనిక
వణిజులంబోలె వారెట్లు ♦ వరలగలరు, సభ్యయోగ్యతనార్జించి ♦ సభికులగుచు.

తే. కూలియుండిన నాళ్ళలో ♦ కుండగాలు, ఎవ్వడే గూలిలేనిచో ♦ నెండగాలు
నట్టిపేదజనమ్ముల ♦ కెట్టులబ్బు, లీలసభ్యత్వ రుసుము చె♦ల్లింప డబ్బు. 436

క. వారలమన్నన కాంగ్రెసు, వారలకు లభించుకొరకు ♦ వారల సంసే
వారతి దవులుటయేన, వ్వారిగ నేకైకపథము ♦ వసుధాతలిలోన్. 437

ఆ. అట్టి సేవసేయ ♦ నవసరతరుణమా, సన్నమాయె నొందు ♦ తిన్నగాను
గాంధిగాని యల్ల ♦ కాంగ్రెసుగాని సం,సిద్ధులింతగాని ♦ ప్రొద్దునందు. 438

సీ. కాంగ్రెసు సంఘంబు ♦ గడపదాటగలేని, శైశవావస్థలో ♦ సాగుచుండె
గాంధి బారిస్టరు♦గా ప్రాక్టీసాగించు,టే మూడునాళ్లు నె♦లేగెనంతె
చినిగినగుడ్డలం♦జే దలపాగయు, పండ్లు ముందువి రెండు ♦ పగిలి మిగుల
నోటనెత్తురుగార ♦ నోటమి గనుకుచు, నేడ్చుచార్చుచు గాంధి♦కెదుటవచ్చి

తే. నిలిచెనొకనాడు లోకాన♦నోయునెల్ల, హీనదైన్యము మానవా♦కృతిధరించి
నిలిచెనో యనునట్లుగా ♦ గలతపడుచు, తమిళభారత కూలిపో♦వరు డొకండు.

తే. తమిళుడైన గాంధీగుమ♦స్తా వచించె, తెలిసికొనియెల్ల నా భాష♦తీయుకష్ట
మతనియజమాని,యతనిప♦న్యాయముగను,కొట్టగావచ్చె మొరపెట్టు♦కొనదటంచు.

సీ. బాలసుందరమను ♦ కూలిసోదరు డతం♦డా డర్బనునగర♦మందు జాల
పేర్గన్న యొకయూరో♦పీయునికడ కూలి,కుండ నాయజమాని ♦ యొక్కనాడు
కోపమాపగలేక ♦ కొట్టినాకూలిని, పండ్లూడదన్ని తీ♦వ్రంబుగాను
ఆతని మొరవిని ♦ యంతయునతని వి,మోచనార్థమ్ముగా ♦ మోహనుండు

తే. డాక్టరుపరీక్ష సేయించి ♦ తగిలినట్టి, గాయములగూర్చి సర్టిఫి♦కట్టుతోడ
తీసికొనిపోయె నతనిగాం♦ధియెస్వయముగ,కరుణనపుడె మెజస్ట్రీటు♦కడకువిడక.

క. కని బాలసుందరమునా,తని ఫిర్యాదెల్ల గాంధి ♦ తడయక తెలుపన్
విని మేజస్ట్రీటా,గ్రహ,మున నాయజమాని కంపె♦పుకోర్టు సమన్. 442

క. ఆయజమానికి నడన,వేయింపగ దలపకింత ♦ విమలమ్మగు స
న్న్యాయము కూలికి గూర్చుట,కై యోచనచేసె చాల♦గాంధి తనమదిన్. 443

వ. ఆనాటి నెటాలులోని కార్మిక చట్టము ననుసరించి, యూరోపీయులకడ కూలి కొప్పుకొన్న భారతీయుల యవస్థ బానిసలయవస్థ కేమాత్రము దీసిపోనిది. ముందెరుక లేకుండ, యజమాని సేవనువీడిన కూలివానిపైన క్రిమినల్ కోర్టులో వ్యాజ్యమువేసి, కారాగారశిక్షకు పాల్పడచేయవచ్చును. అనగా యజమాని యొక్క అన్ని ఆస్తులవలె కూలియుగూడ నా యజమాని ఆస్తులలో నొండై యుండెను. 444

ఆ. అందువలన బాల♦సుందరమునకు వి,ముక్తి,కొరకు మదిని ♦ మోహనుండు
యోచనమ్మొనర్చి ♦ యారోపియను యజ,మానితోడ నిట్లు♦మాటలాడె. 445

ఆ. కోర్టుకీద్వనిన్ను ♦ గోర్కెయింతయులేదు, నీవుతోడి నరుని ♦ నెనరులేక
పందులూడగొట్ట ♦ పాడిగాదంచు గ్రహింపంగఁజాలు లేదె ♦ పాపభీతి? 446

ఆ. అతనిమీఁదనీదు ♦ హక్కుమరొక్క యైరోపియనుకు ట్రాన్సు♦రునకు నీవు
సమ్మతింపుమంతె ♦ చాలన నాతడంగుదలకు సమ్మతించె ♦ నలుగకుండ. 447

తే. అంతగాంధియు వేరొక్క ♦ యైరోపియుని, కష్టపడి బాలసుందరు ♦ కట్టుపాటు
కొప్పుకొనజేసె గాంధికి ♦ మెప్పుగల్గె, కష్టజీవులకందరి ♦ కిష్టుడంచు. 448

క. కూలిజనమ్ములతో నిటు, చాలగ సఖ్యంబు గలియ ♦ సంతసమందెన్
వాలాయమ్ముగ గాంధియు, నాలీలనొనర్చె సాయ♦ మందరికెపుడున్. 449

సీ. గాంధియాఫీసుకు ♦ కార్మికజన మెడ, తెగకుండ వచ్చిరి ♦ తెంపుతోడ
తనకడకటుల వ♦చ్చినవారి నెల్లవి, చారించి వారిక♦ష్టాలగూర్చి
తగినసాయ మొనర్చె ♦ మిగులనాదరబుద్ధి, గాంధి; యాతని పేరు ♦ గణనకెక్కె
అల్లమద్రాసున ♦ కంతనెటాలున. కష్టజీవులనెల్ల ♦ కాంగ్రెసునకు

తే. కల్గె పేరుప్రతిష్ఠలు ♦ గరిమ పెరిమె, బాలసుందరమును దల♦పాగ తిరిగి
తాల్పగా చేసె నతడు సం♦తసము చెంద, చేసె మోహను డెంత యో♦చిత్తశుద్ధి.

### మూడుపౌండ్ల పన్ను—1894

తే. బాలసుందరు వ్యాజ్యంబు♦ బానిసలుగ, బ్రతుకుభారతీయులతోడ ♦ బాంధవంబు
గూర్చె గాంధికి; వారిపై ♦ కుటిలనీతి, శ్వేతజాతి ప్రభుత్వమ్ము♦ వేసె మూడు
పౌండ్ల పన్నదిగని గాంధి ♦ పఠనచేసె తెల్లముగనెల్ల తత్పరి♦స్థితిచరిత్ర. 451

వ. 1860 వ వత్సరమున నెటాలులోని యైరోపీయు లందు చెరుకుఁబండింప దగిన వసతులుండుట గనిపెట్టిరి. కాని యితరజాతి జనముల కృషిలేక, చెరకుపండించుటగాని, చక్కెర తయారొనర్చుటగాని తెల్లవారి కొల్లని పనియని తెల్లమాయెను. ఆదేశమందలి జూలూ తెగవారుగూడ ఆపనికిఁ దగరని యెరిగి, భారతప్రభుత్వమునర్థించి భారతీయకార్మికులగొని పోవ నారంభించిరి. అటుల నెటాలున బాటువడ సమ్మతించి చనిన భారతీయులు నెటాలులో నైదువత్సరముల పాటు కృషిచేయ ననుమతిపత్రమువైన సంతకములిడిరి. అయిదేండ్లయనంతరము, వారు నెటాలున స్థిరపడి సంపూర్ణహక్కులతో స్వతంత్రభూస్వాములుగా నుండవచ్చును. భారతకార్మిక పరిశ్రమఫలితముగా నయిదేండ్లపిమ్మట తామే తమవ్యవసాయము జక్కచూచుకొనగలమని నాటినెటాలులోని తెల్లవారు తలచిరి. కాని వారనుకొన్నదానికన్న మిన్నగా భారతకార్మికులు సాధించిరి. 452

ఆ. కూరగాయలెన్నొ ♦ క్రొత్తజాతులవన్ని, పండజేసిరెంతొ ♦ ప్రబలముగను
స్థానికముగ బండు♦వాని జొక్కగబండ, నిండియను లొనర్చి ♦ రెంతొ కృషిని.

క. మామిడిచెట్లను క్రొత్తగ, ప్రేముడితోనాటి పండ్ల♦నేతెంచిరి వా
రామధురఫలములెవ్వా, రేమాత్రమైన విడుతు♦రే చవిగన్నన్. 454

క. వ్యవసాయముతో నిలువక, ప్రవేశ మొనరించినారు ♦ వాణిజ్యమ్మున్
ప్రవిమలముగ భూములగొని, నివసనముల నిండియనులు ♦ నిర్మించిరహో. 455

ఆ. కార్మికదశనుండి ♦ కష్టించిభూస్వామ్య, ధనికపథము నందు♦కొనిరి చాల
మంది భారతీయు♦లెందరో నర్తకు, లకగ వెంచి రింకి♦యానువీడి. 456

ఆ. వర్తకమున కటుల♦వచ్చి నెటాలున, సుప్రసిద్ధపటేల ♦ జూసుమైన
వారిలోన మొదటి ♦ వాడు నేటబుజేక, మొదలు పెడువాడు ♦ ప్రముఖుడయ్యె.

ఆ. అసలునిండియనుల ♦ వ్యవసాయ కార్మిక, జనము కొనుపట బిల్చు♦సమయమందు
భారతీయజనుల ♦ వాణిజ్యమై పురి, తెల్ల ... కుటుంబ ♦ తెలియలేదు. 458

ఆ. వర్తకమ్మునందు ♦ భారతీయులపోటి, పాటుపడగలేక ♦ నోటుపడిన
తెల్లజాతి ప్రభువు ♦ లుల్లంబునందున, సూయనోజనుగన♦జొలుగగై. 459

తే. జీవితవిధానములయందు ♦ చేష్టలందు, భాషగతుల,వ్యాపారలా♦భమ్ములందు
శౌచరీతులనిత్య వి♦చారవిధుల, జేసొరముబందున ♦ భిన్నులగుట
ఇండియనులపై తెల్లవా♦రెసుగొనిరి. 460

క. దొరతనము తెల్లవారల ♦ కరగతమై యుంట వారి ♦ కలుషితమతి జూ
పిరి, పన్నువేసి, హక్కుల, హరియించెడు శాసనములొ♦నర్చుచు సతమున్,

క. అధికారము తమదగుట వి,విధరీతుల నిండియనులు ♦ వేసారంగా
అదలించిరి, విదలించిరి, బెదరించిరి, చెదరగొట్టి ♦ రేయివిధములన్. 462

వ. అట్టివేయివిధానంబు లందొండు, ఆనాటి భారతదేశ రాజప్రతినిధియగు ఎల్జిన్ ప్రభువుతో రాయబారములు జరిపి నెటాలు తెల్లప్రభుత్వమువారు నెటాలున నెలకొన్న భారతీయులపై యేడాది కొక్కొక్కరు మూడుపౌండ్ల తలపన్ను చెల్లింపవలెనని శాసనమొనర్చుట. ఈ దుష్టశాసనము ననుసరించి, నెటాలులోని భారతీయకుటుంబము లొండొండు కనీస మేడాదికి 12 పౌనులైనను చెల్లింపవలసి యుండెను. సగటున మాసమునకు పదునాల్గు షిలింగులకు మించని ఆదాయముగల భారతీయకుటుంబ యజమాని పన్రెండుపౌనుల పన్ను చెల్లించుట కడుంగడు కష్టమగుటచే, నెటాలు ఇండియన్ కాంగ్రెసువారు దానిని ఖండించి, దానిని తుదముట్ట తొలగింపచేయుట కొకమహోద్యమము లేవదీసిరి. తదుద్యమము ఫలించి, పన్ను పూర్తిగా దొలగింపబడుటకు మరొక యిరువదేండ్ల కాలమును, నెటాలుభారతీయులేకాక, దక్షిణాఫ్రికాయందలి భారతీయు

లంద రేకీభవించి యెదిరింపవలసి యుండెను. ఆ మహోద్యమమునఁ బదివేల
మందికిపైగా కారాగారశిక్ష ననుభవించిరి. ఎందరో తమప్రాణముల తుపాకి
గుండ్లకు బలియిచ్చి వీరమరణ మందిరి. 463

తే. అయిన నేమాయె, తుదకు స♦త్యంబె విజయ,మందె, నడి భారతీయుల♦త్యాగఫలము
కష్టజీవుల నిత్య దీ♦క్షాఫలమ్ము, కాంగ్రెసోద్యమ సహన ద♦క్షతల ఫలము.

ద్వి. భారతీయులు వారి♦పోరాటమాపి, భీరువులై యింత♦వెనుకాడియున్న
అల్లకాంగ్రెస్సు యు♦ద్యమమాపి పన్ను, చెల్లింప తప్పదం♦చెల్లప్పుడంచు
దిటవింత సడలించి ♦ ధీరతడించి, మటుమాయముగ దీక్ష♦మాని యేయున్న. 465
దక్షిణాఫ్రిక భార♦తప్రజావళికి రక్షయై సకల భా♦రతదేశమునకు
తలవంపులుగనుండ ♦ తప్పకానాటి, తలపన్ను నేటికి ♦ గలచుచేసుండు. 469

### వివిధమత పరిశీలనము —1894-96

ఆ. ఆత్మసిద్ధివడయు ♦ టాశయమగుటచే, పాటుబడియెగాంధి ♦ ప్రజలసేవ
సేవమూలముననె ♦ దైవసాక్షాత్కృతి, కలుగగలదటంచు ♦ గాంధిమతము.

ఆ. జననిసేవబోలె ♦ జన్మదేశముసేవ, దైవసేవకన్న ♦ ధన్యుఁజేయు
మానవునినటంచు ♦ మదినమ్మిసేవాభి, మతముబూనె గాంధి ♦ మతముబోలె.

ఆ. జనని,జన్మభూమి ♦ స్వర్గమ్ముకన్న శ్రేష్ఠమ్ములంచుగాంధి ♦ జన్మభూమి
భరతమాతసేవ ♦ భవబంధమోక్ష ప్ర,సాదసాధనముగ ♦ నాదరించె. 472

ఆ. కథియవాడులోని♦కడుకుట్ర లెడబాయ, కడుపుకుడుపుకొరకు♦గడనసేయ
అరిగె గాంధి దక్షి♦ణాఫ్రికాకటతాను, వలవకుండగల్గె ♦ ప్రజలసేవ

ఆ. గాంధియభిమతమ్ము ♦ క్రమముగానిటుదేశ, సేవగాగనాత్మ ♦ సిద్ధివడయ
పాటుబడుచుమిగుల ♦ భక్తిశ్రద్ధలతోడ, దేశసేవఁగాంచె ♦ దేవసేవ. 474

ఆ. సేవమూలముననె ♦ సిద్ధించుదైవంబు, సేవయనగ సంఘ♦సేవ సంఘ
సేవ, మాతృదేశ ♦ సేవయైగాంధి కం,దాత్మసిద్ధి లభ్య♦మయ్యెనరయ. 475

సీ. క్రైస్తవమిత్రులు ♦ గాంధిని వెంటాడి, యాతనికధిక జ్ఞా♦నార్జనమున
తృష్ణగల్గించిరి ♦ దీక్షమై వాల్టను, దంపతులందు నా♦దర్శజీవు
లాడంబరము లేక ♦ ఆసక్తితోకార్య, దీక్షులుగానొప్ప ♦ దక్షులెన్న
పరమత పరభేద ♦ భావసహిష్ణుత, త్యాగబుద్ధియును స♦త్యానురక్తి

తే. మనుచు నా క్రైస్తవాప్తు లా♦త్మగలుగాంధి, మతనిరంతరచింతన ♦ మనగజేసి
రెంతపనియున్న,వ్యవధియు♦న్నంతవరకు,చదివెనతడువివిధమత♦శాస్త్రచయము.

మం. రాయ్‌చంద్ భాయికి♦వ్రాయుచు సతత,మే యనుమానమ్ము♦లెసగినమతము
గూర్చి యాతని ♦ గురిగాదలంచి, తీరిక వేళల ♦ తెలివిడిగాంచె

నర్మదాశంకరు ♦ ధర్మవిచార, మర్మిలి నంపగా ♦ నందు పఠింప
తొలిపల్కునం గవి ♦ తొలిజీవితంబు, కలుషితంబైనను ♦ గడకాతడెల్లు, 481
మతశాస్త్రపఠనచే ♦ మార్పునుగాంచె, నతులిత సజ్జనుం ♦ డౌట యెరింగి
చదివెనాధర్మ వి♦చారగ్రంథమ్ము, వదలకం డుండెను ♦ ప్రతిపేజి గాంధి. 482

సీ. మిగులశ్రద్ధం బఠించె♦ 'మేక్స్ముల్లర్' వ్రాసిన, "ఇండియాబోధించు♦నేమిమనకు"
"థియసాఫికల్ సొసై"♦టీ వారియాంగ్లికృ,తోపనిషత్తుల ♦ నోర్మిజదివె
గాంధికాపఠనచే ♦ గౌరవమొచ్చెను, హైందవ మతధర్మ♦మర్మమందు
అయిన నన్యమతము ♦ లందుద్వేషములేమి, మహమదు జీవిత♦మహిమగూర్చి

తే. చదివెనిర్వింగు కార్లైల్ ర♦చనల హెచ్చు, గౌరవము మహమ్మదుమీంద♦ నేరుపలర
పఠనగావించెజరతూష్ట్ర♦ప్రవచనముల, తెలియనాయామతమ్ముల♦గలమహిమలు

తే. ఇటులనేక మతములగు♦రించి జ్ఞాన,మార్జనమొనర్చె నందుచే ♦ నధికమయ్యె
అరయనాత్మ విచారమం ♦ దాచరింపం, పఠనచేసినవానిలో ♦ మంచివెల్ల. 484

ఆ. అటులజదివినట్టి ♦ దాచరించుట వారు, కగుటచేత గాంధి ♦ యాచరించె
చాలశ్రద్ధతోడ ♦ సరవి యోగాభ్యాస,మైన నందువిజయ♦మంద లేదు. 485

ఉ. చదివినదెల్ల నాచరణ♦శ్రద్ధగబెట్టగ నుద్యమించుచో
ఒదవునొకో జయంబు సుగు♦రూత్తము డవ్వడో లక్ష్యశుద్ధిమై
ఎదనిడినేర్పకుండునెడ ♦ నింత గ్రహించిన గాంధి యోగముం
కుదురుగ నిండియాగురులం ♦ గొల్చుచు నేర్వదలంచె నెమ్మదిన్. 486

వ. ఇంతేకాక 'ది గాస్పెల్స్ ఇన్ బ్రీఫ్' మొదలగు టాల్స్టాయిరచనల నత్యాసక్తిం జదువుటవలన గ్రమముగా మోహానుం డధికాధికముగా నంతమింతయులేని విశ్వవిశాల ప్రేమను జీవితమున నలవర్చుకొనుటకు వలయుసాధన సంపత్తిని గూర్చి గ్రహింపగల్గెను? 487

క. అటులనె మరియొక క్రైస్తవ కుటుంబసఖ్యమ్ము మిగుల ♦ గుదిరె నతనికిం
పటువాక్చతురత నవ్వా,రెటులనొ బోధింప చర్చి♦కేగె నతండున్. 488

సీ. ఆదివెస్లియను చర్చి ♦ యాదివారమునాడు, ప్రతివార మతడేగె ♦ ప్రార్థనార్థ
మారోజులందు నా♦హ్వానింపబడె గాంధి, విందుగుడువ వారి♦వీటియందు
చర్చిలోజరిగెడు ♦ సకలవిధములైన, ప్రార్థనల్ బోధనల్ ♦ భక్తిరహిత
రిక్తోక్తులుగనుండె ♦ ముక్తసరిగ గూడు, చుండికందాచార♦ముండుకతన

తే. తూగుబోతులుకొందరు ♦ వాగుబోతు,లెందరో యుండిరందున ♦ గాంధియొక్క
డైన నిటువంటిచోటుం ♦ గనుగు వేల, కాలమును వ్యర్థమొనరింప♦నేలయనుచు
నాపివేసెను ప్రార్థనల్ ♦ కరుగు టెల్ల. 489

సీ. చర్చికి జనులెల్ల ♦ చాలించినను బ్రతి,యాదివారము విందు♦కరుగుచుండె
ఆకుటుంబములోని ♦ యందరితో మత,చర్చలఁబాల్గొన ♦ జనుచునుండె
నాడుమోహనుడు నా♦ర్నాల్డు"లై టాఫేషి,యా"తిర్గిచదువుచు♦న్నందువలన
ఒకనాటిచర్చిలో ♦ నుత్సాహమున నేసు, గౌతములం బోల్చి ♦ గాంధిపల్కె
తే. ఏకమనుజజాతి ♦ యెడలమాత్రమెకాక, అఖిలజీవరాసి ♦ యందుగరుణ
ఎనయమనియె బుద్ధుఁ♦డే సన్ననోయెుక, మనుజ జాతినె సభి♦మానముంచె. 490

ఆ. అనుచుగాంధి వాద♦మాడఁగా నదివిని, గృహిణి చాలకోప♦గించుకొనుట
కాంచిమార్చిపై చె ♦ గాంధివిషయమెల్ల. అపలవిందుగుడువ ♦ నరిగిరెల్ల.

ఆ, విందులోన గృహిణి♦నందనుఁ డోకఁడై, దేండ్ల చిట్టికుఱ్ఱ ♦ యెపుడు గాంధి
తోడనుండు నాట♦లాడుచుఁ బాడుచు, గాంధిసన్నిహితుడు ♦ గరమునయ్యె.

తే. గాంధిసరసనె కూర్చుండ♦విందుగుడు-చు, బాలకుని పళ్లెరములోని♦పలలమరసి
నిరసనంజేసి తనతట్ట ♦ నిండనున్న, ఆకులు ఫలములం గొని♦యాడెఁజాల. 493

తే. ఆ యమాయక బాలకుఁ♦డాఁకించి, గాంధిపలుకుల నాపిళ్ళ ♦ ఘనతబొగడె
తల్లియుల్లమ్ము మాత్రము ♦ తల్లడిల్లె, అంతమార్చెను నా విష♦యంబుగాంధి.

క. మరువారమును మామూలుగ, సరిగెన్మోహనుడు విందు♦కాయిల్లాలి
ట్లరయగబలికెను గాంధికి, సరిసరి నీసఖ్యమింక ♦ చాలించవయా, 495

క. నిత్యము నీవాదమ్మే, సత్యమనుచు, బలఁమింత ♦ సాపడకుండెన్
నిత్యంబీగతి డిన్నర్, సత్యముగా వానిమేను ♦ సన్నముగాదే. 496

క. కాన న్నీవాదములిక, మానుము బాలకులతోడ ♦ మాతో మాత్రం
జే నీవాదము లీకనని, పోనాడక బడులువలికె ♦ మోహనుడిటులన్. 497

క. నేనాడు పలుకుకన్నర్, నేనేమి భుజింతుఁ, దినక ♦ నేవిడిచెదనో
ఆనారీతి ప్రభావమె, మీ నిసుగుకు గల్గుగాన ♦ మీయింటికికన్. 498

క. మేలగుఁగాకుండుటయే, మేలుగ నీ బిడ్డతిండి ♦ మీవాడుకమై
ఈలీలవెఁయుగావుత, గ్రాలుచు నునమైత్రియెల్ల ♦ కాలమువిడకన్. 499

వ. అని మోహనుడు పలుక నా గృహిణియు మంచిదనెను. 500

గృహస్థజీవితము—1894-96

సీ. బొంబాయిలండను ♦ పురవాసముకు భిన్న,ముగ నెటాలు నివాస♦మున ననుభవ
మయ్యెగాంధికి ప్రతి♦ష్ఠార్థమెక్కువగ కొ,ల్పింపవలసివచ్చె ♦ తెంపుతోడ
భారతదేశపు ♦ బారిష్టరుపదవి, కనుగుణంబైన బే♦రందినట్టి
ప్రాంతమందున చిన్న♦ప్రాసాదముంగొనె, నందమైనట్టిది ♦ నరసి వరుస
తే. ఆటగృహోపకరణములం ♦ డిటవుగలుగ, గాంధినెలకొల్పెసంసార♦మందుభోజ
నము సిరాడంబరంబైన♦ప్రముఖులకును, స్వాగతంబిచ్చుకతనవె♦చ్చంబుహెచ్చె.

ఆ. ప్రతికుటుంబమందు ♦ పరిచారకుడొకండ, నళ్ళముగను నుండ ♦ వలయునైన
ఎరుగడించుకంత ♦ యొంచి మంచి మనుజు, నుంచుకొనగ గాంధి ♦ యూడిగమున.

తే. తోడుసీడగ నొక్క మి ♦ త్రుండు వంట, మనిషి యొకడుండె నాకుటుం ♦ బమ్మునిషి
కరణి; మోహను నాఫీసు ♦ క్లార్కులకును, గ్రాసము నివాసమెల్ల నా ♦ వాసమందె.

ఆ. తోడిసఖుడు గడుసు ♦ వాడును గపటియు, నగుటదన్ను నమ్మ ♦ నటునటించె
మోసకారియగుచు ♦ మోహనుఁ బతని కూ, తలనునమ్మి గాంధి ♦ తప్పొనర్చె

ఆ. క్లార్కొకని పైనఁ ♦ గడుసీసు చేఁజెప్పె, కొండెములను నా స ♦ ఖుండు గాంధి
నమ్మనంత క్లార్కు ♦ నమ్మిక చెడగని, అందునుంట దగద ♦ టంచు నేగె. 505

ఆ. ఆతండేగిన యాతరు, వాత విచారించె గాంధి ♦ స్వాంతమతసిక
ప్రీతినొనర్చితినే నని, నీతిననుచు వగచెగాంధి ♦ నెమ్మదిలోనన్. 506

మం. ఇటులుండ సెలవుపై ♦ యేగెను 'కుక్కు,' క్రొత్తగా వేరొక్క ♦ కుక్కు యేర్పడెను
ఆతడు సౌమురి ♦ పోతంచు పేరు, వడసిన నేమాయె ♦ వచ్చిన రెండు
మూణాళ్ళలోపల ♦ మోహను డాసి, ఆఫీసునందు మ ♦ ధ్యాహ్నంబు వేళ
త్వరగ నింటికి రండు ♦ తా యమొకండు, జరుగుచున్నదిరండు ♦ నరయగా రండ
టంచుఁదొందరవెట్టి ♦ యతని గొంపోయి, మేడపైకచ్చటి ♦ మిత్రుని గదిని
చూపి జరుగుచుండె ♦ లోపల జూడుమని తొందరింపగా ♦ నంతట గాంధి
తలుపుపై కొట్టగా ♦ బలుమారు తలుపు, తెరవగా గనెనొక్క ♦ తెరవతో సఖుని
ఇరువుర నందుండి ♦ యిలువీడవంపె, పోలీసుకిత్తు రి ♦ పోర్టంచు బెదర. 514

సీ. ఈసంఘటనచేత ♦ హెచ్చరింపంబడె, మోహనుండెట్టి వ్యా ♦ మోహములకు
లోనౌట తగదను ♦ నానుడి జీవిత, సత్యంబుగాగ నా ♦ చరణమందు
నమ్మిక చేగల్గు ♦ నమ్మకమ్మని నమ్మి, నమ్మిత్రునిఁ గాంధి ♦ నమ్మియుండ
వమ్ముగా దననమ్మ ♦ కమ్మెల్ల నాతఁడా, తని కడుదుష్ప్రవ ♦ ర్తనము చేత. 515

తే. ఆగ్రహింపగ జేసె ఖాం ♦ తావతారు, గాంధినీయనుభవము ని ♦ గ్రహము చెడగ
పనులు మంచివెయ్యైన సా ♦ ధనము లెవ్వి, చెడువి కాగూడదను సుషి ♦ యొడద దెలియ.

ఆ. క్రొత్త 'కుక్కు' చెప్ప ♦ కున్నచో సత్యమ్మె, పంగకుండు. దుష్ట ♦ సంగమప్ర
భావమునను మాయఁ ♦ బడుటచే నిస్సంగ, జీవితంబు రంగు ♦ జెడగనకట! 516

తే. అయిన దైవమె 'కుక్కు'గా ♦ నరుగుదెంచి, తగినతరుణమ్మునందున ♦ దప్పుగాచె
తప్పులుండిన గాచుచు ♦ దప్పకుండ, దైవమెప్పుడు సద్భక్త ♦ తతిని విడక. 517

శా. ఉద్దేశమ్ముల బుద్ధిశుద్ధమయినీ ♦ పున్నం బొసంగల్ విధుల్
అద్వైతమ్ము సహాయమబ్బుఁదరుణం ♦ బందా సఖుప్రేరణన్
బుద్ధిందప్ప గుమస్తకుం జరిగె సం ♦ పూర్ణంబుగా ద్రోహమం
చద్దిం బాపగ గాంధి చేసెను వృథా ♦ యత్నంబు చింతింపుచున్. 518

## గృహోన్ముఖుడగుట—1896

చ. కడచెను వత్సరత్రయము ♦ కాలము మోహనుడాత్మదేశముం
విడిచియు దక్షిణాఫ్రికకు ♦ విజ్ఞతవచ్చి ప్రజానురాగమున్
పడసి తదీయసేవ ఘన ♦ బంధురకీర్తి గడించి వృత్తిలో
గడనయు హెచ్చుగా మదిని ♦ గాంతయు బిడ్డలునాక్రమింపగాన్. 519

క. పదునెనిమిది వందల తొంబది యారవ యేట నింటి♦పయనమ్మునకిం
పొదవగ ననుమతినేడె స్వహృదయత మోహనుడు సన్ని♦హితులకు హితులన్.

తే. ఆరుమాసమ్ము లిండియా ♦ కరిగియందు, దక్షిణాఫ్రికలో భార♦తప్రజాళి
పడెడు యిడుమలగూర్చి తె♦ల్పంగ స్వీయ,దేశనాయకులకు గాంధి♦తివిరిబూనె.

సీ. మూడుపౌనులపన్ను ♦ వీడకమాయని, గాయమ్మువలె బాధ♦గల్గజేయ
అద్దానిరూపు మా♦యగ, బూర్తిగా రద్దు, చేయించినంగాని ♦ చిత్తమందు
శాంతిగల్గదు రేయిం ♦ జక్కగా గంటికి, నిండుగా రాదెప్డు ♦ నిద్రయంచు
తలపోసి మోహనుం ♦ డామాతృదేశమం, దలజడి లేవనె♦త్తంగవలయు

ఆ. బహుముఖ ప్రచార ♦ మహామహమ్మొనరించి, ప్రజలతోడం బల్కు♦బడిగడించి
ఇండియా ప్రభుత్వ♦మే దక్షిణాఫ్రికా. యిండియనుల సాయ ♦ మెంచిచేయ. 522

వ. ఇటుల దలపోసి మోహనుడు, దక్షిణాఫ్రికాలోని భారతీయులగూర్చి భారత ప్రజలకుం దెలియ ప్రచారమొనర్చుటకును, తనపెండ్లాము బిడ్డలను దీసికొని వచ్చి నెటాలున స్థిరముగా నెలకొనుటకును, నారునెలల కాలము మాతృదేశమునకేగ సమకట్టెను. తాను లేనపుడు, తానుమామూలుగా జేయుపనుల నొనర్ప గల మిత్రుల సంఘమును నియమించెను. అందులో కాంగ్రెసు కార్యక్రమము చక్కజూచుటకు 'ఆడాన్జిమియాఖాన్' ఎడ్యుకేషన్ సొసైటికి సంబంధించిన పనులొనర్ప పార్సీరుస్తోమ్జియు నియమితులైరి. తరువాత 1896 జూన్ 5 వ తేదిన కలకత్తాకు బయలుదేరిన, పొంగోలా అను నౌకయందు గాంధి పయనించెను.

సీ. నౌకయందున ప్రయా♦ణీక బృందము కొద్ది,యై యుండె యందిర్వు♦రాంగిలేయు
లాఫీసరులు, గాంధి ♦ యందునొక్కనితోడ, నాడెను జదరంగ ♦ మనుదినమ్ము
షిప్పుడాక్టరు 'టమిల్-సెల్ప్టీచరు' నొసంగె, తమిళమ్ము నేర్వమం♦చమలమతిని
అలనెటాలున గాంధి ♦ యనుభవమ్మున నెర్గె, ఉర్దు తమిళభాష ♦ లుచితరీతి

తే. గరవవలె ముస్లిముల జెన్న♦పురి జనాళి, గూడిమాటాడుటకని తన♦తోడనౌక
డెక్కునంబయనించెడు♦నొక్క ఉరుదు,మూన్షి కడనేర్చె ఉరుదును♦మోహనుండు.

సీ. నేరిచెం దమిళమ్ము ♦ నేర్పమైడాక్టరొ,సంగిన పొత్తమ్ము ♦ సాయపడగ
ఈశతనమ్ముల ♦ నోపికసాగింప, నెంచెనాతడు చేరి ♦ యిండియాను
కానిప్రజానీక ♦ కార్యంబులంబడి, వదలె భాషాభ్యాస ♦ వాంఛలెల్ల

తే. బందియందున గాని యా♦భాషలందు, మాటలాడఁగఁ బూర్తిగా♦నోటువడియె
గాంధియభ్యాసమంతగా ♦ గామిజేసి, కూసువిద్యయె కాదె య♦భ్యాసమెన్న

సీ. తెలుగు తమిళములు ♦ దెలియమి గాంధికి, ప్రతిబంధకమ్ముగా ♦ బరిణమించ
తెలుగుమిత్రులును ద♦మిళసఖులనుగన్న, వారితో మాటాడ ♦ వాంఛదగులు
దక్షిణాఫ్రికయందు ♦ దనతోడ స్వార్థమ్ము, త్యజియించి పోరాడి♦నట్టి తెలుగు
తమిళమిత్రాళి చి♦త్తమ్మునదగిలి యార్ద్రమ్ముగానెడద మో♦హనుడు దలచు

తే. అల్లవారాడ మగవార♦లెల్ల చదువు,రానివేద లమాయికు♦లైన, వారి
యుల్లములు కొల్లగొనెగాంధి♦కల్లకపట, ముల్లని మహాత్ముడగుటచే♦ మొదటినుండి.

ఆ. వచ్చిరానియట్టి ♦ వారిహిందుస్థాని, ఆంగిలేయబాసె ♦ ఆసరాగ
కడిమిదక్షిణాఫ్రి♦కాయందు వారికై, గాంధి పోరెనెదలు ♦ కలియుకతన. 527

ఆ. అయినవారలసహా ♦ జానురాగమునకు, ప్రతిఫలముగవారి ♦ భాషతెలుగు
తమిళమెంతొ నేర్వఁ ♦ దపియించె మోహనుం, డైన గరవజాల♦డయ్యెఁజాల.

ఆ. తెలుఁగుతమిళములను ♦ దెలియమిచేగాంధి, కోరె ద్రావిడులను ♦ నేరువంగ
హిందిమాటలాడ ♦ నింగ్లీషుప్రతిబంధ,కమ్ము గాదటంచు ♦ గాంధివాణి. 529

ద్వి. ఈరీతిభాషల♦ కూరిచి తలచు, చారసి నౌకాధి♦కారి సఖ్యంబు 530
గడియించి, యతనితో ♦ గాంధిసాగించె, వడిమతనైతిక ♦ వాదముల్ పెక్కు
నీతిపేరుననెట్టి ♦ నిర్బంధములకు, ప్రీతివహింపఁడా ♦ 'ప్లిమతు' సోదరుడు
ఏసుత్యాగమున వి♦శ్వాసమేయున్న, దోసాలనదియెల్ల ♦ తొలగింపగలదు
సృష్టించె శాకముల్ ♦ మృగములనొక్క, స్రష్టయే మానవ♦జాతి సౌఖ్యమున
కనుచునేకైక శా♦కాహారియగుచు, మనుటేలయనుటె, యా♦తని మతమెన్న
మత నీతులకు భేద♦మావంతగాంధి. మతమున లేదట్లు ♦ మసలిరివారు.

— ఇండియాలో 1896 —

క. ఇరువదినాలుగు దినము, లరిగిన మరునాడు హుగ్లి♦యంవమ్మునకు
న్మరియగమది కలకత్తా, పురమున నడుగిడియెగాంధి ♦ మోదంబొదవన్

క. కలకత్తానగరమ్మున, నలయక బొంబాయి కపుడె ♦ యరిగె బయనమై
నిలువగ ప్రొయినట మోహను,డలహాబాదందు నలువదైదు నిమిషముల్. 538

ఆ. పురము జూడఁబోయె ♦ మోహనుడాస్వల్ప, కాలమూరకుండ ♦ నేలయంచు
అలకెమిష్టుషాపు ♦ నందుమందునొకండు, గొనుటకొరకుగూడ ♦ జనెనతండు.

ఆ. ఔషధములగలుపు ♦ నాతడాలస్యమ్ము, సలుపు కతనగాంధి♦సమయమునకు
తిరిగియరిగివేగ ♦ ప్రొయినందుకొనలేక, అలహాబాదునందె ♦ నిలిచిపోయె. 540

క. అలహాబాదునఁ బేరుం,గలిగిన పయనీరు పత్రి♦కాధిపతిం దా
కలిసికొని తనమనమ్మున, కలది తెలిపె దక్షిణాఫ్రి♦కా తెరగెల్లన్. 541

క. ఆపత్రిక ప్రచురించిన, దే పిదపనెటాలునందు ♦ తెల్లజనముగాం
ధీపని బట్టగకారణ మై పలుబాధలకు బలిగ ♦ నయ్యెనతండున్. 542

క. పయనీరుపత్రికాపతి, నయసంభాషణము పిదప ♦ నతవినమితుడై
ప్రియమున నేగె త్రివేణి న, రయగా నావెనుకపనుల ♦ క్రమముదలంచెన్. 543

సీ. నిలువక బొంబాయి ♦ నిక రాజకోటకు, నేరుగా జనియె నా ♦ నెలను దొమ్మి
దవ తేదిజేరెను ♦ దారాసుతాదుల, జూడగా నోడక ♦ పాడిమెయిని
దక్షిణాఫ్రిక భార ♦ త ప్రజగోడుగు రించి పాంప్లెటు ప్రచు ♦ రించెనొండు
ఆకరపత్రిక ♦ కట్ట పచ్చగనుంట, గ్రీనుపాంప్లెటటంచు ♦ గీర్తిగాంచె
దానియందలిభావ ♦ లోని భావమ్ములు, కానలేనియునే ♦ కడుమితములు

తే. గాగ వడిసంతరించెను ♦ గాంధి దాని, దూరమునసుండి వినఁజెవి ♦ దూరునట్టి
దెల్లయునపోహ పడనెడ ♦ మిచ్చి చిలువ, పలువలుగ నెంచబడునంచుఁ ♦ బలచెగాంధి.

మ. పదివేలప్రతులచ్చు వేయబడియెన్ ♦ బంపంబడెం బత్రికా
బుధ సందోహము, భారతావని ప్రజా ♦ పూజ్యుల్ మహానాయకుల్
చదువన్ సర్వజనమ్ము పయొనీర్ ♦ సంపాదక వ్యాసమున్
మొదటన్ వ్రాసెఁ దదీయ సంగ్రహముకే ♦ బుల్ జేరెనింగ్లాండుకున్. 545

క. ఆసంగ్రహ సంగ్రహమిం, తే సిగ్గిలకుండ బంపెఁ ♦ దివిరి నెటాలా
ఫీసుకు లండన్ రాయిట, రీసున్ రోసమును బెంచు ♦ టింతదలపకన్. 546

క. కడకు నెటాలుకు బంపం, బడినపు డా సంగ్రహమ్ము ♦ పంక్తిత్రయినిం
జెడి యసలుగాంధి నుడులకు, నడిచప్పుడుటొదవ జేయు ♦ సంగ్రహమయ్యెన్. 547

ఆ. పేరుబొందిన ప్రతి ♦ పేపరా విషయమ్ము, గూర్చి వ్యాఖ్యవ్రాసె ♦ గొంకుజంకు
వీడిలోకమునకు ♦ వెల్లడిగా నెల్ల, వారి దుష్టచేష్ట ♦ లారడి నడ. 548

ఆ. అలనెటాలు యిండి ♦ యనులెట్టికడగండ్ల, పడెదువారొ తెల్ల ♦ వారివలన
ఆవిధమ్మదెల్ల ♦ నఖిలసభ్యప్రపం, చమున కెల్ల దెలిసె ♦ సడిగ వడిగ. 549

సీ. కరపత్రములనెల్ల ♦ కడలకంపెను గాంధి, న్యాయము దక్కు వయగు ♦ నట్లుఁదనదు
వీధిలో నివసించు ♦ విద్యార్థులందరు, ఉదయాస్తమయముల ♦ నొండురెండు
గంటలకాలమ్ము ♦ ఘనబుద్ధి బడిలేని, యదనున దనకు సహాయపడగ
పోస్టుముద్రలవి స్టాం ♦ పుల వారికొసగెను, ప్రతిఫలమ్ముగ వారి ♦ పనికిమెచ్చి

ఆ. అదియె మొదటిగాంధి ♦ యనుభవమ్మన నలం, టీరులుగను బాల ♦ వీరగముల
గూర్చుటట్టివారి ♦ గొప్పవారగువారి, యందు గాంధిమిత్రు ♦ లైరిరువురు. 550

వ. ఇట్టి గ్రీనుపాంప్లెటొదంతమంతయు రాజకోటయందు 1896 ఆగష్టు 1 వ తేది నారంభమై 19 వ తేదికి ముగియ నాడు గాంధి బొంబాయిలోని రాజకీయనాయకులంగలయ నేగెను. ఆనాటికే బొంబాయినగరమున బొబ్బలవ్యాధి విజృం

ఖించుటవిని రాజకోటకావ్యాధి వ్యాపింపకుండునట్లు రాష్ట్రప్రభుత్వానుమతిని దదీయారోగ్య శాఖాధ్వర్యమున శానిటరీ విజటర్సు కమిటి యొకటి రాజకోట నగరమందలి యారోగ్యపరిరక్షణార్థమై యేర్పడెను. గాంధియు నాకమిటియం దొక సభ్యుడైయుండెను. ఆనగరమందలి మరుగుదొడ్లపరిస్థితిని చక్కబెట్టి ఆరోగ్యరక్షణ గావించి వ్యాధివ్యాపకము నరికట్ట సంకల్పించెను. నగరమం దన్ని వీధులందును పేదలు, ధనికులను భేదములేకుండ నగరవాసుల గృహ ముల నన్నింటిని పరీక్షింప సభ్యులరిగిరి. అందలి విచిత్రమేమన, పేదలు, కమిటీసభ్యులఁ దమగృహపరీక్ష కాహ్వానించి, వారిసలహాలఁ బాటించి, మరుగు దొడ్ల బాగుపరిచిరి. ధనికులన్ననో లేనిపోని యాక్షేపణలు దెల్పి, కమిటీవారి సలహాలను జెడచెవి నిడిరి. 551

సీ. ప్లేగాదివ్యాధులు ♦ విస్తరించుటకెల్ల, పారిశుద్ధ్యములేమి ♦ కారణమ్ము
పరిశుద్ధిలేమికి ♦ మరుగుదొడ్లందలి, అపరిశుద్ధస్థితి ♦ లరయ కతము
మరుగుదొడ్లట్లుంట ♦ మలమూత్రముల విసర్జనపద్ధతులు తప్పు♦పరణినుంట
మీఁదుమిక్కిలియందు ♦ మిగులచీకటిగ్రమ్మి, గాలివెల్లువలులేమి ♦ కారణమ్ము
తే. కానమోహనుడారోగ్య ♦ కమిటిసభ్య,
డగుచుమలమూత్రముల బకె♦ట్లందునిడుడు
మరుగుదొడ్డికి వెలిగోడ ♦ మధ్యనెత్తి, గోడబెట్టకగాలి వె♦ల్గులకుదారి,
నిండటంచును నుపదేశ ♦ మిచ్చెనిచ్చ. 552

తే. కమిటిసభ్యుల సలహాల ♦ గౌరవించి, రనుసరించిరి చెప్పిన♦యట్లు పేద
వారలైనను ధనికులు ♦ వారిమాట, దాటవేసిరియేదో ఆ♦దాటుగాను. 553

సీ. హరిజనవాడల ♦ కరుగుటకొకగాంధి, మరియొక సభ్యుడే ♦ యరుగఁజాలి
రితరులువెనుకాడి ♦ రేగనచోటికి, కానిగాంధికియందె ♦ కనులవిందు
గూర్చె వారల కూళ్ళు ♦ గోమయమ్మున పరిశుద్ధములగు చెల్ల♦చోటులందు
కుండలుమూకుడుల్ ♦ గొంచమైనను బరిశుభ్రముగానుండె ♦ శోభిలుచును
ఆ. మరుగుదొడ్లులేవు ♦ మురుగుకాల్వలులేవు, పెద్దజాతివారి ♦ మిద్దెలందు
నుండుకంపులేదు ♦ ఉన్నంతవరకెల్ల, కనులవిందుగూర్చె ♦ గాంధికందు. 554

ఆ. అదియెమొదటి తూరి ♦ హరిజనవాడ దర్శనమొనర్చు టతని♦బ్రతుకునందు
కానియదియెయయ్యె ♦ గాంధికి బ్రియతమ, వాసముగను నెల్ల♦వాసరముల.

క. అందరియిండ్లకు బలెహరి, మందిరమునకుం జనిరి కమిటి ♦ మానవులబ్రం
బందిరిచూడగ నచ్చట, నందరు విందులనుగుడుచు ♦ నాసులువేయన్. 556

క. నాకగ నాయాకులనట, కాకులు గ్రద్దలును సకల♦కాలములందున్
మూకగ వ్రాలుచు నోలుచు, చీకుచు నుండంగ గాంచ♦జిత్రంబయ్యెన్. 557

ఉ. అచ్చుకు డాస్థలంబు నెపు ♦ డంతకు ముందరయంగ లేదు తా
నేర్చిన యట్లొనర్చుటయె ♦ నిత్యవిధిం జరియించుచుండె నే
మార్చుచు నెల్లవారలను ♦ మంచితనమ్ముగ లోకవిజ్ఞతన్
కూర్చెద మీరు చెప్పనను ♦ కూలములం చొడగూర్చె హర్షమున్. 558

తే. దైవతాపూజ లొనరించు ♦ స్థలము లెల్ల, నుంపవలయు బవిత్రస్థ♦లోచితముగ
ఆయురారోగ్యసూత్రమ్ము♦లన్ని స్మృతులు, పలుకుగతినవలంబింప♦వలయునంచు

క. బహిరంతర పరిశుభ్రత, బహుధా సర్వత్ర వరుస ♦ బాటింపవలెన్
గృహముల గుడులందను నుడు లహరహముం బల్కె గాంధి ♦ యందరికెందున్.

— రెండు చిత్తవృత్తులు — 1896 —

ఆ. గాంధిసహజపత్యం ♦ సంధుండగుటచేత, రాజభక్తితో వి♦రాజిలె సత
తాంగ్లపాలనమున ♦ నాంగ్లరాజ్యాంగమ్ము, యెడల నెల్లయెడల ♦ సడలకుండ.

ఆ. కుటిలనీతి కపట♦నటనల నెటుపంటి, సంఘటనల గాంధి ♦ చనడు రాజ
భక్తియొకటె గాంచు ♦ రక్తినే ధర్మమా సక్తిబూని చేయు♦ముక్తిదముగ. 562

సీ. గాంధినెటాలున ♦ గలయగూర్చెడు సభ, లందెల్లెడల బాడు♦టాంగ్లదేశ
గీతమ్మువాడుకై ♦ ఖ్యాతిగాంచెను బ్రీతి, గాంధియునందున ♦ గలసిపాడె
ఆంగ్లపాలనలోని ♦ యవగుణాలెరిగిన, తలచె మోహనుడు ♦ మొత్తమ్ముపైన
ఆరోజులందదే ♦ యఖిలప్రజాళికి, మంచిదం చాతని ♦ మానసమున

తే. దక్షిణాఫ్రికవర్ణ భే♦దమ్ములెల్ల, ఆంగ్లసాంప్రదాయవిరుద్ధ ♦ మనుచు దలచె
అల్పకాలికప్రాంతీయ ♦ మనుచునమ్మె, ఆంగ్లజనములకన్న న♦త్యధికభక్తి
తోడజాతీయగీతమ్ము ♦ పాడనేర్చె. 563

క. డంబములేకంత నిరా, డంబర సందర్భములం బ♦టాటోపము లే
కింబుగ బాల్గొనె నాగీ, తంబుల బాడంగ గాంధి ♦ తత్పరమతియై. 564

సీ. తనరాజభక్తి స్వా♦ర్థమ్మునకుంగాని, లాభేచ్ఛగాని ప్ర♦లోభబుద్ధి
ఎపుడుపయోగించు ♦ టెరుగడు మోహనుం, డే ప్రతిఫలము వాం♦ఛింపడెపుడు
ఆంగ్లేయులరాజ్య ♦ మందలి పౌరుడై, దనరుట విధ్యుక్త ♦ ధర్మముగను
మదినెంచి మనసార ♦ మలమక పొలయక, తరుచు జాతీయ గీ♦తంబుపాడె. 565

తే. వడిస్వరానుగుణమ్ముగా♦బాడనేర్చె, లయనిబద్ధముగా గాంధి♦నియమమొప్ప
రాజభక్తియెల్లెడలందు♦బ్రాకటముగ, మోహనుడు సర్వవేళని♦ర్మోహుడగుచు.

సీ. రాణి విక్టోరియా ♦ రత్నోత్సవమున కే, ర్పాట్లు నాయకులొన♦ర్పంగ నియమి
తంబైనకమిటి యం♦దింబుగా జేరెను, మెంబరుగా గాంధి♦మిత్రుల బ్రీతి
కానిసందేహించె ♦ గాంధియా యేర్పాటు, లన్నియు గపట నా♦ట్యమ్ములనుచు
నైనను దనధర్మ ♦ మూనిచేయగనెప్డు, వెనుకంజ వేయని ♦ విజ్ఞుడగుట

తే. అందరింబోలెగాక మో♦హనుడు దాను, నాటి సందర్భమందున ♦ నాటినట్టి
చెట్టుకెల్లపు శ్రద్ధతో ♦ చెడకనుండ నీరుపోసియు బెంచెను ♦ నిర్మలముగ. 567

సీ. ఇచ్ఛకాలకుగాక ♦ మెప్పుకోలుకుగాక, కపటనాటకముల ♦ గానుకాక
మనసా మంచిదం♦చును నమ్మినట్టియే, పనిబూర్తి విశ్వాస♦మునఁనొనర్చె
నిష్కపటమ్ముగా ♦ నీతినిజాయితీ, లొప్పగా జరియించె♦నోర్మితోడ
మాయలమారిగా ♦ మసలకెప్పుడును ద,గాకోరుగా గాక ♦ గాంచెకీర్తి
విధ్యుక్తధర్మమం ♦ చుదగ్గమించిన రొట్టి, కార్యములే తుదముట్ట♦గా నొనర్చు

తే. గాంధి, ఘనసద్గుణానేక ♦ గంధి, సత్య సంధుడై నేర్పెనట దన♦పంతుకెల్ల
ఆంగ్లజాతీయగీతమ్ము ♦ నటులె స్థాని, కమగు కాలేజి విద్యార్థి ♦ గణముకెల్ల.

తే కానితన యహింసాభావ ♦ సూనరాజి, క్రమముగా వికసించి, ప♦క్వముగుకొలది
ఆంగ్లగీతమందున్న హిం♦సాప్రబోధ, వచనములగాంధి నిరసించె ♦ వాయినిడగ.

మం. పగతుల చెరగంగ ♦ పతన మందంగ, కలవరంబంద వా♦రల రాజనీతి
చాతురి, వారి మోస♦పు యుక్తులెల్ల, భంగమందగ నను ♦ వాక్యముల్, తన య
హింసాప్రవృత్తికి ♦ హేయమ్ములయ్యె, వైరులందరు మోస♦కారులంచెట్లు
పలుకగా నొప్పును ♦ పగతురైనంత, తప్పువారిదెయంచు ♦ జెప్పనెట్లొప్పు
న్యాయంబుమాత్రమె ♦ యర్థింపగలము, దైవమునైనను ♦ దయనిమ్మటంచు
తలచిమోహనుడు పా♦డగనోడెవాని, డాక్టరు 'బూతు' గూ♦డా గాంధిభావ
ములనె సమర్థించె ♦ వెలయ మరొండు, నూతనజాతీయ ♦ గీతి రచించె
తనగోష్ఠులందు పా♦డంగ దలంచి. 577

సీ. రాజభక్తినిబోలె ♦ ప్రజలందు సఖులైన. క్రొత్తవారైనను ♦ గూడవారి
పరిచర్యసేయుట ♦ పరగమోహనుని రెం,డవస్వభావగుణమ్ము ♦ సువిదితముగ
గణితశాస్త్రిక ప్రజో♦పంతమ్ము వినిపింప, బహిరంగసభల గూ♦ర్పంగనోరి
బొంబాయిపురికేగ ♦ మోహనుండటదన, సోదరిపతి వ్యాధి♦గ్రుక్కియుండ. 577

తే. ఆరక్షి సోదరితోగూడ ♦ నతనిరాజ, కోటకుంజేర్చి యేలాటి ♦ లోటువడని
రీతిపరిచర్యజేసె సం♦ప్రీతితోడ, నతడుమరణించు వరకు న ♦ నారతమ్ము. 578

క. సేవాభిలాష రోగుల, సేవగ రూపొంద గాంధి ♦ చేసెం దనస్వ
భావిసుగుణప్రేరణ, చే వివిధావస్థలందు ♦ సేవలప్రీతిన్. 579

క. విడవాడు స్వకార్యమ్ముల, విడువక రోగులకుసేవ ♦ విధిగా జేయన్
పడతిం బరిచారకులన్, తడయక నియమించుగాంధి ♦ తత్పరమతియై. 580

ఆ. ఇష్టసేవ సేయు♦టంత వృథాయగు, నద్ది ప్రీతితోడ ♦ నాచరింప
కున్న, పరుల మెచ్చు♦కోలునకో లోక భీతిచే 'చలో చేయ ♦ నీతిజెడును. 581

ద్వి. అంతపంబునఁజేయ ♦ జాలనిసేవ, నింతైన సత్ఫలం♦బనగదు, సేవ
చేయువానికిగాని ♦ సేవలనొనెడు, యాయవరునకైన ♦ గవనీతలము

అన్యసంతోషమ్ము ♦ లాస్తిపాస్తులును, ధన్యుజేయగలేవు ♦ ధరసంతసమున
నొనరించుసేవచే ♦ గనెడుధన్యత్వ,మునకెనగావెట్టి ♦ వనయభాగ్యములు. 585

—— బొంబాయి సమావేశము ——

తే. పచ్చపాంప్లెటును దయారు♦పరుచు కాల మందొకప్పుడు బొంబాయి♦కరిగె నత్య
వసరకార్యార్థమైయప్డు ♦ ప్రజలనాయ,కులనుమాటాడగాగాంధి♦కలసికొనియె.

సీ. దక్షిణాఫ్రికభార♦త ప్రజోదంతంబు, భారతావని పుర♦ప్రజకు దెలియ
బహిరంగసభల గూ♦ర్పగనెంచి బొంబాయి, నగరమందలి ప్రజా♦నాయకులను
కలసిమాట్లాడగాఁ ♦ దలచి జస్టిసురేన, డేని సందర్శింప ♦ జ్ఞానియతడు
సర్ ఫిరోజ్ షామెహ్తా ♦ సందర్శనముచేసి, కొనుమంచు, గాంధిచె♦ప్పినదియెల్ల

తే. శ్రద్ధగావిని సఃహా యొ♦సంగె న్యాయ,
మూర్తి బద్రుదీన్‌త్యాబ్జియు ♦ మోహానునికి
తెలిపెనంతయునట్లు గాం♦ధియును గలసి,
కొనియె గ్రగణముగ మెహతాను ♦ గూడ వేడ్క. 587

మం. బొంబాయినగరసిం♦హంబు, కిరీట, రహితరాష్ట్రప్రజా ♦ రాజన బిరుదు. 588
లంది వెల్గొందెడు ♦ నాఫిరోజ్ షాను, కలయగా నాతండు ♦ గాంధిని వయసు
వచ్చినసుతుబోలె ♦ మచ్చికమెయిని, స్వేచ్ఛసంభాషించె ♦ షాచ్చెమ్ము వీడి.

క. తనసఖుల వాచ కామా,లను గాంధికి పరిచయమ్ము ♦ లౌకకరీతిఁ
బొనరించి గాంధిచెప్పగ, వినెయెల్లంబలికె మెహత ♦ వివరముగాగన్. 591

తే. గాంధినేసాయ మొనరింప♦గావలయునువలయుబహిరంగసభనుగూ♦ర్పంగవలయు
ననుచుదనకార్యదర్శియై♦నట్టి మూన్షి,కనియె నిర్ణయమొనరింప ♦ దినముసభకు.

తే. సభకుదిననిర్ణయంబెల్ల ♦ జరిగెగాంధి, నాదినమునకు ముందుది♦నంబునందు
దన్నుగాంచుమటంచును ♦ వెన్నుదట్టి, పంపివైచె ఫిరోజిషా ♦ యింపుమీర.

సీ. అటులనేమోహనుఁ ♦ డారోజు, తనబావ,మరది గతించిన ♦ నరిగె బాంబె
బావమరందికి ♦ సేవసేయుచు సభో,పన్యాసమునకింత ♦ వ్యవధిలేక
బడలికజెందిన ♦ యొడలితోఁ గంపించు, స్వరముతోఁ బూర్తిదై♦వమును నమ్మి
అనుకొన్న దినమున ♦ నైదుగంటలకు సా,యంకాలసమయాన ♦ నరిగె గాంధి.

తే. ఫిరోజిషా మెహ్తాఆఫీసు♦కరసి, యతని, అయినదె తయారునీయుప♦న్యాసమనగ
లేదులేదండి, యిప్పటి♦కేది, యాశు,వుగనుపన్యసింపగ దలం♦పున్న దనియె.

క. వణుకుచునిటుబల్కెడు మో,హనుగని యిట్లనియెమెహత ♦ అదికుదరునె,యీ
దినములనీవీ బొంబా,యిని సఫలమొందంగ గోరు♦దేనిఁ వినుమీ. 525

క. వ్రాయవలె నీప్రసంగం, బీయగవలె ముద్రణమున ♦ కీరాత్రికె నీ
వీయత్యవసరకార్యము, చేయంగలవంచు విశ్వ♦సించెద ననగన్. 596

క. కంపమొదవె గాంధికయిన, తెంపున యత్నింతునని యా ♦ ధీశక్తిమెయిన్
సంపూర్ణవ్రాతప్రతికై, పంపుడు మూస్ష్నిరాత్రి ♦ పదుకొండుకనెన్. 597

సీ. మరునాటిసభ గాంధి ♦ యరసెను మెహతాయు, పంగిన సలహాప్ర♦శస్తమనుచు
సర్ ఫిరోజ్ షామెహ్తా ♦ సభప్రసంగింతురం, చేగుదెంచిరి జను ♦ లిసుకరాల
నటు సందులేకుండ ♦ నందుచే గాంధికి, ఒదవె కంపమ్ము నో ♦ రోడెనాడ
సభికులుగోర వా♦చా, వాచవులునూర, చదివె బిగ్గరగ ప్ర♦సంగమెల్ల

తే. తనిసి సభికులు కరతాళ ♦ ధ్వనులొనర్ప,
మిన్నుముట్టె ప్రసంగముల్ ♦ మెహత పొగడె
ముట్టె మిన్నును మోహను ♦ మోదమెడద.
నుత్సహించిరి పలువురు ♦ యువకులాఫ్రి, కాకు బోవగ బాస నో♦సర్చిరపుడ.

ఆ. అయిన బాసచేసి ♦ నట్టివారెవ్వరు, దక్షిణాఫ్రికాకు ♦ తరలలేదు
గాంధియత్నమెల్ల ♦ గంగలో బోసిన, పాయసమ్ము వోలె ♦ వ్యర్థమయ్యె. 599

క. పెష్టోన్జీబాద్షాయను, నిష్టుండొకడుండె గాంధి ♦ కింగ్లాండందున్
రెష్టారెంట్ పరిచయమే, శిష్టునతని గాంధి కెంతొ ♦ స్నేహితు జేసెన్. 600

తే. అతడు బొంబాయిహైకోర్టు ♦ నందొకండు,
పదవియందుండె ప్రోత్సహిం♦పంగ నతని
తనకు సాయము రమ్మంచ♦తండు గాంధి, కిటుల బలికెను ఘనమున ♦ మెల్ల దెలియ.

శా. హైకోర్టందధికార మొందు గుజరా♦తందొండు కార్యంబు నం
దేకోపాసననుంటి, గ్రంథరచనా ♦ ధ్యేయమ్మునం గాననే
రాకుంటిన్ క్షమియింపు మిందుగలుగన్ ♦ బ్రాజ్ఞుండవౌ నీవునుం
బోకున్నంబనులున్ స్వరాజ్యమొదవన్ ♦ బూనంగగూడ యత్నముల్. 602

శా. సంపాదింప స్వరాజ్యమీమన స్వదే♦శంబందు, సాధ్యంబుగా
వింపన్ సాధ్యమగున్ నెటాలు ప్రజకున్ ♦ వేసారెదేలా యిటుల్
గొంపన్ వీడియు బోననేల వినుమా ♦ కోపింప కిందెంతొ నా
కింపారంగ నొనర్పుమా విపుల సం♦తృప్తిన్ సహాయంబులన్. 603

తే. అనుచు పెస్తొంజిపలుక, మో♦హనుడునతని, దేశభక్తికి, మాతృభా♦షాభిమాన
రక్తికచ్చెరువందె గౌ♦రవము హెచ్చె, నైన సౌతాఫ్రికాయందె ♦ మానసమ్ము
దగిలియుండెను గీతోక్తి ♦ తలపుగలప. 604

పూనా, మద్రాసుసభలు

ఆ. సర్ ఫిరోజిషా ప్ర♦శస్తవైఖరి గాంధి, కినుమడించె ధైర్య♦మెచ్చె కౌతు
కమ్ము బొంబెనుండి ♦ కడుసునాయాస ప్ర, యాణమతడు చేసె♦ పూనపురికి. 605

సీ. పూనాపురిని పక్ష♦ములు రెండు వెలయునా, యిరుపక్షములవారి ♦ నరసితత్స
హాయమపేక్షించె ♦ నఖిలభారతదేశ, ప్రజలతోఁడ్పాటు సం♦పాదనమ్మె
తనధ్యేయమగుట మో♦హనుడు మొట్టమొదట,మాటలాడెనులోక♦మాన్యుతోడ
తోయధిగంభీరు ♦ తోడ నాతండును, వినిగాంధి చెప్పిన♦విషయమెల్ల
ఆ. అఖిలజనసహాయ ♦ మర్థించుటయె లెస్స, దక్షిణాఫ్రికా వి♦ధానమందు
భేదభావములు న♦భిప్రాయ భేదమ్ము, లేవి లేవు నేను ♦ నీవెరుంగ. 606

చ. అయినను రాజకీయముల ♦ నం దెటువంటి ప్రసక్తిలేని ధీ
నయగుణశాలినొండొకని ♦ నాథుడుగా సభగూర్పగాదగున్
నయమతినీమనమ్మున నొ♦నర్పుము యోచనమెల్లవారలం
బ్రియమున జూడుమీ, యడుగు♦మీ, యెవరెవ్వరుతోడు వత్తురో! 607

క. ప్రాపిసరు భండార్కరుకడ, కిపుడేగుమతండు రాజ♦కీయమ్ములలో
ఎపుడే పాలుగొనని ని,ష్కపటి నతని జూచినాడు ♦ కడకున్ రష్టా. 602

వ. నా సంపూర్ణ సానుభూతి సహాయసహకారములు సర్వదా నీకుండ గలవు. నీవు సర్వేసర్వత్రా నీకిష్టమైనపుడెల్ల వచ్చి నన్ను గలియవచ్చును. నేనెప్పుడును నీవాడనే సుమా యని వీడుకొల్పిన మోహనుడా లోకమాన్యుని యద్వితీయ ప్రజానురంజకత్వమునకు రహస్యమెరిగిన వాడై. 603

సీ. లోకమాన్యుపిదప ♦ గోకేలునుంగాంచె, ఫెర్గుసన్ కాలేజి ♦ ప్లేగ్రవుండు
నందాతడున్ గాంధి ♦ కనురాగ పూర్వక, స్వాగతమ్మొసగి ప్ర♦శస్తరీతి
గాంధిప్రేమాంతరం♦గము చూరగొనె పూర్వ,మిత్రులవలెవారు ♦ మెలగిరంత
అల్లఫిరోజిషా హి♦మాచల ధీరుండం, బోధిగభీరుండు ♦ బుధనుతుండు
ఆ. లోకమాన్యుడెన్న ♦ గోకేలు గంగాప్ర,వంతి వంటి యొంటి ♦ వంతదీర్చి
హాయినొసగువాడ♦టంచు మనమ్మున, తలచెగాంధి యాత్రి♦తయము గూర్చి.

చ. హిమగిరినెక్క సాధ్యమగు♦నే సులభమ్మగు కార్యమొక్కొ! సం
ద్రము పయిపైనమైన, నను♦రాగముతో నొడిజేర్చుతల్లి కిన్
సమమగు గంగపై పడవ ♦ సంతసమారగ నెక్కితెడ్డుతో
క్రమముగ హాయిమైచనిన ♦ బ్రాణములన్నియు లేచునట్టులా 605

సీ. బడిపంతులోర్మిమై ♦ బడిలోనఁజేరగా, వచ్చిన విద్యార్థి ♦ బాలునెట్లు
తగపరీక్షించు ప♦ద్ధతిని గోకేలు మో,హనుని బరీక్షించి ♦ యాదరించె
ఎవరినెట్టులఁజేరి ♦ యేరీతి మాట్లాడు, టెల్లయు గాంధికి ♦ నెరుగజెప్పె
భండార్కరును గాంచి ♦ భాషించి, యతడు చె,ప్పునదెల్ల దనకు దె♦లుపగోరె
తే. అరిగితే మాన, లాభాన♦దిరిగి రమ్మ,టంచు వీడ్కొల్పె గాంధినా♦నందమొంద
నాటినుండియెగాంధి డెం♦దమున రాజ,కీయగురువుగ నిలిచె గో♦కేలుతనకు. 606

క. జనకునివలె నతికౌతుక,మున జేరగదీసె మిగుల ♦ మోదమొదవ మో
హనుభండార్కరు నడిచె, త్రిన సూర్యుండుండువేళ ♦ దీరికగాగన్. 607

ఆ. పక్షపాతిగాని ♦ దక్షులరగుమిమ్ముఁ, జేరిసభకు బతిగ ♦ గోరమనిరి
తిలకుగోకలేల ♦ గలసితి,వారు చె.ప్పంగమిమ్ము జేర ♦ వచ్చినాడ. 608

ఆ. అనుచుగాంధివలికి ♦ నంతట భండార్క, రనియెతిలకు గోక్లె ♦ లనినయట్లు
పాలిటక్సులోన ♦ బాల్గొననైన నీ,విషయమట్లుగాదు ♦ వింటినెల్ల. 609

క. బలముగలది నీకార్యము, విలువగలది నీదుశ్రమయు ♦ విశ్రుతమగు స
త్ఫలముగలుగవచ్చెదనే, నలయక నిరుపక్షసభకు ♦ నధ్యక్షుడుగాన్. 610

క. ఇరుపక్షమ్ములనాయకు, లరసిసభం గూర్చ కాల ♦ మందేత్త్రక
మరివేరొకసమయము నా,కొరకవసరమేల గాచు ♦ కొనకుండనియెన్. 611

ఆ. ఇట్లుకాలహరణ ♦ మింతేనిలేకుండ, స్వార్థమింతలేని ♦ పండితాధ్యు
లరసిపూనపురి ని ♦ రాడంబరమ్ముగా, సభనుగూర్చి రెంతో ♦ సంతసమున
నలరఁ దనప్రచార ♦ మందువిశ్వాసము, హెచ్చచెన్నపురికి ♦ నేగెగాంధి. 612

సీ. చెన్నపురమ్మున ♦ మిన్నుముట్టెనుప్రజల్, చూపినయుత్సాహ ♦ మాపకుండ
బాలసుందరుగూర్చి ♦ యాలింపగా సభ,నెంతయో యుద్రేక ♦ మెచ్చిపోయె
గాంధిప్రసంగంబు ♦ కడుదీర్ఘముగనున్న, సభికులెంతయు దాని ♦ శ్రద్ధవినిరి
తత్సభాంతమున ని ♦ తాంతమర్థించిరి, పచ్చపాంప్లెటుకొర ♦ కిచ్చమెయిని

తే. కనుక గ్రమ్మరపదివేల ♦ కాపిలచ్చు, వేయబడెగాని నాలుగు ♦ వేల ప్రతులు
మాత్రమేవిక్రయమ్మయ్యె ♦ నాత్రమునను, అమితముగజాలముద్రించి ♦ నందువలన.

సీ. మదరాసు పురమున ♦ "మదరాసుస్టాండర్డు", ఎడిటరు జీ. పర ♦ మేశపిళ్లై
తనపత్రికనుగాంధి ♦ కనువైనరీతిని, ప్రకటనల్ విషయవా ♦ ర్తల ప్రచురణ
కావించె, సభగూడె ♦ ఘనముగా శ్రీపచ్చి.యప్పకళాశాల ♦ హాలునందు
అధ్యక్షుడుగనుండ ♦ నల్లడాక్టరు సుబ్ర,మణ్యమ్ము గాంధియు ♦ ధన్యుడయ్యె

తే. చెన్నపురియందుఁ సఖులు వ ♦ ర్షించినట్టి, సదనురాగము వారియు ♦ త్సాహగరిమ
గాంధియాంగిలేయ ప్రసం ♦ గమ్ము వలని, కొరతవరిగె ప్రేమకు నష్టు ♦ ధరణిగలదె?

త్వరగా తిరిగిరాక 1896

గీ. చెన్నపురినుండి కలకత్త ♦ చేరెగాంధి, పదియునెన్మిది నూటతొం ♦ బదియునార
వేట నక్టోబరున దుది ♦ నాటి దినము,నందు గ్రేటీస్టరన్ హోట ♦ లందు విడిసె. 615

క. అటగలిసె మోహనుడు 'డెయిలీటెలిగ్రాఫ'నెడు సింగి ♦ లీష్పత్రికప్రా
కటమగు ప్రతినిధియగువా, డటనుండగ 'ఎలెరుతోర్పు' ♦ అనునాంగ్లేయున్.

సీ. ఆతడాహ్వానింప ♦ నరిగె బెంగాల్క్లబ్బు, కందు డ్రాయింగ్రూము ♦ నందు నిండి
యనులు జొరగరాద ♦ టంచెర్గి తనస్వంత,గదికిని గొంపోయె ♦ గాంధి నతడు

స్థానికాంగ్లేయుల ♦ దౌష్ట్యమ్ము దురభిమా,నమున కెలెర్ ఢోపు♦విముఖుడయ్యె
పిదపగాంధిగలసె ♦ బెంగాలుప్రజకెల్ల, బ్రీతిపాత్రుడగు సు♦రేంద్రనాథు

తే. అతడుమోహాను తోడని♦ట్లనియె "కష్ట,నిష్ఠురమ్ములుగలవైన ♦ నీవుగలియ
వలయునిండియన్ సంఘ స♦భ్యులనుజూడ,వలె మహారాజులనువారి♦వారి వారి
సానుభూతిసంపాదింప ♦ జనుటలెస్స. 617

క. ప్యారీమోహానుడల టా,గూరుమహారాజులెన్న ♦ గురుసువిశాలో
దారమనస్కులు ప్రజకుప,కారకమగు పనులయందు ♦ గలసెడువారల్. 618

ఆ. అని సురేంద్రనాథు ♦ డంపమోహానుడల్ల, వారిదరిశనమ్ము ♦ వారిచేసె
కాని ఫలమొకింత ♦ గానరాదయ్యె మో♦హానుని కష్టమెల్ల ♦ వ్యర్థమయ్యె.

క. కలకత్తానగరమ్మున, సులభమె బహిరంగసభ వి♦శుద్ధిగ జరుపన్
కలదుసురేంద్రబెనర్జి, పిలిపింపగ నట్టిసభల ♦ బ్రియమారంగన్. 620

ఆ. ఆతడొకడుదక్క ♦ నన్యులెవ్వారునీ, గోరునట్టిసభను ♦ గూర్పలేరు
కాన నరుగుమతని ♦ కడకంచు బంపిరు,య్యాలబోలె నూగ♦నటులనిటుల. 621

సీ. రాజకీయమ్ముల ♦ రాష్ట్రనాయక దర్శ,నమ్ముకడకు నిష్ఫ♦లమ్ముగాగ
అరిగెనంతటగాంధి ♦ యమృతబజారుప,త్రిక బంగబాసి ప♦త్రికనునడుపు
కార్యాలయమ్ముల ♦ కడకు తత్సంపాద,కుల సహాయము బొంద♦దలచి కాని
యందునునిష్ఫల♦మయ్యె నాతనికష్ట,మైన జెందక నధై♦ర్యమ్మొకింత

తే. ఇతరపత్రికాఫీసుల ♦ కేగెనందు, నాంగ్లోయిండియన్ పత్రిక♦లైన 'స్టేట్సు'
మెను మరియునట్టు లింగ్లీషు♦మెనును సముచి,
తముగ గుర్తించ ప్రచురించె♦దక్షిణాఫ్రి,కా సమాచారమంతయు♦గాంధివల్ల.

మం. ఇంగ్లీషుమెన్ పత్రి ♦ కెడిటర్రైనట్టి, సాండర్సనెడు ప్రాజ్ఞ♦డండగా నిలిచి
గాంధికి దనపత్రి♦కయును కార్యాల,యమ్ము సంగియుదన ♦ వ్యాసమ్ములందు
మార్పులుగోరిన ♦ మాడ్కియొనర్ప, గాంధికొసగె నధి♦కారమ్ము ప్రేమ
చేతనేసాయమ్ము♦చేసెదనంచు, ప్రతినయొనర్చెత ♦ త్ప్రతినానుసరణి
సలిపెసర్వవిధాల ♦ సాయంబుగాంధి, కుత్తరంబులువ్రాసె ♦ నోర్మిమైకూర్మి

క. సాండర్సుబోలె ననుకో,కుండ గలిగెమోహానునికి ♦ కూరిమిసఖ్యం
బండగనిలిచినవారలు, పండితులుం బామరులును ♦ బలువురుమిత్రుల్. 628

సీ. సాండర్సు సాయంబు ♦ సలుపకమున్నత, డడిగెప్రశ్నలు దక్షి♦ణాఫ్రికాను
గూర్చియనేకమ్ము ♦ కోపమూనక గాంధి, సకలమెరింగించె ♦ సత్యఘణితి
సౌతాఫ్రికాతెల్ల ♦ జాతివారలగూర్చి, పక్షపాతములేని ♦ దీక్షతోడ
దాక్షిణ్యమునకెట్టి ♦ తావీయకయె యిరు,పక్షమ్ములంగూర్చి ♦ దక్షతమెయి

తే. తెలుపసాందర్పు సానుభూ♦తియు లభించె, ఎదిరిపక్షమునకున్యాయ♦మొసగఁజేయ
స్వీయపక్షమ్మునకుఁగూడ♦న్యాయమొప్ప, జరుగుననిస్వానుభవమున♦నెరిఁగెగాంధి.

ఉ. అనుకొనకుండ లభ్యమయి ♦ నట్టితదీయ సహాయమొప్ప, మో
హానుసికి ధైర్యమబ్బె బహి♦రంగసభంగలకత్త పత్తనం
బున జరుపంగలాడనని ♦ పూనికనుండఁగ, దంతెవచ్చె డ
ర్బనుపురినుండి వేగముగ ♦ బైనముగా, జనుదేరఁగమ్మరన్. 630

వ. ఇటుల డర్బనునుండి 1896 నవంబరు 12 వ తేది దాదా అబ్దుల్లా "వచ్చే 1897 జనవరి నెలలో పార్లమెంటు సమావేశమగును. కాన నీవు వేగమ తిరిగి రమ్మని" తంతిపంపగా, గాంధికలకత్తాలో బహిరంగసభ జరుపు ప్రయత్నము నుండి విరమించి, బొంబాయికి తిరుగుపైనమునకు సిద్ధమై 'ది ఇంగ్లీష్‌మెన్ పత్రిక'లో దానంత హఠాత్తుగా కలకత్తావిడిచిపోవుటకు గారణముల వివరించుచు, దన్మూలమున దక్షిణాఫ్రికాలో భారతీయులు బడుపాటులంగూర్చి తేటతెల్లముగా బ్రచురించెను. అందుండి బైలుదేరుటకుముందే, దాదా అబ్దుల్లా కంపెనివారి బొంబాయి యేజెంటుకు దనకు సాధ్యమైనంత త్వరగా దక్షిణాఫ్రికాకు బైనించుటకు వలయు ననుమతిపత్రమును జేకూర్పుమని కోరుచు దంతినిచ్చెను. దాదా అబ్దుల్లాయు నప్పుడప్పుడే కౌర్లాండు అను నోడను గొనియుండెను. అందులో నుచితముగా గాంధిని, భార్యాపుత్త్రాదులతో దక్షిణాఫ్రికాకు జేరుప దనగోరికగా తెల్పియుండెను. గాంధియు నందుకు సమ్మతించి 1896 నవంబరు 30 వ తేది తనభార్యయును, నిరువురుబిడ్డలు, మేనల్లుడు వెంటరా దక్షిణాఫ్రికాకు బయలుదేరెను. 631

క. శ్రీరామా, కృతి నాథా, నేరచియించిన మహాత్మ♦నిగమాభకథన్
ఈరెండవస్కంధము విం, టేరసయుత మధురశబ్ద ♦ నిధినింప్రేమన్.

ద్వితీయస్కంధము, సంపూర్ణము.

---

ఓం శ్రీరామ, జయరామ, జయజయరామ

# శ్రీ గాంధి మాహాత్మ్యము

## తృతీయస్కంధము



### తుపానుసూచనలు—1896

రఘుపతి రాఘవ రా
జారామా, పతితపావ♦నా, సీతారా
మా, రాక్షసకులభీమా
శ్రీరమణీయగుణధామ ♦ సీతారామా. 1

తే. ఆలుబిడ్డలతో నౌక♦యందుఁ బయన, మాచరించుటకిది మొద♦లగుటకతన
గాంధితనసతీ సుతులనే ♦ కరణినాటి, సభ్యతకుదగనెట్టి వేషములు గూర్ప
వలయునోయంచు యోచించె ♦ స్వాంతమందు. 2

సీ. బాల్యవైవాహిక♦పద్ధతిచేనాటి, సతులకేలాటిది ♦ చదువులేమి
విద్యనేర్చినభర్త ♦ యుద్యమంబుల దోడు, పడుటసాధ్యముగాని ♦ పనిగనుండె
వేషభాషలయందు ♦ వెలయురీతులనెల్ల, పతియే సతికి నేర్ప♦వలసియుండె
గాంధియేతనభార్య ♦ కస్తూరిభాయికి, తనయులకుంగ్రొత్త ♦ స్థలములందు
తే. మసలుకొనవలసిన రీతు♦లెసగదెల్పె, పతివచించినగతిమెల్గు ♦ టతివధర్మ
మగుటకస్తూరిభాయి మో♦హనుడుచెప్పి,నట్టులం బారిసీచీర ♦ గట్టెబ్రీతి. 3

ఆ. భారతీయులందు ♦ పార్సీలధికనాగ,రికులంచు బేరు♦కెక్కుకతన
నాటిపారిసీల ♦ కోటుట్రౌజరులనే, తాల్పజేసెగాంధి ♦ తన తనయుల. 4

ఆ. కత్తులుమరిముండ్ల ♦ గరిటెలువాడిరి, భోజనమ్మొనర్ప ♦ రోజువారు
తెల్లవారిపద్ధ♦తిని వారితోఁబల్కు, బడిగడించుకొంకు♦గుడున, నుడువ. 5

ఆ. ఓడలోప్రయాణ ♦ మొనరించునపుడె న,వీననాగరికత ♦ వేష.భాష
లలవడంగ గరపె♦నాలుబిడ్డలకెల్ల, గాంధి దక్షిణాఫ్రి♦కాకు జనుచు. 6

క. ఈమాయదారి రీతుల,పై మోహానుపిచ్చితగ్గు ♦ పరకట్లుండెన్
వ్యామోహమడగ గ్రమముగ, నామెయినా క్రొత్తరీతు ♦ లడగెవరుసగన్. 7

మ. తనయానాపిది నౌకయాటకతనం ♦ దానంతట న్నావలో
ఎనయంగా దిరుగాడుచున్ గలియుచుం♦తే ప్రీతిమై బాంధవా
ళిని, మిత్రాళిని, గాంధియెల్లరిసదా ♦ లీలన్విచారించుచున్
తనివోవం గడపెన్ దినమ్ములను ప♦ద్మాల్గున్ సముద్రంబుపై. 8

ఆ. ముందుజరుగబోవు ♦ ముప్పుసూచించుచు, నాలుగుదినములె నె♦టాలుజేర
పట్టునంచు నెంచు♦పట్టున నౌకభయం,కర తుపానువీచె ♦ కంధిపైన. 9

సీ. ఆతుపాను గాలి ♦ యతితీవ్రముగ వీచి, ఉయ్యాలవలె నావ ♦ నూగఁజేసె
నౌకయందలి ప్రయా ♦ ణీకులెల్లరు దమ, ప్రాణంబులగ చేత ♦ బట్టి యెల్ల
రైకకరంత్యమ్మున ♦ నర్థించి, ప్రార్థింప, దొడగిరీశ్వరుదమ ♦ యిడుముబాప
వేడుచుదమమత ♦ భేదంబులన్నీడి, దైవమొక్కండె, యం ♦ దరికటంచు
తే. సాముదాయికా పాయమ్ము ♦ సంభవించు, సమయమునమత భేదముల్ ♦ సమయనెల్ల
సకలజాతి జనంబులీ ♦ శ్వరుడొకండె, యనెడు భావైక్యమున వేడి ♦ రందరిట్లు. 10
క. జగదీశా, పరమేశా, భగవంతా కావుమో ప్ర ♦ పంచనియంతా
ఖగ, మృగ సకలాధారా, సుగుణాకర, నీవెదిక్కు ♦ సూర్యాధారా. 11
క. నీవేదిక్కిటమాకో!, దేవామము గావరాగ ♦ దే వారింపగ
లేవా, మహానుభావా, రావా, యాపదలను, బ్రోవ ♦ రావా, రామా. 12
సీ. నౌకాధిపతి ప్రార్థ ♦ నముజేసె దైవమ్ము నందరితో బాటు ♦ బృందగీతి
గాలివానలఁ బెక్కు ♦ గనితిసిట్టివి; యింత, కన్న తీవ్రమ్మైన ♦ వెన్నొమీకు
భయములేదీనౌక ♦ బహుదృఢంబుగ నిర్మి, తంబైనదే యపా ♦ యంబురాదు
అని హామి యిచ్చెద ♦ నని బహుభంగుల, బల్కె నూరటగల్గ ♦ బాంధపాళి
ఆ. కైన నూగుబ్రోగు ♦ నపుడెల్ల నావయం, దలి జనంబు నోట ♦ దైవనామ
జపమొకండె నిల్చె ♦ ఝుంఝుమిజృంభణ, సాగినంతవరకు ♦ సమధికముగ. 13
ఆ. ఆగెగాలివాన ♦ యరుణదర్శన మాక, సమునన య్యె నిర్మ ♦ లముగనయ్యె
అబ్ధి, దైవభక్తి ♦ యవసరమ్మునుదీరె, మరణభయముబాసె ♦ మానెస్మరణ.
ఆ. తిరిగిజనము తిండి ♦ తిప్పలంబడి, త్రాగి, తందనాలనాడి ♦ రెందుగన్న
అంతరించెనెల్ల ♦ నాపదల్మొక్కులు, మాయమనసమేయ ♦ మాయఁజేయ. 15
క. మామూలు సమాజులు రో, జేమాత్రము తగ్గవయ్యె ♦ హిందూజపముల్
ఏమూలంగన నౌకా, ధామమ్మున జరుగుచుండె ♦ దరుగకొకింతన్. 16
ఆ. కానియాయపాయ ♦ కాలమందలి హృద, యస్మరణమదెల్ల ♦ విస్మరింప
బడియె, బెదవులం జ ♦ పములొనర్చుట హెచ్చె, పాడుటాడుటెల్ల ♦ నోడరెచ్చె.
మం. కానిమోహనుడా తు ♦ పానుకాలమున, ఆనావలోని ప్ర ♦ యాణికావళిని
ఓదార్చుచెంతో ధీ ♦ రోదారుడగుచు, మోదంబుగూర్చుచు ♦ ముప్పొద్దులందు
గంటగంటకు నోడ ♦ కాప్టెనరిపోర్టు, వెంటవెంటనె చెవింగు ♦ వినిపించుచెల్ల
వారలచెలిమి సం ♦ పాదించెనోడ, నాకసినందున ♦ నట్టితుపాను
లావరకెన్నియో ♦ యంబుధి జ్వరము, లేవియాతని జేర ♦ లెప్పుడుఁ జిత్త
మందుభీతిల్లుట ♦ లణుమాత్రమేని, డెందానగూర్పడా ♦ నందసంధాయి
యని తోడిమానవు ♦ లందరిసేవ, ననిశమ్ముచేసి ప్ర ♦ యాణమొనర్చె
తుదిడిసెంబరు నెల ♦ బదునేడుగడచి, పదునెన్మిదవ తేది ♦ పడినంతనోడ

డర్బను రేవు ప♦ట్టణమునఁ గాల, గర్భమందలి వాన ♦ గాలి నెరుంగ
చాలక విడిసెను ♦ జాగేమి సేయ, కోలి 'నాదేర'ను ♦ నోడయు విడిసె. 27

## తుపాను 1897

సీ. ఆ కాలమందు 'ప్లే'♦గను అంటు వ్యాధి బొం,బాయిపురమ్మున ♦ బ్రాకియుంట
ఆపురినుండి ప్ర♦యాణించువారి దే,హమున వ్యాధిక్రిము ♦ లంటియుండు
ననియనుమానించి ♦ యా యోడ జనమిరు,వదిమూడు దినముల♦వరకు రేవు
జొరకూడదనుచు సు♦త్తరువుంట చేమరి, యైదునాళ్ళా యోడ ♦ లందె గాంధి
తే. ఆలుబిడ్డలతోనుండె ♦ కాలమెట్లొ, గడపెఁ దోడి ప్రయాణికుల్ ♦ గాంధి చెప్పి
నట్లు నడిచిరి, గడిపిరి ♦ యాటపాట,లందు దినములు ననుమతి♦యందుదాక. 28
సీ. కాని నెటాలున ♦ గల తెల్లవారిండి,యను లెవ్వరిక దక్షి♦ణాఫ్రికాకు
రాగూడదనుచు ని♦రాకరించిరి నౌక,లందున్నవారెవ్వ ♦ రాపురమున
అడుగిడ. దిరిగిపో♦వ్వనుచు నాందోళన, మల్లరుల్ సాగించి ♦ రెల్లవేళ
దక్షిణాఫ్రిక ప్రభు♦త్వము గూడ వారికి, మద్దతునొసగెను ♦ మంచిచెడ్డ
తే. లరయకింతయు 'ఎస్కోంబె'♦యను ప్రభుత్వ, సచివుఁడా తెల్లవారల♦సభలఁ బాలు
గొనియె బహిరంగముగనె బల్♦కోపతాప, మధికమగుచుండె నానాటి♦కా పురమున.
ఆ. తెల్లజాతివారు ♦ తెల్లజాతి ప్రభుత్వ, మిండియనుల దిరిగి ♦ యిండియాకు
అంపుకోరకొనర్చు ♦ నాందోళనమ్మెది,రించి నిలువదలచి ♦ రిండియనులు. 30
వ. అట్టి విపరీత విపత్కరపరిస్థితులందు, భారతీయులు వచ్చిన నౌకాద్వయ యజమానులగు దాదా అబ్దుల్లా కంపెని కప్పూడా డర్బను నగరమున యజమానియగు సేటు అబ్దుల్లా కరీము హాజి ఆదము అనువారు తెల్లవారి కుట్రలకు, గూడుపుఠాణీలకుగాని, వారి కోపతాపములకుగాని, లక్ష్యపెట్టక నౌకల రెంటిని రేవునకు జేర్చి, వానిలో వచ్చిన భారతీయులను దింపుకొనుట కెంత త్యాగమైనను జేయుటకు వెనుకాడకుండిరి. అతడు నిత్యము గాంధికి పట్టణమందలి పరిస్థితుల నప్పుడప్పుడే యెరిగించుచుండెను. మీదుమిగుల మాణిక్ శుక్లాలు నాజరు అను భారతీయనాయకుడు కాంగ్రెసును గాంధిని గలియనేతెంచి, డర్బనులోనేయుండి భారతీయుల కండగా నిలిచి, నిర్భయముగా వారి కన్ని మంచిసెబ్బరలు తెల్పుచునేయుండెను. ఇంతేగాక, భారతీయుల న్యాయవాదిగానున్న 'లాప్టను' అను నాతడు తెల్లవాడైనను, నీతిమంతుడగుటచేత దన తెల్లవారి దుండగములు ఖండించుచు, నిండియనులకు వలయు నండదండలు చేకూర్చుచునే యుండెను, ప్లేగు క్రిముల నెపమున, భారతీయుల దీరమునదింప దక్షిణాఫ్రికా ప్రభుత్వ మీయకొనమికి నిజమైన కారణము, గాంధి దక్షిణాఫ్రికాను నిండియనుల చేనింపి, యందలి తెల్లవారి యాధిక్య ప్రభుత్వముల బడగొట్టు నుద్దేశముతో రెండు నౌకల నిండుగా నిండియనుల గొనివచ్చెనని పుకారు పుట్టించుట. 31

సీ. ఇందుకుదోడుగా ♦ నిండియాలోనుండ, ఖండించుచొనరించు ♦ గాంధియిచట
బాధించుచుండిరి ♦ భారతీయుల దెల్ల వారలంచును దుష్ప్ర♦చారమనుచు
అపవాదువైచి మో♦హనుబరిమార్పగా. పన్నుచుండిరి తెల్ల♦వారుకుట్ర
కానియేపాపంబు ♦ గాంధియెరుగడు నెటాలున ... బల్క ♦ నక్కటదెదియు
తే. చెప్పలేకిండియా యందు♦శ్వేతముఖుల,గూర్చి యొంతైననందుచే♦నోర్చిగాంధి
క్రిస్టుమసుదినమున నోడ♦కేపిటెయిను, పిలువవిందుకుజని యందు♦పలికెనింత
కలుషపాశ్చాత్యనాగరి♦కతగురించి, భవ్యమైనప్రాచీన స♦భ్యతకుబోల్చి. 32
క. అంతట నటగలవారలు, వింతగ గనిగాంధి నిట్టు♦విసరముగాన
భ్యంతరపరుచుచు బల్కిరి, సుతయు రోచింపకుండ ♦ క్షుల్లకబుద్ధిన్. 33
సీ. "శ్వేతజాతులునిన్ను ♦ జెడుతలంపునమీద, పడికొట్టరాగనే ♦ పగిదినుండు
వెటులనోర్తువువారి ♦ నెల్లసీదౌర్జన్య, రాహిత్యనియమమే ♦ రహిని నిల్చు"
"జగదీశుకందుకు ♦ వగుధైర్య సాహస. సహనశక్తులనా కొ♦సంగె నన్ను
కొట్టవచ్చినవారిం ♦ గూర్మిక్షమించెడు, నోర్మినిపేర్మి నా♦కొసగెననుచు
తే. నమ్మకమ్మున్నదెట్టి కో♦పమ్ములేదు, వారియజ్ఞానమున కల్ప♦భావమునకు
వగతునీనాడువారలు ♦ పగగొనరుప, చేయునది మంచిదనియె యెం♦చిరినిజముగ
కనుకవారిపై నాకెట్టి ♦ కినుకలేదు", అనుచుగాంధి వచించెకే♦ప్టెనుకు బ్రీతి.34

వ. ఇటుల దినంబులు సాగుచుండ గడకు శ్వేతముఖులు "మీకు ప్రాణంబులపై యాసయున్నచో నిండియాకు దిరిగిపోండు లేకున్న మీకపాయంబు వాటిల్ల గలద"ని భయపెట్టుచు గాంధికిని, దదితరనౌకాప్రయాణీకానీకమునకును, అంతిమసందేశము బంపిరి. కాని గాంధికాని, తదితర ప్రయాణీకులు కాని యిసుమంతయు జలింపక, నెటాలురేవున దిగుటకును, నెటాలుపట్టణముం జొచ్చుటకును మీకుబోలె మాకును నిక్కమైన హక్కుగలదనియు, నందుకుమాప్రాణము లొడ్డుట కేమాత్రము వెనుదీయమనియు జవాబిడిరి. అటుల నిండియనులు ప్రతిఘటించి నిలువ వారిధైర్యసాహసములకు బెంబేలుపడి శ్వేతజాతిప్రభుత్వ మోడలందు చేరిన యిరువదిమూడు దినములు గడచిననాడు, అనగా 1897 జనవరి 13 వ తేది సాయంకాలము అయిదుగంటలకు రేవుజొచ్చుటకు నౌకల ననుమతించెను. పురప్రవేశమునకు ప్రయాణికుల ననుమతించుచు నుత్తరువులు జరిగెను. 35

మం. ధర్మసమ్మతములౌ ♦ కష్టమ్ములందు, నిర్మలమనముల్న ♦ నేర్పులేకున్న
ధైర్యసాహసముల ♦ దౌర్జన్యరహిత, కార్యములందున ♦ గల్గించుజయము
పరమకృపాళుండు ♦ భక్తావనుండు, వరదుండు శ్రీశుండు ♦ భగవంతుడెపుడు.

—— పరీక్ష —— 1897 ——

క. నౌకలు రేవుం జొచ్చెను, మూకలుగా దిగిరి తీర♦మున వానిప్రయా
ణీకులు జాగొనరింపక, ప్రాకటముగ, నైన గాంధి ♦ పయనంబాగెన్. 36

తే. చెప్పిపంపెను కాప్టెను ♦ చేశ మోహ,నునికి ఏస్కోంబె, యీరీతి ♦ కినుకబూని
యున్నవారలు నీపైన ♦ యుసురుగుదియ, కనుక నా మాట నోర్మితో ♦ వినుము గాంధి.

సీ. నీవు నీవారలు ♦ నెమ్మది చీకటి, పడినపిమ్మట రండు ♦ విడిచి చలము
రేవునందున సూప♦రింటెండుగానుండు, టాటము నెడువాడు ♦ మేటి రక్ష
నీకు గూర్పగలండు ♦ నీయింటికిం జేర్ప, గలడన సరియనె ♦ గాంధి, కాస
'లాప్టను' అను తెల్ల ♦ లాయరటకు వచ్చి, పల్కె మోహనుతోడ ♦ "భయము వీడి
తే. రమ్మునను గూడి నడిచి పు♦రమ్ములోని, కంపి నీసతీసుతులను ♦ దెంపుచేసి
అల్లరస్టోన్జి యింటికి ♦ దెల్లవారి. అల్లరులకల్కి చోరున♦ట్లరుగదగునె
పురములోనికి జీకటి♦ పూట నకట". 41

క. అంతయు బురమున నిస్వాడు, శాంతముగానుండె దెల్ల ♦ జనములగుంపుల్
మంతనములాడ వీడ ని,శాంతమ్ములకరిగి రెల్ల ♦ సద్దడగెనహో. 42

క. అని ప్రోత్సహింప లాప్టను, విని గాంధియు సమ్మతించె ♦ వెంటనె భార్యం
దనయుల రస్టోమ్జీ గృహ,మునకంపెను కారులోన ♦ ముదమారంగన్. 43

క. నడచి వెడల దాకేప్టెను, కడసను మతిగొనియు దిగిరి ♦ గాంధియు లాప్టన్
కడలితటంబంగానన,క్కడ నుండియు రెండు మైళ్ళ ♦ కాల్నడక జనన్. 44

సీ. దిగినవెంబడినె "గాంధీ, గాంధి" యని యువ,కులు కొందరాతని ♦ గుర్తుపట్టి
గోలనేయంగ నిం♦కొక పెద్దలార్గురు, వారితోగూయుచు ♦ జేరి చటు
గుంపునుగని భీతి♦గొని లాప్టనంతట, పిలిచె రిక్షానొండు ♦ వేసికేక
కానియాయువకులు ♦ గాంధి రిక్షానెక్క,నీక నా రిక్ష వా♦లాకు జంపి
వేతుమనిన్నంచు ♦ బెదరగొట్టగ వాడు, బ్రతుకు జీవుడయంచు ♦ బారిపోయె
తే. ముందుకుంబోప బోవ గుం♦పులును బెరిగె, అడుగిడగ ముందునక సాధ్య♦
మయ్యె మొదట, పట్టుకొనిరి లాప్టను వేడ ♦ బడగ గాంధి, పైనరువ్విరి రాళ్ళర♦
ప్పలను గ్రుడ్ల. 45

తే. గాంధి తలపాగగొందరు ♦ గడుసువారు, లాగివేసిరి మరికొంద ♦ రాగకుండ
తన్నగా దొడిగిరి కెళ్వె ♦ తప్పునట్లు, పాపమాలిండు నంతట♦ బట్టుకొనియె
ఎదుటి యిలు ముందు భాగాన♦ నెనయు నినుప,కమ్ములును నిల్చె నట శ్వాస♦కిమ్ముగాను.

తే. కానియల్లరి మూకలు ♦ గాంధినంత, విడువకాతని పై బడి ♦ రడలనాత
డంతనా దారి బోవుచు ♦ నరసి గుంపు,నచ్చు గాంధిని గాపాడ♦ వనిత యొండు. 47

మం. పాలీసు శాఖలో ♦ పురి పెద్దయైన, సూపరింటెండెంటు ♦ సుదతి గాంధీని
కాంచి యాతని పేర్మి ♦ కాపాడదలచి, సాహసమ్ము నెత్తె ♦ జంకలోనున్న

గోడుగుపై కెత్తి యా♦నడిమిభాగమున, నిలబడెగుంపును ♦ నిలువరింపంగ
అల్లరిమూకల ♦ యాగ్రహమూగె, ఆయవెజ్గాండరు ♦ యతివక పాయ
మగుననిభయపడి ♦ యాగడమూగె. ఇంతయుగనియొక్క♦యిండియను యువకు
డంతటబరువెత్తి ♦ యరిగిపోలీసు సూపరెంటెండెంటు ♦ కోపికఁదెలుప
గాంధిని క్షేమంబు గానటనుండి, చేర్పగాబోలీసు ♦ స్టేషను కతడు
బంపగా బోలీసు ♦ బంట్రోతులరిగి, అల్లరిమూకల ♦ నాపిమోహానుని
చేర్చిరిపోలీసు ♦ స్టేషనుకచట, తలదాచుకొనుమంచు ♦ దలపరి దెలుప
వలదువారెల్లరు ♦ వడిదమతప్పు, తెలిసినంతటనె శాం♦తింతుకువారి
తెలివి తేటలయందు ♦ గలదునమ్మకము, అనియుండ సందేశ♦మొనక మోహానుడు
చేరెపోలీస్ కాపు♦దారిలోనే వు, రేయాపదయులేక ♦ రెస్టోజ్జి వీడు. 59

క. గాయములు వగిలియుండెను, కాయంబంతయును మిగుల ♦ గాంధికినచ్చో
ఆరోడవైద్యుడుండుట, సాయంబొడగూడె తగిన ♦ సమయంబందున్. 60

క. శాంతముగ నుండెనెల్ల ని. శాంతమునంబైన శ్వేత♦జాతి జనమ్ముల్
పంతమున "గాంధియేడీ, అంతకు కడకంపెద"మని ♦ యల్లరికాంత్రై. 61

ఆ. చుట్టుముట్టియిల్లు ♦ ముట్టడించిరి, దీని, సత్వరముగ గాంచి ♦ చక్కబరుప
పూనివచ్చినటకు ♦ బోలీసుశాఖ నా,యకుడు నయకుడగుచు ♦ సకలవిధుల. 62

తే. గృహమునందున్న గాంధికి ♦ రీతిచెప్పి, పంపెనాతడు "నీవు నీ♦భార్యసుతుల
నీదుమిత్రుగృహమ్మును ♦ నెమ్మిగావ, తలపుగలదేనివినుమునా♦తెలుపుపలుకు."

చ. "వెడలుము మారువేషమున ♦ వెంటనె. యీగృహమందునుండి" యం
చడరుజనింపగా దెలుపు♦నంతట, పోలిసుబంటువేసమున్
వడివడి దాల్చిమోహనుడు ♦ బైటపడెన్ దనతో డిటెక్టివున్
నడువగ, నిర్వ్వరిండియను ♦ నాడెపువేషము బూని మానుగన్. 64

తే. సందుగొందులబడి ప్రక్క♦పాపు సదన,ముందు గోతాల గిడ్డంగి♦యందు నడిచి
గుంపులోబడి దారి ని♦గూఢముగను,చేరెఁ గడకెట్లో పోలీసు ♦ స్టేషనునకు.

వ. ఇట్లు మోహానుడు మారువేషమున దప్పించుకొని పోవునపు డల్లరిమూకను,
జిల్లరపాటలతోను, కల్లరిమాటలతోను నలరించుచు గడకు గాంధి పోలీసు
స్టేషనుకు జేరెననువార్త తెలిసినయనంతరము గుంపునుద్దేశించి, యాపోలీసు
శాఖాధికారి యిట్లుపలికెను. 66

సీ. తప్పించుకొనిచనె ♦ నెప్పుడో మీగాంధి, యిప్పుడేమగు నిండ్ల♦ కేగుడింక
ననునమ్మకున్నచో ♦ వినుడుమీ వారిద్దు, రరిగిలోనికి నెల్ల♦నరయువచ్చు
గాంధినిమీవారు ♦ గాంచగల్గినమీకు, సంతోషముగ నప్ప♦గింతు నతని
అటుగాక గాంధిమీ♦కగపడకున్నచో, శాంతమ్ముగా మీరు ♦ చనుట లెస్స

తే. గాంధిభార్యకు సుతులకు ♦ గాని యాగ్ర,హమునకుంగాని యేహాని ♦ నాచరించు
వాంఛమీ కెవ్వరికిని లే ♦ దంచుదలతు, ననగ గొందరు చని లోని ♦ కంత వెదకి
వచ్చిమాకకు దెలుపనా ♦ వార్తనంత, చెదరిపోయెను గుంపెల్ల ♦ వదరుకొనుచు.

సీ. ఒకనాడె యిటు గాంధి ♦ యొకసఖు ప్రేరణ, బహిరంగముగ జొచ్చె ♦ బగలుపురము
వేరొండు చెలికాడు ♦ వెడలునప్పుడె మారు, వేసాన నన నట్లె ♦ చేసెరేయి
ఎవరు చెప్పంగల ♦ రిటు గాంధి చేయుట, తన ప్రాణముల గాచు ♦ కొనుటకంతె
కాని, మిత్రాదుల ♦ గావంగాదని మరి, తప్పించుకొనిపోవు ♦ టొప్పు లేక

తే. అల్లరిజనమ్ము కెదురొడ్డి ♦ యరుగుటొప్పొ, చెప్పగల్గుదు రెవ్వరే ♦ దొప్పొ; యేది
యెటులదప్పగునో యెవ్వ ♦ రిప్పుడొప్పు, తప్పునేర్పడ జక్కగా ♦ జెప్పగలరు? 68

ఆ. జరిగిపోయినట్టి ♦ సంగతులం గూర్చి, చెప్పనేమి ఫలము ♦ తప్పులొప్పు
లెప్పుడైన వాని ♦ నెరిగి తద్గుణపాఠ, మును గ్రహించి నడుచు ♦ కొనుటెలెస్స. 69

క. ఎవ్వండే స్థితియందెటు, లెవ్విధి వర్తించునంచు ♦ నిదమిత్థము వా
క్రువ్వగ దుస్తరమగుటం, ద్రవ్వదగదు గడచినది గ♦తం నాస్తిగదా! 70

క. మనుజుని బాహ్యాకారము, గని యతడిట్టిడుగ జెప్ప ♦ గాదగ దెపుడా
తని మనమెరుగక పూర్తిగ, గనకపరిస్థితులగతుల ♦ కలరూపెల్లన్. 71

వ. ఇట్లు మోహనుడు దనకు దటస్థించిన వివిధసంఘటనలంగూర్చి తలపోయుచుండ నాటి బ్రిటిషు వలసదేశ కార్యదర్శియగు చాంబర్లైయిను గాంధిని గొట్టిన దుండగీడుల దండింపవలయునని నెటాలు ప్రభుత్వము నాదేశించుచు దంతినొసగెను. అంత ఎస్కోంబే 1897 జనవరి 20 వ తేదిన గాంధిని బిలువనంపి, యతని నూరడించి యిట్లనియెను. "గాంధీ! నీకు దగిలిన దెబ్బలకు నే నుబ్బిపోలేదు. జరిగిన దానికంతయు నే నెంతయో సంతపించుచున్నాను. లాఫ్టన్ సలహాను బాటించి, నగరము జొచ్చుటకు నీకధికారమున్నను, నా చెప్పిపంపినది నీవు వినియుండినచో, నీదుండగము లెవ్వియు జరిగియుండ జాలవు. నిన్ను గొట్టిన వారిని నీవు గుర్తింపగల్గినచో, వారికి దగినట్లు కోర్టుచే విచారణ జేయించి, తగుదండన విధింపగలము" అని పలుకగా, గాంధి యిట్లు బదులువల్కెను. 72

సీ. కోరనెవ్వరిని నే ♦ గుర్తింపగల్గినన్, దండింపజేయనా ♦ దలపునందు
దుష్టులొనర్చిన ♦ దుండగమ్ములకెల్ల, తప్పువారిదె యంచు ♦ దలపనేను
ఇంతయునెల్ల నీ ♦ యంత నాయకులు సే,సినయట్టి దుష్టబో ♦ ధనల ఫలము
ప్రజలను బెడదారి ♦ బట్టిపోకుండ కా,పాడ నాయకులకు ♦ పాడిగాదె

తే. భరతదేశాన నీతెల్ల ♦ ప్రజలగూర్చి, తప్పుబల్కితే నంచు మీ ♦ రొప్పబలుక
ప్రజలును ద్రిక్తులైరి నా ♦ పైనబడిరి, కాన వ్యాజ్యము వేయగా ♦ బూననేను.

ఉ. సత్యమెరింగినంతట వి♦చారము బొందగలారు వారలే,
సత్యము దాగదెప్పటికి ♦ సత్వరమే తెలియంగవచ్చు నా
సత్యమె దైవమెన్నగ, న♦సాధ్యము మోసముసేయ దైవముం
నిత్యముగా దసత్యమది ♦ నేర్పులకూర్పుల చేర్పులన్నిటన్. 74

క. అనిమోహనుండు పలుకగ, వినియెస్కోంబిట్లులనియె ♦ వివరముగా నీ
వనినది లిఖించి యిమ్మా, అనుపవలయు వలసమంత్రి ♦ కంతవిషయమున్. 75

క. తొందరపడి వాఙ్మూలమ్మిందే యిపుడిమ్మటంచు ♦ నేగోరను నీ
వెందులకైనను లావ్ఞను,కుం దెలియగజేసి యతని♦గోరము సలపెన్. 76

క. తదితరమిత్రులగలియుము, తదీయసలహాల బొంది ♦ తడబడకింతం
తుదినిర్ణయముం దెలుపుము, సదయులమతి ముందువెనుక ♦ చక్కగగనుమా. 77

సీ. అయినను నినుగొట్టి♦నట్టి దుండగులపై, వ్యాజ్యమొనర్చుచు ♦ హక్కు నీవు
వదలుకొన్న యెడల ♦ వారిరి శాంతిపు,నః స్థాపనమ్మొ నొ♦నర్పుటందు
చాలతోడ్పడు నీయ♦శమ్మధికమ్మగు, ననిపల్కయెస్కోంబె ♦ వినియునెల్ల
నొరులవిచారింప ♦ నొల్లనెవ్వారి నీ,విషయమందుననెల్ల ♦ విమలమతిని. 78

తే. నిర్ణయముజేసికొంటిని♦నీకడకిటు, వచ్చుటకు ముందె తగదంచు ♦ వ్యాజ్యమొసరి
పైనవేయుట;నాదువి♦శ్వాసమిదియ, యనుచుబ్రవాసియెసంగెమో♦హనుడదెల్ల.

వ. తదనంతర మతడు తనయింటి కరిగెను. మరి రెండుదినము లైనవెనుక, ననగా 1897 జనవరి 22 వ తేదిన దనకంతగా సాయమొనర్చిన, అలెగ్జాండరు దంపతులకు గృతజ్ఞతాభివందనలుఁదెలుపు లేఖతోబాటు కొన్ని కానుకలుగూడబంపెను.

### శాంతి పునఃస్థాపన 1897

ఆ. సాటిలేనియిట్టి ♦ సత్యవర్తనచేత, గాంధియశము హెచ్చె ♦ గడవహెచ్చె
తెల్లవారలెల్ల ♦ వెల్లమొగము వేసి, రాత్మవర్తనమున ♦ కంపిసిగ్గు. 80

వ. ఇందుకుదోడుగా నెటాలు అడ్వర్టైజర్ 'అనుపత్రికా ప్రతినిధి యొకడు గాంధిని 1897 జనవరి 13 వ తేదినాడె యోడయందే కలుసుకొని ప్రశ్నింపగా, నతనికి గాంధి, హిందూదేశమున దాను నెటాలులోని శ్వేతజాతివారిగూర్చి, దక్షిణాఫ్రికాలో దా నంతకుముందు నుడివినవానికన్న భిన్నముగా నేదియు నాడలేదని, నిదర్శనపూర్వకముగా ఋజువుచేయుచు, సర్ ఫిరోజ్ షా మెహతా ప్రబోధమువలన దాను జేసిన లిఖితోపన్యాస ప్రతులను జూపెను. ఇంతియేకాక, తనతోగూడ రెండోడలనిండుగా వచ్చిన యిండియనులకును, దనకును నెట్టి సంబంధములేని విషయమునుగూడ తత్పత్రికా ప్రతినిధి కెరుకపరచెను. ఏతద్విషయములెల్లయు బ్రచురించుచు గాంధి నిర్దోషిత్వమును బ్రశంసించుచు, నాతనిపై దౌర్జన్యము నెరపిన అల్లరిమూకల ఖండించుచు, సౌతాఫ్రికాపత్రికలు

ప్రముఖప్రకటనలు గావించెను. ఇందువలన గాంధిప్రతిష్ఠయే గాక, దక్షిణాఫ్రికా లోని భారతీయసంఘ ప్రతిష్ఠయును నినుమడించెను. అట్టిప్రతిష్ఠ పెంపకముతో భారతీయులపైన దెల్ల వారలెల్ల యీర్ష్యాకులచిత్తులైరి. ఈర్ష్యానలము పెంపు నంజేసి, యిండియనుల పెంపుద్రుంప సమకట్టి దక్షిణాఫ్రికాలోని శ్వేతజాతి ప్రభుత్వమువారు దమ నెటాలు శాసనసభలో రెండుబిల్లుల బ్రవేశపెట్టిరి. అందులో నొండు భారతీయుల వ్యాపారవ్యాపక మాపుచేయుట కుద్దేశింపబడి యుండెను. అదృష్టవశమున నోటుహక్కుకుగాను జరిగిన పోరాటములో, జాతి వర్ణ భేదములు బాటించు శాసనములు జేయబడగూడదను నిర్ణయము జరిగిన కారణమువలన, నిండియనులపై యెట్టిశాసనము చేయగూడదనుతీర్మానముతో ముగిసెను. 81

క. ఈబిల్లుల మూలమున బ్రజాబాహుళ్యమ్మునందు ♦ జాగృతి హెచ్చెన్
ప్రాబల్యమెచ్చె గాంధికి, రాబడితో బాటుపడగ ♦ ప్రజకై సతమున్. 82

ఆ. భారతీయజనుల ♦ భాషలన్నిటిలోని, కనువదింపబడియె ♦ నన్నిబిల్లు
లర్థమయ్యెడుగతి ♦ నంతయు విశదీకరింపబడియె బ్రజల♦కెల్లరికిని. 83

ఆ. వినతిపత్రమంపు♦కొని రిండియనులెల్ల, కలిమిబలిమితోడ ♦ వలసరాజ్య
కార్యదర్శికపుడు ♦ గాంధియధ్యక్షత, బిల్లులెల్లత్రోసి ♦ వేయమనుచు. 84

తే. అయినను నెటాలుచట్ట స♦భాధికార, మాపగా సమ్మతింపనే ♦ నంచతండు
పలికెబిల్లులు శాసన♦ములుగ నయ్యె. 85

మం. ప్రజకుసంబంధించు ♦ పను లెక్కువయ్యె, గాంధికాలముచాల♦గడచెనాపనుల
మనుషుకులాలను ♦ మాన్యమిత్రుండు, గాంధికి సాయంబు ♦ గావించెబ్రీతి
గాంధిభారతదేశ ♦ మందుండినపుడు, కాంగ్రెసుసభ్యసం♦ఖ్యయు హెచ్చెదాని
నిధివేయిపౌండ్లయ్యె ♦ నేవ్వరి సేటు, ఆడమ్జిమియఖాను ♦ అధ్వర్యమందు
బిల్లులం జాగృతి ♦ బెంపొంద గాంధి, సభ్యులజేర్చెను ♦ సమకూర్చెనిధిని
అయిదువేలపవుండ్ల ♦ నతిసాహసమున, ఆస్తిసంపాదించె ♦ నద్దానియద్దె
కాంగ్రెసునకు దిన♦ఖర్చుకిబడియె, ఆనిధిపాలన♦కై మంచిధర్మ
కర్త సంఘసియామ♦కమ్మొనరించె, అయిన నాసంఘమం ♦ దంతర్వి భేద
కారణంబునబాడు♦గలు వసూల్గాక, కోర్టులోనెలనెల ♦ కూడబెట్టబడె
దక్షిణాఫ్రికను వ♦దలి గాంధిరాగ, ఈసాక్ష్యనుభవముచే ♦ నికమీదప్రజల
సంస్థలనడుపుట ♦ సరిగాదునిత్య, నిధులచేసని గాంధి ♦ నెమ్మది నెంచె. 96

ఆ. నిత్యనిధులయందు ♦ నీతిబాహ్యంబగు, నడవడికకుబీజ ♦ మడగియుండు
సంస్థపతనమునకు ♦ జక్కనిమార్గంబు. నిత్యనిధులుగూర్చు ♦ నేప్పమీర. 97

సీ. తానిర్వహించిన ♦ తదితరసంస్థాను,భవమున గాంధికి ♦ భావమందు
కుదిరెవిశ్వాసంబు ♦ కుదురుగానికమీద, నిత్యనిధులతోడ ♦ సత్యసరణి

సాధ్యమవదు ప్రజా♦సంస్థలనడుపుట, ప్రజప్రాపు లేకున్న ♦ భారమగుట
అవని బ్రజాసంస్థ♦ మనః బ్రజామోదంబు, వెలయ బ్రజాధన ♦ మొలయునదియె
సంస్థకేదైన ప్ర♦జాప్రాపకమ్మెప్పు, డంతరించినసంస్థ ♦ వాక్కుడంగు
నిత్యనిధులచేత ♦ నెగడుసంస్థలు ప్రజాభిప్రాయమడ్డప్డు ♦ విస్మరించు.

తే. కనుకననుదినము బ్రకృతి♦గతిని గడుపవలె బ్రజాసంస్థలెల్ల జీ♦వనము నవవి
యను చుజా లెబల్మారు మో♦హనుడు ఘనుడు, స్వానుభవపూర్వకముగవి♦జ్ఞానియగుట.

క. హర్షించి ప్రజలొసంగెడు, వార్షికచందాలె సంస్థ♦వాసికి సత్కో
త్కర్షమునకు నిక్షేపము, మార్షమ్మొం ధర్మమెన్న ♦ నావర్శమ్ముల్. 99

ఆ. అయిన శాశ్వతనుగు ♦ నాలయంబుండంగ, వలయు దైవమునకు♦ వలెను బ్రజల
సంస్థలన్నిటికిని ♦ చందాలతో సాగ, వలయు నవియునివియు ♦ వ్యవసములందు.

బిడ్డల చదువులు

సీ. బయటప్రజాసంస్థ ♦ నెనిర్వహించుచును, నింటబిడ్డల జది♦వించు పెట్టు
లంచునాలోచించి ♦ యాంగ్లమునకు తి గొందు, నెంకేడుపొండ్లకు ♦ నేర్పజదువు
కావించనేర్పాటు ♦ గాంధిబిడ్డలకట్లు, సాగెను గొన్నాళ్లు ♦ చదువులందు
నేర్పతానడ్డప్ప ♦ నేర్చిరి మాతృభాషను పట్టుపడె పరి♦జ్ఞానమింత

ఆ. కాని యాంగ్లవనిత♦కడ గ్రహసత్వమ్ముగ నేర్చు. చదువువలన దృష్టి♦యొదవలేదు
ఆంగ్లపాఠశాల ♦ కనుపనిష్టముగలేక, అభిలషించడంప ♦ హాస్టలులను. 101

సీ. చదువులుమాతృభా♦షను సాగుటయెగాంధి, యభిమతమైయుండె♦ననవరతము
తల్లిదండ్రులం జిన్న♦పిల్లలువీడుట, లనుచితంబని సత♦ముతని మతము
చక్కని, చిక్కని ♦ సాంప్రదాయములొప్పు, సంసారమందున ♦ సహజరీతి
నొదవెడు చదువుల ♦ కెదియుసమానంబు, కాదుహాస్టలునందు ♦ గరచువిద్య

తే. అనుభవమ్మును బడిసెందు ♦ నలవడగల, విద్యకేలపాటిరాగల ♦ విద్యలేమ
ఎం ఎ, బియ్యె మొదలగు స♦ర్టిఫికెటులు. నెగ్గువారేమిసేతురు ♦ సిగ్గుచేర. 102

క. జననీజనకులవదలుచు, జనికొనుటకిక హాస్టలందు ♦ పాపము చెపుదుగా
తనియుచు, కృత్రిమవిద్యల, గనుపిల్లలకెట్లుగల్గు ♦ మంచిగుణమ్ముల్. 103

ఉ. కృత్రిమవిద్యలన్ మునిగి ♦ కేవలముం బెద్దల, దల్లిదండ్రులన్
చిత్రములైన దుస్తుల వి♦చిత్రగతిం ధరియించుచున్ సదా
ఆత్రముతోడబరీక్షకును ♦ నచ్చటికిచ్చటికిచ్చునై యహో
రాత్రములం బరీక్షలకు ♦ రాకుసవీక్ష బఠించువారలే
మాత్రము దేశసేవయెడ ♦ మానసముంతురు భక్తియుక్తులై. 104

క. అనితనమనమందున మోహనుడాలోచించి తనకు♦మారులం గాలే
జిని జనువగనంపండా,యెను దంబాచార్యగాక ♦ యొసగిరివారల్. 105

ఆ. అందువలన గాంధి ♦ నందను లలవాటు,పడిరి డంబమెల్ల ♦ విడిన జీవి
తమునకిచ్చుమెయిని ♦ దమతండ్రి యడుగుజా,డలను నడువగలిగి ♦ రెలమి కలిమి.

చ. అయినను గాంధి పిన్నవయ ♦ సందున స్వైరవిహారియౌచునే
నియమములేని జీవితమ ♦ నిశ్చితరీతుల సాగిపోవ ని
ర్భయముగనున్న కాలమున ♦ బ్రాయమునం జనియించినట్టి వా
డయినకతమ్ము నన్వదలె ♦ నాతని జ్యేష్ఠతనూజుడాతనిన్. 107

సీ. స్నేహితు లెందరో ♦ చేరి ప్రశ్నించిరి, గాంధినిట్లాతని ♦ నందనులను
"కాలేజిచదువుల ♦ కేలబంపవయితి, వందేమికీడున్న ♦ దయ్యనీకు?
వారిరెక్కలనిట్లు ♦ వంపగానీకేమి, హక్కుండె? నీవేల ♦ యడ్డుపడితి
వారుపట్టములంది ♦ వారికిష్టమ్మైన, ఉద్యోగములజేరి ♦ యుంట" కైన

తే. అట్టిపట్టమ్ములందిన ♦ దిట్టలైన, యువకులం దస తనయుల ♦ కుద్దియైన
వారలం గాంచెఁ బలువుర ♦ వారలేరు, మనిషిమనిషిగ గనఁదన ♦ తనయులకును
మించువారని గాంధి క ♦ న్పించలేదు. 108

మం. పరగృహవిద్యకు ♦ బడిచదువులకు, కలదు భేదమదెంతో ♦ కలదుసత్ఫలము
తలిదండ్రులు తమ ♦ తనయుల బ్రతుకు,నం జేయు మారుపు ♦ లం జెల్ల సతము
త్యాగమ్ముగోరు స ♦ త్యారాధకుని వ,లన సత్యదేవత ♦ అనిశమదెంతో
చదువులెన్నైనను ♦ స్వాతంత్ర్యమునకు, సమముగావను నుడి ♦ సత్యమెఱింగి
పంపడాయెసుతుల ♦ బడికి; నా బడుల,వీడి రమ్మనెగాంధి ♦ స్వేచ్ఛోద్యమమున.

సేవాసక్తి—1897

ఆ. గాంధివృత్తి దృష్టి ♦ కరముగా నభివృద్ధి, బొందెనైనదాను ♦ బొందడాయె
నించుకంతదృష్టి ♦ నికను నిరాడంబ,రముగ బ్రదుకగోరె ♦ విమలగతిని. 114

ఆ. మరియుగోరె, దోడి ♦ మానవులకుసేవ, సేయవిడకగాంధి ♦ చిత్తమెపుడు
అట్టిసమయమందు ♦ నరుదెంచె నొకకుష్ఠు,రోగి యతనియింటి ♦ కాగెనందు.115

క. కేవలమాతని యన్నము,తో వెడలింపకయె ప్రీతి ♦ తోనాతనికిం
గావించె సేవగింపక, సేవల దనయింటనిల్పి ♦ చిత్తమెలర్పన్. 116

క. తనయింటనె యాశ్రయమిడి, తనియ నతని పుండ్లకడిగి ♦ తానేకట్టుల్
పనిగొనికట్టుచు బెట్టుచు, మనమలరగ భోజనంబు ♦ మరువగవ్యథలన్. 117

సీ. అయిననెన్నాళ్ళట్టు ♦ లతనితోవేగుటం, చని ప్రభుత్వమువారి ♦ హాస్పిటలుకు
అని పెన్షాతనినైన ♦ మనమూరడిలకనే,దో స్థిరమైనట్టి ♦ తోడిమాన
వోపకారకముగా ♦ నుండుసత్కార్యమ్మొ,కండొనర్పగ మది ♦ కాంక్షజేసి
కన్నబ్రోలె దయాహృ ♦ దయుడైన డాక్టరు, బూతను నాతని ♦ చేతిక్రింద

తే. పార్సిగస్టోన్జిధర్మ సం♦పత్సహాయ, బలము వెలయగ ధర్మాసు♦పత్రి చిన్న
దొండు తెరువగ జేసె నం♦దుండ గాంధి. రోగిసేవల కంపౌండ♦రుగ నొనర్చ. 118

వ. ఈ ధర్మాసుపత్రి స్థాపన 1897 సెప్టెంబరు 14 వ తేదిన డర్బనునగరమున జరిగెను. అందు గాంధి కాంపౌండరుగా దినము రెండుగంటలకాలముండి. యనాథవ్యాధి పీడితుల సేవసేయు స్వచ్ఛందముగా నీయకొనెను. అంతకుముందే యాఫిబ్రవరి నెల 2,3,4 తేదులందు వార్తాపత్రికల కానాటి భారతదేశమందలి క్షామపీడితుల సహాయార్థము నిధిసేకరించునిమిత్తము నెటాలుప్రజకు విజ్ఞప్తిగావించుచు ప్రకటనలుగావించెను. భారతీయభాషలలో కరపత్రములు ప్రచురించెను. ఫిబ్రవరి 8 తేదిన డర్బనునగరమందలి క్రైస్తవమతాధికారులకు క్షామపీడిత సహాయార్థము విజ్ఞప్తిగావించెను. ఏతత్ఫలితముగా 1540 పౌండ్లవరకు క్షామపీడితులకుగాను నెటాలు యిండియనులనుండి నిధి సేకరింపబడెను. జూన్ మాసమున విక్టోరియా మహారాణి వజ్రోత్సవమందు పాల్గొని ఇండియన్ గ్రంథాలయావిష్కరణోత్సవమున నుపన్యసించెను 119

తే. న్యాయవాదిగ గాంధికు♦న్నట్టిపనుల, చక్కజూచెను భారను ♦ సఖుడొకండు
వ్యాజ్యములను మేజస్ట్రేటు♦న్యాయసభను, గాంధి కాంపౌండరుగనున్న♦కాలమందు.

ఉ. రోగులబాధలెవ్వియొ నె♦రుంగ బరామరిసించి వారి నా
రోగవిశేషముల్ దెలుపు ♦ ప్రౌఢగ డాక్టరుకెల్ల నాతడా
రోగమునీగ దెల్పగ ని♦రూఢిగ మందుల గల్పియిచ్చుచుం
డాగక నెందు మోహనుడు ♦ హాస్పిటలం దనురాగమందుచున్. 121

ఉ. వ్యాధులబాధలంబడెడు ♦ వార లనేకజనమ్ము శ్రామికుల్
బాధనివారణార్థమయి ♦ వచ్చుచు బోవుచు వైద్యశాలకున్
సాధుగుణాకరున్ విమల♦శాంత మనోజ్ఞుని గాంధిగాంచుచున్
వేదనలం దరింపగ ని♦వేదనముం బొనరించి రెల్లయున్. 122

ఆ. ఇటులనిండియను ల♦క్షోజనమ్ముల, తమిళులాంధ్రుల దది♦తరులభార
తీయు లెంతమంది♦నో యాశ్రయించుచు, మొగను గలిసికొనియె ♦ మోహనుండు.

క. ఈ కాంపౌండరనుభవ మిమ్మే కూర్చెను వలయుజ్ఞాన ♦ మెంతయు దెబ్బల్
దాకగ బోయనరణమున, శోకించెడు వారిసేవ ♦ జొప్పడజేయన్. 124

తే. కల్గిరిద్దరుతనయులు ♦ గాంధికల్ల, దక్షిణాఫ్రికాయందున ♦ దక్షతమెయి
వారిపెంపకమందున ♦ బనికివచ్చె, హాస్పిటలునగడించిన ♦ యనుభవమ్ము. 125

సీ. దక్షిణాఫ్రికయందు ♦ తగినశిక్షణగల్గి, నట్టి భారతనర్సు ♦ లరిదియగుట
భద్రమ్ముగా దన ♦ బాల్యనీళ్ళాడుట, కరసమ్మగుపిష♦యము లెరింగె

డాక్టరుత్రిభువన ♦ దాసురచించిన, 'మా శిశుపోషణం'♦బఠనజేసి
అపాత్తమున దెల్పి♦నట్లుగా దనయను,భవ మెరింగించిన ♦ పద్ధతులను

తే. పెంచెమోహనుడిర్వుర ♦ బిడలనెత్తి, తానెతండ్రియై తల్లియై ♦ మానుగాను
కొనియెమాసద్వ్యయమెదాది♦పనులగాంధి, దీక్షయట్టిది స్వాతంత్ర్య♦దీప్తివలన.

క. కనినప్పుడునొక్కొకపరి, తనసతికి సహాయమునకు ♦ దాదిని నియమిం
చెను రెండునెలలపాటుం, బనిపాటు లోనర్పనామె ♦ వలచిన రీతిన్. 127

క. కడపటిబిడ్డ జనించిన,పుడు డాక్టరులభ్యపడమి ♦ మోహనుడేతా
పడతి సుఖప్రసవంబగు, వడువున గనె నామె దనదు ♦ పరనాశక్తిన్. 128

తే. తా బఠించిన త్రిభువన ♦ దాసురచన, వలనగల్గిన విజ్ఞాన♦పటిమవలన
జంకుగొంకులువిడి తన♦పతి విచేశ, మందుసుఖమున బ్రసవించు♦నట్లొనర్చె. 129

తే. సక్రమమ్ముగబిడ్డల ♦ సాకి సంత,రింపగ, దదీయవిజ్ఞాన ♦ మించుకంత
తల్లిదండ్రులెఱుంగుట ♦ తప్పనిసరి,యనుచు స్వానుభవమునమో♦హనుడెరింగె.

సీ. తనకుమారుల నిట్టు♦లనిశమారోగ్య సూ.త్రానుగుణమ్ముగా ♦ నరయుకతన
వాడునిరంతర ♦ మారోగ్యముగనుండి, రావంత తలిదండ్రు ♦ లడలకుండ
ప్రథమసంవత్సర ♦ పంచకమ్మనె గ్ర,హింత్రుజీవితమున ♦ నెక్కువగను
వాస్తవమ్ముగ గర్భ♦వాసమందుననె వి,ద్యారంభమగును సం♦తానమునకు

ఆ. చూలువడెడువేళ ♦ నేలీలతలిదండ్రు,లుండ్రు దైహికముగ ♦ నుల్లమందు
నట్లుపుట్టుచుండ్రు ♦ నవ్వారిబిడ్డలా, బుద్ధులే ప్రపంచ♦మున వెలయగ. 131

క. గర్భముననుండునప్పుడు, అర్భకునికి దల్లిసద్గు♦ణావగుణంబుల్
నిర్బంధమ్ముగ నలవడు, దుర్భరములు కొన్నియందు ♦ దొడ్డగుణమ్ముల్.

క. జననానంతర మీఘవి, జననీజనకులనుగాంచి ♦ సకలమెఱుంగున్
అనుకరణంగొన్ని గొనములు, అనుసరణానుమతులమరి ♦ యన్యగుణమ్ముల్.

మం. కానదంపతులెప్డు ♦ కలియంగరాదు, కేవలకామార్తి♦నావేశమునను
సంగమమెల్ల స♦త్సంతతికొఱకె,యని గ్రహించుటలెస్స ♦ యాల్మగలెపుడు
తింటనిద్రించుట ♦ వంటిది సంగ,మమ్మని తలచుట ♦ యవివేకమగును.
శ్రీపరమేశ్వరు ♦ క్రీడాస్థలమ్ము, పరమాత్మ ప్రతిభకు ♦ ప్రతిబింబమైన
ఈప్రపంచమ్మున ♦ నీశ్వరునాజ్ఞ, మీరివర్తించుట ♦ మేల్గాదుసుమ్ము
మితిమీరగా సంగ ♦ మించిదుస్సంతు, గనుటపచారమ్ము ♦ గావించుటీశు
నెడనంచునెల్లవా ♦ రెరుగంగవలయు, సంతానమెల్లయు ♦ శారీరకముగ
మానసికముగ వై♦జ్ఞానికమ్ముగను, ప్రగతిపథంబున ♦ బయనింప, పుత్ర
పౌత్రపరంపర ♦ ప్రబలమౌనట్లు, సంభోగకార్యమ్ము ♦ సలుపంగవలయు
మితముగా జ్ఞానసం♦యుతులైన మనుజు,లని గాంధివాకొనె ♦ స్వానుభవమున
దాపరికమువీడి ♦ యోపిశుభంబు, అభిలషించుచుమాన ♦ వావళికెల్ల. 144

—— బ్రహ్మచర్యము—1897I-1901 ——

సీ. క్రమముగా నీగతి ♦ బ్రహ్మచర్యము గాంధి, వ్రతముగా ననుసరిం♦పంగ నెంచె
పరిణయమ్మాదేక ♦ పత్నీత్వమాదర్శ,ముగ నవలంబించె ♦ మోహానుండు
సత్యాచగణమందు ♦ నిత్యాంగముగదన, యర్ధాంగినేదప్ప ♦ నన్యసతుల
తలపకుండుటె నిత్య♦ధర్మమ్ముగానెంచె, సత్యధర్మవ్రతా♦చారి గాంధి

ఆ. కాని దక్షిణాఫ్రి♦కాదేశమందె గ్ర,హింపగల్గె నాత♦డింపుమీర
భార్యయెడలగూడ ♦ బ్రహ్మచర్యవ్రతం,బూను టెంతమిగుల♦ముఖ్యగుణమొ.

క. ఇందులకు ముఖ్యకారణ,మెందెట్టుల నెపుడు సంభ♦వించెనో తనకం
తం దెలియదంచు బల్కెను, గాంధి తదీయాత్మచరిత ♦ గాథాపుటలన్. 146

ఆ. రాయిచందుభాయి ♦ ప్రతిభాప్రభావమే, మిగతవానికన్న ♦ మిక్కుటముగ
తన్ను బ్రహ్మచర్య ♦ మెన్నుకొనగజేసె, నంచుగాంధివ్రాసె ♦ నాత్మకథను. 147

సీ. ఆంగ్లదేశ ప్రధా♦నాధ్యక్షులం జేర్లన్సు, గ్లాడ్‌స్టనసెడు మహా♦ఘనునిభార్య
తనభర్తయెడ సత♦మనురాగయుత భక్తి,చాలొచు కామన్స♦హానునందె
అతనికై 'టీ'నిత♦యారు గావింపగా, పట్టుబట్టి యొనర్చె ♦ భక్తియుక్తి
ఆమిథున పరస్ప♦రానురాగము పేరు, గన్నదిగదెయంచు ♦ గాంధిపల్కె

ఆ. రాయిచందుతో ద♦మీయసంభోగాను, రాగమునుగురించి ♦ రమ్యఫణితి
వినుతిచేయగాంధి ♦ గనియిట్టుపల్కెనా, రాయిచందుభాయి ♦ ధీయుతముగ.

సీ. గ్లాడ్‌స్టనుయెడభార్య♦గారు ప్రేమతో జేసి, నట్టిసేవమహో♦త్తమాధికంబొ
గాక, యాతనిభార్య ♦ గాగాదయిడుభక్తి, యుతసేవయత్యధి♦కోత్తమంబొ
ఆతనికామె ప్రి♦యానుజయో లేక, సద్భక్తిపరిచర్య ♦ సలుపుదాసి
యైయట్టిశ్రద్ధతో ♦ నాసక్తిసేవలో,నర్పుచో నపుడేమి ♦ యందువీవు

తే. లేరొకో! పలువురు పరి♦చారకులును, సోదరీమణులట్టి మ♦హాదరమున
సేవచేసినవారెంద♦రో వినవొకో, అట్టివారిచరితకొందు ♦ నచనియందు? 149

తే. పురుషసేవకుడట్టి సం♦పూర్ణభక్తి, అల్లగ్లాడ్‌స్టను సతిబోలె ♦ నధికసక్తి
నాచరించినసేవ నీ♦వట్టిప్రీతి, జెందువాడవె తెలుపుమా ♦ గాంధియనగ 150

క. వినిరాయిచందుభాయ్ చె,ప్పినదంతయు, గాంధితలచె ♦ ప్రియసతి పతిభ
క్తిని సేవించుటకన్నను, వినుతింపందగును దాసి♦ప్రియపరిచర్యన్. 151

క. ప్రతిసతి తనపతిం దత్పర,హిత మతిమైసేవసేయు ♦ టెల్లయు సహజం
బతులిత మెదిగల దందా,శ్రితు శ్రద్ధాసక్త్యుపేత ♦ సేవయె మించున్. 152

ఆ. సతిపతికి నొనర్చు ♦ సాజమ్ముగానె శ్ర,ద్ధానురక్తి సేవ ♦ దానికన్న
వేయిరెట్లుదగును ♦ వినుతింపసేవకుం, డాచరింపశ్రద్ధ ♦ నధిపుసేవ. 153

సీ. ఆలోచనామగ్ను ♦ డై యిటు, దనసతి, యెడదనవిశ్వాస ♦ మెట్టులుంట
సరియగునంచు వి♦చారించి, సతియెడ, కామదాసుండౌట♦గాదు కాదు
విశ్వాసమనగనీ ♦ విశ్వమందునగాము, మరికట్టి, బ్రహ్మచ♦ర్యవ్రతంబు
సాగించుటేచాల ♦ చక్కనిపథమంచు, పనిబూనె నందుల ♦ కనిశమతడు
తే. ఆదియందుఁగుటుంబని ♦ యంత్రణేచ్ఛ, కారణంబైన గ్రమముగా♦గడకుఁ,గడక
విజయమందెను, పడిలేచు ♦ చజయుడగుచు, ఆచరించెను బ్రహ్మచ♦ర్యవ్రతంబు
అడచి కామేచ్ఛ మోహానుం ♦ డతివతోడ. 154

క. ఒక్కొకప్పుడు పనిలో, చిక్కి దినాంతమున నలసి♦చేవయుడిగిన
పైక్కనుమంచమునిద్రం, జిక్కుచు, దక్కుచును భార్య♦చేరువబోకన్. 155

వ. ఇట్టిప్రయత్నము లెన్నియొనర్చినను నంతగా ఫలమతడందలేదు. అయినను నిట్టి యనేకయత్నమ్ముల సత్ఫలితమ్ముగానే కడకు గాంధి తనపూనికయందు విజయముసాధించెను. ఆతనికిబ్రహ్మచర్య వ్రతభాగ్యప్రాప్తి 1906 వ వత్సరము నందు గల్గెను. అప్పటికింకను సత్యాగ్రహమారంభింపలేదు. ఏతద్విషయము గురించి, యాతనికప్పటికేదియుఁ దెలియదు. అప్పుడప్పుడే బోయరుయుద్ధ మంతమై నెటాలున జూలూలఅలజడి సంభవించెను. అప్పుడుగాంధి జోహాన్స బర్గు నగరమున దనన్యాయవాద వృత్తినెరపుచుండెను. జూలూల అలజడికాల మున నెటాలుప్రభుత్వమునకు దనచేనైనంత సేవసేయసంకల్పించి, గాంధి తన సంకల్పముగూర్చి ప్రభుత్వమునకు దెలియజేసెను. ప్రభుత్వమువారును గాంధి కోర్కె కీయకొనిరి. గాంధియు ఆంబులెన్స్‌కోర్సుతో నెటాలుప్రభుత్వమునకు సాయముజేయబోయెను. ఆకాలమున సంఘసేవకంకితమైన సంతాన సంపదల, సంపూర్ణముగాసన్యసించి వానప్రస్థజీవన మొనర్చుట సమంజసమనిర్ణయించుకొని తదనుసరణార్థము వ్రతదీక్షకు బూనుకొనెను. జూలూఅల్లరు లారువారములు మాత్రమే జరిగినను గాంధి యది తనజీవయాత్రయందు ప్రధానమైన మలుపుగా భావించెను. అప్పటినుండియే వ్రతములయొక్క, దీక్షలయొక్క, ప్రాముఖ్య మును పరిపూర్ణముగా గ్రహించి గాంధి యవ్వానిని నిష్ఠతో సంతృప్తిగా నేకొరత రానీకుండ నెరవేర్చుట నేర్చుకొనెను. 156

మ. వ్రతదీక్షావిధి స్వేచ్ఛభంగమగు స♦న్వాదంబనాధార మీ
బతుకందుఁ నిజమైన స్వేచ్ఛగలుగఁ ♦ బాలింపగాబోలు సు
వ్రతనిష్ఠానియమంబులంచు దృఢమా ♦ స్వాంతంబుతో గాంధి స
న్మతియై పూనెను బ్రహ్మచర్యవ్రతముం ♦ బాలింప శీలంబుతోన్. 157

సీ. బ్రహ్మచర్యవ్రత ♦ పాలనమ్మున జయం, బందమి దృఢనిశ్చ♦యంబులేమి
భగవంతుదయయందు ♦ దగిననమ్మికలేమి, ఆత్మవిశ్వాసమా♦వంతలేమి

సంతత సందేహ♦సాగరమ్మునఁగొట్టు, మిట్టాడు మనసరి ♦ కట్టలేమి
ఎల్లలేములు నశి♦యించి విజయలక్ష్మి, చేపట్టుమనుజుండు ♦ స్థిరమనమ్ము
తే. వెలయ వ్రతదీక్షఁ బూననే ♦ విషయమందు
ననుచు దృఢనిశ్చయుఁడయి మో♦హనుఁడు బ్రహ్మ
చర్యమును వ్రతదీక్షగా♦జరుపఁబూనె, నార్యజనరీతిభక్తిమై ♦ యనుసరించి. 158

ఆ. శపథమూనకుండ ♦ సమకూరదాత్మ ని,శ్చయము; తద్వినావి♦జయముగలుగ
దెట్టియత్నము దుద♦ముట్టసాగదు, చంచ,లాత్ముఁడైన వా♦డొనర్చు పనుల. 159

ఆ. అందుకనియె నిష్క♦లానందుఁడాడె వి,రాగిగాకనరుఁడు ♦ త్యాగిగాఁడ
టంచుగానగాంధి ♦ యాత్మవైరాగ్య స,న్యాసమూనె మనము♦హర్షమంద. 160

మం. ముందువెనుకలు సం♦పూర్తిగా మనము,నందు విచారించి♦యానందమునను
పదియును దొమ్మిది♦వందలు నార,వాబ్దాన బ్రహ్మచ♦ర్యవ్రతదీక్ష
కొనెగాంధి తనభార్య ♦ యనుమతింపంగ. 163

సీ. సతితోటి సంభోగ♦సౌఖ్యసంతోష మా,పంతలేకుండ సా♦ధ్యంబె మనగ?
రాగరజ్జువులకు ♦ లోఁగక,దిన మొక్క, వత్సరంబుగ గడు♦పంగనౌనె?
ప్రక్కనసతియుండ ♦ పలువిధమ్ముల వాంఛ,లూరింప శక్యంబె ♦ యూరకుండ?
క్షుద్రప్రపంచకా ♦ మోద్రేక మొదవించు, పరిసరమ్ముల ప్రభా♦వమునకింత
ఆ. లోనుగాకసాధ్య ♦ మానొకో బ్రహ్మచ,ర్యవ్రతంబు దీక్ష ♦ ననుసరింప
ననుచుగాంధియెంతొ ♦ అనుమానడోలాయ, మానమానసమున ♦ దీనుఁడయ్యె.

సుగంధి. దీనుఁడైననంతగాంధి ♦ దీనరక్షణక్షమా
ధీనుఁడైనజానకీ స♦తీధవుం దలంచుచున్
మానసాంబుజంబునన్ స♦మర్పణంబు భక్తితో
జ్ఞానియౌచు బూనె బ్రహ్మ♦చర్య దీక్షదక్షతన్. 165

క. శ్రీరామా, కౌసల్యానందారామా, ప్రేమధామ ♦ నామనమున నా
త్మారాముఁడవై నిలుమా, ఘోరాముల నడచినన్ను ♦ పోషింపగదే. 166

క. రామా రఘుకుల జలనిధి, సోమా, నినునమ్మినేను ♦ స్తుతముని నామా
నేమమ్మున బూనితి ని,ష్కామా, కామాగ్ని నార్చి ♦ కాపాడగదే. 167

క. నీవేనాకిక దిక్కిల నీవేనా పట్టుగొమ్మ ♦ వీరాగాబ్ధిన్
నావగ, నావగదీర్పం, గావగదే కంపకుండ ♦ కామాగ్ని నిలన్. 168

ఆ. అనుచుఁ గామజనకు ♦ నందు సంపూర్ణవి,శ్వాసముంచి బ్రహ్మ♦చర్యదీక్ష
గొనియెగాంధి, యెవడు♦మనసార శ్రీరాము, నమ్మువానికోర్కె♦నమ్ము కాదు.

వ. ఇట్లు 1906 వ వత్సరమున నారంభింపబడిన, తనబ్రహ్మచర్య దీక్షగూర్చి మోహనుఁడు తనజీవిత చరితయందు 1925-26 లో నిట్లువ్రాసెను. "గతవింశతి

వత్సరమ్ముల దీక్షంగూర్చి సింహావలోకన మొనర్ప నాకెంతయో సంతోషాశ్చర్యములు గల్గుచున్నవి. 1901 నుండియే యించుమించుగా నింద్రియనిగ్రహాచరణముఁ బాటించుచునే యున్నాను. కాని దీక్షగొన్న తరువాత ననగా 1906 నుండిగల్గిన స్వేచ్ఛానందానుభూతు లంతకుముందందని ఫలములుగానే యుండెను. దీక్షాత్పూర్వము నేనేనిమిషమందైనను, నెట్టిప్రలోభములకైనను లోనగునట్లుండెను, అనంతరమట్లుగాక, సకలప్రలోభాపాయములనుండి రక్షించు శ్రీరామరక్షగా బ్రహ్మచర్యదీక్ష నన్ననుక్షణము రక్షించెను. బ్రహ్మచర్యదీక్షా మహామహిమ దినదినమున కధికాధికముగా నాకువిశదముగా దెలియనయ్యెను. జూలూలఅల్లరుల కాలమందలి నా 'అంబులెన్స్'పని ముగిసినవెంటనే, నేను ఫోనిక్సు ఆశ్రమమునకు జనితిని. అందుండినపుడె బ్రహ్మచర్యదీక్షకుం దొరకొంటిని. అచటనుండి జోహన్సుబర్గు నగరమునకుజేరిన యొకనెలకు లోపులనే సత్యాగ్రహమునకు బునాది యేర్పడెను. నాకుతెలియకుండనే, నా దీక్షాచరణమే నన్ను సత్యాగ్రహమున కాయత్తపరచెను. అయ్యది నే నేమాత్రమును ముందుగా ననుకొన్నది కాదు. దాని కదేసంఘటిల్లెను. అయినను నేనంతకుముందవలంబించిన విధానములు క్రమముగా సత్యాగ్రహ సంఘటనకు దారితీసెను. అధికాధికముగానున్న జోహాన్సుబర్గునందలి నాకుటుంబ వ్యయమును బూర్తిగా దగ్గించుకొని బ్రహ్మచర్యదీక్షా స్వీకారముకొరకో అనునట్లు ఫోనిక్సునకరిగితిని. సంపూర్ణబ్రహ్మచర్యావలంబన మనగా బ్రహ్మసాక్షాత్కృతిం బడయుటయే యను విజ్ఞానము కేవలము శాస్త్రపఠనమువలన నాకలపడినది కాదుసుమా. క్రమముగా స్వానుభవమువలన, నెమ్మదిగా సిద్ధించిన ప్రజ్ఞానము. తదనంతరము నాజీవితమందలి చరమదశలో బ్రహ్మచర్యముగూర్చి తెలుపు శాస్త్రపఠనగావించితిని. అనుదిన దీక్షాచరణమువలన, దైహికమానసికాధ్యాత్మికసంరక్షణ సకలము తదాచరణమందే వెలయుచున్నదను విజ్ఞానగమ్యమునకు జేరువగా జేరుకొంటిని. బ్రహ్మచర్యదీక్ష నాకిపుడు కేవలము కష్టముతో గూడుకొన్న తపముగా దోపక, సంతోషము, సంతృప్తిగల్గించునదిగా బరిణమించెను, ఒక్కొక్కదిన మొక్కొక్క యందమందు దెలివిడియగుచుండెను. ఇంతటిసంతోషాభ్యుదయకర విషయమైనను, నాకయ్యది సులభసాధ్యమైనదని తలపరాదు. నా యేబదారవయేటగూడ, యదియెంత కష్టమైనదో, నాకుపూర్తిగా, నవగతమైన విషయమే. ప్రతిదినమదియొక కత్తిమీద సామువంటిదని గ్రహించుచునే యున్నాడను. ఒక్కొక్కనిమిషమును, సర్వకాలసర్వావస్థలందును జాగరూకతావసరము నాకెరుకయగుచునే యున్నది. 170

ఆ. బ్రహ్మచర్యదీక్ష ♦ పరిపూర్తిగా సాగ,వలయునన్న జిహ్వ♦వాంఛలడపఁ
జెల్లు మొదటఁ గట్టి ♦ జిహ్వాచాపల్యసం,పూర్ణ నిగ్రహమున ♦ మోహనునికి. 171

తే. లఘుతరమ్మౌట దీక్షాప♦లంబనమ్ము,నర్చ నాహారగుణశోధ♦నమ్ము బ్రహ్మ
చారికనుగుణమైన యా♦హారమెరుగ, స్వల్పమైన శాకాహార♦సముదయమున.

క. పరిశోధనఫలితముగా, నెరిగెనతఁడు, విశేషము సరళ♦మింతమసాలా
తిరుగంబోతలు లేనిది, సరియగు నశనమ్ము బ్రహ్మ♦చారికటంచున్. 173

క. ఆరేండ్ల ప్రయోగమ్ముల, నారసె నిల బ్రహ్మచారి ♦ కాదర్శపుటా
హారము ఫలములు పప్పులు, నేరగనని మోహనుండు ♦ నిశ్చయమతియై. 174

తే. ఫలములుం బప్పులొండె సా♦పడెడుకాల,మందుమోహనుడెట్టి మో♦హమునఁబడక
మనఁగ గల్గెను సాపాటు♦మార్పుజెంద, నట్టి మోహరాహిత్యంబు ♦ నంతరించె.

సీ. పండ్లుపప్పులనె సా♦పడుకాలమున దక్షి, ణాఫ్రికాలో పేక♦కష్టులేదు
పాలనుద్రావున♦ప్పటినుండి కష్టసా,ధ్యముగనున్నది వ్రత♦మును పరించు
టగుట చేక్షీరము ♦ ట్లనలీల జీర్ణమౌ, కండరబలమిచ్చు ♦ క్రమఫలప
దార్థమేదైన నొం♦డారయగాఁ బలె, వైద్యవాకీము లె♦వ్వారు పెవి

తే. తెలుపలేరైరి, కనుక నే ♦ దెలియగోరి, కృషినిపల్పును నామాట ♦ నెవ్వరైన
పాలద్రావుటమానగా ♦ వలదువలదు, పరగనుద్రేక మొనవించు♦ వస్తువైన.176

ఆ. బ్రహ్మచర్యమునకు ♦ బయటనోడ్పడు నెంతో, నిరశనవ్రతమ్ము♦నెరపుచున్న
పథ్యమునుటయెంత ♦ ఫలముండునో యంత, పట్టెనంగు దీక్ష ♦ నిస్తులతను. 177

తే. ఇంద్రియోద్రేకముడగింప ♦ నిచ్చగల్లు, వాడు పథ్యపదార్థాలె ♦ వాడవలయు
త్రికరణమ్ముల నుపవాస♦ దీక్షనెరప,వలయు,దిండియే యింద్రియ♦బలమునగుట.

ఉ. ఊరకపస్తులుంట నుప♦యోగము గల్గదు; కేవలమ్ము శా
రీరకమైన దాటనది ♦ ప్రీతిని భక్తివలిర్ప మానసం
బూరక వాని వీనిపయి ♦ వోవగ నీక వ్రతమ్ము మీదనే
సారెకుసారెకుం దలపుఁ ♦ జక్కగ జిక్కగ నుంపలేనిచోన్. 179

క. ఉపవాసమునం దేహము, జపవాసమునందు మానసము పతిముందర్
తపమాచరించుటగు హరి, కృపగల్గును బ్రహ్మచర్య♦ మీడేరంగన్. 180

ఆ. ఉపవసించునట్టి ♦ యొడలుతో సహకరించ,దగిన గల్గుమనసు ♦ భక్తి "రామ
రామచంద్ర, రఘుపతి♦ రాఘవ, రామా యంచు", స్మరణ సేయ బ్రహ్మ♦చర్యదీక్ష

క. సకలేంద్రియ చాపల్యము, నకుమూలము మనము; మనియ♦ నంటకనున్నన్
వికలాత్ముండగు మనుజుం, డకలంకుండగుట సాధ్య♦ముపవీ ధరణిన్. 182

ఆ. కనుక బస్తుకలన ♦ గలుగుఫలమ్మంత, చెప్పుకొనగరాదు ♦ చిత్తశుద్ధి
లేకయున్న మనసు ♦ పోడలరికట్ట, రాకయున్న నందు ♦ రాగమూగ. 183

ఆ. అయినగామవాంఛ ♦ నడగింప సాధ్యంబు,గాదు వస్తువడక ♦ గాన బ్రహ్మ
చర్యమనుసరింప ♦ సతముతప్పదు వస్తు,లుంట తప్పనిసరి ♦ యుర్వియందు. 184

సీ. బ్రహ్మచర్యావలం ♦ బనమున సాధకుల్, దప్పిపోవుచునుంద్రు ♦ తదితరేంద్రి
యోపయోగమున న♦నుచితవర్తన బ్రహ్మ,చారేతరులుగ సం♦చారులౌట
అట్టివారి ప్రయత్న♦మ్ముతయు గ్రీష్మర్తు, వందున శీతకా♦లానుభవము
కొరకు యత్నించెడు ♦ దొరలయత్నముబోలె, సత్ఫలదాయిగా ♦ సాగదెపుడు.

ఆ. బ్రహ్మచారిబ్రతుకు ♦ బ్రహ్మచారేతరు, మనుగడకు విభిన్న♦మగునది గను
వెలయవలయు పవలు ♦ వెలుగురీతిగ, రేయి, కైవడిగనుగాక ♦ కేవలమ్ము. 185

సీ. బ్రహ్మచారి సుదృష్టి ♦ పరగునంతర్ముఖం,బై పరమాత్మపై ♦ భవముగనుచు
బ్రహ్మచారేతరు ♦ పాపపుచూపుండు, పరిసరంబులపాప ♦ పంకిలముల
బ్రహ్మచారిచెవులు ♦ బడదెయ్యదియునొక్క, బ్రహ్మసంస్తుతి పద్య♦పఠనదప్ప
బ్రహ్మచారేతరు ♦ శ్రవణంబులకు విందు,గొల్పుచుండును గూళ♦కుకవనంబు

ఆ. ఇద్దరుందురెపుడు ♦ నిద్దురపోవక, అర్ధరాత్రిదాక ♦ నందొకండు
పుచ్చుకాలమీశు ♦ సచ్చరితముల వే,రొకడుగడుపు వ్యర్థ♦వికటకథల. 186

తే. బ్రహ్మచారికి పరమాత్మ ♦ భవనమొడలు, కుడిపితొట్టితదన్యున ♦ కడరమేను
ఫలములం బ్రీతిదిసుభక్తి ♦ బ్రహ్మచారి, చెడదినుంజిరుటండ్లను♦దదితరుండు.

సీ. క్రమముగా సర్వేశు♦కడకు జేరునొకండు, విటక తైలంజేరు ♦ వేరొకండు
భక్తిసూక్తులువిను ♦ బరవుప్రీను లొకండు, వక్తవాగుడులందు ♦ బరచునొకడు
త్యాగయ్యకీర్తనల్ ♦ ధ్యానించునొక్కండు, సినిమాలపాటలం ♦ జేరునొకడు
పరమేశుదర్శంప ♦ నరుగు కోవెలకొక్క, డేగుడాన్స్యలజూచి ♦ యూగనొకడు

తే. పూజలందున గాలంబు ♦ బుచ్చునొకడు, భోజనంబుల ద్రాగుళ్ళ♦బుచ్చొకండు
అలరునొక్కడు చదివి రా♦మాయణంబు, అడరుచదివిమరొకడు ప్రే♦మాయణమ్ము.

ఆ. బ్రహ్మచారియిటుల♦వసియించునుత్తర, ధ్రువమునందు; మరొక♦ధ్రువమునందు
వాసముండుబ్రీతి బ్రహ్మచారేతరుం, డటులబెరుగువారి ♦ యంతరంబు. 189

వ. బ్రహ్మచర్యమనగా, మనోవాక్కర్మల మూడిట, సర్వేంద్రియముల స్వాధీనము దిడుకొనుటయే. అను దినమధికాధికముగా ననేకవిధములగునవధుల యవసరంబు గ్రహించుచుంటిని. సర్వసంగపరిత్యాగమునకుంబోలె బ్రహ్మచర్యమునకును బరిమితిలేదు. అంతటియమోఘమగు బ్రహ్మచర్యము పరిమిత ప్రయత్నముల సాధింపరానిది. పెక్కురకయ్యది కేవలమాదర్శముగా మాత్రమే వెలయగలదు. బ్రహ్మచర్యసాధకుడు తనలోపముల నెప్పటికప్పటికి గ్రహించుచునే యుండును. తన హృదయాంతర్భాగములం దెందైన నడయాడు వ్యామోహములం బట్టుకొని వానినుండి విముక్తిబొందుటకు సర్వకాలసర్వావస్థలయందునుయత్నించు

చునే యుండును. స్వాంతంబును సంపూర్ణముగా స్వాధీన పరుచుకొనక, సంపూర్ణబ్రహ్మచర్యము సాధ్యముగానిది. అప్రయత్నముగా జనించు భావ మొకానొక మానసికవ్యసనము. కనుక మానసప్రవాహ మరికట్టినగాని భావ వీచిక లడగజాలవు. మనసునణచుట మారుతము నణచిపెట్టుట వంటిది. ఎట్లయినను, మనోంతరంగము పరమేశ్వరు నివసనమగుటవలన, నయ్యది స్వాధీనము కాకపోదు. కష్టసాధ్యమయినంతమాత్రమున నేనియు దుస్సాధ్యమనితలపరాదు. అయ్యది యప్రతిమానమగు నత్యున్నత స్థానము. అద్దానినందు కొనుట కత్యధిక పరిశ్రమయు నవసరమేయగును. "అని మహాత్ముడు తనయాత్మచరిత్రమందు బ్రహ్మచర్యముగూర్చి చర్చించెను. 190

సీ. భారతదేశమ్ము ♦ చేరినపిదపనే, అట్టిమహోన్నత♦మైన బ్రహ్మ
చర్యమ్ము మానుష ♦ శ్రమచేతబడయున, సాధ్యమంచు గ్రహింప♦జాలెగాంధి
అంతదాకఫలమ్ము ♦ లాహారముగఁగొన, వ్యామోహములనెల్ల ♦ వదలగొట్టు
శక్తిగల్గునటంచు ♦ స్వాంతంబునందొకా,నొక కుహనాభావ ♦ ముండెనతని

ఆ. కైనదైవదర్శ ♦ మాత్మకోరియ బ్రహ్మ,చర్య మాశ్రయించు ♦ సాధకుండు
స్వప్రయత్నమునకు ♦ సమముగా దైవవి,శ్వాస మలరగలుగ ♦ వలయుజుమ్ము.

తే. అవనియందు నిరాహారి ♦ యైనదేహి, వదలువిషయమ్ము లైనత♦ద్వాసనుండు
నయినాత్మసాక్షాత్కార♦మైనయంత, వదలిపోవును గలుగవే♦వాంఛలపుడు.

క. కావుననే మోక్షార్థికి, దైవకృపయు దైవనామ♦ తన్మయ జపమే
నావలు దరంప, మోహను, డీ వరసత్యముగ్రహించె ♦ నిండియజేరన్. 193

—నిరాడంబర జీవితం—1896-97—

మం. సుఖజీవనంబున ♦ జొక్కుచుగాంధి, మొదలిడె జీవిత♦ముంగాని కొంత
కాలంబునకెయాక్తి ♦ లోలజీవితము, మొగము మొత్తగపీడె♦ మొదలంట, మార్పు
కావించె నంబమ్ము ♦ కాపంతలేని, జీవనమ్మొనరింప ♦ జేతోముదమున
యత్నించి సర్వజ♦యమ్మె సాధించె, చాల హెచ్చుగనున్న ♦ చాకలిపద్దు
తగ్గింపజాలరె గ్రం♦థమ్మొండు గుడ్డ,లుతికి యిస్త్రీని సే♦యుటకూర్చి నేర్వ
తద్విషయము జన♦దాకను నేర్పె, కొత్తదౌ పనియగాట ♦ కుతుకంబుతోడ
చాకిరపనిసేసె ♦ సంతోషమెనయ, తగ్గించాకలిఖర్చు ♦ తరుణమ్మునందు
వలయుదుస్తులుగల్గె ♦ వాసిధరింప, తగ్గెగుడ్డలసంఖ్య ♦ తత్ఫలితముగ
తగ్గెడంబము నిరా♦డంబరత్వమ్ము, అబ్బెనొరులపైన ♦ నాధారపడమి
క్రమముగా నాపనిం ♦ గౌశలమొప్పె, గోఖేల్ మహాశయు ♦ గొంతుకపట్టి
కూడ నిస్త్రీని బా♦గుగజేసె మెచ్చి, యాతడు రెనెడీమ♦హాశయుడద్ది

తనకుగానుకఁగ నిచ్చె♦నని తెల్పె, గాంధి, సంతసించె గోఖేలు♦ సర్టిఫికెటుకు
మెచ్చిలోకమె తన ♦ కిచ్చిన యోగ్య, తా పత్రమట్లు మో♦దమున నద్దాన
చాకలపని బాని♦సత్వము త్రోయఁ, గా జాలినట్లు మం♦గలిపనిగూడ
సాధించెనేర్పును ♦ సాధనసలిపి, సాధనమునఁ బనుల్ ♦ సమకూరుగాదె
తొలుతఁ దప్పులు పోవు♦టలుగల్గునెందు, పరుల హేళనలు ద♦ప్పవు కదా, యపుడు
తప్పుపోవుటకింత ♦ దలకక పరుల, హేళనకించుక ♦ నెద స్రుక్కకుండ
తనకార్యములను సా♦ధన సేయువాఁడె, జయమందున ప్రసం♦దమునందు నెందు
తెల్లమంగలివాఁడు ♦ నల్లవాఁడనుచు, క్రాపు సేయఁగ దిర♦స్కార మొనర్ప
క్రొత్తక్లిప్పర్సు జత♦గొని గాంధి తనదు, క్రాపు జేసికొనెను ♦ కష్టమ్ము కోర్చి
బాగుగా లేకున్న ♦ బరిహసించినను, భ్రాతృబారిస్టర్లు ♦ పాడిపట్టందు
పరులపై నాధార ♦ పడఁగూడదంచు, తెల్లమంగలితన ♦ తెల్ల ఆసాము
లెల్లదన్ను బహిష్క♦రింతురు నల్ల, జనముల క్రాపు దా♦సలిపిన నంచు
గాంధిక్రాపునుఁ జిర ♦ స్కారమొనర్చె, ఇదియెల్లతన జన్మ♦హిందుదేశమున
హరిజనులకు క్రాపు ♦ నాచరించుటకు, తమమంగలులు సమ్మ♦తమియ్యకుంట
వలనగల్గెనటంచు ♦ పడదుకోపమ్ము, గాంధియా తెల్లమం♦గలిపై నొకింత
ఈరీతిగా గాంధి ♦ యెల్ల విషయము, లందు స్వయంసహా♦యము నిరాడంబ
రతను బాటింపఁగా♦ గ్రమముగా వ్యయము, మితమయ్యె, మదికిస♦మ్మతమును నయ్యె.

## బోయరు యుద్ధము — 1899-1901

తే. ఇరువదవ శతాబ్దాంతమం♦దరయఁ దక్షి, ణాఫ్రికా యందుజరిగె బో♦యరురణంబు
బోయరులతోడ బ్రిటిషు ప్ర♦భుత్వమునకు, గాంధి యోచించి బ్రిటిషుప♦క్షమున జేరె.

ఆ. బోయరులెడ సాను ♦ భూతియుండినను మో, హనుడు దలచె దాను♦ నాంగిలేయ
రాజభక్తుఁడగుట ♦ సాజంబుగా నాంగ్ల, రాజ్యరక్షగోరెఁ ♦ బూజ్యమనుచు. 222

ఆ. ఆంగ్లపౌరసత్వ ♦ హక్కులగోరువా, డాంగ్లరాజ్యరక్ష♦ణార్థమవని
ఉద్యమించుట తన ♦ విధ్యుక్తధర్మమం, చని తలంచె గాంధి ♦ యాత్మలోన. 223

సీ. ఆకాలమందిండి♦యా కాంగ్లసామ్రాజ్య, మునసె తత్సామ్రాజ్య ♦ మూలముననె
పూర్ణస్వరాజ్యంబు ♦ పొందుట దగునంచు, నతనియభిప్రాయ ♦ మగుటవలన
ఆబోయరులయుద్ధ♦మం దాంగ్లపక్షంబు, నందు జేరదలంచి ♦ గాంధితోడి
భారతీయులను స♦భంగూర్చి సమ్మతిం, గొనెను "అంబులెన్సు ♦ కోర్సు" గూర్ప

తే. అల్ల డాక్టరు 'బూతు' స♦హాయమునను, అంబులెన్సు కార్యక్రమ♦మందు నేర్పు
కలుగనభ్యాసమొనరించి ♦ రలయకుండ, భారతీయులు మోహను♦ప్రేరణమున.

సీ. భారతీయులు చాల♦భీరువులను నాంగ్ల, నమ్మకమ్మెల్లయు ♦ వమ్ముగాగ
భారతప్రజలే య♦పాయమెదుర్కొను, సాహసుల్ గారను ♦ సడియడంగ

భారతీయులు చాల ♦ స్వార్థపరులనెడు, దూఱెల్లయును బలా♦దూరుగాఁగ
భారతీయుల శక్తి ♦ బలసేవనాది యో♦గ్యతలపైఁగల సంశ♦యంబు సమయ
తే. బోయరురణాంగణమ్మున ♦ గాయపడిన, ఆంగ్లసైనికావళి చికి♦త్సార్థముగను
అని మొనర్ప సేవ సేసెద ♦ 'యాంబులెన్సు, కోర్సు'తోనని వినతినొ♦క్కండు బంపె.
క. అవసరము లేదు వలదిపు, డవి యేవియటంచు మునుని♦రాకరణ మొన
ర్చె వినతి నాంగ్లదొరతన, మవినయమనకుండ గాంధి♦కవమతి గూర్పన్ 226
ఉ. కాని రణమ్ము ముమ్మరము ♦ గాఁగొనసాగగ, బోయరుల్ మహా
మానపరాక్రమక్రమ ధ♦నుల్, ఘనశౌర్యముతోడ బోరగా
మానె ప్రభుత్వముం శఠము♦మాన్పె హఠమ్ము నెటాల్ బిషప్పు; ఆ
హ్వానము వచ్చె గాంధికి స♦మానమ్ముగ రక్షసి యుద్ధసేవకై. 227
చ. నలువదిమంది యిండియను ♦ నాయకులొప్పగ వేయినంపగా
గలజనపాళితో జరలె♦గాంధియు డాక్టరు బూతుతోడురా
కలనికి, బైటనేసలుప ♦ గాక్షతగాత్రుల సేవ 'రెడ్డుక్రాస్'
వెలయగ రక్షణంబిడుచు ♦ విశ్రుత దీనజనోపకారియై. 228
సీ. కాని 'స్పియన్‌కోపు ♦ కడదెబ్బ తగిలిన, దావిపరిస్థితి♦యంతమారె
అడరెనంత విపత్క♦రావస్థ యని మొన, గరుగవలయు నప♦కరముగలిగె
అరిగిగాయములచే ♦ ధననొరిగిన యాంగ్ల, యోధులందర లింపు ♦ డోర్మినంచు
జనరలు బుల్లరు♦వినతి సేయ నతని, వేడికోలును బ్రీతి ♦ విని మహాత్ము
ఆ. డోర్పునోర్పు వెలయ ♦ యుద్ధభూమికి జనె, వెన్ను జూపకుండ ♦ వేయకుండ
వెనుక కడుగు, గనక ♦ విసుగు స్ట్రెచర్సుపై, మోసె యిండియనుల♦వాసి హెచ్చ.
సీ. నాడిండియనులు డి♦నాని కిర్వది మైళ్ళు, క్షతగాత్రులను మోసి♦నతుల వీరు
లైనట్టి 'ఉడ్గేటు ♦ సేనానిఁబోలిన, ఘనయోధులను మోయు♦గౌరవంబు
కూడెనా 'ఆంబులెన్స్♦కోర్సు' కష్టారుపా,రములు సేవనొనర్చి ♦ రమలరీతి
ఆ. ఇండియనుల సేవ ♦ కెంతయో మెచ్చికో, లొడవె వాసిగల్గె ♦ నున్నతమగు
ప్రకటనములు వెలసె ♦ పత్రికలందు సా,మ్రాజ్యసుతుల మెల్ల ♦ మనమటంచు.
క. జనరలు బుల్లరుమిగులన్, వినుతించెను దనదు రణని♦వేదికయందున్
ఘనభారతీయ జనసే,వను, దన్నాయకులకీయ♦బడియెం బతకముల్. 231
సీ. భారతీయులసంఘు ♦ బలము హెచ్చెను మత,కులభేద భావాల ♦ బలము సమసె
హిందుముస్లిముక్రైస్త ♦ వేతరాది మతస్థు, లందరు నొకయిండి♦యనులె యంచు
తమిళులు ఘూర్జరుల్ ♦ తదితరసింధీయు, లందరు భరత మా♦తాత్మజులమె
అనెడు నేకీభావ ♦ మంకురించెను జాతి,చైతన్యవంతమై ♦ జాగృతిగనె

తే. సంఘటిలె మైత్రియాయుద్ధ♦సమయమందు, శ్వేతజాతి జనముతో స♦శేషముగను
భారతీయులయెడవారి ♦ భావమందు, మార్పుగల్గెనటంచు న♦మ్మకము దోచె. 232

సీ. "కోర్సులో నెక్కడ ♦ కూలివారెన్నిది, వందలమందిగా ♦ నందునుంట
గాంధివారలకెంతో ♦ కడుసన్నిహితుడయ్యె, వారలక్షేమలా♦భమ్ములరయ
తెల్లవారుంగూడ ♦ కల్లబొల్లి తనమ్ము. వదలిపాటించి ర♦వ్వారి మైత్రి
కష్టకాలమున సం♦ఘటిలెనా మైత్రికి, మధురానుభవమొందు ♦ మరువకుండ

తే. చావుగాయము దగలిన ♦ సైన్యనాథు, లెఫ్టినెంట్ రాబర్ట్సు శ♦రీరమునసి
మోసికొనివచ్చుదారి నా♦యాసమడర, త్రోవగోరిరి నీరమ్ము ♦ దప్పిదీర. 233

ఆ. అదినిదాఘమెండ ♦ లధికంబుగానుండె, ఆంగిలేయు లిండి♦యనులుగూడ
డస్సియుండిరకట ♦ దప్పిదీరుటకొక్క, చిన్నకాలువుండె ♦ చెన్నుదిరిగి. 234

క. ముందుగమీ రానుడుజల, మందను చాంగ్లేయులిండి♦యనులం గోరన్
ముందుగమీరే త్రావుట, అందంబని రిండియనులు ♦ నాంగ్లేయులకున్. 235

ఆ. ముందుమీరు మీరు♦ముందు త్రాగుడునీర,మిందటంచు నాంగ్లు♦లిండియనులు
పోటిసలిపిరెంతో ♦ మేటియానందమా,పూట వారయెల్ల ♦ పొట్టనింప. 236

ఆరోగ్యసంస్కరణ - క్షామనివారణ — 1897-99

క. దేహారోగ్యము కొరకై, దేహాంగములెల్లపనుల ♦ దివిరి శ్రమించున్
ఐహికసంఘారోగ్యము, సౌహిత్యమ్మగు దదీయ ♦ సంపూర్ణకృషిన్. 237

సీ. సంఘమ్మునందలి ♦ సంస్థలయందలి, దోషమ్ములెల్లను ♦ ద్రోయకుండ
ఆ సంఘసంస్థల ♦ హక్కులకై పోరు, టనుచితమని గాంధి ♦ యాత్మదలచు
కానవెటాలునం ♦ గాలిడనది మొద, లతడిండియను సంఘ♦మం దెసంగు
అవగుణమ్ములనెల్ల ♦ నడుగంటచేయుట,కై బద్ధకంకణుం♦డయ్యె; నట్టి

ఆ. అవగుణమ్ములందు ♦ భువిపేరుగన్నది, సరకుసేయమి పరి♦సరముల శుచి
శుభ్రతలనటంచు ♦ నభ్రమందగ విదే,శీయులెల్లనుండె ♦ చెలగుచెపుడు. 238

సీ. సంఘమండలి ముఖ్య♦జనులెల్ల తమగృహ,మ్ముల చక్కబరుపగా♦బూనిరైన
ప్లేగురోగము సంభ♦వించు డర్బనున నున్నప్పుడే ప్రతియిండి ♦ యనుగృహంబు
తనిఖిసేయగబడి ♦ తప్పని సరిగనా,రోగ్య సూత్రములకు ♦ యోగ్యముగను
చక్కబెట్టంబడె ♦ సంతృప్తికరముగా, హర్షించెగాంధి, స్వీ♦యాభిమతము

తే. పూర్తిగానెరవేరగా ♦ గీర్తిగొర, వాదరములుగలిగె ప్రభు♦త్వాధికారు
లందు హక్కులకేగాక ♦ యాత్మశుద్ధి,కొరకు కృషిసేయుగాంధియం♦ చెరిగిరెల్ల.

సీ. అయినప్పటికి సంఘ♦మందుకొందరు గాంధి, కీదుగ్ధయేలని ♦ రేవగించి
లేనిపోనిబెడద ♦ తానుగానితడేల, తెచ్చిపెట్టెనటంచు ♦ దిట్టుకొనిరి.

సరిసరి తమరియి♦ష్టము ప్రకారమె యెల్ల,యనుచు జూపిరి నక్క♦వినయములను
కొంత జనమ్మట్లు ♦ కొంతజనమ్మిట్లు, కూసిరేవో గాంధిఁ ♦ గూర్చి పేర్చి

ఆ. అనుభవమున దెలిసె ♦ హక్కులవలె బాధ్య,తలను సంఘమెల్ల ♦ తెలిసినడువ
చేయుటందు ప్రజల ♦ సాయమబ్బదటంచు, గాంధికీయదనున ♦ గష్టపడఁగ 240

క. సంతతము సహనశక్తి ని,రంతర శాంతమ్ముగలిగి ♦ నప్పుడె విజయం
బెంతో కొంత లభించును, పంతమ్మున బ్రజలచేత ♦ పనిచేయింపన్. 241

తే. సంఘమునకుండ దెప్పుడు♦శ్రద్ధ వడయ,సంస్కృతిక,సంఘసంస్కర్త♦సంతతము శ్ర
మింపవలె గష్టమింతలె♦క్కింపకుండ, అనుచు గాంధి గ్రహించెనీ♦యనుభవమున.

క. కోపములుం, దాపములు ప్ర,లాపములుం జూపువారు ♦ తరుచున్నేరా
రోపణలు సేయువారును, లోపింపరు సంఘమందు ♦ లోకంబందున్. 243

క. అవినన్నింటి నెదుర్కొని, అవిరళముగ బ్రజలక్షేమ ♦ మందే డెందం
బవిరళముగ గలవాడే, భువిజక్కంబరచు సంఘ♦మును సంస్కృతిచేన్. 244

ద్విపద. హక్కులకొరకు పో♦రాడెడు శ్రద్ధ,తక్కువ కాదు బా♦ధ్యతలనటంచు
మానసమ్మున కెక్క ♦ మరిమరిగాంధి, పూనియత్నించి ప్ర♦బోధమ్ము సల్పె
తమసౌఖ్యముంబోలె ♦ గమనింపవలయు, సమభారతీయ సో♦దరుల క్షేమంబు
తమమాతృదేశపు ♦ దారిద్ర్యమడచి, తమభారతీయ సో♦దరుల కష్టముల
కాదుకొంటయె దక్షి♦ణాఫ్రికలోన, పాదుకొన్నట్టియా ♦ భరతోర్విజనుల
కర్తవ్యమంచును ♦ గాంధి బోధింప, నార్తి నిర్వేదన శ♦తాబ్ది పుట్టుకకు
మూడేడులొకయేడు ♦ ముందిండియాకు, మూడిన కాటక♦ముల వెంటగూడ
దక్షిణాఫ్రిక భార♦తప్రజ పంపె, నక్షయమ్ముగ విరా♦ళానేకమెంతొ
మోహను విన్నప♦మును గొనియాంగ్లు, లోపాటింపక పంపి♦రోహో యనంగ
ధనముచాలగ నావి♦ధమ్మున నిండి,యనులకు సాయమొ♦నర్చిరి సతము
తనియబంపు భార♦తప్రజకష్ట,మున నుండునపుడెల్ల ♦ కనికరమూని
ఇటుదక్షిణాఫ్రిక ♦ యిండియనులకు, ఎటులెట్లొ తానుగా♦పంచిన కృషిని
దెలియగావచ్చుగాం♦ధికిఁ దెల్లముగను, పలువిధములగు సే♦వాధర్మగతులు
సత్యదేవత విశే♦షార్థముల్ క్రొత్త,సత్యంతమును బ్రతి♦సత్యనూత్నములు
సత్యమ్ముబోల్ప వి♦శాలవృక్షమ్ము, నిత్యమ్ము నీవుదా♦నికి నీరువోయు
కొలదినందిచ్చుది ♦ విలువైనమధుర, ఫలములనధిక ప్ర♦బలముగా సతము. 60
కలుగులోతుకుబోవు ♦ కొలదిసత్యఖని, విలువైన సేవామ♦ణులు వలసినవి.

## ఇండియాకు పునరాగమనము—1901

క. అనిలోంబనిముగియగ మో,హనుతలపున దోచె దక్షి♦ణాఫ్రికయందే
పనిలేదంతగ భరతా,వనికిం బోవలయు ననెడు ♦ భావములీలన్. 262

ఆ. ధనముఁగూడఁ బెట్టు ♦ పనిప్రధానమ్మైన, పనిగ వెలయుచుంచు ♦ భయముఁ బొందె
గాంధిప్రజలకొరకు ♦ గావింపవలసిన, పనులు ముగియుఁ గతన ♦ మనమునందు.

సీ. ఇండియాస్నేహితు ♦ లెందరో యుక్కనైన, తిరిగిరమ్మన మాతృ♦దేశమునకు
దక్షిణాఫ్రికకన్న ♦ తప్పక భరతోర్వి, సేవావసరమెంచి ♦ చిత్తమందు
ఖానుమన్సుకులాళ్ళ ♦ గలుగ దావక్షి,ణాఫ్రికా పనిజూడ♦వని తలంచి
తోడివారెల్లరి♦తో సంప్రతింపులు, జరిపి వేడెను దన్ను ♦ దిరిగి బంప.

ఆ. భరతమాతృసేవ ♦ కొరకు వారనుమతి, నిచ్చి రాతడొక్క ♦ యేడులోన
దక్షిణాఫ్రికభర♦త ప్రజ గోరుచో, తిరిగివారిఁ జేరు ♦ షరతుపైన. 264

సీ. అదిచాలకష్టమై♦నట్టి షరత్తైన, నందుకొడంబడె ♦ గాంధి ప్రేమ
సూత్రమ్ముల జగదీ♦శుండు దన్ను బంధించె, తద్దాసుడై యుంట ♦ దానుగాన
జనవాణి సర్వేశ్వ♦రునివాణి మీరు మి, క్కిలి సుహృద్వరవాణి ♦ విలువలేని
దానుగాదే త్రోయ♦ నానిసాధ్యమె తన, జీవితంబే ప్రజా♦సేవకొరకు

తే. మీదుగట్టినగాంధికి ♦ వాదమున్నె, కనుక వారటు గోరిన ♦ కరణి దిరిగి
వత్తు మీకెప్పుడెపుడే య♦వసరమున్న, ననుచు సర్వజనమ్ముల♦ యనుమతిఁ గొనె.

శా. ఆ కాలాన నెటాలుతోడ సమధికా♦న్యోన్యత్వముం గల్గి సు
శ్లోకుండౌట నెటాలుభారత జనుల్ ♦ లోటెందు లేకుండగా
లోకాతీతములౌ బహూకృతులతో ♦ లోచూపుతో, మోహనున్
లోకజ్ఞుల్ నయి గౌరవించిరెటునే ♦ లోపంబులేకుండగన్. 266

క. ముందెన్నడు దానెరుగని, చందంబున రవలనగలు ♦ స్వర్ణాభరణా
ముదానందదములు గను,విందుగనిడి రెవ్వొనస్తు ♦ బృందములుఁ గడిన్. 267

ఆ. అందుఁగొన్నియతని ♦ యాసాములిడినవి, తదితరములు ప్రజలు ♦ తమకు గాంధి
చేసినట్టిమేటి ♦ సేవకై యతనికి, భక్తినిడిన వివిధ♦బహుమతులవి. 268

తే. ఆయమూల్యబహూకృతు♦లరసిగాంధి, అద్భుతాశ్చర్యములకులో♦నగుచు మదిని
నిటులదలపోసె నావస్తు♦నిచయముగొను, టొప్పగునొ లేక తప్పగు♦నో యటంచు.

సీ. "ఈ బహూకృతులనే♦నెటుగొందు; గొన్న నా, సంఘసేవెట్లు ని♦ష్కామమగును
అందులోనొకస్వర్ణ ♦ హారమే బదిగినీ,ల విలువగలది నా♦లలన కిడిన
దదియు నా సంఘసే♦వార్థమిచ్చినదౌట, అన్యథా దానినే ♦ నరయనగునె?
ఆసాములుంగూడ ♦ అస్మత్ప్రజా సేవ, ముందు దోడ్పడినవా ♦ రగుటవారి

తే. బహుమతులతోడి వారల♦బహుమతులటు, పరిగణించుట నాకు భా♦వ్యంబుగాదె"
అనుచుదలపోయు చారాత్రి ♦ యకట గాంధి, భద్రసద్గుణకంధి ని♦ద్రబడడయ్యె.

ఆ. నిదురలేమిఁదనదు ♦ గదినడయాడు నాం,దోళనమున నేమి ♦ తోపమికట!
వినువబుద్ధిరాదు ♦ విలువైన బహుమతుల్, గొనుటకంతరాత్మ ♦ గొంకువాని,

మ. "అకటా! యేగతినీయకొందు బహుమా♦నానేకమున్నేడు గొం
టకు నాపత్నియు నాసుతుల్ తగునె యే♦నాడుం బ్రబోధింతురే
అకలంకంబగు సేవసేయవలె సం♦ఘార్థంబు, నాసేవయే
సకలంబందురె నేడిటేల గొనుటల్ ♦ సత్యంబె, యీభూషలన్." 272

సీ. "విలువైన భూషణ♦ములు లేవు మాయింట, సామాన్యజీవన ♦ సరళికతన
బంగారుగొలుసులు ♦ వజ్రాంగుళీయముల్, ధరియింపమాకిప్డు ♦ తగునదెట్లు
ప్రజలకాభరణాళి ♦ పై పిచ్చి మోహంబు, తగదంచు బోధించి ♦ తగుదునమ్మ
అని యయాచితలభ్య♦మైన యీభూషలతో నేమిసేయగా ♦ నౌను నేను"

ఆ. అనుచు చాలసేపు ♦ నాత్మవిచారించి, చివరకాయమూల్య ♦ వివిధభూష
ణంచుకొనగఁదగద♦టంచుఁ దీర్మానించు,కొనియె మోహనుడు సు♦గుణధనుండు.

సీ. ఆయాభరణముల ♦ నన్ని సంఘమునకి,చ్చెను ధర్మనిధిని స్థా♦పన మొనర్చి
పార్సీపెస్తోంజీని ♦ పలువుర నితరుల, నియమించె నా ధర్మ♦నిధికి ధర్మ
కర్తలుగాదన ♦ కార్యనిర్ణయమెల్ల, భార్యాసుతులకు దె♦ల్పంగ బూనె
సుతులెల్ల యీబహు ♦ మతులేల మాకంచు, సంఘమ్మునకొసంగ ♦ సమ్మతించి

తే. కైసకస్తూరిభాయి యి♦ట్లనియెఁబతికి, "నాకు దెలియును మీకును ♦ మీకొమరుల
కవసరమ్ములుగావీనగ♦లంచు నన్ను, అనుమతింపరు ధరియింప♦నంచెరుగుదు.

సీ. అయిననాకోడండ్ర ♦ కవసరంబుండదే, ఎరుగుదురే రేపు ♦ జరుగుదాని
ఎంతోగౌరవముతో ♦ నీయగా బడినయీ, బహుమతులెట్లునే ♦ వదలగలను?
అనుచు వాదప్రవా♦హంబుతో డంతఃప్ర,వాహంబుగాగార్చె ♦ నశ్రుజలము"

తే. అయిన నాతండ్రికొడుకులా♦వంతయును దమ, పట్టువలసడలఁగఁ జేయ♦రెట్టులైన
ఆమెసమ్మతిగొనునిశ్చ♦యమ్ముతోడ, పలికెనిటు గాంధి సమ్మోహ ♦ ఫణితిసతికి.

సీ. "మనపుత్రికులకెట్లు ♦ మనవలె బాల్యవి,వాహమ్ము లొనరించు ♦ వాంఛ లేదు
పెరిగిదేవునిదయ ♦ బెద్దవారైనప్డు, తనయులు తమజాగ్ర♦తను వహింత్రు
ఆభరణములపై ♦ యతికాంక్షగల పెళ్ళి కూతుళ్ళ మనము చే♦కొనగబోము
అయిననప్పటికి నీ♦కాభరణమ్ముల, యవసరమ్మన్న ను♦వ్వానుగాదె

తే. అడుగుమప్పుడునీకేది ♦ యవసరమ్మొ", "అడుగకుందురె మిమ్మున♦మ్మమ్మ నమ్మ
నెరుగనేమిమ్ము మీగుణం♦బెల్లయెపుడొ, తెలియునేనాడొ మీబుద్ధి♦తెల్లముగను.

క. నానగలంబోకార్చితి, రేనాడో శాంతిఁ బ్రదుక ♦ నీయరుకదన
స్నీ నాటినుండియే నా,కూనలఁ జేయవలచితిరొ♦కో సాధులుగాన్. 277

తే. మిమ్మునమ్మగ వెర్రినా♦గమ్మ నొక్కొ?, ఎపుడొ, కోడండ్రకే నగ♦లెత్తునంచు
బీరముల్ పల్కినంత మీ♦పేరునూరు, గుణగణమ్ము లెరుంగని♦మనుజులెవరు?

ఆ. పిచ్చిపట్టెనొక్కొ ♦ యిచ్చమెచ్చియు బ్రజ,లిచ్చినట్టినగల ♦ నిట్టివదలు
కొమ్మటంచుఁబలుకఁ ♦ గూడునేమీ కేమి, హక్కుగలదునాదు ♦ హారమడుగ."

ఆ. "ఏమిమాటలివ్వి ♦ యిచ్చిరికాదెనా, సేవకెల్లనగలు ♦ నీవవేవి
కలవు నీదుసేవ ♦ కలదెయొకండును, పల్కెదిట్టులేల ♦ వ్యర్థముగను". 280

క. "సరిసరి మీసేవకె యి,చ్చిరి సర్వమ్మైన నాదు♦సేవయె లేదే?
అరయరె రేబవలు మీ,కొరకెంతయుగష్టపడితో ♦ గుర్తించితిరే! 281

ఆ. దారిబోవునెల్ల ♦ వారిని గొనితెచ్చి, వీరికెల్లఁజేసి ♦ పెట్టుమంచు
కష్టపెట్టలేదె ♦ కన్నీరుమున్నీరు,గా శ్రమించలేదె ♦ విశ్రమించ
కకట! యెన్నడైన ♦ నాత్మవిచారించి, నారెకట్టుకొన్న ♦ దారగూర్చి". 282

క. ఈగతి మాటకు మాటకు, వీగకబదులాడె భార్య ♦ వ్రేగుగనైనన్
వీగకజయించె కడకె,ట్లో గొనెసతి సమ్మతమ్ము ♦ లోగకపతియున్. 283

వ. ఇటుల దనయర్థాంగి యామోదంబు సాధించి గాంధి, యటు 1896 వ సంవత్సర మందును, నిటు నీ 1901 వ యేటను, దనకు ప్రజలొసగిన బహూకృతులెల్ల బ్యాంకులో నిడి దనకోరిక మేరకు, ప్రజాభ్యుదయార్థము వినియోగింపబడునట్లు, నిధినిర్వాహక పత్రము లిఖింపజేసెను. ఎన్నోమారు లెన్నియో యవసరము లేర్పడినను, మోహను డానిధి నేమాత్రమంటకుండనే కావలసినధనమును విరాళముల ద్వారా సేకరించి, యెప్పటికప్పటికి పని గడిపెను. ఈ సంఘటన గూర్చి గాంధి యేనాడును విచారింపలేదు. కస్తూరిబాయియుఁ గాలక్రమమున దనభర్తగావించిన యీ ఘనకార్యమందలి వివేకమును గుర్తింపగల్గెను. ఎన్నియో ప్రలోభములనుండి, విముక్తులుగా మనుగడసాగించుట కియ్యది యెంతయో యాకుటుంబీకులకు సహకరించెను. 284

క. ప్రజలహితముకొరకు ♦ పనిచేయువారెప్డు, కోరగూడదేమి ♦ వారినుండి
విలువగలుగు బహుమ♦తుల, బ్రజలిచ్చిన, గొనగదగదటంచు ♦ ననియెగాంధి.

సీ. ఇటుదక్షిణాఫ్రికా ♦ యిండియన్ మిత్రులు, వీడ్కొని యోడపై ♦ వెడలెఁదనదు
జన్మభూమికిగాంధి ♦ జాయాసుతులతోడ. దారిలోనాగెను ♦ మారిషసున
ఆదీవికిగవర్న♦రైన సర్ చార్లెసు, బ్రూసుకువిందుగా ♦ బుచ్చెరేయి
చక్కగానెరిగె తత్ ♦ స్థానికస్థితిగతు, లెచటికేగిన ప్రజా♦హితముగోరి

గీ. ఇండియాఁజేరి, దేశమం♦దెల్లయెడల, గ్రుమ్మరియె గొంతకాలమ్ము♦కోరిప్రజల
స్థితిగతులెరుంగ ప్రత్యక్ష♦హితమునరయ, భావికార్యప్రణాళికా♦భావమెనయ.

తే. పదియుఁదొమ్మిదినూటొక్క ♦ వత్సరమది, కాళికాఘట్టమందున ♦ కాంగిరెస్సు
జరుగుచుండెను 'దిన్షవాచా' ధీశతిగ, మొదటిదదెకాంగ్రెసరయఁగా♦మోహనునికి

మం. దక్షిణాఫ్రికభారత ♦ ప్రజగూర్చి, చర్చింప సర్ ఫిరోజ్ ♦ షా మెహ్తాతోడ
ఆతఁడేగెడు స్వప్న ♦ లందుఁ బైనించె, వాచాయు మరిసెత ♦ ల్వాడులంగూడి
అందు మెహ్తాయు, మో ♦ హనుడు మాట్లాడు, నపుడుండి రా స్వప్న ♦ లందె మెహ్తాతో
అరసి మోహానుని, మె ♦ హ్తాయిట్లుఁ బలికె, గాంధినీకొనరింప ♦ గా నేమిగలదు?
నీవుకోరినరీతి ♦ నెగ్గింపఁగలము, తీర్మానమందు చేఁ ♦ దీరు నేయిఁకను
లేమనదేశాన ♦ నేయధికార,ములులేక సాధింప ♦ గలవేది, వలస
లందంచుఁ బల్కె మె ♦ హ్తా నిరుత్సాహ, వంతుడై, పల్కంగ ♦ వాచాయునట్లె
వేదచూపులఁ జూచెఁ ♦ బెంపేది 'అంతె', అనె సెతల్వాడు మో ♦ హనుడేమి వారి
ననలేక తీర్మాన ♦ మును గూర్చి కాంగ్రె,సందు చర్చించిన ♦ నదియె చాలనియె.

సీ. కలకత్తపురిఁ జేర,గనె రిపన్ కాలేజి, నిడిరొందు గాంధికి ♦ విడిది యందు
లోకమాన్యుని బస ♦ ప్రాకటంబుగ నుండె, నాతని దర్శించు ♦ నరసి గాంధి
ఆశ్చర్యచకితుఁడై ♦ యరసెనంతయు వారు, మాటలాడెడు తీరు ♦ మాటసారు
పాలకజాతిలో ♦ భమున నొనర్చు త,ప్పులగూర్చి చేయు చ ♦ ర్చల కటారు, 296

గీ. నట్టిహాసమ్ము లేనాటి ♦ కైనవాని, విన్నవారికి వారిని ♦ విస్మరింపఁ
జాలనివటంచు రచియించె ♦ జాలగాంధి, తాను వ్రాసిన ఆత్మక ♦ థాంతరమున.

క. ఆకాంగ్రెసు క్యాంపుననే, సౌకర్యము లేకయుండె ♦ జక్కనొనర్పన్
చేకూర్పవలంటీరులు, వాకొను చోకరొకరిమీద ♦ వ్యర్థపురుషులన్. 297

తే. ఆసమావేశమున కప్పు ♦ డచటహాజ,రైన ప్రతినిధుల్, చుక్కాని ♦ లేనిపడవ
పగిదినుండిరి దిక్కుదో ♦ పనివిధమున, నడుగుచెప్పుడు వలంటీర్ల ♦ నదియునిదియు.

క. మూడుదినాల్ ముచ్చటగా, నేడాదికి నొక్కమారు ♦ నేదే నొకచోఁ
గూడెడువారలకెట్లొన, గూడం గలదనుభవమ్ము ♦ కొంచెంబైనన్. 299

క. ఆనాడీకాంగ్రెసుసభ, లేనగరంబుననొ జరుగు ♦ నేర్పాటగుచున్
మూణాళ్ళముచ్చటగ నా,పైనన్ నిద్రించుచుండె ♦ పనిగూదిలేమిన్. 300

క. కానవలంటీరులకుం, గాని ప్రతినిధులకు గాని ♦ కలుగకపోయెన్
న్యూనముగాని యనుభవ,జ్ఞానధనమ్మింతయైన ♦ జక్కఁగఁ బనులన్, 301

అ. అందుగూడ గాంధి ♦ యరసెనస్పృశ్యత, ననుసరించుచుంట ♦ నరవవారు
వారివంటతింట ♦ పడకూడవితరుల,కంట వారివంట ♦ యంటువడక
నుండ వండబడుచు ♦ నుండెఁ గాలేజికాం,పౌండు లోననెల్ల ♦ నిండఁ బొగలు.302

ఆ. అదియె వంటశాల ♦ యాహారశాల స్నా,నాలగదియు వారి ♦ కోలలాడ
అదియునెల్ల జూడ ♦ నగపడె గాంధికి, బయటవెలుగుపడని ♦ బందిపగిది
లోనిజలము వెలికి ♦ రానికూపము బోలె, వికటవర్ణధర్మ ♦ విధము నాగ. 303

ఆ. ప్రజలప్రతినిధులన ♦ బదువార లేయంత, అంటరాని తనము♦ననుసరింప
ప్రజలమధ్యనెంత ♦ ప్రబలమ్ముగా నుండు,నది యటంచు గాంధి♦యలమటించె.

క. నీరెల్లయెడల మడుగులు, గా రోతగ జేరియుండె ♦ కటకట! యదియె
వ్వార లనామయకరముగ, నారయమికి గాంధిచింత ♦ నటమటపడియెన్. 305

సీ. అటగూడినట్టి జ♦నాళికిఁ దగినన్ని, మరుగుదొడ్లుండమి ♦ మురికిచేరి
గబ్బుకొట్టగనెల్ల ♦ కడలందు గాంధివా,లంటీర్లజేరి యా♦పెంటఁజూపె
"అదిమాదుపనిగాదు ♦ అల్లపాకీవాని, పని వానితో జెప్పు♦డనిరివారు
చీపురునొందునా♦చేతి కిందనికొని, ఊడ్చెమరుగుదొడ్డి ♦ నొందుగాంధి

ఆ. అయినజనములధిక ♦ మగుటశుభ్రమొనర్ప, చాలకష్టమగుచు ♦ సాధ్యపడని
కార్యమగుటచేత ♦ గాంధియుఁ దనవర, కరసి తనిసెపైన ♦ నఁయలేమి. 306

క. డెలిగేటులు కొందరుగది, వెలుపలనే రాత్రిపూట ♦ వెగటన కకటా!
మలమూత్రవిసర్జనములు, పలుమారొనరించిరెల్ల ♦ బయలంగలయన్. 307

క. ఆరయుమని చూపె వలం,టీరుల కిదియెల్లగాంధి ♦ తెలియగనైనన్
వారెవరదిశుభ్రపరుచు, గౌరవమునఁ గలయ్యరైరి ♦ గాంధినొకింతన్. 308

గుమస్తా గిరి—1901.

సీ. అల్లకాంగ్రెసుసభ ♦ ఆరంభమగుటకు, రెండుదినములింక ♦ నుండెవ్యవధి
అనుభవార్జనకాంతు ♦ నా కాంగ్రెసాఫీసు, నందునబనిసేయ ♦ గాంధిగోరె
కలకత్తపురిఁజేరి ♦ కాంగ్రెసాఫీసుకు,పోయి ప్రాతఃకృత్య ♦ ములనుదీర్చి
భూపేంద్రనాథ బా♦బును ఘోషాలులు కార్య,దర్శులచ్చటివారి ♦ దర్శనంబు

ఆ. చేసి, పనినిగోర ♦ గోసాలుగాంధిని, క్లర్కుపనినొనర్పఁ ♦ గలవెయనఁగ
తప్పకుండజేతుఁ ♦ బడయకిండనెగాంధి, కుర్చిచూపగాంధి ♦ కూరుచుండె. 309

ఆ. 'ఉత్తరాలకుప్ప' ♦ ఉన్నదికనుమిటు,వీనిలోన విలువ ♦ వెలయువాని
బంపె నాకుమిగులు ♦ వానికీవెజవాబు, వ్రాయుమందినట్లు ♦ వారిలేఖ. 310

క. అందుకుగాంధి యమందా,నందంబందెను గోసాలు ♦ నమ్మగదన్నుం
గాంధిపురాచరితం, బెందువిచారింపకుండ ♦ నించుకయైనన్. 311

క. చెప్పిన ఉత్తరములపని, తప్పులులేకుండజేసెఁ ♦ దడబడకుండన్
మెప్పందెను గోషాల్కడ, ఒప్పించినపనియొనర్చు ♦ టొప్పగునెపుడున్. 312

శా. గోషాలంతట గాంధి గాథనెరిగెన్ ♦ గూర్మిన్విచారించి సం
భాషించెన్ దనమాటకారితనమున్ ♦ ప్రాగల్భ్యమేర్పాటుగాన్
ఈషణ్మాత్రము! యీగుమస్తపనులన్ ♦ నీకీయగా బోలునే!
దోషంబంచును గాంధి కూరటగ వా♦దుంజేసె స్వాదూక్తులన్. 313

మం. అదివిని మోహను ♦ డతివినయమ్మున, బదులిడె మీవంటి♦వారలయెదుట
నావంటివాడెంత ♦ నావయసెంత, కావించితేనెట్టి ♦ ఘనకార్యములను!

కాంగ్రెసు సేవలో ♦ గడుపందు ముసలి, వారలైతిరి పెద్ద♦వారలు మీరు
అనుభవమింత లే ♦ నట్టి యువకుడ, పనియొసంగితి రవే ♦ పదివేలు నాకు
పనియందు; కాంగ్రెసు♦పనియన్న నాకు, వెనుకంజు వగునిందు ♦ విషయమ్ములెల్ల
వివరంబుగ నెరుంగ ♦ విస్తారమైన, అవకాశమిచ్చితి ♦ రంతియేచాలు
మిగులఁగృతజ్ఞుఁడ♦ మీకంచు బల్కె. సుగుణాకరుఁడు గాంధి♦ చొప్పంతెయగుట
"అదె నిజమ్ముగ సరి ♦ యగు సుగుణమ్ము!. ముదమందితిని నీస♦హృదయపద్ధతికి
కాని యీ విషయంబు ♦ గ్రహియింపఁజాల, రీనాటి యువజను ♦ లేమందు నిజము
తెలియుదు కాంగ్రెసుఁ♦ దొలినాటినుండి, కలిసితి 'హ్యూమును ♦ కాంగ్రెసు సంస్థ
జననమందంచు" గో♦పాలు వచించె, గాంధి గోపాలులు ♦ కడుమిత్రులైరి,
విందొనర్చెను నాడు ♦ గాంధికాతండు, గోపాలు పట్టకు ♦ గుండీలు వేయ,
వాసిగా నొకబంటు ♦ వారితో నుండు. గాంధియాపని తానె ♦ గావింతు ననియె,
పొందుగాఁ బెద్దఁ♦జేయుండునఁ దనకు, గౌరవముండుట ♦ కతన సతమ్ము
తన పట్టుగుండీలు ♦ తగిలింపగాంధి, కనిగోపాలను చుండు ♦ కాంగ్రెసు కార్య
దర్శికి గుండీలు ♦ తగిలించుకొనుట, కైనఁ దీరిక లేదు ♦ కష్టాలు మెండు.
అతని యవమాయిక ♦ మారసి గాంధి, మతిని వినోదించె ♦ మందహాసమ్ము
చేసెనైనన తని ♦ సేవల సేసె, నా సేవచేఁ దన♦కబ్బె మేలనియె
క్రమముగా నటగాంధి ♦ కాంగ్రెసు పనిని, విమలంబుగ నెరింగె ♦ విశదంబుగాను
పలువురఁ గాంగ్రెసు ♦ ప్రముఖనాయకులఁ, గలసి మాటాడెను ♦ ఘనుడైన గోఖ్లే
వంటివారల, ముఖ♦మెంటుల్ గ్రహించె, నొంటిగా నొక్కండు ♦ నొనరింపగల్గు
పనిని బల్వురొనర్చు ♦ పద్ధతిం; గంట, పని పదిగంటల ♦ పాటొనర్చుటలు
మొదటి స్థానము నాంగ్ల♦మునకు నిచ్చుటలు, గమనించి మనమందుఁ♦ గడుఁ గుందె గాంధి
ఆటుల రంధ్రాన్వేష ♦ ణాభీష్టమున్న, కుటిలుండు గామిచేఁ ♦ గొదవ లేకుండ
అచటి పరిస్థితు ♦ లందంత కన్న, వచరింపగా సాధ్య ♦ పడదు కాబోలు
అనితలంచె నుదారుఁ ♦ డగుటచే గాంధి, కనుక నేపనినైన ♦ గర్హింపఁదగదు. 341

## కాంగ్రెసులో — 1901

సీ. కడకు కాంగ్రెస్సులోఁ ♦ గాలిడి గాంధి యందలి విశాలమగు గు♦డారమరసి
గంభీరమగు వ్యూహ♦గతిని వరసలుగా, దీరినిల్చిన వలం♦టీర్ల గాంచి
వేదికపైనున్న ♦ విస్తృతాసనముల, నాసీనులైన నా♦యకులఁ గాంచి
పెద్దలసుద్దుల♦ న్వీన గుంపుగానున్న, ప్రేక్షకప్రతినిధి ♦ బృందమరసి
గీ. గాంధి మిక్కిలి విభ్రాంతి ♦ జెందెనంత, సంతటి మహాధిక ప్రజ♦ నాతఁడొక్క
చోటఁ గుమిగూడియుండగా♦ జూచుటద్దిఁ, మొదటి యనుభవమౌట చే♦ముగ్ధుడయ్యె.

క. అధ్యక్షోపన్యాసము, సద్యఃపతనమ్మొనర్ప ♦ సమయము లేమిన్
మధ్యపుటలనచటచ్చట, హృద్యములగునవిపఠించి ♦ రింపుగఁ గొన్నిన్. 343

వ. తదనంతరము విషయనిర్ణయసంఘ మెన్నుకోబడెను. ఆసంఘసమావేశ చర్చలఁ దిలకించుకొరకు గోఖ్లేగాంధిని గొంపోయెను. దక్షిణాఫ్రికా యిండియనులఁ గూర్చి గాంధి తీర్మానమును కాంగ్రెసులో ప్రవేశపెట్టుటకు సర్ ఫిరోజ్ షా సమ్మతించియుండెను. అయినను విషయనిర్ణయసంఘసమావేశమున నా విషయము నెవ్వరెప్పుడు చర్చకుగొనివత్తురని గాంధి డోళాందోళిత మనస్కుడై యుండెను. ప్రతితీర్మానమునకు దీర్ఘోపన్యాసము లాంగ్లమందు పరిపాటిగా జరిగిపోవుచుండెను. ప్రతితీర్మానము నెవరోయొకరు, గొప్పపేరందిన నాయకుడు ప్రతిపాదించుచుండెను. అట్టిఘనాపాటీల గర్జారావముల ముందు, మృదులములగు తనమేళవింపులు కేవలము పేలవములుగా నుండునని తలపోయుచున్న గాంధికి చీకటిపడుకొలది, హృదయాందోళన మధికమాయెను. ప్రొద్దుపోవుకొలది, తీర్మానములు తటిల్లతలవలె క్షణికములుగాఁ బరిగణింపబడుచుండెను. ఎల్లరును వెడలిపోవ తొందరపడుచుండిరి. రాత్రిపదునొకొండు గంటలుకొట్టెను. గాంధికి నోరాడకుండెను. అంతకుముందే గోకేలునుకలుసుకొని తనతీర్మానమతనికి చూపించియుండెను. కనుక నతనికడకు క్రమ్మఱఁజని "నాకు మీరించుక సాయపడుడని "గాంధి మొఱనిడెను. "నామనసులోనీ తీర్మానమున్నది. వారెట్లు వారివారి తీరుమానము లెంతత్వరత్వరగాఁ బ్రవేశపెట్టుచున్నారో, చూడుము. ఎట్లైనను, నీతీర్మానమును సంఘమువారి దృష్టికి కొనివచ్చి తీరుదు" నని గోక్లే అభయ మొసఁగెను. "అంతయునైనదికదా" అని మెహ్తాసభాంతమునఁ బ్రశ్నించెను "లేదు, లేదు, ఇంకను దక్షిణాఫ్రికానుగూర్చి చేయవలసినతీర్మానము మిగిలినది. గాంధి చాలసేపునుండి వేచియున్నాడు" అని గోఖే లరచెను. 344

మెహ్తా:—నీవాతీర్మానమును చూచావా ? గోక్లే.—ఓ, చూచాను.

మెహ్తా:—నీకిష్టమేనా ? గోక్లే:—చాలా చాలా బాగుంది.

మెహ్తా:—సరే, అలా అయితే, గాంధీ, దానిఁ జదువుము.

క. వడకుచు గాంధిపఠించెను, వడిగోక్లె సపోర్టుచేసె ♦ వారందరొకే
నుడినామోదము దెలిపిరి, సడినేక గ్రీవముగను ♦ సంఘంబందున్. 345

తే. అయిదునిమిషముల్ నీయుప ♦ న్యాసమున కొసంగబడునని నుడివెవా ♦ చాయిదెల్ల
క్రమవిపర్యయముగఁదోచ ♦ గాంధికకట! అతనితీర్మానమందెవ్వఁ ♦ డర్థమెరుగఁ
డంచరుంజనఁ దొందర ♦ నొందుకతన. 346

తే. అల్లగోఖ్లెయా తీర్మాన ♦ మరసియుండి, సందు చేనెవ్వరితరుల ♦ కవసరమ్ము
గలుగదాయెఁ దీర్మానంబు ♦ గాంచిదాని, మంచిచెడ్డలెరుంగుట ♦ కించుకైన.

క. అందరును వెడలిపోవం, దొందరఁబడుచుండిరిట్టి ♦ న్యూనవ్యవహా
రాందోళనపద్ధతి మన, గాంధికి రుచియింపవెంతొ కష్టమెగూర్చెన్. 343

ఉ. ఆమరునాడు కాంగ్రెసు స ♦ భాస్థలిలోన నుపన్యసింపగా
సామయికాను గుణ్యముగఁ ♦ జక్కఁదయారయి వ్రాతకోతలే
వేమియులేకయే సభకు ♦ వేకవచోద్ధతి, బల్కఁబూనె; న
ట్టేమునుదక్షిణాఫ్రికఁ గ ♦ డించిన నైపుణిపీడ గాంధినిన్. 439

సీ. తీర్మానముపఠించి ♦ తెల్లంబుగాఁబల్క, వాచా పిలువగాంధి ♦ వచ్చినిల్చె
తలతిరుగఁదొడంగెఁ ♦ దడబడెమాటలు, తీర్మానమెట్లొ చ ♦ దివె నొకింత
ఇంతలోమూడు ని ♦ మేషముల్ గడవ హెచ్చరిక బెల్ మ్రోతివా ♦ చాయెసంగ
వెనువెంటనే గాంధి ♦ విసువుతోఁ గూర్చుండె, అన్నితీర్మానము ♦ లట్లె నెగ్గె.

గీ. అతనితీర్మానముం జేతు ♦ లందరెత్త, ప్రేక్షకులు ప్రతినిధులు స ♦ భేదముగను
మంచిచెడ్డలొకింత వి ♦ మర్శలేమి, గాంధియందేమి తృప్తిని ♦ గాంచడాయె. 350

సీ. అయిననేమి లభించె ♦ నఖిలభారతకాంగ్రె, సామోదముద్ర సౌ ♦ తాఫ్రికా స
మస్యకంతేచాలు ♦ సలకాంగ్రెసామోద, మేయింతయామోద ♦ మెరుగనంచు
సమ్మోదహృదయుడై ♦ సంతుష్టి సంతోషి, తాంతరంగుండై ♦ నితాంతమతిని

ఆ. ముగిసె; కాంగ్రెసుసభ ♦ మొత్తంబుపైతృప్తి, నందె గాంధి దక్షి ♦ ణాఫ్రికేండి
యనులఁగూర్చి తాను ♦ యనుకొన్న తీర్మాన, మందు సమ్మతిఁగనె ♦ ననితలంచి.

—◎ కర్జనుప్రభువు దర్బారు—1902 ◎—

సీ. కాని వాణిజ్యసం ♦ ఘము వారిఁ దదితర, ప్రముఖులంగలసి సం ♦ భాషణంబు
దక్షిణాఫ్రికకార్య ♦ దీక్షగూర్చి యొనర్ప, గలకత్త పురమందె ♦ గాంధియుండె
ఇండియాక్లబ్బునం ♦ దేర్పాటుగా నొక, గదియందు నెలపాటుఁ ♦ గడుపఁదలఁచె
ఆక్లబ్బుసభ్యులన్ ♦ యశముకెక్కినవారు, బలువురుండుటవారిఁ ♦ గలసిమెలసి

గీ. దక్షిణాఫ్రికపనుల శ్ర ♦ ద్ధవహింపుఁ, డంచు గోరగవారల ♦ నప్పుడప్పు
డాడుటకు బిల్లియార్డ్స్ యాట ♦ నరుగుచెంచు, చుండె నాక్లబ్బునకుగోఖ్లె ♦ యుండగాను.

సీ. కలకత్తలోఁ గొంత ♦ కాలముండును గాంధి, యని యెరింగినగోఖ్లె ♦ యతనిగాంచి
తనతోడనుండర ♦ మ్మనుచు నాహ్వానించె, దెలిపెఁగృతజ్ఞతఁ ♦ బిలుపుకతఁడు
కానిలోనఁదలంచెఁ ♦ దానెయందులకేగుట నుచితకార్యమం ♦ చాత్మయందు
ఒకటిరెండుదినమ్ము ♦ లోర్చి గోఖ్లేతానె, తనతోడనేగాంధి ♦ గొనుచుజనియె

గీ. అతనియమితలజ్జాభర♦మ్మగు ప్రవృత్తి, గాంచి గోఖలెయిట్లనె ♦ గాంధినీవు
నిలువవలయునీ నేలలోఁ♦గలియవలయు, సాధ్యమైనంతయెక్కువ♦జనుల సలుప
పనుల కాంగ్రెసులో సిగ్గు♦పడగదగదు. 354

వ. ఇదియిట్లుండ, నాకాలమున, కర్జనుప్రభువు తన వైస్రాయి దర్బారునకు రాజాలను, మహారాజాల నాహ్వానించెను. ఆ రాజాలెల్లరు ఇండియాక్లబ్బుసభ్యులుగా గాంధికి సుపరిచితులే. నాణ్యమైన వంగరాష్ట్రధోవతులు, షర్టులు మొదలగు దేశీయ దుస్తులధరించి, క్లబ్బునకు వారువాడుకగా వచ్చుచుండుటగాంధికి తెలియును. దర్బారునాడట్లుగాక, వెయిటరులఁ ధరించెడు. ట్రౌజరులును మెరిసే బూటులధరించి యుండిరి. ఇట్టివింతవేషముల గాంచి, గాంధి యారాజాల యందొకరినందులకు కారణమేమని యడిగెను. అతడు గాంధి కిట్లుబదులిడెను.

క. మాదురదృష్టము, మాబడు,బాధలు, చీవాట్లు తెలియు♦మాకొరులీమా
వేదనలెరుగరిదెల్లయు. మాధనబిరుదములుగల్గి ♦ మన నవసరముల్. 356

తే. కాని యీసేవకోచిత ♦ మైన మెరయు, కాలిజోళ్ళల తలపాగ♦లేలదాల్ప!
క్లబ్బులోమనపిల్పుకు ♦ గాచియుండు ఖన్సముల దుస్తుల ధరింప♦కతమదేమి?

ఆ. ఖన్సములకు మాకు ♦ గలభేదమేమిటి, కలుగు;వారుమాకు ♦ ఖన్సములట
కర్జనుప్రభువునకు ♦ ఖన్సములము మేము, తప్పదిద్దియేమి ♦ చెప్పనగును.

తే. నేరమగును పోకున్న ద♦ర్బారుకెలమి. నేమగునిత్యమగు వస్త్ర♦ధారణంబు
ఇంతవేషాలనున్నను ♦ సుంతయేని, కలుగదవకాశ మాప్రభుం ♦ గలసి పలుక.

సీ. నిష్కపటముగ నా♦స్నేహితుఁ డీగతిం, బలుక గాంధి కరుగ♦మనమునందు
వేరొకటిట్టిద♦ర్బారు జ్ఞప్తికివచ్చె, అదికాశికాపురం♦బందు మున్ను
హైందవ సర్వక♦ళాశాలకు పునాది, రాయిని హార్డింజి ♦ ప్రభువువైచు
సమయమ్మునందున ♦ జరిగినదర్బారు,నందు రాజాలుండి ♦ రబలలట్లు

గీ. నగలధరియించి, తాల్చిచీ♦నాంబరమ్ము, లరుతపీమలముత్యాల ♦ సరులువ్రేల
కడియములు గ్రాలగా మణి♦కట్టులందు, నూగముత్యాల కుచ్చులు♦పాగలందు.

తే. పురుషులను కొనఁజూపరుల్ ♦ మోలనుబాకు, లమరియుండుటఁ గని గాంధి ♦
యదిసకలము, దాస్యమాత్రచిహ్నములంచు ♦ దలఁచెమదిని. 360

సీ. అబలచిహ్నములవా ♦ రటు,తమంతకెకోరి,తాల్చుచుండిరటంచు♦దలఁచెగాంధి
అయినదర్బారునా ♦ డటుధరించుటవారి, కర్తవ్యమనుకొర్గె ♦ గడకతండు
అందుఁగొందరికిష్ట ♦ మందుకులేకుండె, దర్బారుదినముఁ లందప్పనెపుడు
అయిననన్యత్రవా ♦ రటుదాల్తురో లేదొ, స్త్రీలుమాత్రమ్మె ధ♦రించునగల

ఆ. దాల్పవలసెకట ♦ దర్బారుకరుగరా, ట్పురుషువరులకంచుఁ ♦ బొగిలెనాత్మ
గాంధి, ధరధనాధి ♦ కారాల, పదవుల, పాపదోష ఫలిత ♦ భారమంచు. 361

## గోఖేలుతో నొకమాసము—1902

సీ. తనతోడివాస ప్ర♦థమదివసమునుండె, గాంధినివనతమ్ము ♦ కరణిగాంచె
ఆతనికవసర♦మైనవన్నియుఁగూర్చ, వలసినవసతుల ♦ వడినమర్చె
అతనికివలయు న♦వన్నిస్వల్పములోట, వానిదానె కనుట ♦ వాడుకగుట
అన్యులసాయమే ♦ మర్థింపకయె యన్ని,విషయమ్ములందున ♦ వెలయుచుంట
గీ. శుచియు, శుభ్రతపాటించి ♦ సోలయకుండ, నిత్యనైమిత్తకమ్ము ల♦గత్యముగను
తీర్చుకొనుచుండు మోహను♦దీక్షగాంచి, గోక్లెకొనియాడె గాంధిప♦కుంఠితమతి.

క. తా నెరిగిన సర్వస్వము, నూతముగా దెలుపు మోహ♦ నునికిం దన్నుం
గానగవచ్చెడు ప్రముఖ జ,నానేకముఁ బరిచయమ్మొ♦నర్చె నతనికిన్. 363

ఆ. అట్టిప్రముఖజనము ♦ లందుముఖ్యుఁడు గోక్లె, ప్రక్కయింటియందె♦వాసముండు
డాక్టరు పి. సి. రాయి♦తరచుగోకేలుతో, మాటలాడవచ్చు♦మాన్యతముఁడు.

ఉ. ఆర్యగురూత్తముండు, సుగు♦ణాంచితు డాశ్రితకల్పవల్లి, యా
చార్యవరుండు, రాయియను ♦ నాహ్వయుఁ డెప్పిదినూర్లయాయ మా
దార్యముతో వ్యయించు, బహు♦థా ప్రతి మాసము ప్రజార్థమెప్పుడుం
భార్యయెలేదు; పెండిలినె ♦ వద్దను వర్ణిసతంబతండిలన్. 365

సీ. అనవరతంబు ని♦రాడంబరంబుగా, దుస్తులఁ దాల్చు ప్ర♦శస్తగుణుఁడు
భరతదేశపుమిల్లు ♦ బట్టలమును దాల్చె, తదనంతరమున ఖ♦ద్దరు ధరించె
సతముగోకేలుతో ♦ సంభాషణలుసల్పు, ప్రజప్రకృతిఁగూర్చు ♦ పనులఁగూర్చి
విమలవిద్యాధిక ♦ విషయమ్ములంగూర్చి, లీల మాటాడుగో♦కేలుతోడ
తే. అప్పుడప్పుడు ప్రజలనా♦యకుల మనెడు, వారిఁగూర్చి విమర్శన♦వారిగా నొ
నర్చుచును విచారించుచుం♦డంగవినుచు, గాంధియానాయకమ్మన్యగతులెరింగె.

ఆ. పనులమీదనుండఁ ♦ బరికింపగోక్లె, నానంద మొందు డెంద♦మందు గాంధి
క్రొత్తవిషయములను ♦ గుఱించి నేర్చువి,ద్యార్థిపగిది నతడు ♦ తరచు శ్రద్ధ.

సీ. తనమొకండు పృథాగ ♦ గడపడాతని సర్వ,సంబంధ బాంధవ్య♦సరణులెల్ల
ప్రజలక్షేమార్థమే ♦ భాషించు నెల్లదే,శము బాగుపడుటకే ♦ సంతతంబు
నీతి నిజాయితి ♦ ప్రీతిరంజిల్లనా, భాషణభూషణ ♦ భాగ్యమంది
భారతదేశస్థ ♦ దారిద్ర్యదాస్యమ్ము,లం గూర్చి యేచింత♦లం దపించు
గీ. వివిధవిషయమ్ములం జర్చి ♦ వివిధజనము, లతనిమనమున కెక్కింప♦జతనసలుపు
వారలైనను బదులిడు ♦ వారికెల్ల నొక్కరీతిగ నిటుగోక్లె ♦ యొప్పుమిగుల.

సీ. నీగోరినట్టిది ♦ నీభావమున కను,గుణముగ జేయు మీ♦కోర్కెదీర
నీచెప్పినట్టిది ♦ నీవెసేయవలంతి,వీవె సేయుము నాకు ♦ వీలుపడదు
నాచేయుకార్యమ్ము ♦ నన్ను సేయగనిండు, నాదేశమును స్వతం♦త్రమ్మొనర్ప
నన్యవిషయమ్ముల ♦ నామీద యోచింప,వచ్చు నీనాడునా ♦ యిచ్చయందు

గీ. కలవదొక్కటెకోర్కె నా ♦ కాలమెల్ల, నాకుగలశక్తియుక్తులఁ ♦ బ్రాకటముగ
నన్ని తదభీష్టసిద్ధికై ♦ తిన్నగాను, ధారవోయగనెట్లుండు ♦ వేరుకోర్కె? 368

క. స్వాతంత్ర్యము సిద్ధించిన, ఆతరువాతం దలంప ♦ ననుకూలమ్మా
ఖ్యాతిగఁ, దదన్యవిషయము, లేతీరుగనైనఁ జేయ ♦ నిది నామతమున్. 369

క. అడుగడుగునఁ గనబడు నా,తడు బొగడుచునుండ సంత ♦ తముభక్తిని రా
నడె, నుడివినవే వేదము, నుడువులనుచుఁ దాను బల్కు ♦ నుడువులనెల్లన్. 370

గీ. గాంధికాదర్శపురుషుండు ♦ ఘనుడుగోక్లె గోక్లెకాదర్శగుణుఁడు స ♦ ద్గుణగరిష్ఠు
డైనరానడె, యతనియ ♦ ఖ్యాతికాది, భౌతికగుణమ్ములంగూర్చి ♦ భక్తిఁబొగడు
నవధిలేనియానంద ర ♦ సాబ్ధిమునిగి. 371

గీ. గాంధితనతోవసించిన ♦ కాలమందు, జరిపె ♦ రానడేవర్ధంతి ♦ సంతసమున
గోక్లెప్రతివత్సరముబోలె ♦ గొప్పగాను, అప్పుడతనితోనుండిరి ♦ న్యాయమూర్తి
యొకరు ప్రొపెసరుకథవాడె ♦ ప్రకటితముగ. 372

వ. ఆనాడు గోక్లేమహాశయుఁడు, తానెరిగియుండిన రానడే మహాశయుని సద్గుణ గణమ్ములఁ గూర్చి కొనియాడుచుఁ జేసిన ప్రసంగమునఁ బ్రాస్తావికముగా, తెలాంగ్, మాండలిక్ మహాశయులతో, రానడేనిబోల్చి యిట్లు పలికెను. "తెలాంగ్ మిగుల మనోహరాకారుడు. మాండలిక్ మహాసంస్కారి. అతనికతని ఆసాములయెడ నత్యంతాసక్తిఁ గలవాడు. ఒకానొకనాడతడు మామూలు రెయిలుబండికి పోలేనపుడు, తరుణమునకు కోర్టులో హాజరగుటకొంకు, ఒక 'స్పెషల్ట్రెయినునే' ఏర్పాటుచేసికొనెను. అటువంటి తెలాంగ్, మాండలికుల మించిన బహుముఖ ప్రతిభాశాలి రానడే. అతడు గొప్పన్యాయమూర్తియేగాక, చారిత్రిక పరిశోధకుడును, ఆర్థికశాస్త్రవేత్తయు, సంఘసంస్కరణాసక్తుఁడునై యుండెను. న్యాయమూర్తిగా, ప్రభుత్వోద్యోగమందుండినను, నిర్భయముగా నాతఁడు కాంగ్రెసు సమావేశములకు హాజరయ్యెడివాఁడు. ఆనాడెల్లరి విశ్వాసము చూరగొన్న వివేకవిజ్ఞానధనుడగు రానడేతీర్పులఁ నెల్ల రామోదించెడి వారు." అని రానడేనిగూర్చి గోక్లే నిరవధిక సంతోషతరంగితాంతరంగుడై కొనియాడెను. 373

సీ. గోకేలుకానాడు ♦ ఘోటకశకటమొఁ ♦ దుండె దానిని మోహ ♦ నుండుగాంచి
"ట్రాముండ నీశక ♦ టంబేల ప్రయనింప, తగదె నాయకులకు ♦ ట్రామ"నంగ
మదినొచ్చి యించుక ♦ మందలించెడురీతి, గాంధితోఁబల్కె నీ ♦ కరణిగోక్లె
"స్వేచ్ఛమైనీవు పో ♦ వచ్చు ట్రామున నిప్డు, కానినావలె ప్రజ ♦ కంటఁబడిన
వెంటాడు స్థితికిరా ♦ వెనుకాడ గలవీవె, యచ్ఛమై ట్రామున ♦ నేగుటకును.

గీ. నీ నిరాడంబరగుణమ్ము ♦ మాననీయ, మైన జీవింతుసాధ్య మై♦నంతవరకు
దంబమెనయని విధమున♦దప్పదైన, వ్యయమగుటనాదు బోంట్లకే♦యనని నెట్లొ".

సీ. అంత నిట్లనెగాంధి ♦ "కొంత సేపైనను, నడకవ్యాయామ మొ♦నర్ప రేల?
ఎపుడు నేదో వ్యాధి ♦ నీసురోమను చుందు, రేల? ప్రజలపను ♦ లెక్కవాక్కొ."
ఎపుడూరకొందు నే ♦ జెపుమెపుడున్నది, వ్యవధినడక వ్యా♦యామమునకు"
అని గోక్లెబదులిడె ♦ నైనమోహనుఁడా స,మాధానమునకింత ♦ మానసమున

గీ. తృప్తి జెందఁడయ్యెఁ ♦ దీరుబాటెట్టులో, కలుగ జేసికొనగ ♦ వలయు నెల్ల
వారలెల్ల పనుల ♦ వ్యాయామ మొనరింప, నంచుఁబల్కె గాంధి ♦ యంచితముగ.

సీ. గాంధిగోక్లెయింటఁ ♦ గాలమూరక వ్యర్థ, మొనరింప కాతండు ♦ మునుపు దక్షి
ణాఫ్రికాయందుండి ♦ నప్పుడు క్రైస్తవ, విహితులతో నన్న ♦ విధముగాను
క్రైస్తవులెట్లు భా♦రత దేశమునను న్న, విధమెల్ల నెఱుఁగగా ♦ మదిఁదలంచి
బాబుకాళిచరణు ♦ ప్రఖ్యాతి వినియుండి, యాతనిగలిసి మా♦టాడఁగోరె

గీ. హిందుముస్లిము జనముల♦నెవరితోడఁ, గలయకుండెడు సామాన్య♦క్రైస్తవేండి
యనులవలెగాక కాంగ్రెసు♦నందుఁ బ్రముఖ, పాత్రవహియించియుండెను♦బాబుకాళి
చరణుఁడెరుగు గాంధి యా ♦ సంగతులను. 376

మం. "కాళీచరణుతోడఁ ♦ గలసి మాటాడ, కోరితి"నని పల్కె ♦ గోక్లెతో గాంధి.
"ఆతనితోఁ గలసి మా♦టాడుటవలన, నేమి ప్రయోజనం ♦ బెసగునీకందు
ఆతనిసమాచార ♦ మంతయు నెంతో, ఎఱుగుదు బాగుగా♦నే నిన్నతండు
సంతృప్తిబరపగాఁ ♦ జాలఁడంచెంతు, ఆయినను నీకిష్ట♦మైనచోఁ గలయు
మాతని" యనిపల్కె ♦ ప్రీతిని గోక్లె, తెలిపియుండె యతని ♦ గలసెను గాంధి
అతఁడందుఁ జనినప్పు ♦ డాతని భార్య, మరణశయ్యందునం ♦ బవళించియుండె
అతనిగృహమ్ము ని♦రాడంబరమ్ము, వంగదేశపుటంగ ♦ వస్త్రమ్మునుండి
అతనిదుస్తులిడెల్ల ♦ నరసి మోహనుఁడు, సంతసమ్మునసల్పె ♦ సంభాషణమ్ము
"మూలపాతకవాద♦మును విశ్వసింతె" "విశ్వసింతట్లైన ♦ వినుము లేదెందు
ఆపాతకమునుండి ♦ నంసవిముక్తి, హైందవమతమున ♦ నరయనేదారి
క్రైస్తవమతమందు ♦ గలదట్టిదేను, ప్రభుశరణాగతిఁ ♦ బడయు లేముక్తి"
"ఆట్టిప్రపన్న మా♦ర్గాను వర్తనమె, కృష్ణప్రబోధిత ♦ గీతబోధించు
భక్తియోగము"టంచు♦బల్కె మోహనుఁడు, కానియొప్పండయ్యె♦కాళీచరణుడు
గాంధియొప్పడొకింత ♦ క్రైస్తవబోధ, ఎట్లైననేమి యం♦దెసగ మేలంచు
పలికెమోహనుడు స♦ద్వర్తనుండగుట, మంచివారలకెందు ♦ మంచియే తోచు.

క. ఆదినములఁ గలకత్తా, వీధులఁబడి నడిచెగాంధి ♦ విసుగొందకయిం
తే దక్షిణాఫ్రికాపని,పైఁ దరుచుగఁ గొంతమంది ♦ ప్రముఖులగలిమన్. 392

క. కలసెఁ జస్టిస్ మిత్తరుఁ, గలసెఁ గురుదాస్ బెనర్జి ♦ ఘనుఁ బెక్కురపె
ద్దలనర్థించుచు సాయ,మ్ముల రాజాప్యారి మోహ♦నాఖ్యముఖర్జిఁ. 393

తే. న్యాయమూర్తిమిత్తరుదర్శ♦నంబుకొఱకు, చనినదినముం దెయాప్రాత♦మున నెసంగు
కాళికాలయమరయంగ ♦ గాంధిపోయె. 394

తే. కాళికాఘట్టమందలి ♦ కాళికాల,యమ్ముగూర్చి గ్రంథమ్ములం ♦ దతఁడుచదివి
యుండినందున నుల్లముం♦దుత్సహించి, కోర్కెజనియింపనేగెనా ♦ గుడినిజూడ.

తే. కాంచె నతఁడు ప్రవాహమ్ము ♦ గతినిజనెడు, గొఱ్ఱెమందల కాళికి ♦ కోర్కెదీర
నంధభక్తులు బలియీయ♦నకట గాంధి, తానుగుడికేగునట్టి యా♦దారినెల్ల.

తే. ఆలయమునందు నందెల్ల ♦ యాచకతతి, వరుసలుగ దీర్చియుండిరి♦వారిలోన
కొందరుండిరి మతభిక్షు♦కులుగ దెలియ, నందునొకగుంపు గాంధి వెం♦టాడిచనియె.

సీ. ఆనాడు గూడమో♦హనుఁడు బలిష్ఠులౌ, నెట్టివారికి దాన♦మీయనోడె
అందొక్కఁడు వసార ♦ యందునాసీనుఁడై, అబ్బాయి నీవెందు ♦ కరుగుచుంటి
వనిగాంధి నాతని ♦ యనుచరుంగూర్చుండ, మనగనాతని గాంధి ♦ యడిగెనిట్లు
ప్రాణులనీరీతి ♦ బలియిచ్చుటలు నీకు, సమ్మతం బెయటన్న ♦ సాధువనియె

ఆ. "జీవహింసమతము ♦ గావరించెదరెవ్వ?" "రట్టులైనఁ గూడ ♦ దిట్టిహింస
యంచుబోధ నీవొనర్పవేలన" "నది, కాదు నాయొనర్చు ♦ కార్యమెపుడు."

శా. దైవధ్యానము నా యొనర్చుపని ని♦త్యం"బట్టు"లైనన్ భవ
ద్దైవధ్యాన మొనర్పగా నితర సు♦స్థానంబులం గానవే"
ఏవైనన్ గలకత్త పట్టణమునం ♦ దిం దెల్లస్థానంబులన్
సేవింపన్మది దైవముల్ సమముగా ♦ శ్రేష్ఠంబులే మాకిటన్. 399

క. గాయకపల్లవిబోలెన,మాయక జనులెల్ల గొఱ్ఱె♦మందలబోలెన్
నాయకులుజనెడుదారిన్, బాయకజన సాధుజనులు ♦ మాన్పఁగలారే? 400

సీ. అనుచుసాధువు వల్క♦నతనితోఁ జర్చసా,గింపక మోహనుం ♦ డేగెగుడికి
అందురక్తప్రవా ♦ హమ్మెదురరుదేర, నిలువంగలేక నా♦స్థలమునందు
సహియింపలేక దుః♦స్సహమైన యాదృశ్య, మరయంగలేక మో♦హనుఁడు నాటి
సాయంత్రమున వంగ♦జాతిమిత్రులు బిల్వ, విందారగింపగా ♦ వెళ్ళియందు

ఆ. చెలిమికాని వొకని♦జేరి యాక్రూర పూ,జావిధాన విషయ♦చర్చసలిపె
నాతఁడాలయాధి♦కారావము మృదంగ,వాద్య శబ్దమందు ♦ వాయిలేని
గొఱ్ఱెలెట్టిబాధ ♦ గుర్తెరియురుంగవు, కావనందు హింస ♦ గలుగదనియె. 401

ఆ. కాని యాజవాబు♦గాంధి కావంత రు,చింపకుంట గొఱ్ఱె♦లించుకంత
పలుకగల్గియున్న ♦ దెలిపియుండును వేరు,విధముగా నటంచు ♦ విసుగుచనియె.

క. క్రూరమ్మగు నాహింసా, చారము నిలుపందలంచె ♦ స్వాంతమునఁబురా
కారుణ్యనిధినిబుద్ధుని, సారమతిందలఁచె దనదు♦శక్తిం దలచెన్. 403

సీ. ఆనాటినుండి మో♦హనుఁడు భావించెమా,నవుని ప్రాణమ్మట్లు ♦ భువినిమేక
పిల్లప్రాణముగూడ ♦ విలువైనదంచ స,హాయులౌ ప్రాణుల♦ మసువు లధిక
తరరక్షణార్హముల్ ♦ దప్పక యీజీవ,రాసుల బలినుండి ♦ రక్షసేయ
నాత్మశుద్ధికితోడు ♦ త్యాగశక్తినిబొంద, వలయుఁ బ్రాణులహింస♦బారినుండి
ఆ. కావమనల పాత♦కమునుండి రక్షింప, గుడికి శుద్ధిముక్తిఁ ♦ గూర్పదైవ
మవతరింపడేల ♦ నక్కటికంబుతో, నక్కటా! యటంచు ♦ నార్తిగుందె. 404

చ. వినుతవివేకవంతులును ♦ విజ్ఞులు ప్రాజ్ఞులు త్యాగశక్తిసు
ఘనులని, జ్ఞానులంచుభువి ♦ ఖ్యాతిని గాంచిన వంగసోదరుల్
మనమున రోయరే యిటు న♦మాయక జీవులప్రాణముల్ బలిం
గొనుట లటంచు గాంధిమది♦గుందెను కొందలమందగానెదన్. 405

సీ. మతముపేరటఁగాళి ♦ మాతకు బలియిచ్చు, జీవహింసనుమాన్పఁ♦జిత్తమందు
కలుగజిగీష బెం♦గాలు జీవితగతు, లెరుగగోరికె గాంధి ♦ కెక్కువయ్యె
పఠనశ్రవణముల ♦ బ్రహ్మసమాజమ్ము, గురిచియాతం డెంతొ♦యెరిగియుండె
చక్కగాను ప్రతాప ♦ చంద్రమజుందారు, చారిత్రమెరిగెఁ ద♦త్సభలకరిగి
వాసిమజుందారు ♦ వ్రాసినకేశవ, చంద్రసేనుచరిత్ర ♦ శ్రేష్ఠఁజదివి
ఆదిబ్రహ్మసమాజ♦మల్ల సాధారణ, బ్రహ్మసమాజాంత ♦ రమ్మెరింగె
తే. సరసుఁబండిత శివనాథ ♦ శాస్త్రిఁగలిసె, కోరిదేవేంద్ర నాథఠా♦గూర్ మహర్షి
వజ్రబ్రహ్మసమాజోత్స♦వమున కరిగి వంగసంగీతమాధురి♦ భంగి వినియె. 406

సీ. బ్రహ్మసమాజమ్ము ♦ పద్ధతులారసి, స్వామివివేకానందుఁ ♦ బ్రేమఁజూడ
బేలూర్మఠమునకు ♦ వెళ్ళెఁగాల్నడకఁ ద,దేకాంతవాసమ్ము ♦ సిచ్చమెచ్చె
నైన నస్వస్థత ♦ నాయన కలకత్త, యింటనుండుట విని♦యెడద నొచ్చె
ఆరిగెనాపిమ్మట ♦ నలసోదరి నివేది,తం గాంచనామె చౌ♦రంగిమేడ
తే. కలసికొనియామెవిభవమ్ము♦గొలుపవిభ్ర,మమ్ము నామెతో సంభాష♦ణమ్ము సలిపి
కలయికంగనఁజాలక ♦ గాంధిమరలె, చంచలాత్మగనామె; వ♦ర్ణించెగోఖ్లె. 407

తే. మరల పెస్టోంజిపాదుషా ♦ మందిరమున, ఆమెనుంగాంచె పెస్టోంజి♦యంబతోడ
మాటలాడవారిద్దరి ♦ మధ్యగాంధి, వ్యవహరించె ద్విభాషిగా ♦ వారలెరుగ.

తే. ఆమెభావముల్ తనకెంత♦నచ్చకున్న, హైందవమతమ్ముయెడనున్న ♦యామెసమధి
కానురాగాధికప్రేమ ♦ లరసిగాంధి, అబ్రమందెఁ దద్రచనల ♦ నరసెఁబిదప. 409

సీ. కలకత్తపురమందుఁ ♦ గలప్రముఖులఁదక్షి, ణాఫ్రికాపనిగూర్చి ♦ యరయుటందు
పురిప్రజామత సంస్థ ♦లరసి తత్కార్య క,లాపమ్ముల గ్రహించు♦టంధిగాంధి

ప్రతిదినమ్మున దీరు♦బాటు కాలంబెల్ల, వ్యయమొనర్చెదు శ్రద్ధ ♦ ననుదినంబు
ఆ కాలమందె యొ♦కప్పుడు సౌతాఫ్రి,కా గూర్చి మరియొక ♦ ప్రాంబులెన్ను

గీ. కోర్సు, బోయరుయుద్ధము ♦ గూర్చి యతఁడు, పన్యసించె మల్లికునధి♦పతిగ గల్గి
సభలమును బోలె సాండరు్స ♦ సలుపసాయ, మల్లనింగ్లీషు మేఁ పత్రి♦కాధిపతిగ.

ద్విపద. ఆప్రసంగంబుల ♦ నాలించి గోఖ, లే ప్రశంసించెను ♦ రేప్రస్తుతించె
నదియంచు నానంద♦మందెను గోఖ్లె, అది యీశతాబ్దాది ♦ యందుద్వితీయ
వత్సరంబున జన♦వరి మాసమందు, ఉత్సాహమెంతయో ♦ యొడవగా జరిగె.

సీ. ఈరీతి గోఖేలు ♦ యింటియందుంటచే, పనులు గాంధికి సుల♦భముగ నయ్యె
పలువురు బెంగాలి ♦ ప్రముఖకుటుంబీకు, లైరి మిత్రులుగ మో♦హానునికపుడు
జనవరి కడపటి ♦ దినముల రంగూను, చని యందు గనె బంగ♦రాలయంబు
అట ‘ఫ్రూంగి’లను బౌద్ధ♦జటిజనమ్ముల బద్ధ,కముగని మదినొచ్చు;♦కరము మెచ్చె
తద్దేశకాంతా స్వ♦తంత్రవిహారముల్, చురుకుగా, బనులందుఁ♦దిరుగుచుంట

గీ. నొచ్చునాలయమున పతు♦లెచ్చుగాలు, చుంటకెన్ని యోచినచిన్న♦వురుక నెలుక
లరయ స్వామిదయానందు♦లనుభవములు, మదినిదోచెను గాంధి క♦మందముగను.

తే. అగునె బొంబాయి యిండియా?♦అట్లె బర్మ, యగునె రంగూను పుర?మన ♦ మాంగ్లు
లకును, కమిషనే జెంట్లమైనట్లు♦కడకు మనకు, నాంగ్లజనులకే జెంట్లు బర్మా జనములు.

క. రంగూను నుండి క్రమ్మర,గం గాంధికిఁ బనులు ముగిసెఁ ♦ గలకత్తపురిన్
పొంగమదిఁ దలఁచె గుతుకము, నంగన మూడవ తరగతి ♦ నరులపయనమున్.

క. వినిపించెను గోఖ్లేకిన్, తనమదిఁ గలవిషయమతఁడు ♦ తప్పనె మొదటన్
కనిగాంధి మనోశుద్ధిం, దనిసి ముదలనొసగె గోఖ్లె ♦ తమివీడ్కొల్పెన్. 417

వ. మూడవతరగతి ప్రయాణంబునకు వలయు, ముదక ఉన్నికోటు, ధోవతి, తువాలు, పండ్రెండణాలడబ్బు నొకసంచిలో నుంచుకొని, పూరీలు, మధుర పేణీలుతో నిండుగా గోకేలొసగిన ‘టిఫిను బాక్సు’తో, గోకేలు, స్టేషనుకు తోడుగావచ్చి వీడుకొలుప, మూడవతరగతియందు ప్రయాణమొనర్ప మోహనుడు బయలుదేరెను. 418

వారణాశిలో — 1902

ఉ. పైతనము రాజకోట కటు ♦ పశ్చిమమార్గము మధ్యవారణా
శీనగరంబు నాగ్రపురి ♦ శ్రీజయపూరు పలాన్పురంబులన్
కానగ నాపురంబుల ది♦గందల పోసెను ధర్మశాలలం
దో నిజయాత్రికాళిగతి ♦ నుండగఁ బండితులిండ్లలోనెటో. 419

సీ. మూడవక్లాస్ ‘పైన♦మున’ మెయిల్ బండ్లక,న్నను మేలు సాధార♦ణముగు బండ్లు
‘చార్జీలు’ మెయిలందు ♦ జాస్తియౌ జనమతి, సమ్మర్థముగనుండు♦క్రుమ్ముకొంచు

మూడవక్లాస్ పెట్టె ♦ లోడకమురికికూ,పము లట్టులుండు నె♦ప్పటికిజూడ
తత్ప్రియాణికుల నం♦తట గొర్రెమందల, ట్లరయుదురధికారు♦లగణితముగ

గీ. మొదటితరగతి సౌకర్య♦ములకు బోల్పఁ, బరగుమూడవతరగతి ♦ వసతులల్ల
పశువులంగట్టు దొడ్డిగా ♦ భరతదేశ,మందు లేదిట్టి వ్యత్యాస♦మెందు జగతి.

సీ. ఐరోపదేశమ్ము ♦ లందొందు నింతభే,దముగల్గ దీరెండు ♦ తరగతులకు
సౌతాఫ్రికాయందు♦సామాన్యముగ నీగ్రో, లెక్కు మూడవక్లాసు♦పెక్కువసతు
లలరనొప్పును దక్షి♦ణాఫ్రికాలో కొన్ని,ప్రాంతంబులందుండు ♦ పడకవసతి

గీ. ఒత్తుగామెత్తలుండుఁ గూ♦ర్చుండుచోట్ల, సరిగపాటింత్రు జనముక్రి♦క్కిరియకుండ
నియమముల నధికారుల♦నయము; క్రమము, దప్పరెప్పుడుమనకట్టు♦లెప్పుడొప్పు.

సీ. రయిలువేవారి ని♦ర్లక్ష్యభావమ్ముం బ్ర♦యాణికా శుభ్రపు♦టభ్యసనము
లరసిశుభ్రాచారుఁ♦డగు ప్రయాణికుఁడోడు, మూడవతరగతిం ♦ బోవనెపుడు
తమలపాకు పొగాకుఁ♦దవడలనమలుచు, పొగఁద్రాగుచెపుడు తు♦పుక్కుమంచు
ఉమిసి చెత్తచెదార ♦ మోడకపెట్టియం, దంతట వేయుచు ♦ నధమువాక్కు

గీ. లాడుచరచుచుఁదోడి ప్ర♦యాణికులకు, కలుగజేయుచునున్నారె♦కష్టమంచుఁ
దలఁపకింతయువర్తింత్రు ♦ తప్పెరుగక, అకటమూడవతరగతి ♦ యందుజనులు.

సీ. ఆనాటికీనాటి ♦ కనుభవమ్మునభేద, మరయనింతనుచు మో♦హనుడుపలికె
అయిదేండ్లస్వానుభ ♦ వానంతరమున బం,దొమ్మిదినూట పం♦దొమ్మిదేట
ఇందుకు గలదొండె ♦ మందు విద్యాధికుల్, మూడవతరగతిం ♦ బోవుచెపుడు
స్వార్థరహితముగాఁ ♦ జనులకు మంచియ,భ్యాసముల్ దెలుపుచు♦పైనమందు

గీ. అంతులేకుండ అధికార్ల♦కంపి వినతి,పత్రికల నేరతిక్రమిం♦పక నియమము
లనుసరింపఁజేసిన నొద♦వును క్రమముగ, మేలుఁజేకూరునని గాంధి♦చాలవరకు.

క. పందొమ్మిది పదునెన్మిది, పందొమ్మిదవాబ్దమందు ♦ వ్యాధింబడి శ్రీ
గాంధి తృతీయశ్రేణిం, బొందుగఁ బయనింపలేక ♦ పోక్కెనెడంబఱ. 424

సీ. అటులమూడవశ్రేణి ♦ యందునఁబయనించి, చేరమోహనుఁడు కా♦శీపురంబు
అందు దనకుశుభ్ర♦మైనవాఁడనితోచి, నట్టి 'పండా' యింటి ♦ కరగెనందు
మేడపైగదినుండి ♦ పాడిగా గంగాన,దీస్నాన మొనరించి ♦ దీక్షపూజ
గావింప దర్శింపఁ ♦ గాశికావిశ్వేశు, నాలయంబునకేగి ♦ యరసెనందు

ఆ. మున్ను దానువిన్న♦మోస్తరెల్లెడనుంట, మురికియాగలెచట ♦ ముసురుచుంటఁ
పాపుకీపరుల య♦సహ్యవర్తాయరుపులు, యాత్రికులకు దుస్స♦హముగనుండ.

సీ. దేవాలయములందు ♦ దీక్షధ్యానించుట, కనుకూలమైన వా♦తావరణము
కలిగింపవలె నధి♦కారులు శుచి శుభ్ర,తలను బాటించి, సం♦తతము; కాని
గుడిముంగిటనె కంపు♦కొట్టె; నట్టులె కుళ్ళి,పోయినపువ్వుల ♦ ప్రోవులుండె
జ్ఞానవాపీ పరి♦సరములంగూడ క,ల్మషముండుటంగాంచి ♦ మదిసిగుండి

క. నేఁ దెలిసిన నీటి చికి,త్సాదుల ఫలితంబుగోరు ♦ దరయఁగనిందీ
వాడుకొనవలయు బాలుని, వ్యాధిఁ బరీక్షించి చెప్పు ♦ చరయుచు నాడిన్.

క. అని గాంధిపలుక డాక్టరు, విని సరియని యరిగె బిదప ♦ విని మణిలాలున్
తినజాలఁ గ్రుడ్లు మాంసము, కనుగొందము జలచికిత్స ♦ గతులంచనియెన్. 452

తే. అంత గాంధి మనమ్మున ♦ సంతసించి, 'ఖూనె' చెప్పిన గతికటి♦స్నానములను
బాలకునిచేతఁ జేయించె ♦ పథ్యమిడియె, జలముతోఁగల్పి నారింజ♦ఫలరసంబు.

తే. మూడునాళ్ళట్లు లొనరించె ♦ మోహనుండు, కానిపట్టదె తగ్గుము♦ఖంబువ్యాధి
రాత్రులందునాతనికిస్మా♦రకముదప్పుచుండె, హెచ్చుగాజ్వరము ను♦ష్ణోగ్రతయును.

వ. రాత్రులం దట్లు జ్వరము తీవ్రంబుగా దెలివిఁదప్పి పడియున్న కొడుకుంగని బెగడొంది గాంధి తన మనంబున "అకటా ! జనులు ననుగూర్చి యేమనుకొందురు ? నా యగ్రజుడు ననుగురించి యేమని తలంచును ? వేరొక డాక్టరుం బిలువనంపిన బాగుండునేమో ? ఆయుర్వేద వైద్యముఁ జేయించిన నయమగు గాబోలు ? బిడ్డలను దమ పిచ్చినమ్మకమ్ములకు బలిచేయుటకు తలిదండ్రుల కెట్టి హక్కున్నది ?" అని యనేక విధంబులగు తలపోతలవలనఁ దల బరువెక్క, వేరొక్క భావధోరణి బైలుదేర, "నేను నాకెట్టివ్యాధి వాటిల్లిన నేనెట్టి చికిత్సఁ జేసికొందునో అట్టి చికిత్సయే నాకొమరునికిఁ జేయించుట సర్వేశ్వరుండు సమ్మతించి సంప్రీతిజెందగలడు. నాకా జలచికిత్సయందు విశ్వాసము గలదు. డాక్టర్లు ప్రాణమ్ములకు భయమీయగలరా! ప్రాణపాశమ్ము లా పరమాత్ముని కరంబులందుండ, నాయనయందు సంపూర్ణ విశ్వాసముంచి, మంచిదని నానమ్మిన చికిత్స నాపరమాత్మువేర నెందుకు చేయరాదు ?" అని గాంధి దోళాందోళితచిత్తుఁ డయ్యెను. 455

ఆ. రేయిసమయ మిట్లు ♦ ప్రేమనిండుగఁ దండ్రి, పక్కపైనఁ గొడుకు♦ప్రక్కఁ బండి
పొయ్యిపైని పెనము♦బోలె. గాలుచు నెండి, పోయినట్టి కొడుకు♦వొంటిమీద
నీటదడిపి గుడ్డ ♦ నీరెల్లబో బిండి, కప్పె తలకు తడిదిఁ ♦ గప్పెటవలు. 456

క. దుప్పట్లు రెండు సుతుపై, కప్పెను నిలువెల్ల నలయఁ ♦ గడలి కడకు నా
యప్ప చనె సుతునితల్లికి, అప్పన మొనరించి తీర♦నాయాసమ్మున్. 457

క. పదిగంటల సమయము రే,యది వాహ్యాళికటు వచ్చి♦నట్టి జనమ్ముల్
చెదురుగ నటనటనుండిరి, మదినిండుగ యోచనముల ♦ మాటాడకెదిన్. 458

సీ. "ఓసర్వలోకేశ ♦ నాసర్వగౌరవ, ముండెనీకడనె బ్ర♦హ్మాండనాథ
ఇదినాదు మర్యాద♦కెల్లఁ బరీక్షా స,మయమిందు జయమందు♦మా మహేశ
మునుపు నిన్నాశ్రయిం♦చిన మృకండుకుమారు, పాలింపవే యము♦బారినుండి
భక్తినివ్వేడిన ♦ ప్రహ్లాదుమాటను, కాపాడబుట్టవే ♦ కంబమందు

తే. మరణమందిజమునిపురి ♦ కరిగినట్టి, గురునికొమరుని గొనితెచ్చి ♦ కరుణనిడవె
కోరి మొరనిడినంత నీ♦గురువరునకు, రామ శ్రీరామ పాపవి♦రామ రామ. 459

ఆ. భక్తినిన్ను నమ్మి ♦ భజియించి, నట్టివా,రెవ్వరైనఁ జెడుట ♦ యీశతగునె
నిన్ను నమ్మకుండ ♦ యేనైన్నఁగాచునే, రామ రామ యఘువి♦రామరామ. 460

క. నమ్మితినిన్నే భక్తిని, నెమ్మనమున నాదుసుతుఁడు ♦ నీదుసుతుండే
రమ్మా లేరిక దిక్కొవ,రిమ్మహి శ్రీరామ రామ ♦ యినకులసోమా. 461

తే. రామ రమ్మిక రయమున♦రమ్మురమ్ము, రామ రక్షింపగా రమ్ము♦రమ్మురమ్ము
రామ కాపాడనాదు గౌ♦రవమురమ్మ్మ, రామ నాసుతు రక్షింప♦రమ్మురమ్మ్మ.

సీ. అనిరామనామమ్మ♦నధరోష్ఠములమధ్య, నాట్యమాడ జపమ్మొ♦నర్చుచతఁడు
చాపతేయందలి ♦ సైకతస్థలి నొంత, సేపుండి క్రమ్మరెఁ ♦ జిత్తమెరియ
హృదయమ్ము రమ్మ్మనం♦దదురుచుండగ నిల్లు,చొచ్చినంతట బాలుఁ♦డచ్చెరువతఁడ
డంద బాపూ వచ్చి♦నాడవే,” “వచ్చితి, నాయనా యిప్పుడు ♦ నయమెనీకు”

తే. తీసివేయుము దుప్పట్లు♦పోసెఁజెమట, చాలమిక్కుటముగ నొక్కొ♦జాలననుచు
బాలుఁడుండంద్రి కంతోష ♦ భాషణములఁ, గలసిరంతట బాలిమై ♦ గాంధితీసి
వేసెతడిబట్ట దుప్పట్లు ♦ త్రోసి వేసి. 463

ఆ. చెమటగార బాలు ♦ చక్కిళ్ళనంతయు, తగ్గిపోవజ్వరము ♦ తండ్రికొడుకు
లిద్దరొక్కప్రక్క ♦ నిద్దురవోయిరి, రాముకరుణనే ♦ జ్వరంబుచనదు? 464

ఆ. పాలుపండ్లు రసము ♦ పథ్యమ్ము గా నలు,బదిదినాలుగడచె ♦ జ్వరమువోయె
గాంధికొడుకులందు ♦ ఘనతరారోగ్య సం,పన్ను డగుచు గ్రాలు♦మణిలలాలు.

ఆ. రామనామ జప ప♦రాయణమహిమచేఁ, బ్రదికెఁబాలుడంచు ♦ హృదయసీమ
రామభక్తి గాంధి ♦ ప్రేమశ్రీరాముని, స్మరణసేయుచుండు ♦ సర్వవేళ. 466

## తిరిగి దక్షిణాఫ్రికాకు—1902-1903

క. మణిలాలుకుఁ జేకూరఁగ, పునరారోగ్యంబు మార్చె ♦ మోహాను డిల్లుఁగా
తనియవెలుగు గాలియుఁగల, ఘనమగు నొక మేడశాంత ♦ క్రజునఁగొనుచుఁగా.

ఆ ‘శాంతక్రజ్జనుండి ♦ చర్చిగేటుకు ఫస్టు,క్లాసుటికెటుఁగొనియె♦గాంధి, ఫస్టు
క్లాసుపెట్టెలో నొ♦కండెతానుండుట, కెంతొమురిసె గర్వ♦మెడదనిండ. 468

ఆ. తాఁదలంచినట్టి ♦ దానికన్న నుజాల, నెక్కువగనె వృత్తి♦వృద్ధిఁ గాంచె
అతనిసఖులు దక్షి♦ణాఫ్రికావారిచ్చు, పనియొజీవన భృతిఁ♦బనియఁ బూర్చె. 469

సీ. కాని హైకోర్టునఁగా ♦ గలుగలేదేపని,మైనఁ గ్రొత్తగవచ్చి♦నట్టి యితర
బారిస్టరులఁబోలె ♦ వనధిపీచెడుచల్ల, గాలికి నిద్రింప♦గాంధిచనియె
హైకోర్టునం గ్రొత్త♦వ్యాజ్యవిచారణ, లాలించునెపమునం ♦ దప్పుడపుడు
ఆనాడు హైకోర్టు ♦ కరుగుట ట్లొకపోకు, క్రొత్తవిజ్ఞానంబు ♦ కొరకుఁగాదు

ఆ. కాని గాంధికోర్టు♦గ్రంథాలయమున గ్రం,థములఁజదివెఁబరిచ♦యములునూత్న
ముగలభించె ఫలిత♦ముగ హైకోర్టున, పనులుఁకూడివచ్చు ♦ పగిడిఁదోఁచె. 470

సీ. ఇట్లొక్కచక్కని ♦ వృత్తిపోయి చెలంగ, నింకొక్క ప్రక్క నో♦ కేలు గాంధి
కొరకుఁ బ్రజాళికల్ ♦ గూర్చుచుండెనతనిఁ, దనకనుకూల రీ♦తిని బ్రజాళి
సేవనొనర్పఁగాఁ ♦ జేయుసంకల్పమ్ము,తో వారమున మూడు♦తూరులతని
గదిపై పువచ్చి సం♦గడికాంగ్రదతో నప్పు, డపుడు వారిఁబరిచ♦యంబొనర్చె
తే. తెలిపెగాంధికిఁ దనపని ♦ తీరునెల్ల, నైన నటుగాక దైవమా ♦ యనస్వకీయ
విధినొనర్పఁగఁ గావించె ♦ విధివిధాన, మవనిసాధ్యమే త్రోయఁగా♦నెవరికైన.
క. ఆతడు తనమదిఁ గోరిన, రీతిని స్థిరపడగనుఁడ,♦ వృత్తిని వచ్చెన్
సౌతాఫ్రికవారంపఁగ, ప్రాతిఁగ ననుకొనని తంతె♦వార్త యొకండున్. 479
సీ. బ్రిటిషుప్రధాని చాం♦బెర్లెను రాబోవు,చుండె వెంటనె మీరు ♦ రండటంచు
వార్తనందికొనుచు ♦ బదులు 'కేబిలు'పంపె, డబ్బుబంపుడటంచు ♦ డబ్బువచ్చె
వెంటనే దక్షిణా♦ఫ్రికకు బయలుదేరె, ఆఫీసులో గదు♦లన్నివీడ
తే. నైననివసించుమేడయం ♦ దాలుబిడ్డ, లుండనేర్పాటు గావించి ♦ ఖండితముగ
గాంధియరిగెను సౌతాఫ్రి♦కాకు మున్ను. తానొనర్చిన బాసను♦దలచిమదిని.
తే. సాహసికులైన యువకులు♦జన్మభూమి,యందు దగినట్టి యుద్యోగ ♦ మందకున్న
ఇతరదేశాలకు వలస♦నేగుటొప్పు,ననుచు నానాటికిమోహము ♦ నభిమతమ్ము.
సీ. ఆలుబిడ్డలువీడు ♦ టాస్థిరవృత్తిఁ బో,నాడుట నిశ్చిత♦మందుకుకుట
ఎల్లబాధాకర♦మ్మయైన క్షణమాత్ర, మది తనకభ్యాస♦మగుటచేత
సత్యస్వరూపుడౌ ♦ సర్వేశ్వరుడొకండు, దక్కస్థిరమ్మైన ♦ దొక్కటన్య
మున్నదొక్కొ ప్రపంచ ♦ మును; మనకగపడు, సంభవంబులవెల్ల ♦ క్షణికములిల
ఆ. నైన; నీయనిత్య♦మగువాని యందుండె, నిత్యనిర్వికార ♦ సత్యసర్వ
జగదధీశుడైన ♦ భగవానుడాదైవ, సత్కటాక్షమున్న ♦ సాగునెల్ల. 476
క. ఆసత్యాన్వేషణమె, ఈ సర్వంసహ మనుగడ ♦ నెల్లరు మనుజుల్
వాసింజేయఁగ వలసిన, భాసుర కార్యక్రమంబు ♦ భాగ్యంబంచున్. 477
క. తలపోయుచు భగవల్లీ,లల గూరిచి గాంధియిట్టు♦లన్ బయనమ్మున్
జలనిధిని జేసెఁజేరఁగ, నలడర్బను రేవు దక్షి♦ణాఫ్రికయందున్. 478
ఆ. అచటఁజేరినంత ♦ నన్నిసిద్ధంబుగా, నుండె చాంబరులెను ♦ నొద్దకేగ
అంత గావలసిన ♦ 'అర్జీ'తయారించి, గాంధిడెప్యుటేష ♦ నందుజేరె. 479
క. రామా ఆలించితె నీ, ప్రేమాంచిత భక్తసచ్చ♦రిత్రంబందున్
ఈమూడవ స్కంధంబును, కామితఫల సుప్రదాయ♦కా శ్రీరామా. 480

తృతీయస్కంధము, సంపూర్ణము.

ఓం శ్రీరామ, జయరామ, జయజయరామ

# శ్రీ గాంధి మాహాత్మ్యము

## చతుర్థ స్కంధము



మద్భక్తి చకోరాంక
సోమా, జగదేకనామ ♦ స్తుత సుత్రామా
ధీమత్సన్నుత సుగుణ
స్తోమా, కారుణ్యధామ ♦ సీతారామా,

### నిరర్థకకృషి—1903

సీ. చాంబర్లెయిను వచ్చి ♦ సౌతాఫ్రికాంగ్ల బోయరుల హృదయములఁ ♦ గరఁగఁజేసి
కొనిపోవఁగా మూఁడు ♦ కోట్లు నేబదిలక్షల కవుండ్లధనమును ♦ విపులమతిని
అందుచే నిటుఁబల్కె ♦ వరసిభారతరాయ, బారవర్గముతోడ ♦ సామతిని
స్వపరిపాలనగల్గు ♦ వలసలవైన మా, యధికారమతి మిత ♦ ముగుటమీకు
గీ. తెలిసినదికాదె, మీకష్టములుఁ నిజమ్మె, చేతునాచేతనైనది ♦ శ్వేతజాతి
వారిమధ్యవసింపఁగాఁ ♦ గోరునెడల, వారి సంప్రీతిపడయుట ♦ వాంఛితమ్ము. 1

సీ. ఈరీతి చాంబర్లెయిను కొంకకింతయుఁ, బలుకంతునివె రాజ్య ♦ మిలనటంచు
బదులిడగా రాయ ♦ బారవర్గమున కీవిషయమంతయు గాంధి ♦ విశదపరచ
వడినెటాల్ నుండి ట్రాన్సు ♦ వాలుకుఁజనియె చాంబర్లెయిన్ గాంధి ట్రాన్సు ♦ వాలులోని
భారతీయులఁగూర్చి ♦ పల్కవలసియుండె, నైననందేగ మోహనునికిఁదగు
తే. నట్టియనుమతి పత్రమొం ♦ డార్జనంబొనర్పవలసియుండెను గాంధి ♦ నేర్పుతోడ
కలిసెమిత్రుఁ, బోలీసధి ♦ కారియైన, అల్లసూపరింటెండెంటు ♦ నతఁడనుమతి
పత్రముఁగడించె గాంధియుఁ ♦ బయనమయ్యె. 2

క. చేరియట మోహనుండు ప్రిటోరియ పురినట దయారు ♦ దోడనెచేసెన్
నేరుపలరంగ నొక్క మెమోరియలు నెటాలునందు ♦ బోలెన్ లీలన్. 3

ఆ. కాని దర్బనందు ♦ కరణి ప్రిటోరియా, యందు రాయబార ♦ మందు గాంధి
చేరగూడదంచు ♦ నేరుపుమైయధి, కారులాజ్ఞనిడిరి ♦ గాంధికచట, 4

సీ. ఎటుజొచ్చె 'ట్రాన్సువా ♦ లీ'నిబంధనలందు, గాంధియంచని యభ్ర ♦ మందువారు
'పర్మిట్టు' లేకయే ♦ పగిదిఁ బ్రిటోరియా, చేరెనీతండంచుఁ ♦ జెప్పువారు
అనుమతిపత్రంబు ♦ గొనకవచ్చినయెడ, చేతమురెస్టంచు ♦ జెలగువారు
చేసిగాంధి నరెస్టు ♦ జెయిలులోనుంచిన, డెప్యుటేషనుఁ జేరఁ ♦ డీతడప్పు

తే. డంచునంచిత సంతోష♦మందు వార, లైరియధికారులు ప్రిటోరి♦యాపురమున
గాంధిపైగలమాత్సర్య♦కలుషితాత్మ, భావబంధురులగుట దు♦ర్భావులగుచు. 5

ఆ. తంతినంపినొండు ♦ డర్బనునగరాధి, కారులకును, గొనెనె ♦ గాంధి పర్మి
టల నెటాలునుండి ♦ ట్రాన్స్వాలుకరుదేర, నంచు బదులు దెలుపు♦డంచు వేగ. 6

క. గడియించెను బర్మిట్టును, వడిజొచ్చెను గాంధి ట్రాన్సు♦వాలునటంచున్
తడయక ప్రత్యుత్తర మం,పృడెవచ్చెఁ బ్రిటోరియాకుఁ ♦ బొక్కగనాంగ్లుల్. 7

తే. ట్రాన్సువాలుఁ బ్రవేశించు♦టందు గాంధి, విజయమందెనుగానియా♦విజయమెల్ల
త్రోసిరాజనఁ, దదధికా♦రులు ప్రయత్న, మొనరిచిరి రాయబారాన♦మోహనుండు
చేరకుండెడు నటులెంతో ♦ నేరుపలర. 8

వ, ఈ చాపక్రింది నీటివ్యవహారమంతయు నిండియా మొదలగు నాసియా దేశములం దధికారమందుండి, యందలి యవినీతిపద్ధతులకలవాటుపడి, దక్షిణాఫ్రికాకు వచ్చిన దుర్మదాంధులైన దుష్టాధికారులు తెరవెనుక జరిపిన భాగవతము. దక్షిణాఫ్రికయందెంత వర్ణద్వేషమున్నను, అందలి ప్రభుత్వము, ప్రజాప్రభుత్వమగుటచే నందలి ప్రభుత్వశాఖలును, ప్రభుత్వాధికారులును, ప్రజాభిప్రాయమున కనుగుణముగా ప్రవర్తించుచు, బ్రజలక్షేమ మాకాంక్షించి, తమయధికారము నెరపుచుండుటవలన, నిండియాలోని నిరంకుశప్రభుత్వమందలి నీతిబాహ్యమైన ప్రభుత్వపద్ధతులందు లేకుండెను. కాని యీ యిండియావంటి నిరంకుశ ప్రభుత్వదేశములం దధికారమందుండి, దక్షిణాఫ్రికకు బోయరు యుద్ధకాలమందువచ్చి, యందలి ప్రభుత్వమం దధికారులైనవారు తమ నీతిబాహ్యమైన యధికారముఁ జెలాయింప నారంభించిరి. కనుక శ్వేతజాతివారి వర్ణద్వేష మొకవంక, యీ నూతనాధికారుల నిరంకుశాధికారము మరియొకవంకఁబట్టి పీడింప, భారతీయులపరిస్థితి ముందునూయి, వెనుకగోయిగాఁ దయాగ మ్యేను.

ఆ 'ఏసియాటిక్ డిపార్టుమెంటు'లోని, ముఖ్యాధికారి, సేట్ తేల్ హాజిఖాన్ మహమ్మదను భారతీయునిద్వారా, గాంధిని బిలువనంపి, కూర్చొనమనికూడ చెప్పకుండ "నీవిందు స్థిరనివాసియగు భారతీయుడుగాఁ బరిగణింపఁ బడజాలవు, కనుక|నీకీయఁబడిన అనుమతిపత్రము, పొరపాటున నీయబడినది. నీకిచటికివచ్చుట కధికారము లేదు. ఇండియనుల రక్షణార్థమే, యీ మా 'ఏసియాటిక్ శాఖ' నెలకొల్పబడినది. కనుక నీకు చాంబర్లైనుఁ జూచునధికారముగాని, యవసరముగానిలేదు. కనుక నీవింక యిటునుండి వెడలిపోవచ్చును" అని గాంధిని మృదువుగానే మందలించి పంపివైచెను. తదనంతరము గాంధితోఁగూడ వచ్చిన భారతీయులనందరి నన్నివిధములగు మందలింపులతో జీవాట్లువెట్టి, గాంధిని బంపించివేయుఁడని సలహానొసగి పంపెను. వారును, మిక్కిలి యాశాభంగ

ముతోఁ గ్రమ్మరిరి. ఈ యనుశాసని హఠాత్సంఘటనచే గ్రొత్తగా భారతీయు
లెదుర్కొనవలసిన వారైరి. 9

## చేదుమ్రింగుట

ఉ. ఈయవమాన మెట్లుభరి ♦ యింపగు నౌనని మోహనుండెదన్
బాయని బాధబొందె బహు ♦ భంగులనైనను; గొద్దిసేపులో
మాయని, మాయనట్టి యవ♦మానము లంతకుమున్న వెన్నియో
ఆయెను, వానినన్నిటిని ♦ హాయిగ నాతడు విస్మరించుటన్
"ఈయవమానము న్మరచి ♦ యేమియొనర్చిన జాతికంతకున్
శ్రేయముగూర్ప నౌనను చు ♦ జింతనజేసెను గాంధినెమ్మదిన్. 10

సీ. వడి నేసియాటిక్ డి♦పార్టుమెంటధికారి, వ్రాసెనుత్తరము ద♦ర్బనునగాంధి
చాంబర్లెయినుతోడ ♦ సంప్రతించుటఁజేసి, ఇతడెక్ష్మరసందు ♦ కరుగనేల
యనితొలఁగించి రా♦తనిపేరు డెప్యుటే,షనునుండి యనుచు" నా♦జాబుగాంచి
అగ్రహావేశులై ♦ యక్కఱలేదిట్టి, డెప్యుటేషనటంచు ♦ దెగడునట్టి
తే. అనుచరులతోడ మోహనుం ♦ డాగ్రహమ్ము వలదు జార్జిగాడ్ఫ్రేనాకు ♦
బదులువచ్చి, తెలుపుచాంబర్లెయినుకెల్ల ♦ కలతెరంగు, పొందు పోకున్న
మనకు తె♦ల్పునది లేద,టంచు దలచుప్రభుత్వ మ♦టంచుగాంధి,
సమ్మతింపఁగఁజేసెనా ♦ సంఘజనుల. 11

ఆ. గాడ్ఫ్రీనాయకుఁడుగ ♦ కడకిండియను లేగి, రల్లచాంబరు లెయి ♦ నంతికమున
కతడు గాంధిఁగూర్చి♦యడిగి యెప్పుడొకండె, వచ్చుకంటెనొరులు♦వచ్చుటొప్పు
ననుచువారిబాధ ♦ నపనయింపఁగఁ బ్రయ,త్నించెఁగాని భార♦తీయసంఘ
బాధ కోర్చెగాంధి ♦ భారమధికమయ్యె, మొదటికే యదెల్ల ♦ మోసమాయె.

సీ. "నీబోధ ననుసరిం♦చియె కాదె; చేసితి,మనికి సాయముఫల ♦ మరయుమిప్పు
డని గాంధినిం జెప్ప ♦ రనుచరుల్ గొందరు," కర్తవ్యమొనరించు♦టార్తిసాయ
మొకరికెప్పటికైన ♦ నెల్లమే లేయగుఁ, గడకుమేల్జేయుట ♦ కతనఁగాన
గతమునకేల వ♦గవ భావికర్తవ్య, మాత్మనాలోచింపు ♦ డనుచుగాంధి
ఆ. అనునయింప నెల్ల♦రందు కామోదింపఁ, బలికెనంతనన్ను ♦ బిలువనంపి
నట్టిపనులుముగిసె ♦ నైన నీక్రొత్త "డి,పార్టుమెంటు" అంతు♦నరయవలయు. 14

మం. అటుగానిచోనిండి♦యనులసంఘమ్ము, మటుమాయ మొనరింత్రు మంత్రతంత్రముల
అనుదినమ్ముంగ్రొత్త ♦ యవమానములకు, మనమెరయగుటస♦త్యమ్మట్టి-కుక్క
బ్రతుకుదుర్భరమగు ♦ భారతీయులకు, సతతమందువలన ♦ చాంబర్లెయిను
వలననాయుదోద్యోగి ♦ వలవనాబడిన, అలనాటి యవమాన♦మంతయు సంఘ

మునకగునవమాన ♦ మునకైనగాదు, అనుచునాలోచించి ♦ యందరితోడ
జోహాన్సుబర్గులో ♦ చొచ్చి ఆఫీసు, మోహానుడుంప నే♦పున నిర్ణయించె
లాసొసైటి ప్రతికూ♦లముగ లేకుండె, వాసిగాగ ల్లైట్రాన్స్♦వాలు సుప్రీము
కోర్టు కీల్ హక్కు ♦ కొరత లేకుండ, పార్టీలకనుకూల ♦ పడుచోటగదులు
ఆఫీసుకమరె రిట్చ్ ♦ అనునొక ముఖ్య,వ్యాపారి సాయమ్ము ♦ వడినొనర్పంగ
వారాసుయేజెంటొక్క ♦ డనుకూలపడగ, వాసికెక్కెనున్యాయ ♦ వాదిగాగాంధి.

## త్యాగనిరతి

సీ. అల్ట్రాన్సువాల్ ప్రాంత♦మందలి భారతీ,యుల హక్కులకుపోరు ♦ సలుపుగాథ
వివరించుటకుముందు ♦ ప్రవిమలమ్ముగగాంధి, వివరించె స్వీయజీ♦వితవిధమ్ము
అప్పటివరకెంత ♦ స్వార్థంబుత్యజియించు, నంతభవిష్య జీవి♦తార్థమర్థ
సేకరణాభిలా♦షిగ నుండెనాపైన, మారబొచ్చెనతని ♦ మానసంబు
తే. మున్ను బొంబాయిలోవృత్తి♦ మొదలుబెట్టి,నప్పుడమెరికాజాతీయు♦డైనయొక్క
భీమయేజెంటుప్రియమైన♦ మోమువాడు, మధురవాక్యాపుణింగల్గు♦మంత్రవేత్త.
సీ. కావించనోడఁబడ ♦ గాంధిని గొనఁ బది, వేలరుపాయల ♦ పాలిసీని
అంతకుముందు సౌ♦తాఫ్రికా భారత, దేశాలయేజెంట్లుఁ ♦ ద్రిప్పికొట్టె
భీమాఁగొనుట ప్రాణ♦భీతి, దైవమ్మునం ద,విశ్వాసమున్నట్లు ♦ వెలయునంచు
అయిననాతని దక్షి♦ణాఫ్రికా జీవిత, రీతిలోనాతని ♦ దృక్పథంబు
ఆ. మార్పుచెందినపుడు ♦ మదినిట్లుఁ దలపోసె, "నాకునాదుసతికి ♦ నాసుతులకు
నిత్యరక్షకుండు ♦ సత్యస్వరూపు డీ,శ్వరుడొకండు గాక ♦ యొరులుగలరె". 26
ఆ. అనుచుగాంధి తానొ♦నర్చెడు పనులనా,దినమునుండి దైవ♦దివ్యనామ
జపముతోడఁజేసె ♦ సర్వేశ్వరార్పణ,మ్మంచు భక్తితోడ ♦ ననుదినమ్ము. 27
క. పలికెడిది దైవనామము, పలికించెడి దెల్లదైవ ♦ భక్తిమహిమ తా
పలికినఁబాతకహరమగు, నిలనంచు స్మరించెగాంధి ♦ యీశ్వరుమహిమల్. 28
క. చేయునది దైవకార్యము, చేయించెడువాడు పరమ♦శివుడై యుండన్
చేయునది భగవదర్పణ,మై యుండగవలయునంచు ♦ నన్నియుఁ జేసెన్. 29
క. రక్షకుడెల్లరికి జగ,ద్రక్షకు డొకరుండెకాన ♦ రక్షణకన్యం
బీక్షణము కోరనేలా, ఈక్షమనని యెంచిగాంధి ♦ యెల్లనొనర్చెన్. 30
క. నీవే తల్లివి తండ్రివి, నీవేయన్నవును నాన్న♦నీవేగురువున్
నీవేవిద్యవువిత్తమ, వీవే, నీకన్ననన్య ♦ మెది లేదీశా. 31
క. నిజముగ రక్షకుఁడెల్లరి,కి జగత్తున నీశ్వరుండు ♦ కికురింపక నా
అజరామరుఁడగు రాముని, భజియింతుఁదదర్పితముగ ♦ బ్రజసేవింతున్. 32

ఆ. అనుచునమ్మిగాంధి ♦ మనసార నీశ్వరు, నీశ్వరుండె యుండె ♦ నెల్లప్రాణు
లందటంచహింస ♦ ననుసరించుచు సర్వ, జనులహితము కొరకుఁ ♦ బనులొనర్చె.

వ. ఈవిధముగా సత్యస్వరూపుఁడగు సర్వేశ్వరునియందు డెంద మమందానందమునఁ గందళింప గాంధి తన ఆలుబిడ్డల జగద్రక్షకుని సంరక్షణనుంచి తొలగించుటకును, వారిని బరభాగ్యోపజీవులుగా జేయుకొరకే తాను జీవితభీమాను గొంటిననియు దలంచి, పదివేల రూపాయల పాలిసీని వదులుకొనెను. ఇట్టి యాతని యంతరాలోచనాపరంపరకు దోహద మొనరించునవి గానే బాహిర పరిస్థితులును తటస్థించెను. ఆతఁడు మొదట దక్షిణాఫ్రికాయందు పర్యటించునపుడు క్రైస్తవ మిత్రప్రభావమున నాతని భావములు మతప్రభావితములై యుండెను. తదనంతరము థియాసిఫిస్టు (దివ్యజ్ఞానసంఘము) మిత్రుల ప్రభావమునకు లోనై గాంధి తత్సంఘీయులతో మైత్రినెరపుచు, వారిసభలందుఁ బాల్గొనుచుండెను. కాని, ఆసంఘసభ్యుఁడుగాఁ జేరకుండెను. ఆ దివ్యజ్ఞానసంఘీయుల ఆదర్శము సర్వమానవులందును సోదరభావమును బెంపొందింపఁ జేయుటయే, కాని యాసంఘీయు లాయాదర్శమునకు భిన్నముగా ప్రవర్తించునపుడు గాంధి వారిని మందలించుచు, తన్ను దాను ఆత్మపరీక్ష జేసికొను టభ్యసించెను.

ఆత్మశోధనాఫలితములు

క. పదునెనిమిదివందల తొంబది మూడవయేటఁ గ్రైస్త♦వస్నేహము దా
నొదవెను లోకజ్ఞానం, బధికమెరుగనట్టి గాంధి♦కాదినములలోఁ. 35

సీ. ఏసూపదేశమ్ము ♦ లెన్నియో గాంధికి, నూరిపోసిరి మిత్రు♦లూరకొనక
వినియెఁ దద్బోధల ♦ వినయపూర్వకగౌర, వమ్మున నాత్మ కా♦పట్యముడిగి
పఠియించెగాంధి య♦ప్పట్టి హైందవమత, గ్రంథముల్ శక్తికొ♦లంది నితర
మతములఁ దెలియగా ♦ జతనమొనర్చె నా,పైనఁ బదేడులు ♦ బహుళలోక

తే. వైఖరులెరింగె గాంధి, య♦వాక్య రీతి, నాతని థియాసఫిస్టు మి♦త్రాళి యతని
తమసొసైటిలోఁ జేర్చుట♦కమితముగ శ్ర,మించి రాతనినుండి గ్ర♦హింపహింసు
మతముఁగూర్చి హైందవుడత్వఁ♦డగుటఁ గూర్మి. 36

సీ. అల థియాసఫి వాఙ్మ♦యమున నిండుగ హైంద,వ మతప్రభావమ్ము♦వరుసనుంట
దలచి రామిత్రులు ♦ తప్పక మోహానుం, డుపకరించునెఱుంగ ♦ విపులముగను
హైందవ శాస్త్రార్థ♦ముని; కాని, తనకున్న, సంస్కృతజ్ఞానమ్ము ♦ స్వల్పమనియు
హిందూమతగ్రంథ♦బృందమ్ము మూలమ్ము,నందు దాజదువలే♦దనియు మరియు
అనువాదముల చదు♦వంతంతమాత్రమే, యనిగాంధి తనుగూర్చి ♦ వినిచెనైన

తే. అలపునర్జన్మకర్మ సి♦ద్ధాంతమందు, నమ్మకమ్మంట వారత♦డిమ్ముగ నెటొ
సాయపడునంచుఁ దలచిరి♦స్వాంతమందు, మొక్కయే లేనిచోటనా♦ముదపుచెట్టె
కాదొకో మహా వృక్షమ్మా ♦ స్థాలములన. 37

చ. చదివెను గొందఱంగలసి ♦ స్వామి వివేకుని రాజయోగముం
చదివె, ద్వివేది వ్రాసినది ♦ సాంతము, చేరి మరింతమందితో
చదివె మఱొక్క మిత్రునితో ♦ చక్క పతంజలి యోగసూత్రముల్
చదివె మరింతమంది తగు♦సాయమొనర్పఁగ గీతఁ గౌతుకం
బొదవఁగ నిత్యమధ్యయన♦ముం బొనరింపఁగ గాంధి వారితో
ముదమున గూర్చె క్లబ్బొకటి ♦ బూర్తిగ శోధనసేయ శాస్త్రముల్. 38

తే. గాంధి గీతచే నపుడె, యా♦కర్షితుఁడయి. పూర్ణవిశ్వాసమా సత్ప్ర♦బోధమందు
వెలయువాజొటచే నిపు♦డలయకుండ, తత్పఠన చేసె, లోతుగాఁ ♦ దరచి తరచి.

మ. అనువాదమ్ము లొకండు రెండిటి సహాయం♦బొప్పగా మూలముం
తనివారం బఠియించి; సంస్కృతమునం ♦ దదొబ్బధలర్థంబుగాం
మననంబుం బొనరింపఁగాఁ బ్రతిదినం♦బందొక్కటో రెండో శ్లో
కని పాఠమ్మొనరించె, మోహనుఁ డుషః♦కాలంబునం బ్రశ్రద్ధమై. 40

సీ. దంతధావన మనం♦తరము స్నానమొనర్చు, సమయమ్ములందునఁ♦జదివె గాంధి
కాగితాలందు శ్లో♦కముల వ్రాసినవాని, నంటించి యెదుటి కు♦డ్యంబుపైన
కావించె, వల్లించి ♦ కంఠస్థమాతఁడ, ధ్యాయమ్ముల్ పదుమూడు ♦ తమిని గీత
పాఠించె నీరీతి ♦ సత్యాగ్రహముఁ గూర్చి, చింతనఁదన కాల♦మంతయుఁ గొను

తే. దనుకఁ దత్ఫలితముగ మో♦హనుని జీవి, తమున నిత్యము స్వీయప♦ర్తనముదిద్దు
కొనుటకై సూటిగాఁ జూచు♦ ఘననిఘంటు, వయ్యెనతని మిత్రులకదె♦ట్లయిననేమి!

క. అర్థముగాని పదమ్ముల, కర్థము దెలియఁగ నిఘంటు ♦ నందు వెదకగా
అర్థమగు నటుల ననుదిన, వర్తనగతిఁ దెలియఁ గీతఁ ♦ బఠియింపవలెన్. 42

క. అనుదిన జీవనమందున, ననయము బ్రాప్తించు చిక్కు ♦ లనుమానమ్ముల్
సునిశితబోధన విడగా, నొనరించెడు గీత శుద్ధి ♦ యున్నె జగములన్? 43

క. అపరిగ్రహ సమభావము, లెపుడే గతి నెట్టులనుస♦రింప నుచితమో
విపులముగా నర్థమ్ముఁ దెలుపు శ్రద్ధగ గీత మనుజ ♦ లోకమెఱుంగన్. 44

క. సమతాభావం బేమే, సమయంబుల నెవ్వరెవరి ♦ చక్కని నెటులన్
గమనించి, యనుసరించిన, ప్రమాదము గల్గకుండు ♦ బనిపాటులలోన్. 45

తే. ఎటులఁ బాటింపనగు నప♦రిగ్రహంబు, నిత్యనైమిత్తికమ్ముల ♦ సత్యరీతి
అనుసరింపఁగ నగు నెట్లు ♦ దినము కపట, వేషధారులతోడఁ గో♦విదులతోడ.

సీ. అపరిగ్రహంబెట్లు ♦ లనుసరింపగ నగు, కల్గియున్న విపీడఁ ♦ గల్గు టెట్లు?
ఆలుబిడ్డలు, కడ♦ కాత్మీయ గేహమ్ము, పుస్తకమ్ములు గావె ♦ ఆస్తు లెన్న
సకలమ్ము విడనాడి ♦ సర్వేశ్వరు ననుసరించుటొక్కొ! యప♦రిగ్రహంబు
సకలమౌ స్వత్వముల్ ♦ సన్యసించిన నైన, బరమాత్మ ననుసరిం♦పంగ నౌనె

తే. అనివితర్కించి, మోహను డంతరాత్మ, దానుజదివిన యింగ్లీషు టీక నెఱుంగ
బోధపడియెను గీతాగ్రబోధమహిమ, ధర్మకర్తృపదమున కర్థమ్ము స్ఫూర్తి. 47

సీ. ఆస్తిపాస్తులు స్వంతమని తలంపకవాని, కెల్లఁదా ధర్మకర్తృత్వమొందె
కలిగియుంటి నటంచుఁ దలఁచి మోహనుఁడున్న, దఖిలమ్ము సర్వోదయార్థ మొసగు
టపవర్గసాధన కగు రాజమార్గమ్ము,గా నిర్ణయించెను గాంధిఁ జదివి
తదనుగుణమ్ముగాఁ దనయెడ దనమనో, వైఖరినిం బరివర్తనంబు

తే. కల్గవలయునటంచును గాంధినిర్ణ,యమ్ము గైకొని వీడె భీమా ధనమ్ము
నాన్న పిమ్మట నాన్నగా దన్ను సాకి, సంతరించిన యన్నకు స్వత్వమెల్ల
నున్న దానాటి వరకంత నొసగియుంక, గల్గు రాబడి సంఘోపకారమునకె
యీయఁబడునంచుఁ దనయన్న కెఱుఁగఁ దెల్పె. 48

మ. "తగునే, తమ్ముడ, యిట్లు వ్రాయ, మనతాతల్ సంప్రీ నిర్మించిన
ట్టి గుణాధిక్యుఁడవే, కుటుంబమిటుల ప్పేటన్విడం జెల్లునే"
"నిగుణంబిందు నొకింత లేదు, తలఁపన్ విశ్వంబె నా దౌకుటుం
బగతింగాంచెద, నన్నరో నను క్షమింపం జెల్లదే తమ్మునిన్". 49

ఉ. అన్నయుఁ దమ్ముఁడీగతిని నాత్మకుటుంబముగూర్చి యొండొరుల్
భిన్నములైన వాదముల స్వేచ్ఛనొనర్చిరి, కాని మోహనుం
డెన్నికఁ దాను ధర్మమని యెప్పుడనమ్మెదాని వీడకుం
డెన్నిజమన్నయుంగనియె నెమ్మదిగా జయమందె ధర్మమున్. 50

ఆ. తాము నమ్మినట్టి ధర్మంబు వీడరు, ధీరులైనవారు తేరికైన
భీతిఁగొనియుఁగాని ప్రీతిచేయుటకేని, నీతిమతమునందు నిల్పుకతన. 51

క. తనమరణమందు కాలం,బున నన్నగ్రహించె ననుజు బుధ ధర్మపు స
ద్గుణముల్, జాబులిఖించెను, "అనుజా మన్నింపవే మదజ్ఞతనంచున్". 52

క. నాకొడుకులఁ బెంపుము నీ,వేకరణిం గోరుదట్లు వేగమెవత్తున్
నీకడకని వ్రాసెనయిన, లోకాంతరమేగె నతఁడు లోబడి విధికిన్ 53

క. ఆతనికొడుకులు స్వీయస,నాతన రీతులనె పెరిగి రధునాతన స
న్నీతులు ప్రీతింజేయమి, భీతిలి మోహనుని జేరఁ బెంపకమునకున్. 54

## శాఖాహారమునకు త్యాగము

సీ. త్యాగ నిరాడంబ రాదర్శసాధన, మతనిష్ఠ, నిత్యజీవితమునందు
అధిక మాకొలది శాకాహారసుగుణ ప్ర,చారానురక్తి యాసక్తి పెరిగె
చెప్పెదురీతిగాఁ జేసె విజ్ఞాన శో,ధకులతో జర్చించె దానిఁ గూర్చి
మోహనుఁడట్టులా జోహాన్సుబర్గున, వెలయు శాకాహార నిలయమునకు

తే. సాయమొనరించె నాంగ్లేయ♦సఖులఁ గొంచుఁ, బోయి యచ్చటికది వేగ♦మూయఁ
బడియె, ఆర్థికానర్థముల చేత♦నకట! 'ఖూనె' జలచికిత్సానుయాయియై♦జర్మనొకఁడు
నడుపుచున్నను దగినంత ♦ గడవలేమి 55

ఆ. అలధియాసఫిస్టు ♦ లధిక శాకాహారు,లగుట సాహసమున ♦ నాసొసైటి
సభ్యురాలొకండు ♦ సకళ శాకాహార, శాలనడుపసాగె ♦ బాలిమెయిని. 56

సీ. సరిగ లెక్కలఁజూడఁ ♦ జాలరు మిక్కిలి, వ్యయమొనరించు స్వ♦భావమెంతొ
ఆడంబరమ్ములం ♦ దధిక రాగము మిత్ర,బృందమ్ము బహుళమ్ము ♦ లందువలన
ఆరంభమునఁ జిన్న♦దైయున్నఁ గ్రమముగా, పెద్దగా సాగింప ♦ బుద్ధిఁదలచి
అర్థించె మోహను ♦ నార్థికమ్ముగ సహా,యార్థ మాతండది ♦ యాచరించె

తే. వెనుకముందు యోచింపక ♦ వేయిపౌండ్లు, ఋణమొసఁగెనొక్క యాసామి ♦
ప్రీతిపిన్ను, నష్టితనకడనుంచిన♦సొమ్మునుండి, భారతీయుఁడాతడునూలీ♦భద్రపేరు.

క. "ఏనొండెరుంగ నీవిష,యానేకమునందు; మిమ్మె♦యున్నింటికి నా
మానసమున నమ్మితి మి,మ్మేనాడో, యొసగుపెట్టు♦మేనిక మీకున్". 58

క. అనిపల్కె భద్రి ముసుపా,ల్గొనె సత్యాగ్రహమునం... ♦ గూర్మిఁ జెయిలునం
దున వాసముండె నాతడు. కనుగొనటుల విశ్వసించె ♦ గాంధి నుడిలోన్. 59

మృజ్జలచికిత్సా ప్రయోగములు

సీ. పరనిరాడంబర ♦ సకళజీవనమెచ్చు, కొలది నౌషధములు ♦ కొనుటతగ్గె
జోహాన్నుబర్గున ♦ మోహానుని కయిన, మలబద్ధకమునొప్పి ♦ తలకుగల్గె
ఆహారనియమంబు ♦ లాచరించుచు ఖేది,సంది సేవించుచు ♦ గాంధి తరుచు
పడకవేయకయొట్లో ♦ పనిఁజూచుకొనుచుండె, నైనఁబూర్ణారోగ్య♦మభిలషించి

ఆ. ఆలవిరేచనౌష♦ధాలినుండి విముక్తి, పడయఁగోరి తెల్ల♦వారిపూట
తినుటమానివేసె ♦ దీరెనుదలనొప్పి, కాని ఖేదబాధ ♦ కదలదయ్యె. 66

సీ. 'ఖూనె' చెప్పినకటి ♦ స్నానమ్ములొనరించె, కాని పూర్ణగుణంబు♦కలుగదయ్యె
ఇంతలోనెవ్వరో ♦ యిచ్చిన 'జస్టు'ర,చనను 'రిటర్న్టు నే♦చరు'ను బ్రకృతి
వైద్యశాస్త్రము జదు♦వఁగఁ దటస్థించెనం, దెరిగె ఫలాహార ♦ మృచ్చికిత్స
సద్గుణమ్ములగూర్చి ♦ సత్వరమ్ముగ గొనె, మృత్తిచికిత్సను ♦ మాయమయ్యె

తే. అల్లమలబద్ధకమ్మెల్ల ♦ నంతనుండి, మృజ్జిల చికిత్సలంగాంధి ♦ కినుమడించె
నమ్మకము మిత్రులకు దద్గు♦ణములు దెలిపె, వారనుసరింప మృజ్జల♦వైద్యవిధులు.

ఉ. స్వానుభవమ్ముతో నెరిగి ♦ చక్కగ మృజ్జల వైద్యరీతులన్
మానుగ గాంధిలోకులకు ♦ మంచివటంచును బల్కెనిట్టులన్
మానుపరోగముల్ జనులు ♦ మందులు ద్రావుట తింటమూలికల్
మానుట లెస్స; పుస్సుమని ♦ మాటికి వైద్యులఁ జేరరాదిలన్. 68

క. ప్రతిచిన్నబాధ కేదో, మితిమించిన మందుమాకు ♦ మ్రింగుటచే జీ
వితము నశించాయుః పరి,మితి తగ్గును దాసుడగును ♦ మేసికెవండున్. 69

ఉ. మానుసహస్ర మందునియ♦మంబున భోజనమాచరింప నే
కోన సహస్రరోగములు ♦ 'ఖూనె' వచించిన మృజ్జలాదిక
స్నానచికిత్సల న్నరుడు ♦ సంకటపంకమునందు దాఁటబడున్
తానొనరించ వజ్జల క♦దంబునఁ గర్మఫలంబు తప్పునే ? 70

ఆ. రోగశయ్యనుండి ♦ యీగతి వ్రాసితే, నంచుదలపకూడ ♦ దస్మదీయ
బాధకెల్లకే న♦బాధ్యుండ దైవమ్ము,నకు నమస్కరింతు ♦ సత్యసుగుణ
పాఠములుగ నెంతు ♦ వ్యాధులనివియెల్ల, సంతసమున ననుభ♦వింతునంచు
'జస్టు' వ్రాసినట్టి ♦ జలమృచ్చికాదిక, విషయరాశినెల్ల ♦ వేదవచన
ములుగ దీసికొనక ♦ తెలిసివివేచన, ననుసరింపవలయు ♦ ననుభవజ్ఞు
లైనవారు చెప్పు♦నది వించునోర్మితో, చదివె తానె గ్రంథ♦సారమెల్ల
వడిఁ గ్రహించి జరుప♦వలె చికిత్సలనంచు, గాంధివ్రాసెనాత్మ♦గాథయందు. 71

హెచ్చరిక

సీ. అనుసరింపవలయు ♦ నాహారనియమాళి, గూర్చి వ్రాసెను గాంధి♦కొన్నియేండ్ల
మును 'పిండియనొపీని, యను' యను నొండుప,త్రికయందువియునువ♦దింపఁబడియు
నాంగ్లమందొకపుస్త♦కాకృతిఁ బ్రచురింపఁ, 'బడె' గైడ్ టు హెల్తన♦బరగెనదియు
గాంధివ్రాసిన చిన్న♦గ్రంథాళినిది యొక్క,వగఁ బఠింపఁబడెఁ బ్రా♦క్పశ్చిమముల.

గీ. తత్పరిభావితములు జీవి♦తములుగాగ, ఉత్తరములు గాంధికివ్రాసి♦"రో మహాత్మ!
నీదుమజ్జనభోజన ♦ నీతినియమ,ములను వివరముగా మాకు♦ దెలుపు"మందు.

తే. కానఁ దన జీవితచరిత్ర ♦ గాంధివ్రాసె, "గైడ్ టు హెల్త్" పాఠకులెకుంగఁ
గ్రమముగాను, తాను దెలిపిన నియమముల్ ♦ దానెయొందు, ననుసరింపక
పోయెనో ♦ అఖిలవిషయ, మన్నత మాడఁగనోడు మ♦హాత్ముడెపుడు.

ఆ. గాంధివ్రాసెనెల్ల ♦ గ్రంథమ్ము లాధ్యాత్మి,కోన్నతిఁ దనపాఠ♦కులు గ్రహింప
వ్రాయునెపుడు తాను♦జేయుకార్యంబుల, విషయములనె గాంధి♦వివరముగను.

క. బాలుడుగాఁ గన్నజనని, పాలొండే త్రావజనును ♦ బాలితరములన్
గ్రోలఁగఁ గూడదుమనుజుడు, వాలాయముగా నటంచు ♦ వ్రాసెనతండున్. 76

క. మనుజుం డాహారముగాఁ, దినవలెఫలములను బప్పు♦పినుసు లితరముల్
కొనరాదు కుడిపితొట్టిగ, కనరాదీ కడుపునెవరు ♦ ఘనులగువారల్. 77

ఆ. ద్రాక్షదాడిమాది ♦ రసవత్ఫలాళి బా,దామివంటి పప్పు♦ధాన్యములను
తినినఁజాలుఁ గలుగ♦దిటవు దేహమునకు, నరములకు బలమ్ము ♦ నయముగాను.

సీ. సాత్త్వికాహారమ్ము ♦ సాపడువారికి, గతిని బప్పులు బండ్ల♦గలుగ గలదు
కామమోహాదిక ♦ కలుషభావమ్ముల, నరికట్టగల్గెడు ♦ నాత్మబలము
భుజియించు నాహార♦ముం బోలె మనుజుని, గుణవర్తనములుండు ♦ ననెడు బుధుల
నుడియందు సత్యాంశ♦తో యుండెనని గాంధి, తనపాత్రమున విశ♦దముగ దెల్పె
తే. నైననదాఁ జెప్పినవి తానె♦యాచరింపఁ, దప్పెదనయుండియా జీవి♦తమునఁదొల్లి
ఖేడ సత్యాగ్రహమునం దొ♦కే ప్రమాద, మతని కయ్యాగతు నొనర్ప♦నకటవిధిగ.
క. ఆరోగ్యముచెడి మృత్యు, ద్వారముకడఁ జేరినపుడు ♦ తప్పనిసరిగా
క్షీరముగొనె గాంధి శరీ,రారోగ్యార్థమ్ము వంచి♦తాత్ముండగుచున్. 80
ఆ. పాలబదులు పెసర ♦ పప్పులగంజి, బా,దామిపాలు కుసుమ♦తైలమాద్య
నేకమాను వైద్యు♦లేది చెప్పినసద్ది, ఎదియునతని కుపక♦రింప దాయె. 81
ఆ. అదియునిదియుఁదినుట♦నారోగ్యముమరింత, చెడఁగఁ,గొనియె గాంధి♦కడకు మేక
పాలు; ఆవు బఱ్ఱె♦పాలకు బదులుగా, నిపుణమతి నొకింత ♦ నియతిసడలి. 82
వ. పాలం గ్రోలరాదని, యొట్టుం బెట్టుకొన్నప్పుడు, కేవలము గో మహిష క్షీరమ్ములు మాత్రమే మోహనుని మానసవీథియందు భావింపఁబడి యుండినందున, రౌలట్టుచట్టము నెదిరించుకొరకు జీవింపవలయునను జిగీషఁ జేసి, మేషమ్ముల పాలఁ గ్రోలుట; ఆత్మవంచనమే యగునని తెలిసియుండియు, విధిలేక మేక పాలను శరీరధారణార్థము మోహనుఁడు గ్రావవలసివచ్చెను. 83
సీ. తినుట ద్రాగుటయెల్ల ♦ దేహార్థమగుటాత్మ, చెడదనుటం దింత ♦ చేవయున్న
దైవభీతిని జీవి♦తమును సాగించుచు, దైవమీక్షించు సా♦ధకుని కెపుడు
ఆహారనియమ మ♦త్యవసరమ్మగు, భావ,వాఙ్నియమమ్ముల♦వలె సతమ్ము
తమ జీవితానుభ♦వమున సత్ఫలదమౌ, రీతిఁబాటించుటే ♦ ప్రీతికరమ
తే. టంచుఁబాటకులను హెచ్చ♦రించెగాంధి, గ్రుడ్డిగాదనవచనమ్ము♦గొనుట గూడ
దనియెఁ బాలనుమించు నా♦హారమెదియు, నరుగుదలశక్తి లేమి లే♦దనియెగాంధి.
తే. జగతినాహార నియమాను♦సరణి స్వానుభవము నందున క్షీరమ్ము♦భంగిసులభ
జీర్ణశక్తి పోషకగుణ ♦ శ్రేణిగలుగు, శాకముల దెల్పగోరెను ♦ జనులగాంధి.

## అధికారము నెదిరించుట

సీ. అల్లజోహాన్సు బ♦ర్గందిండియను జను,లధిక సంఖ్యాకులు; నక్లైయేసి
యాటికాఫీసర్ల ♦'కావాసభూమి; యా,యధికార్ణజాలము భీ♦తావహమ్ము
అనుదినమ్మందు ఫి♦ర్యాదులు మోహను,కడఁ జేయఁబడె నిట్లు ♦ "గాంధికనుమ
హక్కున్నవారల ♦ ననుమతింపక హక్కు,లేనివారిని జాటు♦గాను వంద
తే. పౌండ్లలంచముగా గొని ♦ 'పర్మిటు'లను, ఇచ్చుచుండిరీ దుస్థితి♦నీవెమాన్ప
వలతి" వనివేడఁ దన ట్రాన్సు♦వాలువాస, మర్థరహితమౌదుస్థితి♦నణపకున్న
ననుచుగాంధి కంకణబద్ధుఁ ♦ డయ్యెనందు. 87

సీ. అందుకువలయు సా♦క్ష్యాధారసేకర, ణానంతరము పోలి ♦ సాధికారి
వర్ధించె సాయమొ♦నర్చు మంచాతండ, రెస్టు వారంట్లు జా♦రీయొనర్చె
పట్టువడిరి నిల♦బెట్టబడిరి జూరి, లెదుటవారలనై రో♦పీయులగుట
విడిచిపుచ్చిరి దోష ♦ విగహితులని యప, రాధుల నిర్వ్యాక♦బాధఁజెందె
తే. గాంధి వ్యర్థమయ్యెనె తన♦కష్టమనుచు, నైనఁదదపరాధముస్పష్ట♦మగుటఁబడవి
నుండి తొలగించె నిరుపురా♦దుండగీడు, లను ప్రభుత్వము ప్రజలెల్ల♦తనియునట్లు.
సీ. ఈసంఘుటనచేత ♦ హెచ్చెగాంధి ప్రతిష్ఠ, అతనివకీల్ వృత్తి♦యధికమయ్యె
ధనముదోపిడియాట ♦ తగ్గెను నెలనెల, నీతినిజాయితీల్ ♦ నెగ్గగల్గె
పదవిగోల్పోయిన ♦ వారలయెడగాంధి, వ్యక్తిగతాగ్రహ ♦ మందకుంట
వారానగరపరి ♦ పాలన సంస్థ న్యాయ్జింప నుద్యోగముల్ ♦ జేసె సాయ
తే. మందుచే గాంధిపట్ల శి♦క్షింపవారు, నఖ్యతంబూనికి యనా♦సక్తదృక్ప
థము, ప్రవర్తన సత్యాగ్ర♦హముక ముఖ్య, భాగము నహింసకుఁ బ్రధాన♦
భవ్యగుణ మ, టంచుఁ గ్రమముగా నెరిగె మో♦హనుఁడు ఘనుడు. 89
క. మనుజుడును వాడొనర్చెడు, పనియును వేర్వేరుభిన్న ♦ వస్తువులగుటన్
పనిదూష్యమైననాపని, మనిషినిద్వేషింపకుంట ♦ మంచిగుణంబౌ. 90
క. పాతకమురోయఁ దగవగు, పాతకునిన్రోయకుంట ♦ భావ్యంబను స
న్నీతిగ్రహించుట సులభమె, ఖ్యాతిదదాచరణమెంతో ♦ కష్టంబరుదున్. 91
చ. మనుజుఁడొనర్చునట్టి పని♦మంచిది యానెడ మెచ్చవచ్చునా
పనిచెడుదైన నొచ్చుకొన♦వచ్చును; పాపిగ నెంచఁగూడదా
మనుజు నహింస కార్యమిది ♦ మానవులెల్ల చరించుచో నిటుల్
మనుజులద్వేష మన్వెషము ♦ మందునకుం గనబోము భూమిపైన్. 92
ఆ. మంచివారలెల్ల ♦ మర్యాదకర్హులు, ఖలజనంబులెల్ల ♦ కనికరింప
బడుటకర్హులంతె ♦ చెడదిట్టగూడదు, ఎట్టిపాపినైన ♦ హింసయగుట. 93
క. నిత్యానుభవచరిత్ర మ, గత్యమ్మగు ప్రాపహింస ♦ తన్మాతలిలేదీ
సత్యాన్వేషణమునకెది, గత్యంతరమనుచుఁ దెలియ♦గాంధి గ్రహించెన్. 94
క. ఎదిరింపందగు పద్ధతి, నెదిరింపఁదదీయకర్త ♦ నెపుడుందగద
ల్లెదిరించుటయగుఁద, న్నెదిరించుట; స్రష్టసుతుల ♦ మెల్లరమగుటన్. 95
ఆ. జీవులెల్లరొక్క ♦ సృష్టికారునిసంతు, దైవముండునెల్ల ♦ జీవులందు
జీవినెవ్వనేని ♦ సేవగించినవాని, దైవమేవగించు ♦ దప్పకుండ
జగతినెల్లనిండి ♦ సర్వలోకవ్యాపి, యగుచుఁగర్త భర్త♦హర్తయైన
దైవసృష్టినెవని ♦ కేవిధినపకృతి, సేయలోకమునకె ♦ సేయుటగును. 96

వ. మోహను జీవితమందలి వివిధసంఘటనలవలన ననేక మతములకును, వివిధ
జాతులకును జెందిన వారితో నతనికి సన్నిహితసంబంధ మేర్పడెను. అయినను
వారినందరిం గూడ తన కుటుంబీకులంబలె, జాతిమతభేదము లేమాత్రము
బాటింపకుండ పరిగణించుచుండెను. ఇయ్యది ఆయన సహజస్వభావగుణము.
ఈ యసాధారణ సద్గుణమునకుగాను, బ్రహ్మచర్యాహింసాపరిగ్రహములబలె
ప్రత్యేకముగా నాయన పరిశ్రమించిన దేదియు లేదు. 97

— పవిత్రస్మృతి; పశ్చాత్తాపము — 1907 —

తే. ఆతఁడు దర్బనునగరమున ♦ దడ్వొకేటు వృత్తిసాగించునెడ హైంద♦వేతరులగు
క్రైస్తవగుమస్తలతనితోఁ♦గలసి తరుచు, నతనియింట వసించిరే ♦ కౌతుకులేక.

సీ. వారిలో క్రైస్తవ ♦ పంచముండొక్కరుం, డతనిపడకగది ♦ యందునున్న
మురుగుజలముకుండ ♦ మోమోటమందక, పరిశుభ్ర మొనరింప ♦ వలసియుండె
కస్తూరిభాయికా ♦ గదికుండ శుభ్రమొ,నర్ప నయిష్టమై♦నందువలన
తానైనఁ దనభర్త♦యైన నాకార్యము, నిష్టంబుతోఁ జేయ♦నీయకొనమి

తే. ఆగ్రహమ్మున 'నాయింటి♦యం దెనాకె, బదులువల్కుదే'యని చేయి♦పట్టియీడ్చి
గేటువలద్రోయఁదలచె మో♦మోటపడక, గాంధికస్తురిభాయిని ♦ గరుణవీడి. 99

సీ. కట్టలుదెగియామె ♦ కన్నీటిధారలు, చెక్కిళ్ళఁగారగా ♦ వెక్కియేడ్చి
ఉజ్జగించితె యింత ♦ లజ్జలేదేనీకు, ఎవరున్నవారునా ♦ కిచటఁబోవ
నీభార్యనైనంత ♦ నీతన్నుత్రోపుళ్ళ, కూరకపడియుండఁ ♦ గోరెదొక్కొ
ఎవరైనజూచిన ♦ నేమందురోయని,కూడ తలంపక ♦ రౌడివౌదె?

తే. చాలునిక గేటుమూయుము♦ఆలుమగల, మిటులఁబోరాడుకొనుచున్న♦నెవరుగన్న
ఉన్నమర్యాదబోవు నం♦చులుక నలుక, పలుకగా గేటు మూసి లో♦పలికేఁజనిరి.

క. పురుషుఁడగుటచే నాతఁడు, గరువతనము మోముపైన ♦ గనపడనున్నన్
మరియాదబోవుననిలో, మరిమరిసిగ్గందె గాంధి ♦ మానసమందున్. 101

క. పతిసతిని వీడలేదెటు, పతిసతిని న్వీడలేదు ♦ పతిసతులెపుడో
మతిచెడినపుడపుడప్పుడు, కుతకుతమనుచుండ్రు చిలిపి ♦ కొట్లాటలకున్. 102

క. మిరియముబోలె రుచించును, చిరుజగడము లాల్మగలకు ♦ చెంపలతళుకుల్
మెరయగఁ గన్నీరురలగ, పురుషునిపై విజయమందుఁ ♦ బొలతియె సతమున్.

క. తననిరుపమానమైన స,హనశీలముచేత విజయ♦మందును సతియే
అనయము నయ భయములమరి, వినయమభినయించి యెటులో♦విడువకపతిపై.

ఆ. కోపగించి మించి ♦ కొట్టినఁ దిట్టిన, చేరిభర్తపక్క ♦ నేదదీర్చు
బడలినంత నొడలి♦పరిచర్య సలుపును, భార్యకన్న నాప్త ♦ బంధులెవరు? 105

క. ప్రతిఫలమాసింపకయే, పతిదైహిక మానసిక వి♦పర్యయములనం
దతులిత సేవలొనర్చెడు, సతిమించిన నాత్మబంధు ♦ జనులెవ్వారల్? 106

తే. కసరికొట్టినఁ దినిపించు ♦ కొసరి కొసరి, ముసిముసిగ నవ్వుచునె యన్న♦మును
మరింత, తల్లివలెప్రేమతో నుల్ల♦ముల్లసిల్ల, నాత్మసతికన్న నాత్మీయు♦లవని నెవరు?

శా. దాసింబోలె నొనర్చు సేవ, తల్లివలె నో♦దార్చు న్నాపద్వేళలన్
గాసిందీర్చుచు డాసి రంభవలె సౌ♦ఖ్యాంబోధి ముంచున్ సదా
వాసింగూర్పగ మంత్రిబోలె సలహాల్ ♦ పాటింపగా నేర్పుచున్
పూసల్ గ్రుచ్చినరీతి, పత్నివలె నిం♦పుం గూర్తురెవ్వారిలన్. 108

క. పదునెన్మిదివందల తొం,బది యెనిమిదవాబ్దమందు ♦ భార్యనిటులవే
వ్యథలంబెట్టెను మోహాను, డదయుండన దప్పునంత ♦ గాత్మం దెలిసెన్. 109

సీ. శారీరకక్షుధా ♦ సక్తిక్రమమ్ముగా, వీడగా వారి జీ♦వితము మిగుల
శాంతసంతోష ప్ర♦సాదభూయిష్టమై, పరస్పరసంతృప్తిమై ♦ ప్రగతి పథము
చదువులేకున్నను ♦ సాధ్వి కస్తురిబాయి, అనుసరించుచు భర్త♦యడుగులందు
నాతని బ్రహ్మచ♦ర్యాశ్రమ జీవిత,మున కడ్డురాకుండ ♦ ముదముతోడ

తే. భర్త యాదర్శజీవిత ♦ పథమునందు, తోడునీడగ గావించె ♦ దోహదమ్ము
అతని సత్యసందర్శన ♦ వ్రతవిశిష్ట, తపముఫలియింపగఁ దపించెఁ♦దక్క సుఖము.

తే. వారలాదర్శదంపతుల్ ♦ గారు వారి, భావములనెసంగ దైక్యభా♦వం బొకింత
అతనిపనులెల్ల యామెస♦మ్మతిని గనవు, కానియాదర్శవంతమా ♦ గాంధిజీవి
తమ్ము సకలజగజ్జన ♦ సంతతికిని. 111

## ఐరోపీయులతోడి చెలిమి

వ. గాంధిజీ తనజీవితచరిత్ర ప్రతివారము తన యంగిండియా పత్రికయందు వ్రాసెను. వ్రాయుట కారంభించినపు డాయన ముందెట్టి ప్రణాళికయు నిడుకొనలేదు. తన సత్యాన్వేషణానుభవ ప్రయోగములఁగూర్చి వ్రాయుటకు వలయు దిన చర్యవంటి మూలాధారము లేవియు నాయనకడ లేవు. వ్రాయుచున్నపుడు తన అంతరాత్మ ప్రేరణానుసారము రచన సాగించెను. ఆయనజీవితమం దాయన కావించిన చిన్న పెద్ద కార్యములనెల్ల పరీక్షించుచో నవియన్నియు నంతరాత్మ చేలేక, పరమాత్మచే చోదితములైన మానవాతీత కార్యములుగా గానుపించును. "నేనాపరమాత్మను బరికించుటగాని, యెరుగుటఁగాని సంభవింపలేదు. ఆ విశ్వాత్మునియందు విశ్వజనీనముగాగల విశ్వాసమే నావిశ్వాసముగా జేసికొంటిని. నా యీ విశ్వాస మనశ్వరమగుటచే నయ్యది నాస్వానుభవముగా బరిగణింతును. అయినను విశ్వాసము ననుభవమనుట సత్యదూరము. కనుక నాదైవమందలి విశ్వాస మిదమిత్థమని తెలుపుటకు వలయు పదజాలము నాకడ

లేదు." అని మహాత్ముడే తనయాత్మకథయం దుగ్గడించెను. తన ఆంగ్లమిత్రులఁ గూర్చి దేనివ్రాయవలెనో, యేదివ్రాయఁగూడదో, గాంధి కొక సమస్యగాఁ బరిణమించెను. సమంజసములైన విషయముల వ్రాయకున్న సత్యదేవత నేమ రించుటగును. ఈ ఆత్మకథారచనమందలి సామంజస్యమే సందేహాస్పదమై యుండ, నందు వ్రాయవలసిన వివిధవిషయ సామంజస్యము నిర్ణయించుట దుష్కరమే యగును.

"ఆత్మకథ యెట్టిదైనను, వానికి, చరిత్రకుండవలసిన లక్షణము లన్నియు లేవని, గాంధిజీ కేనాడో తెలియును. తానువ్రాయుచున్న యీ యాత్మకథ యందు తనకు జ్ఞాపకమున్న అన్నివిషయములఁ దాను వ్రాయుటలేదని ఆయన కెరుకయే! సత్యరచనార్థ మెంత వ్రాయవలయునో, యేది వ్రాయకూడదో, యిదమిత్థముగా నెవడు చెప్పగలడు? తనజీవితమందలి కొన్ని సంఘటనలగూర్చి, లోపభూయిష్టముగాఁ బరోక్షమున దానిచ్చిన సాక్ష్యమునకు న్యాయస్థానమం దెంత విలువగల్గును! ఎవరైన నధికప్రసంగి, యదివరకే తానువ్రాసిన అధ్యాయములందలి విషయములగూర్చి ఎదురుప్రశ్నలువేసి పరీక్షించినచో, నావిషయములగూర్చి మరింత యెరుగనగును. ఆ ఎదురుప్రశ్నల నడుగువాడు విరోధ విమర్శకుడగుచో, గాంధి వ్రాసుకొన్న అనేకవిషయములం దంతగా యాథార్థ్యమే లేదనియు, నవియన్నియు నుత్తిత్తిమాటలేయని, దాను బయటబెట్టినట్లు బడాయిలు వలుకును. అందువలన గాంధి యిట్లధ్యాయములుగా వ్రాయుచుండుటయే యుక్తమని ఒకప్పుడు తలపోసినను, అంతర్వాణి నిషేధించినంతవరకు దానువ్రాయుచునే యుండవలయుననియు, నైతికముగా దోషమైన దప్ప ఆరంభింపంబడిన కార్యము తుదముట్ట సాగించుటయే ధర్మమను పెద్దలనుడి ననుసరించుటయే యుక్తమనియు గాంధి నిశ్చయము. 112

ఆ. అలవిమర్శక జన ♦ మలరింపగాదు మో,హనుడు వ్రాసెను దన ♦ యాత్మగాథ
వ్రాయుటం దెకలదు ♦ వరుససత్యాన్వేష,ణ ప్రయోగ మొండు ♦ న్యాయరీతి.

క. తనతోడి ప్రజాసేవక, జనముల మెదడునకుమేత ♦ సమకూర్చెదు; మో
చనజయరాందాసా నం,దనువారలు గోరవ్రాసె ♦ దనయాత్మకథన్. 114

సీ. ఇండియనులబోలె ♦ నింగ్లీషుసఖులు డ,ర్బనున మోహానుకుటుం ♦ బమునసుండి
రనుభవమ్మున గష్ట ♦ మైనను దమయందు, గలపరమాత్మయే ♦ వెలయునొరుల
ననివిశ్వసించె వా ♦ రందరితో ననా,సక్తులై సేవానుర ♦ క్తినుండ
గలుగుసామర్థ్యమ్ము ♦ నలవర్చుకొన సాధ,నం జేయవలెనను ♦ నమ్మకమున

తే. గాంధిబోయరు సంగ్రామ ♦ కాలమందు, నిండుగానున్న దనయింట ♦ నే వసింప
ఆంగిలేయ ద్వయమున కా ♦ హ్వానమిచ్చె, దనసతి కయిష్టమైయేడ్చి ♦ నను వినీతి.

ఆ. కట్టుకొన్న భార్య ♦ కన్నీరునించిన, కలతపడకగాంధి ♦ క్రమవినీతి
ఇండియనులఁబోలె ♦ నింగ్లీషుమిత్రుల, చేర్చుకొనియె సుపమ ♦ చిత్తుడగుట.

క. ఈరీతి దర్బనందున, ప్రారంభమ్మైన యాంగ్ల♦పరిజన సంబం
ధారూఢి జోహాన్స్‌బర్గున, నారయ మోహానుని యింట ♦ నధికంబయ్యెన్. 117

సీ. అల్లజోహాన్సు బ♦ర్గందుగాంధి కతని, సుతులమించిన వార♦లతుల తేజు
లిండియనుగుమస్త ♦ లుండిరినల్వురు, వారెరుంగరు 'టైపు♦వ్రాత'కింత
ఎంతనేర్చినవారి ♦ కింగ్లీషురామిచే, పనినిల్వలధికమై ♦ పరగె రోజు
ప్రజపనితోవృత్తి ♦ పనులును రెండధి,కముగాఁగ క్రమముగా ♦ గాంధికడను

ఆ. ఆంగిలేయునైన ♦ నైరోపియునినైన, క్లర్కుగాను గొనుట ♦ గాంధికోరె
వర్ణభేదమింత ♦ పాటింపనట్టి యే,తెల్లజాతివారి ♦ నొల్లననక. 118

సీ. తానెరింగిన యొక్క ♦ టైప్‌రైట రేజెంటు, నడుగనాతండంపె ♦ నతివనొకతె
కాంచి యాస్కోచ్‌సతిఁ ♦ గాంధిసంభాషించె, 'పనిచాల కష్టమైయుండి♦యనుకడవని
వెనుకాడతెంధైన ♦ పనులెల్లనొనరింతు', నన జీతమెంతనీ ♦ కతివయన్న
పదునేడుపౌనులుం ♦ బదిషిలింగులు హెచ్చు, కా దొనర్చిననీవు ♦ నాదుపనుల

తే. ఎపుడు పనిలోన జేరెద ♦ విపుడె జేరె,దనగ వెనువెంటనేగాంధి ♦ యామెకుత్త
రములఁజెప్పుచువ్రాయించె గ్రమముగాను, కన్నసుతవోలె మెలగెనా♦స్కాచియువతి.

ఆ. నిధులవేలపౌండ్ల ♦ నిర్వాకమొనరించి, నమ్మకముగ బనులొ♦నర్చి గాంధి
మెప్పుగాంచె నాతఁ♦డొప్పఁగా మెక్డొనా,ల్డనెడువాని బెండ్లి♦యాడెనామె. 120

తే. పరిణయానంతరముగూడ♦పనులుమితము, మించినపుడెల్లనామెగా♦వించుచుండె
నాతడలరగ సాయమొ♦నర్చుచుండె, గాంధికిందప్పకెపుడు వె♦న్కాడకుండ. 121

సీ. స్థిరముగాఁ బనిచేయ ♦ స్టేనొటైపిస్టుగా, 'మిస్‌స్కేసిన్' అనుక్రొత్త♦మెలతచేరె
ఆమెనైజమ్ముగా♦న సహించుకొనువర్ణ, భేదభావము చిన్న ♦ పెద్దలనక
ఉన్నదున్నట్లెల్ల ♦ నుద్వేగమునబల్కు, నుద్రేకగుణముచే ♦ నుల్లసిల్లు
కానియింతయుగల్ల ♦ కపటమ్ములెపుగని, నిష్కళంకసుభావ ♦ నిపుణమతియు

తే. నాంగ్లభాషయందు ♦ నధికవిజ్ఞానియై, నమ్మకముగఁ బనులొ♦నర్చిచూర
గొనియె నామెగాంధి ♦ మనమువిశ్వాసమ్ము, లాఱుపౌండ్ల జీత♦మందనెలకు.

క. ఏనాడందుకొనదు పది,పౌనులకును మించినెలకు ♦ బలవంతముననా
"నేనిటజీతమునకుగా,దే నీకడపనులొనర్ప ♦ నిచ్చవలచితిఁ. 124

క. నీయాశయభావమ్ములు, నీయాదర్శములు నీదు♦నీతిపథమ్ముల్
నీయోర్పు న్నీతీర్పు. న్నాయాత్మం జూరగొనె" న♦టంచుంబల్కెన్. 125

వ. "ఒకానొకప్పు డామెకు పదిపౌనులతో నవసరము గల్గినను, దాని నప్పుగా మాత్రమే గాంధినుండి తీసికొని, పూర్తిగా దిరిగియిచ్చివైచెను. ఆమెధైర్య

సాహసము, లామెత్యాగనిరీతివంటివే. స్ఫటికమువంటి స్వచ్ఛమైన సద్గుణ సంపత్తియు, సమరశూరునిఁగూడ సిగ్గిలఁజేయు సాహస సంపత్తియుఁగల యా యువతీరత్నముఁబోలినవారినే కొద్దిమందిని మాత్రమే నే నెరుఁగుదును. రాత్రిఁబవలనక, మాయుద్యమాభివృద్ధ్యర్థము కష్టించినది. గాఢాంధకార మలముకొన్న రాత్రులందుగూడ, తోడేదియు లేకుండనే, యామె యెన్నెన్నో పనులమీదఁ గడుసాహసమునఁ దిరుగాడెను. ఎంతెంతో సాహసవంతులైన భారతీయులెందరో, ఆమెసలహాల బాటించిరి. సత్యాగ్రహకాలమందు నాయకు లందరును బందియం దుండినపు డామె యొక్కతెయే యుద్యమమును సాగించి నది. వేలకొలదిగాగల నిధి నిర్వహణమును, మిక్కుటమైన ఉత్తర ప్రత్యుత్తర ముల పనియు, "ఇండియన్ ఒపీనియన్" అను పత్రికాభారమును, మున్నగున వెన్నియోపనుల నామె తనయొక్క చేతిమీదుగానే నడిపెను. అయినను దేని గూర్చిగాని, యేనాడును విసుగుకొన్నదిలేదు. ఈరీతిగా నెంతవరకైన, మిస్ స్క్లెసిన్, గురించి వ్రాయగలను. కాని, నాతోగూడ పనిచేసినవారి నందరి నెరిగిన గోఖేలుగూడ, వారందరిలోను, మిస్ స్క్లెసినుకే అగ్రస్థానమొసఁగెను" అని మోహను డామెఁగూర్చి తన ఆత్మకథయందు వ్రాసికొనెను. మిస్ స్క్లెసిన్ రాకకుపూర్వమే, మిస్ డిక్ ఉండగనే, గాంధికి పలయు సహాయమంతయు నొక మిస్ డిక్ వలననే లభింపమిఁజేసి, తనకు మొట్టమొదట 'ఆఫీసుగదిఁ జేకూర్చు టందు సహాయమొనర్చిన రిట్చి అను నొకదివ్యజ్ఞాన సభ్యమిత్రుని, దనక్రిందఁ బనిచేయ సమ్మతింపఁజేసెను. 'రిట్చి' రాకవలన మోహానునికి పనిభారముతగ్గెను.

### ఇండియ నోపీనియన్ — 1904-1914

సీ. అట్టికాలమున మో♦హను బ్రోత్సహించెను, మదనజిత్తనువాఁడు♦మొదలిడంగ
"ఇండియనోపినియన్" ♦ ఇష్టపడియెగాంధి. ప్రారంభమయ్యెను ♦ బత్రిక పది
తొమ్మిదివందలం♦దున నాల్గవేట మన్, శుక్లాలునాజరు ♦ చోదకుడుగ
అయిన సంపాదకీ♦యము వ్రాయుభారబా,ధ్యతలు వహించె మో♦హనుఁడెమిగుల
ఆ. అంతెకాక ధనస♦హాయంబొనర్చెను, వలయునప్పుడెల్ల ♦ వదలకుండ
ఆర్థికష్టుగా ని♦రర్థకమైనను, ఇండియనుల కుపక♦రించెనద్ది. 128
క. సత్యాగ్రహమ్ము గూరిచి, నిత్యముఁదనయాత్మఁదోచు ♦ నియమావళియున్
నీత్యుక్తాచరణవిధిన్, ప్రత్యహము రచించెగాంధి ♦ పత్రికయందున్. 129
క. పదియుం దొమ్మిదివందల, పదునాల్గవయేటివరకు ♦ ప్రతిపత్రికయం
దెదఁదోచెడు భావమ్ముల, నిదియదియనకెల్ల వ్రాసె ♦ నింపుదలిర్పన్. 130
తే. ఆత్మసంయమసాధన ♦ మాచరింప, నుపకరించెను గాంధికి ♦ నుపకరించె
నతనిభావమ్ము లెప్పటి ♦ కప్పటికటు, లనుసరింపఁగ గాంధి మి♦త్రాళికెల్ల. 131

తే. పత్రికా రాజమండలి ♦ వ్రాతలే విమర్శకుండునా క్షేపింప ♦ మానసమ్ము
సమ్మతింపని రీతిగా ♦ సత్యసమ్మతమ్ములై యుండెడినిఁ సర్వ♦దావినీతి. 132

క. ఇండియనొపీనియను లేకుండిన సత్యాగ్రహమ్ము♦కుంఠిత దీక్షా
ఖండముగ జేయ సాధ్యంబుండునె. యనితలచెడెంద ♦ మున మోహనుఁడుర్విన్.

సీ. సత్యాగ్రహోద్యమ ♦ సత్యసమాచార, మందించె పాఠక ♦ బృందమునకు
దక్షిణాఫ్రిక భార♦తజన నిజస్థితిఁ, జక్కగా నెరిగించెఁ ♦ జదువరులకు
అఖిలరకాల ప్ర♦జాళిమానవనైజ, మెరుగ గాంధికి నుప♦కరణమయ్యె
సంపాదకునకును ♦ జదువరులకు మధ్య, సదమల సంబంధ ♦ సాధనమయి

ఆ. పాఠకజన భిన్న♦భావ లేఖలు ప్రవాహముగ వచ్చెఁ బ్రచుర♦ణార్థమిండి
య నొపినియను కవ్వి♦యనసి పఠించి గ్రహించె గాంధి వడి గ♦షించెఁ దెలివి.

తే. పాత్రికేయుని బాధ్యతా♦పాత్రతలను, బాగుగ నెరుంగ సాధనా♦పాత్రమయ్యె
గాంధి కిండియనొపినియన్♦కరము గూర్చె, సర్వజనముల నడిపించు♦శక్తియుక్తి.

మం. పత్రికా రచయిత ♦ పరమలక్ష్యమ్ము, ప్రజలసేవగ గాంధి♦గ్రహియించె మొదట
హద్దుపద్దులు లేని ♦ యధికార మెదియు, ఆనకట్టలవేవి ♦ లేని ప్రవాహ
మాహద్దుపద్దు లా♦త్మైకమ్ములైన, లాభించునీరీతి ♦ లోభించునట్టి
పత్రికలామోద ♦ పాత్రముల్ గావు, మంచిసెబ్బరలెట్లు ♦ మసలునట్లెల్ల
మంచిపత్రికలతో ♦ మసలుఁజెడ్డవియు. 140

కూలిలేక మాల గూడెములు

సీ. యూదులఁ గ్రైస్తవుల్ ♦ యూరపునందూరి, బయట గెట్టోలన బడెడువాడ
లందుండ నియమించునట్లు ♦ నస్పృశ్యుల, మనముంచినట్టుల ♦ మాలవాడ
నలదక్షిణాఫ్రికాయం దిండియనులుండ, కూలీలొకేషన్ల ♦ ఘోరముగను
కట్టడిగావించె ♦ గట్టిడి శ్వేతజాతుల ప్రభుత్వమ్ము ద♦న్నిలయమందు

గీ. పారిశుద్ధ్యము గమనింప♦రేరు మునిసిపాలిటీ వారలెప్పుడా ♦ భారతీయు
లెరుగరారోగ్యవిధులెవ్వి♦వృత్తియందు, ధనవిహీనులుకృషికులై♦తనరుచుంట.

గీ. మునిసిపాలిటి నిర్లక్ష్య♦మునకుఁదోడు, ప్రజలయజ్ఞానముం జేరి ♦ పాడుమురికి
కూపముగ జేసివైచెనా ♦ కూలివాడ, నకట! అధికారులందుల ♦ కాగ్రమించి
కూల్పఁదలఁచిరి పూర్తిగాఁ ♦ గూలివాడ. 143

ఆ. అజ్ఞులైనపేద ♦ లందుశ్రద్ధాసక్తిఁ, గూలివాడస్థితిని ♦ మేలొనర్ప
వలసియుండ మునిసి♦పాలిటి యధికార్లు, కూలివాడనల్లె ♦ కూల్పశాస
నాధికారమంది ♦ రాకూలివారల, వారియిండ్లనుండి ♦ పంపివైవ. 144

క. జోహాన్సుబర్గు పురమున, మోహనుఁ డందున్నకాల♦మున స్థితిగతుల
శ్లేహీన స్థితినుండెను, సాహసపరులెవరులేక ♦ చక్కఁబరుపగన్. 145

ఆ. ఇండియనులు వారి♦యిల్లుగట్టిన నేల, స్వంతమగుటచేత ♦ వారికీయ
వలసియుండె నష్ట♦పరిహార మవ్వారి,నుండి కొన్న నేల ♦ కొప్పినట్లు. 146

వ. ఇందుకై ప్రభుత్వమువారు ప్రత్యేకన్యాయ సభను నెలకొల్పిరి. మునిసి పాలిటివారిచ్చు నష్టపరిహారమునకు సమ్మతింపనివార లా ప్రత్యేక న్యాయసభకు అపీలుచేసికొనుచుండిరి. ఇట్టి అపీళ్ళలో గెలుచు నిండియనులకు మునిసిపాలిటి వారు వారివ్యాజ్యమునకైన డబ్బుకూడా నీయవలసివచ్చెను. గాంధికడకే యీకేసులు చాలవరకు వచ్చెను. అట్టిడబ్బేకాక, ప్రతివ్యాజ్యములోను, పది పౌనులరుసుము గాంధి కొసగిరి. అట్లుపొసగిన ధనములో సగము పేదల కాసు పత్రిం గట్టుటకు వినియోగింప గాంధి నిశ్చయించెను. వచ్చిన డెబ్బదివ్యాజ్య ములలో 69 వ్యాజ్యములందు గాంధిదే గెలుపు. అందువలన రాబడియెక్కువ గానే యుండెను. అందులో 1600 పౌనులు డబ్బు 'ఇండియన్ ఒపీనియన్' పత్రికయే భ్రమింగెను. 147

క. వ్యాజ్యమ్ములందునం జా,లావ్యథలంబడియు గాంధి ♦ క్లైంటు లతనిచు
ట్టు వ్యూహముగాం జేరగ, నవ్యాజదయామృతాబ్ధి ♦ యాతండగుటన్. 148

సీ. వారియందున నెక్కు♦వగం గార్మికులును బీ,హారు ప్రాంతమ్ముల♦వారు మొదట
సౌతిండియావారు ♦ చాలమందియుం దమ, ప్రత్యేకకష్ట ని♦వారణమ్ము
కొరకు స్థాపనముచే♦సిరి సంఘమొండు వే,రుగం బెక్కురందున ♦ సుగుణమణుల
జయరామసింగును ♦ సంఘాధిపతి భద్రి,నాముండు వారల ♦ నాయకులుగ

గీ. వెలయగాంధికి బాసట ♦ నిలిచిరెప్డు, భద్రిసత్యాగ్రహమ్మునం ♦ బాలుగొనియె
వారికష్టసుఖంబులం ♦ బాలుపంచు,కొను సహోదరుడుగ గాంధి ♦ యనిశమరసె
వారి క్షేమలాభములకై ♦ బాటుపడుచు. 150

ఆ. అందువలన గాంధి♦నందరుసోదర, భావమునం దలంచి ♦ 'భాయి'యంచుం
బిల్చుచుండిరెపుడు ♦ ప్రియమారనబ్బుల్ల, ప్రేమపేరుబెట్టి ♦ పిలిచినట్లు. 151

ఆ. ఆప్తులెవరు జనుల ♦ కాపదలం దాదు,కొనెడువారె; భ్రాతృ♦జనములెవరు
శత్రుబాధనుండి ♦ స్వయముగా బాధలం,బడుచు నైనంగాచు♦వారుగారె. 152



ప్లేగువ్యాధి

సీ. ఆవాడ యాజమా♦న్యము మున్సిపాలిటి, దగుట నిండియనుల♦కందు శ్రద్ధ
తరిగె; బెరిగెనందు ♦ మురికిరోగమ్ముల, కాలవాలమ్ముగా ♦ నాస్థలమ్ము
అచ్చోటికి సమీప♦ముందున్న బంగారు, గనులందుం బనిచేయు♦కాలమందు
తగల ప్లేగిర్వది ♦ ముగురిండియనులకు, బాధంబడుచునిల్లు ♦ వారుజేర
నత్తరి నావాడ♦యందుంట మదనజి, త్తరసివారల వ్యాధి♦కరుగ మనము

గీ. ప్లేగకస్మాత్తుగా సంభ♦వించఁగాన, రమ్ము వెంటనే తగిన♦చర్యలను గొమ్మ
టంచుగాంధికిఁ జెప్పిపం♦పించె నతఁడు, వేగిరమ్మెబైసికులు నెక్కి ♦ యేగెనటకు.

గీ. ధైర్యమువహించి మదనజి♦త్తందరి యొక యింటి యందున రోగుల♦నెల్లఁజేర్చె
గాంధియావార్త తెలిపెటౌన్♦క్లర్కుకెల్ల, స్థితిగతులఁ;దందుకతనిమె♦చ్చెనుగుమస్త.

క. అలమదనజిత్తు డాక్టరు, విలియము గాడ్ఫ్రియుగాంధి ♦ విసువక మువురుఁ
కలిసి పరిచర్య నెమ్మది, సలిపిరి రోగులకుఁ జాల♦ శ్రమయేమైనన్. 155

గీ. ముప్పురక్కట! యిరువది♦మువ్వురికిని, సలుపసాధ్యమొకో! పరి♦చర్యసతము
అనుభవమ్మున నెరిగె మో♦హనుఁడెడంప, అమలమగుచో విపత్తున♦నబ్బుసకల
జనధన సహాయమెంతయు ♦ ననుచుమడిసి. 156

సీ. కల్యాణదాస్ మనె♦క్లాల్ గుణ వస్తరామ్, దేశాయియనెడు గాం♦ధీగుమస్త
లందరు "నీవెందు ♦ నుందువో యందె మే,ముందు మటంచును♦గాంధికనిరి
గాంధిచెప్పినరీతిఁ ♦ గావించి రందరు, కడునపాయకరంబు ♦ కఠినమైన
అల్ల డాక్టరు గాడ్ఫ్రి♦యసమాన సాహసా,దార్య మందరికి నా♦దర్శమయ్యె

గీ. రాత్రియందెల్లరును జాగ♦రణమొనర్చి, రోగులకు సేవచేసిః ♦ త్యాగనిరతి
ఔషధమొసంగి తీర్చుచు ♦ నవసరములు, పడకలను శుభ్రపరచుచు♦బరగశ్రద్ధ.

ఆ. భయమొకింతలేక ♦ భక్తినాసక్తి వి,సువక యువకులెల్ల ♦ రవిరళముగ
కష్టపడుటగాంచి ♦ గాంధి సంతోష సం,భరితుడయ్యె మనము ♦ కరిగెపోయె,

క. తెలిపెను గాంధి కతనిరో,గులసేవకు టౌనుక్లర్కు♦కుకుతరభక్తిన్
వెలయఁగృతజ్ఞత మరునా, డెలయించుచు గొట్టొకండు ♦ నెక్కటిదాదిన్. 159

క. శుద్ధమొనర్చిరి కొట్టును, శ్రద్ధాసక్తులను వైద్య♦శాలగ వెలయన్
అద్దానఁ గొన్ని పడకలు, కొద్దిగనవసరములెల్లఁ ♦ గూర్చిరివారల్. 160

ఆ. పంపె మున్సిపాల్టి ♦ బ్రాందిబాటిల్సుతో, నరుసునొకతెనామె ♦ సరసుగుణ
అరుసమునను రోగు♦లందరి పరిచర్య, సలుపబూనె వారు ♦ వలదనినను. 161

సీ. తానుద్రావుచు బ్రాందిఁ♦దమ్ముద్రావుమటంచు, తరుచురోగులకీయఁ♦దలచెనర్సు
గాంధికందున నమ్మ♦కములేమి డాక్టరు, నడిగి బ్రాందిని వల♦దనినరోగు
లకు మువ్వురకొనర్చె ♦ నకలంకమౌ భక్తి, మట్టిచికిత్సఁ బ్రే♦మమ్ముతోడ
తలలపై యెదురు రొ♦మ్ములపైనఁ దడిమట్టి, పట్టీలఁ గప్పుచుఁ ♦ బల్మరతఁడు

గీ. ముగ్గురం దిద్దరికి వ్యాధి ♦ తగ్గిపోయె, బ్రాందిఁద్రావెడు నిరువది♦మంది మడిసి
రందరాకొట్టునను ♦ పరమాత్మయందు, భక్తిఁగల్గినవారె కా♦పాడబడిరి, 162

సీ. ఆపురికేడు మైళ్ళందున గల అంటు, రోగులాస్పత్రికా♦రోగు లిద్ద
రంపఁబడిరి పూర్తి♦వ్యాధి పీడగ మున్సి♦పాలిటివారి స♦త్పాలనమున

మరికొన్ని నాళ్ళలో ♦ మరణించెనర్సును, గాంధి నాతనిమిత్ర ♦ బృందమెల్ల
నీశ్వరానుగ్రహ♦మే కాచెననవచ్చు, మట్టివైద్యమున న♦మ్మకము హెచ్చె

ఆ. ఈశ్వరు దయయందు ♦ విశ్వాసమతిశయ,మయ్యె గాంధి కతని♦యనుచరులకు
బ్రాందిమందునకును ♦ బనికిరానిదియయ్యె, బ్రకృతిమాతయందు ♦ భక్తికుదిరె.

ఆ. ప్లేగు ప్రబలగానె ♦ బ్రెస్సున కొకలేక, వ్రాసెగాంధి మున్ని♦పాలిటీయె
కూలివాడ మురికి ♦ కూపంబుగాఁ జేసి, వ్యాధివ్యాప్తిగా నొ♦నర్చెనంచు.

క. ఈలేఖవలన హేన్రీ,పోలకు గాంధికిలభించె ♦ భుజియించెడు హో
టేలున; నాల్బర్ట్వెస్టయె, నోలినిసంపాదకుడుగ ♦ "నొపినియను" కటన్. 165

సీ. గాంధి భుజించు శా♦ఖాహార శాలలో, కలసిన వెస్టుతోఁ ♦ గలసెమైత్రి
నిత్యమిరువ్వురునట ♦ నియమంబుగా గూడి, సంధ్యావిహారంబు ♦ సల్పుచుంట
ప్లేగుగూర్చిన గాంధి ♦ లేఖపఠించి హో,టలునందు నాతని ♦ గలయగోరె
సంధ్యవేళందు భో♦జనముమానిన గాంధి, ఆల్బర్టుకగుపింప♦డయ్యె నకట!

గీ. ఆతురత హెచ్చు మోహను♦నరయనొకప్ర,భాతమున నాతనిగృహంబు♦పైనఁగొట్టె
నిద్రలేపెను గాంధియుం ♦ దెరచితలుపు, దృష్టిఁబరపెను వెస్టుపై ♦నిష్టసఖుడు.

క. రెష్టారెంటున నాదగు, దృష్టిఁబడమి నిన్నుఁజూడఁ ♦ దీవ్రమగుతమిన్
ఇష్టసఖా,వచ్చితి నిపు,డిష్టపడుము రోగిసేవ ♦ నేనేయనగన్. 167

క. నర్సుగ నినుగొంటకునే, హర్షింపను; జనుము దర్బ♦నందు నొపినియన్
దర్శకుడుగఁ బనిసేయుము, హర్షింతుననంగ గాంధి ♦ యాల్బర్టరిగెన్. 168

ఆ. నాటినుండి మోహ♦నాల్బర్టులెల్ల క,ష్టముల సుఖములందు ♦ సమముగ సుఖ
జీవనమొనరించి ♦ రేవగఁగుందక, సఖ్యమనెడు నాఖ్య♦సార్థకముగ. 169

గీ. ఆంగ్లకర్షక జాతివా♦డతని పాఠ,శాలచదువంత మాత్రమే ♦ చాలనేర్చె
ననుభవమ్మును బడిని స్వ♦యం సహాయ♦మను కళాశాలయందున ♦ ననవరతము.

గీ. నిత్యనిర్మల నిశ్చల ♦ నిపుణమతియు, దైవభీతిదయాధర్మ ♦ భావభరిత
చరితుఁడైనట్టి యాంగ్లసం♦జాతుఁ డాత,డంచుగాంధి వచించె స్వీ♦యాత్మగాథ.

### కూలివాడకాల్పు

సీ. కూలివాడ జనాళి♦గూర్చి యశ్రద్ధచే,సినను శ్రద్ధవహించె ♦ శ్వేతజాతి
వారలగూర్చి య♦వ్వారిగా ధనమువె,చ్చించి ప్లేగెల్లన ♦ డంచివైచె
తెల్లవారికిగాను ♦ గొల్లగాఁగొనగోరె, భారతీయులచేత ♦ పనులనెల్ల
సకలజీవహితైషి ♦ యకలంక గుణగణుం,డగు మోహనుసహాయ♦మభిలషించె

ఆ. మునిసిపాల్టిగాంధి ♦ వెనుకడుగిడకుండ, తనదుపల్కుబడిని ♦ వినిమయమ్ము
చేసె; ప్లేగడంగె ♦ వాసికెక్కెను నిండి,యనుల సత్ప్రవర్త ♦ నాభిలాష. 172

ఆ. కూలివాడనెల్ల ♦ కాలుచు కోర్కెతో, మునిసిపాల్టి యిండి♦యనులనెల్ల
ట్రయినుమీద గొంచుఁ♦దరలించెఁ బదుమూడు, మైళ్ళ దూరమునకు♦కుళ్ళడంప

క. వారలకట వసియింపఁగ, వాసత్రమిచ్చె మునిసి♦పాలిటి తినుభం
డారమ్ములు; తద్వ్యవ,స్థారోగ్యము గూర్చె నిండి♦యనులకునెల్లన్. 174

క. కూలిజనుల నటుబంపుచు, కాలిచె నిటఁ గూలివాడఁ ♦ గల్మషమెల్లన్
దూలగ నెలుకలదండులు, కూలగనామంటలందు ♦ కుతకుతమనుచున్. 175

ఆ. ఇందువలన గల్గె ♦ నెంతయో ధననష్ట, మట్లు మున్సిపాల్టి ♦ కెల్లవిధుల
అడగెప్లేగు; పల్కు♦బడి హెచ్చె గాంధి కా,రోగ్యమబ్బెఁ బ్రజకు♦భాగ్యమబ్బె.

## ఒక గ్రంథప్రభావం

సీ. ప్లేగువలన హెచ్చె ♦ పేదలౌ భారత, ప్రజతోడ గాంధికి ♦ పలుకుబడియు
పలుకుబడివలన ♦ ప్రాక్టీసు బాధ్యత, లధికమైయూరోపి♦యనులతోడ
సంబంధము మరింత ♦ సన్నిహితంబయ్యె, బలపడ నైతిక ♦ బాధ్యతలటు
'దీక్రిటి'క నెడు ప♦త్రిక కుపసంపాద,కుఁడ నేననుచు పోల♦కొక్కసంచె

గీ. వేళయందు శాకాహార ♦ శాలయందు, "ప్లేగుగూర్చిన నీలేఖ ♦ ప్రెస్సులోన
పఠనచేసిన దాదినీ ♦ పరిచయమ్ము, కోరుచున్నాడ"వని గాంధిఁ ♦ జేరిపల్కె.

క. పోలకు జీవనగతులం, బోలెందన బ్రతుకుభావ♦ములు నుండుటనా
వేళనె మోహనుఁడతనిం, జాలఁగఁ బ్రేమించి యతని ♦ సఖ్యమొనర్చెన్. 178

క. అతనినిరాడంబర జీ,విత మతని త్రికరణశుద్ధి ♦ విమలాచరణం
బతులిత సద్వర్తనమున్, మతికెక్కెనుగాంధికటు స♦మాయకుఁడగుటన్. 179

గీ. ఇటులపోలకుతో స్నేహ♦మినుమడింప, నట నెటాల్ నుండి వెస్టొక♦ లెటరువ్రాసె
'ఇండియ నొపినియను'గూర్చి♦ఖండనములు,నిండుగానుండ గాఁగష్ట♦నిష్ఠురములు.

క. ఆలేఖం బఠియించియు, పోలకుతో నెల్ల చెప్పి ♦ మోహనుఁడేగెన్
సాలోచనుడై యపుడె నె,టాలునకుం జక్కబఱుపఁ ♦ దత్పత్రికనున్. 181

సీ. ఎవడేదిచెప్పిన ♦ నెదనమ్మునే కాని, తన్నిజానిజములఁ ♦ దలఁపకుంట
మదనజిత్తాడిన ♦ మాటఁ బత్రికలాభ, సాటిచేకమ్మని ♦ సాటె గాంధి
వెస్టుతో నతడిప్డు ♦ నష్టకష్టదము ప,త్రికయంచు వ్రాసిన ♦ తెరగుఁదలచి
తగదెవ్వరికి బ్రమ♦త్తత ప్రజాకార్యంబు,లందు సత్యాత్మకుం♦డప్రమత్తు

గీ. డగుచుసర్వదా కన్నుంచి ♦ నన్నియెడల, శక్తికినిమించు పనులందు♦జనక,తోడి
వారికేలాటితోందరల్ ♦ వదలనీక, నుండవలె నంచరిగె మోహ♦నుండుమదిని.

క. ఈలీలఁదలచి గాంధి నె,టాలున కుంబయనమయ్యె ♦ నాతనికట వీ
డ్కోలీయవచ్చి యిచ్చెను, పోలకుమోహానుని కొక్క ♦ పుస్తకమణిరన్. 183

తే. అంటుదిస్‌లాస్ట 'నెడు'రస్కి♦ననెడునాంగ్ల, కవిరచనమద్దిశతియించి♦గాంధియందు
తెలిపినటుదన మనుగడ♦దలచె మార్చ, ననువదించె ఘూర్జరభాష♦యందుదాని.
ఆ. తననిగూఢగాథ ♦ తమనైజ విశ్వాస, మణుల బింబమందుఁ ♦ దనరుకతన
మోహనుండుదాని ♦ మోహమ్మునంబడె, మారెనతని బ్రతుకు♦మార్గమెల్ల,
క. మానవువంతర్గర్భిత, మైనసుగుణగణము స్పష్ట♦మగునటుజేసే
జ్ఞానియెకవి తదితరుడ, జ్ఞానియె విజ్ఞానమెంత♦జగమున నున్నన్. 186
క. కవిరచననెల్ల రొకగతి, భువిని బ్రభావితులుగారు ♦ పొలములెపుడు పం
డవు సకలమొక్కగతి నం,దవిరళముగ విత్తులొకటె ♦ యైననునాటన్. 187
ఆ. 'అంటుదిస్‌లాస్టు' బోధించి♦నట్టి నీతు, 'లఖిల జీవుల క్షేమమే ♦ వ్యక్తిక్షేమ'
'మఖిలవృత్తులవిలువ స♦మానమవని' 'కష్టపడుజీవితమె సార్థ♦కమ్మనఁదగు
అనెడు నీతిపాత్రత ♦ యమ్మె తెలియ. 188
ఆ. అఖిలజనుల క్షేమ ♦ మందె వ్యక్తిక్షేమ, ముందునంచు మోహ♦నుండెరుంగు
వృత్తులఖిలమొకటె ♦ విలువగలవటంచు, గొంత తెలిసియు గాంధి ♦ కంతవరకు.
గీ. 'అంటుదిస్‌లాస్టు చదివిన♦యంతఁదెలిసె, మొదటి నీతిలో రెండవ♦మూడవగుణ
పాఠములు గర్భితమ్ములై ♦ పరగుటాచ,రణకు సమకట్టిగాంధి యా♦దినమునుండె.

ఫోనిక్సున సెటిలొనుట — 1904

మం. వెస్టుతో 'నంటుదిస్ ♦ లాస్టు' గురించి స్పష్టమ్ముగా దాని ♦ ఫలితమ్ము గూర్చి
చెప్పి మోహనుఁడొక్క ♦ క్షేత్రమ్మునందు, ఒప్పించె నెల్లవా♦రొకట శ్రమించి
జీతమ్మొకటిగాగ ♦ జీవించు చోట, నేవిధమగు భేద ♦ భావాలు లేక
'ఇండియన్ ఒపీనియన్'♦ఎటులో విరామ, ముండునప్పుడు జూచు♦చుండెనమంచు
ఈమాదిరి బ్రతుక ♦ మోమోడకున్న, మామూలుగానె సఁ♦బళమందుకొనుచు
క్రమముగా క్షేత్రానఁ ♦ గాలిడవచ్చు, విమలమానాదర్శ ♦ విధి జేరనంచు
వర్ణభేదము జాతి♦వ్యత్యాసమూడ్చి, నిర్ణయించె నవుండ్ల ♦ నెలకుమూడుగను
ఈపథకమనుస♦రించిరి వెస్టు, నోపిక చతునలా ♦ ఉత్తమగుణుడు
గోవిందుస్వామియుఁ ♦ గోర్కెమై యితర,లేవారలం దిచ్చ♦గింపరు చేర
ఫోనిక్సుస్టేషను ♦ పొంతనువేయి, పౌనులకు లభించె ♦ వనమున్న నేల 200
క. రస్టోష్టి యొసగ గొనిచని, వెస్టుం దదితరులు పూని♦వేయించిరొకం
డిష్టపడియినుపరేకుల, కోష్ఠమునుంపంగ నచ్చు♦కూటంబందున్. 201
మ. ఇటు పందొమ్మిదినూర్ల నాలుగవదౌ ♦ యేటన్మహాత్ముండు ప్ర
స్ఫుట మానట్ట ప్రణాళికాను సరణిన్ ♦ ఫోనిక్సునం జేర్చె సం
కటముల్ పెచ్చుగనోర్చి పత్రికను సా♦గం జేసె ముద్రించుచున్
ఎటులో తోడిజనమ్ముఁ జేర్చెనటకున్ ♦ హ్యాద్యాన వద్యంబుగాన్. 202

గీ. అటుల 'ఫోనిక్సు'చేరిన ♦ యాప్తమిత్ర,బాంధవులయందు మగనలాల్ ♦ గాంధియద్వి,
తీయుఁ డాతండు త్యాగబు ♦ ద్ధిని సమర్థుం డగుచు నీతిపథంబున ♦ ననుగమించె
గాంధిసేయు నైతిక ప్రయో ♦ గమ్ములందు.

ఆ. దక్షిణాఫ్రికాకు ♦ ధనముసంపాదింప, వచ్చినప్పటికిని ♦ యిచ్చమెచ్చి
మగనలాలునిరుప ♦ మానభక్తినిగొల్చె, గాంధినడుగు జాడ ♦ లందు నడచి. 204

మొదటిరాత్రి—1904

వ. 'ఇండియన్ ఒపీనియన్' పత్రిక మొదటిసంచికను ఫోనిక్సునుండి సకాలమున ప్రచురించుట సాధ్యముకాదనిగా దోచెను. వ్యవసాయక్షేత్రమైన ఫోనిక్సునందు యంత్రశక్తి నుపయోగించుట కూడదనిగా దోచి, గాంధి చేతిబల ముపయోగింపఁదలచెను. కాని యది యాచరణ సాధ్యమైన పనిగాఁ గానఁబడమి, ఒక తైలయంత్రమును నెలకొల్పిరి. అయినను యంత్రము పనిచేయనిపక్షమున, ప్రత్యామ్నాయముగా పనికివచ్చుటకై, 'చక్రమునొండు' 'వెస్టు' గాంధి సలహాపై యేర్పాటు చేసియుండెను. మామూలు జనావాసములకు దూరముగా నుండు ఫోనిక్సునందు, దినపత్రికంబోలె పెద్దసైజుగా ప్రచురించుట నవసరమని, ఫూల్‌స్కాప్ అరఠావుసైజుకు తగ్గించిరి. అప్పుడు ట్రెడిల్‌వంటి చిన్నయంత్రముపైన ముద్రించుట కనుకూలపడునని, యందుకువగిన యేర్పాటులన్నియు నాలోచించియే చేసిరి. మొదటి ప్రచురణమునకు ముందునాటిరాత్రి యందరును అర్ధరాత్రమువరకు మేల్కాంచి పత్రికను ముడిచెడుపని చేయవలయునని నిర్ణయించుకొని యుండిరి. కాని యా మొదటిరాత్రి యెన్నటికి మరువరాని రాత్రిగా పరిణమించెను. యంత్రము పనిచేయ నిరాకరించెను. డర్బను నుండి యంత్రమును జక్కబెట్టగల, యెంజినీరు పిలిపింపబడెను. ఆ ఎంజినీరు 'వెస్టు'తో కలిసిచేసిన కృషియంతయు బూడిదఁబోసిన పన్నీరుగా బరిణమించెను.

గీ. కడకుగన్నీరు నింపుచు ♦ గాంధికడకు,వచ్చి 'వెస్టనె' ఎంజిను ♦ పనియొనర్ప
దెల్లిపత్రిక నెటు ప్రచు ♦ రింపఁగలము, తెల్లవారి సకాలానఁ ♦ దెలుపుమంచు.

క. పనిచేయని యంత్రముతో, పనియేమిక నితరగతులఁ ♦ బనిచేసెదు సా
ధనముల యత్నింతమ్మిట, పనిగొందము 'చక్ర'మింత ♦ పనివడవొక్కొ!. 207

క. అనిగాంధివలుక నందుకు, పనివారలు పలువురుండ ♦ వలయును గాదే !
మనపనివాండ్లందరలసి, కనుమూసిరటంచు వెస్టు ♦ గాంధికి బలుకన్, 208

క. ఉందురు వడ్రంగులు నిట, కొందము పనివారిచేతఁ ♦ గొంకక రే యొ
ల్లందరముం గష్టింపం, గందెలవారంగఁ బత్రి ♦ కాప్రచురణమగున్. 209

ఆ. అనుచు వారిలేపి ♦ యర్థించె దత్సహా, కారముపుడ గాంధి ♦ వారు లేచి
ఇట్టియవసరముల ♦ నేముసహాకరింప,కున్న; నున్న లేక ♦ యున్న నొకటె. 210

మ. అనివద్రంగులు పూన్కిమైతోడరగా ♦ నందంబున న్వేష్టప్రా
ర్థనగీతమ్మును బాడగాఁ దొడఁగె జ♦క్రంబూనె ద్రిప్పంగమో
హానుఁడవ్వారలతోడ నాడుదయమం♦దౌదాక వెస్టంత మో
హానునాలోచన నెంజినీరొనరుపన్ ♦ యంత్రంబు చక్కంబడెన్. 211

సీ. అంతసంతసమంది ♦ రందరుద్విగుణీకృ,తోత్సాహమునఁబని ♦ కుద్యమింప
శాత్రిఫలింపని ♦ శ్రమఫలింపగ నుద,యమునఁ జక్కంబడె ♦ యంత్రమహామ
మనబుజావర్తన ♦ మునకు ఫలంబిది, కదిలెయంత్రము దైవ♦కరుణగాదె!
మానవులంబోలె ♦ మనగయంత్రములు వి,శ్రాంతికోరునొ యేమొ♦వింతగాన

ఆ. టంచుఁ బనికిబూని ♦ రందరు సమయాని,కెల్ల పనులుముగిసె ♦ నుల్లమలర
పంపబడియె నెల్ల♦ప్రతులు సకాలమం, దిటులజయపతాక ♦ మెగయమింట. 212

ఆ. ఇట్టిమొదటినాటి ♦ పట్టుదలవలన, క్రమముగాను బత్రి♦కాప్రచురణ
మును స్వయంసహాయ ♦ గుణము ఫోనిక్సునం, దలరె నుజ్జగించి♦యంత్రమెల్ల
పనులుచేతిశక్తి ♦ వలననే జరిగె ఫో,నిక్సుకేంద్రమయ్యె ♦ నీతిఁబ్రతుక. 213

పోలక నిర్ణయము

సీ. ఫోనిక్సుసెటిల్మెంటుఁ ♦ బూన్కినేర్పరచెనే, కానిసేయగలేదు ♦ కాపురమట
గాంధిస్థిరమ్ముగాఁ♦గ్రమముగాఁదన న్యాయ,వాదివృత్తినిపీడు ♦ వాంఛకతన
నైననాతఁడెరింగె ♦ స్వానుభవమ్మున, తరుచుగామనుజుని ♦ తలపులెల్ల
దైవమ్ముదయదప్ప ♦ తారుమారగునంచు, నైననంతిమలక్ష్య ♦ మరయసత్య

గీ. మైనయెడలమొత్తముమీద♦హానియొదవ,దసలుపథకమ్మునకొకింత♦నప్పుడప్పు
డనుకొనినదానికన్న స♦త్యధికఫలద, మగుచునుండునాపథకమ్మె♦యంత్యమందు.

గీ. కాయకష్టముచే బ్రతు♦కంగనెల్ల, రచ్చుకూటముచుట్టు ను♦న్నట్టినేల
పంపకముసేసెనచ్చటి ♦ వారికెల్ల, మూడెకరముల వంతున ♦ మోదమొదవ.

క. అందొక మూడెకరమ్ములు, గాంధికిని లభించెవారు ♦ కర్షకులగతిన్
పొందికఁగట్టగఁ గొట్టము, లందరికందముగ జరిగె ♦ యత్నమ్మందున్. 216

క. కొట్టములఁ గట్టఁగాలము, బట్టునుజాలగ నటంచుఁ ♦ బనివినతోడం
గట్టిరి నుపరేకులతో, నెట్టననొకరీతి నచట ♦ నివసనములనున్. 217

సీ. పత్రికకపుడు సం♦పాదకుండైన మ,న్సుక్లాలు 'ఫోనిక్సు' ♦ చొప్పు కిష్ట
పడమిఁదర్బనునుండి ♦ పత్రికనడిపెను, ప్రతివాడచట ప్రెస్సు♦పనులయందు
కంపోజిటరుపనిఁ ♦ గరువంగవలెనంచు, ప్రతినగైకొని యుండి ♦ రతులనిష్ఠ
అందరిలోనొక్క ♦ గాంధిమాత్రమ్మె నే,ర్వగఁజాలడయ్యె నా♦పనినొకింత

ఆ. మగనలాలుగాంధి ♦ సుగుణుడై నేరిచె, నఖిలముద్రణాల♦యమ్ము పనుల
హానుమపాలె నాత్మ♦డాత్మశక్తి నెరుంగ, డట్టియాత్మశక్తిఁ ♦ దిట్టయగుట.

వ. ఆ క్రొత్త కట్టడమ్ములు పూర్తిగా నెలకొనకముందే గాంధిప్రవృత్తి నిమిత్తమై జోహాన్సుబర్గున కరిగెను. అందతడు తన ఫోనిక్సు నివాసముఁగూర్చి పోలకు నకు తెలిపెను. అదివిని పోలకు దామున్ను గాంధికి పఠింపనిచ్చిన గ్రంథప్రభావం బున కచ్చెరువంది గాంధితో నిట్లు సంభాషణ జరిపెను. 219

క. "నీనూతన పథకమ్మున, నేనుం బాల్గొనగరాదె" "♦ నీకడి యిష్ట
మ్మా నెడఁదప్పక రమ్మట", "నేనిప్పుడె వచ్చెదచటి ♦ కీ విష్టపడన్". 220

క. ఒకనెలలోపల వీడి క్రి,టికు పత్రికఁ గ్రొత్తదగు సె♦క్రెట్మెంటుకుఁ బో
లకుచనె నైజగుణంబత,నికి డంబము లేమి యగుట ♦ నిరసింపనట్లన్. 221

ఆ. కలుపుగోలుతనము ♦ వలన ఫోనిక్సుకుటుం,బమున నాతడెల్ల ♦ వారిమనము
జూరగొనియెనందు ♦ జొచ్చెనీరమున స్వా,భావికముగ జొచ్చు ♦ బాతుఁబోలె.

సీ. కానియాతని జాల ♦ కాల మచ్చటనుండ, నీయక సాయమ్ము ♦ సేయుకొఱకు
తనన్యాయవాది వృ♦త్త్యర్థమ్ముగా గాంధి, పిలిపించె నతని 'నా♦ఫీసుపనికి
కడకు దానతనితోఁ ♦ గలసివృత్తినివీడి, నెలకొనఁదలచె' ఫో♦నిక్సునందు
చర్చింప కెప్పుడు ♦ సఖులతో పోలకు, సమ్మతింపఁదలంచు ♦ నష్టకమున

గీ. అతనినైజగుణంబట్టి ♦ దగుటచేత, విశ్వసించి మోహానుమాట ♦ వెడలివచ్చె
న్యాయవాదిగఁజేర జో♦హాన్సుబర్గు, గాంధికిసహాయ మాఫీసు♦సందొనర్ప. 223

గీ. పోలకాదర్శముగవానిఁ ♦ బోలెదన్ను, జేరరమ్మనె "మేకిను♦ష్మైరు" అనెడు
'స్కాచ్ థియాసిఫిస్ట్' నొక్కని ♦ గాంధితనదు,న్యాయవాదపుపనులందు ♦ నతడుజేరె.

క. తనయాదర్శమ్ముల పాని,క్సువ శీఘ్రతరముగ బొందు♦కొఱకెరుగకయే
చనుచుండెఁ దద్విరుద్ధపు, పనులందు మరింతలోతుఁ ♦ బడిగాంధి కటా! 225

వ. అయినను బరమాత్ముండు దయదలచుటం జేసి, త్వరలోనె మోహాను దావ్హా మోహాముండి బయటఁబడెను. 226

## ❧ దైవకృతులు ❧

ఆ. తిరిగిఇండియాకుఁ ♦ ద్వరగానరుగు నాశ, వెనుకఁబడుట గాంధి ♦ తన సతీసు
తులను రప్పటంచుఁ ♦ బిలిపించుకొనెఁ దన,కడకు వారినెల్ల ♦ కడలిమీద. 227

సీ. పయనమైవచ్చెడు ♦ పడవలోనోడ క్రే,ప్టెనుతోడ దా నాడు♦కొనుచు రామ
దాసనుగాంధి మా♦డవకుమారుని చేయి, గాయంబుగాఁ గట్టుఁ ♦ గట్టి యోడ
డాక్టరు; యోగ్యుడౌ ♦ డాక్టరుచేఁ గట్టుఁ, గట్టింప మంచును ♦ గాంధికనియె
కాని యానాటికే ♦ గాంధికిప్రకృతిచికి,త్సలయందు విశ్వాస ♦ మొలయుచుంట

ఆ. కట్టు విప్పి కడిగి ♦ గాయంబునకు మట్టి, పూతవేసి తిరిగి ♦ మూసి కట్టు
గట్టుచుండ నిట్లు ♦ గాయంబు పూర్తిగా, మానె నెల్ల నొక్క♦మాసమునకు. 228

క. ఇందువలన హెచ్చయ్యెను, గాంధికి విశ్వాసబలము ♦ గాయమ్ములకున్
మందాగ్నికి పసిరికలకు, మందుగ మృజ్జలచికిత్స ♦ మరిమరి వాడన్. 229

ఆ. అయిన ననుభవమున ♦ నందపాయము తటస్థింపవచ్చు నంచు ♦ దెలిసికొనియె
ఐరోపియనులతోటి ♦ కూరిమిచే నపాయములు సంభవించు ♦ నటుల నెటులొ.

క. మనుజుడు నూత్నపరీక్షల, నొనరించుట దగునుదనదు ♦ నొడలిపయిన; ద
న్మనుజుని నిజాయితికి గాచును దైవము సత్యమునకు ♦ చూపును దారిన్. 231

సీ. తనతోడనుండ ర♦ష్మనెగాంధి పోలకు, నిరువు రుండిరి సహో♦దరుల కరణి
మోహానుబోధచే ♦ బోలకుదాను ప్రేమించిన ప్రేయసిం ♦ బెండ్లియాడె
ఆమె క్రైస్తవమత♦మందు బుట్టినదాత, డకట! యూదుమతస్థు♦డైన నేమి
ఇరువురి హృదయమ్ము ♦ లేకమ్ముగాగ నైతికముగాం దన్మత♦మొకటె యయ్యె

గీ. గాంధివారికి సంధాన ♦ కర్తయయ్యె, బహుని రాడంబరమ్ముగా ♦ బరిణయంబు
జరిగె నూతనదంపతు♦లిరువురందె, మోహానుని కుటుంబమందు స♦భ్యులుగనైరి.

సీ. బ్రహ్మచర్యముగూర్చి ♦ భావపక్వము గామి, నానాటిగాంధి యం♦దరిని బెండ్లి
యాడ బోధించె 'వె♦స్లాం'గ్లయువతి నొండు, చేపట్టె నామె వ♦చ్చెను వసింప
తల్లితోపోనిక్సు ♦ యెల్లరికుమ్మడి, వాసమయ్యెను దెల్ల♦వారికట్లు
భారతీయులుగూడ ♦ భార్యాసుతుల బిలిపించి రందరను వ♦సించిరందు

గీ. ఇటుల ఫోనిక్సు క్రమముగా ♦ వృద్ధిచెంద, పల్లెటూరయ్యె నాపైన♦పట్టణముగ
మారె తద్వాసులెల్ల రిం♦పారంగష్టజీవులు గృహీవల కుటుంబ♦జీవులెల్ల. 234

— ఇంటిమీది దృష్టి —

సీ. హెచ్చుగా వెచ్చమ్ము ♦ లింటనాడంబర, రహితజీవితము డ♦ర్బనున జరిగె
జోహన్సుబర్గున ♦ గేహమ్ముతీరు ర,స్కిన్ ప్రబోధములచేం ♦ జెన్నుతరిగె
బాహిరమ్మునకన్న ♦ ప్రబలమౌ మారుపు, లంతర్గతమ్ముగా ♦ నధికమయ్యె
కష్టించి జీవింప ♦ నిష్టమ్మధికమయ్యె, నందువలన దన♦నందనులను

గీ. కూడనాకీతిగా బెంచం ♦ గోంచెమైన, ముందువెనుకల నరయక ♦ డిందువడక
మోహనుడు తనతరిబీతు ♦ మొదలువెట్టె, కాయకష్టముచే బ్రతు♦కంగగరవ.

సీ. బేకరు బ్రెడ్ మాని ♦ విసిరిన పిండితో, 'ఖూనె' రొట్టెని జేయం ♦ గోరిగాంధి
తిరుగలింగొని దాని♦ద్రిప్పెం బోలకు తోడ, వాడుకగాంబిల్ల ♦ వారితోడ
అపుడప్పుచేసె సా♦యమ్ము కస్తూరిబా, పోలకుసతిచేరె ♦ లీలనవల
బలవంతముగనెట్టి ♦ పనిచేయమని చెప్పకయె పిల్లలందరున్ ♦ గష్టపడుటం

గీ. గన్గొనారోగ్యమందరి ♦ కాయములకు, మానసికముగ నుల్లసిం♦పంగ గనిరి.
నాడుపనిచేయుటకు వెను♦కాడువారు, నలయుపిల్లలు ముందున ♦ కైనలేరు. 236

క. ఇంటిపనింజూడగ నొక, బంటును నియమించి రతను ♦ వసియించె నటం
దంటగఁ దోడ్పడిపిల్లల, జంటగఁ బనులం గుటుంబ ♦ సభ్యులుపోలెన్. 237

క. పాకీపనిమాత్రమ్మా, నౌకరుకుం జెప్పకుండ ♦ నందంబున గాం
ధీ కొడుకులె చూచుకొనిరి, ప్రాకట పాకీలులైరి ♦ పరిశుద్ధిపనిన్. 238

క. అందువలన జోహాన్స్‌బర్గ్, మందిరమున జబ్బులేమ ♦ మందునకైనన్
మందులొసగి పరిచర్యల, నందముగా సేయ బిల్ల ♦ లందరు రుజాలన్, 239

శా. వ్యాధిగ్రస్తుల కిట్లొనర్చుచు సప♦ర్యల్ గాంధి పుత్రుల్ బడిం
బోధింపంబడునట్టివిద్యగరుపం ♦ బోరైరి వారింవనే
బోధింపన్ సమకట్టివెంటఁ గొనిపో♦వుందారి భాషింపుచున్
సాధింపన్దలపోసె వారిచదువుల్ ♦ సంభాషణావైఖరిన్. 210

సీ. ఇందుమూలమ్మున ♦ గాంధినందనులకు, చదువంత రాకుండె ♦ జక్కగాను
అన్యులతో మాట♦లాడుచు సుతులతో, భాషింపగా వీక♦బడియు లేమి
దిన మొకగంటయై♦నను వారికై విని, యోగించియుంచిన ♦ బాగుగానె
ఆదర్శవంతమై♦నట్టి విద్యయెనేర్పి, యుంచునేయని దుఃఖ♦మందె గాంధి.

గీ. ఐననేమాయె నిజమైన ♦ మానవులుగ, తీర్చిదిద్దగ వారిని♦ధీ నిధులుగ
గాంధియత్నించె నెంతైనఁ ♦ గానిపనుల, చేసినన్ వారలది తండ్రి♦దోసమవదు
తప్పుసుతులది జనకులి♦ద్దంది సుమ్ము. 241

క. తలిదండ్రుల వైహికఛా, యలవలె, తద్గుణము సుతుల ♦ కంటును వరుసన్
కలుగగల దింత పరిసర, ముల గుణమా యసలుగుణము ♦ పూర్వీకులదే. 242

ఉ. పిల్లలకాంగిలేయమున ♦ విద్దెలనేర్పిన విశ్వవిస్తృతం
బెల్ల రెరుంగుభాషగుట ♦ నెందు జయంబగునంచుఁ జప్పలన్
బల్లవి పాడుపోలకు స♦మంబగు ధోరణిగాంధి యందుచే
నెల్ల చెడున్ స్వజాతియని ♦ యెంచివచించుచు నుండుకట్టులన్. 243

క. పరభాషాభావమ్ముల, బరువులిడంజేసి పిల్ల ♦ వారి మెదడునన్
పరభాషాపదములనే, గరపినచో దేశమునకు ♦ గలుగుదోసంగున్. 244

సీ. తమబిడ్డలకు భార♦తప్రజలెవరైన, నాంగ్లమందాలోచ♦నాదికములు
కావింప మాటాడఁ గరపబాల్యమునుండి, జాతీయనీతికి ♦ సంస్కృతికిని
దూరులఁగావింత్రు ♦ వారినంచుదలంచి, గాంధిఘూర్జరభాష ♦ గరపెనెపుడు
తనపుత్రకులకెందు ♦ దప్పక నందుచే, మాతృభాషజ్ఞాన ♦ మూతగాగ.

గీ. విజ్ఞులైరి వారెల్లరు ♦ ప్రాజ్ఞులైరి, ఆంగ్లమునగూడ ఆంగ్ల♦మిత్రాళితోడ
నాంగ్లమే ముఖ్యముగమాట♦లాడు దేశ, మందునుంటచే వారిబా♦ల్యమ్మునుండి.

## జూలూ తెగవారి తిరుగుబాటు—1906

వ. తాను జోహాన్సుబర్గున నెలకొంటినని భావించినతరువాతకూడ గాంధికి నిలకడగల జీవితము లభింపదాయెను. కొంతశాంతితో నెమ్మదిగా శ్వాస పీల్చుకొనునంతవ్యవధి కలిగెనో లేదో, అంతలోనే యేనాడు ననుకొనని యొక హఠాత్సంఘటన వాటిల్లెను. నెటాలులోని 'జూలూ'లను, నొక నాటుతెగవారు తిరుగుబాటొనరించిరను వార్తపత్రికలందు ప్రకటింపఁబడెను. జూలూలయెడ గాంధికేలాటి ద్వేషమును లేదు. భారతీయుల కాతెగవారెవ్వరు నేలాటి హానియు జేయలేదు. తిరుగుబాటుఁగూర్చికూడ శంకగల్గెను. కాని, ఆనాటి గాంధి విశ్వశ్రేయస్సుకొరకే బ్రిటిషుసామ్రాజ్యము వర్తిల్లుచుండెనని విశ్వసించియుండెను. నైజమ్ముగా నట్లతనికిగల రాజభక్తి యాతనికా నాటి బ్రిటిషుసామ్రాజ్యమునకేహానియుఁదలపెట్టకుండజేసెను. అందువలన నాతిరుగుబాటుయొక్క న్యాయాన్యాయములఁగూర్చి యతడు తర్కింపలేదు. ఏతర్కము నాటి యతని మనోనిశ్చయమును మార్పజాలదు. ఆనాటి నెటాలున "స్వచ్ఛంధరక్షణ సైనికానీకహము" అను నొక సైనికదళముండెను. క్రొత్తవారందులో నర్హులైనవారందరు జేరవచ్చును. అప్పటికే ఆదళము, తిరుగుబాటు నడపవలయునని సేకరింపఁబడి యుండెను. తాను నెటాలుపౌరుడ ననియు, వలయునెడ, 'ఇండియన్ అంబులెన్సు దళమును' కూర్తుననియు, గాంధి గవర్నరున కొకలేఖ వ్రాసెను. గవర్న రందులకు సమ్మతించెను. 246

క. ఉత్తరమంపకముందే, ఎత్తై మకామందు నుండి ♦ యింతిని ఫోనిక్సు
పత్తనమున కంపెను దన, చిత్తమునకునచ్చ గాంధి ♦ చేసెసకలమున్. 247

సీ. అరిగిడర్బను పురి♦కచ్చట ప్రకటించు,నంత నిర్వాదినల్లు ♦ రభిలషించి
చేరిరిగాంధిని ♦ సేవింపదీక్షతో, క్షతగాత్రులైనట్టి ♦ సైనికులను
నలుగురంపున ఘూర్జ♦రులు పఠానొక్కండు, తదితరులెల్లరు ♦ దాక్షిణాత్యు
లింపరితో చేరె ♦ గాంధితగవుపట్టు, నరయఁ దిరుగుబాట♦నంగ దగిన

గీ. చిన్నెలించుక లేదందు ♦ నెన్నఁగలత, కంతటికి కారణం బింగిలీ♦షాధికార్లు
క్రొత్తగాను విధించిన ♦ క్రూరమైన, పన్ను చెల్లింపరాదని ♦ పలికి 'జూలు'
నాయకుడు గొట్టిపంపె సుం♦కరిని దిరిగి. 248

గీ. తిరిగివచ్చినసుంకరి ♦ తిట్టికొట్టి, పంపిరనియేవొ కొండెముల్ ♦ పలికేదానఁ
జేసి గోరంతకొండంతఁ♦జేసి దొరత,నమ్ము 'జూలూ' తిరుగుబాం♦టనంగదాని.

క. ఇదియంతయుఁ గనగాంధికి, హృదయము నీరయ్యెఁదలచె ♦ నింపారంగన్
మదిసేవింప జూలాలను, గదిసెన్ గార్యాలయంబుఁ ♦ గనదన విధిగన్. 250

గీ. అచటివైద్యాధికారి మోహనునికనియె, నిచటిజూలాలసేవింప ♦ నిచ్చలేదు
తెల్లవారికి గాయముల్ ♦ గ్రుళ్ళుచుండె, దిక్కుదోచదు నీవైనఁ♦జక్కబఱుపు
మనగ గాంధియు సంతోషి♦తాత్ముఁడయ్యె. 251

క. దిక్కెదిలేని వారికి, దిక్కయి కాపాడుదేవ♦దేవుండే మి
మ్మిక్కడకుం జేరిచె నీ, దిక్కెదినవారిబాధఁ ♦ దీర్పందేర్పన్. 252

క. అనిపొగడి గాంధి నాతని, యనుచరుల జూలూలసేవ ♦ కప్పనజేసెన్
తనియఁగడిగి గాయమ్ముల, కనికరమున మందు వేసి ♦ కట్లంగట్టెన్. 253

గీ. గాంధి ననుచరవళిముందు ♦ గనిజూలూలు, సంతసించిరి తెల్లవా♦రింతగాంచి
సంతపించిరి వీరికి ♦ బలుచనల్లదు, సేనలేనియాంగని పల్కు♦చావలిదెస. 254

ఆ. కానిగాంధివారి ♦ కర్ణకఠోర వా,క్కులకుఁ జెవులు మూసి ♦ కోనుచుబెట్టె
వారిక్రూరబుద్ధి ♦ వారుగాఁజేసెఁ బ్రేమామృతముఁ గరగె ♦ నాశలాలి.

సీ. ఆసైనికనికాయ♦మం దధికారులు, మునుగాంధి దెగడిన ♦ జనులె 'స్పార్క్స
వైల్సను'వారలు ♦ వారు మోహనుసేవ, నచ్చెరువునఁగాంచి ♦ మెచ్చిరతని
ఆయధికార్లు ద♦నధిపతియగు మెకం,జియు వృత్తిమై సేనఁ♦జేరలేదు
'వైల్సు'లాయరు,'స్పార్క్స'♦వ్యాపారియు'మెకంజి',వ్యవసాయిగ బ్రసిద్ధి♦నందినాడు

ఆ. గాంధిపరిచరించు ♦ క్షతగాత్రులని గాయ,పడిన వారుగారు ♦ బందియందు
కొట్టబడినవారు ♦ క్రూరంబుగా బొర,పాటువలన గాల్పఁ♦బడినవార. 256

ఆ. గంట్లుగాయములును ♦ గడిగి కట్టులగట్టి, అలజూలాల,కిచ్చె ♦ నౌషధముల
తెల్లసైనికులకు ♦ దెలివిగావను దొంటి, శిక్షణానుభవ వి♦చక్షణమున. 257

చ. అతిత్వరితమ్ముగాఁ జను ప♦దాతిచయమ్మున కంటియుంట శీ
ఘ్రతరముల్ ప్రయాణములఁ ♦ గాల్నడకం గడుదూర మేగుచున్
ప్రతిదినముం జికిత్సలు♦పం బరిచర్యల సేయదేవతా
వ్రతముగనెంచి మోహనుడు ♦ పాటుబడెన్ గడు♦సమ్ముదమ్మునన్. 258

## హృదయ మథనము

గీ. అలజూలూల్ తిప్పబాటు నూ♦త్నానుభవము
మొదటనకు మేలగా గాంధి ♦ యెదమథించె
మున్నుబోయరు యుద్ధానఁ ♦ బొందనట్టి
రణవిపత్తనుభూతి సు♦గ్రాహ్యమయ్యె. 259

క. రణమే; యది? జూలూలను, మనుజులవేటనగ రావో! ♦ మరిమరి కాల్పుల్
వినుచుదయమా [illegible], జనహత్యలు నడుమనుంట ♦ సహనము చెడియెన్.

ఆ. అయిన నెటులొ సహించి ♦ సూచనల్లో 'జూలూ', మనుజసేవకీయ♦కొనియెగాంధి
తానుగాకపరులు ♦ శత్రునిగ కొట్టబడ,రని గ్రహించియాత్మ ♦ వనియనందు.

చ. అదియొకస్వల్ప జానపద ♦ మంతట కొండలు లోయ లందులో
చెదరుగ నచ్చటచ్చట వ♦సించుచునుండి రమాయికుల్ జులూల్
ముదమున గాయపడ్డ జన♦ముల్ భుజపీఠిని మోయుచుంజనన్
పొదలె జనించి పెక్కు తల♦పుల్ మది సద్గుణకంది గాంధికిన్. 262

సీ. బ్రహ్మచర్యముగూర్చి ♦ భావనలుదయించె, దత్కష్టనిష్ఠుర♦తతిఁదలంచె
తోడివారలతోడ ♦ తుదముట్టఁజర్చించె, బ్రహ్మచర్యావస♦రము గురించి
ఆర్తులౌ జనసేవ ♦ కాలుబిడ్డలసేవ, షష్టాష్టకంబని ♦ చక్కనెరిగె
ఆత్మసిద్ధికిఁ దదీ♦యావసరముగూర్చి, యపుడంతగా నాతఁ♦డరయడాత్మ
గీ. భోగిజీవితమందటు ♦ పూర్తిమునిగి, త్యాగజీవితమిటులఁ జే♦యంగనౌనె
కాక బ్రహ్మచారిగఁ గుటుం♦బీకుడుగను, సంఘసేవకుడుగ ఘన♦సాధ్యమౌనె?.

సీ. అనితలపోసి మో♦హను డాత్రపడెబ్రహ్మ, చర్యావలంబన ♦ సల్పుకొరకు
ఆతలపోతలం ♦ దానందహర్షాతి, శయములవధిదాటి ♦ చనియెజాల
ఆతనియార్తసే♦వాధిక విస్తృత, క్షేత్రమ్మునుగురించి ♦ చింతనంబు
ఇంతలోతిరుగుబా ♦ టంతమయ్యెను గాంధి, సేవదొరలు ప్రశం♦సించిరెల్ల
గీ. రరిగె ఫొనిక్సుఁజేర మో♦హనుఁడు బ్రహ్మ, చర్యముంగూర్చి చర్చించె♦ వగనలాలు
మగనలాల్ వెస్టుమున్న గు♦మగలతోడ వారుఁగొనియాడిరదిగొప్ప♦వ్రతమటంచు.
గీ. వ్రతము పూనుట లగ్గని ♦ వలికిరెల్ల, రైనఁదత్కష్టనిష్ఠుర ♦ మరసిరెల్ల
అందుఁగొందరు పూనొ్కని ♦ రనుసరింప, నింకనుంగొంద రెట్టులో♦నింకిరందు.
క. వెనుదీయకప్పుడే మో,హనుడుం దనజీవితాంత ♦ మవలంబింపన్
గొనె శపథము పరమాత్ముని, మనమున ధ్యానించి మూడు♦మారులు భక్తిన్.
క. శపథంబిట్లాతఁడు గొను, నపుడెరుగడు దానిమహిమ ♦ నాధిక్యమ్మున్
విపులముగ దానిపరుషత, నెపుడు న్వ్వన్నంటియుండె ♦ నెపుడున్ గాంధిన్. 267
ఆ. అనుదినాచరణము♦నం దధికాధికా, సాధ్యమెన్న బ్రహ్మ♦చర్యమరయ
బ్రహ్మచారిగాక ♦ బ్రతుకునిస్సారమౌ, పశువుఁబ్రతుకు బ్రతుకు ♦ పగిదిపొగులు.
గీ. జంతువు లెరుంగవింత నై♦జముగనాత్మ, నిగ్రహంబిట్టిదంచు దా♦నింగ్రహించి
యాత్మనిగ్రహమెంత ను♦న్నంతవరకె, మానవుడుమానవుడొరుంచు♦దానవుండె.
క. మనగ్రంథములం దంతట, ఘనధర్మము బ్రహ్మచర్య ♦ గౌరవమందన్
వినుతించు టతిశయోక్తిగ, మనుదలఁచుట తప్పటంచు ♦ మోహనుడెరిగెన్.
క. ఘనతమము బ్రహ్మచర్యము, మనధర్మములం దటంచు ♦ మనపెద్దలు వ
ల్కిన ధృచితమ్మనుభవ సం,జనితమ్మని యెరిగెగాంధి ♦ స్వానుభవమునన్. 271
గీ. బ్రహ్మచర్యముచే సిద్ధిఁ ♦ బడయగోరఁ, జాలదొక్క శారీరక ♦ సంయమనము
స్వప్నముననైన సద్బ్రహ్మ ♦ చారిగోర, డెట్టిరాగభోగమ్ముల ♦ హృదయమందు

ద్వి. శారీరకబ్రహ్మ♦చర్యమే గాంధి, కారంభమున గష్ట♦పూరితమ్మయ్యె. 273
మేనిజయమ్మెట్లొ ♦ మెల్లగా బొందె, నైనను నోజయం ♦ బంతరాలేదు
ఎంతజాగ్రత నున్న ♦ నేతెంచునెట్లొ, వింతగాఁజెడుభావ ♦ విషవహ్నులకట!
చెడుతలంపులనెల్ల ♦ వెడలించి పూర్తి, నెడదతలుపు మూయు♦కడిదికాళంబు
ప్రతిమానవుడు స్వాను♦భవభాగ్యగరిమ, సతముసాధింపగా♦శ్రమియింప వలయు
మునులు మహర్షులు ♦ మునుతాముగన్న, యనుభూతి సంపద♦మనకిడి రెంతొ
అదియు విశ్వజనీన♦మై యమోఘమగు, నదిగాదు; పరిపూర్ణ♦మగునట్టి పదము
భగవదనుగ్రహ ♦ ఫలమొండె; కాన, భగవదన్వేషక ♦ భక్తులుస్వీయ
తపజపమ్ములఁ బవి♦త్రమ్ముగావించి; అపురూపరామ నా♦మాది మంత్రముల
మనకిడిపోయిరా ♦ మంత్రజపమ్ము, ననినమ్మికావించు ♦ చఖిలేశు శరణు
మునుకొని సంపూర్ణ♦ముగ జొచ్చకుండ, అనయంబు బ్రహ్మచ♦ర్యముశక్యమవదు
తలపులనోర్వ సా♦ధ్యముగాదు వేద,ములుమున్నగునవెల్ల♦తెలుపునీ నీతి
సంపూర్ణమగు బ్రహ్మ♦చర్యమ్ము నిర్వ,హింపగా దానొన♦రించు యత్నమున
తెలియంగవచ్చె గాం♦ధికి వేదవాక్కు, బలము సత్యంబని ♦ ప్రతినిమేమమ్ము
సతితోడనొకశయ్య♦శయనించుటాపె,రతినిల్పుటయె గాంధి♦ప్రథమమహామార్పు.

వ. ఇట్లు గాంధి 1900 నుండి యిట్లట్లు సాగివచ్చుచున్న తన బ్రహ్మచర్యాచరణము 1906 వ సంవత్సరమున భార్యాసంగమవిసర్జనతో వ్రతరూపమున దృఢీకరించెను.

## సత్యాగ్రహోదయం—1907

సీ. బ్రహ్మచర్యావలం♦బన మందు గాంధియొ,నర్చాత్మశుద్ధి స♦త్యాగ్రహమున
కాద్యమ్ముగాగ జో♦హాన్సుబర్గున గొన్ని,సంఘటనలవియొ ♦ సంభవించె
బ్రహ్మచర్యావలం ♦ బనకుగారణమాచు, ప్రఖ్యాతిగన్న సం♦భవములెల్ల
సత్యాగ్రహముపైపు ♦ సాగిపోజేసె మో,హను డెరుంగని రహ♦స్యంపు పథిని
గీ. పుడమిసత్యాగ్రహాఖ్యయే♦ర్పడకముందె,తదనుగుణమైనమూలత♦త్వమ్ము పుట్టె
నదియెఱుంగడొకింత మో♦హనుడు నాడు, దానిపేరెట్టులెఱుగునా♦తండు నాడు.
ఆ. అతనిమాతృభాష ♦ యగుఘూర్జరమునను, దీనినొరులెఱుంగ ♦ దెల్పనపుడు
వర్ణనమ్మొనర్చె ♦ "పాసివ్ రెసిస్టంచు", ఆంగ్లభాషపదము ♦ లాశ్రయించె. 289
సీ. అయిననాతడొకప్పు♦డైరోపియనులతో, కలిసి చర్చించుచోఁ ♦ దెలియఁగలిగె
'పాసివ్ రెసిస్టను' ♦ పదముసంకుచితార్థ, వాచియటంచు దు♦ర్బలులచేతి
ఆయుధంబనియు ద్వే♦షానలమయమునై, హింసకుదారిఁ జూ♦పించునంచు
భారతీయోద్యమ ♦ భావార్థవాచిగా, నేరదీనుడియంచు ♦ నేర్చి గాంధి
ఆ. అందుకుఁదగిన పద♦మునయ నూతనముగా, యోచనమ్మదెంత ♦ యోయొనర్చి
పత్రికఁబ్రకటించె ♦ బహుమానముచిత ప,దంబుఁ దెలుపు ప్రాజ్ఞ♦తమునకీయ.

క. ఇది తెలిసి మగనలాలును, 'సదాగ్రహ'మనెడు వినూత్న ♦ శబ్దమొకండుఁ
విదితముగాఁ గల్పించెను, పదిలముగాఁ గొనెనొకండె ♦ బహుమానమ్ముఁ.

గీ. ఆసదాగ్రహపదమె స♦త్యాగ్రహముగ, గాంధిమార్చెనప్పటినుండి♦క్రాలెనతని
శాంతి సంగ్రామనామమై ♦ సంతతంబు, సర్వభాషల నీప్రపం♦చమున నెల్ల. 292

ఆ. ఇట్టిశాంతిసంగ్ర ♦ రేతిహాసమె గాంధి, సత్యశోధనముల ♦ చరితమరియు
నతనిదక్షి♦ణాఫ్రికా జీవిత. గాథయగుఁ దాని♦గాంధివ్రాసె
యరవాడజైలు ♦ నందున్న పుడుచాల, విడుదలైనపిదప ♦ కడమదెల్ల
అదియు వెలసెదక్షి♦ణాఫ్రికా సత్యాగ్ర, హేతిహాస మనగ ♦ ఖ్యాతిగాంచె.

ఆహారసంబంధమైన మరికొన్ని సాధనలు

సీ. త్రికరణమ్ములవర్ణి ♦ దీక్ష పాలింప స, త్యాగ్రహసమరార్థ ♦ మర్పణమ్మొ
నర్పగా దనకాల ♦ మధికంబుగ గడింప, నందుకర్హత శుద్ధ♦మైన మనికి
నందునాహార ని♦యమపాలనమున మా, ర్పులు చేసె మరికొన్ని ♦ మోహనుండు
తొల్లినారోగ్యార్థ♦మెల్ల మార్పులొనర్చె, క్రొత్తవిధర్మము ♦ కొరకొనర్చె

గీ. పస్తులుండుట; యాహార ♦ పథ్యమంట, నతనిజీవితమం దిప్పు ♦ డధికమయ్యె
ఇంద్రియమ్ముల చాపల్య♦మెల్లజిహ్వ, చిలిపి చాపల్యముంబట్టి♦ చెలగుచుంట.

సీ. జిహ్వాకేంద్రియముల ♦ చిచ్చుడగింపఁ జే, సిన యత్నములనెన్నొ ♦ చిక్కులొదవె
నైన నింకను బూర్ణ♦మగు విజయమ్మంద, లేదంచు గాంధిప♦ల్కెను సతమ్ము
అతడునైజంబుగా ♦ నతిభోజియౌటచే, కడుపుకక్కురితెల్ల ♦ నడచెముందె
లేకున్న బశువుల ♦ లీలదుర్గతిపాలు, నైయుందునెప్పుడో ♦ యంచుబల్కె

ఆ. తనకుఁదెలిసియుంట ♦ తనలోపములు; వానిఁ, దగ్గఁజేసె మంచి♦ చెలిమి కలిమి
కష్టపడుచు గోక♦లాష్ట మేకాదశి, నుపవసించి ఫలము♦లొండె తినుచు. 295

క. ఫలముల తిండికిఁ దినుగిం,జల తిండికి నిగ్రహప్ర♦సాదపరీక్షన్
పొలయమి ఖేదమ్మంతగ, సెలవులనేకాన్న ముపవ♦సించుట జరగెన్, 296

ఆ. ఇందువలన దేహ♦మెంతయో నిర్మల, మగుచు రుచియుఁ బచియు ♦ నతిశయించె
ననుభవమున దోచెఁ ♦ ద్యాగభోగములకు, పస్తులుంట రెంటఁ ♦ బనికివచ్చు
నంచు నన్యజనుల ♦ యనుభవమ్ములుగూడ, తెలిపె నీవిషయమె♦ తెల్లముగను.

సీ. తనమేని వృద్ధిగో♦రినవాడ యైనను, సంయమనము నాల్క♦చవి జయమ్ము
మభ్యాసయముఁలొట ♦ మోహను డాహార ములు మార్చెఁబల్మారు♦భోజనమును
తిండిప్రమాణంబు ♦ దివరితగ్గించె నై, నను నోరుచవులూరు ♦ టణగదయ్యె
ఒకనాటితిండి మ♦రొకనాడు తినకుండ, పలుమారుమార్పులు ♦ సలుపుకతన

ఆ. మునుపు తిండికన్న ♦ వెనుకటితిండియే, అధికముగ రుచించె ♦ నతనికిట్టి
ఆశనశోధనముల ♦ హారమాఁ కెల్ల వేకు, చాలనెచ్చెలియయి♦సహకరించె. 298

ఆ. అతనిగూర్చి దక్షి♦ణాఫ్రికా సత్యాగ్ర,హేతిహాసమందు ♦ నెప్పుడుపన్య
సించుటందు మార్పు♦చేయుటకనమందు, తనకు సాయమయ్యె ♦ ననియె గాంధి
సీ. సౌతాఫ్రికాయందు ♦ సత్యాగ్రహమ్ముచే, దశనుండినప్పు డా♦తనిగృహమున.
విడిసి యాతనితోడ ♦ విరివిగాఁ బిండిమా,ర్పులగూర్చి చర్చించి ♦ రుచులమరిగె
ఆనాటిచర్చలం ♦ దానంద మొందెమో, హానుభైన ననుభవ♦మందెరింగె
తిండిరుచుల గూర్చి ♦ తివిరిచర్చించుట, తనబోంట్ల కెప్పుడుఁ ♦ దగదటంచు
ఆ. దేహధారణార్థ ♦ మాహారమేకాని, కాదు నాల్కతృప్తి♦కై భుజించు
టింద్రియమ్ములెల్ల ♦ నేర్పాటుగామేని, కొరకు మేను నాత్మ♦దరిసెనార్థ
మే శ్రమింప రుచుల♦మిడిసి పాటడగి స్వా,భావికముగ నాల్క ♦ పరగుచుండు.
క. స్వాభావిక రూపమ్మటు, లాభించుట కొరకొనర్పు ♦ లక్షలు చేతల్
శోభించునైన నోటిప్ర,లోభమ్మెడురీత జేసె ♦ లోకమునకటా. 301
క. నేడో రేపో మృత్యుం, బాడగునీ యొడలిమనుచుఁ ♦ బశువులనునికిఁ
పాడొనరింపగ సిగ్గున, నోడముగద; మడియుచున్న ♦ నొడలు నెడదయున్.
ఆ. వ్యాకఫేరొంతు ప్రాత♦పడచు యత్నమ్మున, వంతలుగను క్రొత్త♦వ్యాధులబ్బు
ఇంద్రియముల సౌఖ్య ♦ మినుమడింప నొనర్చు, జతనమునసుఖించు♦శక్తియుడగు.
ఆ. ఇంతపట్టుకంటె ♦ కెదురుగా సతతంబు, జరుగుచున్ననకట! ♦ యెరుగమింత
కన్నులుండి కన్న♦గానని వారల, కన్నసంధులుండ్రె ♦ క్ష్మాతలమున!. 304

కస్తూరిభాయి ధైర్యము

సీ. గాంధి సతీమణి ♦ కస్తూరి గృహచికి,త్సల దాటె ముమ్మారు ♦ చావునుండి
సత్యాగ్రహమునాడు ♦ జరుగుచుండెను మొద,లామె రక్తస్రావ♦మడచినపుడు
వైద్యమిత్రుసలహా ♦ పాటించి శస్త్రచి,కిత్సకు గురియయ్యె ♦ గృశతనుండి
విడిచియామెను వైద్యు♦కడ డర్బనున జో,హాన్సుబర్గునకు మో♦హనుడుపోయె
ఆ. బలమొకింతలేమిఁ ♦ దెలివిదప్పె నొకప్డు, గోవుమాంససార ♦ మీవలయు న
టంచుఁ దంతివచ్చె ♦ డాక్టరునుండి మో,హానున కిన్నిదినము ♦ లరిగెనంత.305
సీ. ఈయజాలననుజ్ఞ ♦ నే నిందుకైన నా,యింతియిష్టపడిన ♦ నిమ్మటంచు
బదులిడగాగాంధి ♦ వైద్యుడందుల కట్టు,లైన నీవే రమ్మ♦టంచువ్రాసె
వెనువెంటనే గాంధి♦చనియె డర్బనునకు, కలసెవైద్యునతఁడు ♦ గాంధి కనియె
తంతినీకిచ్చిన ♦ తరుణమందే నీదు,సతికిచ్చి తావుమాం♦స రసమంచు
గీ. అక్కటా! మోసమాయెనం♦చడలెగాంధి, మందుమ్రాకులమోసమర్మ♦మాటలేదు
వాస్తవమ్ముగరోగ ని♦వారణార్థ, మేమరించుట నెల్లర ♦ నెంతు మేము
వైద్యులము సద్గుణమ్మగు ♦ బాధ్యతగను. 306

చ. అదివిని నొచ్చిగాంధి మది♦నైనను మౌనము బూనె డాక్టరున్
సదయుడు మిత్రుడాతడును ♦ సమ్మతినాతని పత్నియున్ బ్రియం
బొదవగ వైద్యసేవ దని♦వొందగ గాంధి కొనర్చియుంటఁ దా
మదిఁగినుకన్వహింపకయె ♦ మాటల మంచితనాన నిట్లనెన్. 307

క. వినుమా డాక్టరుమిత్రమ, చనిపోవునుగాక నాదు♦సతికే నీ నో
ల్లను గోమాంసమ్మామెయె, తినగోరిన నిమ్మునాదు ♦ దీక్షయిదౌటన్. 308

క. నీ నియమమున నీయిష్ట,మ్మైనయెడల నిచటనుండి ♦ యామెను గొనిపో
మ్మా నేనామెను జూడగ, లేనిట మరణించుటకట! ♦ లెమ్మావేగన్. 309

సీ. అనివల్క డాక్టరు ♦ వినిగాంధి యామెను, దరలింపమందువే ♦ తక్షణంబె!
అనగనే నెపుడంటి ♦ నామెను దరలింపు, మని? నేనుఁగోరిన ♦ దరయుమింత
ఔషధాహార ప♦థ్యములందు నాకు స్వా,తంత్ర్యముండగ సమ్మ♦తంబెనీకు ?
అటులైననేను నా♦యతిశక్తి కొలంది, సేవచేతుమునీవు ♦ చింతిలకుము
ఆ. ఇట్టిచిన్నివిషయ ♦ మెరుగలేకున్నచో, మాగృహమ్మునుండి ♦ నీగృహిణిని
దీసికొనిచనమనఁ జేసెదంతెయటంచు, పలికె డాక్టరెంతొ ♦ పరుషముగను.

సీ. అంతగాంధియు దన♦యంతికమందున్న, తనయుండునుం దన♦తల్లి కావు
మాంసమిగూడ దం♦చనగ నామెకదెల్ల, దెలుపనామెయు నిట్లు ♦ బలికెబతిక
"గోమాంస సారమే ♦ నేమాత్రమును గొన,నర జన్మమీధర♦నరిదియగుట
పతిదైవమైన మీ♦పావన హస్తమ్ము,లందు ప్రాణమువీడ ♦ నభిలషింతు
గీ. కాని దూష్యాశనమున నీ♦మేను పతిత,మగుట నొర్వగజాల నే♦మైన నన్ను
వేగమేతరలింపు డీ♦విడిదినుండి", అనుచు మోహానుడెంత చె♦ప్పినను వినక.

మం. ఇంతయుడాక్టరు ♦ కెరిగింపగాంధి, చింతించియతడిట్లు ♦ ఛీత్కారమెసగ
ఎంతనిర్దయుడవీ ♦ వింతయాసతికి, సంతానసిగ్గేది ♦ పల్కగానకట!
తరలింప బడుటామె ♦ దగదిట్టి స్థితిని, కరమొకింతయునాపె ♦ గదలింపనోప
వచ్చెరుసందనే ♦ దారిలోనామె, చచ్చిననైన మాం♦సరస మీకున్న
నాయింట జనమొకం♦డైనను నామె, ఈ యపాయస్థితి ♦ నీ కొననుండ
నవవెంటనే యామె ♦ నటనుండి గొనియు, జననిర్ణయించిరి♦జనకుండుఁగొడుకు.

క. చినుకులు బడుచుండెను స్టేషను దవ్వననుండె ప్రొయిను ♦ జనఫోనిక్స్ డ
ర్బనునుండి యందుకొనవల,యును రెండున్నరమయిళ్ళు ♦ వోవగవలయున్.

వ. అంత ప్రయాసముతోటి దూరప్రయాణ మాచరించుటయు, నా పయనమం
దన్నిమార్పులతో రోగితోజనుటయు, నిశ్చయముగా నపాయకరమైన ప్రయా
ణమే అయినను గాంధి భగవంతునిపైననే భారముంచి ముందునకు సాగెను.
ఫోనిక్స్ క్షేత్రముననున్న 'వెస్టు'కు; దమ ప్రయాణవిషయముఁగూర్చి వార్తఁ

బంపెను. ఫోనిక్సుస్టేషను కొకఉయ్యాలపెట్టెను, దానియందు కస్తూరిబాయిని మోయుట కొఱకు కార్మికులను, వేడినీటిబుడ్డిని, వేడిపాలబుడ్డిని వేర్వేరుగా వెంటతీసుకొని వెస్టును ఫోనిక్సుస్టేషనుకు రమ్మని కబురంపెను, రిక్షాబండిలో డర్బనుస్టేషనుకును, స్టేషనులోని ఆవరణనుండి పొగబండి పెట్టెలోనికిఁ దన చేతులమీదను, కస్తూరిబాయిని గాంధియే చేర్చెను. ఫోనిక్సు స్టేషనునుండి ఫోనిక్సుక్షేత్రమునకు, 'వెస్టు'కొనివచ్చిన ఉయ్యాలపెట్టియం దామెను గొని పోయిరి. అం దామె మృజ్జలచికిత్సాసహాయమున గ్రమముగాఁ గడతేరి పునరారోగ్యవంతురా లయ్యెను. 319

ఆ. అలసి సొలసిదేహ ♦ మస్థిపంజరమట్టు, లున్నఁజాలకాల ♦ మన్నమింత
లేమిఁజిక్కియున్న ♦ లేమ కస్తురిభాయి, భర్తకెంతొ ధీర ♦ వాక్కుఁబలికె.

క. "మీరేల కలతపడెదరు, శ్రీరాముండుండ గావఁ ♦ జిక్కుఁలఁబాపన్
ఆరాముడె నను గావఁగ, నారోగ్యముఁగో; విపత్తు ♦ కలదే నాకున్? 321

గీ. గుండెనిండుగ శ్రీరాము ♦ డుండనే య, పాయముండును; శోకము ♦ హాయిగాను
మనగృహమ్మును జేరద ♦ మనుచుమగని, కలతదేర్చెను గస్తూరి ♦ వెలితిపడక.

సీ. ఫోనిక్సు చేరిన ♦ మూణాళ్ళకావల, వచ్చెగాంధి కడకు ♦ స్వామి యొకడు
"మతవిరుద్ధముగాదు ♦ మాంసమ్ము దినుటెంత, మనుస్మృతమ్మిది" ♦ యనుచుబల్కె
నైనను మోహను ♦ నాత్మజుల్ మణిలాలు, రామదాసుండును ♦ స్వామిపల్కు
ఆచరింపకపోయి ♦ రబలయయ్యును గస్తురీ భాయి స్వామికే ♦ రీతిఁబల్కె

గీ. "స్వామిజీ మీరె యీరీతిఁ ♦ బల్కఁదగునె, సాంప్రదాయముగాదు, వం ♦ శాపచార
మెట్టిమాంసముదింట మా ♦ యింటనొంట, లేనివిక చాలుమీబోధ ♦ లెందుపొండు.

క. ఏమైనగాని నేనా, గోమాంసము చేతఁదేరఁ ♦ గోరనుస్వామీ?
మామత నేమస్మిదిమీ, రేమాత్రము బలుకఁగూడ ♦ దీవిషయమునన్. 323

ఆ. వలయునెడల నాడు ♦ వల్లభుం బిల్లల, వాదమునకు బిలువు ♦ డేవొవారు
పలుకువారు మీరు ♦ బదులాడుడికమాదు, తీరుమానమునకు ♦ తిరుగులేదు.

## గృహసత్యాగ్రహం — 1908

క. అదిపందొమ్మిదినూటె. న్మిదివత్సరమందు గాంధి ♦ నిలువఁగవలసెన్
మొదటి జెయిలువాసమ్మున, తదనుభవమ్మొసగె గొన్ని ♦ తప్పని నిష్ఠల్. 325

ఆ. బందివాసమందు ♦ నందరుతప్పక, అనుసరింపవలయు ♦ నట్టినియమ
నియతిబ్రహ్మచారి ♦ నిష్ఠననుసరించు, నట్టియాత్మనిగ్ర ♦ హమును బోల్చు. 326

సీ. అస్త్రాద్రిభాస్కరుం ♦ డడుగిడకుండనె, తినవలెరేయి భో ♦ జనమటంచు
భారతీయాఫ్రికా ♦ బందీలకెవరికీ, బడవు టీకాఫీ లె ♦ ప్పుడు నటంచు

ఉప్పుకారములేని ♦ చప్పనితిండినే, తినవలయును మీరు ♦ తినమటంచు
చవులూరఁజేసెడు ♦ షడ్రసోపేత భోజనమిందు దొరకదు ♦ తనియనంచు
గీ. జెయిలుప్రభులువిధించిరి♦నియతులెన్నొ అన్నియును బ్రహ్మచారిని♦యమములగుట
కష్టమంతగలేకుండె ♦ గాంధికవ్వి. బందిపిమ్మట ననుసరిం♦పంగఁ బూనె. 327

ఆ. భోజనమ్మొనర్చు ♦ ప్రొద్దుగ్రుంకకముందె, రోజు కాఫి టీల ♦ రోసె బాసె
ఉప్పుదినుటగూడ ♦ నుడిగెగాంధి యొకప్పు, డుండెనటుపదేండ్లు ♦ నుక్కుచెడక.

క. ఎదియో శాకాహార, ప్రథితగ్రంథమున నుప్పు ♦ బడనియశనమే
విదితనరభోజనమ్మని, చదివె నిరామయదమనుచు ♦ జక్కగనతడున్. 329

చ. లవణము లేని యన్నము సులక్షణమైతగు లక్ష్యశుద్ధికై
భువినిటు బ్రహ్మచారికిఁ దపోనిధులైన మునీంద్రకోటికిన్
ప్రవిమల దుర్బలాంగులకు ♦ పప్పులుగూడ సహింపవంచు ప్రా
భవపఠనమ్మొనర్చెఁ గడు♦భక్తి నెరింగెను గాంధి సర్వమున్. 330

గీ. ఆపరేషననంతర ♦ మల్లతిరిగి, సంభవించె రక్తస్రావ ♦ జృంభణంబు
జలచికిత్సాప్రయోగంబు ♦ విలువలేని, దయ్యె విశ్వాసముంజెడె♦నామెకందు.

సీ. మోహనుఁడంతట ♦ ముదితకస్తురిబాయి, కనియెనీరీతిని ♦ గనికరమున
ఉప్పుపప్పులులేని ♦ చప్పనియన్నంబు. తినుము కొన్నిదినాలు ♦ గుణముగలుగు
ననినీవునట్టులం ♦ దినజాలవనిదెప్ప, నొచ్చిమోహనుడనె ♦ మచ్చికమెయి
ఉండెదొక్కేడునే ♦ నుప్పుపప్పులు దిన,కుండ నీవునునట్టు ♦ లుండుమతివ
గీ. నిలిచిపోవు రక్తస్రావ♦మలయకుండ, ఔషధములఁ బథ్యములనంచు♦నాదరమున
నయభయమ్ముల దెల్పియ♦ట్లాచరింప, చేసెసతికి గుణంబొప్ప ♦ శీఘ్రగతుల. 332

క. ఇది సత్యాగ్రహజయముల, మొదటిది తన భార్యరోగ♦ముం బాపియు నిం
పొదవించుటచే వెలసెన్, సదమలముగ నిద్దిగేహ ♦ సత్యాగ్రహమై. 333

క. ఇయ్యదతని జీవితమున, తియ్యనితలపులను మదికి ♦ దెచ్చెడువిషయం
బయ్యెన్ గాంధికి ప్రియసతి, కియ్యదనున గలిగె మనసు ♦ కింపున్ బెంపున్. 334

క. తదనంతర మాసతినిన్, వదలెను తద్వ్యాధియెల్ల ♦ వడి జప్పిడితిం
డిఁదినుటవలననొ కలిగిన, హృదయానందముననో వి♦రించికె తెలియన్. 335

గీ. నూతనాహార నిగ్రహ♦నీతివలన, గాంధికొదవెను శారీరి♦కాభ్యుదయము
వదలిపెట్టినవానిపై ♦ వాంఛనిడక, గడపె నొకయేడు విషయాబ్ధి♦బడకచెడక.

ఆ. ఈప్రయోగమున జి♦తేంద్రియత మరింత, గలుగనొదవె కౌతు♦కము మరింత
ఆత్మనిగ్రహమున ♦ నటుపిమ్మటొకపరి, లవణభుక్తి విడిచె ♦ లండనందు. 337

ఆ. ఉప్పుపప్పులేని ♦ చప్పిడియాహార, పథ్యమిడియెఁ దోడి♦పరిజనమ్ము
పైనగల్గెమంచి ♦ ఫలితమ్ముగాంధికి, దక్షిణాఫ్రికందు ♦ దక్కకీర్తి. 338

క. భిన్నాభిప్రాయమ్ముల, వెన్నైన నన్నుండవచ్చు ♦ నిలవైద్యాలయం
దిన్నవ పథ్యముపై నయి, నన్నియతిన్ననుట మంచి♦యగు నాత్మకిదిగా. 339

గీ. ఆత్మసంయమి యాహార♦మల్లనైన్, జీవి తిండికి భిన్నమై ♦ చెలగుసతము
వారిజీవనపథములు ♦ వేరుగాన, బ్రహ్మచారికి భుక్తిపం♦త్ఫలము గలుగు. 340

క. ఆనందమె పరమావధి, గానిలమును మనుజునుచిత ♦ కలమధురాన్నం
బౌనొక్క బ్రహ్మచారిగ, మానిగమను వానికుచిత ♦ మధురాన్నంబుల్. 341

ఆత్మనిగ్రహమువైపు

సీ. కస్తూరిబాయి రో♦గముకతమ్మునమారె, గాంధి యాహార వై♦ఖరులుకొన్ని
బ్రహ్మచర్యప్రతి ♦ పాదకమ్ముగ గొన్ని, చేర్పులుమార్పులుం ♦ జేయఁబడియె
మొదటివందునఁ బాలు♦వదలుట రాయిచం, దద్దికామోద్రేకి ♦ యనుటకతన
కలకత్తలోఁబశు♦వుల హింసచేఁ బాలు,పిండుదు రనిచాల ♦ వినుటకతన

ఆ. పాలువదల దలచి ♦ పారమార్థికవృష్టి, వాడటంచు దనకుఁ ♦ బరిచయమ్ము
చేయఁబడిన ఖాను♦స్నేహితుఁడగు 'కలెన్, బాకి' నడిగె గాంధి♦పాలఁగూర్చి.

సీ. అతఁడు భోగవిలాస♦మతియాటగని గాంధి, చెందెవిభ్రాంతిః జె♦చ్చెరనతండు
మతవిషయములపై ♦ మరిమరి ప్రశ్నించి, చర్చించుచునుగాంధి♦సఖుఁడునయ్యె
క్రమముగా నిరువురి ♦ గతులొక్కటియగాగ, కలనివేసుతలంచె ♦ గాంధిరీతి
బ్రదుక నిరాడంబ♦రముగ జీవితవిధా,నమ్మున మార్పులొ♦నర్చె నెన్నొ

ఆ. వేయిరెండునూర్లు ♦ వెచ్చించుమానిసి, పదియురెండు పదులఁ♦బడసెదృప్తి
మాసమొక్కటికి వి♦లాసలాలసదృష్టి, వీడి గాంధితోడ ♦ విడిసెమనికి. 343

క. ఈలీలవార లిర్వురు, కాలమటులఁ గడుపునపుడు ♦ కాలెన్బకే
పాలచెడుగుణము పలికెద,మేలా విడరాదు పాల♦నిపుడని పలికెన్. 344

గీ. గాంధియాశ్చర్యపూర్వకా♦నంద మెసఁగ, పల్కెనీపల్కు మోఘమిా♦పాలఁగ్రోలు
టేలవీడుద మిప్పుడ♦యింక నెపుడు, గ్రోలమంచును బాసను♦గొందమిపుడ.

క. అనఁగా లెను బెకును 'సరి', యనె నిర్వురు బాలుగ్రోలు♦టచ్చట నేయా
దినమందే విడనాడఁ బ్ర,తినగొనెనా మిత్రయుగము ♦ తృప్తియెసంగన్. 341

ఆ. గాంధి దీనితోడ ♦ గనక సంతృప్తికే,వలము వేదజనుల♦వలె ఫలమ్ము
లొండెచొకగాను ♦ నున్నవానింగొని, తినుచుసఖునితోడ ♦ మనగగోరె. 347

మం. వండగా నవసర ♦ ముండవొకింత, తిండికిఫలములఁ ♦ దినసంచు బచ్చి
వగు వేరుశనిగలు ♦ నరటిఖర్జూర, ఫలములు నిమ్మకా♦యలు మున్నగునవి
ఆలివునూనె మా♦మూలు భోజనము,గా స్వీకరించెను ♦ గాంధిసంప్రీతి. 359

గీ. బ్రహ్మచర్యము బాటించు♦వారల శివ,నియమ మొందుపాటించుటం♦దృప్తివడక
నిర్మలమనస్కులై యుంట ♦ నీతిజగతి. 351

క. తెలిసియు మలినమనమ్ములు, కలవారుపవాసముండఁ ♦ గలిగినమాత్రం
బలవడునేవారికి నిర్మలమన మాహారఫలిత ♦ మాత్రమ్మున్నే. 352

గీ. సంతతముద్విగ్నమగునాత్మ ♦ చింతనమున, 'అన్యథాశరణంనాస్తి' ♦ యనుచు రాము
శరణుజొచ్చుటవలనఁ ద♦త్కరుణవలన, గాని నిర్మలమన మెట్లు♦గలుగు జగతి.

సీ. కలదుమనోదేహ ♦ ములకు సంబంధంబు, కలమాన్నములె కోరు♦కలుషితమతి
కలుషితమగు మనో♦క్షాళనార్థమ్ముప,వాసాదులుండంగ♦వలయు నైహి
కాసక్తమన మింద్రి♦యములనిగ్రహమిాక, బదులువానికె యది♦బానిసగుట
వలయు మేనికి నుప♦వాసముల్ దరుచు శు,ద్ధాహారమిడుటగ♦త్యమ్ముసతము

ఆ. అలసదృష్టికూడ ♦ దఖిలదృష్టియుఁగూడ, దశననియతి యెడఁ♦వాత్మనిగ్ర
హమ్ము పెంపుగాంచు ♦ నాహారనియమోప, వాసదీక్షనంచుఁ ♦ బలికెగాంధి.

గీ. నియమితాహారములఁ గొన♦నేరకున్న, ఉపవసింపక తరుచును ♦ సంన్నమనము
క్షాళితము గాదని వ్యభి♦చారభావ, నిచయమడచి ముమ్మాటికి♦నిజమునిజము.

పస్తు-ఉపవాస దీక్ష

సీ. తృణధాన్యముల, పాల♦తిండిమాని ఫలమ్ము,లశనమారంభించి♦నపుడెగాంధి
ఆత్మనిగ్రహమున♦కై మొదలిడె నుప,వాసవ్రతముకలెన్ ♦ బాకుతోడ
వైష్ణవకులమందు ♦ వ్రతదీక్షదక్షురా,లైన మాతకుజన్మ♦మంది మనుట
ఇండియాలోనుండ ♦ నేకాదశీత్యాదు, లందు పస్తుండు ట♦భ్యాసమగుట

గీ. మిత్రబోధలఁ బస్తుల ♦ మేలెరింగి, పాలుపండ్లను దినకయే ♦ పస్తులుండె
నీరుమాత్రము ద్రావుచు ♦ నీలినాత్మ, నిగ్రహార్థమే కావశి ♦ నింబవర్తి. 367

క. ఈరీతినుపవసింపగ, నారంభమ్మతడొనర్చి ♦ నప్పుడొకటిగా
ప్రారంభమయ్యె శ్రావణ, మారంజాక్ కలిసి గాంధి ♦ యానందించెన్. 358

గీ. శైవ వైష్ణవ వ్రతముల ♦ దేవతలను, గొల్చెంచిరి గాంధీలు ♦ కనుకగాంధి
శ్రావణమునఁ బ్రదోషదీ♦క్షావలంబు, డయ్యెదదితర బాంధవు ♦ లట్లుఁదాను.

గీ. ఈప్రధాన ప్రయోగమ్ము ♦ లెల్ల గాంధి, చేసెఁదొల్లిని టాల్స్టాయి♦క్షేత్రమందు
'కలెనుబేకుతో' నివసించు♦కాలమందు, కలిసిసత్యాగ్రహకుటుంబ♦ములనుగొన్ని.

ఆ. అందునాలుగైదు ♦ మంది ముస్లిములు'న, మాజు'మొదలగుదమ♦మతగతులను
అనుసరింపఁజేసె ♦ నంచరగాంధి నిత్యమ్మైనర్పైనన్లై ♦ దదితరులను. 361

మం. మహమదీయులనుర♦మ్జానుమాసమున, ఉపవాసముండమం♦చుపదేశమొసఁగె
గాంధి క్రైస్తవపార్సి ♦ హైందవసఖుల, దనతోప్రదోషమ్ము ♦ ననుసరింపంగ
నేర్పారబోధించె ♦ నిగ్రహవిషయ,మందు సన్న్యులఁజేర ♦ మంచిదటంచు
ప్రొద్దుగ్రుంకినమిాద ♦ భుజియించు మహమ,దీయసోదరులకు ♦ దియ్యనిపంట
లొనరించిరెల్ల ర♦న్యులు ప్రియమార, నీప్రయోగములచే ♦ నెల్లరెరింగి

రుపవాసగుణంబు ♦ విపులమ్ముగాను, అందరిలోనఁ బెం♦పొందెనందముగ
సోదరభావము ♦ సురుచిరముగను, అందెల్ల వారు శా♦కాహారులగుట
తనకనుకూలించిదిగ దో♦చిన నెట్టివిషయ,మందున దనతోడి ♦ యనుచరానీక
మునుదనతోడను♦ము మారనెపుడు, కలుపుకొనుటగాంధి♦కాంక్షించుచుండు.

క. ఆసహాచరులెరుగని దుప,వాసగుణమ్మైన గాంధి ♦ వారందరినిఁ
జేసెనుపవాసముండ బ్ర,దోషాదుల నిగ్రహమునఁ ♦ దోడ్పడుసంచున్. 371

గీ. అట్టులాత్మసంయమనవా♦శావకాశము, సృష్టియయ్యెనైజముగ నా♦క్షేత్రమందు
తన్నివాసులుచేరిరి ♦ తరుచునొక్క, ప్రొద్దులుపవాసములఁగ్గడ♦బూర్తిమేలు.

సీ. అయినసీయాత్మసం♦యమమును వారియెడంద, స్పృశియించియింద్రియ♦జితులఁజేసె
ఎరుగకైనను దీన♦సరకు బొందెను గాంధి, దైహికనైతిక ♦ ప్రథిమమిగుల
ఆత్మనిగ్రహమున ♦ కనుసరించినగాని, పశువాంఛతరుగదు ♦ పస్తువలన
అటుగాని గాంధిమి♦త్రాళి నొందరికెచ్చె, పశువాంఛ జిహ్వాచా♦పల్యమందు

గీ. ఎదుబహిరేంద్రియములప్ర♦వృత్తినిగ్ర,హింపఁబస్తులనవ్వాని♦యింద్రియగుణ
మడగుగాని తద్వాంఛలు ♦ నట్లెయుండు, నడఁగునవి హరిదర్శన♦మందినప్పు
డనుచు శ్రీకృష్ణభగవానుఁ ♦ డనియెగీత. 373

గీ. మేనియుపవాసమునుగూడి♦మానసికము, నైనయుపవాసమున్న నే♦యాత్మజయము
గలుగు; లేకున్ననరునికి ♦ గలుగదంచ,నమ్మ్రికిడకొదవును సర్వ♦నాశనమ్ము.

— ఉపాధ్యాయుఁడుగ గాంధి —

సీ. ఫోనిక్సుక్షేత్ర మ♦ధ్యదయమందఁ దవీయ, బాలబాలికల వి♦ద్యాలయంబు
నెలకొల్పి యందుగాం♦ధియెదా నుపాధ్యాయు,డుగ బూనెబోధింప♦సుగుణములను
ఆర్థికాధ్యతలేమి ♦ సమ్యలెవ్వరురామి, ప్రాప్తవిద్యారీతిఁ ♦ దృప్తిగామి
స్వానుభవమ్ముచే ♦ సరియైన విద్యావి,ధానమ్ము గనుగొనఁ ♦ దలచిశ్రద్ధ

గీ. పరగనాక్షేత్రమొక కుటుం,బమ్మెయగుట,తత్కుటుంబమునకుదానె♦తండ్రియగుట
నచటిపిల్లలశిక్షణ ♦ కంతటికిని, దానెబాధ్యత వహియింపఁ ♦ దలఁపుగనుట.

గీ. పిల్లలెల్లరుఁ దమతోడఁ ♦ బెరుగకుంట, వివిధవాతావరణములఁ ♦ బెరిగియుంట
పలుమతమ్ములవారందఁ ♦ బరగుచుంట, గ్రాలనెల్లకతండ్రిగాఁ ♦ గష్టమయ్యె.

చ. విమలగుణమ్ములన్, హృదయ♦విస్మృతినింగన నైతికప్రబో
ధమును సుశిక్షణం బొసగి ♦ ధన్యులుగా నొనరింప నెల్లరన్
సుముఖులునొట నెల్లపుడు ♦ సూనృతశీలిగవారి తోడుతన్
బ్రముదితుడై వసింప స్థిర♦మానసుఁ డయ్యెనతండు తండ్రిగాన్. 377

గీ. చదువులను సమ్మమునకిల ♦ సత్ప్రవర్తనమున శిక్షణమగును బు♦నాదియద్ది
చక్కగావేయబడినచోఁ ♦ జదువులెల్ల, గరుపగల్గుందురెల్ల బా♦లురుపతమంత
తామె లేకున్నసఖుల తో♦డ్పాటుతోనొ. 373

మం. కానిసద్గుణసుశి♦క్షణముతోడుతను, అక్షరాస్యతశిక్ష ♦ ణావసరమ్ము
గ్రహియించుటం బూర్తి♦గా గాంధికలెను,బాకు ప్రాగ్జిదెశాయి ♦ బాసటగాగ.
తరగతుల్ కొన్ని మొ♦దలువెట్టినల్లె, దైహికశిక్షణ ♦ ధ్యాసచేసతఁడు
క్షేత్రమందలివంట ♦ చేయుటమొదలు, పెంటనెత్తుట ఫల♦వృక్షముల్ చక్కఁ
బరికించుటలు తోట♦పనులెల్లక్షేత్ర, వాసులెల్లరుఁజేయ ♦ వలసినందునను
ఇతరమౌవ్యాయామ ♦ మేదిలేకున్న, వలయుపరిశ్రమఁ ♦ గలిగియెల్లరును
ఆరోగ్యవంతులై ♦ యందమౌమేను, లలరక్షేత్రనివాసు ♦ లందరానంద
మెసఁగఁగాలముఁబుచ్చి ♦ రేవ్యాధిలేక, శుద్ధజలము పరి♦శుభ్రమౌగాలి
క్రమశిక్షణమ్ము స♦కాలభోజనము, సాయఁపుర్యోను దేహ♦శక్తిపెంపొంద. 388

గీ. వ్రాయుటకుఁదోడు ప్రతిపిల్ల♦వాడుచేతి. వృత్తి దెలియగనొండు నే♦ర్పింపఁదలచె
పరులపై నెప్పుడాధార ♦ పడక బ్రతుక,గలుగు శక్తిఁబ్రసాదింప ♦ గాంధిమదిని.

గీ. అరిగి 'ట్రాపిస్ట్ మొనాస్టరి'♦యనుమతగురు.వాశ్రమముపాదరపు♦రిశ్రమమును
గరచివచ్చె 'కలెనుబేకు' ♦ గాంధియతని, వలననేర్చి నేర్పెవలయు♦వారికెల్ల,

ఆ. కలెనుబేకు మరియొ♦కండు వడ్రంగిప,రిశ్రమానుభవ మె♦రింగియుంట
కొంతమంది బాల♦కులనేర్చి రావృత్తి, వంటనేర్చి రెల్ల♦వారలందు. 390

క. వ్రాయుట చదువుట లెక్కలు, వేయుటయే దక్క వేరు ♦ వృత్తినొకదేఁ
చేయుటఁదెలియమి వారల, కీయదిక్రొత్తగనుదోచి ♦ యింపుంగూర్చెఁ. 391

మం. 'అధ్యాపకులు చేయ♦నట్టిదేదియును, విద్యార్థులకుఁ జెప్పి♦విసిగింపరాదు'
అను నిబంధనము 'టాల్స్టాయి క్షేత్రమున,అమలులోనుంటన♦ధ్యాపకుల్ గలసి
విద్యార్థిజనముతో ♦ విసుగెత్తకుండ, పనులొనర్చుచుఁ బాటు♦బడుచుండుకతన
గరచిరిబాలకుల్ ♦ మరువ కేమరక, ఉత్సాహమున మన♦ముల్లసిల్లగను

— అక్షరాస్యత —

సీ. దైహికశిక్షణ ♦ మైహికవృత్తి శి,క్షణకిట్టులేర్పాటు ♦ సల్పిగాంధి
అంతకన్నను కష్ట♦మగునక్షరాస్యత, గూర్పనేర్పాటు లొ♦నర్పఁదలచె
అందుకుదగిననట్టి ♦ యనుకూలములు దీరి,కయులేమి నపరాహ్ణ♦కాలమందు
అక్షరాస్యత శిక్ష♦ణార్థమ్ముగామూడు, గంటలకాలమ్ము ♦ గడపెహింది

గీ. ఉరుదు గుజరాతి తమిళముల్ ♦ గరుపుకొరకు
బోధనము మాతృభాషల ♦ మూలముననను
జరిగె; నాంగ్లముబాగుగా ♦ గరపబడియె
పరగగుజరాతి హైందవ ♦ బాలకులకు
నేర్పబడె సంస్కృతమ్మింత ♦ నేర్పుమీర. 396

గీ. చరితగణిత భూగోళ శా♦స్త్రమ్ములెల్ల, బాలికాబాలకులకు నే♦ర్పంగబడియె
గాంధి ఉర్దూ తమిళములు ♦ గరపబూనె, పయనముల, బంది నేర్చిన ♦ బాపలవ్వి.

క. ఘూర్జర సంస్కృతవిజ్ఞా, నార్జన గావించి యుండె ♦ హైస్కూలున నా
ఘూర్జరభాషయు నట్లా, నిర్జరభాషయును గాంధి ♦ నేరిపెనట్లో. 398

గీ. గాంధిసహచరులాతండు ♦ గలిగినంత, పట్టుసాహితీ విజ్ఞాన♦బలము లేని
వారలగుటచే, గాంధియే ♦ పరుసగరపె, నెల్లరకు దానెవిసుగన ♦ కించుకైన.

సీ. తనదేశభాషలం ♦ దనకు నైజమ్ముగా, గలగౌరవానురా ♦ గములవలన
అధ్యాపకుండుగా ♦ నలరగాంధనశక్తి, గలయాత్మవిశ్వాస ♦ గరిమవలన
అందున్న విద్యార్థి ♦ బృంద మమూయి కు,లజ్ఞాన మూర్తులు♦నగుటవలన
అన్నింటికినిమించి ♦ నట్టియావిద్యార్థి, సమ్మానయతౌదార్య ప్ర♦శస్తివలన

గీ. గాంధికంతగా కష్టంబు♦కలుగకుండ, సాగెనాతని జీవిత ♦ శకటమొజ్జ
యైప్రశాంతమ్ముగానెట్టి ♦ విప్రియములు, విప్రతీపముల్ లేకుండ ♦ సుప్రశస్తి.

సీ. తమిళబాలకులెల్ల ♦ దక్షిణాఫ్రిక జన్మ,లగుటయుంగరు తమి♦ళాక్షరములు
కాననేరిపె తానె♦గాంధియే తమిళాక్ష,రములు గొంచెము వ్యాక♦రణము చెట్లొ
భాషించుటందున ♦ బాలురేగురువును, దాటిపోగల్గిరి ♦ ధాటిగాను
ఇంగ్లీషెరుగని వా♦రెవరైన దమిళులు, గాంధికడకువచ్చు ♦ కాలమందు

గీ. వ్యవహరించిరి తమిళాను♦వాదకులుగ, గాంధికాబాల బృందంబె♦ కాన నతడు
ప్రోసె తనకాలమేపడి ♦ దుడుకులేక, శక్తిపంచనలేమి ప్ర♦శాంతమతిని. 403

గీ. తనకుదెలిసినదేదియు ♦ దాపకుంట, తనకుదెలియని దేదుగుదే ♦ ననకయుంట
ఉన్నరూపున నెల్లప్పు♦డొప్పుచుంట, గాంధిపొందెబాలురప్రేమ♦గౌరవములు.

క. ఉరుదును ముస్లిముబాలకు, లెరిగినకతమునను వ్రాయు ♦ లెంతయువారిం
గరుపగసులభం బాయెను, పొరయగ నాసక్తిచదువ ♦ బుస్తింపంగన్. 405

సీ. సోమరుల్ గాకుండ ♦ జూచుచుబాలుర, కాసక్తి చదువందు ♦ నలరజేసి
పుస్తకాల్ బస్తాలు ♦ మోయకుండనొనర్చి, వాచకమ్ములవేవి ♦ వాడకంత
తాఁబఠించిన వివి♦ధానేక సద్గ్రంథ, సారమ్ముదన స్వభా♦వం దెలుపుచు
రక్తిగల్గెడురీతి ♦ రమ్యంబుగా విష,యముల బోధించుచు ♦ ననవరతము. 406

గీ. గాంధిసంతృప్తిమై బాల♦కాళిప్రేమ, గౌరవములు యథేచ్ఛమై♦మీరగొనియె
పఠనమునకన్న, బాలురు ♦ భక్తి శ్రద్ధ, వినినది మరువకుండెడ ♦ రనుచుదెలిసి.

ఆ. గ్రంథపఠనవలన ♦ గరచినదానికి, మిన్నగాను జాల ♦ తిన్నగాను
జ్ఞప్తిగల్గియుంద్రు ♦ దృష్టిమైయధ్యాప, కుండు చెప్పవినెడు ♦ కూడికలను.

ఆ. కనుటవలనకన్న ♦ వినుటచేతనెచాల, సులభముగ గ్రహించి ♦ కలిగియుంద్రు
జ్ఞాపకముదాము ♦ గ్రహియించినట్టిది, అధికముగను బాలు♦రందరవని. 409

ఆ. గ్రంథపఠనచాల ♦ కష్టమ్ము; కష్టత,రమ్ము గలుగ జ్ఞాప♦కమ్ము దాని
ఒజ్జ నోటిమాట♦నుండి నేర్చినదెల్ల, పలుకగలరు తిరిగి ♦ బాలురెల్ల. 410

ఆత్మ (హృదయ) శిక్షణ

సీ. మేనిశిక్షణకన్న ♦ మెదడుశిక్షణకన్న, హృదయశిక్షణకష్ట ♦ మెన్ననుచు
పెద్దవారలకు నే♦ర్పించుటకన్నను గరపబాలురకెంతొ ♦ కష్టమనుచు
ప్రతిబాలకుఁడు తన♦మత మొకింత యెరుంగ, వలయునంచందుకు ♦ వసతులొసగి
గాంధివివేక శి♦క్షణమాత్రమేయది, యని స్వానుభవమున ♦ కంతదెలిసి

ఆ. సద్గుణాభ్యుదయము ♦ సత్ప్రవర్తన ము,లగుచుకొనుచుదైవ ♦ మెరుగుకొరకు
చేయసాధనమ్మె ♦ చిన్మయాత్మః సాధ,నమ్మటంచుగాంధి ♦ నమ్మెమదిని. 411

చ. పనిపడదెట్టిశిక్షణము ♦ బాలురకిట్టి విశిష్టమైన శి
క్షణమునొసంగ కాత్మకటు ♦ సల్పుట హానికరంబుగూడనం
చని పనిబూనె గాంధిహృద ♦ యాభ్యుదయంబును గూర్పతగ్గ శి
క్షణమునొసంగ బాలురకు ♦ సాధనసంపదలం గడింపఁగన్. 412

వ. ఇట్టి యాత్మసాధన కనుకూలమైన కాలము, మానవుని జీవితమున కడపటి మెట్టగు సన్న్యాసాశ్రమకాలమని, ప్రొద్దులుబుచ్చువాడు కడకు ద్వితీయబాల్య మనఁదగిన వార్ధక్యమును మాత్రమే సంపాదించి, తనవారికే గాకుండఁ తనకును, ధరణికినిగూడ భారమగును. ఇట్టి అభిప్రాయము గలవాడగుటచే గాంధి యానాడే తన యధీనమందున్న బాలబాలికల కాత్మసాధన విద్యయందు శిక్షణమొసంగ నుద్యుక్తుఁడాయెను. 413

సీ. బాలుర ప్రార్థనా ♦ పద్యముల్ కంఠస్థ, మొనరించి వల్లింపఁ ♦ దనియఁజేసె
నైతికమ్మగుశిక్ష ♦ ణముగూర్చి తెలిపెడు, గ్రంథముల్ బాలుర ♦ కడఁబఠించె
క్రమముగా గ్రంథముల్ ♦ గాదాత్మశిక్షణ, మ్మితరశిక్షణముల ♦ గతిగ్రహించి
అభ్యాసమొనరించె ♦ నాత్మశిక్షణమందు, నాదర్శజీవిత ♦ మనుసరింప

ఆ. గాంధి సద్గుణగణ ♦ కంథిబాలురుదన్ను, గాంచి నడువమంచి ♦ గాసతమ్ము
కల్లలాడునొజ్జ ♦ పిల్లలకుంజెప్ప, జాలడెపుడుబల్క ♦ సత్యమనుచు. 414

క. ఈలీలనొజ్జలుగ నా,బాలకులే గాంధిసత్య ♦ వంతుఁడుగా ధీ
శాలిగనడుపగ జేయం,జాలిరనారతమునాత్మ ♦ సంయమశిక్షన్. 415

క. అధికాధికముగ నిగ్రహ, మధికముగా నాత్మశిక్ష ♦ ణాభ్యాసంబున్
బుధులునుతింపఁగ సద్గుణ,నిధి గాంధియొనర్చె నందు♦నిపుణుండయ్యెన్. 416

వ. అక్లా-టాల్స్టాయి క్షేత్రమున దానడుపుచుండిన బడియందలి, పిల్లలయందొకం డల్లరి చిల్లరిగాఁ దిరుగాడుచు, పెల్లుగాఁ గల్లలాడుచు, జగడగొండిగానుండెను. ఒకప్పుడా పిల్లడు మిగుల దౌర్జన్యముగా ప్రవర్తించెను. మోహాను డోపికఁ

గోల్పోయి, కోపమునకు లోనయ్యెను. అంతకుమును దెప్పుడును బాలకుల
దండించురీతి నెరుగకుండుటచే కోపోద్రిక్తుఁడయ్యెను, నాఁడా బాలకు నను
నయింపఁ బ్రయత్నించెను. కాని, యాబాలకుఁడు మరింత మొండిగా మోహ
నునిపై తిరుగఁబడెను. అంతట గాంధియందున్న రూళ్ళ కర్రంగొని, యా
బాలునిపై నొకదెబ్బ వేసెను. అటుకొట్టునపుడు గాంధి యొడలు కంపించెను.
దీనినంతయును గమనించిన యాబాలుడు బిగ్గరగా నేడ్చుచు క్షమింప వేడు
కొనెను. దెబ్బవలనఁ దనకుఁగలిగిన నొప్పిచేగాక, తన దుష్ప్రవర్తనచే తన
గురువు నంతవిపరీతముగా నొప్పించితినేయని గ్రహించుటచే నాబాలుఁ డట్లే
డ్చెను. తదనంతర మా బాలకు డేనాడును అవిధేయుఁడుగా నడచి యెరుగడు.
కాని గాంధిమాత్ర మానాటి తన విపరీతప్రవర్తనకు పశ్చాత్తాపతప్తుఁడై,
యానాడు తాను తనయందలి మానవతంగాక పశుప్రవృత్తియే ప్రదర్శించితి
నని, తనయాత్మకథయందు నిస్సంకోచముగా నుడివెను. 417

గీ. బాలురఁగొట్టి దండించు♦పద్ధతికతఁ, డెపుడుఁ బ్రతికూలుఁడగుటచే♦నిటుఁదలంచె
కోపమూనుట కొట్టుట ♦ కూడదాత్మ,తపము బలమున నడపంగ♦వలయుస్పర్థ.

— సదసద్యోగము—1910-11 —

సీ. మోహనుచేఁ దొల్లి♦ నామాతులై జోహాన్స్, బర్గ్ నుండి వచ్చిన♦ వారిపిల్ల
లల్లరివారౌట ♦ జెల్లదువారితో, గాంధికుమారులు ♦ కలియుటంచు
కలెనిబేకుపచింప ♦ గాంధియిట్లు వచించె, "బాలురందరకేనె ♦ బాధ్యునగుట
వారిసి జూచుట♦వేరుగా ధర్మమే, ఇటనసౌకర్యమ్ము ♦ లెటొసహించి
గీ. వచ్చిరిటకుపిల్లలతోడ ♦ వారుగాన, నెల్లపిల్లలగనుటనా ♦ పిల్లలవలె
ధర్మసమ్మతమగుగాదె ♦ తగునె నాకు, నారయగ భేదబుద్ధి నె♦వ్వారినైన.
క. వారిందుండుట తప్పదు, వారెనినాతనయులాట ♦ పాటలలోనఁ
చేరుట తప్పదు; మరియటు, చేరుటచే నిరువురకును ♦ జేకురుశుభముల్. 420
క, ఈనాటినుంచి యేనా,సూనులకుఁ దామెగొప్ప ♦ సుజనులమనుచున్
పోనాడుటొరుల నేర్పం,గా ననుగోరుదువె నన్ను♦గమనింప కిటుల్. 421
ఆ. వారిమెదడులందు ♦ తామెఘనులమను, భావమిడుటవలన ♦ వారినేదొ
తప్పుదారినిడుట ♦ తప్పకయే సుమీ, కలయనొరుల సుగుణ ♦ మెలయుమైత్రి,
సీ. అనుభవమ్మున వారె♦కనుగొందు రెదిమంచి, చెడుదేదియో పరీ♦క్షించితామె
మనపిల్లలందున ♦ మంచిగుణంబున్న, నిజముగా నదిగూర్చు ♦ ఋజుగుణంబు
ఏదియెట్లయినను ♦ నాదుబాలకులతో, నితరబాలకులుండ ♦ నీయవలయు
అందుతప్పక నపా♦యంబున్నచో దాని, ననివార్యముగను జే♦కొనగవలయు

ఆ. నంచుబల్క గాంధి ♦ యందుకు దలనూపె, కలెనుబేకు మదిన♦కలుషపడగుచు
కలిగెనందుచే సు♦ఫలితమ్మె కడకెల్ల, గాంధిసుతులుమంచి♦గానె మనిరి. 423

మం. వారిలో నేదైనఁ ♦ దారెగొప్పనెడు, భావముండిన నది♦పరుగిడిపోయె
అన్యబాలకుల నె♦య్యమ్మున నిట్లు, గాంధిబిడ్డలకంత ♦ గల్గెసత్ఫలము
వివిధగుణమ్ములు ♦ వెలయుబాలకుల, గలసివర్తించుటం ♦ గల్గెశిక్షణము
అనుభవమ్మున దెలి♦యగవచ్చు జనకు, లధ్యాపకులు శ్రద్ధ♦నరయనాసక్తి
సకలగుణాల బా♦లకులనుగలసి, శిక్షణమిచ్చుటం ♦ జెలగుసత్ఫలము. 428

ఉపవాసతపము

ఆ. దినదినానుభవము ♦ తెలిపెఁ బిల్లలఁబెంచి. చక్కనిపథమందుఁ ♦ చదువుచెప్ప
యెంతకష్టమో త♦దంతరంగముదాక, వారికష్టసుఖము ♦ బంచుకొనుచు. 429

క. ఆనాళ్ళజొహానుస్‌బర్గ్, పోనిక్సులమధ్యవచ్చి ♦ పోవుచునుండన్
పోనాడిరిద్దరాశ్రమ, హీనులు నైతికపథమని ♦ యెరుకకువచ్చెన్. 430

సీ. ఈదుఃఖకరవార్త ♦ నెరిగినంతటగాంధి, పిడుగుపాటుగదోప ♦ వడిగనేగె
పోనిక్సునకుదారి ♦ పైనమందుఁదలంచె, తానెంతవారి ప♦తనముగూర్చి
తపియించెనో వారి♦తప్పిదమెంతటి, దారుణమైనదో ♦ వారెయెరుఁగ
తానుపవాస దీ♦క్షానిరతిఁ దపించు, టేమార్గమని నిర్ణ♦యించి దీక్ష
గీ. నేడుదినము లుపవసించి ♦ నికనునాల్గు, నెలలు పదునైదుదినములు ♦ నిండుదీక్ష
నొక్కప్రొద్దుండశపథంబు♦నొక్కమొగిని,కొనియెబాలురకొరకు మో♦హనుడు నెడద.

ఆ. కలెనుబేకుమొదట ♦ గాంధిని బస్తుండ,వలదటంచు బోధ♦సలిపెఁగాని
క్రమముగానతండె ♦ గాంధికిఁదోడుగా, నుపవసింపబూనె ♦ నుత్సహించి. 432

సీ. ఈ నిర్ణయము గాంధి ♦ మానసమ్మున కుప,శాంతి గూరిచెఁగోప♦మంతమయ్యె
దుండగింద్రపయిన ♦ దోషరహితమైన, కనికరమ్ముదయించె ♦ మనమునందు
తపమూనె ననగాంధి ♦ తపియించి రాదర, ధర్మమెంతటి తప్పి♦దంబొ తెలిసె
గాంధికందలి బాలి♦కాబాలకులమధ్య, ప్రేమరజ్జువులు మ♦రింతబిగిసె
ఆ. ఇదియకారణముగ ♦ నొదవిన పేరొందు, సంభవమున గాంధి♦కిం భరింప
వలసివచ్చెఁ బస్తు ♦ పదునాల్గుదినములు, తత్ఫలితము నధిక♦తరముగాగ. 433

సీ. మోహను ననుభవ♦ముం దీనదధ్యాప,కులుదిద్ద తమబాల♦కులను బస్తు
లని వార్యముగగూడ ♦ దపుడప్పుడిట్టి తీ♦వ్రమ్మగు తిరుగడ♦వసరమైన
అకులాంతరాలోక ♦ నాధ్యాత్మికార్హత, లావశ్యకములిట్టి ♦ వాచరింప
గురుశిష్యులకుమధ్య ♦ గురుతరమ్మగు సహా,జానురాగమ్ముండు ♦ టవసరంబు
గీ. శిష్యతప్పిదములు గురుఁ♦జేయవలెన, చేతనుండుగ గురువుపై ♦ శిష్యునకును
గౌరవమ్ముండవలె హాని♦కరముగాక, సఫలమగుటకు నుపవాస ♦ సద్వ్రతంబు.

క. విద్యార్థి తప్పిదమ్ముల, కధ్యాపకుడెల్ల వేళ ♦ ననివార్యముగా
బాధ్యత వహింపవలయును, మిథ్యయయినవారి మధ్యఁ ♦ ట్రేమల్ గిమల్. 435

ఆ. మొదటిదీక్షఁగట్ట ♦ మొదవలే డిసుమంత, నిత్యకృత్యములెవి ♦ నిలుపలేదు
గాంధినాడు పూర్తి ♦ గాఫలాహారిగా, నుండె నట్లుగాక ♦ రెండవపరి. 436

క. శ్రీరామనామసుస్మర, ణారాధన మహిమగాంధి ♦ కంతగఁదెలియం
గా రామిఁగట్టఁడబల, సాఁమక్కొరవడియె నాత్మ ♦శక్తిభక్తి. 437

ఆ. మొదటి దీక్షకాల ♦ మున ఖానెపద్ధతి, స్నానములనొనర్చె ♦ చాలద్రాగె
నీరసహ్యమైన ♦ నిలపక రెండవ, దీక్షనట్లుగాక ♦ దిగిచెనిష్ఠ. 438

ఆ. గొంతుపిడచకట్టె ♦ 'గుఁగుఁ'ధ్వనివచ్చె, తుదిదినాలనాడు ♦ కదలకుండె
నైనవ్రాతపని సి♦కంతరాయమ్ముగా, జరిగెఁ జదువరామ ♦ చరితవినియె. 439

—గోక్లెక్రియుట—1914—

క. పదియుందొమ్మిది నందల, పదునాల్గవ వత్సరమున ♦ బయనంబయ్యెన్
వదలియు సౌతాఫ్రికను గోక్లెకరికి మోహానుడు సతిక♦లెనివేకులతోన్. 440

మం. అంతమైయుండె స♦త్యాగ్రహమ్మపుడు, లండనుమార్గాన ♦ నిండియారమ్ము
అనుచు గోక్లేతంతి ♦ నంపుటకతన, వెడలెనింగ్లాండుకు ♦ కడలిపైనోడ
నల్లజూలైమాస ♦ మందున గాంధి, సత్యాగ్రహారంభ ♦ సంవత్సరమున
మూడవతరగతిం ♦ బోవఁబైనంబు, ఆరంభమొనరించి ♦ నందుచే నిప్పు
డింగ్లాండునకుఁగూడ ♦ నేగెనట్లయిన, అందువిశాలమై ♦ నట్టి సదాస
నమ్ములవసతియు ♦ నిమ్ముగావలయు, పరిశుద్ధమైనట్టి ♦ పాయిఖానయును
పప్పులు పండ్లు స♦ప్లయిలసౌకర్య, మమరియుండుటచేత ♦ నాపైనమెల్ల
పద్దెనిమిదినాళ్ళు ♦ బాగుగాహాయి,గా గాంధిదంపతుల్ ♦ కలెనిబేకందు
గడిపిరిండియకేగు ♦ కాలంబునందు, కలిగినకష్టమ్ము ♦ కాసంతలేక
నౌకాప్రయాణంబు♦నం గలెన్ బేకు,ప్రియమైన దూరద♦ర్శినులొండు రెండు
కలిగియుండగ నింత ♦ విలువైనవస్తు,వులు మనకడనుండ ♦ నుచితమేమన ని
రాడంబరాదర్శ♦మేడ యీయేడు, పౌండ్ల మూల్యముగల ♦ బైనాక్యులర్స
యేడ? సముద్రమం ♦ దేలవేయంగ, రాదివియనిగాంధి ♦ వాదింప కలెని
బాకు సమ్మతిజూప ♦ వారాశివాని, బడవేసె నిటుకలెన్ ♦ బాకును గాంధి
సత్యపథంబున ♦ సాగపైనంబు, విడిచిరి స్వార్థమ్ము ♦ ద్వేషకోపములు
కోపతాపములచే ♦ నోపిక చెడిన, నుద్దేశములు మంచి♦వున్నను సత్య
వాక్కున్న నీవు ద్వం♦ద్వాతీతుడవుగ, నైననే సత్యసం♦పన్నుడవెదవు, 457

సీ. ఈ ప్రయాణముగాంధి ♦ కేర్పడునాటికి, నిరశనవ్రతఫల ♦ నీరసమున
ఆకలికై తిన్న ♦ యాహారమరుగుట, కొరకాతడోడపై ♦ తిరుగసాగె

అందుచే నడుమువం♦దధికమై నొప్పి ను,రింతదౌర్బల్యమ్ము ♦ హెచ్చుసాగ
కానలండను జేర ♦ గనెసంప్రతించె డాక్టరు జీవరాజ్ మెహ్తా ♦ జరితఁజెప్ప
గీ. అంత డాక్టరు పూర్ణవి♦శ్రాంతి గొనుము, లేనిచో గాళ్ళుపడిపోవు♦లెమ్మటన్న
తెలిసికొనె గాంధియుపవాస ♦ దీక్షనుండి, తేరుకొన బట్టు కాలమెం♦తే నటంచు.
క. ఉపవాస ముండుకన్నను, ఉపవాసము వీడునప్పు♦డుండగవలయున్
అపరిమితమ్మగు నిగ్రహ, మపురూపపు జాగరూక ♦ తావశ్యకమున్. 459
ఆ. వినియెగాంధిపైన ♦ మొనరించుచుండ ను,ధీరయందు మొదటి♦కూరి తొలి ప్ర
పంచయుద్ధమంచు ♦ బ్రకటన జరుగుట, ఆంగ్లకాలువందు ♦ నరుగుచుండ. 460
క. అదిపంద్తొమ్మిదివందల, పదునాల్గవ వత్సరమున ♦ ప్రారంభించెన్
కపనమ్మాగష్టు నాలుగ,వదినమునన్ జెర్మనీకి ♦ ఫ్రాన్స్ బ్రిటనులకున్. 461
వ. యుద్ధ ప్రకటనమువలన గాంధి పయనించు నౌకనధికారులు కొంతసేపు నిలువ రించిరి. తదనంతరము జలాంతర్గాములను, విషతంత్రులను దప్పుకొని పయనించుచు, నెమ్మదిగా సౌథాంప్టన్ చేరుటకు రెండుదినములుపట్టెను. లండనునగరమున కాగష్టు ఆరవతేదిననే చేరనయ్యెను. 462

యుద్ధమున గాంధిపాత్ర

మం. ఇంగ్లండుఁ జేరఁగ♦నే పారిసునకు, గోక్లెయారోగ్యమ్ము ♦ కొరకేగి యటనె
ఉండిపోయె నటంచు ♦ యుద్ధంబువలన, ననివిని గాంధియా♦తని గాంచువరకు
ఇండియాకేగుట ♦ కిచ్చింపడాయె, అందుచే యుద్ధమాం ♦ దాఁగిలేయుటకు
సాయ మొనర్ప ని♦చ్ఛించవలపోసి, ఇంగ్లాండునందుండు ♦ నిండియాజనుల
సంప్రతింప దలంచి ♦ సభగూర్చెనొండు, జీవనమెహ్తాప్రాక్ ♦ జీవనమెహ్తా
ఉజ్జేనియాల సా♦యంబుచేగాంధి, "ఆంగ్లేయసామ్రాజ్య♦మందలి పౌరు
లైయుంట మనమిండి♦యను లెల్లచేయ, వలయును మనశక్తి♦కొలది సాయమ్ము
ఆంగ్లేయులకువారి ♦ యాపదవేళ", ననిగాంధిపల్కఁద ♦ దన్యులుకొంద
"రివితగుతరుణమ్ము♦కదలింప బ్రిటిషు, అధికారమూ యిండి♦యానుండి"యనిరి.
ఆ. కానిగాంధి యుద్ధ♦కాలమందేమియు, బేరమాడకుండ ♦ బ్రిటనుకింత
సాయపడుట సబబు♦సరియైన మార్గంబు, దూరదృష్టియంచుఁ ♦ దోపమదిని.4 2
క. తనుఁబోలెఁ దలచి బ్రిటనుల,కని సాయమొనర్పఁ గోరు ♦ నాభారత స
జ్జనముల నాహ్వానించెను, అనిక్షతగాత్రులకు సేవ♦నారసి చేయన్ 473
క. ఆ యాహ్వానంబందఁగ, చేయఁగసాయంబువడిగఁ ♦ జేరిర నేకుల్
ఆ యోధనమున బ్రిటనుకు, న్యాయముగవలంటి రులుగ♦నై యిండియనుల్,
వ. అంత గాంధియు లార్డ్ క్రూ అను నున్నతోద్యోగి కీవిషయమంతయుఁ దెలిపి, తమ్ము ఆంబులెన్స్పనికి తరబీతొనర్పుమని వినతినంపెను. ఆయుద్యోగియు

గొంత తడబాటనంతరము గాంధిపిసతి కీర్తిఁగొని యంతటి విపత్కర విపరీత సమయమం దట్టిసాయ మందజేయుటకు భారతీయులకు కృతజ్ఞతాభివందనముల నందించెను. ఆరువారాలపాటు వలయుశిక్షణ నిచ్చి పరీక్షింప, నందుఁజేరిన 80 మంది వలంటీరులలో నొక్కఁడుదక్క మిగిలినవా రెల్లరు నెగ్గిరి. ఆకాల మందు లండనునగర మెంతయో చూడతగ్గదిగా నుండెను. 475

మం. ఎందుగాంచిననేమి ♦ యెవరినిగన్న, గొంకఁబింతేని ♦ నందరెల్లరును
తమతమశక్తియుక ♦ తలకొలంది, క్రమరీతి సాయంబు ♦ గావించుకొరకు
పనిచేయుచుండిరి ♦ పడుచువారెల్ల, పనియోధశిక్షణ ♦ నందుచునుండ
బలముడిగినవా ర♦బలలు వృద్ధులును, క్షతగాత్రులకుకట్లు ♦ గట్టుబట్టలను
దుస్తులను దయారు ♦ చుస్తుగాఁజేయ, క త్తిరింపులు కుట్లు♦కావించుచుండి
రనుపమశక్తి శ్ర♦ద్ధాసక్తులెసఁగ, 'లైసీయమ్' అను స్త్రీల ♦ క్లబ్బొంపునైని
కులకుచేనైనన్ని♦కుట్టుబట్టలను, సమకట్టియుండె నా♦సంఘమ్మునందు
సభ్యురాలుగ సరో♦జని దేవియుండె, సంపూర్ణహృదయమ్ము ♦ శ్రద్ధానురక్తి
కలిగి యాయమ్మయీ♦కార్యంబునందు, మునిగియుండియొసంగె♦మోహనుంగుట్టి
పంపించమనియొక ♦ బట్టలగుట్ట, గాంధియుఁ జెప్పిన ♦ క్రమమునన న్ని
కుట్టించి పంపించె ♦ బట్టలన్నిటిని, ఇదియె సరోజని ♦ నీక్షించుటల్ల
గాంధికిసేవా దు♦రంధరుండగుచు, తనవాతఁ బెంపొంచె ♦ పరిచయమ్మద్ది. 487

ధర్మసంకటము

సీ. ఇటుగాంధి తనసేన ♦ నింగ్లాండునకు యుద్ధ,మున సమర్పించె నం♦చనెడువార్త
దక్షిణాఫ్రికఁజేరఁ ♦ దంత్రీద్వయమువచ్చె, నందొంకు పోలకు ♦ నుండియుండె
శపథమూనితి పహిం♦స వ్రతమ్మున కెట్టు,లిపుడు హింసాకాండ ♦ కీయకొంటి
వనెడుపోలకు ప్రశ్న ♦ నవసరకేగాంధి, తన 'హింద్ స్వరాజ్య' పు♦స్తకమునందు
గీ. చర్చచేసియు నుండె వి♦శదముగాగ, దక్షిణాఫ్రిక మిత్రులు ♦ తానుమున్ను
బోయరుల యుద్ధమున సేవ♦సేయుటెరిగి, నట్టివారలు వారల♦కంతదెలియ. 488
క. బోయరురణకాలాభి, ప్రాయములే మారెనాటి ♦ ప్రాయము వేరే
యైయుండె గాంధికని తల,పోయఁగ సఖులిట్లుఁజేరె ♦ మోహనుఁడనికిన్ 489
ఆ. అట్టిసఖులతోడ ♦ గట్టిగా చర్చించి,యుండె హింసయనుచు ♦ యుద్ధమెపుడు
నీతిబాహ్యమను చ♦రాతికైనను బ్రతి,హింసచేయనుంటె ♦ యెరుఁగఁగాంధి. 490
ద్విపద. మునుపు బోయరు యుద్ధ♦మునఁగల్గినట్టి, మనసుతోడనెయిప్డు ♦ పలుకుటగాంధి
చేరెయుద్ధంబున ♦ సేవసేయంగ, ధారుణి హింసాయు♦తంబైన రణము
ధర్మకార్యంబెదో ♦ ధర్మేతరమగు, కర్మమేనో యెరుంగ ♦ కష్టమూటవని
తరుచంథకారాన ♦ తారటులాడు, ధరణిసత్యవ్రత ♦ దక్షుడౌనరుఁడు. 494

సీ. తలపనహింస సా♦ధ్యమ్ముగాని ధర్మమ్ము,నుష్ఠింప నెల్ల మ♦నుష్యులకును
హింసాగ్నిఁ దగిలి ని♦ర్మూలి దిన నరు లేదొ, హింసలేకుండ జీ♦వింపనగునె
ప్రాణులు ప్రాణుల♦పైననే జీవించు, ననుసూక్తియం దెంతొ ♦ యర్థముండె
తినుట ద్రావుటయందుఁ ♦ దిరుగాడుటాదిగా, గలమనుగడ నేదో♦ కలదుహింస.
ఆ. కాన సత్యసంధు♦డైన నరుఁడహింస,యందె నడుచునతని ♦ యాత్మయందు
కనికరమ్ముగల్గి ♦ కర్మమ్ము లొనరింప, శక్తికొలది హింస ♦ సల్పుటుడుగు. 495
క. కడుచిన్ని జీవినైనను, గెడపక తద్రక్షణమున♦కే యత్నము నె
ప్పుడుఁ జేయువాడు హింసా,దృఢబంధ విముక్తిగాంచు ♦ ధీరుండగుచున్. 496
ఆ. అట్టివాడు సతత♦మభ్యుదయముగాంచు, నాత్మనిగ్రహమున ♦ నక్కటికము
నందుగాని యెప్పు♦డందజాలడు ముక్తి, బాహిరమున హింస ♦ బాధనుండి.
సీ. అరయనహింసకీ ♦ యఖిలజీవైక్యమం, తర్భూతభావమై ♦ తనరుఁ గాన
వేయేండ్లు ప్రమాద ♦ మెదియైనజీవుల, నంవరఁబాధించు ♦ నందువలన
సంపూర్ణముగను హిం♦సావిముక్తుండయి, మనజాలనేరడు ♦ మానవుండు
సంఘస్థితి కెయి ను♦ల్లంఘనీయంబైన, హింసనుండి విముక్తు ♦ డెట్టులగును?
గీ. మానవుఁడుసంఘజీవియై♦మనెడువరకు, రాజ్యములు రెండొనర్పంగ♦రణముతప్ప
రమణకుంబూనుకోవలె ♦ విమలమతిని, ధరనహింసా ప్రతునికి స♦ద్ధర్మమద్ది.
సీ. అట్టివిధ్యుక్త ధ♦ర్మాచరణమ్మున, కోపలేకయు రణ♦మాపలేక
యుద్ధనిరోధమ్ము ♦ కుచితయోగ్యతలేని, వారందుఁ బాల్గొన ♦ వచ్చునైన
తమ్మును దమస్వదే♦శమ్మును మరి ప్రపం,చమును దప్పింప యు♦ద్ధమునుండి
సేవచేయత్నమ్ము ♦ సేయంగవచ్చు సం,పూర్ణహృదయముతో ♦ భూతలమున
ఆ. తనకు దనదుప్రజకు ♦ ఘనతర స్థితిగూర్ప, నభిలషించె గాంధి ♦ యాంగ్లరాజ్య
మూలముననుమరియు,మోహానుండపుడాంగ్ల,భూమినుండెబ్రిటిషు♦పోషణమున.
ఆ. ఆంగ్లపోషణమ్ము ♦ నందుండుటేచాలు, పాలుగొనియెనాంగ్ల ♦ పాలకకృత
హింసయందుననుట ♦ కిందుచే మార్గత్ర,యమ్ము గలదుగాంధి ♦ కనుసరింప. 500
సీ. యుద్ధనిరోధమే ♦ నొనరింతునని చాటి, సామ్రాజ్యముఁ దదీయ♦ సైన్యశాస
నావళి మార్చునం♦దాక సత్యాగ్రహ, మాచరించుట మార్గ♦మరయనొండు
ఎదిరింపఁదగునట్టి ♦ వేవొశాసనముల, నెదిరించి చెరసాల ♦ కేగుటొండు
సామ్రాజ్యపక్షాన ♦ సమరానఁబాల్గొని, సమరహింసాకాండ ♦ సమయఁదన్ని
గీ. రోధమున కర్హతయుశక్తి♦సాధనమ్ము, లార్జనమొనర్చుటయునొండు♦నట్టిమూడు
పథములందేనికిని దగు♦బలము లేమి, నీయకొనెగాంధి రణమునఁ ♦ జేయసేవ.
తే. బందిపోటైన వారల ♦ బంటైయైన, బందిపోటులపాపపు ♦ పనులలోన
పాలుగొనుటయెయగుగాన♦బాధితులకు,సమరమునఁజేయు సేవహిం♦సగనెతలచె.

వ. పోలకుకడనుండి పైనఁ జేర్కొనఁబడిన తంత్రీవార్త యందకముందే, గాంధి యీ చందంబునఁ దనకుదానై చర్చించుకొని యుంచిన యీ విషయము నంతయు, దదీయ తంత్రీవార్త యందిన వెనువెంటనే యీ తనయభిప్రాయ భావన లన్నిటిఁగూర్చి పెక్కుర మిత్రులతో సంప్రతించి యుద్ధమున క్షతగాత్రుల సేవసేయుటయే తన విధ్యుక్తధర్మముగా నిర్ణయించి యుండెను. ఆనాటి తన కార్యమునకు తదనంతర మాత్రఁ దేనాడును పశ్చాత్తాప పడలేదు. సరికదా! ఆనాడు తనకు బ్రిటిషువారి యెడల, వారితోఁగల సంబంధముయెడలఁ దనకుఁ గల భావముఁబట్టి నాటి తనచర్యయం దెట్టిదోషము లేదనియే గాంధి తన ఆత్మకథ వ్రాయునాటివరకు భావించెను. అయినను, ఆనాడుకూడ తన యీ భావములు సరియైనవని యతనిమిత్రు లంగీకరింపలేదు. ఇందులో భిన్నాభిప్రాయముల కెడమున్నది. కనుక గాంధి తనవాదము కన్నిటికిని తనకు సాధ్యమైనంత విశదముగా నహింసయందు సంపూర్ణవిశ్వాసముగల్గి దానిం దమ జీవితములం దెల్లెడ నాచరించుచుండు తన సహచరులందరికిని వివరించిచెప్పెను. సత్యారాధకుడు కేవల మాచారముఁబట్టి యేదియు నాచరింపఁజనదు. అతడు సతతము జక్కదిద్దబడుటకు సంసిద్ధుడై యుండవలయును. తప్పుదెలిసినంత, నా తప్పొప్పుకొని పశ్చాత్తప్తుడు కావలయును. 503

## ఒకచిట్టి సత్యాగ్రహము

క. సమయానుకూల మగుధర్మముగాఁ బాటించి గాంధి ♦ మర్యాదకు యు
ద్ధమునం జేరినఁ బ్రత్యక్షముగా బాల్గొనడు జబ్బు ♦ శాంతింపమిచేన్. 504

క. అట్టి విపత్సమయమునం, గట్టి! తటస్థించె నించు♦క ప్రయోగింపక
చిట్టిదయిన సత్యాగ్రహ,మట్టిది యప్పటికి గాంధి ♦ కక్కరపడియెన్. 505

సీ. గాంధివాలంటీరు ♦ బృందమ్మునకు 'జేక', రేర్పడెను గవాతు ♦ నేర్పుకొరకు
అతడాకవాతుకే ♦ యధికారి తదితర, కార్యమ్ములకుపెద్ద ♦ గాంధియె యని
దళమునందంతటి ♦ తలపైన జేకర్ చలాయించె నధికార ♦ మన్నియెడల
నియమించెఁ గొందరి ♦ నేర్పఁగవారు శాఖాధికారులుగనా ♦ "అక్నుఫక్టు
గీ. యువకవిద్యార్థులను వార ♦ లుద్ధతిమెయి, పెత్తనమ్మొనరించిరి♦చిత్తమెరియ
నంతసోరాబ్జి అడ్జేని ♦ యనెడువాఁడ, దెల్ల గ్రహియించి మోహాపు♦కిట్టులనియె.

క. 'జేకరు' నరసితివే పలు,గాకితనంబునను మమ్ము ♦ గారించెదుదాఁ
గాకయువకనాయకులం, బోకిళ్ళంబోవబంపెఁ ♦ బొక్కఁగనెల్లన్ 507

సీ. అనగసోరాబ్జి మో♦హాను "డిందుకంతగా, కలవరపడెదేల ♦ నిలువుమోర్మి"
నన "నమ్మెదెల్ల నీ♦వవనిలో నమ్మించి, గొంతుఁగోసెదరిట్టి ♦ క్రూరమతులు
కాంతువంతయుఁ గట్టి♦కడపట మమ్మెల్ల, సత్యాగ్రహమ్మును ♦ జాటఁజేసి
కష్టమ్ములంద్రోసి ♦ కష్టింతువీవును, నినుజేరగా దప్పు♦నే వ్యథాలి"

గీ. యనుచు బల్కు సౌరాబ్జికి ♦ యనియె గాంధి "మోసపోవ సత్యాగ్రహి ♦ బుట్టెననల
మోసగింపనిమ్మాతడు ♦ మోసగించు, వారలే మోసపోదు ర♦వార్యమనుచు".

మం. అని మోహనుండన ♦ హసితాస్యుడగుచు, "సరిసరి మోసాని♦కెరయౌచునుండు
మెప్పుడో యొకనాడ ♦ దెట్టులో చావు, తప్పదు నీకు స♦త్యాగ్రహుండు
నీవెంటగొంపోదు ♦ చావుమటంచు, నావంటివారి నెం♦దరినో పేదలన"
టంచుఁ బల్కె సౌరాబ్జి♦ యలుక మైమిగుల, మోహను పల్కుల♦ మోహితుండగుచు.

ఆ. అటు సౌరాబ్జి పల్కు♦నపుడు జ్ఞప్తికి వచ్చె, మోహనునికిఁ దనకు ♦ మును పొకప్డు
'హచవావుస్ కొమారి' ♦అసహ యోగము గూర్చి, వ్రాసినట్టి విషయ♦ పంక్తులిట్లు.

క. "ఉరిపాలౌదువు సత్యము, కొరకీవీ దినములందు ♦ కొండొక నాడ
బ్బురమంద నేను; కావుత, పరమాత్ముడు నీకు సత్య ♦ పథమునఁ దోడై."

సీ. అయ్యదియటులుండ ♦ నధికారి యదలింపు, లధికమై నేను మీ♦కధికృతుండ
సైనికా సైనిక ♦ సర్వాంశములనంచు ♦ స్వారిచేయదొడంగె ♦ సకలగతుల
అందులకు సౌరాబ్జి ♦ యాగ్రహోదగ్రుడై, గాంధికడకు వేగఁ ♦ గదలివచ్చి
నీమూలమున గాక ♦ మేమెవ్వరాజ్ఞల, గైకొనమింతకు ♦ గరిడినుండ

ఆ. అనుచితమ్ములైన ♦ యాజ్ఞలీయగనేల, మనకు నాంగ్లులకును ♦ మధ్య నేల
అంతరమ్ములెల్ల ♦ యంతరింపవలె స్వ,గౌరవార్థమిందు ♦ జేరుకతన. 515

మం. అనగాంధీ విని జబ్బు♦నందుండి కూడ, పత్యోపవాసమ్ము ♦ ఫలితంబునుండి
తేరకుండిన నింత ♦ డ్రిల్లుకై క్రోసు,దూరంబు నడుచుటఁ ♦ గారియవడిన
ఫేకరు కడకేగి ♦ భీతిలకింత, వాకొనె గాంధి య♦పారధైర్యమున
"నేనధికారినం♦చేఁ బల్కనొకడ, సైనికమ్ముగనెల్ల ♦ స్వచ్ఛంద సేవ
కులనైన దన్నాయ♦కుడ నేటివారి, చెలిఁగాన నధికృతో♦చితప్రతినిధిగ
నుంటకు మీరిప్పు ♦ డొప్పుకోవలయు, కంటగింపకుడధి ♦ కారులందమకు
ఎన్నుకొందురు వారె ♦ మన్నింపవలయు, నన్ని రీతులమీర" ♦ లనివల్కె గాంధి.

ఉ. సైనిక శిక్షణమ్మునకు ♦ జాలవిరుద్ధము గావె యెన్నికల్!
నానియమించినట్టి యుప♦నాయకులందరు నుందురట్టులే;
మానుడు మీ యయోగ్యమగు ♦ మంతనముల్ విడనాడు డెన్నికల్
పూనుడు నావచించినటు ♦ బొందికఁ జేయగ నెల్లకృత్యముల్". 523

క. అని బదులు వల్కె ఫేకరు, విని మదితన యనుచరులకు ♦ వినిపించెను మో
హనుఁడంతట సత్యాగ్రహ, మొనరింపఁగఁ గొనిరియొ శపథ♦మును దళమెల్లన్.

గీ. మేమె మానాయకుల నియ♦మించుకొందు, మెన్నికలలోనగాన మీ♦రేర్పరచిన
వారినుపసంహరింపంగ♦ వలయులేని, యెడల డ్రిల్లుకాంపులకురా♦మింకననుచు
కొనిరి నిర్ణయమెల్లరుఁ ♦ గోష్ఠి జరిపి. 525

క. బేకరుకీనిర్ణయమొక, లేకఁ దనయనుభవము దె♦లిపె మోహనుఁడుర్
ప్రాకట బోయరురణమున, నేకరణిందాదశాధి♦కృతుఁడై యుంటన్. 526

క. "సేవాయత్తము నామది, భావింపకుడన్యరీతి♦ భారతవశమం
దేవాంఛించు మదధికృత, మీవిధిగొనుఁడంచు" గాంధి♦ మృదువుగ వ్రాసెన్.

ఆ. అయిన బేకరొప్ప♦డయ్యె; నంతటగాంధి, వ్రాసెలేఖ నొకట♦ భరతదేశ
మంత్రికెల్ల దెలియ♦ మంచిచెడ్డలతండు, కుదరదనుచునిట్లు♦ బదులువ్రాసె. 128

మ. "ఆంగ్లదేశము దక్షి♦ణాఫ్రికాగాదు, ఇచటిపద్ధతివేరు♦ యిప్పటిదాక
నియమితులైనవా♦రయిరట్లు సక్రమముగ నీదేశ ని♦యమములబట్టి
అయినను నికముందు♦ నియమింపబడెను, వారెల్లనిపు సి♦పాయిసుబట్టి
నియమింపబడెద" రం♦చేమేమొ వ్రాసె, బెదరించి కొందర♦ బెల్లించి కొంద
రెటులనో లోఁగొని♦ మటుమాయఁజేసి, బేకరుబుట్టించె♦ భేదభావములు
ధృతిమానగా భార♦తీయుల వశము, నందంతయును వారి♦నైక్యంబు జెడఁగ.

గీ. అంతక్షతగాత్రులైన యో♦ధాళియెట్లొ, హాస్పిటలుకకస్మాత్తుగా♦నరుగుదేర
తత్సపర్యలకంపెను♦ దనకులోకు, వైన భారతీయులబేక♦రాజ్ఞనొసఁగి. 536

మ. మోహనుండపుడు జ♦బ్బునఁబడియుండ, భరతోపమంత్రి రా♦బర్ట్సనువాడు
వచ్చిపరామర్శ♦ బలుమారొనర్చి, "అక్కటా! క్షతగాత్రు♦లందరట్లుండ
తత్సపర్యలకేగఁ♦ దగదె నీవారు, వేరువశంబుగా♦ వీరందురందు
హాస్పిటలధికారి♦ యాజ్ఞయందుందు, రన్యులెవ్వారమే♦ యాజ్ఞలిడరు
మీయాత్మగౌరవ♦ మిందేమిచెడదు, అంపుడు మీవారి♦ నందరనిప్పు
డాంగ్లప్రభుత్వ మా♦నందమంద"నఁగ, పాటించిరెల్ల రా♦బర్ట్సు చెప్పినది
క్షతగాత్రసేవకై♦చనిరి హాస్పిటలు, పడియుండె మంచాన♦వ్యాధి మోహనుఁడు.

## 41. గోఖలుని ఔదార్యము

క. ఊపిరితిత్తులనొప్పిని, వాపోవుచు గాంధియాంగ్ల♦ వసుమతినుండన్
గోపాలకృష్ణుఁ డమృతా. లాపుండటు తిరిగివచ్చె♦ లండనుపురికిన్. 544

క. అనుదినము మోహనుఁడుదాఁ, జనుచుండెను కెలను బేకు♦ సరసన్నడువన్
గుణనిధినల గోకేలుని, కనిసంభాషింప లోక♦గతవిషయములన్. 545

సీ. ఐరోపదేశమ్ము♦ లందెల్లఁ బెక్కుమా,ర్లోపికఁ బయనించి♦ యుంటవలన
జర్మనీభూగోళ♦ శాస్త్రవిజ్ఞానంబు, తెల్లంబుగఁ దనకుఁ♦ దెలియుకతన
ఎందుగాంచిననాడు♦ నెవ్వారలైనఁ బ్ర,పంచయుద్ధముగూర్చి♦ పల్కుకతన.
చూపి దేశపటమ్ము♦ నోపిక వివిధసం,గ్రామరంగమ్ముల♦ కలెను బేకు

గీ. చెప్పుచుండెను యుద్ధవి♦శేషములను, చాలవరకిట్లు మాటలు♦సాగుచుండె
గోకులునితోడ ప్రతిరోజు♦ కూర్మి గాంధి, శ్వాసకోశరుగ్మతగూర్చి♦జరుగుచుండె
వరుససంభాషణమ్ము ల♦వ్వారిగాగ. 546

క్రొవ్వుకొరకు వేరుశనిగల వెన్న గాని యాలివుతైలంబుగాని కొనుమనియు, నిష్టమున్న కూరగాయలు బియ్యముతోఁ గూడ వండి తినవచ్చుననియు ననుమతించెను. గాంధి కీమార్పులన్నియు హర్ష దాయకములైనను, సంపూర్ణముగా రోగము కుదరదాయెను. డాక్టరు మెహతా, అప్పుడప్పుడు పరీక్షింపవచ్చి, తాఁ జెప్పినట్లు విన్నచో రోగము నెప్పుడైనను నయముసేయగలనని బాసచేసెను. ఇట్లుండగా రాబర్ట్సు దొర గాంధిని జూడవచ్చి "నీవే యిట్లు రోగగ్రస్తుండవై యుండ, నెట్లీహాస్పిటలందలి రోగులకేమి సేవసేయగలవు? కనుక నిండియాకుఁ బోయి సంపూర్ణారోగ్యముఁ బడసి, యప్పటికి యుద్ధము జరుగుచుండుచో నీవు రావచ్చును" అని బోధింప మోహనుం డిండియాకు బయనమయ్యెను. 572

## 48. ఇంటిపయనము

ఆ. కలెనుబేకు గాంధి ♦ గలసి యింగ్లాండుకు,చనిరి; యిండియాకుఁ ♦ జనుటకట్ల
ఇర్వురొక్కనౌక ♦ నెగఁగోరిరి కాని, బేక్కుపాసుపార్టు ల♦భింపదాయె. 573

క. విడనాడఁ బేకు మోహనుఁ, డడలెనెడద బాధనెంతొ ♦ యంతకురెట్టిం
పడలెం బేకును మోహను, విడుచుటకుం బరమ మిత్ర♦విరహమ్మోర్వన్? 574

తే. భరతదేశమ్మునకు బేకు♦వచ్చియున్న, సాగుచేయుచునేయుండు ♦ సంతసమున
బ్రతుకుసాగ నిరాడంబ♦రముగ నుండు, దక్షిణాఫ్రిక నిప్పుడా♦తండు శిల్పి.

క. పాఠ్యనేజిలేమి మూడఁగ, క్లాసున నానౌకయందు ♦ గాంధిపయనముం
జేసెవిధిలేక రెండవ, క్లాసునఁగొని యొండుపండు♦లను దినుచుండెన్. 576

ఆ. కట్టుగట్టియుండె ♦ గాంధిపార్శ్వములకు, జీవరాజు 'రెడ్‌సి ♦ చేరువరకు
కట్టువిప్పకుమనెఁ ♦ గానిరెణ్ణాళ్ళకే, విసిగిగాంధి కట్టు ♦ విప్పివేసె 577

ఆ. పప్పు పండ్లె చాల♦వరకు గాంధి తినుచు, ప్రతిదినమ్ము గుణముఁ ♦ బడసిచాల
మేలుగాంచె సుయెజు ♦ కాలువం జేరున,ప్పటికి శుద్ధమైన ♦ వాయువుంట. 578

సీ. సౌతాఫ్రికానుండి ♦ చనునౌకయందుఁదా, నరయఁజాలని దూర♦మరసె గాంధి
భరతదేశమునకు ♦ బయనించునౌకయం, దాంగ్లేయులకు నిండి♦యనులకెట్టి
మనసారఁదనివార ♦ మాటలాడుటరెండు, జాతులవారికి ♦ జరుగకుండె
ఇది యాంగిలేయుల ♦ యెదపాలకుల జాతి,వారలమను గర్వ♦భావముంట
గీ. భారతీయులయెడ దాము♦పాలితజన, జాతివారలమనుభావ ♦ మూతగొంట
వలననేర్పడెనని తన♦భావమునఁ ద,లంచెనందు గొందరబల్క♦రించి గాంధి. 579

క. సరిపోవని యీ వాతా,వరణమునందుండి ము క్తి♦వడయన్వడిగాఁ
మరిమరిగోరెను నిండియఁ, ద్వరగా జేరంగగాంధి ♦ తలచుచుసతముల్. 580

గీ. ఏడెనుం జరఁగనె తన♦యిల్లుజేరి, నటులభావించె మోహనుఁ ♦ డప్పటికె 'యె
డెను' జనమ్ములు తనకెంతొ ♦ తెలిసియుంట, డర్బనునదిన్న దంపతుల్♦దరిసియుంట

క. మరికొన్నాళ్ళకు బొంబయి, పురిచేరెను గాంధిమనము ♦ పొంగగఁ బదివ
త్సరములకు మాతృదేశము, నరయుటకెంతయును మురిసె ♦ నతనిహృదయమున్.

వ. బొంబాయిపురమున మోహానునికి స్వాగత సన్మానంబు జరుపవలయు నేర్పాటుల
నెల్ల గోకే (తన ఆరోగ్యము బాగుగా లేకున్నను) గావించియుండెను. గాంధి
యును గోకేలును గలయ నువ్విళ్ళూరుచుండెను. కాని విధియన్యథాతలఁచెను.

## న్యాయవాదవృత్తియందలి కొన్నిస్మృతులు

ఉ. భారతదేశమందుఁ దన ♦ భావిచరిత్రముఁదెల్పు ముందు దం
గోరుట న్యాయవాదులను ♦ గొందరు మిత్రులు గాంధితెల్పగా
గోరె; వచించెసత్యమును ♦ గూరిచి స్వానుభవస్మృతుల్ మదిన్
పేరిమి జ్ఞాపకమ్మున ల ♦ భించినవానిని గొన్నియెన్నికన్. 584

సీ. తనన్యాయవాది వృ ♦ త్తిని గాంధియొప్పు డన్వృతమువాడకయె జీవి ♦ తంబుగడపె
చాలనరకది ప్ర ♦ జాక్షేమమునుగోరి, యే తివవృత్తి సా ♦ గించె నతఁడు
చేతివెచ్చములకు ♦ చిల్లరడబ్బుల, మించి యూసాముల ♦ నుంచికొనడు
ఆవ్యయమ్మునుగూడ ♦ అప్పుడప్పుడుతానె, భరియించుచుండెను ♦ భారమనక

ఆ. సత్యపథమునుండి ♦ జారకొక్కింతయు, వృత్తినెరపినట్టి ♦ విధులుకొన్ని
న్యాయవృత్తి మేలు ♦ నకుగాను గాంధి వ,చించె స్వానుభవము ♦ నించుకంత.

మ. విద్యార్థిగా గాంధి ♦ వినియుండె న్యాయ,వాదవృత్తి యసత్య ♦ వాదమేయంచు.
అయిన దానిప్రభావ ♦ మావంతయతని, కదిలింపగాలేదు ♦ కల్లల నతడు
పదవులంగాని సం ♦ పదలైనగాని, గడియింప మదిలోన ♦ గాంక్షింపఁడెపుడు.

సీ. దక్షిణాఫ్రికయందు ♦ తననియమము బరీ,క్షకు నిల్చిబల్మాను ♦ జయముగాంచె
తరుచుసాక్షుల నబ ♦ ద్ధముపల్క నేర్పించు, టనసీయు గాంధియం ♦ దురకడాయె
హృదయాంతరాళము ♦ దెపుడుగోరె నతండు, తనకక్షిదారు స ♦ త్యముగనుండ
తనరుసు మేర్పాటు ♦ నొనరించుకొనుటంచు, వ్యాజ్యమ్మునందుజ ♦ యంబునరతు

గీ. కొప్పుకొనలేదు మోహానుం ♦ డెప్పుడతని, కక్షిదారుల ముస్ముందు ♦ గలిసినపుడె
ముట్టదప్పుడు వగువ్యాజ్య ♦ ములను నేర్ప,జాలసాక్షులకని తెల్పు ♦ సత్యశీలి
యగుటచేగాంధి యాతని ♦ యశము ప్రాకె. 589

వ. ఒకానొకప్పు డాతని యుత్తమకక్షిదారులం దొకడు, గాంధికడ కాతనిఁ జాల
తికమకలుపెట్టునట్టి వ్యాజ్యమొండుగొని తెచ్చెను. అందనేకముగాఁ దిరుగుళ్ళు
గలవు. ఆవ్యాజ్యము చాలకాలము నడచెను. అనేక న్యాయస్థానములందం
దలి యనేకభాగములు విచారింపఁబడిన వ్యాజ్యమయ్యెది తుట్టతుదకందలి
లెక్కలభాగము, యోగ్యులగు నకౌంటంటుల మధ్యవర్తిత్వమున కప్పగింపఁ
బడెను. వారిచ్చినతీర్పు మోహానుని కక్షిదారున కనుకూలముగా నుండెను.

కాని వారిలెక్కలం గూడికలం దామధ్యవస్తు లేమరుపాటున నొకపొరపాటు గావించియుండిరి. అయ్యది చాల స్వల్పమైనది. కాని యది 'జమ'వైపునం బడవలసినపద్దు, ఖర్చువైపునం బడినందువలనం దీవ్రమైన తప్పిదముగానే భావింపంబడంగలదు. ఎదిరికక్షిదారు తీర్పు నితరాధారములపైన నాక్షేపించి యుండిరి. గాంధి క్రిందివ్యాయవాది. ఆతనిపై న్యాయవాది పొరపాటెరింగి నప్పుడాతప్పిదమును దమకక్షిదా రొప్పుకొన నవసరములేదని, యభిప్రాయ పడెను. తనకక్షిదారుని కనుకూలముగాక, ప్రత్యక్షముగాం బ్రతికూలమైన దేదేయు నాకక్షిదారుని పక్షమున వాదించు న్యాయవాదు లెవరు నేమాత్ర మొప్పుకొనవలసిన యవసరములేదనియే యాతని నిశ్చితాభిప్రాయము. కాని గాంధిమాత్రము పొరబాటు నట్లనే యొప్పుకొనవలయునని వాదించెను. 590

గీ. అంతపై న్యాయవాదియి♦ట్లనియె "నీవు, చెప్పినట్లొప్పుకొన్న చోం♦దప్పిదమును
కోర్టువారెల్లతీర్పును ♦ గొట్టివేయ,వచ్చును వివేకియగు న్యాయ♦వాది యెవ్వం
డంత తనకక్షిదారుని♦వ్యాజ్యమును బ్ర,మాదమునకెర జేయగా♦మదిందలపడు.

గీ. ఏది యేమైననే సాహ♦సింపంజాల, నంతటిప్రమాదమునకు, 'కే♦సంత క్రొత్త
గా విచారింపంబడ మన♦కక్షిదారు, కెంతనష్టయమగునో తుద♦కేమియగునో"
యనుచు నీశ్వనమిలెనుపై ♦న్యాయవాది, అంతయునుసాగెకక్షిదా♦రరయనిట్లు.

సీ. గాంధియంతట "మన♦కక్షిదారుడు మన,మెల్ల నంతకు సాహ♦సింపవలయు
మనపొరపాటొప్పు ♦ కొననంతమాత్రాన, తప్పుడుతీర్పు కో♦ర్టొప్పుకొనునె
మనమొప్పుకొనుటచే ♦ మనకక్షిదారుకు, కష్టంబువాటిల్లుం♦గాక దాన
హానికల్గెడిదేమి" ♦ యని గాంధివల్కపై, న్యాయవాదియుబదు♦లాడెనిట్లు

గీ. "మనమెయాపొరపాటొప్పు♦కొనగనేల", 'కోర్టుప్రతికక్షి యోకను♦గొనరటంచు
ఖండితంబుగనెటుచెప్పం♦గలమటంచు,గాంధిపొరంబాటునొప్పుకో♦కాంక్షసలిపె.

ఆ. 'సరియే,' అట్లైన ♦ నల్పుదువె నీవె,వ్యాజ్యమందుగల్గు ♦ వాదమెల్ల
నీవుచెప్పునియమ ♦ మేహరింపగం జాల" ననుచుంబలికెను బయి♦న్యాయవాది.

ఆ. "వ్యాజ్యమందు నీవు ♦ వాదింపనున్న వా,దమ్మొనర్తుం గక్షి♦దారుకిష్ట
మైననేనె యెట్టు♦లైనను నేనిందు, తప్పదొప్పుకొనుట ♦ దప్పిదంబు". 595

క. అనిపలికె మోహనుడు క,న్గొచును దనకక్షిదారుం ♦ గొంకుచతండీ
కొనెగాంధి నడుపవ్యాజ్యము, పనివిని దైవమ్ముపైన ♦ భారమ్మిడుచున్. 596

క. "ఒప్పుకొనుము పొరపాటును, ముప్పే విధికూర్పనున్నం♦ బొందుదమదియుగా
ఎప్పుగిదినైన దైవము, తప్పక కాపాడుమనల♦ ధర్మమటంచున్. 597

ఆ. పలుకంగక్షిదారు ♦ పరమసంతోషాంత, రంగుడయ్యె గాంధి ♦ బెంగవిడక
పలికెమీాది న్యాయ♦వాది మోహనుమొండి, తనమునకును జాగ్ర♦తనువహింప.

## చాతుర్యమా

క. సందియము లేదు తనహిత,వ్రుం దగవునమేలు గూర్చు ♦ టొప్పుగనైనన్
సందేహించెను దనబల,ముం దగునే కేసుకంచు ♦ మోహానుడుమదిన్. 599

క. అంతటి క్లిష్టవ్యాజ్యము, నెంతయు సుప్రీముకోర్టు ♦ యెదుటనిల్చివే
పంతమ్మున వాదించుట, కంతరమున గాంధిభీతి ♦ నడలెనొకింతన్. 600

వ. లెక్కల యందలి పొరపాటుం గురించి గాంధి పలికినంతటనే, న్యాయమూర్తు లందొకరు 'గాంధీ యిదిపార్ప్రాక్టీన్' కాదా? అని పోనాడెను. అందులకు గాంధి తనడెందమున మిగులఁగుంది కారణ మిసుమంతయును లేకుండనే మొద టనే యింతగా తనపైన పోహపడిన న్యాయమూర్తి యెదుట నంతటిక్లిష్టమైన వ్యాజ్యమున వాద మాడి జయించుట దుస్తరమనియే తలపోసెను. అయినను దనయాలోచనములెల్ల నడంచుకొని న్యాయమూర్తి కిట్లు బదులిడెను.

"నావినుచునది పూర్తిగా వినకముందే నన్ననుమానించుట చాల ఆశ్చర్య ముగా నున్నది"

"సందేహించుట అనునదేలేదు. కేవలమది యొకసూచనయే."

"సూచించుటే నాకుశంకించుటగాదోచినది. దయనుంచి నా చెప్పునదెల్ల ముందుగను విని, నన్ను శంకించుటప్పుడు సముచితమగుచో నటు చేయదగునని నావిన్నపము"

"మంచిది నిన్నింక అభ్యంతరపరచుటలేదు. నీవు చెప్పగోరిన దెల్ల చెప్పుము.

క. తనవాదమునకు గావల,సిన విషయములవలసినంత ♦ చేకూర్చియుం
డెనుగాంధి; మొదటినుండి య,తనివాదము మీదకోర్టు ♦ ధ్యానము నిలుపన్.

ఆ. విపులధృతి నతండు ♦ విషయమ్ము వివరించె, వినియెకోర్టు శ్రద్ధ♦వినిచినంత
న్యాయమూర్తులెల్ల ♦ నచ్చెరిగాంధి చెప్పినదె సత్యమంచుఁ ♦ బేర్మికూర్మి. 603

తే. అందుచే వారలాతీర్పు ♦ నంతఁ దిరుగ, త్రోడగా నిష్టపడరైరి ♦ వాడిమైన
వాద మొనరించినం బ్రతి♦వాదికక్షి,వారు వారిపక్షీయ ని♦వాక్యముగను. 604

మ. పొరపాటుగాంచి యెప్పకొనకయున్న, మీరేమి చేయగ♦లారో చెప్పండి.
మానియమించిన ♦ వానినిమించు, గణికుండు లభియింప ♦ గలడెమీకుర్వి
కనుకనీపొరపాటు ♦ కన్ననుమించి, కారణమ్ము పరికించు ♦ గనబర్చకున్న
కోర్టువారొప్పరు ♦ క్రొత్తగా కేసుఁ, దిరిగివిచారణ ♦ నెరపగఁగాన
తీర్పిప్పటిదె కోర్టు ♦ స్థిరపర్చె మీకు, వాదమామోదింప ♦ మేదియునంచు
పలికిరిన్యాయమూ♦ర్తులు పొరపాటు, సవరణకెల్లరు ♦ సంతోషపడిరి. 610

## కక్షిదారులే సహచరులైరి

సీ. అడ్వొకేటగుచు నె♦టాలున నట్టార్ని, గా ప్రాక్టిసొనరింపఁ ♦ గలడొకండు
అడ్వొకేటుగలేక ♦ అట్టార్నిగనెమాత్ర, మలట్రాన్సువాలులో♦వెలయనగును

భారతీయులతోటి ♦ ప్రత్యక్షసంబంధ, మలవడ ట్రాన్సువా ♦ లందు గాంధి
ఆట్టార్ని పట్టాని ♦ కనుమతిబడసె మే,జెస్ట్రీటు ఎదుటు వా♦దించె నొకపు
గీ. డల్లజోహాన్సుబర్గున ♦ నట్టియెడల, గాంధికనుగొనెఁ దనుఁదన ♦ కక్షిదారు
మోసగించె నటంచంత ♦ కేసుఁగొట్టి, వేయుమంచును గోర్టుకు ♦ వినతిచేసె. 611
క. అందుకు మేజెస్ట్రీటా, నందంబును బొందె నెదుటి♦యట్టార్ని కడుం
జెందెను విస్మయమెంతయొ, గాంధియు జీవాట్లుపెట్టె ♦ క్లైంటును మిగులన్.
క. తప్పుడు కేసులు నాకడ, కెప్పుడుగొనిరాకు నాదు ♦ యెదుటికి నికనం
చొప్పుగదిట్ట నతఁడుతన, తప్పునుమన్నింపవేడెఁ ♦ దద్దయుగాంధిన్. 613
ఆ. ఇందువలనగాంధి ♦ కెచ్చుగా 'ప్రాక్టీసు', వచ్చెనతని సత్య♦వాక్కు కెంతొ
మెచ్చుతోడివారు ♦ హెచ్చెనాతనికీర్తి, తెల్లవారిప్రేమ ♦ కొల్లగొనియె. 614
ఆ. మీదుమిగులఁ దనకు ♦ నేదైనవ్యాజ్యంబు, దుష్కరమ్మటంచు ♦ దోచినంత
తెలియదంచుఁ దనకు ♦ దెలిపియన్యన్యాయ,వాదికడకు గాంధి♦పంపువాని. 615
సీ. ఇటువంటికల్ల క♦పటములు లేనిమో,హాను సత్ప్రవర్తన♦మ్మతనికెల్ల
కక్షిదారులప్రేమ ♦ గౌరవపూర్వక, విశ్వాసము గడించి♦పెట్టమిగుల
ఈగౌరవమ్మును ♦ రాగమ్ముగాంధికి, కొండంత సాయమ్ము ♦ గూర్చెనతని
వరప్రజాహిత కార్య,వర్గమ్ము సులభత,నమ్ముగాఁ దోడ్పాటు ♦ ప్రజలొసంగ
ఆ. గాంధిడబ్బుగొనుచు ♦ గావించెను వకీలు,వృత్తిగూడ ప్రజని♦మిత్తమంచు
దారచరితులైన ♦ భారతీయులుకొని, యాడుచతని పనులొ♦నర్చి రెప్డు. 616
క. చెరసాలకు తమహక్కుల, కొరకేగిరి కష్టములకు ♦ గురియైననటన్
చిరునవ్వున ముందువెనుక, లరయకయే దక్షిణాఫ్రి♦కందిండియనులున్. 617
మం. ఇటుగాంధి కక్షిదా♦రెందరో యతని, కెటువంటి కష్టమ్ము ♦ లెదురైనవిడక
అనుచరులై మిత్రు♦లై యెల్లకడల, తనువినుచునదెల్ల ♦ తలదాల్చిచేసి
రన్నికష్టము లపా♦యమ్ములకోర్చి, రన్నియుమధుర స్మృ♦త్యావళిగాగ. 620

### కక్షిదారుని రక్షించుట

ఆ. గాంధిఁగలసి సకల♦కార్యంబులం బని,చేసి పిదప తనదు ♦ కేసులొసగి
అతనికక్షిదారు ♦ షైనట్టి పార్సిర, స్తొంజి గాంధి కిష్టు♦డుం జిరముగ. 621
ఆ. గాంధియందు నమ్మ♦కమున నాతఁడు తన,గేహవిషయముల స్వ♦దేహగతుల
తెలియజేసియతని ♦ సలహా సహాయముల్, వాడుకగ నతంబు ♦ వడయుచుండె.
క. తెలుపుచునుండిన సకలము, తెలుపకయుండెను తనస్థి♦తిన్ జేరపురీ
తుల గాంధికద్ది యాతని, నలుపుబజారు వర్తకంబు ♦ నాడెముజెడగన్. 623
సీ. బొంబాయి కలకత్త ♦ మున్నగుపరదేశ, పట్టణమ్ములనుండి ♦ పలుసరకుల
తెప్పించు సుంకరు ♦ లెప్పటికప్పుడు, విశ్వసించిరతని ♦ విమలుడంచు

నమ్మించియధికార్ల ♦ నెమ్మెయినోవారి, కండ్లకాకము గొట్టి ♦ గడుసరిగను
దొంగచాటుగ చట్ట ♦ మంగీకరింపని, సరుకులదెప్పించి ♦ చాటుగాను
సీ. అధికలాభమ్ములాశించి ♦ యమ్ముచుండె, నైనఘూర్జరకవి అఖో♦యాడినట్లు
పాదరసముఁ జౌర్యమును దా♦పంగనౌనె, పార్సిరస్తోమ్జికడ యీ♦పాపకూప
మందుబడియె నొకప్పుడు ♦ మందమతిగ. 624

క. కన్నీరుగారఁ జెక్కుల, నన్నా నానేరమిదె బ♦యల్పడె నేడే
నిన్నింతకు వంచించితి, నిన్నాళ్ళే దొంగబేర♦మే చేసితయో! 625

క. చెరసాలకేగఁ జెడుదును, కరుణింపగ నీవెవలతి ♦ కావగ నన్నీ
దురితాబ్ధినుండి సకల, మ్మెరిగించితి దీనిదప్ప ♦ నిపుడేమందుఁగా. 626

క. వ్యాపారతంత్రముల నీ, కోపిక చెడునంచుఁదెలుప ♦ నుడిగితి యీ నా
పాపమ్మును క్షమియింపుము, కాపాడుమటంచు గాంధి♦కడ మొరలిడియెఁగా.

తే. అంతనాపార్సిరస్తోమ్జి ♦ ననునయించి, నిన్ను గాచుట విడుచుట♦కన్న వినుము
దేవుడెవలంతి యాతడే ♦ దిక్కు నీకు, కానదేవునిపై భార ♦ మూనినిలుము 628

తే. ఎరుగుదీవెల్ల ననుగూర్చి♦యెల్లనాడు, విధివిధానము సకలంబు ♦ వినుమొనర్తు
కావనను నీవొనర్చిన ♦ కలుపమెల్ల, బయటనిడితప్పు క్షమియింప♦బ్రతుములాడి.

ఆ. అనుచు గాంధిపల్క ♦ నాపార్సిరస్తోంజి, చాలనొచ్చిమదిని ♦ జాలనొక్క
ఒప్పుకొనగనాదు ♦ తప్పెల్లనీముఁదు, నంచుఁబల్కగాంధి ♦ యనియెమరల.630

ఆ. "నాకుగాదు తప్పొ♦నర్చినదీవు ప్ర,భుత్వమునకుగాన ♦ బొసగదిందు
ఒప్పుకొనుటనీదు ♦ తప్పునాకడ"నన్న, "సరియెనీవుచెప్ప ♦ నరగఁజేతు
నైన నావకీలు ♦ నైన నీవొక్కింత, సంప్రతింపుమతఁడు ♦ సఘుడనాకు." 631

వ. విచారింపగా నాతని దొంగబేరము చాటుమాటుగ చాలకాలముగా జరుగుచుండెనని తెలియనయ్యెను. అయినను కనుగొనబడిన తప్పిదము చాల చిన్న మొత్తముదే యైయుండెను. గాంధియు రస్తోమ్జితోకలసి యాతని వాడుకవకీలు కడ కేగెను. ఆతడా వ్యాజ్యమునకు సంబంధించిన పత్రములనెల్ల పరిశీలించి, "యీ కేసు జూరీలచే విచారణ చేయబడును. నెటాలులోని తెల్లజూరీలు భారతీయుని విడుదలసేయుట అసంభవము. అయినను నేనాశవదలకుండ ప్రయత్నింతు" నని వాకొనెను. గాంధి కావకీలుతో నంతపరిచయములేదు. అందువలన రస్తోమ్జి "మీరుచెప్పినదంతయు సత్యమే. కాని యీ కేసులో గాంధి సలహాను పాటింపవలయునని నాకోరిక. అతనికి నాకు చాలస్నేహానుబంధము గలదు. మీరును వారి కవసరమైనప్పుడెల్ల సలహాల నీయవచ్చును" అని తన వకీలుకు వినతిచేసెను.

తదనంతరము వారు రస్టోంజిపాపునకు జనిరి. అచట గాంధి యాలోచించి తనయభిప్రాయము నిట్లు తెలిపెను:— "ఈకేసు కోర్టువరకు పోనక్కరలేదు. నీపైన చర్య పుచ్చుకొనుటకుగాని, లేక నిన్ను వదలివేయుటకుగాని, సుంకరోద్యోగికి సర్వాధికారము గలదు. అతడు అట్టార్ని జనరల్ చెప్పినట్లు చేయును. వీరిద్దరిని నేను స్వయముగా కలుసుకొని మాట్లాడెదను. నీవు వారు నిర్ణయించినప్రకార మపరాధము చెల్లింపవలసియుండును. వారిందుకు చాలవరకు సమ్మతింతురనియే నేతలంతును. వా రందులకు సమ్మతింపకపోయినచో నీవు చెరసాల కరుగుటకు సంసిద్ధుడవుగా నుండవలయును. నేరము చేయుటకు సిగ్గుపడవలయునుగాని, చెరసాలకరుగుటకు సిగ్గుపడవలసినపనిలేదని నాయభిప్రాయము. సిగ్గుపడవలసిన పనిచేయడ మిదివరకే జరిగిపోయినది. చెరకేగుట, చేసినపాపమునకు ప్రాయశ్చిత్తమని భావింపుము. నిజమైనప్రాయశ్చిత్తము, తిరిగి యిట్టి దొంగతేరమునం దడుగిడనని ప్రమాణ మొనర్చుటలో నున్నది." 632

ఆ. అనుచుగాంధిపలుక ♦ దనయభిప్రాయంబు, పార్సిబెండువడుచు ♦ పదరె"నాదు
వేరుగౌరవములు ♦ పెంపెల్లచెడనుండె, నీవెదిక్కుచేతు ♦ నీయనుజ్ఞ." 633

మం. తనబోధనాసమ♦ర్థత నంతగాంధి, విని యోగ మొనరించి ♦ విజయంబుగాంచె
వెడలిసుంకరికెల్ల♦వివరించిపార్సి, కడునొచ్చెఁగాబట్టి ♦ కాపాడవేడె
పలికెసుంకరి "నాదు♦పనినీకుతెలియు, తెలుపుమట్టార్ని జ♦న్రలునకిదెల్ల
చేతునేనాతండు ♦ చెప్పినట్టనగ", నా తదుపరిగాంధి ♦ యరసియట్టార్ని
జనరలునొప్పించెఁ♦దనసత్యనిరతి, చనువును బోధనా ♦ సామర్థ్యమెసగ. 633

క. రెట్టింపుగ జరిమానా, కట్టగ విడుదలనుపార్సి ♦ కాంచెనతండుఁ
కట్టెం దదీయలిఖితము, చట్టమున బిగించి గదిని ♦ జదువగజనముల్. 639

క. రామాకృతినాథా నీ,నామభజన సతముజేసి♦న మహాత్ముని గాం
ధీమాహాత్మ్యంబున నిది, ఆమోదింపగదె నాల్గ♦వది స్కంధంబుఁ. 640

తే. రామ శ్రీమదంబటి సుబ్బ♦ రాయవిరచి,తాంధ్ర గాంధిమాహాత్మ్యమం♦దాలకించి
నావె నాల్గవస్కంధంబు ♦ నవ్యదివ్య, భావభరిత భవద్భక్త ♦ భవ్యచరిత. 641

చతుర్థస్కంధము, సంపూర్ణము.

---

# నాలవస్కంధమున కనుబంధము

---

వ. 1906 వ సంవత్సరము జూలై నెలలో ముగిసిన జులూల తిరుగుబాటునుండి ఫోనిక్సునకు గ్రమ్మరిన గాంధి జోహాన్సుబర్గునకు త్వరగా పోవలసివచ్చెను. అందొక చిన్నయింటియందు తగిన సౌకర్యములు లేకున్నను నందు మకా మేర్పరుచుకొనెను. నౌకరు లెవరు లేనందున స్వయంపాకమే శరణ్యమాయెను. కాన గాంధి కాహారవస్తు గుణపరిశీలనమున కనుకూల మేర్పడెను. కొన్ని నెలలపాటు ఉప్పులేకుండనే భోజనము సాగించెను. మరికొంతకాలము చక్కెర విసర్జించెను. ఇంక కొంతకాలము పచ్చిపదార్థములే సాపడెను. ఈ వివిధాహార ప్రయోగము లాచరించుటం దవ్వానివలన మానవునికి శారీరకముగాను నైతికముగాను గలుగు గుణ పరిశీలనము జరిగెను. కొంతకాలము రక్తపరిశుద్ధ మొనర్చు పదార్థమని ఉల్లిపాయల వాడెను. కాని కామోద్రేకము గలిగించు వస్తువుగా ననుభవమున దెలియ దానిని బూర్తిగా మానివైచెను, 1906 ఆగస్టు 22 వ తేదిన ట్రాన్స్వాల్ ప్రభుత్వము రాష్ట్రమున నివసించు ప్రతిభారతీయుడును, తనపేరు రిజిస్టరు చేసికొనవలయుననియు, నందుకు దప్పువారు మూడు నెలల కఠిన కారాగార శిక్షకు పాల్గావలసి యుండుననియు నొక ఆర్డినెన్సును ప్రకటించెను. అయ్యది శాసనమై, భారతీయులందుకు లోబడుచో, దక్షిణాఫ్రికాలోని భారతీయుల జీవితము నాశనమగునని గాంధి యాందోళన లేవదీయ సమకట్టి, భారతీయ ముఖ్యుల సమావేశపరచెను. తత్సమావేశమున బహిరంగముగా నార్డినెన్సును ప్రతిఘటింపవలయునని తీర్మానము జరిగెను. గాంధి నాయకుడుగా నొక రాయబారవర్గము వలసరాజ్య కార్యదర్శిని దర్శించెను. అది నిష్ఫలముకాగా నాసెప్టెంబరు 11 వ తేదిన మూడువేలమంది భారతీయ ప్రతినిధులు సమావేశమైరి. తత్సమావేశమున నార్డినెన్సును బ్రతిఘటింపవలయు ననియు, నందుచే నొదవు నెట్టివిపత్తులకు వెనుకంజవేయకుండ పోరాటము సాగింపవలయుననియు దీర్మానము జరిగెను. ఆతీర్మానమును బలపరచుచు గాంధి యిట్లు ప్రసంగించెను. **1**

సీ. "మనకష్టముల నివారణకు నర్థించుచు, బంకేగుదమంట ♦ భావ్యమగునె"
అనిపల్కఁదగదొక ♦ అవుసుసాచరణంబు, టన్నుల బ్రాత కూ♦తలకు మిన్న
సౌతాఫ్రికాలోని ♦ సకలాసియాజన, ప్రతికూలశాసన ♦ ప్రచయమందు
మిగులదుర్భరదుష్ట ♦ మగునదీ యార్డినెన్సగుట నిందింత వె♦న్నాఁడరస్మ

తే. దీయసోదరులగు భార ♦ తీయులంచు, విశ్వసింతెవ్వరేనియు ♦ వెనుకబడిన
మిత్తిగవ్యాకమందేను ♦ జొత్తుగాని, ఆర్డినెన్సుకు లోబడ ♦ నాత్మనిడను. 2

వ. అని గాంధిపలుకగా నాయన ననుసరించి, యచటఁజేరిన భారతీయు లందరును దైవసాక్షిగా నా యార్డినెన్సుకు లోబడమని శపథముగావించిరి. ఈనూతనోద్యమమునకు, సాత్విక నిరోధమని గాంధి ముందు పేరిడెను. అక్టోబరు 3 వ తేదిన బ్రిటీషు ప్రభుత్వముపై నొత్తిడితెచ్చు నిమిత్తము మరియొకరితో గలిసి గాంధి యింగ్లాండునకు రాయబార మరిగెను. నాటివీడ్కోలు సభలో గాంధి యిట్లుపలికెను. 3

ఆ. చేయగలదియెల్ల ♦ జేతుమేమింగ్లాండు, నందు మీరలిచట ♦ డిందువడక
నడుపు డుద్యమము ధ ♦ నము సేకరింపుడు, హిందు మహమదీయు ♦ లేకమగుడు.

లండనుకు రాయబారము—1906

వ. 1906 అక్టోబ రారవ తేదిన లండనుచేరి దాదాభాయి నౌరోజి మొదలగు శ్రేయోభిలాషుల ద్వారా కృషిచేసి నవంబరు 8 వ తేదిన వలసరాజ్యమంత్రిని, తదుపరి ప్రధానమంత్రినిగూడ కలిసి మాటాడెను. మొత్తముమీద నింగ్లాండున గాంధి ఆరువారాలపాటుండి ప్రతినిమేషము సద్వినియోగ మొనర్చెను. వెచ్చించిన ప్రతిపైసాకు లెక్కలిడెను. ఇండియాలోవలె నింగ్లాండునను విద్యార్థు లడ్రసులు వ్రాయుటందును, స్టాంపులంటించుటందును, నుత్తరములు పోస్టుచేయుటందును గాంధికి సాయపడిరి. అతని నిస్స్వార్థసేవంగాంచి సైమండ రసు బ్రిటీషుమిత్రుడు ప్రతిరాత్రి పండ్రెండుగంటలవరకు టైపుచేసి యిచ్చెను. 'టైమ్సు' మొదలగు నాంగ్లపత్రికలు కూడ గాంధికి సాయపడెను. కడ కాతడు డిశంబరులో దక్షిణాఫ్రికాకు గ్రమ్మరెను. అతనికృషి ఫలితముగా నా ఆర్డినెన్సు శాసనమగుటకు 1907 జూను మాసమువర కాగెను. ఆజూనుమాసమున ప్యాసైన శాసనానుసరణి జూలై నెల 31 వ తేది లోపల భారతీయులెల్ల రిజిస్టరుచేసికొనవలసియుండెను. గాంధి యాశాసనము నొకసవాలుగాఁబరిగణించియిట్లుపల్కెను.

సత్యాగ్రహోదయము—1907

క. మనపై యీనూతన శాసనమిడు బానిసపు గుర్తు ♦ స్వాంతమున నెరిం
గినవారమగుటలోబడ, జనదెవరిండియను లిట్టి ♦ చట్టమ్మునకున్. 6

క. ధీరులగుటచే బ్రిటిషధికారు లుపన్యాసములను ♦ గైకొనరింతన్
ధీరోదాత్తమగు ప్రతీకారపు చర్యలనె గొప్ప ♦ గా మెత్తురిలన్. 7

సీ. అనుచు "పాసివురెసి ♦ స్టన్సు" సంఘమును స్థాపించె సభలుజరి ♦ పెనుజనమ్ము
శపథముల్ చేసిరి ♦ సరిక్రొత్తగా జట్టు, మెదిరించినిల్చెద ♦ మెల్లర మని
ఏ నూరుగురొతప్ప ♦ యెల్లరెదిర్చిరి, గాంధిప్రభుత్వంబు ♦ బందిసుంచె. 8

ఆ. అయినను ద్యమమ్ము ♦ నాగకసాగె నూ,రార్లమంది జైలు ♦ కరిగి రిండి
యను లెదిర్చి చట్ట♦మును వెనుకాడక, తెచ్చెగాంధి బంది♦తిండి మూర్పు. 8

ఆ. కడకు స్మట్సుమనసు ♦ కరిగి సంధికినొప్పె, గాంధిఁ బిలువనంపె ♦ గలియఁదన్ను
చేసికొనిరియె సంధి ♦ చీకాకువడకైన, కొట్టెగాంధి నొక♦కట్టెతోప
ఠానొకండు గాంధి♦తమ్ము నేమార్చెనం, చాసుపత్రి నాత♦డకట పడెను. 9

క. వినను మీరాలమనుప, ఠానతని న్విడువుడనియె ♦ దండింపక య
జ్ఞానమునగొట్టె దన్నని,మానసమున నెనరు బూని ♦ మరచియు నెల్లన్. 10

తే. సంధిషరతులు నెరవేర్చె ♦ గాంధి కాని, స్మట్సు తప్పెను గ్రొత్తశా♦సన మొనర్చి
ఉచ్చులబిగింప భారతీ♦యుల మెడలకు,కాని ప్రకటించెనంతట♦ గాంధియిట్లు. 11

మ. ఈదుష్టశాసన ♦ మేసియాటికు, ఆక్టుసంధిషరత్తు ♦ లనుసరించియును
రద్దొనర్పనియెడ ♦ రగిలింతుమగ్ని, సకలసర్టిఫికెట్టు ♦ లకటంచు బల్కె
భారతీయుల తమ♦భావంబు దెలియ, లైసెన్సులేకుండ ♦ చేసిరెల్లెడల
వ్యాపారమంతట ♦ వడిప్రభుత్వమ్ము, చేసె నరెస్టులు ♦ శిక్షలువేసె
కానిగాంధి నరెస్టు ♦ గావింపకుండె, నంతట వ్రాసెమో♦హనుడిట్లుస్మట్సుకు
వేద ప్రజలలీల ♦ బెదరింపనేల, నాయకుండేనుండ ♦ నన్నేలనిట్టు
చెనకకుంటిరిదేమి ♦ పనియంచు నీస,డించె హర్తాళము ♦ నేర్పాటొనర్చె
అల్ల జూలైయిర్వ♦దవ మూడవదిన,మందు నాగష్టు పదు♦నారవ తేది
కాల్చసర్టిఫికెట్లఁ ♦ గలసిరందరును, గాంధియా సభ్యులఁ ♦ గనియిట్లువల్కె
ఇపుడైనసరె కాల్ప♦యిష్టంబులేని, వారలు పుచ్చుకో ♦ వచ్చునువారి
సరిటిఫికెట్టులఁ ♦ దిరిగి యీనాడు, కాల్చియీసర్టిఫి♦కటుల నీదుష్ట
చట్టమ్మునకులొంగ ♦ మెట్టులేమంచు, మనమనో నిశ్చయం,బును జాటుచుంటి
మిదిబాగుగనెరింగి ♦ యిందురకఁదగు, ననగ గాంధిని గొట్టి♦నట్టి పఠాను
గాంధిభాయికిఁ దప్పు♦గావించితే న,టంచు గాల్పగనిచ్చె ♦ నాతనిసర్టి
ఫికెటును గాంధియుం ♦ క్షేమమైనతని, కరముచే గొని కిను♦కరియె నాడుమనము
నందులే దెప్పుడే♦నాడు నీపైన, టంచుబల్కెను ప్రీతి♦నంద నందరును
కాలుపబడెరెండు ♦ వేలకుమించి, సర్టిఫికెట్లిదె ♦ సరిక్రొత్తరాజ
కీయ జీవితమునఁ ♦ జేయగాబడిన, తొలిగాంధి బాన్ఫయర్ ♦ కలవరపరుప
స్మట్సుగాంధినిబిల్చె ♦ సంధిమాటలకు, విఫలంబుగానది ♦ వేరొక్కమారు
కాల్చిరి సర్టిఫి♦కట్లిండియనులు,
పార్శిరస్టోమిజీ♦వంటి వర్తకశి,ఖామణులేగిరి ♦ కారాగృహమున
కట్టోబరునఁ బదు♦నైదవ తేది, రెండవపరి గాంధి ♦ రెండుమాసముల

కఠినశిక్షవిధింపఁ ♦ గడువార్త మొదవె, ననిపల్కి జైలున ♦ కరిగెను సందు
బాధలుఁబడుటండె ♦ పడయఁగానగును, ముక్తిగల్గును జయ♦ము దప్పకుండ
అనిపంపె సందేశ♦మును దనప్రజకు, కడదాకనింత వె♦న్కాడకుడంచు.
లండనుసభనొందు ♦ ఖండించిరిడుట, గాంధినిజైలందుఁ ♦ గడకు డిశెంబ
రాదినివిడుదల ♦ యయ్యెఁగస్తూరి, కడకు దర్బనుకేగెఁ ♦ గడువ్యాధినుండ 38

మరల అండనుకు—1909

వ. ఉద్యమము తీవ్రముగాదొడఁగెను. గాంధి పలుమారరెస్టయి శిక్షింపబడి విడుదలై తిరిగి తిరిగి అరెస్టయి విడుదలగాంచుచుండెను. జైలునుంచి విడుదలైన యొక్కొక్కపరి గాంధి మరింతజ్ఞానవృద్ధుడుగాఁ జొచ్చెను. జైలులోనున్నప్పుడు వివిధభాషలలోఁగల ముప్పదిపుస్తకములు పఠించెను. తమిళపుస్తకములగూడ చదివెను. నాఁటి తనకారాగార నివాసముగూర్చి గాంధి యిట్లు వాక్రుచ్చెను.

సీ. జన్మభూమిస్వార్థమై ♦ జైలునందుండుట, ఉత్తమాదృష్టమీ ♦ యుర్వినగును
అనుదినజీవిత ♦ మందలి కష్టాల, నుండివిముక్తిని ♦ నొందవచ్చు
అన్నానికి శ్రమింప ♦ నవసరముండదు. కలుగుఁబరిశ్రమ ♦ కాయమునకు
కలుషవర్తన కవ♦కాశముండదొకింత, ప్రార్థింపదైవముఁ ♦ వ్యవధియుండు
తే. ఆత్మముక్తికి సోపాన♦మబ్బునిట్లు, జెయిలులో దేహమొండె వ♦సించుగష్ట
ములకునోర్చిమై లొంగక ♦ నిలువఁదరుణ,మబ్బుజైలిట్లు మేలెప్పు♦డందఁజేయు.
ఆ. బందినుండి విడుద♦లంది నంతమరింత, ఉత్సుకతను నడిపె ♦ నుద్యమంబు
సడలకపోయె దినమ♦రుదుగ నాలుగుగంట,లకును మించియు బను♦లన్నునింగి.
సీ. కడకుప్రభుత్వంబు ♦ గ్రహియించె సత్యాగ్ర,హమ్ముడంపగ నసా♦ధ్యంబటంచు
గాంధిని విడుదల♦గావించె నంతట,క్రమ్మర రాయబా♦రంబు లండ
నరిగెదానిని నొక♦యం దిట్టుల లిఖించె, "సత్యంబుగానాకు ♦ జైలువాస
మేబాగుగానుండె ♦ నెంతోసదృక్తితో, దైవముఁ బ్రార్థింపఁ ♦ దగినస్థలము
తే. పరగఁజెరసాలయే వైభ♦వమువిలాస,సుఖము లాడంబరములుండు♦చోటులందు
వినయవిశ్వాసభక్తులు ♦ వెలయవెందు, దైవమందుఁదదీయప్రా♦ర్థనలనంచు. 41

వ. ఈరాయబారమునకును దొంటిరాయబారమునకు బట్టినగతియే పట్టెను. గాంధి చాలకష్టపడి పార్లమెంటు సభ్యులఁ బలువుర దర్శించెను. కాని యదయంతయుఁ బూడిదఁబోసిన పన్నీరయ్యెను. అందుచే గాంధి నిస్సంకోచముగా నిట్లు నుడివెను. 42

సీ. పెద్దవారనిగొడు ♦ పేరందినట్టివా,రిం దిలకించుకొ♦లంది నధిక
ముగు వెగటుజనించె ♦ నధికారమందున్న, వారికింతయు న్యాయ♦వాంఛలేదు.

అధికారతాపత్రయమె కాని యవ్వారి, కేమాత్రమును ధర్మ♦దృష్టి లేదు
ఇట్టివారలఁగటా! ♦ యాతఁడించుటకుఁగాల, ధనముల వెచ్చించు♦టనుచితంబు
తే. అమల సత్యాగ్రహికి జైలు♦కరుగుటుచిత,ముంచు ఫలమందె కానియా♦వందుఁ గైన
రాయబారాలవలననో ♦ రంగబోదు, ఫలితమని నమ్మువనె స్వాను♦భవము దెలుపు.
సీ. స్వసుఖంబునకె కాదు ♦ సత్యంబునకుగూడ, సత్యాగ్రహుల మేటి ♦ సమర మెన్న
శపథమ్ముగొంటిమా ♦ శాశ్వతసత్య దై,వము పేర గాన ♦ నీశ్వరుడె మా శ
పథము సంపూర్తిగా ♦ బథము చూపించు నం,చాత్మవిశ్వాసంబు♦నధికమయ్యె
జనధనంబులు మాకు ♦ సత్యాగ్రహుల కెంతో, తక్కువగానున్న ♦ దప్పకుండ
ఆ. అనుచు వ్రాసె గాంధి ♦ ఆంప్థిల్ ప్రభువునకా,తండుశిక్షించినట్టి ♦ కడిదమందు
మెండుగాను గోర♦కుండుడటంచు నా,తండు వ్రాయబడులు ♦ ధర్మ మెంచి. 45

వ. ఇట్లు గాంధి లండనులో నాల్గుమాసములుండెను. ఓటధికారమునకుగాను, సాత్వికనిరోధోద్యమును సాగించు డస్పార్డ్ సతీమణి వంటివారిని, మాతృదేశ దాస్యవిమోచనమునకై యాంగ్లేయుల హత్యగావించ వెనుకాడని మదన్‌లాల్ ధింగ్రావంటి వారి నా కాలమున గాంధిచూచుట తటస్థించెను. ఆంగ్లదుస్తుల ధరించి దక్షిణాఫ్రికాలోవలె విందు లారగింప మిత్రుల నాహ్వానించెను. ధింగ్రానుగూర్చి యిట్లు తనభావమును గాంధి వెల్లడించెను. 46

ఆ. ధింగ్రవంటివారి ♦ ధీరకార్యములెల్ల, క్రూరమైనవగుటఁ ♦ గూర్పవింత
సత్ఫలంబు వారి ♦ సమధికష్టగు దేశ,భక్తితప్పు దారి♦బట్టె నకట. 47

వ. ఈ రెండవతూరి లండనులో నుండిన కాలమందే, గాంధి టాల్‌స్టాయికి మొదట ఉత్తరము వ్రాసెను. అందుకు టాల్‌స్టాయి తనజవాబులో గాంధి నతనియుద్యమమునఁ బ్రోత్సహించుచు వ్రాసెను. తదుపరి నవంబరు 13 వ తేది గాంధి లండనునుండి రిక్తహస్తములతోడను, రెట్టించిన మనోనిశ్చయముతోడను దక్షిణాఫ్రికాకు మరలెను. మదన్‌లాల్ ధింగ్రా కోర్టులో నిచ్చిన వాఙ్మూలమిందు స్మరింప దగినది

మం. భారతయువకుల ♦ బలువుర దేశ,భక్తుల నురిదీయు ♦ పాతకంబునకు
ఆంగ్లరక్తము గార్ప ♦ యత్నించినాను, ఇందెవ్వరిని సంప్ర♦తించలేదేను
నాయంతరాత్మను ♦ నాధర్మములనె, సంప్రతించితి నిందు ♦ సమ్మతమార
నా దేశమున కప♦రాధం బొనర్చు, టీశ్వరునెడఁ జేసిన♦ట్లె నెంచినాడ
దేశభక్తియె రామ ♦ దేవునిభక్తి, దేశసేవయె కృష్ణ♦దేవుని సేవ
ఈభక్తిసేవల ♦ నీదలకొంటి, భగవదర్పణముగాఁ ♦ బ్రాణమానముల. 54

### హిందు స్వరాజ్యము—1909

వ. గాంధి లండనులో నుండినప్పు డిండియాకు స్వరాజ్యము సాధించుటగూర్చి యాలోచింప నారంభించెను. అందన్నిరకాల భారతీయులతోడను సంప్రతింపులు

జరుపుచుండ, నాతని రాజకీయభావము లోక స్థిరరూపము దాల్పదొడగెను. 1909 అక్టోబరు 9 వ తేదిన దానుదిగిన వెస్ట్‌మినిస్టర్ పేలస్ హోటల్‌నుండి ఆంప్థిల్ ప్రభువుకు వ్రాసిన ఉత్తరములోని భావములే తదనంతరము తనతిరుగు ప్రయాణములో స్టీమరుకాగిదాలలో ఆ నవంబరు 13 నుండి, 22 వరకు, 271 పేజీల నెడమచేతితో వ్రాసిన హింద్ స్వరాజ్ లేక ఇండియన్ హోంరూల్ అను గ్రంథమున నుండెను. సుమారు లేబది పేజీల గ్రంథ మెడమచేతితో డైలాగు రూపమున వ్రాసెను. అయ్యది దిరువది యాధ్యాయాల గ్రంథము; అందు గాంధికి స్వరాజ్యముగూర్చి కల భావములు విశదముగా బొందుబరుపబడి యుండెను.

ఆ. దేశభక్తి యనగ ♦ దేశమందలి సర్వ,జనుల క్షేమము మన♦సారగోరి
శక్తికొలది కృషిని ♦ సతతమ్ముసేయుట, వేయకుండ నెపుడు ♦ వెనుకకడుగు. 56

క. ధరణి స్వరాజ్యంబనగా, గరచుట పరిపాలనంబు ♦ గర్వింపకయే
మరకంబ్రజల స్వాయమ్ముగ, పరగనొనర్చులె యటంచు ♦ పలికెనతండున్. 57

సీ. "ఆశయతరుఫలం ♦ బార్జింపసాధన, బీజముత్తమముగా ♦ వెలయవలయు
విత్తుబట్టియెయుండు ♦ వృక్షంబు; దయ్యంబు, దాపునజేరునె ♦ దైవభక్తు"
డని ప్రవచించెమో♦హనుడుహిందుస్వరాజ్య, మందాశయము సాధ♦నాళిగూర్చి
ప్రచురించె నద్దాని ♦ వరుసగా నిండియ, నొపినియనున మొద♦లోపి పిదప 58

తే. పుస్తకమ్ముగ బ్రకటించె♦బొంబయి ప్ర,భుత్వపు నిషేధమునుదాట♦ మోహనుండె
అనువదించె నాంగ్లమ్మున ♦ కందులోని, భావములు పురాతత్వప్ర♦భావితములు.

తే. పంపెటాల్స్టాయికద్దాని ♦ ప్రతినొకండు, ఆతడుపఠించి ముదమున ♦ నందులోని
'పాసివ్‌రెసిస్టనును' యీ ప్ర♦పంచ సర్వ,జనులకెల్ల శిరోధార్య♦మనుచు వ్రాసె.

### గాంధికి భారతదేశము మద్దతు—1909

మం. దక్షిణాఫ్రికయందు ♦ దీక్షమైగాంధి, అడలకింతేనియు ♦ సుడుగక శ్వేత
జాతిప్రభువులిడు ♦ సకలకష్టముల,కోర్చి సాగించు మ♦హోద్యమ ప్రతిభ
గూరిచి యందున ♦ భారతప్రజలు, భరతమాతృకగౌర ♦ వార్థమై కుడుచు
కడగండ్లగూర్చియు ♦ నెడదకరంగ, తెలియ కాంగ్రెస్సు లీ♦గులవంటి యెల్ల
సంఘముల్ నాయక ♦ సత్తముల్లైన, గోఖ్లేమున్నగువారు ♦ కూడిమోహనుని
ఆతని సత్యాగ్ర♦హమును వేనోళ్ళ, కొనియాడి రెంతయో ♦ తనియగారతన
తాతాదిమహనీయ ♦ దాతలువేల, కొలది విరాళము ♦ లలయక బంపి
రందిన ధనమున ♦ కంతకునందు, వ్యయమైన ప్రతిపైస ♦ కాయవ్యయముల
లెక్కలదెలిపె గో♦ఖ్లేకు మోహనుడు, ట్రాన్సువాలున భార♦తప్రజలెల్ల
పడుకష్టమంతయూ ♦ వరకిండియనులు, విశ్రమింపకుడంచు ♦ వినతినొనర్చె. 69

## టాల్స్టాయి క్షేత్రము—1910

వ. 1910 మేనెల 30 వ తేది కలెనుబేకు తన 1100 ఎకరాల సుక్షేత్రమును గాంధిజీ అనుచరులగు పేద సత్యాగ్రహుల కర్పించెను. అయ్యది జోహాన్సుబర్గు నగరమునకు 21 మైళ్ళ దూరముననుండెను. దానికి టాల్స్టాయి క్షేత్రమని గాంధి పేరిడెను. గాంధి కలెను బేకులు కలిసి సత్యాగ్రహుల కందు నివసింప గృహనిర్మాణము నేయ సమకట్టిరి. జూన్ నెల 4 వ తేది కొందరు సత్యాగ్రహులా క్షేత్రమందలి భూమి దున్ని పనిచేసి జీవింపవచ్చిరి. వారిండియాలోని పల్లుప్రాంతములకు చెందినవారు. హైందవ ముస్లిము క్రైస్తవాది వివిధమతస్థు లందుండిరి. వారిలో 40 మంది యువకులు, నిద్దరో ముగ్గురో వృద్ధులు, అయిదుగురు వనితలు, ముప్పదిమంది బాలబాలికలు నుండిరి. అందరి కొకేవంట, ఒకేశాకాహారము. క్రైస్తవస్త్రీలు వంటచేయదొడగిరి. గాంధియు నతనిసహచరు లందు సహకరించిరి. త్రాగుడును పొగత్రాగుడు నందు నిషేధింపబడెను. ఎవరుతిన్న పాత్రలు వారే శుద్ధిచేసికొనిరి. ఇట్లు రెండునెలలపాటు గుడారములలో నివసించినవెనుక యిండ్లు తయారయ్యెను. తంబినాయుడనే ఆంధ్రుడు బజారుపనులు, ఆరోగ్యవసతులు చక్కజూచెను. పురుషులు స్త్రీలు వేర్వేరుచోట్ల నివసించిరి. వివాహితులు గూడ బ్రహ్మచారులుగా నుండు నియమము పాటింపబడెను. వంటపనిలేనివారు తోటపనిచేసిరి. ఆశ్రమము పనిమీాద తప్ప రయిలుమీాద నెవరును పోరాదు. విహారమరుగువారికి నడకయే శరణ్యము. ఆరోగ్యసూత్రములు చాలా కచ్చితముగా ననుసరింపబడెను. కసవంతయు గుంతలందు గ్రుమ్మరింపబడెను. మురికినీరంతయు మొక్కలకు బోయబడెను. ఎంగిళ్ళు ఎరువుగా వినియోగమయ్యెను. మలమూత్రాదుల కొకగోయి త్రవ్వబడెను. అందలి కుటుంబములు స్వయంపోషకములుగా నుండగలందులకు చిన్నచిన్నపరిశ్రమలు ప్రారంభింపబడెను. చెప్పులకుట్టుట కలెనుబేకునుండి నేర్చి మోహనుడాశ్రమ మందలి వారికందరికి నేర్పెను. కలెనుబేకు మొదలగు యువకులతో గలిసి గాంధి యధ్యాపకుడుగా నందలి బాలబాలికలకు విద్యగరప మొదలిడెను. గుజరాతీలకు ఘూర్జరభాషయందును, తదితరుల కాంగ్లమందును బోధన జరిగెను. మతవిద్యను గాంధియే నేర్పెను. అన్నిమతములును సమానముగా గౌరవింపబడవలెననియు, నందరు నన్నదమ్ములవలె వ్యవహరించవలెననియు గాంధి బోధించెను. నాటి ఆయన అధ్యాపకోపన్యాసములు నీతిధర్మము లేక నైతికమతము అను పేరుతో పుస్తకరూపమున 1912 లో ప్రచురింపబడెను. గాంధి కాలమంతయు సత్యాగ్రహసమరమునకే వినియోగమయ్యెను. ఏడాది కైదారువేల పౌండ్ల ఆదాయము

గల తనన్యాయవాద వృత్తిని విడనాడి 1910 నుండి తాను నెఱపు సత్యాగ్రహమునకే తన యావదాస్తియు ప్రజాభ్యుదయము నిమిత్తము వ్యయించెను. పేద వాని జీవితము గడుప గాంధి అన్నివిధాల తయారయ్యెను. 70

—— తుపానుముందు నెమ్మది—1911 ——

సీ. అయిదవజార్జి ప♦ట్టాభిషేకము నెంచి, అనుకూలముగ నిండి♦యను జనులకు
చట్టమ్ముసవరింప ♦ సమకట్టగ ప్రభుత్వ,మెదిరింప దెల్లవా♦రెంచిరంత
జనులు స్మట్సుతో ♦ జాబుజవాబులు, జరిపితాత్కాలిక ♦ సంధిగాంధి
చేసికొనియెనందు ♦ చేగాంచిరి విముక్తి, సత్యాగ్రహులు చెర♦సాలనుండి
తే. భారతీయులెల్లరు వారి♦వ్యాకృతులును, చేసికొననుమతి వడ♦సిరి తలంచి
రందరు సమాప్తియయ్యెస♦త్యాగ్రహమని, భారతీయులుతమరాజ♦భక్తిదెలుప.

వ. అయినను దెల్లవారితో సమానమగు నంతస్థుతోడనే, వారిసాధికోరికోత్సవముల బాల్గొన నగునని భారతీయులు ప్రకటించిరి. ఆ డిశెంబరులోగలకత్తలో జరిగిన కాంగ్రెసు గాంధినభినందించుచు దీర్మానించెను. సత్యాగ్రహసమాప్తితో గాంధి గ్రంథపఠనయందు దనకాలము గడుపజొచ్చెను. దినానికి 40 మైళ్ళ నడక నానాళ్ళలో గాంధి సాగించుట వాడుకగా నుండెను. ఒకానొకనాడు 55 మైళ్ళుగూడ నడచెను. 1912 సెప్టంబరులో దనయావదాస్తిని ప్రజాభ్యుదయ కార్యములకు వినియోగింప ధర్మసంస్థపరము గావించెను. సర్వదా సౌతాఫ్రికాకు రమ్మని గోఖేలును గాంధి యాహ్వానించుచునే యుండెను. గోఖేలును వలయుననుమతివడసి 1912 అక్టోబరులో దక్షిణాఫ్రికాకు చేరెను. 72

—— గోకేలురాక—1912 ——

తే. భారతీయులతో పోటి♦పడిరి తెల్ల,వారు గోకేలున కొసంగు ♦ స్వాగతమున
సమముగా బోల్గొనిరి విందు♦సమయమందు, తెల్లవారును నల్లవా♦రెల్లవారు.
ఆ. హిందిలోని కనువ♦దించె గోకులు మరా, తీప్రసంగములను ♦ దివ్యముగను
గాంధినిండియాకు ♦ గ్రమ్మరమనె గోక్లె,స్మట్సుకొప్పబల్కి ♦ సలుపమేలు
భారతీయులకును ♦ ప్రతికూలమగు చట్ట,ములను రద్దొనర్చి ♦ కలుగప్రీతి. 74
క. అందులకు బదులిట్లాడెను, గాంధి "యిచటిమంత్రుల నెరు♦గరు మీరలునా
డెందంబున మీనమ్మిన, చందంబున నేను నమ్మ♦జాలను వీరిన్. 75

వ. అట్లయినను వీరికడ మీరు మాటతీసి కొన్నారు. అదిచాలు, తిరిగి సత్యాగ్రహము చేయవలసివచ్చిన ద్విగుణీకృతోత్సాహముతోc జేయుటకు. ఎట్లయినను, మరొకవత్సరమువరకు మరికొంద రిండియనులు జైలున కేగినంతవరకే నిండియాకు రాజాలనని నాతలంపు." అంతట గోకులు డిండియాకు గ్రమ్మరెను. బొంబాయిలో దిగినతోడనే గోకులు డొకానొక ప్రసంగమున గాంధినిగూర్చి యిట్లు పల్కెను. 76

సీ. గాంధి సమక్షము ♦ గలియువారె యొకంగ, గలకత్తవ్యక్తిక్వ ♦ గరిమపెరిమె
కలదిప్పుడాతని ♦ కడమహావీరులం, ద్యాగులంగల బలో♦త్సాహశక్తి
కూడనుండెడువారి ♦ కూడవీరత్యాగ, ధనులుగాజేయు నా♦ధ్యాత్మికప్ర
భావంబుగలవాడు ♦ భావింపనతడు నా,యకుడుగా చెరసాల♦కరిగి రిండి
తే. యను లిటీవల సత్యాగ్రహమున నిరువ,దేడువందల జనమాత్మ♦దేశగౌర
వార్థమందుగలరు ధని♦కాధికులు ద,రిద్రనారాయణులును జ♦రిత్రసృష్టి. 77
క. నాయావజ్జీవితమం, బాయనవలె నను ప్రభావి♦తాత్మునిగాగన్
జేయగగలిగిరి దాదా,బాయియు కసడేలునొండె ♦ భావింపంగన్. 78
ఆ. ఎక్కటినీచభాష ♦ కృత్యంబులకు వారి, ఎదుట దావొసంగ ♦ డెట్టికసును
గాంధి దక్షిణాఫ్రి♦కా యందెరువదేండ్లు,నుండి పోరుచుండె ♦ నిండియనుల
ఆత్మగౌరవార్థ ♦ మునకనికిండియు బుణ, పడియునున్న దెంతొ ♦ విసువకుండ. 79
సీ. అయిదారువేల పౌం♦డ్లాదాయ మేడాది, కొసగు ప్రాక్టీసువీడి ♦ యొసక మెసగ
పేదలబోలె జీ♦వించుచుండెను మూడు.పౌండ్లతో నెలకన్ని ♦ వత్సరములు
సాగించుచుండిన ♦ సత్యాగ్రహమ్మెరో, పీయులయెడలేదు ♦ ద్వేషమింత
ఐరోపియులు గూడ ♦ గౌరవింతురుగాంధిఁ, గరచాలన మొనర్చి ♦ కవముసభల
ఆ. గాంధిగూర్చి చాల♦గమనింప దగినట్టి, విషయమిద్దియంచు ♦ వివిధగతుల
గాంధిఘనతగూర్చి ♦ కడుగొనియాడె గో,కులుడు ప్రజలసాను ♦ కూలపరుప.

### గొప్పపోరాటము—1918

వ. సత్యాగ్రహులు జైలునుండి విడుదలవడముతో గాంధి తన బసిని టాల్స్టాయి క్షేత్రమునుండి ఫోనిక్సుక్షేత్రమునకు మార్చెను. సత్యాగ్రహము తిరిగి యారంభింప నవసరము లేకున్నచో గాంధి 1913 మధ్యభాగమున నిండియాకు గ్రమ్మర నిర్ణయము గైకొనియుండెను. కాని యా 1913 జనవరినుండియె పరిస్థితులు సత్యాగ్రహ పునఃప్రారంభమున కేర్పడదొడగెను. హాసనెసోపను ముసిలిముసోదరుడు 1903 లో నిండియా కరిగియుండి బాయ్ మరియమను నామెను వివాహమాడి యుండెను. ఆమెను 1912 లో దక్షిణాఫ్రికాకు గొనివచ్చెను. దక్షిణాఫ్రికా ప్రభుత్వ మామె ననుమతింపదయ్యెను. సుప్రీముకోర్టును 1913 మార్చి 14 వ తేదిన ప్రభుత్వమునకే అనుకూలముగ దీర్పొసగెను కనుక భారతస్త్రీ జాతిగౌరవరక్షణార్థము సత్యాగ్రహము తిరిగి ప్రారంభింపవలసి వచ్చెను. ఇదియిట్లుండ 1913 ఏప్రిలు 12 వ తేదిన ప్రకటింపబడిన నూతన ప్రభుత్వశాసనము గాంధి స్మట్సులకు జరిగిన తాత్కాలిక సమాధానమునకు గొడ్డలిపెట్టుగా నుండెను. అంత గాంధి. 81

మ. కనుకదానిని పూర్తి♦గా మార్పుకున్న, తప్పదు తిరిగి స♦త్యాగ్రహారంభ
మెప్పటివలె బాధ♦లిడుములు బడుట, తప్పదిండియనులకు ♦ తప్పకనష్ట
కష్టమ్ములందు సౌ♦ఖ్యాన్వేషణం బొ,నర్పగావలసి యు♦న్నదని వాకొనియె. 84

వ. మేనెల మొదటివారములో ట్రాన్స్వాలు భారతస్త్రీ సమాజము వా రవమాన
కరమగు సుప్రీముకోర్టు తీర్పునకు లోబడుటకు బదులు, తమమగవారితో కలిసి,
తాము ను సత్యాగ్రహ మొనర్తుమని మంత్రికిఁ దంత్రివార్త నంపిరి. గాంధియు
యథాప్రకారము రాయబారములు గ్రమ్మర నారంభించి విఫలుడై సెప్టంబరు
12 వ తేది యిట్లొక ప్రకటన గావించెను. 85

మ. సత్యాగ్రహమునకు ♦ స్వాగతంబొసగె, తిరిగి ప్రభుతభార♦తీయులయెడ సు
హృద్భావమునీవడె ♦ హృదయవిదారకముగ గాన నెటుల ♦ గల్గునుసంధి
ఈతూరిపోరాట ♦ మీప్రభుత్వమ్ము,వారి సౌతాఫ్రికా ♦ నైరోపియనుల
హృదయమ్ముకరుగుట ♦ కెందాకవలయు, నందాక కష్టమెం♦తైనను నోర్చి
సాగింపవలయును ♦ సత్యాగ్రహమున, పాల్గొనజైలుకు ♦ ప్రతిభారతీయు
డరుగనుండవలెఁ ద♦యారుగా సతము, మనయొక్క మనదేశ ♦ మర్యాదకొరకు
మనశాంతిసేనలో ♦ మనవార లైదు,వందలమందైన ♦ వందమందైన
ఏబదిమందైన ♦ నేవురేనైన, శాంతమ్ముగానున్న ♦ జయమెన్న మనదె
అంతసెప్టెంబర్ ప♦దైదవ తేది, కస్తూరిబాతోడ ♦ కలిసిపదారు
మంది సత్యాగ్రహుల్ ♦ పొందుగా డర్బ,నందుండి వోల్క్రస్టు ♦ కరిగిశాసనని
రాకృతిచేసి కా♦రాగారమునకు, చేరిరి మూణెళ్ళ ♦ శిక్షవిధింప
ఆనెలలోనిర్వ ♦ దైదవ తేది, గాంధిశాసన నిరా♦కరణమొనర్చె
చొచ్చిట్రాన్స్వాలు య♦థేచ్ఛమైకాని, అతనిన రెస్టుసే♦యమి ప్రభుత్వమ్ము
చేరె జోహాన్సుబర్గు ♦ చేసెప్రసంగ, మొకగొప్ప సభలోన ♦ బ్రకటించు టిట్లు
"టాల్స్టాయి క్షేత్రస్థ ♦ తమిళసత్యాగ్ర,హ స్త్రీలునెల్లరు ♦ నరిగి నెటాల
రెస్టుగావలయున♦ రెస్టుగాకున్న, అలనెటాల్ బొగ్గు గ♦నులలోని యిండి
యనుకార్మికుల సమ్మె♦నొనరింపగా ప్ర,బోధింపవలెనన్న" పూన్కినాస్త్రీలు
చేసికట్టుల సమ్మె ♦ చేసిరి బొగ్గు,గనుల నిండియనుల ♦ కార్మికుల్ మూడు
వేల జనమ్మంత ♦ జైలుకంపెను ప్ర,భుత్వమాస్త్రీలను ♦ మూణెళ్ళశిక్ష. 105

వ. ఈ సంగతి తెలిసినవెంటనె గాంధి యా మూడువేలమంది కార్మికులకు భోజ
నాదివసతుల కేర్పాటు చేయబోయెను. అట్టిసమయమందు డి. ఎమ్. లాజరెసను
తమిళక్రైస్తవుడు తనసర్వస్వమునా సత్యాగ్రహార్థము సమర్పించెను. అతనిగృహ
మొక ధర్మసత్రముగా సాగెను. సమ్మె జరిగినంతకాలము గాంధి వారితోనే
యుండి, వారితోనే తిండి. పండుట జరిపెదనని ప్రతినచేసెను. ఇట్లు కట్టుగుడ్డ

లతో తన్నుచేరిన ఆ 5000 మంది కార్మికులకు భోజనాది వసతుల గూర్చవల
సిన సమస్య చాల పెద్దదిగా గాంధికి కనుపడెను. ఇట్టివిశ్వాసపాత్ర యాత్రికుల,
సత్యాగ్రహ సైనికులుగామార్చ గాంధి వారి నటు ట్రాన్సువాలునకు నడిపించి
యందు ప్రభుత్వమువారి జైలునందో, టాల్స్టాయి క్షేత్రమందో వసింపజేయుట
లగ్గని తలంచెను. 1913 అక్టోబరు 28-వ తేదిన యీసత్యాగ్రహ దండయాత్ర
ప్రారంభించెను. 36 మైళ్ళు పయనించి చార్లెసుటౌను చేరి అచటనుండి గాంధి
వలయుచో దమ్మందే అరెస్టు చేయవచ్చునని ప్రభుత్వమునకు దంతె నిచ్చెను.
అచట వంటవారితో నొకడై కష్టించెను. అందొకవారము వేచియున్నను ప్రభు
త్వమునుండి జవాబురామిచే, నందుండి టాల్స్టాయి క్షేత్రమునకు నవంబరు 6-వ
తేదిన బయలుదేరిరి. ఓల్క్రిస్టుయొద్దను అరెస్టులు జరుగలేదు. అచటి కెనిమిది
మైళ్ళ ఆవలనున్న పామ్ఫర్డువద్ద రాత్రి విశ్రమించియున్న గాంధి నరెస్టుచేసిరి.
కాని మరునాడే 50 పౌండ్ల జామీనుమీద విడుదలై యాత్రలో గలిసెను.
స్టాండర్టు టౌనుకడ క్రమ్మర నరెస్టయి, తిరిగి విడుదలై తనవారింజేరెను. తిరిగి
యానెల 9-వ తేది మూడవదపా గాంధి నరెస్టుచేసిరి. ఆమరునాడు సత్యాగ్ర
హుల నందరి నరెస్టుచేసిరి. నెటాలుకు గొంపోయి యందు బందియందుంచిరి.
గాంధికి 9 నెలల కఠినశిక్ష విధింపబడెను. ఈసమాచారము విన్నవెంటనే
నెటాలులోని 20,000 మంది కార్మికులు సమ్మెచేసిరి. మిలటరీపోలీసు తరిమి
కాల్చినను కార్మికులు లొంగరైరి. గాంధికి తిరిగి మూణెళ్ళును, అతని అను
చరులగు పోలకు, కలెనుబేకుల కొక్కొక్కరికి మూణెళ్లును శిక్ష విధించిరి.
అట్టిసమయమున గోకేలు నాయకత్వమున భారతీయు సకలవిధ సహాయసంపదల
సత్యాగ్రహుల కందచేసిరి. ఇండియా వైస్రాయియు, బ్రిటిషిండియామంత్రి
యును సానుభూతి తెలిపిరి. అంత దక్షిణాఫ్రికాప్రభుత్వము మోమోటి డిశంబరు
11-వ తేదిన నొక కమిషను నేర్పాటుచేసిరి. ఆ కమిషనువారు గాంధిని విడు
దలచేయ సిఫారసుచేసెను. డిశంబరు 18-వ తేదిన గాంధి విడుదలగాంచి,
నూతనసంవత్సరమునాటికి తమ న్యాయమైనకోర్కెల దీర్పకున్న తిరిగి సత్యా
గ్రహమున కుపక్రమింతుమని ప్రకటించెను. ఈసమాచారమువిని గోక్లే అండ్రూ
సును గాంధికడకు తనరాయబారిగా బంపెను. అతడు గాంధిని సత్యాగ్రహ
సంరంభమునుండి మరల్చి స్మట్సును గలియ ప్రిటోరియాకు గాంధిని గొంపో
యెను. అట్టి సందిగ్ధసమయముననే సౌతాఫ్రికా రైల్వేలలోని యూరోపియకార్మి
కులు పెద్దయెత్తున సమ్మెచేసియుండిరి. అంత గాంధిప్రభుత్వమునకు మరింత
తొందరకలిగింప నిచ్ఛలేమి తనసత్యాగ్రహము నాపివైచెను. ఇట్టి గాంధిగారి

అచంచలము, నిర్దుష్టము, నత్యుత్కృష్టమునగు నపూర్వచర్య కాతని నభినందిం చుచు తెల్లజాతినాయకు లాతనితో సమాధానమున కొడంబడిరి. 1914 జనవరి 21-వ తేదిన తాత్కాలిక సమాధానము జరిగెను. దీనికే స్మట్సు గాంధి సమాధానమను పేరుకల్గెను. ఇందువలన నిండియనులపైనుండిన మూడుపౌండ్లపన్ను రద్దయ్యెను. ఇండియనుల పెండ్లిం డ్లంగీకరింపబడెను. మొత్తముమీద నిండియనుల కనుకూలముగా జరిగెను. గాంధిని దక్షిణాఫ్రికాలో తనపని ముగిసినందున లండనుమూలమున నిండియా జేరెను. 105

మహాత్మ బిరుదప్రదానము-1915

క. పదియుం దొమ్మిదివందల, పదునైదవయేట జానువ♦వరి నెలయం ది
ర్వదియేడవతేదిన నొక, సదస్సుగొండాలుపురిని ♦ జరిగెనుదొల్లిన్. 106

సీ. సౌతాఫ్రికానుండి ♦ చనుదెంచినంతట నరిగె గొండాల్ ప్రభు ♦ నరయకొరకు
తనయుద్యమార్థంబు♦తరుచునార్థిక సహా,యంబు బంపిన తదీ♦యప్రభునకు
తనగౌరవ కృతజ్ఞ♦తలు దెల్పగా నందు, గాంధికొసగిన స్వా♦గతసదస్సు
నందు గాంధి జి దక్షి♦ణాఫ్రికాలో భార,తీయార్థముగ నద్వి♦తీయముగను

ఆ. సలిపినట్టి శాంతి ♦ సమరమ్ము తద్విజ,యముల గూర్చిపొగడు ♦ చమరవాణి
చదివెశ్లోకములను ♦ జాలనాసంస్థాన, వైద్యరాజుమిగుల ♦ హృద్యముగను. 107

వ. వైద్యరాజ జీవరాము కాళిదాస శాస్త్రియను నా సంస్కృతవిద్యావేత్త తన యమరభాషా వైశారద్యంబు వెలయబంచిన యా శ్లోకరాజములం దంతట గాంధిజీని మహాత్ముండని వర్ణించెను. అప్పటినుండి మహాత్మబిరుదమా యను పేరుతో చిరస్థాయిగా వెలసెను. 108

తే. ఆయనంతరమునను మ♦హాత్మమహిమ, క్రమముగా మోహను మహామ♦హిమ
యుతము, లైనమానవాతీత కా♦ర్యములుగుణము, లనిబినెంట మ్మొసగె మ♦
హాత్మబిరుదు. 109

మం. విశ్వమెల్లయు దన♦వీడుగానెంచి, వసుధయే తనకుటుం♦బమ్ముగా దలచి
దైవభక్తియుతుండు ♦ ధర్మమార్గాను, వర్తియై కష్టజీ♦వాప్తుండునగుచు
వెలసిన ఆండ్రూసు ♦ వెళ్ళిగాంధిజిని, అరయ సబర్మతీ♦యాశ్రమమందు
కారణమేదియో , కాని గాంధిజిని, కాంచినంతట నాచ♦రించె సాష్టాంగ
వందనంబదివిని ♦ వ్రాసె నాంగ్లేయ, పత్రికలది యాంగ్లపదవి ప్రతిష్ఠ
లకు భంగకరమంచు ♦ వికటంబుగాను, అందుకుబదు లిట్టు ♦ లాండ్రూసువ్రాసె
"అమలవర్తనుడు మహాత్ముడు గాంధి, అవతారపురుషుండు ♦ నాయన నరసి
నంత నాకే తెలి♦యకనే భక్తి, నాచరించితిని సా♦ష్టాంగవందనము" 117

ఓం శ్రీరామ, జయరామ, జయజయరామ

# శ్రీ గాంధి మాహాత్మ్యము

## పంచమస్కంధము



మన్మంగళ దాయక
నామా, భక్తాళిపాప ♦ [illegible]మా
ధీమద్వినుత సుమేరు
స్థైమా రాజకులలామ ♦ సీతారామా.

### మొదటి అనుభవము

సీ. బొంబాయి చేరక♦మున్నె మోహనుఁడంపె, తంతిఫోనిక్సు బృం♦దమునకిట్లు
"అని సంగతులు తల ♦ ముచుకలుగాఁగుంట, నెపుడు రాఁగలనో నే♦నిండియాకు
కాన మీరెల్లరుఁ ♦ గలసి మనుడుసాధ్య, మగునంత ఫోనిక్సు ♦ నందుబోలె
కలయు డాండ్రూసుఁ, దక్♦స్సలహా ప్రకారమ్మె,యెప్పుడు నేవచ్చు♦నంతదాఁక"
ఆండ్రూసు వారి శ్ర♦ద్ధానందు గురుకుల,మున కంగ్రిలోనుండ ♦ ననిపెఁ బిదప
శాంతినికేతనా ♦ శ్రమమున వారుండి, రారెండుస్థలములం ♦ దావసమున.

గీ. అరసికల్లశ్రద్ధానందు ♦ డలకవీంద్రు,డగు రవీంద్రుండు శిష్యబిష్ట♦లట్టు వారి
నందు వారుగడించిన♦యనుభవములు, వారికిని గాంధినుపయోగ♦పడియెఁబిదప.

సీ. ఆ రవీంద్రుండు శ్ర♦ద్ధానందుఁడు సుశీల, రుద్రుండునజహారి ♦ రుద్రులట్లు
ఆండ్రూసు మూర్తిత్ర♦యంబను గాంధి సౌ,తాఫ్రికాలోనుండు ♦ నప్పుడాతఁ
డాత్రిమూర్తులఁగూర్చి♦యుపకారమొనరించు, స్తుతులుగాంధిమధుర♦స్మృతుల
యందు. మధురాతి మధురముల్ ♦ మరియు విస్మృతిగాంచ. నివియుంచు బలికె
గాం♦ధియె సతమ్ము

గీ. స్వామికవ్యాశ్రమమ్ముల ♦ సరణి రుద్రు,నింటఁగూడ ఫోనిక్సు వా♦రుంటవొప్పె
ఎల్ల వారలు నాదర♦మెసఁగఁ గనిరి, కనిరి వారందు ఫోనిక్సు ♦ కరణిసుంట. 2

ఆ. మోహనుండు చేరె ♦ బొంబాయిపురిఁ; జేరె, నతనికల రవీంద్రు ♦ నాశ్రమమున
విడిసిరి తనవార♦నెడువార్త గోకులుం, గాంచిపిదప వారిఁ ♦ గలయఁగోరె. 3

సీ. స్వాగతోత్సవములు ♦ జరిగె బొంబాయి పు,రమ్మున గాంధి గౌ♦రవముకొరకు
అందొకచిన్ని స♦త్యాగ్రహమ్మొనరించు, సందర్భమేర్పడె ♦ గాంధికెనయ
అఁజహాంగీర్పెటొక ♦ హాలునఁ గనులకు, మిరుమిట్లు గొలిపెడు ♦ పరిసరముల
కార్మికజనములం ♦ గలసిజీవితమెల్లఁ గడపినగాంధికి ♦ గష్టముగను

గీ. తోఁచెఁ దదనురూపముగ నుం♦డుటకొకింత, నైనఁదనకథ్యవాడ్ దుస్తు♦లందునాగ
రుండుగాఁదోఁచె నెట్లాఫి♦కోఁజి మహాత, ప్రాపుచేగౌరవముగ నే♦బయటఁబడియె.

క. ఆతఁడుపరిజరిగెం గుజ,రాతుల విందొందునందు ♦ నాంగ్లమునను యా
హాతులు మాట్లాడిరి గుజ.రాతిని బదులిడియెగాంధి ♦ రమణీయముగన్. 5

మం. తడబడె మొదలొకిం♦తగ మోహనుండు ఆంగ్లమ్ముకూడ దం♦చాడగుజ్రాతి
నైననామాతృ లం♦దందరుదన్ను, మంచిదంచును బ్రశం♦సించుటచేత
తనమాతృభాషముల్ ♦ దనదేశజనుల, కడధైర్యముగ బల్క♦గాంధిదలంచె. 8

— పూనాలో గోఖలునితో —

మం. గాంధి బొంబేచేర♦గనె గోఖలుండు, "నినుగవర్నరు దన్ను♦కనగోరె నతని
చూచిపూనాకు వ♦చ్చుట లెస్సయంచు", చెప్పిపంపగనట్లె ♦ చేసెనుగాంధి
అలవిలింగ్డను ప్రభు♦వరసి మోహనుని, "నీవుప్రభుత్వము♦పై పూనుచర్య
లకు ముందునన్ను గ♦లయగగోరె"దనియె?, "సత్యాగ్రహిగనెట్టి♦చర్యనెవ్వాని
పైనఁబూనినను స♦వ్వాని దృక్పథము, తెలిసియాతనితోడఁ ♦ గలయయత్నింతు
ఇదినాదుపద్ధతి ♦ యిటులనే నడిచి, తలదక్షిణాఫ్రికా ♦ యందును సతము
అటులనే యుండియా♦యందు వర్తింపఁ, దలతు" నంచన గాంధి♦ తలనూపినీవు
"రావచ్చుఁగోరిన ♦ ప్డివకాంచెదవు, నాప్రభుత్వము తప్పా♦నర్పదే దెరిగి"
అనివిలింగ్డన్ ప్రభు♦వన గాంధివల్కె, ఆనమ్మకమెతన ♦ కాలంబనమని. 17

వ. గవర్నరుతోటి సంభాషణానంతరము మోహనుడు పూనాపురికరిగెను. అందు గోఖలుడును, ఆయనగారి "సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటి" సభ్యులును గాంధిని దమ యనురాగతరంగములందు ముంచెత్తిరి. ఆ సభ్యులనందరిని గోఖలుఁడు పరిచయమొనర్ప గాంధివా రందరితోడను సకలవిధ సమాచారముల గూర్చి సావధానముగాను, సంకోచరహితముగాను సంభాషించెను. మోహనుఁడాసొసైటియందు సభ్యుడుగానుండ, గోఖలుఁడు తీవ్రముగా నభిలషించెను. కాని యందలి సభ్యులు తమయాశయములు, నాచరణపద్ధతులు. మోహనుని యాశయాచరణ పద్ధతులకు విరుద్ధము లగుటచే గాంధియందుచేరుట తగదని భావించిరి. గాంధి తననియముల ననుసరించుటయం దెంత దీక్షగలవాడో, యితరుల నియమభేదముల నంత సహనముతో నరయువాడని గోఖలుని విశ్వాసము.

సీ. అందుచేగాంధి కిట్లనె గోఖలుఁడు "యీసొసైటి" సభ్యులకు నీ♦సహనశీల
మర్థమవమి స్వని ♦ యమములందునబట్టు, దలనుండి రెంతో స్వ♦తంత్రముగను
సమ్మతింతురు నీదు♦సభ్యత్వమునకు వా,రంచుఁ దలంతు మె♦ట్లయినవారు
గౌరవప్రేమలు ♦ గలవారునీపైన, నిందింతయును లేదు ♦ సందియంబు

ఆ. ఆసమధిక గౌర♦వానురాగముల కే పాయమొసవుచునెడు ♦ భయమువలన
వెనుకడుగిడిరంతే ♦ నినుసభ్యునిగఁగొన, నెట్టులైన సభ్యు ♦ డీవు గావు. 19

క. అనిపల్క నొక్కె మోహనుఁ,డనె ననుసభ్యునిగఁ గొన్న♦నటుగాకున్నన్
మనుటకునాకను పోసిక్స్, జనమున కాశ్రమము లెయు ♦ చక్కనివొందున్.

ఆ. ఘూర్జరుండనగుట ♦ ఘూర్జరప్రాంతమం, దాశ్రమంబునలయు ♦ నశ్రమమున
సేవ దేశమునకు ♦ జేయ ఘూర్జర రాష్ట్ర, మూలమున నసంగ ♦ మోహనుండు.

క. ఒప్పెడిది నీదు భావము, తప్పకనొనరింపు మీవు ♦ తలచినయటులన్
తప్పదు నాసాయం బిం,చిప్పని నాపనిగనెంతు ♦ నిడినెర వేరన్. 22

సీ. అనిగోకులుడుపల్క ♦ నానందపరవశుఁ, డయ్యె" నుండదుకష్ట ♦ మార్థికముగ
కష్టకాలములందుఁ♦గడకఁదోడ్పడువాఁ, లుందురంతయుమీ రె♦యోర్వవలదు
అనుచుమనోభార మడచె♦మోహనుఁడంత, నాశ్రమమ్మునకు మో♦హనుఁడుగోరు
ధనమీయజేసె యా♦తనికి గోఖేలు యే,ర్పాటులన్నియు నాస్♦సైటినుండి. 23

ఆ. విందుచేసెగాంధి ♦ వీడ్కొనువేళఁ దగ్గార వార్థ మాత♦ డారగించు
పండ్లు వేరుళనగ♦నప్పుఁ దెప్పించి తా,నదువలేకయున్న♦ నడచి బాధ
వచ్చువిందునందు ♦ బాల్గొన; నక్కటా! పడియెఁదెలివిడప్పి ♦ యడలసఖులు
తెలివివచ్చినంతఁ ♦ దెలిపెఁడాలేకున్న, జరుపుమంచు విందు♦జరిగె నపియు. 23

ఆది ఒక బెదరింపా

క. అరిగెనటనుండి పోర్బం,దరునకు మరిరాజకోటఁ ♦ దనయున్నసతిన్
మరియితరబంధుజనముల, నరయగ మోహనుడు మూడ♦వది తరగతిలోన్. 24

క. నాడుంటప్లేగు రోగము, మూడవక్లాసున ప్రయాణ♦మును జేయుజనుల్
తోడనె 'వీరంగామ్'కడ, నోడిరి మెడికల్ పరీక్ష ♦ కుండగనెరగాన్. 25

ఆ. గాంధియొడలు వేడి♦గానుంట జ్వరమునే, కూడుమల్ల రాజ♦కోట మెడిక
లాఫిసరునటంచు ♦ నంపె నినస్పెక్ట,రందు ప్రాసికొనియు ♦ గాంధిపేరు. 26

సీ. వాద్వానుమార్గాన♦బయనించుచుండె మో,హనుఁడంచెరిగివచ్చె♦నతనిగలయ
మోతిలాలను ప్రజా♦భ్యుదయ కార్యయశుండు,కలసిగాంధికెరుంగఁ♦దెలిపెనెల్ల
నల్ల వీరంగాము ♦ నందుఁబ్రయాణికుల్, పడుకడగండ్లంత ♦ నడిగెగాంధి
చెరసాలకరుగుదె♦చెప్పుమన నతండు, అరిగెదనీవునా♦యకుడవైన

ఆ. కథియవారు ప్రజలు♦గా మాకు మీపైన, కలదు మొదటిహక్కు ♦ కానమీరు
తిరుగుపయనమందుఁ ♦ దిగుడిందు మాయుప,జనుల పనులకార్యశౌ♦ర్యమరయ.

క. మీ పిలుపు విన్నయంతన, మాపనులంగట్టిపెట్టి ♦ మగుడక మీయా.
జ్ఞానలం గావించెద, మోపికఁజెరసాలకంప ♦ నుందుమటననెన్. 23

గీ. మోహనునికిట్లుబలుకగా ♦ మోతిలాలు,ఆతని మిత్రుడిట్లనియె మా♦యనుగులె

యిల,నైన భుక్తికిగాఁ బడు♦నై దురూహ్య, ములగడించునుగష్టించి♦నెలకుదినము
గంటసేపుమాత్రమ్మన్య ♦ కాలమందు, ప్రజలహితమునకై గొల్ల♦పాటుబడును.
ఆ. మాకునాయకుడుగ ♦ మమ్మెల్లనడిపించు, చదువుకొన్న మాకు ♦ నొదవసిగ్గు
వడగజేయుమంచుఁ ♦ బ్రస్తుతించెను మోతి,లాలు నతని మిత్రు♦డోలిఁజాల. 30
సీ. తదనంతరము మరిఁ♦తగ సన్నిహితుఁడుగా, మోతిలాలాశ్రమ♦మునవసించె
నెలనెల గొన్ని రో♦జులు నియతిగఁబిల్ల,వారికి టైలరింగ్♦నేర్పుచచట
వలయుకుట్టుపనుల ♦ వడితానె చేయుచుఁ, జెప్పువీరంగాము ♦ స్థితిగతులను
అచటిప్రయాణికు ♦ లనుభవించెడు కడ,గండ్లగూర్చి దినమ్ము ♦ గాంధితోడ
గీ. పాపమతఁడు మహాత్ముగా♦ వ్యాధివలన, యౌవనమ్మందె మరణించె♦నకట! అల్ల
వాదవాను ప్రజాసేవ ♦ భంగపడియె,నంచు మోహానుడనేదన ♦ యాత్మకథను.
ఆ. చేరిరాజకోటఁ ♦ జెచ్చెర మెడికలా,ఫిసరు నరసెగాంధి ♦ ప్రీతి నతడు
పంపెగాంధికడకె ♦ పనిచూడగా నిన♦స్పెక్టరును జివాట్లు♦పెట్టి తిట్టి. 32
సీ. ఆరోగ్యసూత్రముల్ ♦ ననుసరించుటఁజేసి, మూడవతరగతిఁ ♦ బోవువారు
ఆరోగ్యముగనుండి ♦ రా లేదయని పరీ,క్షింపగాబడి వెన్క♦బంప బడిరి
అనుభవమ్మున గాంధి ♦ కవగతమ్మగనాటి, యధికారులట్టి ప్ర♦యాణికులను
పశువులట్లుఁబెక్కు ♦ పరిభవమ్ములపాలు, గావించుటందెల్ల ♦ గనులగాంచి
గీ. అక్కటా! వీరికడగండ్ల ♦ కంతమున్నె?, అధికధనమున్నవారు వి♦ద్యాధికులగు
వారుపేదలవలె మూడ♦వతరగతిని, పైనమొనరించి పోరాడ♦వూనకున్న. 33
గీ. కథియవాడునవెచ్చటఁ ♦ గనిన చనిన, వినగనయ్యె వీరంగాము ♦ విప్రకృతులు
కనుకనుకమ్ము వి లింగ్డను♦తనకు జెప్పి,నటు నివేదింపఁదలచె మో♦హానుడువీని.
వ. అంత నతడావిషయమునకు సంబంధించిన సమాచారమునెల్ల సమీకరించి, వానినెల్లఁగష్టపడి పఠించి, బొంబాయి ప్రభుత్వముతో నుత్తరప్రత్యుత్తరముల జరిపి,వెల్లింగ్డన్ ప్రభువును, నతని యాంతరంగిక కార్యదర్శినిగూడగలసి గాంధి మాటాడెను. ఆప్రభుత్వ మందులకు సానుభూతిమాత్రము ప్రకటించి తప్పంత యుఁ గేంద్రప్రభుత్వము దనియు, దమ యధికారమందలి పనియే యైయుండి నచో నీపాటికాకష్టము లన్నియు నివారించి యుండమే? యనియుఁ దెలిపి, భారతప్రభుత్వమున కీవిషయముగూర్చి విన్నవింపమని గాంధికి జవాబిచ్చిరి. 35
గీ. భారతప్రభుత్వమునకు ♦ వ్రాసెగాంధి, వారుకిమ్మనకుండిరా ♦ వలనొకప్డు
లార్డుచెమ్సుఫర్డుదాను గ♦లసినవేళ, తెలిపెగాంధి వీరాంగము ♦ కలుషములను.
ఉ. అచ్చెరువందె చెమ్సుఫరు ♦ డంతనెరుంగ వచింప మోహనుం
డిచ్చెనుమాటఁ గష్టముల♦నెల్లఁ దలంగనొనర్తు నంచువే

చెచ్చెరసంగతుల్ తెలిసె ♦ చేసెననుజ్ఞఁ దలంగెఁ గష్టముల్
అచ్చున బత్రికంగనియె ♦ నానటమోహను డావిశేషముస్. 37

సీ. సత్యాగ్రహమున కీ♦సంఘటనమ్ముతో, భరతోర్వి నంకురా♦ర్పణముజరిగె
గాంధియభిప్రాయ♦మందు బొంబాయి ప్ర,భుత్వముం గలసిన♦ప్పుడు వచించె
తత్కార్యదర్శి "సత్యాగ్రహమ్మనుగూర్చి, గాంధిపల్కు తి ప్రసం♦గమువనొకట
ఇదిబెదరించుట ♦ కదసమర్థ ప్రభు,త్వము లొంగునొక్కో! స♦త్యాగ్రహమున"

గీ. కంచుఁదన యసమ్మతిని సూ♦చించె; గాంధి,పలికె "బెదరింపుగాదిది♦ప్రజకు మేలు
కొలుపు; దాస్యవిము క్తిని♦గోరు దేశ,మెల్ల స్వాంతంత్ర్యపథముల♦నెరుగవలదె..

క. తుదిమార్గము దౌర్జన్యము, వదిలించుకొనుటకు దేశ♦బానిసతనమా
యుధపథమది హింసయె లే,నిది సత్యాగ్రహము దాని♦నేర్పింతునిటన్". 39

శాంతినికేతనము

గీ. అరిగెశాంతి నికేతన♦మల్ల రాజ,కోటనుండి మోహానుడందు ♦ కూర్మి పేర్మి
ముంచియెత్తి రధ్యాపకుల్♦ముద్దుకుర్ర,లెల్లరందు గాంధినిమల్ల♦ముల్లసిల్ల.40

గీ. ముగ్ధమోహనమగు ప్రేమ♦ముప్పిరిగొన, మోహనునికటస్వాగత♦ముంబ్రమోద
భరితులై యిచ్చి రచ్చటి♦ వారలందు, గాంధికొదవె మొదటికే♦ల్కాపరిచితి.

మం. మునుబరోడా రాజ్య♦మున దేశపాండే, స్థాపించె నొక్కవి♦ద్యా సంస్థదాని
పేరుగంగానాథ ♦ విద్యాలయంబు, అందు నధ్యాపకు ♦ లందరినతఁడు
పిలిచెఁగుటుంబపు ♦ పేరులతోడ, 'కాకా' యనుచుకలే ♦ల్కారుపిల్వబడియె
'పడ్కె' మామనిబిల్వ♦బడె; నన్న యంచు, హరిహారశర్మ; త♦దన్యులు తదిత
రాహ్వయంబుల నొప్పి♦దందరువారు, కలసిచేసిరి పనుల్ ♦ గాంధితోడుతను
విద్యాలయము మూసి♦ వేసినవారి, యాత్మీయ బాంధవ్య♦మాఖ్యలల్లెపగె
వివిధవిద్యాసంస్థ ♦ విపులానుభవము, గడియింప నరుగుకా♦కాసా హెబట్లు
శాంతినికేతన ♦ సందర్శనార్థ, మనుదేర మోహనుం ♦ డాదసె నతని
చింతామణీశాస్త్రిఁ♦జేరి నేర్పించె, సంస్కృతమును కాక♦సాహెబాసంస్థ. 50

క. అలశాంతినికేతనమున, వెలసిరి ప్రత్యేకమైన ♦ విడిదిమగనలాల్
కులపతిగా 'పోనిక్స్వా,రలు ఫోనిక్సాశ్రమము స♦రణి బసపొసగన్. 51

క. తనప్రేమయు దనజ్ఞానము, తనదీక్షయుఁ దోడుగాఁగఁ ♦ దనవాసనశాం
తినికేతనమున నిండ,మ,గన లాలందుండఁగాంచె ♦ గాంధిముదముగన్. 52

సీ. అందుండి రాంబ్రహ్మ పి♦యరుసనుల్ మరిజగ,దానంద బాబునా♦గేంద్రబాబు
సంతోషనేపాలు ♦ శారదకాళి బా,బులుక్షితి మోహనా♦దులును వారి
గలసిమాటాడుచు ♦ గాంధి స్వయంసహా,యము గూర్చి చర్చల♦నందొనర్చె
విద్యార్థులును వారి ♦ యధ్యాపకులు దమ,వంటను దాముగా ♦ వండుకొన్న

గీ. యోగ్యదైహికనైతికా♦రోగ్యమొదవు, వలరువస్తుపాఠముగస్వ♦యంసహాయ
విషయమందు విద్యార్థులు ♦ విశదముగ నెఱుంగనెల్లయువంటల♦రుచులనంగ.

క. అందులకధ్యాపకులం, గొందరు విద్యార్థులెల్ల ♦ కుతుకము జూపన్
పొందస్వరాజ్యము మూలలమ్మిందే కలదంచుఁ గవిర♦వీంద్రుండనియెన్. 54

క. అంను 'పియర్సన్ పరమా,నందముతో మునిగిపెద్ద ♦ ఆండాల్ గిండాల్
అందముగా గన్పడునటు, లందోమగఁ బూనెనతఁడ♦నాయాసముగన్. 55

సీ. కూరగాయలు తరు♦గుటకూనె జట్టొండు, కడుగబియ్యము మరొ♦కండుజట్టు
వంటశాలఁదదీయ ♦ పరిసరమ్ముల శుభ్ర,పరుపనాగెన్ బాబు♦వరుసవారు
పనిచేయుచుండగా ♦ వారల బడలికం, బోజేయఁగొందరు ♦ పూనిచేత
వారిసితారుపై ♦ పాడంగఁదొడగిరి, పట్టిరికొందరు ♦ పారఁజేత

గీ. అకసివారల నానంద♦మంద గాంధి, అల్లశాంతి నికేతన ♦ మెల్లపనుల
కాలవాలముగాఁ గన♦నయ్యెఁగనుల, పండువుగఁ గొంతకాలమీ♦పగిదినడచె.

క. ఫోనిక్సువారివలె తా,మూనిరి తమవంటచేయ ♦ నోపికతోడన్
పూని నిరాడంబరముగ, మాని మసాలాలు నాశ్ర♦మము విద్యార్థుల్. 57

గీ. పప్పుబియ్యము గూరలు ♦ వండిరెల్ల, గోధుమపు పిండి రొట్టెలు♦కూడనొక్క
పరిగొ యావిరియంత్రము♦పైన నట్లు, వండగాజూచి ఫోనిక్సు ♦ వారలెపుడు.

ఆ. కొన్నిదినములిట్లు ♦ కొనసాగె శాంతి ని,కేతనమున వంట♦లా తదుపరి
నిలిచిపోయెనైన ♦ విలువైన సత్ప్రయో,గానుభవము వలన ♦ గల్గె మేలు. 59

వ. అట్లు మోహనుఁడు మరికొంతకాల మా శాంతినికేతనమందే యుండఁదలంచె
కాని, విధి మరియొక విధింపలంచెను. 60

ఉ. శాంతినికేతనమ్మున ప్ర♦శాంతముగా నొకవారముండఁగా
తంతియొకండు వచ్చెనట ♦ తండ్రిసముండగు గోఖలుండు ప్రా
ణాంతకమైనవ్యాధి మృతి♦నందెను పూనపురంబు నందటం
చెంతయుఁగుంద మోహనుఁడు ♦ నెల్లరుఁజింతిల నాశ్రమంబునన్. 61

క. శాంతినికేతన మంతయు. చింతాక్రాంతమ్మునయ్యెఁ ♦ జేరియొకటిగా
సంతాపసభను జరిపిరి, కాంతఁగలసి గాంధిచనె నొ♦కట పూనాకున్. 62

సీ. చనెమగన్ లాలు మో♦హానువెంట, బర్ద్వాను, వరకేగె నాండ్రూసు♦వలదటన్న
పయనంబునన్ గాంధి♦ ప్రశ్నించెనాండ్రూసు,"సత్యాగ్రహమ్మిందు♦జరుగునొక్కొ
జరుగుచో నెప్పుడు ♦ జరుగునో యోచించి, చెప్పగలాడవే ♦ చెప్పుమన్న"
"చెప్పదుస్తరము, నా♦చేబాసగొనె♦ గోఖ్లె, ఒకవత్సరము మౌన♦మూనగాను

గీ. అనుభవముగాంచనిండియా♦యందునెల్ల, పర్యటనజేయ నాయభి♦ప్రాయములను
పలుకనోడుదు నంచునుఁ♦బ్రతినగొంటి, వత్సరానంతరముగూడఁ♦బలుకనురుకఁ
గాననైదేండ్లపాటద్ది ♦ కలుగదిందు". 64

### మూడవతరగతి ప్రయాణికుల కడగండ్లు

వ. బర్ద్వానుకడ మూడవతరగతి ప్రయాణికుడు టిక్కెట్టు పడయుటకుం గూడ పడవలసిన కడగండ్లు గాంధికి కనులారఁ జూడనయ్యెను. మూడవతరగతి టిక్కెట్లంత ముందుగానుండి యీయబడవని తెలిసి, స్టేషనుమాస్టరు కడకరిగి, గాంధి యందలి కష్ట నిష్ఠురములఁగూర్చి మొరవెట్టుకొనెను. కాని యాస్టేషనుమాస్టరు గాంధిచెప్పునది వినిపించుకొనడయ్యెను. టిక్కెట్టొసగు కిటికి తెరువబడినతోడనే గాంధి టిక్కెట్లఁ గొనఁజనెను. కాని అతనికి జనసమ్మర్దమువలన టిక్కెట్లు కడపటి వరకుగాని లభింపవాయెను. రైలునువచ్చిన వెనుక అందులోని కెక్కుట మరియొక దుస్తరమైన పనిగా తటస్థించెను. అందులో నదివరకు నుండియే పయనించువారికిని, క్రొత్తగా లోనికెక్కుటకుఁ బ్రయత్నించువారికిని మధ్య తిట్లాటలు, కొట్లాటలు, త్రోపులాటలకు మితిలేకయ్యెను. ప్లాటుఫారమునంతయుం గలయఁదిరిగినను గాంధికి స్థలమొందును లభింపమి, గార్డుకడ కరిగి యడుగ నతడు "నీకెచట నెడమున్న నచటనెక్కుము. లేకున్న రాబోవు రైలునులో రమ్ము" అనెను. తన కందు జవాబునని గలదని యెంత మొరవెట్టుకొన్నను నది యరణ్యరోదనమే యయ్యెను. కనుక మగనలాలును వీలైనచోట నెక్కుమని గాంధి తనభార్యతో నింటర్ క్లాసు పెట్టెలోని కెక్కెను. గార్డు దానింగాంచి అసన్సాల్ స్టేషనుకడ గాంధిని హెచ్చుచార్జి నీయమని తర్జించెను. "మాకు స్థలము చూపించుట మీకర్తవ్యము. మూడవతరగతి పెట్టెలో మాకెక్కడ నెడము గనబడమి యిక్కడెక్కితిమి. నీవిప్పుడైనను మమ్ము మూడవతరగతి పెట్టెలోఁ గూర్చొపెట్టగల్గినచో, సంతోషముగా నచ్చటికివచ్చెద"మని మోహను డనెను. "నాతో వాదులాడి ప్రయోజనము లేదు. నేను నీ కెడమిప్పింపజాలను. అదనపు చార్జి యిచ్చుకొజాలని యెడ బయటికి నడుమ"ని గార్డు గాంధి నదలించెను. పూనాపురము నేలాగునను చేరవలసిన యవసర ముండుటచే గార్డుతోటి కొట్లాటనాపి గాంధి అదనపుచార్జి పూనావరకు చెల్లించెను. కాని యందలి యన్యాయమునకు గుపితుఁడయ్యెను. మరునాటి యుదయమున మొగల్ సరాయి స్టేషను చేరగనే మగనలాలు చూప మూడవతరగతి యందు గాంధీదంపతులెక్కిరి. ఈ విషయమంతయు దెలియజేసి యందుకు సర్టిఫికెట్టునిమ్మని టికెట్టు ఎక్జామినరు నడిగెను. కాని అతడు నిరాకరించెను. రెయిల్వే అధికారుల కీవిషయము సమగ్రముగా దెలుపుచు నష్టపరిహారము నర్థించుచు విజ్ఞాపనమంపెను. వారును "అదనపుచార్జిని తిరిగియిచ్చుటకు సర్టిఫిక్కెట్టు లేకుండ వలనుపడదు. అయినను నీవిషయమున మినహాయింపు చేయడమైనది. కాని బర్ద్వాను నుండి మొగల్సరాయివరకు అదనపుచార్జి తిరిగి యీయబడదు" అని ప్రత్యుత్తర

మిచ్చిరి. ఆనాటినుండి మూడవతరగతి ప్రయాణికుడుగా గలిగిన అనుభవము నెల్ల వ్రాయఁదలచిన నదియొక్కటియే గొప్పగ్రంథము కాఁగలదు. అందువలన సందర్భోచితముగా నందందు దెలుపవలసిన విశేషవిషయములం దెలిపెదనని గాంధి వాకొనెను. దైహిక దౌర్బల్యమువలన మూడవతరగతి పయనము విరమింపవలసి వచ్చినందులకు గాంధి మిగుల వగచెను. మూడవతరగతి ప్రయాణికుల కడగండ్లు నిస్సందేహముగా రెయిల్వే అధికారుల అక్రమచర్యలవలన గలుగుచున్నవి. కాని ప్రయాణికుల అనాగరికత, అవివేకము, అసహ్యమైన అభ్యాసాలు మొదలగు ననేకావగుణములవలనఁగూడ యీ యిడుములు మూడుచుండెను. అంతకన్నను విచారింపవలసిన విషయము తమ యసహ్యాభ్యాసములవిషయము తామె యెరుగకుండుట. తాముచేయునదెల్ల సహజముగానే యున్నదని వారిభావన. ఇదియంతయు చదువుకొన్న వారి కా పేదజనములయెడ గల నిర్లక్ష్యమువలననే సంభవించుచున్నదని గాంధి భావించెను. కల్యాణి స్టేషనుకడకు చేరునప్పటికి గాంధియు, నతనిసతియుఁగూడ పూర్తిగా నలసియుండిరి. గాంధియు మగనలాలు నచటి కొళాయినీటిలో స్నానముగావించిరి. తదనంతరము తనసతీ స్నానమున కేర్పాటు కుపక్రమించుతరి 'సర్వెంట్సాఫ్ యిండియా సొసైటికి సంబంధించిన శ్రీయుత "కౌలు" అనువారు గాంధిని గుర్తించి యతనికడకువచ్చి యామెను రెండవతరగతి స్నానాలగదికి రమ్మని పిలచెను. ఆందుల కామె కర్హతలేకున్నను భార్యగా నామె యెడగల మమకారమువలన సత్యసంధున కిట్లొనర్చుట తగదని తెలిసియు నందులకు గాంధి యీయకొనెను. 65

ఆ. సత్యదేవత ముఖ♦సందర్శనమ్ము గా,కుండబోయె నకట ♦ నిండుగాను
మాయనాసువర్ణ ♦ మండితకుఁగు తెర,వెనుక నునిపత్తు ♦ లనివరీతి. 66

సొసైటిలోఁ జేరఁగోరుట

సీ. పూనాపురముచేరి ♦ పూర్తిగా శ్రాద్ధంబు, చర్చించిరి సొసైటి ♦ సరణిగూర్చి
గాంధియందునఁజేర ♦ గావచ్చునా, కూడ,దా యనుప్రశ్నపై ♦ తర్కమొదవె
గోక్లెయుండఁగ గాంధి ♦ కోరలేను సొసైటి, సభ్యుడుగావారి ♦ చలువెచాల
తదనంతరము భార♦త ప్రజాహిత జీవి,తాబ్ధిఁ గడవఁ గర్ణ♦ధారిఁగోరె

గీ. అట్టికర్ణధారిగఁ దన ♦ కాదరువుగ, నెసగుచున్న గోఖేల్ మర♦ణించుకతన
అవసరంబయ్యెఁ దత్సభ♦యందు జేర, అల్లగోఖేలు నాత్మ యా♦నందమంద

గీ. తత్సభాసభ్యులెల్ల రా♦తరుణమందు, పూననగరంబునందుంటఁ ♦ బోయివారి
జంకుగొంకులువదలింపఁ♦జాలవరకు, యత్నములు సేసెనెన్నొ మో♦హనుడుఘనుఁడు.

క. కొందరుమెంబరు లందున,గాంధికి ననుకూలురుగను ♦ గడముజనమ్ముల్
గాంధికిప్రతికూలురుగాఁ, గొందలపడె గాంధితనదు ♦ కోరిక కొరకై. 69

క. అనుకూలురఁ బ్రతికూలురు, అనురాగమ్మునను జూతు♦రనవరతము మో
హానునైన సభయెడం దను, యనురాగమ్మంతకన్న ♦ యధికతరంబో. 70

ఆ. అందువలన వారి♦యఖిలచర్చలు మృదు,మధురముగను సునియ♦మములదాట
కుండనుండెఁగడకు ♦ నోర్మిమై తుదినిర్ణ,యమ్మొనర్పజాల ♦ రైరియపుడ. 71

సీ. ఇదియెల్లఁగని గాంధి, "అధికసంఖ్యాకుల, సమ్మతిఁదగునొక్క ♦ సభ్యుడొట
గోకేలుయెడఁ దన♦కుంగల సద్భక్తి, కనుగుణ్యమగు ప్రవ♦ర్తనమొయవియు!"
అనియెంచి తనుజేర్చు♦కొన సభనెందరో, ప్రతికూలురైయుంట ♦ పాటితనకు
విరమించునోనుటంచు ♦ విమలమనస్కుఁడై, లిఖియించె శాస్త్రికి ♦ లేఖనట్లు

ఆ. అట్టిగాంధి నిర్ణ♦యమునకు వాక్షించి, రెల్లవారు వను క♦యిష్టమైన
దెసగ లేదటంచుఁ ♦ బొసగెనిజమగు స,భ్యత్వమనుచు గాంధి♦యాత్మనెంచె. 72

ఆ. అనుభవమున నెరిగె♦నంతియు మేలుకే, జరిగెనంచుగాంధి ♦ సభ్యులెల్ల
రతనియన్నదమ్ము ♦ లట్లుండి రెన్లన్ప,డంపు పడియుంతము ♦ గాంధి భక్తి. 73

ఆ. సాధికారికముగ ♦ సభ్యుడుగాకున్న, సభ్యుడాత్మనా సొ♦సైటిగాంధి
ఆత్మలేనిదేహ ♦ మట్టులాత్మయత, సంధిలంగలేని ♦ సభ్యపదవి. 74

కుంభమేళోత్సవము—1915

మ. డాక్టరు మెహతాను ♦ దర్శింపగాంధి, రంగూనుకుంజను♦ రవాణాలోన
నిలిచెఁగొన్నిదినాలు ♦ కలకత్తపురిని, బసచేసె భూపేంద్ర ♦ బొసుగారింట
ఆతిథ్యమాయింట ♦ ఆకసమ్మంటె, ఆనాడుపూర్తి ఫ♦లాశియౌగాంధి
కాపురిని లభించు ♦ నన్నిరకాల,పండ్లు పప్పులకేసు ♦ పాటెల్ల జరిగె
ఆయింటిస్త్రీలు రే♦యంత మేల్కాంచి, ఫలములఁబప్పుల ♦ నొలిచి తయారొ
నర్చిరి గాంధితనయుడు రాందాసు, తదితరులకు విషి♦ధములైన పింపి
వంటలవండి ప♦ర్యాప్తిగా నొసఁగ, సాధారణాతిథ్య ♦ సరణిమించంప
కున్న గాంధికి దప్పు♦కుండెనిదెల్ల, పయనించు రంగూను ♦ పడవలోనపొగు
భాగమ్మునం దెట్టి♦ వసతులులేవు, మురికి ప్రోవైయుండె ♦ మరుగువోడ్లంపు
కంపుగొట్టు చసవ్యా ♦ కరముగాఁజాల, కష్టమ్ముగానుండె ♦ గాంధికాపైన
మక్కటా! ఎట్లనో ♦ అంతసహించి, రెండుదినాల క♦రిగెను రంగూను
అధికారులకు వ్రాయ♦నాస్థితిఁగూర్చి, తిరుగుపైనమున నా♦ తిప్పలుతప్పె
రంగూను నగరమ్ము♦నంగూడ గాంధి, ఫలభోజనస్థితి♦ వలన నాగేస్తు
కధికకష్ట మొదవె♦నైన డాక్టరు మె,హాతయిల్లు తనగృహం♦బట్లుండెనైన
అతడుభుజించు ప♦దార్థము లెన్నొ, కలుగుట దన్నునా♦కర్షించు తిండ్లు
తినెనెల్ల వేళ ల♦తిక్రమించియును, రేపుమాపనకుండ ♦ సాపడెగాంధి. 90

క. పదియుందొమ్మిది వందల, పదునైదవయేట జరిగె ♦ బహుజనపుణ్య
ప్రదమైన కుంభమేళం, బదిరెండేండ్లోత్సవముగ ♦ మాయాపురిలోన్. 91

సీ. కుంభమేళము జూడఁ♦గోర్కె లేకున్నను, గురుకులమ్మునఁ గనఁ♦గోరెగాంధి
మున్షిరాంజీ మహా♦త్ముని నింతలో గోర్కె,సంఘమ్మెచ్చికభట ♦ సమితి నంపె
నాథుడందు హృదయ ♦ నాథకుంజరదేవు, డాదళమ్మునకు వై♦ద్యాధికారి
మగనలాల్ గాంధి య♦రిగెను ఫోనిక్సు జ,నముతోడ సాయమొ♦నర్ప నందు
గీ. ఇండియాచేర రంగూను ♦ నుండిగాంధి, తనదళమ్మును జేరగా ♦ జనియెనందు
అల్లకలకత్తనుండి ప్ర♦యాణమెంతో, కష్టమైన హారిద్వార ♦ ఘట్టమునకు. 92

ఆ. సహారనుపురినుండి ♦ సరకులపెట్టెలో, కప్పులేమి యెండ♦ కాచుచిచ్చు
కణినినుపనేలఁ ♦ గాల్చుచుండగ దప్పి,కనువగర్చు చకట ♦ మనముబోగల. 93

ఉ. అట్టివిపత్కరస్థితిని ♦ నైనను చాంధసులైన హైందవుల్
కట్టు! మహమ్మదీయులట ♦ గాంచి జలంబుల ద్రావనిచ్చినం
బొట్టదహించుచుండినను ♦ బోయరొకింతజలంబు నోటి వా
రట్టులెయుండిరెంతకును ♦ హైందవులిచ్చిన దాకనీరముల్. 94

శా. ఈ హిందూజనులే శరీరరుజలం♦దే డాక్టరో యిచ్చినన్
దేహారోగ్యనిమిత్త మంచుఁగొన రే♦దే ద్రాక్షసారాయముల్
స్వాహాచేతురె గోవుమాంసరసముల్ ♦ స్వాంతమ్మునందింత సం
దేహంబందరె; యేలముస్లిములిడన్ ♦ నీరంబులంద్రావరే. 95

సీ. అల్ల శాంతనికేత ♦ నావాసమునచేర్చె, గాంధిభారతదేశ ♦ మందుసతము
ప్రత్యేకవృత్తిగా ♦ పాకిపని తమకు, గలుగునటంచందు ♦ వలన నచటఁ
గలవలంటీరుల ♦ దళగుడారమ్ముల, దొడ్లనూడ్చెడుపనిం ♦ దొడ్డబుద్ధి
ఫోనిక్సువారలో♦ప్పగ జేయజేసె మో,హనుడు మగనలాలు ♦ నాచరించె
ఆ. గాంధియొకగుడార ♦ మందుగూర్చొని తన,దర్శనమ్ముకొరకు ♦ తరుచువచ్చు
యాత్రికాళితోడ ♦ ననవరతము మత,చర్చలందు గడపెఁ ♦ సమయమెల్ల. 96

తే. స్నానఘట్టమునకు బోవు♦సమయమందు, వెంటనంటిరిభోజన ♦ వేళఁగూడ
గాంధిదర్శనార్థమువచ్చి ♦ యెందరోయిటు, లతనిసౌతాఫ్రికాసేవ♦యఖిలభరత
దేశమెల్లెడగుర్తింపు ♦ దెచ్చియుంట. 97

సీ. ఈవిషయమునగాంధి ♦ యెరిగెహరిద్వార,మం దిందువలనఁ జీ♦కాకుగల్గె
గోయిముందువెనుక ♦ నూయిఁబోలెఁ దలంచె,నీతనస్థితి విచా♦రించితుదిని
తన్నుగుర్తింపని ♦ ట్రయినుప్రయాణాది,కముల నందరితోటి ♦ కష్టమొందె
తన్నుగుర్తించిన ♦ స్థలములందనదర్శ, నార్థులచేఁబడు ♦ నార్తియొందె

గీ. హెచ్చు సంతాపకరమైన♦దేది రెంట, ననివితర్కించె మదిని మో♦హనుడెరింగె
దర్శనార్థుల కుతుకమ్ము♦తరుచునాగ్రహమ్ము దెప్పింప ట్రయిను♦ప్రయాణమిడెడు
కష్టములగల్గెను మనోవి♦కాసమంచు. 98

గీ. చాలగా దేహబల ముంట♦జనసమూహ, దృష్టినంతగాఁ బడమినా♦దినములందు
గాంధి గ్రుమ్మరెనధికాధి♦కముగ నందు, యాత్రికాళినిజస్థితి ♦ నరయఁగోరి.

చ. అరసెను మోహనుం డచటి ♦ యాత్రికులందు పరాకుబుద్ధియున్
మురికియుఁ గృత్రిమమ్మధిక ♦ మూఢమతోద్ధృతభక్త వేషముల్
విరివిగనుంట సాధువులు ♦ వింతగనెంతయొ రాగభోగత
త్పరులయి గుంపుగా దిరుగు♦టల్ గమనించె విషాదచిత్తుడై. 100

ఆ. అయిదుకాళ్ళగోవు ♦ నరసెనొండటగాంధి, యరసెదూడకాలు ♦ వీపిచియొండు
నంటుగట్టగోవు ♦ కైదుకాళ్ళయ్యెనం, చాశపోతు దౌష్ట్య ♦ మాత్మ నరసె. 101

ఆ. దూడకాలునొకటి ♦ ద్రుంచుటొండస్థాని, నావుభుజమునందు ♦ నంటుగట్టు
టొండుక్రౌర్యముఁగను ♦ రెండొనర్చిరిదోచ, ధనమునజ్ఞులైన ♦ జనమునుండి.

ఆ. హైందవులగు వార♦లంద రాకర్షింప, బడుదురైదుకాళ్ళ ♦ బరగుగావు
చేతనట్టిమాను♦షాతీతమగు గోవు, కెల్లజనము గ్రుమ్మ♦రింత్రు ధనము. 103

క. యాత్రికభావముతో నా, క్షేత్రమ్మున కరుగకుంటఁ ♦ జేరడుయాత్రా
క్షేత్రముల దైవభక్తికి, పాత్రుడునాగోరి గాంధి ♦ పావనుఁడౌటన్ 104

క. కానికని గాంధియచ్చట, మానవులెందరినొ వే♦మదిని; పలచెన్
మానసమున నవ్వారి న,నూనముగా భక్తజనము ♦ లుందురటంచున్. 105

ఆ. కొందరాత్మశుద్ధి ♦ కొరకందువచ్చిరి, కొంతమంది పుణ్య♦మింతగడన
చేయవచ్చియుంద్రు ♦ క్షేత్రానికనిగాంధి, నమ్మెకలదు ముక్తి ♦ నమ్మకమున.

సీ. ఆనాటిరేయెల్ల ♦ నంతరాలోచన,మ్మందె సంపూర్తిగా ♦ గాంధిగడపె
కపటవేషులమధ్యఁ ♦ గలరుభక్తులువమ, స్రష్టయెదుటపాప ♦ రహితులనుచు
శమవారిద్వార ద♦ర్శనమెపాపమ్మైన, నాడెనాస్థలముదా ♦ వీడుటొప్పు
అటుగానిచో దదే♦యాక్రమములకుఁ బ్రా,యశ్చిత్తముల దానొ♦నర్పవగున

గీ. టంచుఁ గలకత్తగంగూను ♦ లందుఁడనకు, గా గృహస్థులుబడినట్టి ♦ కష్టములను
దలచి తనదినాహార ప♦దార్థములను, కొంచెమొనరించుకొనిప్రొద్దు♦గూకకుండ
తినగ గడపటి కుడుపును ♦ దేల్చుకొనియె. 107

గీ. ఇట్టినియమాళిదాను బాటింపకున్న, దానుబసచేయు గేస్తులే ♦ తనకు సేవ
సేయుదురుకాదె! తావారి♦సేవసేయ, బదులటంచును గొనెనిట్లు♦ప్రతిననొండు.

మం. తనయాత్మకథ వ్రాయు♦టకు బూనునాటి,కై నట్టి పదుమూడు♦హాయనమ్ములను
ఈశపథ మనుస♦రించియే గాంధి,కడపెను తనమను♦గడ గడునిడుమ

లెడనెడగల్గిన ♦ నెంతయో దాంతి, తనకంగరక్షగా ♦ దనరెనా ప్రతిన
పడసెసదారోగ్య ♦ భాగ్యమ్ముమిగుల, వర్ధిల్లెనతని యా♦యుర్దాయమెంతో.

లక్ష్మణజూలా

ద్విపద. అరిగెహరిద్వార♦మందుండి గాంధి, గురుకులమ్మునకును♦ గురుదేవుండగు మ
హాత్మ మున్షీరామ్జి ♦ నరయఁగా; దన్మ,హాత్ముండు గాంధిమ♦హాత్ముని బ్రేమఁ
ముంచెత్తెఁ బరిచయ♦ముం గాంచెనందు, చంచత్ప్రతిభు ప్రభా♦వాంచితుండైన
ఆచార్యరాందేవ్జి ♦ యనువారితోడ, ఏచిదీర్ఘముగ వా♦దించె రాందేవ్జి
తోడఁ బదితరుల ♦ తోఁ బరిశ్రమలఁ, గూడ శిక్షణీయ ♦ గురుకులమందు
ఆవశ్యకతయున్న ♦ దంచు మోహనుడు, కావిగుడ్డలవారు ♦ గాంధిచెప్పినది
కాదనిరైననా ♦ కలయికవలన, సాధులతోఁ గల్గె ♦ సఖ్యంబుచాల
గురుకులమ్మును వీడి ♦ యరుగుటకెంతో, పరిపరివిధములం ♦ గురుతాపమందె
ఆహ్వాపీకేశంబు ♦ నందుండియేగ, దేహంబు పులకించు ♦ తీరున గాంచ
నగుసమీపమున గం♦గాపగన్ వ్రేలు, సొగసైన లక్ష్మణ ♦ జూలాఖ్యఁబరగు
వారధినొండద్ది ♦ నారయకుండ, పోరాదనగ గాంధి ♦ పూన్కి నచ్చటికి
చేరె రెండుదశలఁ ♦ జెచ్చెర పాద,చారియై భక్తి నా♦వారధికడకు
అందు పెక్కండ్రు స♦న్యాసులందొకడు, గాంధిస్నాతుండౌచు♦గంగాంబువులను
వచ్చుచుండగగాంచి ♦ యచ్చెరువంది, పృచ్ఛించె "నీవేల ♦ నిటుశిఖలేక
జందెంబులేకుండ ♦ జనునెయుండుటలు, హైందవుండవుగావె♦అక్కటా" యనిన
"బాలుడుగా విప్ర♦బాలురంగనితి, తాళాలచెవిగుత్తి ♦ వ్రేల జందెమున
లీలనుండగవారి ♦ బోలెనొనర్పఁ, నాలోనఁ దలచితా ♦ నాడుమాకథియ
వాడున మాజాతి ♦ వైశ్యులందద్ది, వాడుకకే లేదైన ♦ వర్ణత్రయమ్ము
జందెమ్ముదాలుపం ♦ జనునంచుబల్కి, రందుచే మావార♦లందు పెక్కండ్రు
జందెంబుదాల్చిరా ♦ చందాననేయ, ముందంజవేసితి ♦ మురిసితినందు
తాళాలచెవిగుత్తి ♦ వ్రేలాడనిడితి, వ్రీలనద్దిమరొండు ♦ వేసికో లేదు
పెద్దగానేను సద్బుద్ధిఁ బెక్కండ్రు, పెద్దలుయజ్ఞోప ♦ వీతంబునాకు
వేయఁగా సౌతాఫ్రి♦ కాయందు దిరిగి, చేయుయత్నముఁ బరా♦జితులైరి వారు
హైందవులం దొక్క♦రగు శూద్రుఁ డేల, జందెంబు వేయరే ♦ నెందుకు దాల్ప
నంచువాదించితి ♦ నస్మద్గళమున, నంచిత సద్వైష్ణ ♦ వాచారసరణి
తాల్చితిఁ గాంధి పె♦ద్దలు చెప్పినట్లు, తాల్చితిశిఖను నా♦తలపైన నాంగి
లేయు లేమనుకొందు♦రో యంచుఁదీసి, వేయించి తటుఁదీసి♦వేయించితకట
చగనలాల్ గాంధి శీ♦ర్షంబందునుండు, సిగనది యతడొన♦ర్చెడు ప్రజాసేవ
కడ్డురావచ్చు నం♦చతడు నొచ్చినను, ఎడ్డనైయని స్వామి♦కెల్లయుం దెలిపి

నీచెప్పినటుదాల్తు ♦ నియతిమై శిఖను, ఏచొప్పునంగన్న ♦ నేదాల్పఁజాల
జందెమ్ము హైందవ ♦ జాతియందుండు, నిందితాస్పృశ్యత ♦ యుం దదితరము-
లైన కల్మషములు ♦ నన్ని యుండొలగి, పూనియాధ్యాత్మికం ♦ బుగ బొల్పుగనెడు
వరకంచు స్వామితో ♦ వాదించె గాంధి, సరకుసేయక స్వామి ♦ సదుపదేశంబు
వివిధమతమ్ములు ♦ వెలయునందాక, భువినుండు బహిరంగ ♦ ముగ వానిగుర్తు
లవి వివిధములుగా ♦ నైననాగుర్తు,లవిజూప తమతమ ♦ యాధిక్యతవని
పోనాడఁ దగువాని ♦ భువిజందెమట్టి, దేనాటికది యుద్ధ ♦ రించు హైందవము
సిగయన్న నో యది ♦ చిన్నతనాన, తగుబుద్ధిలేమి నిం ♦ దలగ ద్రోచితిని
కనుకఁ బెంచితి శిఖ ♦ గ్రమ్మర మిత్రు,లను సంప్రతించినా ♦ మనమునఁదనిసి"
యనిగాంధి తెలిపెను ♦ దనయాత్మ గాథ, వినమితమతియాచు ♦ వినుతించె భక్తి
పెద్దల ప్రకృతి స ♦ ద్విజ్ఞానగరిమ, బుద్ధితత్సౌందర్య ♦ ముంగ గల్గు రక్తి
చూచియాలక్ష్మణ ♦ జూలాదిస్థలము, లాచెంత ప్రజలెట్టు ♦ లవియొల్ల జెరుచు
కరణులగనిగాంధి ♦ కడుగుందెమదిని, అరసిలక్ష్మణజూల ♦ నక్కటా! వింటి
తొల్లినందున్న త్రా ♦ డులయందమైన, అల్లికవారధిం ♦ ద్రెల్లగా వైచి
ఇనుపవారధి గట్టి ♦ యిచ్చె తాళాలు. మునుపు మార్వాడి ప్ర ♦ భుత్వమ్మునకని
వినిగాంధిమది సంత ♦ పించె నాపిదపఁ,గనె బాడుపడిన స్వ ♦ ర్గాశ్రమసీమ. 156

## ఆశ్రమస్థాపనము—1915

క. అది పందొమ్మిదివందల, పదునైదవ వత్సరమున ♦ బరగఁగ మే, ని
ర్వదియైదవ తేదిన హ,మ్మదుబాదున జరిగె నాశ్ర ♦ మ స్థాపనముఁ. 157

సీ. ఈహరిద్వారమం ♦ దే నెలకొనుమంచు, కోరె శ్రద్ధానంద ♦ గురుకులుండు
కొందరుకలకత్త ♦ కూర్మిమిత్రులు వైద్య,నాథ ధామమున నుం ♦ డంగ గోరి
రన్యులు రాజకో ♦ టందుండ మంచును, బలవంత మొనరించి ♦ రెలమికలిమి
కాని యహ్మదుబాదు ♦ కడమిత్రులెందరో, అందుండగోరుచు ♦ నాశ్రమార్థ
గీ. మర్థమిత్తుము మీ నివా ♦ సార్థమొండు, నిల్లుగట్టింతు మనగాంధి ♦ యిచ్చమెచ్చి
నిశ్చయించి యహ్మదుబాదు ♦ నేవరించె, తాను ఘూర్జరుఁడగుటచే ♦ వప్పదంచు.

ఆ. ఘూర్జరుండు తాను ♦ ఘూర్జరపురమంది, కడుప్రసిద్ధిపూర్వ ♦ కాలమందు
నుండిగాంచె వడుకు ♦ నూలుకుం జేనేత, పనులకందువలన ♦ దనకునచ్చు. 159

క. వరఘూర్జర రాష్ట్రమునకు, బరగును కేంద్రముగ ముఖ్య ♦ పట్టణమగుటన్
తరగని ధనికులకిరవది, కొరవడకం గుమ్మరింత్రు ♦ కోరిన ధనముల్. 160

క. అనితనమనమున నాలో,చన గావించియును మిగుల ♦ జర్చించియు మో
హనుడాగతి నహ్మదుబా,దున నాశ్రమమునకు సమ్మ ♦ తుండయి కట్టెన్. 161

సీ. అహమదాబాదు మి♦త్రాళితోఁ జర్చించె, నస్పృశ్యతా సమ♦స్యను గురించి
అన్యవిధమ్ముల ♦ నర్హుడై యున్నచో, నస్పృశ్యుఁ గొనఁగోరె ♦ నాశ్రమమున
విశదీకరించె నీ♦విషయమా యహమదా, బాదు మిత్రులకెల్లఁ ♦ బ్రకటితముగ
"అట్టులన్నివిధాల ♦ నర్హుడౌ యస్పృశ్యుఁ, డెందులభించు నీ♦కీ జగతిని"
గీ. అనుచుఁ బ్రశ్నించె నొకడల♦ఘ్యముగనైన, వసతిదనబంగళాయందు♦నొసగ నొక్క
సఖుడు జీవనలాలు దే♦శాయి యనెడు, ధనికసత్తముఁ డంత♦ మోహనుడు మొదలు
వెట్టె నాశ్రమమందునం♦గట్టఁ బ్రీతి. 162

సీ. ఇడదగు నేనామ ♦ మీయాశ్రమమునకటం, చాప్తమిత్రులనెల్ల ♦ నడిగియందు
'సేవాశ్రమమ్ము', 'త♦పోవన'మంచును, ఎంతయో యోచింప ♦ నెట్టకేల
కనుమతిగల్గె స♦త్యాగ్రహాశ్రమమున, సత్యసంధతవారి ♦ చరితమగుట
సత్యసంశోధన ♦ జరుపుటకల్ల సౌ, తాగ్రి కాగల్గిన ♦ యనుభవముల
గీ. భారతీయుల కెరుకగా ♦ భవ్యగతిని, సాధ్యమైనంతవరకు నా♦సాధన ప్ర
యోజనపరీక్ష సేయను♦ద్యుక్తుడగుట, మోహనుడు దేశభక్తిని♦ర్మోహుడగుచు.

సీ. ఆశ్రమనిర్వహ♦ణార్థ మాచార ని, యమపట్టికొండు ద♦యారుచేసె
మిత్రులబిలిపించి ♦ 'మీయభిప్రాయముల్, తెలుపుడు నియమాళిఁ♦ దెలివిగాంచి
అనమోహనుడు 'విన♦యాచరణముఁ జేర్ప, దగుననిపలికె గు♦ర్జరాస్యనర్జి
ఈనాటి యువతర ♦ మీవినమ్రతగుణ, మెరుగమి తనకెంతో ♦ యెరుకగ్రాయిన
గీ. వినయముగ నుందునని బాసఁ♦గొని వినయంత, వినయగుణమంతమగునని♦ తనమనమున
భీతి లెను గాంధి; నిజముగా ♦వినయమనగ, తన్ను దాబూర్ణముగను న♦డంచుటగుట.
గీ. అట్టిపూర్ణాత్మనిగ్రహ♦మనగ మోక్ష, మది యొకాచరణమది♦ యలవడంగ
నన్యనియమాచరణముల♦ననుసరింప, నవసరంబగుననుచు మో♦హనుడుదలచె.
గీ. మోక్షసాధకు నాచార♦ములు వినమ్ర, భావ ముండనిచో మోక్ష♦భావముండ
దంచు; వినయము లేని సే♦వాచరణము, స్వార్థపూరితమగు నహం♦భావమవని.
క. పదుమువ్వురు తమిళులు నిరు, వదియైదుగు రెల్లగలసి ♦ వనితలు పురుషుల్
మొదలయ్యె నాశ్రమము స, మ్ముదమున నెల్లరు సమిష్టి♦భోజనమెసగన్. 167

కఠినపరీక్ష

వ. ఇట్లు సత్యాగ్రహాశ్రమ మారంభించిన కొన్నాళ్ళకే తామే నాడు ననుకొన్న పరీక్ష కాయాశ్రమవాసులు గురియైరి. అమృతలాలు ఠక్కరుబాపా, బాపూకొక లేఖ వ్రాసెను. అందిట్లుండెను. "వినయసంపన్నులును, విమలసద్గుణులు నగు నొక అస్పృశ్యుల కుటుంబము మీయాశ్రమమునఁ జేరగోరుచున్నది మీ కిది సమ్మతమా." 168

గాంధి యిందుల కాందోళన చెందెను. ఠక్కర్ బాపాయంతటి ఘనుని పరి
చయముతో నంతటి యనతికాలమున నొక అస్పృశ్యులకుటుంబ మాశ్రమమునఁ
జేరగోరునని తానే నాడు ననుకొనలేదు. ఆయుత్తరమును తనసహచరులకుఁ
జూపించెను. వారంద రందులకానందించిరి. అంతటబాపూ, బాపా కిట్లుబదులు
వ్రాసెను." ఆశ్రమనియమావళి ననుసరించుట కా కుటుంబము వారంద రీయ
కొన్నయెడల, తప్పక వారీయాశ్రమమునజేరుట మాకందరికి సమ్మతమే".

ఆ కుటుంబమందు యజమాని దూదాభాయియు, నతనిభార్యయగు ధనిబె
హేను నామెయు, వారిముద్దులపట్టియగు లక్ష్మియు నుండిరి. దూదాభాయి నగర
మందుపాధ్యాయుడుగా నుద్యోగమం దుండెను. వారందరు నాశ్రమనియమా
వళికిఁ గట్టుపడియుండుటకు సమ్మతించి యాశ్రమవాసులైరి. అయినను వారి
యాశ్రమప్రవేశము అంతవర కాశ్రమమునకు సహాయ మొనర్చుచుండిన,
స్నేహితుల డెందమం దాందోళనకు కారణమయ్యెను. మొదటియిబ్బంది బావి
నుండి నీళ్ళుతోడుకొను విషయమున నేర్పడెను. 168

ఆ. దూదభాయి నీరు♦తోడు బక్కెటునుండి, పడెడు నీటవారి ♦ బకెటులోని
జలముచెడెనటంచు ♦ జగడమాడెను యజమానిమనిషి బావి♦నానుకొనుచు.

క. తిట్టినబదులాడకు మా,తిట్టులనే కొనుము ప్రేమ♦దీవనలుగ నీ
రెట్టులనో తోడండని, పుట్టగ గనికరముగాంధి ♦ బోధనఁజేసెన్. 170

ఆ. తిట్టితిట్టి నోట♦తీటదీరినదాక, కట్ట! బదులు లేవె ♦ తట్టునొంటి
కేనటంచు సిగ్గు♦లేనివారిని దిట్ట,సిగ్గుచేటటంచు♦నెగ్గుమానె. 171

ఆ. అయిన ధనసహాయ ♦ మంతయు బందయ్యె, అంతెకాక వార్త♦లందుచుండె
శాస్త్రిచేతుమిదిగో! సంఘబహిష్కార, మనుచు గాంధి కప్పు♦డపుడునకట. 172

మం. సంఘబహిష్కృతి ♦ సంభవంబైన, మామూలు వసతులు ♦ మనలవీడినను
ఈ యహమ్మదుబాదు ♦ నెటులైనవీడ, మంతపసింత మా♦హరిజనవాడ
చేతికష్టముచేసి ♦ జీవింతమనుచు, తనతోడివారి నో♦దార్చెమోహనుడు

క. క్రమముగఁ బరిస్థితులటు వి,షమింపగా మగనలాలు ♦ చనిగాంధికి నా
శ్రమమున నయిపోయిన విధ,నము లన్నియునంచు మోహ♦నా! యనిపల్కెన్.

ఆ. అట్టులైన మనము ♦ హరిజనవాడకు, చనెదమంచుబల్కె ♦ శాంతమతిని
గాంధితనయనుచర ♦ బృందమ్ముతోడుత, చింతనింతయేని ♦ జెందకుండ. 177

క. ఇదిగాంధి జీవితమ్మున, మొదటిదిగా దనుభవముల ♦ మును పెన్నిటినో
ఎదనెమ్మది వడదైవము, తుదినిమిషమునందు ధనముఁ ♦ దోడ్పడనంపెన్. 178

మం. ఆశ్రమార్థికస్థితి ♦ నారీతి మగన,లాలు దెల్పిన కొంత♦కాలమ్మున కును
ఒకనాటి యుదయమం ♦ దొకబాలకుండు, కారులో నొకసేటు♦గాంధినింగాంచ

వేచియుండె నటంచు ♦ విన్నవింపంగ, గాంధియు నాతని ♦ కడకేగనతఁడు. 181
"ఆశ్రమమ్మునకు సా♦యము సేయవలతు, నంగీకృతమె నీ♦కదియంచు" బల్క
"అందుకొండెట్టి సా♦యమ్మైన నిపుడు, నిందుకొన్నవినాడు ♦ నిధులనె" గాంధి
"ఇటవత్తు రేపునే ♦ నీసేళ కీవి,చటనుందు వేయని" యం♦చడిగె నతండు
తప్పకుండెదనంచు ♦ చెప్పగాగాంధి, మరునాడతం డాస♦మయమునవచ్చి
పదుమూడువేల రూ♦ప్యమ్ముల గాంధి, హస్తంబులందిడి ♦ యరిగెనాతండు
ఇంతధనసహాయ ♦ మీనూత్నరీతి, నిట్లునాశింపక♦యే లభించునని
గాంధితలపలేదు ♦ కలలోననైన, అంతయు దైవద♦యాదత్తమంచు
అంతరంగమున జో♦హారులర్పించె, ఆత్మవొంగంబర♦మాత్మార్పణముగ
ఈ సహాకారమ్ము♦చే సాగెనాశ్రమము మరియొకవత్స♦రము నిర్భయముగ
కానియాశ్రమములో ♦ కస్తూరిభాయి. మొదలగుస్త్రీలు సు♦ముఖులుగా లేమి
ధనిబెహాన్ యెడవారి ♦ సణుగుడుల్ గాంధి, చెవిబడనతడిట్లు ♦ జెప్పెసహింప
స్త్రీలిడునిడుములఁ ♦ జీవాట్లనోర్చి, ఆటులెసహించిరా ♦ హరిజనులెల్ల
ఆశ్రమమ్మున కీస♦దనుభవమ్మొక్క, గుణపాఠమై వెలు♦గుంబాటయయ్యె
ప్రారంభమందె ప్ర♦పంచమంతటికి, అస్పృశ్యత సహింప♦మంచు జాటితిమి
ఆశ్రమమ్మునకు సా♦యము సేయగోరు వారెచ్చరింపగా ♦ బడిరిట్లు ముందె
ఆశ్రమనిత్య వ్య♦యమ్ములాచార, పరులగుహైందవుల్ ♦ భరియించుచుంట
మూలమట్టమ్ముగాఁ ♦ గూలెనస్పృశ్య, తాచారమనుటకు ♦ నానవాలయ్యె
ఇటుల "సత్యపరీక్ష ♦ నెగ్గుటకై ప్ర,యోగమ్ములెన్నియో ♦ నొనరింపఁబడియె"
అందెన్నొ కష్టమ్ము ♦ లావహిల్లెనని, తెలుప సాధ్యముగాదు ♦ కేటతెల్లముగ.

—కూలీవలసల రద్దు—1917—

సీ. ఆయిదేండ్లు శ్రమియింతు♦మనియొడంబడి దక్షి, ణాఫ్రికాచనిరిండి♦యనులువలస
అటునెటాలునకేగి ♦ నట్టివారిచ్చుప, న్నూడె స్మటొస్సెడబడ ♦ మూడుపౌండ్లు
ఈపద్ధతినడంచు ♦ నిచ్చచట్టము ప్రతి,పాదించె మాలవ్య ♦ పండితుండు
చేమ్సుఫర్డు తోసివే♦సెనుదాని గాంధి యాం,దోళన సేయ ను♦ద్యుక్తుఁడయ్యె.
గీ. సభలు దేశమం దంతట♦జరిగెఁ జేయఁ, బడియెఁబదియుఁదొమ్మిదినూర్ల♦పదియునేడ
వాబ్దమున జూలయి నెలాంత♦మగుడువలస రద్దుకావలెనను చుదీ♦ర్మాన మొండు.
క. వెడలిరి రాజప్రతినిధి, కడకెందరొ స్త్రీలుపేరు ♦ గలవారు చెవిం
బడ మొర నిడిరల వలసల, వడపగశాసన మొనర్చ♦డను చాతురతన్. 208
గీ. అలకరాచికిఁ గలకత్త♦కరిగెగాంధి, ప్రజలకు ప్రబోధమొనరింప♦విజయుఁడయ్యె
దేశమెల్లెడ నుత్సాహ♦దివ్యశక్తి, ప్రజ్వరిలఁ, జేయఁదన యాత్మ♦బలమువలన.

ఆ. తలచినట్లు నిలుప♦వలసపద్ధతి ప్రభు,త్వమ్మొనర్పఁ బ్రకట♦నమ్ముజాల
యాంతమునకు ముందె ♦ సట్లుసత్యాగ్రహ, ప్రథమవిజయమిట్లొ♦పడసెగాంధి.

—నీలిమందు మచ్చ—1917—

సీ. జనకరాజేలిన ♦ చంపరాన్ మామిడి, తోపులకును నీలి ♦ తోటలకును
పదియుతొమ్మిదినూర్ల ♦ పదునేడవాబ్దమ్ము, దాక మిగులప్రసి♦ద్ధముగనుండె
ప్రతిచంపరాన్ రైతు ♦ పంటపొలమ్మున, నతనిభూస్వామికై ♦ యదనముగను
ప్రతియొకరాకొక్క ♦ పదునైదు సెంటుల, నేలలో నీలి పం♦డింపవలయు

గీ. 'తిన్కతియ' యందురీపద్ధ♦తిని మహాత్ముఁ, డెరుగడీప్రాంతమీతఁడా♦వరకు నీలి
తోటలంజూచి యెరుగడేవీట; నీలి,రంగు పొట్లమ్ములఁ దయారు♦సంగమెదియు.

మం. రాజకుమార శు♦క్లాజిపేర్గలుగు, రైతు కష్టముదుర్భ♦రంబుగా నూడ్చి
పారవేయంగనీ ♦ పద్ధతినెంచె, తనుబోలు వేల రై♦తాళికెల్ల
కూర్పవిముక్తిని ♦ గోరె మోహానుని, కలసె లక్నోపురి ♦ కాంగ్రెసునందు
ప్రజకిశోరను న్యాయ♦వాదిని పరిచ,యమ్మొనరించె మో♦హానుని కతండు
గాంధిచెప్పకిశోరు ♦ కాంగ్రెసులోన, సానుభూతిదెలుప ♦ చంపరాన్ ప్రజకు
తెచ్చి ప్యాస్ చేయించెఁ ♦ దీర్మాన మొండు, సంతసించెను శుక్ల♦సంతృప్తిగనదు.

సీ. "స్వయముగాఁ జంపరాన్♦వచ్చి చూడుమచటి, కర్షకుల్ పడు కడ♦గండ్లగాంధి"
"వచ్చెదనన్నైనా ♦ పర్యటనమ్మున, నొండురెండు దినంబు ♦ లుండుమనచట"
"చాలొక్కదినమె య♦చ్చటిపరిస్థితులెల్ల, గనుమునీవె స్వయమ్ము♦గాను గనుల"
అనిగాంధి వీడ్కొని♦చనె శుక్లగాంధి ల,క్నోనుండి యరిగె కా♦న్పూరునకును

గీ. కాని శుక్లవచ్చి ♦ కాన్పూరునంగూడ, "చాలదగ్గరుండె♦ చంపరాను
రండుపయను దినమొ♦కండె చాల"నిపిల్చె, వచ్చెదంచుగాంధి ♦ బాసచేసె.

ఆ. కాన్పూరునుండి ♦ గాంధి క్రమ్మరేఁదన, ఆశ్రమంబుచేరె ♦ నచటకూడ
హాజరయ్యెశుక్ల ♦ రోజురాచంపరాన్, నిర్ణయింపుడనుచు ♦ నిపుణమతిని. 213

తే. సరియెవచ్చెద నీతోడ ♦ చంపరాను, కలియవచ్చిననుగల ♦ కత్తననియె
మోహానుండందు జేరక♦మునుపె శుక్ల, బసనొనర్చెను భూపేను♦బాబు యింట.

క. ఇటుగాంధి యొచటికరిగిన, నటుబోవగ శుక్లవెంట ♦ నంటి కడకతం
డటనుండి చంపరాను కొ,కటిగా నిద్దరును జనిరి ♦ కర్షకులబలెన్. 215

క. అది పందొమ్మిదివందల, పదునేడవయేడు, తేది♦పది నెల ఏప్రిల్
ఉదయమ్మున బాట్నాపురిఁ, బదమిడిరదె మొదటగాంధి ♦ పాటలిగనుటల్

సీ. ఆడంబరములేని ♦ వ్యవసాయియైన శు,క్లాపల్కుబడి వాడు♦గా దలంచె
పైనంబునన్ న్యాయ♦వాది మిత్రులుగల, రలపాట్న 'ననిగాంధి ♦ కాతఁడనగ
అతడుబొత్తిగ నమా♦యకుడుగా దెలిసిమో,హాను డట్టివ్యవసాయి♦న్యాయవాది
నరులకు నడుమ గం♦గాప్రవాహమ్మంత, అంతరంబుండు నం♦దాత్మనెంచె

గీ. అల్ల రాజేంద్రబాబు గృ♦హమునకు గొని, పోయె రాజ్ కుమార్ పాట్నలో ♦
మోహనునట, నింటలేడప్డు రాజేంద్రు♦డేగియుండె, శ్రీజగన్నాథదర్శనా♦ర్థిగను పూరి.

క. ఇంటఁగలుగు నౌకరిద్దరు, బంటులుగన లేదుగాంధి ♦ వైపెంతయుదా
వెంటందెచ్చిన వేవో, తింటకు ఖర్జూరపండ్లు ♦ దెచ్చినతండుర్. 218

క. ఆరోజులలో నాబీ♦హారున నధికముగనుండె ♦ నస్పృశ్యత; యా
కారణమున నాబంటులు, వారలనీచముగ గనిరి ♦ బంటులగుటచేన్. 219

ఆ. అందుకింత కోప♦మందడు గాంధి య,భ్యాసపడియె యుంట♦యట్టి వికృత
చేష్టలకు మరింత ♦ నిష్టుడయ్యెను శుక్ల,మోహ రహితుడైన ♦ మోహనునికి.

క. ఎంతనిరాడంబరుడో, ఎంత యమాయికుడో శుక్ల♦యెరుగుటతనకే
మంత నుపయోగపడడని, చింతించుటగాంధి తానె ♦ చేబూనెపనుల్. 221

—— శాంతమూర్తులగు బీహారువారు ——

ఆ. లండనందుఁజదువు♦చుండ 'బారు'కెరుంగు, గాంధి 'మజ్హరులుని♦కాంగ్రెసందు
తిరిగికలసె బొంబె♦ పురిని బందొమ్మిది, వందల పదునైద♦వాబ్దమందు'. 222

సీ. అతడు ముస్లిములీగు ♦ కధ్యక్షుఁడిప్పు డా,హ్వానించె దనయింటి ♦ కరుగుదేర
పాటలీపుత్రంబు ♦ వచ్చుచో గాంధి; నా,యాహ్వానము దలంచి ♦ యతనికిదన
రాక గూరిచిచెప్పి ♦ రాబంపనతడు వెం,టనె గొనిపోయె మో♦హానుని వచ్చి
అతడుచెప్పినరీతి ♦ నరిగె 'ముజఫరుపూ', రానాటి సాయంత్ర ♦ మందెగాంధి

గీ. అటప్రభుత్వ కళాశాల♦యందు 'ప్రిన్సి,పాలు'గా నున్న 'కృపలాని♦వచ్చెశిష్య
జనముతో స్టేషను'కొసంగె♦స్వాగతంబు,వెంటగొనిపోయిమలాకాని♦యింటజేర్చె.

సీ. ఆచార్య కృపలాని ♦ అరటిపండునొలిచి, పెట్టి నట్టులఁ జెప్పె ♦ విశదముగను
విషయమ్ములెల్లయు♦న్వివరించిగాంధికా, కార్యభారముగూర్చి♦క్రమముగాను
మరునాటియుదయమం ♦ దరుదెంచిరి వకీళ్ళు, కొందరుగుమిగూడి♦గాంధినరయ
వారిలో రామన♦వమి ప్రసాదనుసతం, డధికానురాగ శ్ర♦ద్ధాళువగుచు

ఆ. అనియెగాంధికిట్లు ♦ "లయ్యనీవిచటికి, వచ్చినట్టి పనుల ♦ వారిజరుగ
రండు; చెప్పిపంపె ♦ రమ్మనిమిమ్ము గ,యాప్రసాదు తమగృ♦హమునకు మిము.

సీ. భయపడుదుము ప్రభు♦త్వమునకు మేమెల్ల, నైనసాయమొనర్తు ♦ మైనవరకు
సత్యమైనదియె రా♦జకుమార శుక్లమీ,చక్కి చెప్పినదెల్ల ♦ చాలవరకు
ఈనాడిచటలేరె ♦ మానాయకులయిన, వ్రజకిశోర్ రాజేంద్ర♦బాబు లకట!
ఇచ్చితీఁదంతివా ♦ రిద్దరికిని వత్తు, రిత్తురువలసిన ♦ దెల్లమీకు

ఆ. సంగతుల సహాయ♦సంపత్తి చాలగా, నందువలన మాగ♦యాప్రసాదు
బాబుగారి గృహము ♦ పావనంబొనరింప, రండు వినుడు నాదు♦ప్రార్థనంబు.

ఆ. అనుచు రామనవము ♦ దర్శింపగా నెట్ట, కేల కీయకొనియె ♦ నేగె గాంధి
అలగయా ప్రసాద్ గృ♦హమ్మున బసచేసె, వారల యనురాగ ♦ వార్థి దేలె.

సీ. బ్రజకిశోర్ రాజేంద్ర ♦ బాబులు దర్భంగ, పూరీ పురములనుండి ♦ చేరిరటకు
వినయవివేక స♦ద్విశ్వాసములుగల, బ్రజకిశోరుడు గాంధి ♦ వశ్యుడయ్యె
ఎల్లసమాచార ♦ మెరిగించె జేదక, ర్షకుల గురించి వి♦శదముగాగ
పేదరైతులనుండి ♦ పిండుచుండిరివారు, బ్యారిస్టరులుగ రూ♦ప్యములు వేలు

తే. గాంధియిదిగాంచియచ్చెర♦వందిమృదువు, గానె చీవాట్లు పెట్టెనీ♦క్రౌర్యమునకు
చదివియారైతుజనులవ్యా♦జ్యములగాంధి, వారికిటుదెల్పెఁదనయభి♦ప్రాయమెల్ల.

క. "ఇటువంటి వ్యాజ్యములు కో,ర్టులకు గొనిపోవుటలు ని♦రుపయోగమ్మం
తటి భీతిచెందు రైతుల, కెటులైనను భయముడంచు♦టే తగుపథమౌ 228

క. రెండుపదమ్ములు నేనిట, నుండిన చాలంచు వచ్చి ♦ తుచితముగా దిం
దుండిచనుట నాకిపుడే, యుండెద రెండేండ్లవసర ♦ మున్నను వరుసన్. 229

సీ. ఇపుడిప్పుడే గ్రహి♦యించితి నేఁజేయ, గల పనులేవొ తిం♦కాటియాను
పారద్రోలుటకు బీ♦హారురాష్ట్రమునుండి, మీరుసాయ మొసర్ప♦గోరుచుంటి
"ఏమొనర్పంగల ♦ యెల్లసాయమొనర్తు, మెట్టిసాయముగోరె♦దీవ"నంగ
"నాకుమీన్యాయ వి♦జ్ఞానమ్ముతో పని, లేదు; యీ భాషాం♦వాద మిడుచు

గీ. చిల్లరగుమస్తపనులెల్ల ♦ చేసిపెట్టి, యలయు ప్రతిఫలమాశింప ♦ వలనుపడదు
చేయవలె ప్రేమ నుపకార ♦ చింతనమున, చాలునిదికోరనే మిము♦జైలుకేగ".

ఆ. అనెడుగాంధి పలుకు♦లాలించి బ్రజకిశో, రతని సఖుల గ్రుచ్చి ♦ యడిగివారు
నేయగలది వారు ♦ సేయగావలసిన, దెల్ల గాంధినడిగి ♦ యెరిగెనంత. 231

గీ. కడకువారెల్ల గలిసి "మీ♦రడిగినట్టి, పనులనిందరుచేతు రిం♦దునను గొంద
రుంద్రుమీతోడ మీ రెప్పు♦డుండమన్న, జెయిలుక్రొత్తపత్యాభ♦జేర్ణమునకు
యత్నమొనరింతు"మనుచు మో♦హనుని కనిరి. 232

అహింసతో ముఖాముఖి

మం. ఆచంపరాన్ కర్ష ♦ కావళినెల్ల, చక్కగానడిగి వి♦చారించి వారి
స్థితిగతుల్ కష్టముల్ ♦ బ్రతుకురీతులను, దెలియగా గాంధియు♦ద్దేశంబెయైన
ముందుభూస్వాముల ♦ డెందంబెరుంగ, గలయగా జిల్లాధి ♦ కారినింగోరె
బయటూరివానికి♦పనియేమి యిచట, భూస్వాములకు వారి♦పాలమ్ము రైతులకు
నడుమవచ్చుట కీవె♦వడవు, నీచెప్పు, నది వ్రాసి యిచ్చిపొ♦మ్మనెడు తదీయ
కార్యదర్శికనియె ♦ గాంధి మర్యాద, "కానుబయటివాడ ♦ కర్షకుల్ గోర
వారికష్టముల్ వి♦చారింప నిందు, కరుదెంచితి గలదు ♦ హక్కు నాకంచు"

జిల్లాధికారి "నిం ♦ జెయిలుకంపెదను, వెంటనేటిర్వాటు ♦ విడిచిపోకున్న"
అని బెదరించె గాంధిని తాటియాకు, చప్పుళ్లకుం దేలు ♦ జడియునే ధరణి. 241

క. మోహానుడెరిగించెను దన, స్నేహితులకు విషయమెల్లఁ ♦ జెప్పెను "నే మో
తీహారి చనెద ప్రభుత్వము, సాహసమున నంపవచ్చు ♦ జైలుకునన్నున్". 242

వ. టిర్హుటాహ్వాయముగల ఆడివిజనందు, చంపరాననునది యొకానొకమండలము. మోతీహారియనునదా చంపరానుజిల్లాకు ముఖ్యపట్టణము. బెట్టియాపట్టణసమీపముననే రాజకుమార్ శుక్లానివాసము తదీయపట్టణము చుట్టుప్రక్కల వసించు రైతులు చాలపేదవారు. శుక్లావారిని జూడరమ్మని గాంధిని తొందరించెను. మోహానుఁడును వారిని దిలకింప నెంతయో కుతూహలియై యుండెను. కనుక మోతీహారి, బెట్టియాపట్టణములకు దానరెస్టుకాకముందే యేగవలయునని గాంధి నిశ్చయించెను. 243

ఉ. స్నేహిత బృందముంగలసి ♦ చెచ్చెర నాదినముందె గాంధి 'మో
తీహారి' జేర 'గోరకుని ♦ దివ్యగృహంబున నుండవాసమా
గేహము చాలదాయెనటఁ ♦ గిడ్వడెరైతొక డైదుమైళ్ళ మో
తీహారి' కంచువార్తవిని ♦ తీవ్రముగా జనెనందు గాంధియున్. 244

క. ధరణీధర ప్రసాదను, వరమిత్రుండొకడుతోడ ♦ వడినడువంగాన్
తరలెను మోహానుడచటికి, కరిమూపున నెక్కి గోశ♦కటమందుపలెన్. 245

సీ. నడిదారినటులేగ ♦ వడివచ్చి "పోలీసు, సూపరెంటెండెంటు ♦ చూపిబండి
ననుబంపె నభినంద♦నములు మీకర్పింప", ననుచొకదూత మో♦హానునికనగ
ధరణీధరుని మోతి ♦ హారికంపి యాబండి, నెక్కి యాదూతతో ♦ నేగెగాంధి
"చంపరానువిడిచి" ♦ చనుమంచు నోటీసు, జారిచేసి యతని ♦ స్థానమందు

గీ. విడిచెగాంధిని; గాంధి "నే♦విడువజాల, నేనువచ్చిన పనిపూర్తి ♦ యైనవరకు
చంపరా"నంచుబదులంప♦'సమను'వచ్చె, పోవఁగోర్టుకుమరునాడు♦మోహానునికి.

క. ఆనాటిరేయి నతడిం, తే నిద్దురపోక లేఖ ♦ లెన్నియొ వ్రాసెన్
పూని వ్రజ కిశోరున కెం, తే నేర్పెను వలయునట్టి ♦ దెల్లనొనర్పన్. 247

సీ. 'సమను' నోటీస్ సమా♦చారమ్ము వ్యాపించె, దావానలముబోలె ♦ దశదిశలను
అంతకుముందెన్న ♦ దరయనట్లు జనమ్ము, వచ్చెఁగోర్టుకు గుంపు♦లచ్చెరువడ
నధికారులంత మో♦హానుతోడ గలసిరి, సర్దుబాటొనరింప ♦ జనులగుంపు
అంతగ్రహించిరా ♦ యధికారుల నిరంకు, శాధికారము చెల్లఁ ♦ జాలదింక

గీ. ననుచు; నధికారులకికభ♦యంపడంగ, వలయుఁ బనిలేదటంచు రై♦తులుగ్రహించి
రిటులగాంధి సత్యాగ్రహా♦పటిమ దెలియ, నయ్యె భారతదేశంబు♦నందు మొదట.

చ. ఎరుగరె చంపరానున న♦దెవ్వరు గాంధిని నందురైతులం
దరును బ్రపంచమంతగ గ♦నంగల విజ్ఞతలేనివారు చాం
పరును బరంగు భూతలిహి ♦ మాలయ పాదము చెంతగాన కాం
గిరెసు నెరుంగరెవ్వ రెరి♦గించినభీతిలు వారలచ్చటన్. 249

ఆ. ఇట్టి ప్రాంతమున బ్ర♦వేశించె కాంగ్రెస్ త,దీయ సభ్యజనము ♦ దిటవుతోడ
కాని కాంగ్రెసాఖ్య♦గాకుండవలయు కా,ర్యములుజరుపబడియె♦నమలముగను.

క. ఆనాడు కాంగ్రెసన్నన్, పోనాడు ప్రభుత్వమెల్ల ♦ భూస్వామిజనం
బానాడున నగుటందె,వ్వానిం గాంగ్రెస్సుపేర ♦ బంపరు పనులన్. 251

గీ. కాంగ్రెసోద్దిష్టభావంబు ♦ కలిమిచాలు, ఏలకాంగ్రెసుపేరచ్చ ♦ టెత్తుటంచు
గాంధిజరిపించె వలసిన ♦ కార్యమెల్ల, పేరుకెగఁ బ్రాకుపెద్దలు♦పెద్దలొక్కొ!

గీ. కర్షక సహస్రముంజేరఁ ♦ గలడె శుక్ల,రాజకీయవాసనలందుఁ ♦ బ్రాకలేదు
చంపరాన్ దప్ప బయటిదే♦శం బెరుంగ,దైన చిరకాల మెరిగిన♦యాప్తమిత్రు
కరణిగాంధి కొసగిరి స్వా♦గతము వారు. 253

గీ. "గలిగెనాకిందు దైవసా♦క్షాత్కృతియును,సత్యసందర్శనమునహిం♦సా మహత్తు
తెలియనయ్యెగారణమునిం♦దులకునాకు,ప్రజలయెడలగలప్రేమా♦నుబంధమనుచు."

గీ. "చంపరానందు మరువంగఁ ♦ జాలనట్టి, సంభవమునాదుబ్రతుకందు♦జరిగెనాడు
పరచె కమిషనర్ ననుబట్ట♦వలనొకండు, తగులుకొనెప్రభుత్వమ్మందు♦దారితప్పి"
అనివచించెను గాంధిమ♦హాత్ముడగుచు. 255

## వ్యాజ్యోప సంహారము

సీ. ఆరంభమయ్యె వి♦చారణకాని ప్ర,భుత్వలాయరు న్యాయ♦మూర్తి తదిత
రోద్యోగులేమి చే♦యుటకుదోపక తడ,బడగసాగిరి ప్రభు♦త్వపు వకీలు
న్యాయమూర్తిని గాంచి ♦ వ్యాజ్యవిచారణ, వాయిదావేయగా ♦ వాదుచేసె
కాని యడ్డమువచ్చి ♦ గాంధి "వాయిదయేల, వేయనేచంపరాన్ ♦ వీడకుండ

గీ. ధిక్కరించితి మీయాజ్ఞ♦నిక్కముగను, ఒప్పుకొనుచుంటి నేరమే♦నొనరిచితని
వినుడునాదు వాఙ్మూలమీ♦యను ననుమ,తింపుడనిసంగ్రహముగబ♦లికెనిట్లు.

మం. దేశమునకుఁ దోడి ♦ దీనమానవుల, కేసేవనొనరించు ♦ నిచ్ఛవచ్చితిని
ఇచటిరైతులు గోర ♦ నీరాష్ట్రమునకు, ఇందుండి విషయంబు ♦ లెల్లగ్రహించి
నంగాని సాయమొ♦నర్పంగ జాల, వేరుభావములేదు ♦ వెడలిపోఁజాల
నేవచ్చినట్టిప♦నిం జేసిగాని, మీనిషేధాజ్ఞల♦కే నొప్పఁజాల
నాదుకర్తవ్య మొ♦నర్తును ప్రజల,యెడగల బాధ్యత ♦ విడువంగజాల
కనుక మీయాజ్ఞధి♦క్కారమొనర్చి, నాడను నేరము♦నకు బాధ్యునగుట
కెట్టిశిక్షవిధింప ♦ నిచ్చింతు రదివి,ధింపుడటంచు గాం♦ధి వచింపనపుడు. 264

క. ఆమేజస్ట్రేటుకుమది, నేమియు దోషమని దీర్పు♦నిచ్చు నెపమునన్
నేమమున వేసెవాయిద, ప్రేమత్యాగములకు లొంగ♦రే యెవ్వరైనన్. 264

సీ. విషయమ్ములెల్ల స♦విస్తరమ్ముగ దెల్పు,చనిపె బాట్నాలోని ♦ యాప్తులకును
వైస్రాయి మాలవ్య♦వంటి పెద్దలకును, తంతిమోహనుడు ము♦ఖంబుతోడ
కానివాయిదనాటి ♦ కన్నముందుగనె త,ద్వ్యాజ్యోపసంహార ♦ వార్తవచ్చె
కోరినరీతి వి♦చారించుకోవచ్చు, రైతుకష్టములంచు ♦ వ్రాసెగాంధి

గీ. కల కలెక్టరుద్యోగుల ♦ వలన బొంద,వచ్చు సాయము వలసిన♦భంగినంచు
ఉత్తరమ్మొందు దానిని ♦ జిత్తగించి, కలిసికొనె గాంధియా కలె♦క్టరును బ్రీతి.

ఆ. నీతిమంతుడుగను ♦ బ్రీతి న్యాయముగూర్పు, మనముగల్గు పెద్ద♦మనిషిగాను
గానుపడియె నతడు♦గని గాంధిననె "నీవు, వలయునపుడు నన్ను ♦గలయవచ్చు.

ఆ. అడుగవచ్చునెల్ల ♦ యవసరమగు రికా,ర్డులనటంచు" నతడు ♦ తెలిపెగాంధి
కటు ప్రభుత్వమిడిన ♦ యాజ్ఞధిక్కార కా,ర్యమున ప్రథమవిజయ♦మందెగాంధి.

క. ఈ విషయమునకు నాగాం,ధీ విజయమ్మునకుగల్గె ♦ నిత్యమ్ముగువా
ర్తావేదికం బ్రచారము, వేవిధులం బ్రాకెగాంధి ♦ పేరుందిశలన్. 268

సీ. తనయొనర్చెడు విచా♦రణయందున దటస్థ,ముగ నుండదగును ప్ర♦భుత్వమంచు
అతిశయోక్తుల వ్రాత ♦ లధికప్రసంగవి,మర్శ పత్రికలందు ♦ మంచిగూర్పు
దనుచు భావించి మో♦హనుడు వ్రాసెనుదానె, వార్తలంపెదనంచు♦బత్రికలకు
తనయున్కియెడ ప్రభు♦త్వమువారిసుముఖత్వ,మునకుభూస్వాములు♦గినిసియుంట

గీ. పత్రికల నధికమ్మగు ♦ వ్రాతలున్న, నినుమడింపగజేయునా ♦ కినుకనదియు
వ్రాలుపై శాంచికమ్ముగా♦రైతుపేద, జనులపై నంచు దలచిమో♦హనుడు మదిని.

ఉ. ఇంతటి జాగరూకతల ♦ నెంతయొ జాగ్రతనున్న గాంధిపై
మంతన మంత్రణమ్ముల స♦మంజసరీతిని నల్పిభూపతుల్
చింతిలకింత వ్రాయగను ♦ జేసిరి కల్లలుపత్రికాళి నా
ద్యంతమెదో ప్రచారమున ♦ దార్చుచు గాంధిని దత్స్వభావళిన్. 270

గీ. అయిననేమాయె ప్రజలు మో♦హనునిపైన, బ్రజకిశోరునిపై గౌర♦వంబుబలిసె
మనమహామంత్రములుపార♦వనియెరింగి, భూమికామందులూరకై ♦పోయిరెల్ల.

ఆ. ప్రజలసేవగానె ♦ పాటించిపనిచేసె, రాజకీయదిశకు ♦ బ్రాకకుండ
గాంధి చాంపరాను ♦ కర్షకోద్యమమది, తుదకు దేశమునకు ♦ దోడుపడియె.

### కార్యవిధానము

క. గోరఖు బాబుగృహంబు వి,చారణకార్యమ్మునకు వి♦శాలము లేమిన్
వేరొక్కగృహమునకు జే,కూరిచె నలప్రజకిశోరు ♦ కూటముతోడన్. 273

ఆ. వలయుధనములేక ♦ పని చేయసాధ్యమ్ము, కాదు తగదు కోర♦ పేదచాంప
రాను ప్రజలనుండి ♦ కాన వ్రజకిశోరు, ధనికసఖులనుండి ♦ ధనముగోరె
ఇతరరాష్ట్రమిత్రు ♦ లిచ్చెదమన్నను, కొనక గాంధి వారి♦ధనమొకింత. 274

గీ. వ్రజకిశోరుని బీహారి ♦ ప్రబలధనిక, సఖులొసంగెడు ధనములు ♦ చాలకున్న
మిత్రుడైన డాక్టరు పి. జె ♦ మెహాతవలయు, ధనముపంపెద చెప్పిపం♦పినటంచు.

సీ. చాంపరాణ్ వేదదే♦శమ్మాట వెచ్చించె, పొదుపుగా డబ్బులు♦ మోహనుండు
మొత్తమ్ముపై రూప్య♦ములు మూడువేలె వ్య,యంబయ్యెమిగిలెధ♦నంబుగొంత
క్రమముగా సందరం ♦ గలిపిలాయరు మిత్ర,మండలి శోకవంట ♦ వండుకతన
పనిభారమునుదగ్గె ♦ ధనమింత పొదుపయ్యె, కాలమ్ముశక్తియు ♦ కలిసివచ్చె

గీ. సాగె గార్యక్రమము చాల♦సత్వరముగ, గాంధిసందర్శనార్థుల♦గణమునదుపు
చేయరైతులువాఙ్మూల♦మీయగొనగ, ఆరుగురొ ఏడుగురొ వలం♦టీరులుండ్రి.

శా. ఆవాఙ్మూలములన్ని చాలవరక ♦ త్యాసక్తితో రైతుల
త్యావేశంబున బల్కనట్టివియు ని♦త్యాగ్రమేడితాలైన స
ద్భావోత్సాహులు నోటవారి పలుకుల్ ♦ భావ్యంబుగా దోచె నం
దే వైరుధ్యములేమి నెల్లగొనిరా ♦ స్టేట్మెంట్లు వాలంటిరుల్. 277

గీ. పలువిధమ్ములుగా నడ్డు♦ప్రశ్న లెన్నొ, వేసి యొక్కొక్క రైతుద♦ద్వివరణముల
నెట్టివైరుధ్యమును లేని♦యట్టు గొనిరి, వారి వాఙ్మూలముల వలం♦టీరులందు.

గీ. అన్నిగతుల యక్షప్రశ్న♦లెన్నొ వేయు, కతన సి. ఐ. డి వారుంట♦నతిశయోక్తు
లెవియు లేకుండనతిభయ♦మువల ద్రోసి, సత్యమునె పల్కె ప్రతిరైతు♦జాగ్రతగను.

ఆ. అందువలన నవివి♦రాక్షేపణీయముల్, నిర్వివాదములుగ ♦ నెగడె జాంప
రానునందుగొన్న ♦ రైతువాఙ్మూలముల్, అటులనే ప్రభుత్వ ♦ మరసెవాని.

క. ప్లాంటరులమనములం దెటు,వంటి వ్యథాక్రుద్ధమైన ♦ భావమ్ము లెవిఁ
అంటనిరీతిగ మోహను, డొంటిగదా గలసెవారి ♦ నొప్పించుటకై. 281

గీ. తన్ను ద్వేషించు వారితో♦ దన్నలక్ష్య,ముగను జూచెడువారితో♦మిగులగౌర
వమునగాంచెడు వారితో♦విమలమృదుల, ఫణితిభాషించి రైతుల♦పాటులడప
పాటుపడెగాంధి 'ప్లాంటర్ల♦కోటువడక, నిత్యసత్యస్థిత ప్రజ్ఞ♦నిపుణమతిని. 282

## తోడివారు

ఆ. వ్రజకిశోరబాబు ♦ బాబురాజేంద్రుడు, సాటిలేని మేటి ♦ జంట వారి
శ్రద్ధవలనవారి ♦ సాయంబుచేతనే, గాంధిచేసెనెల్ల ♦ కార్యములను. 283

సీ. వారిశిష్యులు శంభు♦బాబనుగ్రహ బాబు,ధరణి బాబను దది♦తరుల తోడ
రామనవమి బాబు♦ప్రముఖలాయరులెల్ల, అనుసరించిరి గాంధి ♦ ననవరతము

అపుడప్పుడు సాయ మొ♦నర్పవచ్చిరి వింధ్య,బాబు జానకధర ♦ బాబు పేర్మి
వీరెల్లరల్ల బీ♦హారిలె రైతుల, వాఙ్మూలములవిని ♦ వ్రాసికొనుట

గీ. వారలప్రధాన కార్యమ ♦ వారిగాను, చేసె సాయము జన్మతః ♦ సింధుజాతి
వాడెయైనను గృపలాని ♦ భక్తిమెయిని, కాచె దర్శనార్థులనుండి♦గాంధి నెపుడు.

క. తనసహాజహాస్య వాగ్ధో,రణిచే బెదరింపుచే ని♦రంతరమును గుం
పును బంపివైచి పవలన్, వినిచికథల సఖులకిడియె ♦ విందుల రేలన్. 285

గీ. మాస మాస మొకటి రెండు ♦ మార్లువచ్చి, ఏదికావలె సాయమే♦దే నొనర్తు
చెప్పమంచును మోహను♦చిన్ననాటి,సకుడు మౌలానమజహరుల్ ♦హకునువచ్చె.

ఆ. అనుభవమ్ము హెచ్చు ♦ నగుకొద్దిబీహారు, నందు రైతు లక్ష♦రాస్యులైన
గానిరెట్టికృషికిఁ ♦ గల్గదుశాశ్వత, ఫలముటంచు గాంధి ♦ తెలిసికొనియె. 287

ఆ. తమకువిద్య లేమిఁ ♦ దమబిడ్డలను విద్య,కంపకుండ వీడి♦రాడఁదిరుగ
నీలితోటలందుఁ ♦ గూలికిఁగష్టింపఁ, జేసిరి దినమెల్ల ♦ కాసులకును. 288

క. ఆరోజులజీతము మగ,వారికి పదిపైస లాడు♦వారికి పైసా
లారుగ నుండుట మూడిం, పారగ గొనుచుండిరెల్ల ♦ బాలురదినమున్. 289

క. దినమొక నాలుగణాల గ,డనచేసిన వాడసృష్ట ♦ ధనవంతుడుగా
గణియింపబడుట గనిమో,హనుఁ డారంభించెఁ బల్లె♦లారిట బడులన్. 290

గీ. ఉండఁగొంపయు, దినఁగూడు ♦ నొసగఁబల్లె, ప్రజలు పాయాధ్యా లకితర♦వ్యయ
ములను భరించిరెల్లయు మోహనుఁ ♦ డితరసఖులు. 291

ఆ. చేతనగదు లేదు ♦ చెల్లింపనైన నీ,గలము తిండిదినుసు ♦ లలయకుండ
ననుచు బ్రతినజేసి ♦ రాపల్లియల ప్రజల్, బడుల దెరచు నెడల ♦ వారికొరకు.

ఆ. అందువలనగాంధి ♦ యంపె నుపాధ్యాయ, జనముకొరకు వినతి ♦ స్థానికముగ
చాలచాలనట్టి ♦ సఁబళమ్ములకు నే,ర్పంగవిద్య నెవరు♦రారటంచు. 293

మ. నిత్యమన్ని బడుల ♦ నేర్పుసామాన్య,లగు నుపాధ్యాయుల ♦ కప్పగించుటకు
నాశైతుపిల్లల ♦ నంగీకరింప,డాయె మోహనుడట్టి ♦ అధ్యాపకులకు
చదువు యోగ్యతకన్న ♦ సంస్కృతిస్థాయి, నీతియుముఖ్య మ♦న్నింటికినియె
అట్టిభావమున మో♦హనుఁడొసరింప, వినతికి తలనొగ్గి ♦ వేంచేసిరటకు
పుండలీక్ సోమనుల్ ♦ బొంబాయినుండి, వచ్చెనవంతికా ♦ బాయిగోకేలు
పూనాపురమునుండి ♦ ఆనందబాయి, అరుదెంచె; సత్యాగ్ర♦హాశ్రమమ్మునకు
చెప్పింపంగ వ♦చ్చిరి దేవదాసు, చోటలాల్ సురేంద్ర క♦స్తూరిబాయిలును
అప్పుడప్పుడె జీవి♦తాంతంబుగాంధి, కనుయాయులుగ నుండ♦నరుదెంచినట్టి
మహాదేవదేశాయి ♦ మరినరహారి పరీకాత్మ సతులతో ♦ ప్రేమగొల్వంగ
అందుగొందరు చదు♦వందధికులును, కొందరునేర్చిరి ♦ ఘూర్జరమ్మొండె. 303

అందరింగనియిట్లు ♦ గాంధివచించె, "ఈపిల్లలందరికి ♦ మీపిల్లలనుచు
పరిశుభ్రముగనుండ♦బాగుగానడువ, గరపుడుముందు; వ్యా♦కరణమ్ముమరియు
వ్రాయుట చదువుట ♦ వేయలెక్కలను, నేర్పంగవచ్చును ♦ నెమ్మదిగాను. 306
అక్షరపంక్తి సం♦ఖ్యావాచకముల, నేర్ప సులభమె మీ♦నేర్చినభాష
లగు గుజరాతి మ♦రాతి హిందీల, అక్షరమ్ముల భేద♦మంతగా లేమి."
అనవారు విశ్వాస♦మాసక్తి వెలయ, ఆరైతుపిల్లల♦కట నేర్పి రెల్ల
ఆదర్శపాఠశా ♦ లయ్యెనవంతి, కాభాయి తాదాత్మ్య ♦ మందామె బడిని
పల్లెస్త్రీలను స్త్రీ యు♦పాధ్యాయజనము, మూలమ్మున గ్రహింప ♦ మొదలిడిరంత
ఆపల్లెలం దస♦హ్యమ్మైన మురికి, తలగింపఁ బిలిపించె ♦ డాక్టరుదేవు
నతడుపెద్దగ నంద♦రధ్యాపకులును, పనిచేసి రభివృద్ధి ♦ పరుప పల్లెలను. 3!3

పల్లెల ప్రవేశము

క. ఒక్కొకబడి కొకపురుషుఁడు, నొక్క మహిళ నియమితులయి ♦ రొప్పరికింపన్
చక్కగ వైద్యారోగ్యము, లక్కరగా నందుసాధ్య ♦ మైనకొలందిన్. 314
క. ఆపల్లెస్త్రీల కామహి,ళోపాధ్యాయినులవలన ♦ నుపకృతి జరిగెన్
ఓపికనడుపంబడె వై,ద్యోపశమన మెల్లసులభ ♦ ముచితముగాఁగన్. 415
సీ. సాధారణజనాళి ♦ బాధలౌ మలబద్ధ,క జ్వరమ్ములడప ♦ గడ్డలుడుప
ఆముదమ్మల్లక్వి♦నైను గంధకతైల,ముల మాత్రమే వాడ♦ మొదలు వెట్టి
రేరోగులును మందు ♦ లిండ్లకెప్పుడును గొం,పోరావటంచును ♦ మదలనిడిరి
కడువిపరీత రో♦గస్థితులందు డాక్టరుదేవు సంప్రతిం♦చిర జనములు
గీ. దేవునింబలె డాక్టరు ♦ దేవు, వార, మందునిర్ణీతమగు దినా♦లందు నెల్ల
వైద్యకేంద్రాల దర్శింప ♦ వచ్చుచుండె, ఎందరికొ యుపయోగించె ♦ నిదిప్రజలకు
వారివ్యాధులుకొంచెమై♦వాయుకతన, సులభముగగొప్పడాక్టర్ల♦వెలితేయున్న.
వ. ఇట్లు రోగనివారణోపాయంబుల కాయమాయికప్రజలు సాయపడినను, పరిశుభ్రతఁ బాటింపఁజేసి, ఆరోగ్యరక్షణ మొనర్చుటందు వారిసహకార మంతగా లభింపదాయెను. తమంతకు తామై తారేదియుం జేయుటకుఁ దయారుగా లేకుండిరి. పొలములందు గష్టించుకృషికులు గూడ తమ సొంతమైన ఊడ్పుపని యందు ముందునకు రారైరి. అయినను డాక్టరుదేవు, నిరుత్సాహపడక పల్లెల నెల్ల నొక్కటొక్కటిగా, నాదర్శప్రాయమైన పరిశుభ్రతగల పల్లెసీమలుగా జక్కదిద్దుటకు, దన వలంటీరు దళసహాయముతో నుపక్రమించెను. వారలాపల్లియల బాటలను తదీయ గృహావరణమ్ములనూడ్చి వారిబావులఁ బరిశుభ్ర మొనర్చి, యందలి మడుగులఁ బూడ్చిరి. తమ యనురాగాదరములతో నాపల్లె ప్రజలమనమ్ములఁ జూరగొనిరి. వారిలో ననేకులు వలంటీరు దళమునఁ జేరున

ట్లొనర్చిరి. కొన్ని పల్లెలందు ప్రజలు సిగ్గుపడి పనిచేయునట్లు చేసిరి. మరికొన్నిటి యందు ప్రజలే యత్యుత్సాహముతో గాంధిగారి మోటారుకారు కష్టము లేకుండా పోగలుగుటకు బాటలు వేసిరి. ఇట్టి మధురానుభవములతోడఁ గొందరి భారమైన నిర్లక్ష్యభావములు తిలతండుల న్యాయమున గలసియుండెను. ఇట్టిపని తమ కయిష్టమైనదని కొందరు రైతులు గాంధిగారి యెదుటనే నుడువుటకు వెనుదీయరైరి. 317

క. తానమభవమున గాంచిన, వానా డాచంపరాను ♦ నందలి విషయాల్
జానుగ వివరించెను విను,వాని మతిఁ సానుభూతి ♦ వడిఁబుట్టుగతిఁ. 318

సీ. భితిహార్వనెడు దొక్క ♦ పిల్ల గ్రామంబట,నుండె వారలబడి ♦ యొండొకండు
తత్సమీపమ్మున ♦ దానికన్నను చిన్న,పల్లెలోఁ బడతులు ♦ క్రుళ్ళుకంపు
గొట్టుబట్టలఁగట్టు ♦ కొంటగాంచెను గాంధి, కస్తూరిబానద్ది ♦ గాంచమనియె
"ఇంత మాసినబట్ట ♦ లేలగట్టెదరిట్టు, లెందుల కుతకలే ♦ దివ్వియనుచు"

గీ. నడుగవారల యందొక ♦ పడతితనదు, గుడిసెలోనికిఁ గస్తూరిఁ ♦ గొంచుబోయి
"కాంచవమ్మరో మరియొక ♦ కట్టుబట్ట, ఉన్న దే? నేగట్టుకొన్న ది ♦ దొకటిగాక.

క. ఎటు లుతకంగలదీనిని, ఎటులే తానంబొనర్తు ♦ నిది తెలిపి మరొ
క్కటిచీరం దెమ్మని పల్కుటతగదె మహాత్మునికని ♦ కోకంగట్టెఁ. 320

తే. ఇటులఁబల్కినదిమె యొ♦క్కటియొగాదు, ఎల్లపల్లెల గుడిసెల♦నెల్ల పేద
కష్టజీవుల యిల్లాండ్ర ♦ గతియునంతె, కట్టమారొక బట్టలే♦నట్టిదకట! 321

వ. మరింకొక అనుభవ మిట్టిదే, యేనాటికిని మరపునకురానిది. 322

సీ. వెదురునుగడ్డియుఁ ♦ గొదువ లేకుంట నా,భితిహార్వబడి గడ్డి♦ వెదురుదగుట
నిప్పుముట్టించిరి ♦ నీచు లెవ్వరొ; యొక,నాటి చీకటి రేయి♦పూటనకట
సోమనునడపెడు ♦ స్కూలొకొట నతడంత, నిటుక కట్టడము క♦ట్టించె బడికి
సర్వజనసహాయ ♦ సంపత్తి జేకూర్చి, నిప్పుముప్పెప్పుడు ♦ దప్పునట్లు

గీ. ఇటువలంటీర్లు తమస్కూళ్ళ ♦ నెట్లొనడిపి, పారిశుద్ధ్యపు పనులనే♦ర్పడనొనర్చి
వైద్యసదుపాయములనెల్ల ♦ బడయఁబల్లె, ప్రజలకొనరించి తద్ద్వార♦వమ్ముపల్కు
బడినివిశ్వాసముల గడించి ♦ రెడరులేక. 323

సీ. అయినవాలంటీరు ♦ లందు తాత్కాలిక, ముగ మాత్రమేయుంట♦ముందు కెవరు
తదితరుల్ రాకుంటఁ ♦ దత్కార్యనిర్వహ, ణార్థమెందుండియు ♦ నకటగాంధి
ఆశించినట్లాని ♦ రవధికనిర్మాణ, కార్యక్రమమ్మెల్ల ♦ గనకపోయె
శాశ్వతస్థాయిని ♦ సదమలస్థితిగాంధి, అన్యరాష్ట్రముల కా♦ర్యములకరుగ

గీ. నైన నాకొద్దినెలల కా♦ర్యక్రమమ్ము, చాంపరానందు వేరూని ♦ సాగుచుండె
వదియెా యొక్కరూపున♦నెట్లొయెందొ, నేటికింగూడననెగాంధి♦నిజమెయగుట.

### ఘనగుణుడగు గవర్నరు

సీ. ఒకప్రక్కసాగ సాం♦ఘికసేవ రైతువా, జ్ఞాలలేఖనసాగె ♦ మూలనొండు
వేలకొలంది వా♦జ్ఞాలమ్ము లట్టివి, అనుదినమును దీసి♦కొనుచునుండ
ప్లాంటరులాగ్రహా ♦ పరవశులై గాంధి. యుద్యమంబడప ను♦ద్యుక్తులైరి
చేరెనుత్తరము బీ♦హారు ప్రభుత్వమ్ము,నుండి యీవిధముగా ♦ నుండెనందు

గీ. "జరిగెగద మీవిచారణ ♦ చాలకాల,ముగను దద్విచారణ నిక♦ బూర్తిచేసి.
వెడలిపోరాదె బీహారు♦విడిచిత్వరగ",ననుచులిఖియింపఁబడియుం డె♦వినయసూక్తి.

సీ. "చాలకాలమునా వి♦చారణ పూర్తియౌ,టకు బట్టునేనంత ♦ దాక నుందు
నావిచారణ కార♦ణమ్మున ప్రజలకు, కష్టవిమోచన ♦ గలుగవలయు
ప్రజమొరవిని వారి♦బాధల దొలగించి, నావిచారణకం తొ♦నర్పవచ్చు
గురుతించి రైతుల♦మొర నధికారవి,చారణ వెంటనే ♦ సలుపవచ్చు"

గీ. అనుచువ్రాయ జవాబు మో♦హనుడుపన్ను,గలసికొమ్మనెపెడ్వర్డు♦గయిటుగలయ
నాగవర్నరు "నీకోరి♦నట్టుల నధి♦కారిక విచారణ మొనర్ప♦కమిటి సభ్యు
డవుగనుండుమీ"వని గాంధి ♦ కనియెఁ గూర్మి. 326

మః. ఆకమిటీలోని ♦ యన్యసభ్యాఖ్య,లడిగి యెరిగి తన♦యనుచరావళిని
సంప్రతించి కమిటి♦సభ్యుఁడగుటకు, సమ్మతించెను గ్రింది ♦ షరతులపైన
"నాతోడఁబనిచేయు ♦ నట్టివారిని వి,చారణసాగగా ♦ సంప్రతించుటకు
కమిటిసభ్యుడనైన ♦ గర్షకజాతి, అడ్వొకేటుగనుండు ♦ హక్కునాకుండ
వలయు విచారణ ♦ ఫలితమ్ము తృప్తి,కరముగా లేకున్న ♦ కర్షకసమితి
కనువైన పథకమ్ము ♦ లనుసరింపంగ, సలహానొసగి తగు♦చర్యలనడుప
హక్కునాకుండ మీ♦రంగీకరింప, వలయు" నంచును గాంధి ♦ వార్తఁబంపంగ
సమ్మతించెను 'గైటు♦షరతులకెల్ల,' 'సర్ ఫ్రాంకుస్లై'యా వి♦చారణ కమిటి
అధ్యక్షుడుగ జర్గె ♦ సభల'మెక్నెయిరి, కమిటిసిఫారసుల్ ♦ కర్షకజాతి
కనుకూలమయ్యె 'టిం♦కాతియా' రద్దు, చేసె ప్రభుత్వమ్ము♦చేసి శాసనము
అణగారె ప్లాంటర్ల ♦ నాదిగాజనుపు, దౌర్జన్యమెల్లయుఁ ♦ దలగ్గె రైతులకు
దీనికంతయు 'గైటు' ♦ ధీరుండుదారుఁ, డమలగుణ స్థైర్య♦విమల మనస్కుఁ
డగుటచే ప్లాంటర్ల ♦ ఆటలుకట్టె ♦ పాస్యయ్యె 'అగ్రేరి♦యను' శాసనమ్ము
ఆతరువాత మో♦హనుడు దామున్ను, ఆరంభమొనరించి ♦ నట్టినిర్మాణ
కార్యమ్ము సాగింపఁ♦గాంతుంచె స్కూళ్ళ, ఎక్కువస్థాపించి♦యెల్లగ్రామముల
కాని తాఁదలఁచిన ♦ కరణినిగాక, దైవమ్ము వేరుగా ♦ దలచినకతన
వీడిబీహారును ♦ వెడలెఁ దదన్య. రాష్ట్రాలప్రజల కా♦ర్యములఁ బాల్గొనగ. 343

## కార్మికులతోటి పరిచయము—1918

సీ. చాంపరాన్ రైతు విచారణ పరిపూర్తిగా వచ్చినంతలో గాంధికందె
'పాండ్యా' పరీక్షులు వ్రాసిన లేఖ 'ఖేడా' మండలమునఁ బంటలుచే డెనని
కర్షకుల్ పన్నుల కట్టఁ గష్టంబని, తద్విముక్తికి జూప దారినెట్లొ
అచటిపరిస్థితు లరసినగాని తా, నేమనుటకు సాహసింపఁడయ్యె. 344

గీ. అహమదాబాదునుండియు నపుడె వ్రాసె, లేఖ కార్మికజాతి కూలీలవస్థ
హేయముగనుండెనని యనసూయబాయి, గాంధివారికిఁ దోడ్పడఁ గాంక్షచేసె.

క. ఏరీతిసాధ్యమగు బీ,హారున దానుండ నహమదాబాద్ కర్మా
గారమ్ములఁ బనిచేసెదు, వారికిఁ దోడ్పడనటంచుఁ బయనమ్మయ్యెన్. 345

క. అటు ఖేడాకర్షకులకు, నటునహమదు బాదు కార్మికాళికి సాయం
బెటులోయొనర్చి త్వరగా, నిటుఁ గ్రమ్మరవచ్చెదంచు నేగె నతండున్. 346

క. కాని యనుకొన్నగతి పను, లౌనే! యింతైనగాంధి యరిగి తిరిగిరా
మానెఁగట! చాంపరానున, మానెఁపనుల్ సాగుటెల్ల మరిముందునకున్. 347

సీ. చాంపరానున గాంధి సాగింపఁదలఁచె నా,దర్శగోరక్షణో ద్యమము వేర్మి
ఉండెమార్వాడి మిత్రుండీయ నాశ్రయ,మాతని ధర్మశాలందొకప్డు
'బెట్టియా' యనుపల్లె పట్టదియందుగో,శాల మార్వాడీలు జరుపుటరసె
గోరక్షణమ్మున గోజాతిపోషణా,భ్యుదయమ్ము వృషభసంతోషణమ్ము

గీ. మరియు నాదర్శగోష్ఠ నిర్మాణమనుచు, కలిగె నిశ్చితాభిప్రాయములను గొన్ని
గాంధితానుండ చాంపరానందు గ్రామ, వైద్యవిద్యోద్యమములతో బాటునాడె.

ఆ. చేయగలముపూర్తి సాయమ్ము గోరక్ష,ణోద్యమమున మీర లున్ననంచు
మాటనిచ్చిరల్ల మార్వాడి సఖులెల్ల,రైన గాంధియుండఁడాయెనందు. 349

క. కలదీనాటికనిం గో,వుల రక్షణశాల నాడునుండిన గతినె
ద్దుల గొట్టిపెట్టిబాధల, వలయించియు బనులగొందు రలవికి మించన్. 350

ఆ. ఇటులనిలిచిపోయె నేకటా! యీపని, యనుచు వగచె గాంధి యనవరతము
చాంపరాను కేగుసమయమ్ములందు జీ,వాటు లిడగమారు వాడిసఖులు.

గీ. సాగుచుండె నేదోరీతి చదువులపని, కాని యనుకొన్నరీతిగా గాకపోయె
చక్కగాఁ బాదుకొనమి గోశాలకార్య, చర్యలెల్లయు నంతట సమసిపోయె.

శా. ఖేడారైతు సమస్య చర్చయొక చక్కన్ సాగుచుండంగనే
పాడింగూర్పఁ దలంచె నా యహమదాబాద్ కార్మికాందోళనన్
ప్రౌఢింజేకొనెఁ దత్సమస్య వడిఁదీర్పన్ మోహనుండందు దన్
వేడంగా ననసూయబాయి మివులన్ వెన్నాడకింతేనియున్. 353

సీ. పనివారికోర్కెలు ♦ పాడివైనను యజ,మానులొప్పమి స♦మస్యరేగ
అన్న 'అంబాలాలు' ♦ యజమానులకు; జెల్లె,లవసూయ తత్కార్మి♦కాళికెల్ల
నేతలౌటయువారు ♦ స్నేహితులౌటయు, గాంధికాతగవాప్పఁ ♦ గష్టమయ్యె
సంప్రతింపులుచాల♦జరిపి మోహనుడు మ,ధ్యస్థసూత్రముమంచి♦దనుచుదెల్పె
గీ. సమ్మతించిరి కార్మికుల్ ♦ సమ్మతింప,రైరి యజమానులందుల ♦ కంత గాంధి
సమ్మెసేయగ సలహానొ♦సంగె గార్మి,కులకునీరీతి బోధించెఁ ♦ గూర్మి బేర్మి. 354
క. "ఎపుడుఁగా హింసకు బూనకుఁ,డెపుడుఁగా బాధింపకుండ ♦ నేవిద్రోహింగా
ఎపుడడుగకొనక నిల్వుడు, సఫలముగా సమ్మెకట్ట ♦ సంపాద్యముచేఁగా".
తే. గాంధిబోధింప నటులనా ♦ కార్మికాళి, "సమ్మెచేసెదమో ర్మిమా♦మరతులెల్ల
మిల్లుయజమానులెల్ల సం♦ప్రీతి సమ్మ,తించు వర"కంచు గొనిరి ప్ర♦తిజ్ఞదీక్ష. 356
సీ. ఈసమ్మెకాలమం♦దే సన్నిహితులైరి, వల్లభభాయింకరుల్ ♦ వాసిగాంధి
కాసబర్మతీ తీర♦మందొక వృక్షరాజచ్ఛాయ కలసిరి ♦ సమ్మెదార్లు
నిత్యమ్ముశాంతిమై ♦ నిలుడాత్మగౌరవ, మేపారనని ప్రబో♦ధించెగాంధి
అనుదినమా యహ్మ♦దాబాదు వీధుల, జరిపి రూరేగింపు ♦ శాంతమతిని
ఆ. ఏకటేకటంచు ♦ నెల్లరుగార్మికుల్, లిరువదొక్కదినము ♦ లరుగుదాఁక
సమ్మెసాగుచుండ ♦ సంప్రతించెను మిల్లు, నాయకులను గాంధి ♦ న్యాయమింత
కార్మికులకు గూర్ప♦గా వారినర్థించి, కాని వ్యర్థమయ్యె ♦ గాంధికడక. 357
క. మాకును గలదయ్యా విను,మీకగా మాగొన్న ప్రతిన ♦ విడువగనౌనే?
మాకన్నబిడ్డలంబలె, నీకార్మిక జనులగంటి ♦ మిప్పటిదాకఁగా. 358
తే. ఇట్టి మామధ్య నితరుల♦కేల జోక్య,మెందుగల దిందుమధ్యస్థ ♦ మెవరుచేయ
ఎటులనోర్వంగ గలవార♦మెవ్వరేని, వచ్చుచోమధ్య మూడవ♦వారుగాను"
అనుచు యజమానులెల్ల మో♦హనుని కనిరి. 359

### ఆశ్రమ పర్యవేక్షణ

తే. చాంపరానులోనుండిన♦సమయమందు, కూడసతతమాశ్రమమును♦గూర్చిగాంధి
మదిని దలపోయు చప్పడు♦మానకుండ, ఆశ్రమముజూడవచ్చుచు♦నరుగుచుండె.
సీ. ఆకాలమందుండె ♦ నాశ్రమ మహమదా,బాద్ కడకొచ్రబఁగా ♦ పల్లెయందు
'ప్లేగు'రోగమ్మందు ♦ రేగెనాశ్రమ వాసు,లైన పిల్లలకపా♦యమ్ము గదిరె
ఆశ్రమ పరిసర♦మ్మందలి యపరిశు,ద్ధమ్ము సహింప సా♦ధ్యమ్ముగామి
పల్లెపట్టణముల ♦ కల్లంత దూరాన, నిరపాయమగుచోట ♦ నిర్ణయించి
ఆ. కట్టనాశ్రమమ్ము ♦ గాంధిదలంచె స,బర్మతిఁ జెరసాల ♦ భవనముండు
స్థలసమీపమందు ♦ జైలుప్రత్యేక మా,కర్షణమ్ముగాగ ♦ హర్షమునను. 361
క. స్థలముంగొను టెనిమిది దిన,ములలోపల బూర్తియయ్యె ♦ మోహనుఁడా చె
ట్టులు కట్టడమదిలేకయె, వెలయునదీ తీరభూమి ♦ వీక్షించెఁ దమిగా. 362

ఆ. శైలపరిసరములు ♦ శౌచమ్మునకు పేరు, తీరభూమి మిగుల ♦ దివ్యభూమి
అమలజీవనమున ♦ కనువైన యేకాంత, మచట గలసియుండె ♦ సుచరితముగ.

క. ఆరంభమయ్యెనందు గృహదార నివాసమ్ముతోడ ♦ డబ్బారేకుల్
కూరిచి వేసిన పాకం, దోరిమితో వంటపందు ♦ చాగినాశ్రమమున్. 364

సీ. అల్ల నల్లనవృద్ధి ♦ యగుచుండె నాశ్రమ, మానాడు మగవారు ♦ నాడువారు
బాలబాలికలు న♦ల్వదిమంది యుండిరం,దరి కొక్కవంట యిం♦టనె భుజింపు
మారంచలచె గాంధి ♦ మగనలాలుది తదీ,యాచరణంబెల్ల ♦ నాశ్రమమున
వానకాలంబది ♦ వలయువస్తువులు దే,వలసియుండె నపుడు ♦ పట్టణమ్ము

గీ. నాలుగుమయిళ్ళ దూరమ్ము ♦ నడచిపోయి, పాములకు నాటపట్టుగా ♦ బరగు క్రొత్త
స్థలమునందున జిన్నపి♦ల్లలనుగలసి, వాసముండుట మిగుల న♦పాయకరము. 365

క. పాములఁజంపఁగ రాదని, నేమంబొకఁడుండె జరుప ♦ నీతిగ భీతిన్
పాముల గనువారలకున్, సామాన్యమె ధరణినెల్ల ♦ జనులకుబోలెన్. 366

గీ. అల్ల విషజాతివధకూడ ♦ దను నియమము, చాలవరకుపోనిక్కుటా♦ల్లాయి క్షేత్ర
ములసబర్మతీ యాశ్రమ♦మునను గూడ, ఆచరింపగఁ బడెనందు ♦ వ్యర్థభూము
లందె వారలు వాసము♦న్నప్పటికిని. 367

సీ. అట్టిన దేవుని ♦ యనుకంప మహిమనే, ప్రాణిచావగలేదు ♦ పాముకరచి
ఎల్లస్థలమ్ముల ♦ నీరీతియగుటకు, కారణంబీశ్వరు ♦ కరుణయొండె
విధి విధానమ్ముల ♦ వివరమ్ముగ నెరింగి, వర్ణింపఁదరమె నే♦వ్వారికైన
మానవ మాత్రులా♦మహనీయ మహిమాతి,శయము వర్ణింపగాఁ♦జాలరెవరు

గీ. ఇరువదైదేడు లిట్టియ♦హింసనున్న, నేయపాయము రామికా♦యీశ్వరు కృపె
కారణంబని నమ్మెను ♦ గాంధి; దాని, మూఢవిశ్వాస మన్నను ♦ మూఢమతులు.

ఆ. నూతనాశ్రమమున ♦ నేతనికిగాను, పాకయొండుకట్ట ♦ బడుచునుండె
కార్మికాళినమ్మె ♦ కాలమం దహమదా, బాదుపురముసందుఁ ♦ బవలురేయి.

గీ. ఇరువదైదేండ్లు పాముల ♦ కిరవులైన; స్థలములందున్నఁ బాములఁ ♦ జంపకున్న
ప్రాణనష్టము లేమికిఁ ♦ బ్రాణదాత, యీశ్వరుని కృపగాక మ♦రేమిగల్లు. 370

క. విశ్వంభరు విశ్వేశ్వరు, శాశ్వతకరుణాకరేశు ♦ సర్వాత్మకునిన్
విశ్వాసమ్మునఁ గొలిచిన, శశ్వత్కృపఁగాచుఁదత్ప్రి♦జాళింబోలెన్. 371

— నిరశన వ్రతము — 1918 —

ఆ. మొదటి రెండువార♦ములు మిల్లు కార్మికు, లనుపమానధైర్య ♦ మాత్మనిగ్ర
హమ్ముతోడ జరిపి♦రను దినమ్మును సభ,లందుపన్యసించె ♦ గాంధి ప్రతిన
మరువగూడదంచు ♦ మరిమరి వారును, చచ్చికూడ ప్రతిన ♦ సడలమనిరి. 372

ఆ. అయినఁ గడకువార ♦ లలసినట్లగుపించి, రంతసమ్మెసడలు ♦ నట్లుఁదోచె
నొడలుబడలి శక్తి♦సడలఁగోపమున హిం♦సకు గడంగునట్లు ♦ సమ్మెబలిమి

సడలుకొలది 'రౌడి'♦చర్యలం బకుదురే, మోయటంచుఁదలఁచె♦మోహానుండు.

సీ. అంతటఁ దనరొద ♦ యందిట్లుఁ జింతించె, మోహానుండాత్మ ని♦ర్మోహుఁడగుచు
"నాచెప్పిన కతమ్ము♦నంగాదె యీపేద, కార్మికుల్ సమ్మెకుఁ ♦ గడఁగినారు
నాసలహా కార♦ణముర గాదేమీసు, పనికేగకునుచునుఁ ♦ బ్రతినగొనిరి
నాదుప్రబోధమ్ము♦నం గాదె నిత్యమా, ప్రతిననుఁ బలుమారుఁ ♦ బలుకుచున్న

గీ. వారలక్కట! నేడిటు♦నీరుకారి, పోవుచుండగఁ జూచుచు ♦ నేనిధాన
నూరకుండగనేర్తునా ♦ యుల్లమెరియ, నాదుకర్తవ్యమిప్పుడే మో♦నర్పవలయు"
ననుచుదలపోయసాగె న♦నారతమ్ము. 374

క. ఈరీతిందలపోతకు, కారణమా కార్మికాళిఁ ♦ గల్ప్రేమొ యహం
కారమొ సత్యముపైఁగల, గౌరవమో యెవరుచెప్ప, ♦ గలరిధరణిన్. 375

క. ఇటుదారిం దెలియక చీఁకటినిందారాడు వాడు ♦ కడుదూరమునన్
తటిదమలకాంతి గనుగొన్నటులంగనె గాంధిభావ ♦ మందుందీప్తిన్. 376

క. కదలేఁదమంతట నాతని, పెదవులు దన్మధ్యమందు ♦ ప్రేమోద్దీప్తిన్
ముదలయొలేకయె వెలువడె, పదములు నీరీతి కొండ♦వాగుంబోలెన్. 377

సీ. అది యొకానొకనాటి ♦ యుదయకాలము కార్మి,కాళి సమావేశ♦మందుజరిగె
సమ్మెదాన్గెల్ల రో♦క్కమ్మడిగాఁ దిర్గి,సాగింపవలయును ♦ సమ్మె తగవు
సత్యమ్ముగాఁ బరి♦ష్కార మౌనందాక, ముట్టనే నాహార♦మును నోకింత
అనిమోహానుండు ప♦ల్కిన నంతకార్మికుల్, భీతచేతస్కులై ♦ రాతతముగ

గీ. అల్ల అనసూయభాయి చె♦క్కిళ్ళనశ్రు, ధారకారగసాగె నం♦తట క్షమింపు
డస్మదీయలోపమ్ముల ♦ ననుసరింతు, మింకమాబాస నమ్మిక♦నెప్పుడనుచు?
బాసచేసిరి కార్మికుల్ ♦ భక్తిఁదిరిగి. 378

ఆ. "మీరుకాదు నిజము ♦ మేముండవలెపస్తు, మీరుపస్తులుంట ♦ దారుణమ్ము
శ్రద్ధతోడనింక ♦ సమ్మెసాగింతు" మ్,టంచు దీక్షకార్మి♦కాళి గొనియె. 379

సీ. "పస్తుండవలసిన ♦ పనిలేదుమీరు మీ,ప్రతిన సాగించి ని♦ల్వంగజాలు
మనకులేవే నిధు♦లని ప్రజాదాతృత్వ,మునను జీవించుచు ♦ మొనసి సమ్మె
జరుపనిచ్చింప మం♦చెరిగి యుంటిరికదా!, కనుక నేదో కాయ ♦ కష్టమునను
జీవింపఁగల్గిన ♦ నీవిధముగ సమ్మె, ఎన్నాళ్ళు జరిగిన ♦ మిన్నకుండ

గీ. నుండగల్గెదరేను ప♦స్తుండగలను, సమ్మెసమ్మతముగఁ బరి♦ష్కారమైన
వరకటంచును" మోహానుం♦ డెరుకపరచె, కార్మికావళికెల్లనుఁ ♦ గూర్మినొప్ప

సీ. మునిసిపాలిటియందు ♦ బనిగూర్పవల్లభ, భాయ్ చేసుకృషి కంత♦ఫలము లేమి
మగనలాలాశ్రమ ♦ మందుఁగట్టెడునేత, బడిపునాదిని బూడ్ప♦వలయు నిసుక

కోరకువలయు కార్మి♦కులటంచుఁ బల్కఁగా, సమ్మెదారులు సంత♦సంబుపడిరి
అనసూయబాయి నె♦త్తిన గంపనిడుకొని, మోయగా నిసుకను ♦ మొదలిడంగ
గీ. అనుసరించెఁ గార్మికతతి ♦ నామెఁజూప, రచ్చరువడంగ మోసిరి♦ హెచ్చుగాను
ఇసుకవారలకుంగూలి♦నీయకష్ట,మయ్యెనెంత యోవరుసగా♦నెయ్యమునను.
మం. 'మిల్లు' స్వాములతని ♦ మిత్రులౌకతన, వారిపై తనయుప ♦ వాసమ్ముతగునె
అనితలపోసె స♦త్యాగ్రహిగాంధి, మిల్లుస్వాములతప్పు ♦ వల్లనగాక
కార్మికావళితప్పు ♦ కతనదానుండె, పస్తువారలకు దా♦ప్రతినిధియగుట
వాదించుటొప్పు 'మిల్' ♦ స్వాములతోడ వారిపై పస్తు ని♦ర్బంధించుటగును
ఇట్లగునంచుదా ♦ నెరిగియుండినను, అందుకీయకొనియె ♦ ననివార్యమగుట
మోహనుఁడుపవాస ♦ మునకుబూనుటకు, తనదైనవిధ్యుక్త ♦ ధర్మమంచెంచె
లేదవసరము మీ♦వాదమ్మునుండి, వెనుదీయుటకొకింత ♦ యనిమిల్లు వార
గనియె మోహనుఁడు వారును ♦ జేసిరింత, నిందాస్తుతినిగాంధి♦నింబస్తుగూర్చి
ఆమిల్లు యజమాను ♦ లధినాయకుండు, సమ్మెనెదుర్కొన ♦ సమకట్టెనతడు
నేతు 'అంబాలాలు' ♦ ఆతనిస్వచ్ఛ,మైన నిష్కాపట్య ♦ మాత్మబలమ్ము
ఆతనిసతి సర♦ళాదేవి ప్రేమ,గాంధి మనస్సుకు ♦ కష్టంబుగూర్చె
అనసూయభాయి ద♦దన్యులుచాల,మందియుఁ గార్మికుల్ ♦ గాంధితో మొదటి
దినముపవాస ముం♦డిరి విరమించి, రాతరువాత మో♦హనుడు బోధింప
కడకుఁదత్ఫలితమ్ము♦గా నెల్లయెడల, వాతావరణమెంతో ♦ వడిఁజల్లబడియె
సానుభూతిజనించె ♦ మానవరూప, దేవుండెయనిరిగాం♦ధిని ప్రజలెల్ల
మిల్ యజమానులు ♦ మేకొనిరంత, వడిఁ బరిష్కారమ్ము ♦ వడయుటకల్ల
అనసూయభాయి గృ♦హమ్మునజరిగె, చర్చలు; నానంద ♦ శంకరధ్రువుడు
మధ్యవర్తిగ నియా♦మకముగా సమ్మె, విరమింపఁబడెగాంధి♦విజయంబుగాంచె
దివసత్రయమ్మె యు♦పవసించి యిర్వ,దొకదినమ్ముల సమ్మె♦యొకటిగా సాగి
కార్మికులకుబంచి ♦ గోర్మిమిఠాయి, యజమానులలయాచ ♦ కావళియందు
కలసిపెనగులాడ♦నలసియున్నాడు, పంచిరి కార్మికుల్ ♦ బాగుగా నిల్వ
అడిగాంచి మోహనుం ♦ డకట! ఆకటికి, ఓపికచెడమాన ♦ ముడిగి సభ్యతను
పోనాడిరే తోడి ♦ మానవుల్ మాన, సమ్మున ననికుంది ♦ సమ్మతిదాన
ములకన్నపనులు వీ♦రలకిచ్చునెడల, పెరుగదుగదయనె ♦ భిక్షుకసంఖ్య. 450

## ఖేడా సత్యాగ్రహము

సీ. అహమదాబాద్ కార్మి♦కావలి సమ్మె పరిష్కారమయ్యెనో ♦ లేదొయపుడె
తోడనే గాంధికి ♦ దూకగావలసె ఖే,డామండలమున స♦త్యాగ్రహమున

మండలమంతటం ♦ బండమిపంటలు, క్షామపరిస్థితుల్ ♦ సంభవించె
పన్నువసూళ్ళను ♦ వాయిదావేయింపఁ, దలచిరచ్చటి పత్తి♦దారులెల్ల

ఆ. అమృతలాలు ఠక్కరు ♦ రావరకే పరి,స్థితి విచారణమ్ము ♦ చేసి కమిష
నరునుగలసి వాదొ♦నర్చి యుండెను చట్ట,సభను విఠలభాయి ♦ చర్చరేపె. 406

క. ఆసమయంబున గుజరా,తీ సభకున్ మోహానుం డ♦ధీశుండయ్యెన్
ఆసభవినతులు తంతులు, రాసిగ బంపెను ప్రభుత్వ ♦ రథికులకెల్లన్. 407

క. ఈనాడు విశ్వసింపఁగ, రానివిధమ్మున ప్రభుత్వ♦రాష్ట్రోద్యోగుల్
ఆనాడు ప్రవర్తించి ర,మానుషముగ నుజ్జగించి ♦ మర్యాదగతుల్. 408

ఆ. భూమిపన్ను చట్ట♦మునుబట్టి నాల్గణాల్, దాటకున్న పంట ♦ దాటవేయ
వచ్చు రైతులెల్ల ♦ పన్ను చెల్లించుటా, వశ్యమరిగి తిరిగి ♦ యచ్చుపరకు. 409

ఆ. పంటనాల్గణాల ♦ కంటెతక్కువపండె, నంచు బంటకాపు♦లనిరి యెల్ల
కాని నాల్గణాల ♦ కన్న హెచ్చునె సధి♦కారులంచనా ప్ర♦కటనలెల్ల. 410

ఆ. ప్రజలవాదన మ్మ♦రణ్యరోదనమయ్యె, నక్కటా! ప్రభుత్వ♦మాలకింప
దాయెఁ బ్రజలమొరల ♦ నభ్యర్థనముల స,త్యాగ్రహమ్మొనర్ప ♦ మనియెగాంధి.

సీ. ఖేడావలంటీర్లు ♦ గూడిరి వల్లభుం, డనసూయ బ్యాంకరు ♦ యాజ్ఞికుడును
అలమహాదేవ దే♦శాయాదు లెందరో, అనుయాయులైరి స♦త్యాగ్రహమున
నాడియడ్‌లోని య♦నాథాశ్రమము ముఖ్య,కార్య స్థలంబయ్యె ♦ గాంధిపనికి
"మాపల్లెలం బంట♦లే పొలమ్ముల నాలు,గాణాల మించవి ♦ దగుట; బన్ను
రాబోవు యేడాది ♦ రాబట్టుడని ప్రభు,త్వమున కంపిన మొరల్♦వ్యర్థమగుట;
మేముగా చెల్లింపఁ ♦ బోముపన్నీయేట, కుదుతుమందుసగల్గు ♦ నిడుములెల్ల

ఆ. పోవుగాకమావి ♦ భూములు వీడబో, మాత్మగౌరవమ్ము ♦ 'నన్నృతమని ప్ర
భుత్వమస్మదీయ ♦ తత్వమ్ముఁ ద్రోసి వేయుటలు చూచుచూర♦కుండలేము. 412

గీ. అయిన రెండవ కంతుప♦నైనన నిపుడు, కట్టమనకున్న; గట్టగాఁ ♦ గల్గువారు
కట్టుదురు లేనిచోవారు ♦ గట్టబోవ, రైకమత్యమ్ముకొరకు ♦ సత్యాగ్రహమున.

వ. అని సత్యాగ్రహులందరు, సత్యాగ్రహశపథంబుసలుపుచు, సంతకంబులొనర్చిరి.

## ఉల్లిపాయల దొంగ

ఆ. చాంపరానుగామి ♦ సత్యాగ్రహోద్యమ, మెల్లవారిదృష్టిఁ ♦ గొల్లగొనియె
పత్రికాప్రచురణ ♦ ప్రబలఖేడాయందు, అనుదినమ్ము సంభ♦వాళియెల్ల. 415

సీ. నూతనోద్యమమాట ♦ ప్రీతిజేరిరి గుజ,రాతివారెల్ల స♦త్యాగ్రహమున
ఉద్యమవిజయార్థ ♦ ముత్సాహమున గ్రుమ్మ,రించిరి తమధన ♦ మంచితముగ
వలదన్నగూడ బొం♦బాయి వర్తకులధి,కాధికమ్ముగ ధన ♦ మంపిరెంతొ
ధనము మాత్రమున సా♦ధ్యముఁగాదు నడుప స,త్యాగ్రహమ్మని తెలి♦యంగలేక

గీ. కావలయు నిరాడంబర ♦ జీవనమ్ము, భయమువీడిన సభ్యప్ర♦వర్తనమ్ము
అత్యవసరమ్ములవని సత్♦త్యాగ్రహులకు, విజయమెల్లెడ సాధింప♦విమలగతిని.

క. ఈగుణపాఠ ద్వయముం, బాగుగబోధించె గాంధి ♦ పల్లెలనెల్లన్
సాగుకొలది సుదృఢమది, రేగెఁ బ్రభుత్వాక్రమములు ♦ ప్రీలిరి రైతుల్. 417

గీ. ప్రజలపశువుల పంటల ♦ బలిమిమేయిని, జప్తిగావించి భయపెట్ట ♦ సాగెనకట!
రాతిగుండె ప్రభుత్వము ♦ రాతినీతి, పేదరైతులనెల్ల నవాదరమున. 418

క. భీతావహులై రంపరు, రైతులు; పన్నియగొంద ♦ రంపనుల్యలు సం
ప్రీతినిడిరి జప్తికి వస్తూతతి కడవరకు బోర♦జోరబడిరితరుల్. 419

వ. ఇట్లు నానాటికి విషమపరిస్థితులు తటస్థించుచుండ శ్రీ శంకర్లాలు పరీకుగారి రైతొకండు తననేల కీయవలసిన పన్ను చెల్లించెను. ఇందువలన రైతులం దాందోళన రేగెను. అందులకు శ్రీ శంకర్లాలు పరీకా పన్నియబడిన భూమిని దానముగా నిచ్చివేసి తనగౌరవము గాపాడుకొని యితరులకు మార్గదర్శి యాయెను. 420

సీ. భీతిఁజలించెడు ♦ రైతుగుండెల నీరు, గారిపోకుండెడు ♦ కనఁడి గాంధి
తనభావమున ప్రభు♦త్వముతప్పు జప్తిచేసిన నేలనుల్లి పం♦టనుగ్రహింపు
డనుచుబోధింప మో♦హనులాలు పాండ్యనా. యకుడుగానుల్లిగ్ర♦హణముజరిగె
అంత మోహానులాలు ♦ నతని మిత్రులఁజెర,నిడె ప్రభుత్వముశిక్ష♦నిడుచువడిగ
తత్ఫలితమ్ముగాఁ ♦ దరిగెబందాల భ,యమ్ము సామాన్య ప్ర♦జాళియందు

గీ. అల్ల చెరసాల ప్రజలభా♦వాంబరమున, నయ్యెశ్రీకృష్ణ జన్మాల♦యముగ నైరి
శిక్షితులుప్రజాదరపాత్రు♦లక్షయముగ, 'ఉల్లిదొంగబిరుదుపాండ్య♦కొసగబడియె
చెరవరకుజర్గె మెరవణి♦శిక్షితులకు. 421

—ఖేడాసత్యాగ్రహము ముగింపు—

మం. సత్యాగ్రహోద్యమ♦శ్రమచేత పూర్తి, అలసియుండె; బ్రజాళి♦నందునలోంగ
నట్టివారలు సర్వ♦నాశనంబగుట, గాంధియిచ్చింపక ♦ కదనమేగతినో
సత్యాగ్రహుల కెట్లొ♦సమ్మతంబయిన, సరణిముగింపగా ♦ సతమతమైన
సమయాన నాడియడ్ ♦ మములతదారు,పంపె గాంధికి నొక్క ♦ వార్తనీరీతి
"ధనవంతులగుపతె ♦ దార్లిచ్చునెడల, పేదలిత్తురుగాక ♦ వెనుకయేడనుచు"
గాంధి జిల్లా కలెక్టరువిచారింప, ఆవార్తనిజమని ♦ ఆర్డర్లుబంపె
సత్యాగ్రహులనాటి ♦ శపథమకాటద్ది, సమ్మతింపంబడె ♦ సంతృప్తి మీర
కాని కలెక్టరు♦గావించె దాని, నిష్ప్రయోజనముగా ♦ నిశ్చితాచరణ
పేదలెవ్వరో ప్రజ♦వివరింపలేమి, అందుచే గనడాయె ♦ గాంధిసంతృప్తి. 430

సీ. సత్యాగ్రహారంభ ♦ సమయమందున కన్న, నధికజలాఢ్య వే ♦ హాసులునౌచు
నుందురు సత్యాగ్ర ♦ హోద్యమాంతమునస ♦ త్యాగ్రహుల్ ఫలవంత ♦ మైన నదియు
నైనఘూర్జర కర్ష ♦ కావళి నూతన, చైతన్యమున రాజ ♦ నీతివిద్య
నారి తేరగబూని ♦ రానాటిఖేడ స, త్యాగ్రహోద్యమదిన ♦ మందునుండి

గీ. నాటినుండియె చదువుకొ ♦ న్నట్టివారు, కర్షకావళితో మైత్రి ♦ గలసి మెలసి
దీనజనసేవకై త్యాగ ♦ దివ్యభాగ్య, భోగ్యసౌభాగ్యవంతులై ♦ పొదలుచుండ్రు.

సీ. ఆనాటి సత్యాగ్ర ♦ హమున వల్లభబాయి, పాల్గొనుటే యొక ♦ భాగ్యమద్ది
తెలిసెం దత్ప్రముఖ్య ♦ మెంతమిపోయినయేట, వరదబాధితుల సం ♦ వారణమ్ము
కార్యకలాపముల్ ♦ గావించు నాడునీ, యజ్జబార్డోలి స ♦ త్యాగ్రహమున
కలుగుట ప్రజకు మో ♦ క్షము తమమీదనే, యాధారపడియున్న ♦ దనుట తెలిసె

గీ. అల్ల గుజరాతివలె దాన ♦ హానుమలైరి, ఘూర్జరమ్మున వేరూని ♦ యూర్జితముగ
పెరిగె సత్యాగ్రహోద్యమ ♦ మ్ముత్తు రాజ్య, మంతనూతనచైతన్య ♦ మంతమగుచు.

ఆ. అందువలన గాంధి ♦ కందేమి యానంద, మంద లేక యున్న ♦ నధికసంత
సమ్మువడిరి రైతు ♦ లిమ్మ గాం దెలిసెను, బాధలకు విముక్తి ♦ పథమటంచు. 433

ఆ. అయినవారికి తెలి ♦ యకపోయె సత్యాగ్ర, హాంతరార్థ మింత ♦ నవల దెలిసి
రెన్నొ బాధలలము ♦ కొన్నకాలమున న, సుభవ పూర్వకముగ ♦ శుభములొనర.

ఐకమత్యకాంత

ఉ. యూరపుఖండదేశముల ♦ యుద్ధముసాగుచు మోహనుండు ఖే
డారయితోద్యమంబును ద ♦ టాలున నిల్పినకాలమందు దీ
ర్ఘోరుతరంబుగా; బిలచె ♦ నుత్తమ భారతనాయకావళిన్
భారతరాజధానికి స ♦ భంగలయన్ రణనీతిచర్చకై. 435

ఆ. పరగ చెమ్సుఫర్డు ♦ ప్రభువు; గాంధికిగూడ, వచ్చెం బిలుపుగాని ♦ యిచ్చమెచ్చ
డాయెసభకుబోవ ♦ నాలిసోదరులుండ, బందియందు నిడుము ♦ లందుచకట. 436

సీ. ఆలిసోదరుల మో ♦ హాను డొకరెండు ప, ర్యాయముల్ మాత్రమే ♦ యరసియుండె
వారిసేవాసక్తి ♦ వారిసాహసమును, వినుతించుటెల్లరు ♦ వినియె గాంధి
ఆంధ్రదూసురుద్రులు ♦ హకిముసాహెబునుగూర్చి, పొగడుటవినియుండె ♦ మోహనుండు
క్వాజాకురేషుల ♦ కలకత్తముస్లిము, లీగునం గాంధిగ ♦ లిసె నొకప్డు

గీ. డాక్టరన్సారిరహ్మాను ♦ డాసియుండె, మంచిమహామదీయులనెల్ల ♦ మైత్రిఁగలసి
వారలమనమ్ము దెలియంగ ♦ వాంఛఁజేసె, మోహనుండుసకలలోక ♦ మోహనుండు.

ఆ. అందువలన నెందు ♦ నరుదేరమన్నను, పోవుచుండెఁ బ్రీతి ♦ మోహనుండు
కలసిమెలసివారి ♦ చెలిమి సంపాదింప అహరహమ్మొకింత ♦ నలయకుండ. 438

సీ. సౌతాఫ్రికాయందు ♦ స్వానుభవమున శీఘ్రముగానె గాంధికి♦గ్రాహ్యమయ్యె
హైందవులకును మ♦హామ్మదీయులకును, అచ్చపుమైత్రిలే♦దనెడు నిజము
ఆరెండుజాతుల ♦ నైకమత్యమునకు, గలుగునడ్డంకులం♦ దొలగజేయ
కృషిచేసె సతతమైన ♦ నెప్పుడెవ్వరినాత్మ, గౌరవమ్మొవ బొ♦గడి మెరుగడు
ఆ. కాని దక్షిణాఫ్రి♦కానుభవమ్మున, నమ్మెదనయహింస ♦ కిష్టమీత
లమునవలయు నన్ని ♦ లౌక్యపరీక్షలు, హిందుమహామదీయ ♦ లేకమగు స
మస్యపైన జరుగు♦ననియు దైవము పరీక్షించుచుండె దన్న♦టంచు సతము. 439
గీ. అట్టిగట్టి నమ్మకముచే ♦ నతడుభరత, భూమికింపిర్గివచ్చి న♦ ప్పుడు దలంచె
నాలిసోదరసహవాస ♦ మధికవిలువ, గలదిగా మహ్మదాలి లే ♦ ఖలఖించె
జెయిలునందుండి గాంధికి♦ ఛిందవాడ, జేటులను గ్రామములనుండి♦ విసుగులేక.
మం. ఆలిసోదరులు కా♦రాగారమునకు, అరిగినవెనుక మో ♦ హనుని కాహ్వాన
మంపిరి కలకత్త♦యందున జరుగు, ముస్లిములీగు స♦మావేశమునకు
ముస్లిముహితుల స♦మావేశమునం బ్రసంగించ బ్రార్థింప ♦ సఖులందరచట
మహామదీయులయిన ♦ మానవులెల్ల, తమతమవిధ్యుక్త ♦ ధర్మముంచెంచ
వలయునాలీ సోద♦రులు బంధముక్తి, చెందసతము కృషి♦ జేయుడటంచు
మరికొంతకాలాని ♦ కరిగి యలిఘురు, కందలియువకుల♦బృందమ్మునకు ప్ర
సంగించె మాతృదే♦శమును సేవింప, కందుఫకీరులు ♦ గాననిగాంధి
తదుపరి నాలిసో♦దరులను జైలు,నందుండి విడుపుమ♦టంచును వ్రాసె
ఉత్తరమ్ముల నెన్నొ ♦ మొత్తమ్ముగాం బ్రభుత్వమ్ము వారికి♦ మోహనుడార్చి
శోధించె సందర్భ ♦ శుద్ధిపాటించి, ఆలిసోదరుల ఖి♦లాపతుభావ
ములగూర్చి వారిచ♦ర్యలగూర్చి చర్చ,చేసె ముసల్మాను ♦ స్నేహితుల్ తోడ
మహామదీయుల నిజ♦మైత్రి గడింప, చేయంగవలెదాను ♦ సాయమూభ్రాతృ
బంధముక్తికి ఖిలా♦పతుసమస్యా పరిష్కారమున కెంతో♦నిష్కాముడగుచు
అందవినీతియా♦వంత లేనప్పుడది భావ్యమో, కాదో♦యని యెంచరాదు
మతవిషయముల న♦మ్మకము భేదించు, ఎవరి మతము వారి ♦ కింపును గూర్చు
అనయంబు మతవిష♦యంబులనెల్ల, నెల్లవారలనమ్మి♦కేకమైయున్న
అఖిలలోకమునకే♦కైకమతంబె, యుండునంచును మోహ♦నుండెదందలచె
కాలమ్ము క్రమముగా ♦ గడువగాగాంధి, యెరిగె ఖిలాపత్తు♦గురిచి ముస్లిముల
ఇచ్చనీతివిరుద్ధ ♦ మెదియు లేదనుచు, నాంగ్లప్రధానియు ♦ నంగీకరించు
అందుచేం దనయంత♦రాత్మ సంతృప్తి ప్రధానివాగ్దాన సం♦ధానమ్ముకొరకు
చేయగావలయు దా♦సాయమ్ము సాధ్య,మైనంత ననుచు మో♦హనుడు దలంచె
ఇటుఖిలాపతుగూర్చి ♦ యెంచుగాంధిని వి,మర్శించి రెవరో వి♦మర్శకుల్ సఖులు

అయినను దాను మ♦హమ్మదీయులకు, సాయమిచ్చుట మార్పు♦జరుపలే దెపుడు
అటుముస్లిములకు సా♦యము సేయుటకు వి♦చారమందగ లేదు♦స్వాంతంబునందు
ఁందుచేదాఢిల్లి ♦ కరిగి వైస్రాయి, కలముస్లిములకో ర్కెఁ♦ దెలుపంగఁగోరె
అయిననాతఁడు ఢిల్లి ♦ నడుగిడగానె, దీనబాంధాంధ్రదాసు ♦ తెలిపెనీరీతి
"కలవురహస్య సం♦ధులు కొన్ని బ్రిటను, ఇటలీలమధ్య నీ♦వెటులఁబాల్గొందు
సంగరసంబంధ ♦ సభలంద"నంగ, వ్రాసె మోహనుడు ఛెమ్స్♦ఫర్డు కీవిషయ
మాతఁడావ్వానింప♦నరిగె మోహనుఁడు, ఛెమ్సుఫర్డ్ప్రభువిట్లు♦చెప్పె గాంధికిని
ఆంగ్లప్రభుత్వమే ♦ దాచరించునది, ఎరుగు వైస్రాయి యం♦చీవ్రనమ్మెదవె
ఆంగ్లప్రభుత్వ చ♦ర్యలు దోషరహిత,మెల్ల యటంచునే ♦ ప్రల్లదంబాడ
నైన మొత్తముమీద♦నాంగ్లసామ్రాజ్య, మాచరించును మేఁ♦టంచాంగిలేయ
సంబంధమున గల్గె ♦ సమధికలాభ, మిండియాకని విశ్వ♦సించుచో నీవు
సాయ మిప్పుడొనర్ప ♦ సామ్రాజ్యమునకు, ప్రతిభారతీయు క♦ర్తవ్యమ్ము గాదె
పత్రికల పుకార్ల♦పై నమ్మకమున, సామ్రాజ్యమున కిట్టి♦సమరంబు సాగు
సమయాన సాయంబు ♦ సలుపమితగునె!, సమరమ్ము పిదప ని♦ష్టమువచ్చినట్లు
అఖిలనైతిక వివా♦దాంశమ్ములెత్త, వచ్చిప్పుడుగాదంచు ♦ వైస్రాయిపలుక
సంగర సంబంధ ♦ సభకాతడరిగె, వైస్రాయి వాదమ్ము ♦ పాతదేమైన
సమయసందర్భముల్ ♦ జక్క యోచించి, మోమోడినావాద♦మునకు మోహనుడు.

సైనిక సమీకరణ

ఆ. క్రొత్తసైనికులను ♦ గూర్చుటఁ గూర్చితీ,ర్మాన మొనరించిరట ♦ దాని గాంధి
బలపరుపు మటంచు ♦ బలవంత పరచె వైస్రాయి హిందినట్లుఁ ♦ జేయగాంధి.

ఆ. కోరవైసురాయి ♦ కోరకాంగ్లమునగూడ, పలికెగాంధి యొక్క ♦ వాక్యమిట్లు!
"బాధ్యతాయుతముగ ♦ బలపర్తు తీర్మాన", మనుచునంత సభ్యు♦లందరతని
"ప్రథముఁడీవ హిందిఁ ♦ బలుకనిట్టి సభాంత,రమున" నంచొనర్చి ♦ రమలవినుతి.

సీ. వైస్రాయిసభయందుఁ ♦ బలుకహిందుస్థాని, యందుఁ దానె ప్రథముఁ♦డంచెరింగి
అందుకంద రొనర్చు♦టభినందనమ్ము ద,న్నరసి మోహను డిట్టు ♦ లాత్మవగచె
"అక్కట! యీదేశ♦మందొనర్చెడు సభ,లందె మా దేశసం♦బంధమైన
పనులందె మాదేశ ♦ భాషను వెలివేయు, టెంతో విషాదమా ♦ వింతగాదె

గీ. ఇంతయభినుతపాత్రమే ♦ యిది "యటంచు, ఇట్టిసంఘటనము మన♦మెట్టిహీన
దశకు దిగజారితిమొ మన♦తలపునందు, మేలుకొలుపును బాడుటఁ♦మేలుగాదె".

క. అనాటి సమావేశము, తానందాంగ్లమ్మునందుఁ ♦ దప్పనిసరిగా
పూనికఁబల్కిన వాక్య,మ్మెన్నాటికి మోహనునికి ♦ స్మృతియుందుండెన్. 483

గీ. ఆ సమావేశమందుఁ జే♦యంగఁబడిన, నిర్ణయము గాంధి స్మృతిలోన♦ నిలిచె చిరము
ఆ సభానంతరమతండు ♦ వ్రాసె లేఖ, వైసురాయి కొకండు దా♦ వలచినట్లు. 484

క. శ్రీలోకమాన్య తిలకును, ఆలీసోదరుల బిలువ♦ నందుకు సభకున్
చాలగటుచుఁ దనవ్యథ, నా లేఖన్ బ్రజలకోర్కె♦ లన్నియు దెలిపెన్. 485

క. అలయుద్ధము చేఁ బ్రజలం, గలిగిన వరరాజకీయ ♦ కాంక్షు ముసల్మా
నులవాంఛితమ్ము లేఖన్, తెలిపెన్ బ్రచురింప సమ్మ♦తింగొనె దానిన్♦ 486

సీ. ఆంధ్రదాసు చెప్పగా ♦ నంపెనా లేఖ నై, గ్లాండను నొక నిర్మ♦లాత్ముచేత
సిమ్లానగరిని వేం♦చేసియుండిన వైసు, రాయి కాతండుత్త♦రమ్ముఁ జదివి
అంపలి విషయమ్ము ♦ లభినుతించెను గాంధి, కోరినట్లుగ దానిఁ♦ గొంచుబోయె
అతనిని జాయింతి ♦ యతని నిరాడంబ, రతక్షమ్ము న్యాయవ♦ ర్తనపు రీతి

గీ. కెంతయును మెచ్చెమది గాంధి♦ వింత యనక, ప్రవిమలాత్మునిచే లేఖ♦ బంపబడుటఁ
గోరబడినట్టి ఫలితమ్ము♦ గూర్చె గాంధి, మనము దేలికబడె సుగ♦మము గుదారి.

క. తన పురియొక కర్తవ్య, మ్మనికిన్ సైనికుల గూర్చు ♦ టది మొదలిడ నెం
చెను ఖేడామండలమున, తనతోఁ బనిచేసినట్టి ♦ ధర్మాత్ములతోన్. 488

ఆ. అందువలన నాడ♦యడు చేరినంతనే, సభనొకండు జరిపె ♦ సఖులఁగలయ
వల్లభాయి మొదలు ♦ నెల్లరు మిత్రులు, వచ్చిరిచ్చ సభకు ♦ ముచ్చటింప. 489

గీ. అందుఁ గొంద రామోదింప♦ రైరి గాంధి, పథకమునకు హర్షించిన♦ వారు తద్వి
జయము గూర్చి శంకించిరి ♦ స్వానుభవము, చే ప్రభుత్వము వారల ♦ చేత లెరిగి
అయిన మోహను మాట కా♦దనరు వారు. 490

మ. పని ప్రారంభమొనర్చినంతఁ దెలియన్ ♦ వచ్చెం దదీయ వ్యథల్
తెనయాశల్ తరుగన్ వలంటిరుల బృం♦దంబింత వెన్కాడెఁ బం
డ్లను లభ్యమ్మట గాక పోయె నయినన్ ♦ లోపమ్ము రానట్లుగాన్
దిన మొండిర్వది మైళ్ళఁ గాల్నడకఁ బై♦ నించె న్వలంటీర్లతోన్. 491

గీ. చిన్నదేపంచిలో మోయు ♦ చన్న మింత, పడక వేసవియగుటఁ జే♦ నిడక వార
లరిగి యూరూరు సభలను ♦ జరిపిరందు, గాంధి చెప్పిన దాలించి ♦ రందరైన. 492

ఆ. సైనికులుగ జేరు ♦ జనులరుదుగనుండి, రెండుబోయెనీ య♦హింస నేడు
ఆయుధమ్ము బట్ట ♦ మందు వెట్లుఁ బ్రభుత్వ, మేమి మేలొనర్చె ♦ నింతవరక
టంచు గాంధి నడిగి ♦ రడుగడుగున నిల, దీసి యెల్లరు వెను♦దీయకుండ. 493

ఉ. ఐన నచంచలమ్ముగ ని♦రంతరమున్ శ్రమియింప గాంధి స్వీ
యానుచరాళితో నయిన♦ కాలిగ జేరగ బేర్లనీయగా
పూనిరి పల్వురుం జనులు ♦ మోహనుఁ డంతట వారి నిల్వ గాన్
స్థానము గూర్చియుం జరిపె♦ చర్చ కమీషన రంతవారితోన్. 494

క. ఢిల్లీసభవలె జరిపిరి, యెల్లెడలం గమీషనరులు ♦ నింపుగ సభలన్
వెళ్లెం గాంధియుఁ బిల్వగ, నల్లలి గుజరాతు రాష్ట్ర♦మం దంతటనున్. 495

గీ. ఢిల్లిలోవలె నీసభ ♦ వెళ్ళదగిన, మంచి వాతావరణము లే♦దంచు రోసె
గాంధిమాటాడె నందునొ♦క్కండు రెండు, నిష్ఠురోక్తు లుద్యోగులు♦కష్టపడిన. 496

సీ. గాంధిసైనికులకై ♦ కరపత్రములు కొన్ని, వినతిప్రజకొనర్చి ♦ వెలువరించె
అం దిండియాయందు ♦ నాంగ్లప్రభుత్వ మొ,నర్చిన దుష్టకార్యములనెల్ల
ప్రజలనందరని ని♦రాయుధులుగ జేసి,నట్టి చట్టముజాల ♦ చెట్టజేసె
అదిరద్దుగామీర ♦ లాయుధమ్ములువట్ట, నిచ్చించుచో గల♦దిపుడు తగిన

గీ. తరుణ మొనగూడెనిందుమ♦ధ్యమతరగతి,జనములు ప్రభుత్వమునకిద్దు♦ పాయమీయ
అడగునపనమ్మకము రద్దో♦నర్పబడును, అట్టి ఆయుధశాసన♦ మంచుబల్కె. 497

తే. కమిషనరు గాంధి కతనివా♦క్యముల వీని, చూపి మనకిరువ్వరకునింక ♦ శుద్ధమైన
భేదములునున్న మాసమా♦వేశమునకు, హాజరైన తమరుమాకు♦హర్ష మొదవు.

క. అనిపలుకగ నతనికి మో,హనుడు సమర్థించుకొనియె ♦ ననితరసాధ్యం
బును సరసమునగు పల్కుల, తనదు నభిప్రాయమొండె ♦ తగినదటంచున్. 499

వ. ఈసందర్భముననే గాంధి తాను వైస్రాయికి వ్రాసినలేఖను బ్రకటించెను. 500

### మృత్యుద్వారముకడ

క. సైనికులంగూర్చుపనిఁ దన,మేసిలతిం దిండిసరిగ ♦ మేకొనమిఁ జెడెన్
ఆనాళ్ళది వేరుశనిగ, నూనెయు మరినిమ్మరసము♦ నుం దినుకతనన్. 501

క. అమితముగ దినన నవనీతము చెడునారోగ్యమంచుఁ ♦ దనకుఁ దెలిపినన్
అమితముగాఁ దినెనతిసా,రమునకు లోనయ్యె గాంధి ♦ ప్రారబ్ధమునన్. 502

ఆ. అయినఁ దానిగూర్చి ♦ యంతగా లెక్కింప, కాశ్రమమునకేగె ♦ నతడునాటి
సంజవేళనెపుడు ♦ చనురీతి నానాళ్ళ, నరుదుగఁ గొనుచుండె ♦ నౌషధమ్ము.

ఆ. ఒక్కపూట దినక♦యున్న భోజనమెల్ల, చక్కబడునటంచు ♦ స్వాంతమందు
తలఁచి మరుదినమ్ము ♦ దయఁభోజనమువీడె, మేనికేదొయింత ♦ మేలుగూడె.

తే. కాని పూర్తియారోగ్యము ♦ మేనికబ్బ,కొరకు పస్తుండవలె మరి♦కొన్నినాళ్లు
ఫలరసముమాత్రమేగొన♦వలయునట్టు, లుండుచోదప్ప కారోగ్య♦ మొదలికొదవు.

తే. అను చెరింగిన కతనమో♦హనుడు వలదు,"నాకుమధ్యాహ్నమునభోజ♦నమ్ము నేడ
టంచుఁ" గస్తూరిభాయికి ♦ ననియెఁ దెలియ. 506

క. నాడేదో యొకపండుగ, నాడగుటం బ్రతిమలాడె "న్యాయంబా యీ
"నాడిటుపస్తుండుట" యని. పాడింగస్తూరిభాయి ♦ పలుకుచునన్నన్ 507

క. "ప్రియమైనదిగద మీకని, స్వయముగ వండితిని పాయ♦సము గోధుమతో
నెయి వేయలేదుసుమి నూ,నెయొవాడితి పాలనెవియు ♦ నేవాడసుమీ. 508

వ. "ఇంతేగాక మీకత్యంత ప్రీతిపాత్రమైనదని పెసరపప్పు గూడ నొకపాత్రము నిండుగా నిలిపియుంచితిని. కాన మీరు దయచేసి నేడుభుజించుట పాడి" యని పదేపదే కస్తూరిబాయి తనభర్తను ప్రార్థించెను. ఆయనయు నాపదార్థములందలి ప్రీతిచే నందు కీయకొనెను. కస్తూరిభాయికి ప్రియమొనర్చుటకును తన జిహ్వా చాపల్యము నయమొనర్చుటకునుం దగినంతమాత్రము కొంచెముగా భుజించిన నప్రియ మేదియుఁ గలుగనేరదని యాపదార్థములుం దిన మోహానుఁ దుద్యమించెను. కాని యాపదార్థములందలి లోభమోహముచేత నోటి తీట వదలునంతవరకు మిక్కుటముగా మెక్కెను. అంత తగినతరుణమునకై వేచియున్న అనారోగ్య పిశాచ మతని నొడిసిపట్టెను. మృత్యుదేవత నాహ్వానించి నట్లయ్యెను. భోజనమైన నొకగంటలోపలనే యతిసార మతితీవ్రరూపముఁదాల్చెను.

ఆ. నాటిసంజవేళ ♦ నాడియడునకు గ్రమ్మరగవలసియుండె ♦ మరువకుండ
కానఁగష్టపడుచు ♦ గాంధిపబర్మతి, స్టేషనెట్లొనడచి ♦ చేరనరిగె. 510

ఆ. దారిలోన నహమ♦దాబాదు కడవచ్చి, కలసెవల్లభాయి ♦ గాంధి నతని
అరసి తనయవస్థ ♦ నతఁడెఱుంగునెయని, కష్టపడియుఁ దాఁప ♦ గష్టమొల్ల. 511

సీ. ఆరేయిపదిగంట ♦ లపుడు చేరిరి నాడి,యదునందు హింద్వనా♦థాశ్రమమున
కరుగస్టేషనునుండి ♦ యరమైలునడుచుట, దోచెను బదిమైళ్ళ ♦ దూరముగను
చేరెనాశ్రమమెట్లొ ♦ చిక్కెఁ బ్రేగులనొప్పి, యెక్కువై క్రమముగా♦నుక్కడంప
గాంధిసిగ్గరి ప్రక్క♦గదియందు పాయిఖా,నా తొట్టినిడజేసె ♦ రోతయనక

గీ. అంత నందలి సఖులంద ♦ రతనిచుట్టు,చేరి బాధేమొ, చెప్పుడు ♦ చెప్పుడంచు
బ్రతుములాడిరి తమయాతు♦రతపడిపడి, తెలియజేయుచు గాంధికి♦దెల్లముగను.

సీ. తమతమప్రేమ శ్ర♦ద్ధాసక్తులంగన, బరచిరైనను వారె♦వరును గాంధి
బాధనావంతయుఁ ♦ బాపనోపరువారు, నిస్సహాయులుగాంధి ♦ "నేనుమందు
త్రావగాజాలనా ♦ తప్పిదమ్మున కప,రాధమీనాటి దీ♦బాధనోర్వ
వలె నంచుహతమూనె ♦ వడినాటిరేయి త్రిం,శతిమార్లకటవిరే♦చనములయ్యె

తే. చచ్చెనాకలియెల్లయు ♦ సాపడకయె, ఫలరసమ్మైన నతడుప♦వాసముండె
ఆయసమ్మాని తాకిన ♦ నతనిమేను, మట్టిముద్దగ నకట! క♦న్పట్టె నపుడు. 513

ఆ. వ్యాధినాపమేని ♦ బలమెల్లచనె కనుం, గాహ్వాయుండు డాక్ట♦రరుగుదెంచె
మనగ గొనగవలయు ♦ మందైనసూది మం,దైన ననియె వలవ♦దనియెగాంధి.

తే. గాంధికానాడకట! సూది♦మందుగూర్చి, సరిగదెలియమి నదియెల్ల♦మురికిరసియె
యనునపోహ చేవలదనె ♦ నవలనేరిగె, వైద్యుడు పచింపనదిశాక ♦ వస్తువంచు.

తే. అయిన నదిచాల ఆలస్య♦మగుటఁ గట్ట!, కట్టవాయె విరేచనా♦లట్టెసాగె
అలతపైకొనెఁ బూత్రిగా♦నంత సన్ని,పాతమగపడె సఖులెల్ల ♦ భీతిలంగ. 516

క. మరికొంతమంది డాక్టరు, లరుదెంచిరి కాని వార♦లౌషధమునసే
విర! కొన ననురోగిని నెటు, సరిచేయంగలరు వ్యాధి♦సమయగ నెల్లన్,

సీ. సేటు 'అంబాలాలు' ♦ చేరెను దనసతీ, మణితోడ నాడియ♦దునకు గాంధి
సహచరులందరికి ♦ సంప్రతించియు జాల, జాగ్రత్తగా గొని ♦ చనియెనహమ
దాబాదునంగల ♦ తనదు 'మీర్జాపూరు', బంగళాకందెంతో ♦ స్వార్థరహిత
సేవలఁబ్రేమతో ♦ గావించిరతి శ్రద్ధ,నైన దరుగక జ్వర♦మల్లె సాగె

తే. నీరసించె నానాటికి ♦ సారముడుగ, మేనియందు; సమీపించె♦మృత్యువంచు
దలచెమిగుల నశాంతిమై♦తన్ను జేర్చు, మనియెనాశ్రమమునకు మో♦హనుడుభీతి.

ఉ. ఆశ్రమమందు పాన్పున వ్య♦థాకులితుండయి గాంధి యుండగా
ఆశ్రమ వీడ వార్తగొని ♦ యచ్చటికిం జనుదెంచె వల్లభుం
డీశ్రమలేల జర్మనుల♦కెల్లఁ బరాజయ మయ్యెనంచు స
ద్విశ్రమ మబ్బెగాంధి కటు♦తీరగ సేన సమీకరించుటల్. 519

సీ. అపుడు జలచికిత్స ♦ ననుసరించుచునుండె, బాధోపశమనంబు ♦ వడయగొంత
కాని మేనిబలమ్ము ♦ గ్రమ్మరవడయుట, అధికమౌకష్ట కా♦ర్యముగదోచె
ఎందరెందరో వైద్య ♦ లేవేవొ సలహాల, నిచ్చిరైనను గాంధి ♦ యేవిధినను
పాలకుబదులుగా ♦ పలలరసము గొను,మని రిద్దరో ముగ్గు♦రనిశ మద్ది

గీ. మంచిదనియెనాయుర్వేద♦మంచు; గ్రుడ్లఁ,గొనుమటంచు మరొక్కరు♦వినిచె;నైన
గాంధియెవ్వారిమాటలఁ♦గైకొనండు, శాస్త్రములుచాటుమాటల♦చాటుగొనడు.

మం. తనసతీ సుతుల మి♦త్రముల నెవ్వాని, తినగూడదని యుప♦దేశించె నవ్వి
తినదగునే తన♦దేహార్థ మిప్పు,డనిరోసె వైద్యులు ♦ వినిచినదెల్ల
గాంధి యీతని దీర్ఘ ♦ కాలికవ్యాధి, యందుబరీక్ష సే♦యగఁదన నియమ
నిష్ఠల,నొదవె న♦నిశమవకాశ, మిష్టరీతినటంచు ♦ నెదసంతసించె
ఆగతినుండ నా♦కానొకరేయి, నాగాంధికంత ని♦రాశజనించె
మృత్యుదేవతను స♦మీపించినట్లు, సత్యముగాదోచె ♦ సత్యసంధునికి
అనసూయబాయి ర♦మ్మనిచెప్పి పంప,గనె నామెపరుగెత్తి ♦ కొనివచ్చెనటకు
వల్లభభాయియు ♦ వచ్చె డాక్టరుతో, ఎల్లయు నాడి ప♦రీక్షించి యతఁడు
"నీనాడియిదె చక్క♦గా నాడుచుండె, ప్రాణాలకిసుమంత ♦ భయములేదిందు
అధికనీరసమిది" ♦ యనిపల్కెగాని, అదిగాంధి కూరట ♦ నొదవింపలేదు
నిదురలేకుండయే ♦ నిశిసాగిపోయె, ఉదయమ్ము వచ్చె మృ♦త్యువు రాకపోయె
అయినమిత్తి సమీప♦మందుండె ననిహృ,దయమందు దలపోసి♦నియమమ్ముతోడ
ఆలింపగా బూనె ♦ నాశ్రమవాసు, లోలిగీతఁ బఠింప ♦ నోర్మిమై భక్తి
మాటాడనొల్లడే ♦ మాత్రంబు మెదడు, కేటుగాదోచె నే♦మాటయు గాంధి

కుడిగె జీవితమందు నుత్సాహమెల్ల. పడకంబరుండియే పనిలేక నిస్స
హాయుఁడై మిత్రులు ననుచరుల్ సేవ,సేయుచుండగమేను జీర్ణించుచుండ
కనుచునానాటికిఁ గటకటంబడుచు, తినుచేదొమనుటకు మనసింతలేమి.

ఆ. చావుగల్గునంచు సతమునిరీక్షించు, నట్టిగాంధికడకు నరుగుదెంచె
క్రొత్తవానివెంటఁ గొనిడాక్టరు తలవాల్కరొకనాడతఁడు మరాతివాఁడు.

క. కననాతని దలచెను మో,హనుఁ డతడుందన్నుబోలు వ్యక్తియనుచు మో
హనుపైన బ్రయోగింప న,తనివైద్య విధానమచటఁ దలచెనతండున్. 539

తే. చదువు గ్రాంట్ మెడికల్ కళాశాలలో ము,గించి పట్టముగొనక నేయేగుదెంచ
నచలనాతడు బ్రహ్మాపమాజసభ్యుఁ, డాఖ్య కేల్కారటంచు మోహనుఁడెరింగె.

సీ. ఆతఁడొక్క స్వతంత్ర హాతవాదిమంచువై,ద్యమున నమ్మకమున్న దాప్టికుండు
వాంఛించెనా మంచువైద్యమ్ము మోహను,పైనఁ బ్రయోగింపఁ బూనియతఁడు
యోగ్యతాపత్రము లున్నడాక్టరు లెరుం,గని వేవొ తానెర్గు దనుచునమ్మె
ఆతని ఐస్ డాక్టరని పిల్చిరందరు, కాని తద్వైద్య విధానమందు

గీ. గాంధికింబూర్తి నమ్మికగల్గదైన, సమ్మతించె నతని మంచు సంచివైద్య
మునకుఁ దత్ఫలితమ్ముగా మోహనునికి, గలిగెనాకలి, నడువగాఁగల్గుబలము.

క. సంతృప్తుఁడయ్యె మోహనుఁ, డంతటితోఁ బ్రజలపనులయం దుత్సాహం
బెంతయుఁ గల్గెనటంచు న,వంతయుఁ గొనఁడాయెఁ గ్రుడ్లనాహారమునన్.

## రౌలటుబిల్లు - ధర్మసంకటము — 1919

ఆ. "మాథెరానుపురికిమారుడు త్వరగ కో,ల్కొనుట కొరక"టంచుఁ గోరిసఖులు
వైద్యవరులు బలుక వడిగాంధియటకేగె, కానియందు జలము కష్టమగుట.

తే. చాలకాలము నిలువ నాస్థలమునందు, కష్టతరమయ్యె నతిసార కారణమున
ఖేదికిం బోవుసమయాన బాధమిక్కుటముగ మోహనుని కనుభవమునగల్గె.

క. కనుక నొకవాసర మవక,మునుపే యామాథెరాను పురమువిడిచి మో
హనుఁడరిగెఁదిరిగి యాశ్రమ,మున శంకరలాలు జూడబూనిక గాంధిన్. 545

తే. వచ్చెడాక్టర్ దళాలు పిల్వంగ; గాంధి,కనియె "నీమేనికారోగ్యమబ్బుకొరకు
పాలఁగొనవలె మీరునాపల్కినట్లు, సూదిమందుల గొనవలెస్రుక్క యుండ."

ఆ. "కొందునేను సూదిమందు లెనైన మీ, రీయవచ్చుగాని యేగొనంగ
జాలవ్రతముగలదు పాల"ననియె గాంధి, "వ్రతమ దెట్టి"దనియె వైద్యుఁడంత.

క. పాలందానెందుకు మును,క్రోలననుచు నొట్టువెట్టు కొనె నాగాథన్
ఆలింపఁదెలిపె డాక్టరు, కోలిన్ మోహనుఁడు సర్వముత్సాహమునన్. 548

క. ఇటుజరిగెడు సంభాషణ, మటబతికడ నిలిచివినెడు నా కస్తూరిబా
యిటులనె" మీయాక్షేపణ, లటుగోమహిషముల పాలకంతియె కాదే? 549

క. ఏమికలదాంతఁ గ్రోలం,గా మేకల పాలనుచుఁ ♦ గస్తురిపలుకం
గా మేషక్షీరమ్ములు, నీమేనికిఁ జాలటంచ♦నియె వైద్యుండున్. 550

ఆ. గాంధి యీయకొనియె♦నందుకు సత్యాగ్ర,హోద్యమంబునడుపు♦నుత్సుకతను
బ్రతుకఁగోరి చాల ♦ పాలఁగ్రోలనటన్న, ప్రతినపేరుకొండె ♦ పరగెనవల. 551

సీ. "మహిష గోదుగ్ధముల్ ♦ మాత్రమే నామది, నొట్టిడుకొన్నప్పు♦డుండియున్న
అఖిల జీవములపా♦లాన రాదనునర్థ, మిమిడినాయొట్టునం ♦ దెసగుగాదె!
నైజమ్ముగాపాలు ♦ నరునశనముగా ద,నెడునాకు పాలాను ♦ టెట్టినీతి
అయినమేషక్షీర ♦ మానితిఁ దెలిసియే, విషయమంతయును జీ♦వించుకోర్కె

తే. బలిమి సత్యమ్ముతోడఁగల ♦ భక్తినడఁప, నడుప సత్యాగ్రహమ్మాశ♦విడిచిపెట్టె
నకటసత్యవ్రతుండె స♦త్యమునటంచు", తరుచుగాంధి పశ్చాత్తాప♦తప్తుఁడయ్యె.

తే. సతతమీమేకపాలనే♦సరణివిడువ, సాధ్యమగునంచుఁదలపోయు♦స్వాంతమందు
అమలసేవారతుండు జా♦నగుటకతన, సత్యదీక్షను సడలగా ♦ సమ్మతించె. 553

సీ. అల నహింసావిష♦యమున దాఁజేసెడు, పరిశోధనల నొక♦భాగమతని
ఆహారవిషయమం ♦ దాచరించెడు ప్రయో,గాలి వినోద మా♦నందదాయి
కాసమేషక్షీర ♦ మాయటసత్య శ,పథభంగములె యంచు ♦ బాధఁబడియె
తన కహింసా ధర్మ♦మునకన్న సత్యమే, అధికమ్ముగఁ దెలిసి♦నట్లు దోచె
స్వానుభవమ్మున ♦ సత్యమ్ము సడల న,హింసా సమస్యఁడా ♦ నెప్పటికిఁబ

తే. రిష్కరింపగ లేనంచె♦రింగె గాంధి,భావ భాషలరెండిటఁ ♦ బ్రతినలెల్ల
గౌరవించుటయే లెస్స♦కానిపాల, విషయమున భావమెల్లయు ♦ విడిచితనుచు
వగచెనైనగానదు సవ్య ♦ పథమొకండు. 554

తే. భక్తివిశ్వాసములు దగు♦బలము లేమి, కల్గుసందేహమెందునఁ ♦ గాన దేవ
దేవవిశ్వాసబలమిచ్చి♦కావుమంచు,అహరహముదైవభజనమో♦హనుడొనర్చు.

ఆ. మేకపాలఁగ్రోల ♦ మేకొని మొదలిడి, నంతగాంధి పగులు ♦ లంతమవగ
'ఆపరేషనొండు' ♦ నాచరించెదశాలు, బలముపుంజుకొనియె ♦ బ్రతుకుకోర్కె
బలమువలన గల్గ♦వడిగ నారోగ్యము,చేయ దైవకార్య♦సిద్ధినెల్ల. 556

మ. పునరారోగ్య బలంబులం గ్రమముగా ♦ మోదంబునం బొందుమో
హను డొండొకనాడు పేపరులద♦న్నాశ్చర్యము న్మించు వా
ర్తనుగాంచెన్ బ్రచురింప రౌలటు రిపో♦ర్టాకస్మికోదంతమున్
మనసంతంగలపా సిపారసులు గాం♦చం గాంచగా నెమ్మదిన్. 557

ఉ. శంకరులాలు బ్యాంకరును ♦ సాదరమూర సుమూర్ శోభానియున్
"శంకలువీడి మీరుతగు ♦ సత్వరచర్యకు బూనుడిందనెన్"

సంకటమెల్ల వీడఁదను ♦ జక్కనహమ్మదు బాదుకేగెని
శ్చంకమరొండు మాసమున ♦ సమ్మతి మిత్రులు డాక్టరీయగన్. 558

తే. అహమదాబాదు నందు ద♦న్నరయగోరి, ప్రతిదినమువచ్చువల్లభ♦బాయితోడ
తనమనసువిప్పిపల్కె మో♦హనుడు "ఏదొ, చేయవలెనిందునీవేమి♦చెప్పు"దంచు,

క. "నేటిపరిస్థితులన్మన, బోటులొనర్పంగ గలము ♦ పూనికచే నే
పాటి వివరింపుమెల్లయు, బాటింతము నీవటంచు" ♦ వల్లభుఁడనియెన్. 560

మం "ఏకొద్దిమందైన ♦ నెదిరింపదీని, వీకముందుకువచ్చి ♦ విమలమౌమదిని
సత్యాగ్రహ మొనర్ప ♦ సమ్మతింపవలె, అకట! అనారోగ్య♦మందిట్టులేను
పడియుండకున్నచో ♦ భయమేదినే నొ,కండనే యెదిరించి ♦ కరువడినన్య
లనుసరింపగనన్ను ♦ మునుబోయియుందు, జైలునకే సహిం♦పాపథమరసి"
ఇటుమోహానునికి బ♦ల్లేలుకు జరిగి,నటువంటిసంభాష♦ణాను సారముగ
గాంధిసంబంధంబు ♦ గలవారలంద, రందుగూడిరిసభ ♦ ననువైనరీతి
అల రవులటు సంఘ♦మర్పించినట్టి, తొలినివేదికకు వా♦రలు జేసినట్టి
వింతసిఫారసుల్ ♦ విరసమైయుండు, టంతయుగనియవి ♦ యాత్మగౌరవము
కలవారికి సహింప♦గలవిగావంచు, తలచె మోహానుడు స్వాం♦తమున యోచించి.

సీ. అనుకొన్నసభగూడె ♦ నాశ్రమమందు శం,కరులాలు బ్యాంకరు ♦ సురశోభాని
వల్లభాయ్ హార్నిమన్ ♦ వచ్చిరల్ల సరోజి,నీదేవి మున్నగు ♦ నిపుణులెల్ల
సభను సత్యాగ్రహ ♦ శపథపత్రమ్ముపై, సంతకంబందరు ♦ సలిపిరందు
దినపత్రికలగాంధి ♦ దీనినిబ్రచురించె, వాడుకచొప్పున ♦ బ్యాంకరంత

తే. చిత్తశుద్ధితో శ్రద్ధతో ♦ సిద్ధమయ్యె, తిరుగుబాటల్లెడల లేఁ♦దీయనతని
యద్భుతపుకార్య నిర్వహ♦ణానురక్తి. కడిమినాతని వరసమీ♦కరణశక్తి
కాంచితొలిసారిగా గాంధి ♦ కరము బొగడె. 570

క. సత్యాగ్రహ సభపేరున, ప్రత్యేకమ్మగు వ్యవస్థ ♦ బంబయిపురిలో
ప్రత్యహము వ్యవహరింపగ, నిత్యమ్మగునట్టి దొండు ♦ నిర్మింపబడెన్. 571

వ. అందు క్రొత్తగా సభ్యులుగాగోరువారలు సత్యాగ్రహశపథ పత్రముపైన సంత
కము గావింప నారంభించిరి. కరపత్రములు విరివిగా బ్రచురింపబడెను. ఖేడా
సత్యాగ్రహమును స్మరింపజేయగలసభలు దేశమంతట సమావేశమయ్యెను. 572

తే. అట్టి సత్యాగ్రహసభ క♦గ్రాసనాధి,పతిగ గాంధియే యెన్నుకో♦బడియెగాని
అతని ఘూర్జరసంభాష ♦ ణాది నూత్న,గుణము లొప్పరువిద్యార్థి♦కులుతదీయ
సభ్యులైన సాగించిరి ♦ సహనమెనయ. 573

ఆ. కాని మొదటినుండి ♦ గాంధికి విస్పష్ట,మయ్యెఁ జాలకాల♦మద్దివెలయ
జాలదంచు నతఁడు ♦ సత్యమ్మునకహింస,కిచ్చు ముఖ్యతనొరు♦లిచ్చుగొనరు.

మం. అటులైననేమి త♦దారంభదశను, ఎటులనో సాగెను ♦ పటిమతోఁ గ్రొత్త
కార్యకలాపముల్ ♦ గడుశీఘ్రగతి న,వార్యమైయుద్యమ ♦ వ్యాప్తియుంజరిగె.

—అద్భుతదృశ్యము—1919—

సీ. ఈరీతినొకప్రక్క ♦ నెఱరించి రౌలటాక్టు,మిటి రిపోర్టులజడి ♦ మీరిపోవ
మరియొకప్రక్క న♦మలుఁజేయ నాసిఫా,రసులఁ బ్రభుత్వ మే♦ర్పాటొనర్ప
రౌలటుబిల్లంత ♦ ప్రచురింపఁబడె; చట్ట, సభయందుఁబిల్లుపై ♦ చర్చసాగె
శాస్త్రిఖండించుచుఁ ♦ జన్పలబిల్లుఁ దూ,ర్పారఁబట్టెఁబ్రభుత్వ ♦ పద్ధతులను
తే. అతనివాగ్ధాటికిని ముగ్ధు♦డయ్యె వైసు,రాయి యైన నదెల్ల న♦రణ్యరోద
నమ్మెయయ్యెబిల్లది శాస♦నమ్ముగాగ, నట్టియెడవచ్చె గాంధి కా♦హ్వానమొండు.

సీ. అదిచెన్నపురినుండి ♦ యల్ల కస్తూరి రంగ,యంగారిపిల్పు మో♦హనునికపుడు
ఎక్కువగా బల♦హీనతనున్నను, వీకమాట్లాడగా ♦ లేకయున్న
సభలఁబ్రసంగింపఁ ♦ జాలినధైర్య మింకను రామిచే సభా♦కంపమున్న
పైనముదూర మ♦పాయకరమ్మైన, వెంటనే పయనమై ♦ వెడలెగాంధి
తే. దక్షిణాఫ్రికాయందలి ♦ తనదుకృషిని, దక్షిణాదిని దమిళాంధ్ర ♦ ధరణినున్న
తనస్వగృహమున నున్నట్లె♦తలచుగాంధి, కాన దరలెను వెంటనే♦గాంధియటకు.

వ. కస్తూరిరంగయంగారి పేర నాహ్వానపత్ర ముండినను శ్రీ రాజగోపాలచారి ప్రేరణ
మున నది జరిగియుండెను. అదియే రాజగోపాలాచారితోఁటి తొలిపరిచయమగు
టచే నారోజులందే గాంధి కంతకు కొన్నిదినాలముందుగా న్యాయవాదవృత్తి
నిమిత్తము సేలమునుండి మద్రాసు చేరియుండిన రాజాజియింట బస యేర్పాటు
చేయబడెను. అది రంగయంగారి బంగళాయగుట నచట దానుబసచేసిన రెండు
రోజులపిమ్మట మహాదేవదేశాయి చెప్పినంతవరకు గాంధికి తెలియకుండెను.
సహజలజ్జాస్వభావుడగు రాజాజి చొరవతో గాంధితోఁటి పరిచయ మేర్పరుచు
కొనకపోయినను దేశాయి 'ఇతనితోఁ బరిచయస్నేహముల నీవు పాటింపవలె
నని' గాంధికి నొక్కిచెప్పెను. 576

తే. గాంధి దేశాయిచెప్పిన♦కరణిదినము, సమరసన్నాహములగూర్చి ♦ చర్చజరిపె
సతము రాజాజితోఁగాని♦సభల మించి, చర్చనేయరు వా రెట్టి♦చర్యగూర్చి. 577

తే. శాసనమ్మైన రౌలటు ♦ శాసనమ్ము, నెదిరివాని నిరోధించు♦టెట్లుజర్గు
నెట్టియవకాశము ప్రభుత్వ♦మీయకున్న, నితరశాసనముల నెది♦రింపఁదగునె
ఇట్టిప్రశ్నలే వారుచ♦ర్చించిరెపుడు. 578

సీ. కస్తూరిరంగయం♦గారు గూర్చిరి నాయ,కులసభ చర్చింప♦గల విషయము
అటపాల్గొనిన ముఖ్యు♦లందు విజయరాఘ,వాచారి సత్యాగ్ర♦హమ్ముగూర్చి

రచనసేయగసమ♦గ్రముగ గాంధికి సూచన మొనర్చెనదియసా♦ధ్యమనెగాంధి
జరుగుచుండగనె యో♦చనలిట్లు వార్తవచ్చెను పబ్లిషయ్యె శా♦సనముగాను

తే. అల్లరౌలటుబిల్లంచు ♦ నానిశీథమందు యోచించుచునె నిద్ర♦నందె గాంధి
తెల్లవారుజామునఁ గండ్లు♦దెరచి తెరవకుండు నుదయసమయమునం♦దోఁడుదోచె.

కం. ఆలోచినదిటు రాజా!, జీతో విషయమ్ము నెల్ల ♦ చెప్పెం దెలియన్
రాత్రిరిఁ గలలోఁ గంటిని, ఆ తెరఁగెల్ల యువచింతు ♦ నాలింపుమనన్. 580

సీ. ఈభారతావని ♦ నెల్లెడలన్ హరతాళము జరుపగా ♦ దగును మనకు
సత్యాగ్రహమ్మునఁ♦జక్కగా నాత్మ పవిత్రమొమ్మనర్చుట ♦ విమలగతిని
మనది పవిత్రోద్య♦మము గాన నయ్యది, యాత్మపవిత్ర మొ♦నర్చుచర్య
అది హరతాలుతో ♦ నారంభమగుట సం♦దర్భోచితమ్మగు ♦ నాడు సకల

తే. భారతావనిఁ బ్రజలెల్ల♦పనుల గట్టిపెట్టియును మది బ్రార్థనల్♦బ్రీతిభక్తి
భగవదర్పితముగ జేయ ♦ ఫలముగల్గు, చేరగల్గుదురందు ము♦స్లిములుగూడ.

క. మనవినతి దేశమెల్లెడ, విని పాటించెదరొ లేదొ ♦ విరివిగ బ్రజ చా
లును బొంబయి మద్రాసుల, పనివిన బీహారు సింధు ♦ ప్రజపాటింపన్. 582

ఆ. అనుచు గాంధి పలికె♦నంత రాజాజి యా, యోచనమున దృష్టి♦నొందె నితర
సఖులు మంచిదనిరి ♦ సంతోషమున గాంధి, వినతిపత్ర మొండు ♦ వెల్వరించె. 583

వ. మొదట 1919 మార్చి 30-వ తేదియు, తదుపరి యేప్రిలు 6-వ తేదియు హర
తాళమునకు ముహూర్త మేర్పాటుచేయబడెను. వ్యవధి స్వల్పమగుటచే
వెనువెంటనే కార్యమున కుపక్రమింపబడెను. అయినను యావద్భారతావనిఁ
గల బ్రజాకోటి పరిపూర్ణ హరతాళము గావించెను. అది యొక అద్భుతానంద
కరమైన వింతదృశ్యము. 584

### ఆ మరవగూడని వారము — 1919

క. అటునతీక్షణభారత పర్యటనము కొన్నాళ్ళొనర్చి ♦ యరిగెను బొంబే
కటుపస్మన శంకరలా, లటులేయని గాంధి యేప్రి♦యలు నాలుగునన్, 585

తే. ఏప్రిలారున హరతాళ♦మిందు జరుగు, హాజరగుడు మీరను తంతి♦యందగానె
చనియె మోహాను డంతకు♦మును పె ఢిల్లి, జరిగె హర్తాలు మార్చి త్రిం♦శతిదినమున.

సీ. అట్టి హర్తాలెప్పు♦డందు జరుగలేదు, హిందుముసల్మాను ♦ లేకమైరి
స్వామి శ్రద్ధానంద్ హ♦కీము, అజ్మల్ ఖాను, వాక్కే శాసనముగా♦బరగెనందు
జుమ్మామసీదులో స్వామి శ్రద్ధానందు, డావహూతుడై మాట♦లాడె నాడు
అధికారులిది యోర్వ♦నందుచే పోలీసు, కాలుపుల్ జరిపె హ♦ర్తాలునాడు

తే. మొకవణింజను జనులపై ♦మించిపొంచి, గాయపడి రెందరో మొద♦లాయెనుగ్రూర
పాలనము ఢిల్లిపురమునఁ ♦ బంపెదంతి, ఢిల్లికరుదేర స్వామి గాం♦ధినిదడయక.

తే. అల్ల బొంబాయిలో నేప్రి♦లారునాడె, పైనమైవత్తు ముత్సవ ♦ మైనవెంట
నేయటం చంపె బదులుతం♦తిని దడయక, గాంధిస్వామిశ్రద్ధానందు♦గారికపుడ.

క. ఢిల్లీలోవలె జరిగెను, ఎల్లయు లాహోరునం ద♦మృతసరమందుక్
ఢిల్లియు పిదప నమృతసర్, వెళ్లెదననె గాంధి కిచ్లు ♦ పిలువగనందున్. 589

సీ. ఏప్రిలారవతేది ♦ నెల్ల బొంబయిబౌరు, లబ్ధిస్నానమొనర్చి ♦ యరిగిరవల
మొరపణిక్ మాధవ♦పురికి చౌపతి నుండి, అందుఁ బిల్లలు స్త్రీలు♦నరుగుచుండ
చేరిరివారి ము♦స్లిములు వేలకొలంది, దారిమసీదొండు ♦ తారసిలగ
అందుముస్లిము మిత్రు♦లర్థింపఁగ సరోజి,నియు గాంధియును బ్రసం♦గించిరపుడ.

తే. విఠలదాసు జెర్జనిగాంధి ♦ వేడె;" కొనుడు. ఇందుమూగిన జనముల♦నెల్లరికడ
'తాల్తుమింక స్వదేశివ♦స్త్రములనెపుడు, హిందుముస్లిములేకమై♦యుందు'మనుచు
శపథముల"ననగాంధి జె♦ర్జానికనియె. 590

క. "శపథమ్ములఁ గొనగూడదు, విపరీతపు తొందరందు ♦ వినుమటుగొన్నక్
శపథమ్ముల నొకపరినవి, యెపుడుక్ మీరంగరాదు ♦ పృథ్వీతలిలోక్. 591

తే. కాని నీవంతగోరగా ♦ గాదటంచు, పలుకగానేల నీవన్న♦పగిదిజేత
మిటకు రమ్మనుమయ్య రే♦పటికి శపథ,ములను గొనగోరు వారిని ♦ బూనిరేయి
కంతరాత్మ విచారించి ♦ యనుమతిఁగొని". 592

క. బొంబాయి నగరమున విజ,యంబెంతో గల్గె పూర్ణ♦మగుచుక్ హరతా
ళంబునకుగాన సన్నా♦హంబులకుం దిగిరి శాస♦నాళింద్రోయక్. 593

ఆ. సమ్మతించెఁ జాల♦చర్చించి యుప్పు చ,ట్టమ్మతిక్రమింప ♦ నమ్ముటకు ని
షిద్ధ వాఙ్మయమునఁ ♦ జేరిన గాంధి స,ర్వోదయాదిపుస్త♦కోత్కరంబు. 594

మం. ఆనాటిసాయంత్ర ♦ మందువాలంటి,రులు నిషిద్ధగ్రంథ♦ముల నమ్మిరిప్రజ
లైదులు పదులేబ♦దైదులాదిగను, కురిసిరి రూప్యముల్♦గొనుటకు హింద్ స్వ
రాజ్య సర్వోదయ ♦ గ్రంథద్వయమ్ము, ఆగ్రంథముల గొను♦నట్టివారలను
బందిఖానానుండఁ ♦ బంపుదురంచు, వివరించిగాంధి చె♦ప్పినఁ బ్రజల్ జైలు
భయమెల్ల వోద్రోసి♦ప్రియముగాగొనిరి, కానిప్రభుత్వమా♦గ్రంథముల్ రెండు
మునునిషిద్ధమైన ♦ పుస్తకాల్ గావు, తత్పునర్ముద్రణల్ ♦ తనరనటంచు
విలిచినవారల ♦ విడిచియుంబుచ్చె, ఆమరునా డుద♦యమున స్వదేశి
హిందు ముస్లిములైక్య♦మందుటఁగూర్చి, శపథముల్ గొనుటకు♦సభగూడెనొండు
అయిన నానాడట ♦ కరుదెంచినట్టి, జనముకొద్దియె యాట♦కనిన నాయకులు
ప్రజలకుద్రేక కా♦రమ్ముగుపనులు, మాత్రమేకాని ని♦ర్మాణాత్మకముగు
కృషిరుచింపదటం చె♦రింగిరానాటి, కీనాటికది యట్టు♦లేనుండె నంచు
వాపోయె మోహానుం ♦ డాపైనసతము, ఆనాటిసంఘుట ♦ నాళిందలంచి. 606

సీ. ఏప్రిలేడవ తేది ♦ నేగెఢిల్లి కమృత,సరములకుం బొంబె ♦ పురమువీడి
మరునాడు చేరగా ♦ మధురనచ్చటవినెఁ, దన్న రెస్ట్ చేయు వ♦దంతిఁగొంత
చేర గానవతలి ♦ స్టేషనాచార్య గి,ద్వాని తెల్పె న రెస్టు ♦ తప్పదంచు
అవసరమైన మీ♦కర్పింప నా సేవ, లరుదెంచితనిగాంధి ♦ కనియెనతడు
తే. అవలి పాల్వాడి స్టేషను♦కరుగుముందు, "మీరుపంజాబు సరిహద్దు♦మీరిపోవ
రాదు మీ పోకశాంతి భ♦ద్రతల జెరుచు, కానదిగుడిందటంచాజ్ఞ"♦గాంధికిడిరి.
సీ. పోదున శాంతిరే♦పుటకు గాదడపఁ పం,జాబు కాహ్వానావ♦సరము వలన
అందుచే మీ నిషే♦ధాజ్ఞ కేలోబడ, లేకుండుటకు విచా♦రింతునంచు
తనతోడి మహాదేవు ♦ కనియె" ఢిల్లీకీవు, చనుము శ్రద్ధానందు♦కనుము సకల
మటశాంతినుండఁ బ్ర♦జాళికి బోధింప, మను మెందుకే నిషే♦ధాజ్ఞ మీరి
తే. శిక్షఁబడ సిద్ధపడితినో ♦ చెప్పి దాన,మనకు విజయమొదవు శాంతి♦మైఁప్రజాళి
మనినచోనది తెల్పుము♦ననుచునతని, పంపెమహాదేవుమోహానుం♦డింపుమీర.
తే. చేరఁపల్వాలు రెయిలువే ♦ స్టేషనుకడ, దింపి మోహానునప్పుడే ♦ ఢిల్లినుంచి
అటకువచ్చినట్రెయినెక్క♦మనియెపోలిసు, జట్టుతమతోడఁగొనిపోయి♦రెట్టులైన.
క. చేరగమధురఁ బోలిసు బ్యారక్సుకు గాంధిఁ గొనుచు ♦ నరిగిరైన నె
వ్వారేమిఁ జేయఁదలచిరో, నేరరుగాంధికిని దెలుప ♦ నిజమింతేనిఁ. 610
క. మరునాటి యుదయమున ని,ద్దురలేవగజేసి గాంధి ♦ దోడ్కొని చనిరా
సరిసడుమ సవాయ్ మాధో, పురికడదిగ జేసిరతని ♦ పోలీస్వారల్. 611
క. ఖేరింగనుపోలీసధి, కారరుదెంచెను మెయిల్ శ♦కటమున నాలా
హోరు పురినుండి గాంధిని, గాకఁమున గొంచు ఫస్టు♦క్లాసుననేగఁ. 612
తే. గాంధి నీయెడ పంజాబు ♦ గవరనరుకు, వ్యక్తిగతమగు ద్వేషమా♦వంతలేదు
నీవు కాలిడపంజాబు♦నెగడశాంతి, యనుచు భయపడిరా గూడ♦దనియెనిన్ను.
ఆ. అందువలన మీరె ♦ యరుగుడు బొంబేకి, లేనియెడ చట్ట♦మేనె యమలు
జరుపవలసివచ్చు ♦ జాగ్రత్తనంగ ఖే,రింగునకును గాంధి ♦ యిట్లుబల్కె. 614
తే. అయిన నన్నేమి మీరు చే♦యంగదలచి, నారననతండు తెలియదు♦నా కెయిపుడు
బొంబయికిమిష్ఠటులగొని♦పోవుచుంటి,ననుచుగొనియేగెగాంధి♦బొంబాయిపురి.
క. దారిని సూరతుకడవగ, వేరొక యధికారియటకు ♦ వేంచేసె నతం
డారసి గాంధిని బొంబయి, చేరగ "నీవిట స్వతంత్ర ♦ జీవివి"యనియెన్. 616

వ. "అయినను నీవు జనమ్ము లధికమ్ముగా నుండు కొలంబా స్టేషనుకడకన్న 'మెరిన్ లైన్స్' కడ దిగినచో బాగుగా నుండునన గాంధి యందుల కీయకొనెను. అందొక స్నేహితుని వాహానం బగుపడ నందెక్కి గాంధి రేవాశంకర్ జవేరియింటికిఁ జేరెను. ఆ మిత్రుడు" నిన్న రెస్టుచేసినారని విని ప్రజలాగ్రహావేశులై యున్నా

రనియు, నే నిమేషమున నైనను పైధూనికడ ప్రజావిజృంభణ జరిగి అల్లరులు చెలరేగివచ్చును. పోలీసధికారులు, మేజస్ట్రీటు లందరిగియున్నా"రని తెలిపెను. గాంధి జవేరిగృహమునకుఁ జేరిన తోడనే, ఉమార్ శోభాని, అనసూయా భాయియువచ్చి గాంధిని తమమోటారు శకటమున పైధునికడకు గొనిపోయిరి. గాంధిని గాంచినంతనే ప్రజలు మరింత యుద్రేకమున "వందేమాతరం;" అల్లాహో అక్బరని మిన్నుముట్ట నరచుచు, ముందునకు విరుచుకపడిరి. గుంపుఁ జెదరగొట్ట యుత్తరువు లీయబడెను. గుంపును శాంతింపజేయ గాంధి చేసిన ప్రయత్నమంతయు నరణ్యరోదనమే యయ్యెను. సందడి హెచ్చి త్రొక్కుడి అధికమై గుంపులు చెల్లాచెదరయ్యెను. గాంధి పోలీసు కమిషనారాఫీసుకడ నాగి, ఫిర్యాదు చేయనేగెను

ఆ మరువఁగూడని వారము — 1919

తే. కమిషనరు గ్రిఫితాఫీసు ♦ కడసిపాయి, లుండిరల మెట్లకట్లపై ♦ సుద్ధృతముగ
సాయుధులయియుద్ధమునకా♦యత్తులనగ, గాంధి గ్రిఫితులోఁజొరింగుఁ♦గాంచెనందు.

క. తాగన్న దృశ్యములనే, బాగుగ వర్ణింప గాంధి ♦ పలికె కమిషనర్
నేఁగోరితి నిలుపఁగ నూ,రేగింపును కానివినక ♦ రెచ్చెజనమ్ముల్. 619

తే. అందువలన నశ్వారూఢు♦లైన పోలి,సాజనమ్ముఁ జెదరగొట్ట ♦ నార్దరీయ
వలసెనన గ్రిఫితనె గాంధి♦బదులు నీదు,చర్య ఫలితమ్ములశ్వముల్ ♦ జనము ద్రొక్కి
వేయునంచెర్గ వాక్కొ పం♦పించు టేల, అకట! అచటికశ్వారూఢు ♦ లందరసలు.

క. అదినిర్ణయమ్ముగా నీ,కిదమిత్థ మ్మనుచుబల్క ♦ నెట్లగుఁబోలీ
సధికారులైన మేమెరు,గుదుమా మీబోధనమ్ము ♦ గూర్చుఫలితముల్. 621

మం. అటు మేము కఠినచ♦ర్యల గొనకున్న, చేజారియుండును ♦ స్థితిగతులంచు
తప్పక నీచేయి ♦ దాటియునుండ్రదు, శాసనోల్లంఘన ♦ చక్కరుచించు
జగమెరుంగదె నీదు ♦ శాంతిబోధనలు, నడచును ప్రజతన ♦ నైజపద్ధతిని
అనుచుఁబల్కగ గ్రిఫి♦త్తనె గాంధియిట్లు, "ప్రజసాజముగ శాంత♦పథమునసడుచు
క్రౌర్యమెవ్వరికి గ♦ల్గదునై జగతిని", ఇటులెంతొ సేపా వా♦దించిరి వారు
కడకు గ్రిఫిత్తనె ♦ "గాంధినీబోధ, నలఁబెడచెవి నిడి♦రలజనమ్మంచు
నమ్ముచో నీవేమొ♦నర్తు వనంగ, అట్టినమ్మికగల్గి ♦ నంతనిల్పెదను
శాసనోల్లంఘన ♦ సత్యాగ్రహముల", ననమోహానుడు గ్రిఫి♦త్తనె బదులిట్లు.
"బొరింగుతో మున్ను ♦ పల్కవేవిదుద, లైనంత పంజాబు♦కరిగెదనంచు"
"అవునప్పు డటులంటి ♦ నైననేడట్టి, ప్రశ్నయే లేదని ♦ బదులాడె గాంధి"
"ఇంచుకోర్చిన నీకె ♦ యెసగునానమ్మ,కమ్మెరుంగుదువె మ♦హాత్ముడా బాదు
నందేమి జరుగుచు♦న్నదొ! యమృతసరు, నందేమి జరిగెనో ♦ యావంతనీవు

ఎల్లెడఁ బ్రజకుఁ బి♦చ్చెత్తినట్లుండ, ఎల్ల సంగతుల నే♦నింత కెరుంగ
టెలిగ్రాపు తీగలు ♦ తెగగొట్టఁబడియె, బాధ్యుఁడవీవ యీ ♦ బాధలకెల్ల"
"ఎచ్చటెచ్చటనిట్టి ♦ వేర్పడినట్టు, లే నెఱింగినయంత♦కే నేవహింతు
బాధ్యత; నహమదా ♦ బాదునఁగల్గె, నలజడియనవిని ♦ వ్యథ చెందె మనము
అమృతసరమ్మెప్డు ♦ డరుగలేదేను, నన్నెవ్వరెరుగరా ♦ నగరమందైన
పంజాబ్ ప్రభుత్వమ్ము ♦ పరగనన్నందు, పోనిచ్చియేయున్న♦పారయవీవ్యథలు
శాంతి భద్రతల క♦చ్చట నేనుసాయ, మొనరించియుందునం ♦ జననీక ప్రజల
రెచ్చగొట్టె ప్రభుత్వ ♦ మిచ్చించి" యంచు, వాదించిరీరీతి ♦ వారెంతొ సేపు
కడకునే చౌపతిం ♦ గావింతు సభను, ప్రజకుశాంతి వరింప♦బల్కెద నంచు
వీడ్కొనె గాంధి గ్రి♦ఫితును చౌపతిని, సభజర్గె గాంధి ప్ర♦సంగించె నిట్లు. 643

క. సత్యాత్ముఁడైనవానికి, సత్యాగ్రహ మాయుధంబు ♦ సతమెన్నంగన్
సత్యాగ్రహి హింసారా,హిత్య శపథమూనవలయు ♦ నేమరకెపుడున్. 644

క. జనులందరిట్టి శపథము, మనమందున వాక్కునందు ♦ మరికర్మమునన్
తనియగఁ బాటించిననే, అనువగు సత్యాగ్రహమ్ము ♦ నవలంబింపన్. 645

క. అనసూయా బెన్ చెప్పులం,దున నహమదబాధలజడి ♦ దుర్వార్తవడన్
వినియామెను నిర్బంధిం,చెను సర్కారను వదంతి ♦ చెప్పులంబడగన్. 646

క. పిచ్చెత్తెను గార్మికులకు, రెచ్చిపనికి సమ్మెచేసి ♦ రెంతయు హింసన్
తుచ్ఛమగు పనులఁబాల్గొని, రిచ్చన్ సార్జెంటొకండు ♦ మృతికెరగాగన్. 647

క. నడియడ్ రైల్వే స్టేషను,కడఁ దొలగింపంగ నినుప♦కమ్ములయత్నమ్మెడరూనిచేయ జనములు, జడియఁబ్రభుత్వమ్ము సైన్య♦చట్టమొనర్చెన్. 648

క. వీరంగామున జంపిరి, కోరి ప్రభుత్వాఫిసరును ♦ గ్రూరముగ జనుల్
వారింప నిట్టిహింసా, చారముల నహమదబాదు ♦ చనెమోహనుడున్. 649

తే. అహమదాబాదరుగ స్టేష♦నందుగలసి, గాంధిఁగొంపోయె కమిషనర్♦కడకుపోలి
సాఫిసరొకండు కమిషన♦రాఖ్యగ్రిఫిట్టు. 650

క. కోపోద్దీపితుడగు నా,ఆఫీసరు నరసి మృదువు♦లగుమాట నతం
డోపివినగాంధి "అల్లరు,లాపగనే దోడుపడెద ♦ నంచిటునుడికెన్. 651

ఉ. చాల విచారమందెద న♦శాంతికి శాంత పునఃప్రతిష్ఠకై
మేలిమిఁ దోడ్పడంగలను ♦ మీరొనరించెడు నెల్లచర్యలన్
ఆలము సేయకింక బహి♦రంగసభం బిలువంగ సమ్మతిం
దాలిమినిండు గూర్తునది ♦ నాదుసబర్మతి యాశ్రమమ్మునన్. 652

ఆ. సైన్యశాసనావ ♦ సరమొకింతయు లేద,టంచు సభనుపన్య♦సించె నుపవ
సింతు మీరునుపవ♦సింపఁ బశ్చాత్తాప, మంది మీదుహింస ♦ కవసరమ్ము. 653

తే. ఉపవసింతుమూణాళ్లు మీ♦రుపవసింపు, డొక్కనాడక్కటోహింస♦కోరిమిచెడి
తప్పుపనులొనర్చినవార♦లొప్పుకొనగ,వలయుననెమోహనుడు కార్మి♦కులకునెల్ల.
ఆ. సైన్యశాసనోప♦ సంహార మొనరించి, క్షమ క్షమింపవలయు ♦ శాంతిమెయిని
నేరములనటంచుఁ ♦ గూరిమిఁజేసెఁ బ్రభుత్వమునకు గాంధి♦బోధనములు. 655
ఆ. ఒప్పుకొనరు తమద♦తప్పు కార్మికులు ప్రభుత్వ మొప్పుకొనదు ♦ పొరిక్షమింప
సలిపెగాంధి తనదు ♦ సత్యాగ్రహోప సంహార మదియశాంతిఁ♦గ్రూరమగుట.

## కొండంత తప్పు—1919

సీ. అహమదాబాదు స♦భాసంతరమున వెంటనెచనె నాడియ♦డునకు గాంధి
మొదటి హిమాలయ♦మున కెనయగు తప్పుదా జేసితని పల్కు♦టలుసిచటనె
అహమదాబాదందె♦ యవగతమయ్యె న,య్యదియైన నాడియ♦డరిగినంత
వినియె ఖేడాప్రజల్ ♦ వెక్కు రరెస్టయి, రనుపంత మోహను♦ మానమునకును
తే. తప్పైతా హిమాలయమంత♦తప్పుచేసి, నటులశాసనోల్లంఘనో♦ద్యమము ప్రజల
పక్వగుణులైన స్థితియందు ♦ పట్టుదలగ, లేవదీయుటయంచని ♦ కేవలంబు. 657
సీ. బహిరంగ సభలో ను♦పన్యసించుచు గాంధి, ఒప్పుకొనియెఁ దన♦తప్పునెల్ల
అపహాసించిరి ప్రజ♦లైన నందుకు గాంధి, చింతింప డప్పుడా♦వంతయైన
తనతప్పు గొప్పగా ♦ గనుటయు నన్యుల, తప్పంత గొప్పగా ♦ చెప్పకుంట
న్యాయమా శాంతి♦మ్య జ్ఞానమేప్పడు, సత్యాగ్రహిగ గోరు♦జనుడుదేని
ఆ. అనుసరించును త్రికర♦ణశుద్ధిగానంచు, విశ్వసించె గాంధి ♦ విమలమాన
సీయమానసమున ♦ నిత్యసత్యవ్రతా, చారుడగుట వలన♦జక్కగాను. 658
తే. ఆ హిమాలయ మంత త♦ప్పనగ నేమొ, విశదముగ వివరించె నీ♦విధముగాను
అందశాసనోల్లంఘ నా♦ర్హ్వతప్రభుత్వ, శాసనవిధేయుఁడై యుండ♦జనుజనుండు.
సీ. చాలవరకునట్టి ♦ చట్టముల్ జనులెల్ల, అనుసరించెదరు భ♦యమ్ము వలన
నీతిబాహ్యములుఁగా♦నివగు చట్టములు ము,ఖ్యముగ దండనభీతి♦ననుసరింత్రు
మర్యాదగలపెద్ద ♦ మనిషిచౌర్య మొకండు, చట్టంబు లేకున్న ♦ సలుపడెపుడు
అయినను దనసైకి ♦ లందుదీపము లేక,యే పోవుదన్ను దం♦డించునట్టి
గీ. శాసనంబొండు లేకున్న ♦ సహజరీతి, కాని సత్యాగ్రహులటుల ♦ గాకసంఘ
శాసనములెల్ల మనసార ♦ సహజరీతి, ననుసరించి ప్రవర్తించి♦యనుదినంబు 660
క. తనియగ నడచిననే తెలి,యును న్యాయమ్మైనవేవి♦యో తదితరముల్
కననెవియో శాసనముల, మనమున సత్యాగ్రహులగు ♦ మనుజులకెపుడున్.
ఆ. అట్టితెలివి గలిగి♦నపుడ యేవో శాస,నము లతిక్రమించు ♦ విమలహక్కు
గలుగునదియు జక్క♦గా నేర్పరచిన ని,యమములందు జరుప♦నగుధరిత్రి. 662

క. ఈపగిదిం దాజేయమి, యేపారవపాటదిరెు యింత ♦ హిమవన్నగమం
తైఫలితము చెడుదై యక,టా! పరితాపంబుగూర్చె ♦ దౌర్జన్యమునన్. 663

మ. ప్రజలందంతటి యోగ్యతార్హతల సం ♦ పాదింపకే కట్ట! త
న్నిజపక్వస్థితిఁ గాంచకుండ తగదిం ♦ తే శాసనోల్లంఘనం
బజరుద్రాదులకైననంచు మనమం ♦ దావేశమెల్ల న్విడన్
నిజముందాపక పల్కెగాంధి తనదౌ ♦ నేరంబపారంబుగాన్. 664

ఆ. అట్టులగుటఁ దిరిగి ♦ యంతట శాసనో,ల్లంఘనమున సత్ఫ ♦ లంబు బొందఁ
దగు సుశిక్షితులును ♦ ధర్మాత్ములగు వలం,టీరు బృందమును ద ♦ యారొనర్చి
వారు నేర్చి ప్రజక ♦ వారి సత్యాగ్రహ, గురుతులెరుగ జేయ ♦ గోరె గాంధి. 665

తే. ఇట్టితలపులతో నిండ ♦ నెడదగాంధి, అరిగి బొంబాయికందు సత్యాగ్రహాసభ
వారిసాయముతో వలం ♦ టీరుబృంద!, మొందుగూరిచి సత్యాగ్ర ♦ హోద్యమంబు
గూర్చి ప్రజకు ప్రబోధింపఁ ♦ గోరె గాంధి. 666

ఆ. అయినగాంధి యత్న ♦ మంతగా ఫలవంత,మువక పోయె ప్రజల ♦ యందు దగిన
రక్తిలేకపోయె ♦ రార్రైరి ముందుకు, వెంటనంట తనవ ♦ లంటిరులుగ. 667

నవజీవన, యంగిండియా పత్రికలు

సీ. అట్లహింసారతు ♦ ణార్థోద్యమమ్మొక్క, ప్రక్కఁబెంపొందగా ♦ క్రమముగాను
మరియొకప్రక్క ద ♦ మననీతి చెలరేగి, రలప్రభుత్వము పం ♦ జాబునందు
శాసనమునదాని ♦ సైనికచట్టంబు, ప్రకటించి మిగుల ని ♦ రంకుశముగ
నాయకుల నరెస్టు ♦ చేయించి న్యాయము,న్యాయ మన్యాయమే ♦ న్యాయమంచు
తే. దుష్టముగఁ బాలన మొనర్పఁ ♦ దొడగిరమృత,సరుననిర్దోషులైనస్త్రీ ♦ పురుషులఁగట
ప్రాకఁజేసిరి పురుషుల ♦ పగిదిఁగడుపు,పైన గనువారు వినువారు ♦ వంతనంద.

సీ. వెంటనే పంజాబు ♦ వెడలుచుంచొత్తిడి, కావించి రెందరో ♦ గాంధిపైన
అయినప్రభుత్వపు ♦ టాజ్ఞలభింపమి, శాసనోల్లంఘన ♦ సమయమవమి
ఆల్ల పంజాబు దు ♦ రంతముల్ ప్రజలకో,పాగ్నిని వాయున ♦ ట్లడరఁజేసి
దేశమశాంతి ని ♦ రాశాజనకముగా, గ్రాలుచుండుటచేత ♦ గాంధిపోవ
తే. జాలడయ్యెఁ బంజాబు పి ♦ శ్రాంతిలేక, నిత్యముదురంతగాథల ♦ నేకముగను
వచ్చుచున్న వదంతు ♦ లవారిగాను, నిస్సహాయుండగుచు గాంధి ♦ దుస్సహముగ.

మ. అపుడప్డు మిగుల ప్ర ♦ ఖ్యాతినిగన్న, బొంబె క్రానికలను ♦ పత్రికారాజ
మున కధిపతి హార్ని ♦ మను నాయకోత్త,మునిగొనిచనియె ప్ర ♦ భుత్వమెచ్చటికో
అభిలషింపడు శాస ♦ నాతి క్రమణము, చాలింపుమని వ్రాసె ♦ శాసనోల్లంఘ
నోద్యమమును గాంధి ♦ యుద్యమించియును, పంజాబ్ ప్రభుత్వాజ్ఞ ♦ భంగ మొనర్ప
వలదన్న ప్రాజ్ఞుండు ♦ అలహార్నిమాను, అట్టివానిక దేల ♦ నంతహాతాత్ప్రి

వాస శిక్షనువిధిం♦పగ బూనె ప్రభుత, అంచు నాశ్చర్య వ్య♦థాకులుడైన
గాంధినా బొంబాయి ♦ క్రానికల్ నడుప, మనిరి డైరెక్టరు♦లైన ప్రభుత్వ
మనతికాలముననె ♦ ఆ పత్రికా ప్ర,చురణము నిలుపుమం♦చును నిషేధించె
అంత క్రానికలు నా♦యకులు శోభాని, శంకరలాలులు ♦ సమ్మతింపంగ
చేసిరి గాంధిని ♦ చేకొనినడుప, యంగిండియాను స♦త్యాగ్రహార్థంబు
ప్రజకు దెల్పనతండె ♦ పత్రికల్ నడుప, సమ్మతించెను మిత్ర♦సలహానుసరణి.

ఆ. బొంబె క్రానికలుకు ♦ బదులుగా నడిపెడు, పత్రికగుట వార♦పత్రికైన
యంగుఇండియా నొ♦నర్చిరి దైవార, పత్రికగను గాంధి ♦ మిత్రులనుడి. 681

క. పంజాబు స్థితికిని న్యా,యంబుం జేకూర్ప నెంచె ♦ యంగిండియ పా
యంబునఁ బ్రభుత్వమున కెరు,గంబడునటు వ్రాయనం పు ♦ గాంధితలంచెన్.

తే. అయినసత్యాగ్రహామునక♦యారొనర్ప. సాధ్యమగుఁ బ్రజన్ ప్రజలభా♦షాసహాయ
మునను గాకంచుఁ దలపోసి♦ మోహానుండు, కోరెగుజరాతుపత్రికం♦గొననొకండు.

ఆ. అల శోభాని బ్యాంకి♦రులతోడ నాడిందు, లాలుయాజ్ఞకు గుజ♦రాతిభాష
నడుపుచుండె నొక్క ♦ నవజీవనను మాస,పత్రిక నది వార♦పత్రికగ నొ
నర్చి మోహానుండు ♦ నడిపె నహమ్మదా, బాదునుండి యిందు బాసటగను. 684

తే. ఇంతలో క్రానికలు కాఁక♦యొల్లదీర్ప బడియె యంగిండియా మారె ♦ వారపత్రి
కగను గ్రమ్మరగాంధికి ♦ కష్టమయ్యె, రెండుపత్రికల్ నడుప వే♦ర్వేరు చోట్ల.

క, కావున యంగిండియ నవ,జీవనతో జేయగ సహ♦జీవన మొకచే
తావున నహమద బాదున, కావెంటనె కొనియు జనిరి ♦ యంగిండియనున్. 686

సీ. గాంధి యీవారపత్రి♦కా సహాయమ్మున, సత్యాగ్రహముగూర్చి ♦ చక్కదెలియ
తన నేర్పుకొలది బో♦ధనసేయ మొదలిడె, పాఠకావళికి నె♦బాసనంగ
అవిరెండు విస్తృత♦వ్యాప్తిగల్గినవి న,ల్వదివేల బరగెడ♦వ్యాప్తకమ్ము
నవజీవన వ్యాప్తి♦యవిరళంబుగ బెర్గె, నడచె యంగిండియా ♦ న త్తనడక

గీ. గాంధి ఖైదునందుండిన♦కాలమందు, పత్రికలవ్యాప్తి క్రమముగా♦పతనమందె
దిగిరె నెనిమిదివేల క్రిం♦దికి మహాత్ము,డాత్మకథ వ్రాయునాటికి♦ వ్యాప్తిముందు.

సీ. వ్యాపార సంబంధ ♦ ప్రకటనల్ కేనాడు, కామతాసుముఖుండు ♦ గాంధిపేర్మి
పత్రికాస్వాతంత్ర్య♦బలమింత చెడకుండు,నని విశ్వసించె మో♦హానుఁడు హాన
ప్రజలెరుంగ నతని♦భావపరంపర, ప్రచురించె నా రెండు ♦ పత్రికలును
సైనికశాసన♦గ్లాని నిరంకుశ,బాధ నపనయించి ♦ ప్రజకు వారి

తే. గడ్డుకాలమందు తప్ప♦కారు లయ్యె, గాంధిశాంతికి దోహద♦కారులయ్యె
స్వేచ్ఛఁదన్మనోభావముల్ ♦ వెలువరించి, ప్రజలకుత్సాహమిసుమసుమడిం♦పగనొనర్ప.

## పంజాబులో

సీ. పంజాబురాష్ట్రము♦నం జరిగిన దాని,కంత బాధ్యుడు గాంధి♦యనియెడ్వయరు
క్రుద్ధపంజాబ్ యువ♦కులు కొందరనిరి సై,నికచట్టమునకు కా♦రకుడు గాంధి
శాసనోల్లంఘన ♦ సాగింపమని, జలి,యన్ వాలు బాగుదో♦ష్టమ్ముజరిగె
ననుచు గొందరుగాంధి ♦ యరిగినఁ బంజాబు, హత్యజేతుమటంచు ♦ నదరగొట్టి
తే. రైన నలుకడు మోహాను ♦డాత్మయందు, తన్నుదాఁ జేయుదానిని ♦ దప్పువట్టి
రెవరువిజ్ఞులో వారంచు ♦ నెంచెగాంధి, అయినన్మాత్రము జూపెఁ పం♦జాబుకేగ.
మ. అంతకు ముందెప్పు ♦ డచటికేగమిని, అచటిపరిస్థితు ♦ లరయదాదలచె
అచటికి దన్నునా♦హ్వానించినట్టి, సత్యపాలాదులు ♦ జైలునందుండి
రైనవారల బంది♦యందుంప రెంతో, కాలమంచును మది♦గాంధి దలంచె
తాను బొంబె నున్న♦తరి దన్నుజూడ, వచ్చెడు పంజాబు ♦ వారలనెల్ల
ఓదార్పుమాటల♦నొగిమోహానుండు, సరసభాషణల నా♦శ్వాసించుచుండె. 624
క. పంజాబు జేర మోహాను,డుం జనుటయె వాయిదా ప♦డుచునుండె సదా
కొంజక కోరిన ననుమతి,కిం జిత్తము వైసురాయి ♦ కించిత్తిడమిన్. 625
క. ఎపుడనుమతింప నడిగిన, ఇపుడే కాదంచుపలికె ♦ నెపుడున్ వైస్రాయ్
విపరీతముగా నటుజనె, అపురూపంబైన కాల♦మకటా! యెంతో. 626
తే. ఇంతలో హంటరుకమిటి♦యేరుపడియె, నల్లపంజాబ్ ప్రభుత్వము♦తొల్లిసైన్య
చట్టమునుబట్టి చేసిన ♦ చర్యలను గు,రించి సల్పువిచారణ ♦ నించుకంత. 627
సీ. ఆండ్రూసుచేరి పం♦జాబు గాంధికివ్రాసె, హృదయవిదారక ♦ మిచ్చటిస్థితి
రమ్ము వెంటనె చేరు♦కొమ్ము పంజాబు,నం, గలియ జాగొనరింప ♦ వలదటంచు
అపుడె మాలవ్యాయు ♦ నంపెఁదంతిని తక్ష,ణమ్మె పంజాబుకు ♦ రమ్మటంచు
తిరిగి వైస్రాయికి ♦ మరియొకపరి తంతి♦నిచ్చె మోహానుఁడిపు ♦ డేనిపోవ
తే. వచ్చునే నేను పంజాబు ♦ కిచ్చునంచు, అక్టొబరు పదునేడవా ♦ నంతరమున
నరుగవచ్చును యనబదు♦లంపెఁ దంతి, వైసురాయి గాంధికికడ♦కీసువీడి.
సీ. చేరినంతటనె లా♦హోరు రైల్వేస్టేష, నందుగాంచెను గాంధి♦యరయఁదన్ను
కదలివచ్చెనో యల్ల♦కడలియే యననెల్ల, పురజనానీకమ్ము ♦ మూగియుంట
ఎన్నాళ్ళకో యెందో ♦ యేగిదూరమ్మైన, అనుగు బాంధవుడదే♦యరుగుదెంచె
అరసివత్తము రండ♦టంచునొండొరు బిల్చు,కొనివచ్చి రెల్ల మో♦హానునిజూడ
ఆ. చెరగనట్టిముద్ర ♦ చేసెనాదృశ్యమ్ము, గాంధిమానసమున ♦ గాఢముగను
బస నమర్చిరల్ల ♦ పండితరాంభజ,దత్తు భవనమందు ♦ తనియగాంధి. 629
తే. గాంధికిసపర్య లొనరించు ♦ ఘనభరమ్ము, తనభుజమ్ములయం దిడు♦కొనియె కరుణ
శ్రీమతి సరళాదేవి ని♦శ్శేషముగను, గాంధిబస ధర్మసత్రమే ♦ యెందుసతము.

వ. పంజాబు ముఖ్యనాయకులగు సత్యపాలాదులు జైలునం దుండుటచేత వారి స్థానమందు మాళవ్యా, మోతీలాలు పండితులును, శ్రద్ధానందస్వామియు, గాంధి యరిగినప్పటికే యందుండిరి. మాళవ్యా శ్రద్ధానందులు గాంధికి పూర్వ పరిచితులే. మోతీలాలుతోఁటి మొదటి ప్రత్యక్షపరిచయ మిదియే. వారును వారును జైలున కరుగని తదితర పాంచాల నాయకులును, గాంధిని గడుగౌర వమునఁ గాంచిరి. వారిమధ్య గాంధి తన స్వగృహమునం దుండినట్లే భావించెను. పంజాబుదురంతముల విచారించుటకై ప్రభుత్వ మేర్పరచిన హంటరుకమిటితో సహకరింప ప్రజానాయకు లెల్లరు నిరాకరించి బహిష్కరించిరి. దదీయస్థానే కాంగ్రెసు తరఫున నొక అనధికార విచారణసంఘ మేర్పడెను. అందు మోతీలాలును, చిత్తరంజనదాసును, అబ్బాస్‌త్యాబ్జియు, యం. ఆర్. జయకరును, గాంధియు సభ్యులుగానుండిరి. ఈకమిటి కార్యక్రమమంతయు గాంధీపై నిడిరి. ఈవిచారణ విషయమం దెక్కువగాఁ బాల్గొని, బహుళ ప్రజానీకముం గలిసికొని శ్రమించినవాఁడు గాంధియే. అందువలన పంజాబందలి పల్లెప్రజల పరిస్థితిఁ బాగుగాఁ బ్రత్యక్షముగా పరికించుటకు వలయు నవకాశ మందువలన లభ్య మగుటకు గాంధి యెంతయో సంతసించెను. ఆకాలమందే ఖద్దరు కార్యక్రమము నకు పంజాబున చాల అవకాశముండుట గాంధి గ్రహింపఁగల్గెను. విచారణ సాగించుకొలఁది ప్రభుత్వ నిరంకుశ పరిపాలనకు గురియై బహువిధ బాధలకు లోనైన పాంచాల ప్రజానీకముం గాంచి గాంధి మిగులవిచారపూరితుఁడాయెను. మీఁదుమిగుల సైనికుల ననేకముగా ప్రభుత్వమునకు బంపగల్గిన పాంచాలు రట్టి యమానుష కృత్యముల సహించియుంట కచ్చెరువందెను. 709

మ. కమిటీనివేదికఁ ♦ గడగితయారొనర్చెడు పనియు మో♦హనుడే యొనర్చె
పంజాబు ప్రజలపై ♦ పరప్రభుత్వమ్ము, అలనాఁడు గావించి ♦ నట్టిదురంత
విషయమెరుగ గోరు♦విజ్ఞులేరైన, నానివేదికజూడ ♦ ముసె గాంధి తొల్లి
ఆనివేదికయందు ♦ నావంతయైన, అతిశయోక్తులు లేవు ♦ ప్రతిమాటకందు
సాక్ష్యమ్ముగలదెట్టి ♦ శంకయే లేని, విషయమ్ము లేయుండు ♦ వివరింపబడియె
సత్యమొక్కండె వి♦శదమునొనర్చు, నుద్దేశమున దయా♦రొనరింపబడిన
దగునానివేదిక ♦ ఆంగ్లప్రభుత్వ, మెట్టియమానుష ♦ కృత్యమ్ములెట్టి
కట్టిడి కార్యముల్ ♦ గావింపగ సమకట్టునో తనయధి♦కారమ్ము నిలుప
బెట్టుకొనుటకెల్ల ♦ వివరమ్ముగ నెరిగించు చదువరుల ♦ కెల్లరికిద్ది. 710

—॥ ఖిలాపతు సమస్య-గోరక్షణ ॥—

సీ. కాంగ్రెస్ విచారణ ♦ కార్యక్రమారంభ, మునకముందే గాంధి♦కరుగుదెంచె
ఆహ్వానపత్రమొం ♦ డలఢిల్లిలో ఖిలాపతుసభ కరుదేరఁ ♦ బయనమయ్యె

ఆసభఁ గాముస్లిముల్ ♦ హైందవుల్ గలిసిరి, గోరక్షణముగూర్చి ♦ కూడబలుక
గాంధికీరెంటినిఁ ♦ గలిపిచర్చించుట, నచ్చకున్నను కడ♦కరిగె సభకు

**తే.** అందుతన మనమెరుగ మా♦ట్లాడెగాంధి, హాకిము అజ్మలుఖానుతో♦నవలసంప్ర
తించె స్వామి శ్రద్ధానందుఁ ♦ దీరికగును, వారలిద్దరి సమ్మతి♦వడసి వల్కె 711

**సీ.** అల ఖిలాపతు సమ♦స్యకు న్యాయసమ్మతి, కల్గుట తత్పరి♦ష్కారమునకు
నిలువవలయు హైంద♦వులు బాసటగ ముస్లి,ములకు గో ప్రశ్న యే♦పలుకకుండ
హిందుసోదరులకా ♦ నందమ్ముగూర్చుట, తమధర్మమనియెంచి ♦ తమకుదామె
నిలిపిన గోహత్య♦కలుగు ముస్లిములకు, గౌరవకీర్తు లు♦దారముగను

**తే.** కనక ముడివెట్టకుడు రెంటి♦కనినగాంధి, వాదమురుచించె సభనున్న ♦వారికెల్ల
చర్చగోరక్షణముగూర్చి ♦ జరుగకుండ, సాగెనాటి సమావేశ♦మాగకుండ. 712

**సీ.** ఇంతగా మోహను ♦ డెచ్చరించిన మౌల,నబ్దుల్ బరీసాహె♦బనియెనిట్లు
"హైందవుల్ మనకు సా♦యముచేసినను జేయ,కున్నదద్దేశమం♦దున్న మనము
వారినున్నిత సుభా♦వముల కనుగుణమ్ము,గాను గోహత్యను ♦ మానుటొప్పు"
అట్లొకానొక్కప్పు ♦ డది నిజమ్ముగవార, లంతమ్ము గావించు♦నట్లు దోచె

**తే.** అందుగొందరు పంజాబ్ స♦మస్య నీ ఖి,లాపతుకు ముడివెట్టుడం ♦ చనిరి కాని
గాంధియదికూడ మంచిది ♦ కాదనంగ, నొప్పుకొనిరెల్లరది యె స♦ముచితమంచు.

**సీ.** ఆసభఁ మౌలాన♦హసరత్ మొహానియు, హాజరై యుండె మో♦హను నికతని
వాగ్వాదనైపుణి ♦ వడిదెలిసెను వార, లన్నిట భేదించి ♦ రక్లిమిగిలె
ఆసభయందు ప్ర♦సైన తీర్మానాల, దీక్షగొంటెల్ల స్వ♦దేశిఁదాల్ప
అందులకనుబంధ♦మైన విదేశివ,స్తువుల బహిష్కరిం♦చుట యొకండు

**తే.** అయినహసరతుసాహె బి♦ట్లనియె "మన ఖి,లాపతుకుగల్గకున్న చో♦న్యాయమింత
అందరముముట్టకుండ మే♦యాంగ్లవస్తు,వులనుసాధ్యమౌ పరకంచు♦బలికెనతఁడు.

**సీ.** గాంధియందుకు నైతి♦కముగ నాక్షేపించె, నాచరింపగ నసా♦ధ్యమ్మనియె
తనయహింసా దృక్ప♦థముగూర్చి కూడనా, సభముందునిడె గాంధి♦సభికులొప్ప
హాసరదుపన్యాస ♦ హర్ష ధ్వనులమధ్య, తనపల్కరణ్య రో♦దనమొయైన
వెనుకాడకుండ మో♦హనుడాడె తనభావ,ములు దెలియగ సభి♦కులకునెల్ల

**తే.** గాంధిచెప్పినదెల్ల యో♦గ్యంబటంచు, సభికులంగీకరింప హా♦సరతుతెచ్చి
నట్టి తీర్మానమోడె నా♦యకులె ఆంగ్ల,వస్తువుల దాల్చియుండుట♦వారిగాను,

**సీ.** వలయునన్ని స్వదేశ♦వస్త్రమ్ము లుత్పత్తి, గావించుటకు నెంత♦కాలమగునొ
పర దేశవస్త్ర స♦ఫలబహిష్కారమ్ము, సాధింపనెప్పుడు ♦ సాధ్యమగునొ
వెనువెంట నాంగ్లుల ♦ కనువిప్పుగానేదొ, చేయవలయు నిడ్డె♦చెప్పుమీవె
అని తొందరించెడు ♦ హాసరత్ మొహానిప,ల్కులవించుగాంధియా♦లోచనమ్ము

తే. సలుపదొడగె విదేశవ♦స్త్రముల వీడ, సాధ్య మగునొక్కొ, అందుకు♦సరిపడంగ
చేయగల్గుదుమే స్వదే♦శిని మరింత, అటులగాకున్న నింకేది ♦ యాచరింప
వలయునాంగ్లుల కనుమాత ♦ తొలగుకొరకు. 716

సీ. గాంధియప్పటికెరుం♦గడుమనకు వలయు, ఖాది గోరినఁజేయఁ♦గలమటంచు
అయినప్పటికెరుంగు ♦ యంత్రవస్త్రములు వి,దేశవస్త్ర బహిష్కృ♦తికి దగవని
అందుచేతామేదొ ♦ యాచరింపవలయు, క్రొత్తదాంగ్లాధికా♦రుల గదల్ప
ననుచు యోచించి మో♦హనుడు వాదనకుప,యుక్తమ్ముగ హిందీ♦యుర్దుపల్కు
తే. లందుతనవినూతన భావ♦మందరా స,భాంతరమ్మున మెచ్చెదు♦నట్లు నిట్లు
తనవినూతన భావోచి♦తమగు హిందీ, ఉర్దు పదమొందు దెలియమి♦నొప్పుమిగుల.

సీ. సంధిషరత్తులు ♦ సరిపడకున్నఁగూ,డను ముస్లిముల్ ప్రభు♦త్వమునకింత
సహకరింపకయుంట ♦ సహజమ్ముగ ప్రజల,హక్కొకటచే ప్రభు♦త్వాధికార్ల
అలఖిలాఫతుపంటి♦ యధికప్రధానోద్య,మములందు మనకుద్రో♦హమునొనర్చు
నాప్రభుత్వముతో స♦హకరింపగ నిరాక,రింపక యుందుమే ♦ తెంపుచేసి
తే. తత్ప్రభుత్వమిచ్చిన బిరు♦దములుగౌర,వములు మనకేలనిక దాల్ప♦వలయు వారి
సేవ యుద్యోగముల పేర♦సేయుటేల, సాయమిట్టిదె వారికిఁ ♦ జేయుటేల? 718

అమృతసర కాంగ్రెసు

మం. నామమాత్రమ్ముగా♦న్యాయసభలన,చెలగు'' త్రైబ్యునులందు♦శిక్షింపఁబడుచు
ఋజువున్న లేకున్న♦రోజు జైలందు, సైనికచట్ట పై♦శాచికపాల
నమున నుంపబడెడు ♦ నాయకాగ్రణుల, వారియనుచరుల నూ♦రార్లకొలఁది
పంజాబ్ ప్రభుత్వము ♦ బందియందుంప, జాలకప్రజ లల♦జడిచేయవిడిచె
అమృతసర్ కాంగ్రెసు ♦ ఆరంభనుండె, లాలాహరికిషన్♦లాలుఁ దదితర
నాయకుల్ కాంగ్రెసు ♦ నడుచుచుండగనె, అలిసోదరులట ♦ కరుదెంచిరపుడు
నేరుగా జైలునుం♦డియె కాంగ్రెసునకు, హర్షింపఁ బ్రజలెల్ల♦ నమితమ్ముగాన
అత్యంత లాభదా♦యకమైన తనదు, న్యాయవృత్తిని విడ♦నాడి పంజాబు
నందె ప్రజాసేవ♦యందున్న మోతి,లాలు అధ్యక్షుడై ♦ క్రాలనాహ్వాన
సంఘాధిపతిగ వి♦చారింపనెల్ల, స్వామి శ్రద్ధానందుఁ♦డోము కాంగ్రెసును. 728

ఆ. గాంధి యింతవరకు ♦ కాంగ్రెసువార్షిక, సభల హిందికై ప్ర♦సంగమొప్ప
జేసె హిందిలోని ♦ దేశవాసులయిన, భారతీయ జనుల ♦ వ్యథలఁగూర్చి. 729

సీ. అటుగాక నీకాంగ్రె♦సందు హఠాత్తుగా, బాధ్యతాయుతమైన ♦ పనులుదగిలె
క్రొత్త సంస్కరణల♦గూర్చి ప్రభుత్వపు, ప్రకటన సంతృప్తి ♦ వడమిఁదిలకు
దాసులు దలచిరి ♦ త్రోసివేయగవాని, మాలవ్యతాటస్థ్య ♦ మొలిబూనె
బసుదాను మాలవ్య ♦ బసనుంట గాంధియు, వినియె నామాలవ్య♦వివిధములగు

తే. రాజకీయములం గూర్చి ♦ రోజు నర్చు, చర్చలనేకమును దానె ♦ సలుపుచట్లు
సంస్కరణలగూర్చి కాంగ్రెసు ♦ సభనుదనకు, తప్పదెటు పాల్గొనుటటంచు ♦ దలచెమదిని.
సీ. పంజాబ్ దురంతాల ♦ పైఁ దాదయూరొన, ర్చిన నివేదికతోటి ♦ పనియొకండు
అల ఖిలాఫతు సమ ♦ స్యయునొండు సర్కారు, సంప్రతింపుల కవ ♦ సరముగూర్చి
ఆలిసోదరుల జై ♦ లందుండి విడుచుట, శుభసూచకముగ దో ♦ చుటను దనకు
భారతీయుల నెవ్వ ♦ వంచింపఁబోడు మాం, టెగ్యుంచు దావిశ్వ ♦ సించి యుంట
ఆ. సమ్మతింపఁ దలచె ♦ సంస్కరణలగాంధి, త్రోసివేయఁదలచె ♦ దాసు సరిగ
లేవు తృప్తికరము ♦ గావవియని వాని, దేశబంధు పథమె ♦ తిలకు ద్రొక్కె.
మం. అంతటియనుభవ ♦ మంతటి ప్రజల, మన్ననంగల్గిన ♦ మాననీయులగు
నాయకద్వయికి భి ♦ న్నముగ వర్తించు, భావమాతనికి దు ♦ స్భరమయ్యెగాని
అతనియంతర్వాణి ♦ నడపలేదయ్యె, కాంగ్రెసు నేవీడి ♦ కదలిపోఁదలచె
మాలవ్యకును మోతి ♦ లాలుకు దాను, సభకింక 'గైరుహా ♦ జరగుట' మంచి
దందరిమన్నన ♦ లందుకొన్నట్టి, నాయకమణులతో ♦ నాకున్న భేద
భావప్రదర్శన ♦ బాధకు లోను,గా వెరతునటంచు ♦ గాంధి మాటాడ
పెద్దలాయిద్దరు ♦ వద్దని రంత, లాలాహరికిషెను ♦ లాలిట్టులనిరె
ఇటుచేయరాదు మీ ♦ రెప్పుడైనఁ జాల, బాధ జెందెదరు మా ♦ పంజాబువారు
'డెలిగేట్సు' వేరుగా ♦ దెలియనేర్పాటు, చేసెద ఓట్లని ♦ చ్చెడువారి లెక్క
నిడమంచి యేర్పాటు ♦ లే చేతు బారి, పోక మీతీర్మాన ♦ మును సభయందు
పెట్టుడనంగ నొ ♦ ప్పెను గాంధి తనదు, తీర్మానమును దయా ♦ రోర్మిఁ గావించె
నాయకాగ్రణుల మ ♦ నమ్ములనెట్టి, కాఠిన్యమింతయు ♦ గానరాకున్న
వారి పల్కులహేతు ♦ వాదమ్ముదక్క, నన్యమేదియు నించు ♦ కగపడకున్న
ప్రజలెల్ల నాయక ♦ భావ భేదముల, బాధజెందిరి యేక ♦ భావమ్ముకోరి
రందుచే వేదిక ♦ యందున్న వారు, పన్యసించెడువా రు ♦ పన్యసింపంగ
జరిగె భేదము బరి ♦ ష్కార మొనర్ప, జతనముల్ ఫలియించె ♦ జరమదానొక్క
సవరణగాంధి హ ♦ స్తంబందునుంచి, ఇదియొప్పు కొమ్మంచు ♦ మృదువుగా వేడె
సమ్మతించె దదీయ ♦ సవరణ కతడు, తిలకుదాసులు సమ్మ ♦ తించిరాపైన
అంత మాలవ్యాజి ♦ యదిగొనిపలికె "చూడుడు 'డెలిగేటు' ♦ సోదరులార
కుదిరె సమాధాన ♦ మిదితత్ఫలితము, సవరణమీరెల్ల ♦ సమ్మతింపుఁడన
కాంగ్రెసుపందిరి ♦ కరతాళ నినద, ములతోడ మార్మ్రోగె ♦ ముదమంద గాంధి.

కాంగ్రెసు ప్రవేశము

ఆ. గాంధికమృతసరము ♦ కాంగ్రెస్ నఁ బాల్గొను, టాయె దానిరాజ ♦ కీయములఁ బ్ర
వేశమంతవరకు ♦ వెళ్ళియేటేట దా, చాటుచుండె కాంగ్రె ♦ సైటునంచు. 753

క. అమృతసరమందలి యనుభ,వమున నెరిగె కాంగ్రెసున కు♦పకరించు విధా
నములొండు రెండుదన కి,ష్టముల్లైనవి మోహానుండు ♦ సమ్మతిఁజేయన్. 754

ఆ. తిలకు మోతిలాలు ♦ దేశబంధుడును ద,దితర నాయకాధ్యు ♦ లెల్ల ప్రీతి
చెందియుండుటరస,♦గాంధి పంజాబు ద,ర్యాప్తునం దొనర్చి♦నట్టి కృషికి. 755

సీ. ఆనాయకాధ్యుల ♦ యాంతరంగిక సమా,వేశమ్ములకు గాంధి ♦ బిలువఁజనియె
అందుఁదదీయ నా♦యకులకు విశ్వాస,నీయులు విజ్ఞులు ♦ నిపుణులొండె
ఆహూతు లగుచుండి ♦ రపుడప్పు తదితరు,లందెట్లొ చనుచుండి ♦ రరయకుండ
మరియేటికొక రెండు ♦ మంచివి గాంధి కి,ష్టమ్ములైనవిషయముల్ ♦చర్చ సేయ

తే. బడియెనందొండు జలియను ♦ వాలబాగు, నందుడయ్యరుసేనాని ♦ కావ్యులైన
దేశభక్తులస్మారక ♦ దివ్యచిహ్నా, నిర్మితికి నైదులక్షల ♦ నిధిగడింపు. 756

ఉ. ఆనిధి ధర్మకర్త గణ♦మందున గాంధిని నాయకాధ్యు లెం
తే నియమించి రాతఁడును ♦ నేమముతో నిధి సేకరించె బొం
బే నగరంబునం దచటి♦ప్రీతిని బౌరు లుదారబుద్ధిమై
మానుగనిచ్చి రంతయును ♦ మానసమందున గాంధివొంగగాన్. 757

సీ. హిందుముస్లిము సిక్కు♦లేకమై యొకటిగా, దమరక్త మొందున♦ధారవోసి
రాతలమెటుల ప్ర♦భూతమొనర్చుట, స్మారకచిహ్నము ♦ చేరహింప
ఆమూడు కులజను♦లైకమత్యముతోడ, కలసియుండుటకు బం♦ధులుగ నకట
కయ్యాని కెయ్యెడఁ ♦ గాలుద్రవ్వుచునుండి, రొండొరు లొక్కింత ♦ నోర్మిలేక

తే. దేశమెట్లుపయోగింప♦ దెలియకుండె, నానిధినటంచు మోహానుం♦డాత్మయందు
వగచుచెంత యోవాపోవు♦చగణితముగ, వ్రాసెఁదనయాత్మకథయందు♦వాసిమీర.

సీ. మరియొండు గాంధి య♦భిరుచి యనల్పార్థ, మల్పాక్షరముల సం♦కల్పరీతి
సాధించి వ్రాయుట ♦ చక్కగానద్దాన, కౌశలమ్ముగడించె ♦ గాంధిచాల
కాలసదభ్యాస ♦ గరిమచే కాంగ్రెసా, గాంధిశక్తి వినియో♦గమ్మొనర్ప
కాంగ్రెస్ నిబంధనల్ ♦ కాలోచితమ్ముగా, మరలవ్రాయింపగా♦మనసువడగ

గీ. అప్పగించిరాపనిని మో♦హానుని కతఁడు, తనకుసాయమ్మొనర్పగా♦గొనియె తిలకు
దాసుప్రతినిధులుగనందు ♦ వాసిగన్న, కేల్కరును ఐ బి. సేనును♦నిల్కడగను.

మం. కాంగ్రెసు కానాడు ♦ గలనిబంధనలు, ఆసంస్థప్రారంభ ♦ మందుగోఖేలు
కావించినట్టివే ♦ కనుకనవ్వాని, క్రొత్తచేర్పులతోడ ♦ కూర్పులతోడ
మార్పులతోతీర్చి ♦ యేర్పాటొనర్ప, సర్వకాలమ్మునా ♦ సంస్థనునడుప
నూతన్నావసరములం♦దునఁ దగినట్లు, వ్యవహరించుట కను♦వైనట్టు లెట్లు
రాష్ట్రాలవారిగా ♦ ప్రతినిధిసంఖ్య, అంపగావలయునో ♦ యానిబంధనలొ
నర్పనూతనముగా ♦ నేర్పడెసంఘ, మొండందు గాంధియై♦ముఖ్యుడై వ్యవహా

రించి బాధ్యతను వ♦హించి తయారు,చేసె నాకేల్కారు ♦ సేనులతోడ
జాబుజవాబుల ♦ సంప్రతింపులను, జరిపినిబంధనల్ ♦ చక్కగా వాని
అనుసరించిన చాలు ♦ నబ్బుస్వరాజ్య, మని మోహనుడు తన♦పనిగూర్చితెలిపె.

—ఖాదిపుట్టుక—1917—

తే. పదియుతొమ్మిదినూటెని♦మిదవయేట,"హింద్ స్వరాజను"గ్రంథమం♦దెచ్చరించె
దినదినముపెర్గు మనయిండి♦యను దరిద్ర,రోగమిాగనోవర్చి కూ♦ర్చునుస్వరాజ్య
మచ్చముగ రాటమంచు వా♦క్రుచ్చె గాంధి. 769

సీ. కాని యానాడునుం ♦ గడకిండియాకు దా,గ్రమ్మరినపుడును ♦ గనడుచర్ఖ
సత్యాగ్రహాశ్రమ ♦ స్థాపనసమయాన, చేమగ్గములుగొన్ని ♦ చేర్చిరందు
నేయనేర్పుట కొక్క♦నేర్పరి పలన పూర్,నుండి రానాతని♦నుండి నేర్చె
మగనలాలాకళా ♦ నిగమసమస్త మా,శ్రమవాసులకు నేర్పె ♦ సకలురకును
తే. అందుశిక్షణ మొసగి త♦యారుచేసె, చక్కగాబట్టలను నేయ♦జాలుసాలె
వారిగానంత వారల♦వారిగా స్వ,దేశినూలుతో గుడ్డల♦నేసిరెన్నొ 770

సీ. అయిన దామటనేసి♦నట్టి బట్టలు చాల,మిని షైటి సాలెవా♦రిని నడిగిరి
వారిండియను నూలు♦వాడినేసినబట్ట,ల నొసంగి రాశ్రమ ♦ జనులకెల్ల
ఈరీతి క్రమముగా ♦ భారతనూలు యం,త్రములతో సంబంధ ♦ మమరదొడగె
యంత్రాలనూలుపై ♦ యాధారపడియుంట, మంచిది గాదంచు ♦ నెంచిగాంధి
ఆ. తమకువలయు నూలు ♦ దామె వడుకుటకు, నిర్ణయించిరైన ♦ నేర్వనూలు
వడుకువిద్య నూలు♦వడుకు రాటము లెందు,దొరకవాయె వారి♦కెరుకగాను.

తే. కానినేయుటయందెచ♦క్రములునూలు,చుట్టుటకుగొన్నియుపయోగ♦పెట్టుచుండి
రైనరాటమ్ములుగ నేవి♦థానవాని, నెరుగరైరి నియోగింప ♦ బరగవారు.772

ఆ. కాళిదాస్ జవేరి ♦ కనిపెట్టి "కలదొక్క, తెరవ గలదు వడుకు♦తెరగు దెలుప
ననగనంపిరొకని ♦ నాపడంతికడకు, గరువనెల్లగరువ ♦ గలుగువాని. 773

క. ఆతడువడుకు రహస్యపు, రీతులునేర్వకయె క్రమ్మ♦రెను జనంగాలం
బాతురత హెచ్చ గాంధికి, ఏతీరునదాని నేర్వ♦నెపుడగు నంచున్. 774

తే. ఆశ్రమమ్మున కరుదెంచు♦నట్టి జనుల,నెల్లరిని యక్షప్రశ్నల ♦ద్రెళ్ళజేసి
ఎటులచే నూలువడుకుటం♦చెరుగగోరి, పట్టుదలతోడ మోహనుం♦డట్టులెట్టొ.

సీ. అయిన నాకళకు స్త్రీ♦లాట పట్టగుటయు, చాలవరకది ని♦ర్మూలమగుట
ఏమూలదేశమం♦దెచటనో మూల్గుచు, ముక్కుచున్నసుదాని♦ముక్కుమొగము
ముగుదలకే తెలి♦యగ నగునని యుండ, నరిగెవిద్యా సభా♦ధ్యక్షుడుగను
గాంధి పందొమ్మిది♦వందల పదునేడ,వేట బ్రోచికచట ♦ నింతియొకతె

తే. తెలిసె గంగాబెహేనను ♦ దీనసేవ, దేవసేవగ నొనరించు ♦ ధీమతియును
ధీరగుణయగు నామెప్ర♦తిజ్ఞచేసె, వెదకి రాటముం గనుగొందు ♦ విడువనంచు.

— కడకు గనుగొనబడెను — 1917-18 —

మం గుజరాతులో నామె ♦ గ్రుమ్మరిచాల, కాలంబునకు నెట్లో ♦ కనిపెట్టెకడకు
చర్ఖాబరోడ రా♦ష్ట్రము విజాపురిని, ఈవిషయము గాంధి ♦ కెరిగించెగంగ
ఆయూరిలో చర్ఖ♦లందరికుండె,నైన వానికిస్థాన ♦ మటుకలందుండె
పనిలేమినవియట్లు ♦ పైదాగియుండె, పనికిమాలినవస్తు ♦ పంక్తిలోనుండె
ఆయూరివారు గం♦గాబెహేన్ కనిరి, "సిద్ధమైయుంటిమి ♦ చేపట్టితిరిగి
వాడుకమై చర్ఖ♦వడుకంగనూలు, ఏకులెవ్వారైన ♦ నెల్లప్పుడొసగి
మావడికిన నూలు ♦ మఱపుచ్చుకొన్న", ఆమహాదానంద♦మగు వార్తగాంధి
కందించె గంగాబె♦హాను మఱోభాని, కీవిషయము దెల్ప♦నేకులాతండు
అంపెగాంధి కతండు ♦ బంపెనువాని, గంగాబెహానుకు శీ♦ఘ్రముగ నూలంప
బడెనైన గాంధికీ♦పద్ధతి నచ్చ, కిటుదలంచెను దన♦యెడ "బూర్వమందు
ఏమిల్లులందించె ♦ నేకులవడక, కనుక నేకెడివారి♦కై గంగవెదక
మన నామె విశ్వాస♦మున ప్రయత్నించి, యేర్పాటుగావించె ♦ నేకులవాని
ముప్పదయిదు రూప్య♦ములకు కొండొకని, నేర్చిరి యువకులో♦నర్చి రేకులను
వచ్చె బొంబయినుండి ♦ ప్రత్తిబంపంగ, యశ్వంత్ ప్రసాదు దే♦శాయివెన్వెంట
అటులగంగా బెహా♦నద్వితీయకృషిఁ, గనుకొన్నదాని క♦న్నను మించివృద్ధి
గాగ విజాపురి ♦ ఖాదిపేర్గాంచె, మొదట భారతదేశ ♦ మున నిట్లుబుట్టి
ఖాదివిజాపురిఁ ♦ గనబెంపునిట్లు, ఆశ్రమమ్మున స్థాయి♦నందె రాటమ్ము
మగనలాల్ తననేర్పు♦మరితెల్వినెల్ల, వినియోగ మొసరించి♦విపులాభ్యుదయము
సాధించె రాట్నపు ♦ చక్రమ్ములితర, చర్ఖభాగమ్ములా ♦ శ్రమమందెచేయ
బడనందుచేయగా ♦ బడిన ప్రప్రథమ, ఖాదిరూపాయణా ♦ గజమొక్కటికిని
గాంధిసిఫారసు ♦ గావింపఁగొనిరి, అతని మిత్రులుగొంద ♦ రావెలకద్ది
బొంబె నస్వస్థతం ♦ బడకనుండియును, సలిపెనన్వేషణ ♦ చర్ఖకై గాంధి
కలిసె నకస్మాత్తు♦గా సాలెలిద్ద,రమ్మగా నూలురూ♦పాయికి నేరు
కాని క్రమమ్ముగాఁ ♦ గనుగొనె దాను, వంచింపబడుచుంటి ♦ నంచుమోహానుడు
అయిన నేర్పిరి వార♦లందు నూల్వడక, వసుమతీ బెహానుకా ♦ వంతికాభాయి
కలరామిభాయికి ♦ నిలువేలుపయ్యె, గాంధికిచర్ఖ త♦ద్దానమ్ము దేర్ప
మనము స్వస్థతగాంచె ♦ మానెనుమేన, నస్వస్థతయునెల్ల ♦ యవలీలగాను
బొంబాయిలోగూడ ♦ మునుబోలె గాంధి, కేకులందకపోయె♦ బ్రాకటమ్ముగను
కనియెదూదేకుల ♦ జనుడొక్కఁడందు, జననిత్యమతని ర♦మ్మని చెప్పిఁపంప

పడకలకై యేకి ♦ ప్రత్తినెక్కించు, వాడని తెలిసి యే♦ర్పాటుగావించె
చేయనేకులవాడు ♦ చెల్లించిమూల్య, మధిక మైనను గాంధి ♦ యా యేకులన్ని
యు నొసంగె మాలల♦నొనరింప వైష్ణ,వులకిట్లు ధనమెంతొ ♦ సెలవయ్యె దేశ
భక్తులౌమిత్రులు ♦ భరియించిరెల్ల, అనుభవ భాగ్యంబు ♦ నబ్బెనెక్కువగ
గాంధియంతఁదలంచె ♦ ఖాదిదాదాల్పు, నై నవిజాపురి ♦ నాశ్రమమందు
ముప్పదంగుళముల ♦ ముదక ఖద్దరెత,యారౌట గనినల్వ♦దై దంగుళముల
ఖాదిదోవతి దేర ♦ గంగాబెహానుకు, చెప్పిపంపగ నామె ♦ చేయించియట్టి
పంపెలేకున్న మో♦హానుడనెముప్ప, దంగుళమ్ములదె తా♦నట్లె ధరింతు
ననుచట్టిసమయాన ♦ గొనితెచ్చి రాజ్ఞి, దంపతులను లక్ష్మి♦దాసాశ్రమమున
కాసాలెదంపతు ♦ లంతటనేరపి, రందరికిని బట్ట♦లందమ్ముగాను
నేయగా నేర్పియ♦నేకమ్ముగాను, గుజరాతులోన ది♦గ్విజయమ్ముగాను. 817

ఒక విజ్ఞాన జనక సంభాషణము

సీ. యంత్రాధిపతు లుద్య♦మారంభ మందుండి, ఖాదివిమర్శించి♦రేదొరీతి
అందుమరుశోభాని ♦ యరమర లేక గాం,ధికి దనయనుభూతిఁ ♦ దెలివిదెలిపె
అతఁడొకప్పుడు వేరు♦యంత్రాధిపతితోడ, భాషింపగాంధి కే♦ర్పాటుచేసె
వారిరువ్వురిట్లు సం♦భాషించిరి స్వదేశి, యుద్యమమ్మునుగూర్చి ♦ యుత్సుకతను
తే. "తెలియదేనీకుగలదుస్వ♦దేశియుద్య,మమిదివరకని"! "తెలియ కే♦మయ్యె తెలియు
తెలియుగద వంగ విభజన ♦ దేశమున గి,రాకిబెంచె స్వదేశివ♦స్త్రములకంచు.
సీ. "ఎరుగుదెల్లయు గొంత♦వరకాప వెలలబెం,చితిరి మీరనివ్యథ♦చెందితేను"
"అవగతమయ్యె మీ♦వ్యథనాకు గాని మా,వ్యాపారమెల్ల లా♦భంబుకొరకె
వస్తువుకు గిరాకి♦బట్టి మూల్యము హెచ్చు, నాందోళమున గి♦రాకిహెచ్చు
బెంగాలువారలె♦రుంగరే తమస్వదే,శీయుద్యమము స్వదే♦శి వసనముల
తే. వెలలబెంచునటం"చయ్యొ!♦విశ్వసించి,రల్ల వంగరాష్ట్రజులునా♦యట్లుమిమ్ము"
యంత్రయజమాను లంతటి♦స్వార్థపరులు, కారుదేశ విద్రోహులు♦గారటంచు.
క. "ఎరుగుదు మీ రెప్పుడు నం,దరి నమ్మెదరంచు నిప్పు♦డందువలన హె
చ్చరికనిడ మీరునటులే, పొరపడకుండుటకు దేర♦బుచ్చితిమిమ్ముఁ. 820
తే. పలుకుచటుగాంధి తోడ నా♦వర్తకుండు, తనగుమస్తాను బిలిచి తె♦మ్మనె నమూన
వస్త్రములు తమమిల్లున♦వడిదయారు, నగునవి తాజసరుకుమో♦హానుడుచూడ.
క. ఇవిమాయంత్రమున దయా,రవునవి వ్యర్థమ్మునుండి ♦ యతిచౌకగనే
డివిపంపఁబడు హిమాలయ,మువరకు గనవీనిపైన ♦ మోజగుప్రజకుఁ. 822
తే. కలరుదేశమందంతటఁ ♦ గలయఁదిరిగి, 'ఆర్డరులు' దెచ్చుటకు వీని♦కరయనీదు
వాణి నీవారలెవ్వరే ♦ పాటియిరుగ,నట్టి చోటులలోగూడ ♦ దిట్టమతిని. 823

వ. "అందువలన మీబోటి పెద్దల ప్రచార సహాయము మా కిపుడంతగా నవసరము లేదు. పైపెచ్చు భారతదేశమందలి వస్త్రోత్పత్తి తదీయ ప్రజాకోటికి వలసినంత లేదని మీ రెఱుఁగవలసిన సత్యము. కనుక మనకు కావలసినంత వస్త్రోత్పత్తి మన దేశమందు చేయగల్గినచో విదేశములనుండి వస్త్రముల దిగుమతి నిలిచిపోగలదు. కనుక మీరు మీయిప్పటి ఖాదీ యుద్యమము నుజ్జగించి, నూతనవస్త్రయంత్ర స్థాపనమున కుద్యమింపుడు. మన కిపుడు కావలసినది గిరాకి నెక్కువచేయుట గాదు. ఉత్పత్తి నెక్కువగా నొనర్పవలయును" అని యా యంత్రాధిపతి వలుక గాంధి "నేనట్టి వస్త్రోత్పత్తి పెంపునకే శ్రమించుచున్నాను. కనుక మీరు తప్పక నాయుద్యమమునకు సాయము చేయవలయును" అని బదులిడెను. 824

క. ఈప్రత్యుత్తరమున కత, డప్రతిభుండగుచు నెట్టు♦లగునది యటుమీ
రే, ప్రాతయంత్రముల నిపు, డీప్రోలునఁ జెపుడు పెట్ట♦నెంచితి రనఁగన్. 825

ఆ. నీవు చెప్పునదియె ♦ నేచేయుటలు లేదు, రాటమునకు దిరిగి ♦ ప్రాణమిచ్చు
టందు మునిగి తేలు ♦ చహరహమ్ము న్నాడ, ననుచుగాంధివలుకు♦నంతనతఁడు.

మం. అదియేమ దేమియం♦చతిసంభ్రమమున,పలుకనాతడుగాంధి♦తెలుపుచంతయును
చరఖాకొఱకు తాను ♦ సలిపినయత్న, మెల్లయు నిటువల్కె ♦ మెల్లగా వినుడు
మీరనినట్లు మీ♦మిల్లుయేజెంటు,గా నుంట నిరుపయో♦గమ్మె పైపెచ్చు
మేలుకన్నను కీడె♦మిగుల నొనర్చు,నది దేశమునకంచు ♦ నాత్మదలంతు
కనుక బూనితి జేయ♦ఖద్దరోత్పత్తి, చేవడికిన నూలు♦చే మగ్గములను
పనిలేక తిండికై ♦ పలవించు భరత,మాత బిడ్డలకు చే♦యూతగానుండ
స్త్రీలుచేవడికిన ♦ నూలుచేనేయు, బట్టల మనప్రజఁ ♦ గట్టఁగోరితిని
ఇది మదుద్యమమిందు♦నేహానిలేదు, ఉండుమేలేబట్ట ♦ లుత్పత్తిగాగ
కనుక నాయుద్యమ ♦ మున నీపలికిన, కీడులు మూడవు♦చూడుమటంచు
బదులాడ మోహనుం ♦ "డధికవస్త్రముల, యుత్పత్తి నీయుద్య♦మోద్దేశమైన
మంచిదే కాని యీ ♦ యంచితయంత్ర, కాలానచర్ఖాకు ♦ కలదెయభ్యుదయ
మని సంశయింతు నే♦నైన నీకెల్ల, విజయమేగాకంచు" ♦ వీడ్కోలొసంగె
నావస్త్రముల మిల్లు♦యజమాని గాంధి, కెన్నియో విషయంబు♦లెఱిగెనిందతఁడు.

## ఉద్యమాభ్యుదయము

శా. ఆలీసోదరు లుద్యమింప ఖిలప♦త్త్రాందోళనం బెంతయో
చాలాముందుకు సాగుచుండ మిగులం ♦ జర్చించె నీసంగతిన్
మౌలానాబ్దులు బారిగాగల యులే♦ మాల్తో ముసల్మానులున్
ఆలంబింప గలారహింస నెటులం ♦ చాలోచనన్ గాంధియున్. 840

తే. చివరకందరు సమ్మతిం♦చిరి మహాత్ము,దీయ మత మడ్డపడ దహిం♦సాయుతమగు
రాజనీత్యనుసరణకా ♦ యోజబూను, వారలందుకు దప్పర♦వారిననుచు. 841

ఆ. చాలదీర్ఘచర్చ ♦ జరుగసాత్త్వికనిరో, ధమ్మునకును సమ్మ♦తముగతీరు
మానమయ్యెఁ దత్స♦మావేశమందున, బాయశంకలు ఖిల♦పతునసెల్ల. 842

క. ఏరీతిసాధ్యమగు హిం,సారహితోద్యమ మటంచు ♦ శంకించెహాకీ
మారంభమునందైన న,వారి ననంతర మాతఁడు ♦ పాల్గొనెనందుఁగా. 843

వ. తదనంతరము ఘూర్జరరాష్ట్ర రాజకీయసభా సమావేశమున గాంధియే యీ సహాయ నిరాకరణతీర్మానము, రాష్ట్రసభయందట్టితీర్మానము కూడదను వాదించు వారినందరి నెట్టకేలకొప్పించి నెగ్గించెను. ఇందులో వల్లభాయిపటేలును నాటిసభకధ్యక్షులుగా నుండిన అబ్బాస్ త్యాబ్జియు గాంధికి బాసటగానుండిరి.

తే. పదియుఁ దొమ్మిదివంద లి♦ర్వదవ వత్స,రమున సెప్టంబరున దీని♦విమలచర్చ
సలుపకాంగ్రెసు ప్రత్యేక♦సభనుగూర్చి, రల్లకలకత్త నగరమ్ము♦నందు వేర్మి. 845

క. లాలా లజపతిరాయా, కోలాహల మొప్పనెంతొ ♦ కూడిన సభకున్
మేలిమినధ్యక్షుఁడుగా, పాలింపగ నెన్నుకొనఁగ♦బడియెన్ వరుసన్. 846

సీ. బొంబాయి కలకత్త ♦ పురముల మధ్య ప,ర్వాత్తె ప్రత్యేకము ♦ రెయిలుబండ్లు
కాంగ్రెస్ ఖిలాపతు ♦ కలియుటచే గొప్ప,సభగూడె డెలిగేట్లు ♦ విభవమలర
అర్థింపగా షౌక♦తాలి సహాయ ని,రాకరణమ్ము తీ♦ర్మానచిత్తు
గాంధితానె తయారు♦గావించెఁ గాని య,హింసాపదమ్ము లో♦పించెనందు

ఆ. అంతపక కహింస ♦ యనుపదమ్ము ప్రసంగ,ములను వాడె ప్రాయు♦టలనువీడె
తత్పదార్థమీయఁ♦దగినయుద్గ్రాహించి, పదములకును గాంధి♦వెదకికొనుచు.

వ. షౌకతాలినడుగ 'నాన్ వైలెన్సుకు' బామాను అనియు 'నాన్కోపరేషను'కు టర్కిమూవలత్ అనియు దగిన పర్యాయపదములుగా వాడిన బాగుండునని గాంధికి సలహానొసంగెను. ఈయాలోచనల సలహాలమధ్య నిమగ్నుడగుటచే గాంధి తాను తయారుగావించినచిత్తులో 'నహింసా' పదమే పూర్తిగాలోపించెను. అయిన నారేయియందే తనతప్పునెరింగి మరునాటి యుదయమునఁ జిత్తును ముద్రణకిచ్చుటకుముందాలోపమును సవరింపవలయునని మహాదేవదేశాయితో జెప్పిపంపెను. అయినను లోపసవరణకుముందే ముద్రణ జరిగిపోయెను.

మం. ఆనాటిసందెవే♦ళందున గలిసె, విషయనిర్ణయసభ ♦ వేళకుఁదప్పు
సవరించుకొని గాంధి ♦ సభఁబ్రసంగించె, పంజాబ్ ఖిలాపత్తు ♦ పరిభవమ్ములని
వారణార్థమె గాంధి ♦ కోరెనుద్యమము, కాని శ్రీవిజయ రా♦ఘవచారిపల్కె
ప్రతిఘటనోద్య మా♦రంభమ్మెసేయ, నున్న స్వరాజ్యమే ♦ యున్నటలెన్స
మనకోర్కె గానంచు ♦ ననమోతిలాలు, కూడమద్దత్తు నా♦కోర్కెకొసంగె.

గాంధియందుల కొప్పి ♦ కలిపె నావిషయ, మాతీరుమానంబు ♦ నందద్దిసభను
సమ్మతింపఁగఁబడె ♦ కొమ్ములుదిరిగి, నట్టినాయకులెల్ల ♦ దిట్టమౌచర్చ
చేసినపిమ్మట ♦ చేరెనుమొదట, మోతిలా లుద్యమ ♦ మున నాగపూరు
కాంగ్రెసునం దాసు ♦ కలిసె లాలాజి,యుం జేరె సమ్మతి ♦ నుద్యమమందు
అయిన నప్పుడె మన ♦ మందున లోక,మాన్య మహాశయు ♦ మరణంబుదోప
అకట! నారతుకుం ♦ దరిగెనేయంచు, విలపించె గాంధియా ♦ కలకత్తయందు
గలయెల్లవారలు ♦ విలపించి''రల్ల, లోకమాన్యుడులేని ♦ లోటుపూరింప
చాలమీ మనదేశ ♦ చారిత్రమున వి,పత్కరమైన యీ ♦ పట్టునఁదంచు. 361

నాగపురమున—1920

క. కలకత్తా నగరమునం,దలి కాంగ్రెసు 'స్పెషలు సెషను' ♦ నం దీర్మానం
బులు ప్యాసైనవి ఖాయ,మ్ములు గావలెనన్ల నాగ ♦ పుర కాంగ్రెసునన్. 362

సీ. వత్సరమ్మున కొక్క ♦ పరి జరిగెడు కాంగ్రె,సాయేట నాగపూ ♦ రందు జర్గె
అటగూడ కలకత్త ♦ యందుబోలె ననేకు, లకుదెంచి రరయ కాం ♦ గిరెసుసభకు
ప్రతినిధుల్ సంఖ్యకు ♦ పరిమితిలేమినిం, బదియు నాలుగువేల ♦ మందియుండ్రి
లాలాజికోరిన ♦ స్కూలుబహిష్కార, సవరణయును దాసు ♦ సవరణలును

తే. గాంధిసమ్మతించెఁ ♦ గలిగెనేకగ్రీవ, సమ్మతిసభయందు ♦ నిమ్ముగాను
నాగపురమునందు ♦ నానోకపరేషను, తీరుమానమునకు ♦ దివ్యముగను. 363

ఆ. నాగపురిని విజయ ♦ రాఘవాచారి య,ధ్యక్షు డచటిసభకు ♦ నందుగల్గె
పరిమితి నియమమ్ము ♦ ప్రతినిధిసంఖ్యకు, ఆరువేలమంది ♦ యనుచు నాడు. 364

తే. గాంధి పదునైదువందల ♦ మంది చాలు,ననియె నైనవిషయ నిర్ణ ♦ యసభవారు
సంఖ్యయెక్కువగానున్న ♦ జాలమంచి,దనిరి మధ్యస్థ నిర్ణయ ♦ మూరువేల
మందిగా నిర్ణయించిరా ♦ నందముగను. 365

చ. ప్రతినిధులెక్కువైనఁ బని ♦ బాగుగ జర్గునటంచు నమ్ముటల్
అతుల ప్రజాప్రభుత్వమున ♦ కాదరువేనని విశ్వసించుటా
వితమదియెల్ల భ్రాంతియని ♦ వెర్రియటం చనుభూతి నెర్గె సు
స్థితమతియైన గాంధి తల ♦ చెన్మది స్వానుభవంబు పెంపునన్. 366

మం. ప్రజల బాగోగులఁ ♦ బరికించుటందు, నిజమైన యాసక్తి ♦ నియతిమైకల్గు
పదునైదువందల ♦ ప్రతినిధు లారు,వేలమందిని మింత్రు; వే ♦ ప్రజాస్వామ్య
రక్షణ; నట్టి సం ♦ రక్షణకెపుడు, ప్రజలాత్మగౌరవ ♦ స్వాతంత్ర్యమాన
సోత్సిక్తులగు చెందు ♦ నుండగావలయు, మంచివారిని సత్య ♦ మనమున్న వారి
నేతప్ప నితరుల నెన్నుకోరాదు, తమప్రతినిధులుగా ♦ దప్పిజారియును
కాంగ్రెసాశయపృచ్ఛఁ ♦ గడుచర్చజర్గె, గాంధిచేత దయారు ♦ కావింపఁబడిన

చట్టంబునందాంగ్ల ♦ సామ్రాజ్యమందు, సాధ్యమౌనెడ స్వరా♦జ్య మసాధ్యమైన
దానికివెలుపల♦నైన స్థాపించు, టాశయమ్ముగ కాంగ్రె♦సనవరతంబు
కష్టించుటనియుండె ♦ కాంగ్రెసులోని, వేరొకపక్షంబు ♦ వేరుగా దలచె
మాలవ్యజిన్నాల ♦ మరియొకకక్షి, ఆశయమ్ము స్వరాజ్య ♦ మాంగ్లసామ్రాజ్య
మందుండి సాధించు ♦ టని తెల్పిరద్ది, ఓటులుతక్కువై ♦ యోడెనుసభను
ఆస్వరాజ్య స్థాప♦నార్థమైపూను, సాధనమ్ములుగూడ ♦ సాధువులుగనె
ఉండవలయునంచు ♦ నొగిపల్కెగాంధి, అట్టి నిర్బంధము ♦ లనవసరమని
కొందరువాదించి ♦ రందైనఁ గడకు, కాంగ్రెసామోదించె ♦ గాంధిచెప్పినదె
ప్రజనిజాయితి నీతి ♦ శ్రద్ధయుం దెల్పి, గల్గివర్తించిన ♦ ఘనవివేకులుగ
అగుదురీనియమమ్ము ♦ లనుసరించునెడ,నని గాంధి తలపోసె ♦ హైందవ ముసలి
మానులైక్యముగూర్చి ♦ మరియునస్పృశ్య,తా నివారణము ఖ♦ద్దరులగురించి
తీర్మానములొనర్చి ♦ రోర్మినానాటి,నుండి హైందవ సభ్యు♦లండఱై నిలిచి
రస్పృశ్యతనడంప ♦ నాసక్తిపేద, భారతీయులతోడ ♦ బాంధవ్యబంధ
మేర్పడె ఖాదితో ♦ నెలమి కాంగ్రెసుకు, అల్ల ఖిలాపతు♦కై పూనినట్టి
ఉద్యమమ్మందు హిం♦దూముస్లిములకు, ఐకమత్యముగూర్ప♦యత్నముల్ జరిగె.

స్వస్తి—1920-21

వ. 1920 వ సంవత్సరం డిశంబరు మాసమున నాగపురమునఁ జరిగిన కాంగ్రెసు నాటినుండి గాంధిజీ జీవిత గాథ ప్రజాకోటి కవగతమైనదాయె. ఇంతియేగాక 1921 వ సంవత్సరమునుండి కాంగ్రెసు నాయకులతో కలిసియే గాంధిజీ పని చేసి యుండుటవలన, వారితో నాయనకుగల సంబంధ బాంధవ్యములం దడవకుండ, గాంధిజీ గాథం దెలుప సాధ్యముగాదు. మీదుమిగుల కాంగ్రెసుమూలముననే గాంధిజీ, 1921 నుండి తన ప్రధాన ప్రయోగ పరిశీలనలన్నియు సాగించెను. 1925 నవంబరులో, గాంధిజీ తన యీ జీవితచరిత్రను, 1920 డిశంబరు వరకు తానుసాగించిన సత్యాన్వేషణ ప్రయోగముల నన్నిటి నేలాటి యాత్మవంచనలేకుండ వివరించుచు, ఘూర్జరభాషలో విరచించెను. దాని నాంగ్ల భాషలోనికి మహాదేవ దేశాయియు, పైరులాలును అనువదించిరి. 888

ఆతని కవగతమైన రీతిని సత్యమును, నందు కాతఁ డవలంబించిన విధానమును, పొల్లువోకుండ, వెనుకాడకుండ విశదీకరించుటయే గాంధిజీ యుద్దేశము. ఇందువలన గాంధిజీ కనిర్వచనీయమైన మానసికానంద మొదవెను. చపలచిత్తులైన చదువరులకుగూడ యాతని యీ సత్యాన్వేషణ చరిత్ర చదువుటవలన సత్యాహింసలందు విశ్వాసము జనించునని గాంధిజీ యాకాంక్ష. ఆతని స్వానుభవమువలన, సత్యమువినా వేరొండు దైవములేడనువిశ్వాస మాయన కొద

వెను ఆతని యీ యాత్మచరిత్రయందలి ప్రతిపుటయందును అట్టి నిత్యసత్య సాక్షాత్కృతి కాయన యహింసావిధానమే సాధనమని ప్రకటితమగుచుండును. పాఠకుని కట్లు ప్రకటితముగాకున్న, తన యీ రచన సకలము నిరర్థకమగునని గాంధిజీ భావించెను. అట్లెందైన నిరర్థకమైనను, అయ్యది తనలోని యేదో లోపమువలన సంభవించినదై యుండునుగాని, సత్యాహింసల మహిమయందలి యేలాటి లోటువలన గాదని గాంధిజీ భావన. ఇంతకు నహింసా సాధనార్థము తానెంత చిత్తశుద్ధితో కృషిచేయుచున్నను, తన జ్ఞానములన్నియు నింకను లోపభూయిష్టములుగానే యుంటున్నవనియు, మనమనుదినముగనెడు భానుభగవానునికన్న కోటిరెట్లధికమై, వర్ణనాతీతమైన సత్యభగవానుని కాంతి యొక్క తళుకుమాత్రమే తనకగపడి యగపడకుండ యదృశ్యములగుచున్నదనియు, నిజానికి దాను బొందగలిగినదా సత్యభగవానుని మహాతేజోదీప్తిలోని మినుకు మినుకుమను నొకానొక తళుకుమంత్రమే యనియు, నైనను దన పరిశీలనాఫలితములఁబట్టి సంపూర్ణసత్య వైవసాక్షాత్కారము, సంపూర్ణమగు నహింసా సాధనానంతరము సంభవింపగలదని తాను చాటగలననియు గాంధిజీ వాకొనెను.

సకలాంతర్యామియగు సత్యభగవానుని ముఖాముఖి సందర్శనభాగ్య మందవలయునన్న, సృష్టియందలి నికృష్టాతి నికృష్టజీవజాలమ్మునంతయు, దన్నుంబోలె ప్రేమాదరముల నరయవలయును. కాన సత్యాన్వేషియగు మానవుడెవ్వడును, జీవితమందలి యేరంగమునుండియుఁ దప్పుకొనఁజాలడు. అందువలనఁ దనకు సత్యభగవానుని యెడగల భక్తివిశ్వాసములే తన్ను రాజకీయ రంగమునం దురక జేసినవి. నిస్సంకోచముగా, వినమ్రతతో, మతమునకు రాజకీయములతో నేలాటి సంబంధము లేదనువారికి మతమంటే యేమోకూడా తెలియదనియే తనయభిప్రాయమని గాంధి నుడివెను.

సకల జీవజాలముతోటి యాత్మీయత, ఆత్మశుద్ధిలేకుండ సాధ్యపడదు. ఆత్మశుద్ధివినా, అహింసావలంబన మొకశూన్యస్వప్నమే యగును. పరిశుద్ధహృదయములేనివానికి భగవాను డెప్పటికిని సాక్షాత్కరింపడు. కాన, నాత్మశుద్ధియనగా జీవితమందలి సకలరంగముల పరిశుద్ధమొనర్చుటయే యగును. పవిత్రీకరణము వడివడిగా సాగుచు, నందరిని లోబర్చుకొను స్వభావముగలది యగుటచే, నాత్మశుద్ధి గలిగినవారి పరిసరములన్నియుఁ బవిత్రములేయగును.

కాని యాత్మశుద్ధి సాధనాపథము, నిట్రమైనదగుటచే, తదారోహణమత్యంత దుష్కరమైనది. సంపూర్ణమైన యాత్మశుద్ధిఁ బొందగోరువారు మనోవాక్కర్మల మూడిట నిర్వికారులై యుండవలయును. అట్టి త్రికరణశుద్ధిఁగల మానవు డేనాడు నాగ్రహమునకు లోనుగాడు.

మం. సంపూర్ణశుద్ధాత్మ ♦ సాధించుకొఱకు, త్రికరణమ్ముల విశు♦ద్ధిని గాంచవలయు
ప్రియమునప్రియమును♦ప్రేమ ద్వేషమ్ము, మొదలగు నేద్వంద్వ♦ములకతీతుడుగ
నుండుట పాడి త♦దున్నతస్థాన, మంద లేదింతకే ♦ నద్దిసాధింప. 891
చేసెడు నాకృషి ♦ సిద్ధింపలేదు, అందుచేత మహాత్ము♦డను లోకవినుతి
తరుచుగా నన్ను బా♦ధను పెట్టుచుండె, కామాది సూక్ష్మవి♦కారంబులుడుగ
కొన్న దిగ్విజయంబు ♦ కన్న దుష్కరము, ఇండియాలో నడు♦గిడిన దాదిగను
నాలోన దాగియు♦న్నట్లును భూతి, కలిగెడు చిత్తవి♦కారముల్ తరుచు.
అందుచే బొందెదే♦నవమతిర్యైన, నపజయభావ మా♦వంత లేదింక
పలువిధానుభవముల్ ♦ పరిశీలనములు, ప్రాప్తులై సంతస ♦ ప్రాప్తికల్గించె
అయినదింకను దూర♦మరుగంగ వలయు, శూన్యస్థితిని నాకు♦ జొచ్చుటుచితము
తోడి జీవులలోనఁ ♦ దుదిస్థానమందు, చేరినవానికే♦సిద్ధించు ముక్తి
అడకువ కంతిమ ♦ హద్దు అహింస, కానమానసిక వా♦క్కాయకర్మలను
తనకహింసా ప్రసా♦దము గూర్ప సత్య,భగవాను ప్రార్థింపఁ ♦ బాలకుగోరె
గాంధీమహాత్ముడు ♦ కనుక నీగ్రంథ, భగవాను బరమాత్ము ♦ ప్రార్థించి సుఖము
లందుడహింసా ప్ర♦దానువర్తలుగ, జీవకారుణ్యంబు ♦ చెలగ నింపార. 903

క. రామా, మత్కృతికన్యా, కామా, నీభక్తుడైన ♦ గాంధిచరిమం
దోమియు నైదవస్కంధము, ఆమోదము వెలయఁ బ్రేమ ♦ నాలించితివే. 904

తే. రామ శ్రీమ దంబటి సుబ్బ♦రాయవిరచి,తాంధ్ర గాంధిమాహాత్మ్యమం♦దాలకించి
నావె యైదవస్కంధ మ♦నన్యమాన్య, ధన్యతమభావయుత భవ♦ద్భక్తగాథ. 905

పంచమస్కంధము సంపూర్ణము.

---

# అయిదవ స్కంధమున కనుబంధము

వ. 1915 వ సంవత్సరము జనవరి 9 వ తేదిన గాంధి బొంబాయికి వచ్చెను. అత
డోడనుండి దిగకముందే గోకులదాసు మొదలగు బొంబాయినగర నాయకులు
కొంద రోడపైకివచ్చిరి. రాజవంశీయులు, రాజప్రతినిధులు మాత్రమే దిగునట్టి
'అపోలోబందరు' అనుచోటనే గాంధి దిగుట కేర్పాటులు చేయబడియుండెను.
అచటనుండియే గాంధి దంపతులకు స్వాగతమిచ్చి ఊరేగింపుగా గొనిపోవ
భారతనాయకులు తలపెట్టిరి. కాని అందు కధికారు లనుజ్ఞనీయమి నాయేర్పాటు
విరమింపఁబడెను. 1

### కాన్ఫరెన్సు - కాంగ్రెసు—1917

ఆ. రాజకీయ కాన్ఫ♦రన్సు కధ్యక్షుడై, ఘూర్జరమున వెలయు ♦ గోద్రపురిని
మోహనుండొనర్చె ♦ ముగ్ధులుగా సభ్యు, లోక ప్రసంగమిట్టు♦లకలుషముగ. 2

ఆ. "తిరుగుబాటొనర్చు ♦ వరకెల్లవారును, మసలుచుంద్రుగాదె ♦ మంచిగాను
వారిరాజభక్తి ♦ గూరిచి తీర్మాన, మిట్లు మూఢబుద్ధి ♦ నేలఁజేయ. 3

ఆ. "రాజుగారి యెడల ♦ రాజభక్తిని బ్రకటించు తీరుమాన ♦ మేలయంచు"
చించివేసినట్టి ♦ చిత్తును గాంధి మా,మూలుగలికి భిన్న♦ముగను బలికి. 4

వ. ఆవత్సరాంతమున కలకత్తా నగరమున జరిగిన కాంగ్రెసునకు గాంధి యరిగెను.
ఆ సందర్భమున దాడబడిన 'పోస్టాఫీస్' అను టాగూరునాటకమును తిలకు,
అనిబిసెంటమ్మ మొదలగు దేశనాయకులతో గలసి గాంధియు దిలకించెను. ఇంతి
యేగాక, వేషభాషలందెల్ల స్వదేశరీతులఁగూర్చి ప్రబోధించుచు నెన్నో వ్యాస
ములను వ్రాసెను. ఉపన్యాసమును చేసెను. అందలి సారాంశ మిట్లుండెను. 4

మం. పరదేశవస్త్రముల్ ♦ ధరియించునెడల, జరుగుమోసము స్వదే♦శమ్మునకంచు
తలచువారలదేల ♦ దాల్తురో బుద్ధి, వీడివిదేశాల ♦ వింతవేషముల
మనవేషధారణ ♦ మనదేశ పరిసరముల వాతావర♦ణమునుసరించి
వెలయుచో నెంతయో♦విమలమైయుండు, భారతీయుడుకటా! ♦ప్యాంటను వేస్తు
కోటునెక్టయిలను ♦ బూటులదాల్చు, టెంతయో వింతగా ♦ నెసగునుగాదె
అనుచు దరుచు స్వదే♦శాత్మప్రచార, మెనయగా నొనరించె ♦ ననయంబుగాంధి
అటులనేదేశ భా♦షార్హతగలది, హిందియె యగుగాని ♦ యింగ్లిష దెపుడు
కాజాలదని నొక్కి♦గాంధి వచించె. 12

### సైనిక సమీకరణోద్యమము—1918

వ. 1918 వ సంవత్సరం, ఏప్రిలు నెల 27 వ తేదిన నప్పటివైస్రాయి చెమ్సుఫర్డు
ప్రభు వాహ్వానింప ఢిల్లీకి యుద్ధసభకు హాజరుగా గాంధియరిగెను. సభానంతర
మున సిమ్లాకరిగిన వైస్రాయికి బ్రజల కోరికలగురించి యొకలేఖ వ్రాసెను.
అందలి ప్రధానాంశముల సారాంశ మిట్లుండెను. 13

సీ. కొంకితి మొదట బాం♦ల్గ్లాంటకు మీ యుద్ధ, సభనందు లేమిఁ బ్రజ♦జాభిమాన
నాయకుల్ లోకమా♦న్యాదులైనను జేరి, తైనను మీపలు♦కాదరించి
కానినామాటను ♦ గౌరవించియు రాష్ట్ర, సభలజేరగ బిల్వ♦జనును వారి
సామ్రాజ్యమునకెల్ల ♦ సాయంబుచేయగా, వలతు నద్దాని య♦పాయమందు
తే. ఆంగ్లసామ్రాజ్యమున సమ♦గ్రాధికార, యుక్తసహభోగులుగ మేము నుండగోరి
తలతుమిపుడుమావిధ్యుక్త♦ధర్మమిట్లు, చేయ తత్తుల్యమగుహక్కు♦చెలగునంచు.
సీ. అందుచే మీ పల్కు♦నట్టి సంస్కరణలు, అలరు కాంగ్రెసులీగ్ ప్ర♦ణాళికాను
గుణ్యమ్ముగనటంచు ♦ గణుతించి మీసభా, సభ్యులు మనసార ♦ సహాకరింప
పలికిరద్దాన నీ♦బవరకాలమ్మున, పలుకకుండ స్వరాజ్య♦పదమొకింత
మూతుకట్టించి నా♦సోదర భారతీ, యులఁ జేరజేతును ♦ యుద్ధమందు
ఆ. దీనివలననాదు ♦ దేశీయులకుదాత్త, పదముగల్గుగాక ♦ బాయుగాక
జాతివర్ణ భేద ♦ సకలంబు నాంగ్లసా, మ్రాజ్య సీమలందు ♦ పూజ్యముగలు. 15
సీ. అయిన నీనాడు వి♦ద్యార్థికులగు వార, లుత్సాహముగలేరు ♦ యుద్ధమునకు
విద్యార్థికులమాట ♦ వెలువడినటు ప్రజా, కోటికి వరహాలమాట నిజము
భరతఖండమునకే ♦ వరుగుదెంచినదాది, సామాన్యప్రజతోటి ♦ సఖ్యముంట
కంటిస్వరాజ్యముం ♦ గాంతీంచుటెల్లరు, గతకాంగ్రెసందున ♦ గలసితేను
తే. గడువు కాలంబులోపల ♦ నిడగవలె స్వ, రాజ్యమిండియా కంచు దీ♦ర్మానమొందు
చేయనందలి కాంగ్రెసు♦నాయకులను, అయిననిద్దిదుస్సాహస ♦ మనియెతలతు.
సీ. కానిస్వరాజ్యంబు ♦ గనకున్న త్వరలోనె, తృప్తిజెందరు భార♦తీయులందు
కెంతత్యాగంబైన ♦ నెపుడుచేయగనున్న, వారుసామ్రాజ్య మ♦వారిగావ
నేడు సిద్ధముగనుం♦డిరి చేయనంతత్యా, గము స్వరాజ్యమ్ము మ♦నమున గోరి
కనుకనే సంగ్రామ♦మునకు గూర్పగలాడ, చాలమందిని నెట్లొ ♦ సైనికులుగ
తే. కాని ధనసహాయముచేయ ♦ గలనటంచు, పలుకనోడుదు దెలిసితి♦ప్రజలతోటి
మైత్రి నిండియుయిచ్చె సా♦మ్రాజ్యకోశ, మునకుతనశక్తికినిమించు♦ధనమటంచు.
సీ. ఎట్టపెత్తనమునే ♦ డీయకున్నను మాకు, మందిత్తురనునాశ ♦ చెందిసాయ
మీయగా మేమిట్టు ♦ లీయకొంటిమికాన, మాయాశను నిరాశ♦చేయునెడల
తలగునేడున్న యా♦దరమెల్ల మీయెడ, మాగృహచ్ఛిద్రాల ♦ మాటదెప్పి
అధికారుల నిరంకు♦శాధికారము సైపు, డన్నచో నదియసా♦ధ్యమ్మునాకు
తే. సైపజాలను నెదిరింతు ♦ శక్తికొలది, ఏనిరంకుశత్వముసేని♦గాన మాన
చేయుఁడధికార్ల దౌష్ట్యమ్ము♦చేయుడెచ్చు, రిక ప్రజలయభిప్రాయమో♦పికవినముని.
సీ. చాంపరాన్ ప్రజలకు ♦ చాలకాలమ్ముగా, సాగుచున్న నిరంకు♦శతదొలంచి
ఆంగ్లప్రభుత్వ ధ♦ర్మాధికృతం జాటి, తిని ప్రపంచమునకు ♦ దెల్లముగను

సత్యార్థమై ప్రభు♦త్వాత్యయమ్ముఁ గోర్చు, శక్తినోర్వంగ న♦శక్యమవని
విప్రభుత్వంబున ♦ కేనియటంచు జా. లెను ఖేదమందల ♦ జనము తెలిసి

**తే.** కనుక ప్రభుతయెడల ♦ గలమనోక్లేశంబు, తొలగె బ్రజలయందు♦తొంటిదెల్ల
కానఖేదచాంప ♦ రానులనాచేత, లనికి దోడుపడియె ♦ ననగజెల్లు. 19

**సీ.** వీడుమీనీయిట్టి ♦ వింత చేతలటంచు, నన్నాజ్ఞజేసిన ♦ నాగుమసుకు
ప్రేమశక్తిమారు ♦ పేరొప్పునాత్మశ, క్తిని మృగమ్ముల బల♦మ్మునకు బదులు
ఇంపుగా బ్రజకొన♦రించిన నిండియా, యెదిరింపగల దుర్వి♦నెల్లఁ జెలిమి
అందుచే నెల్లెడ ♦ నాపదల్ గోర్చు నీ,నీతి నామేన జీ♦ర్ణింపజేసి

**తే.** సమ్మతింపగజేతునే ♦ ప్రజకుజాటి, నాదుచేతల నీనీతి ♦ పాదుకొనగ
దన్మహాత్వము దెలియంగ♦ధరణికెల్ల, తనదుశ్రేయంబు సామ్రాజ్య♦మునకునెల్ల
మహామదీయరాజ్యంబుల♦మనుచునెడల, ఇండియాకుస్వరాజ్యంబు♦నిచ్చునెడల.

**వ.** తదనంతరము బొంబాయి నగరమున జరిగిన యుద్ధసభయందు పాల్గొన నాహ్వా
నింపబడిన తిలకు, జిన్నా మొదలగు నాయకులు తమతమ ప్రసంగముల స్వరా
జ్యము గూర్చి ప్రస్తావింప కూడదని మూర్ఖముగా పట్టుబట్టిన నా రాష్ట్రగవర్న
రును అతని వింతవైఖరిని బహిరంగసభయందు గాంధి తీవ్రముగా ఖండించెను.
అయినను సైనికసమీకరణ కుపక్రమించెను. తన్నుబోలె నిర్నిబంధముగా
సైనికసమీకరణ చేయమని వాంఛించుచు తిలకుకు, జిన్నాకు, అనిబిసెంటమ్మకు,
సురేంద్రనాథ బెనర్జికి గాంధి లేఖలు వ్రాసెను. ఇండియనులకు సైన్యమందు
కమిషనుపదవి నిచ్చునట్లు ప్రభుత్వము మాటనిచ్చునెడల తా నైదువేలమంది
సైనికుల సమీకరింపగలనని తిలకు, గాంధికి లేఖవ్రాయుచు నేబదివేల రూపా
యలకు చెక్కుపంపెను. తనమాటప్రకార మైదువేలమంది సైనికులఁ దాను
సమీకరింపలేనిచో నా యేబదివేల రూపాయల నా తప్పుకు పరిహారముగా
జెల్లింతుననియు వ్రాసెను. కాని గాంధి నిర్నిబంధముగా నందు కొడబడి
యున్నందున నా చెక్కును తిలకుకు త్రిప్పిపంపెను. 21

హార్నిమను ప్రవాసశిక్ష - గాంధి ప్రసంగము—1919

**వ.** 1919 ఏప్రిలు నెల 26 వ తేదిన బొంబె క్రానికల్ పత్రికా సంపాదకుడగు
హార్నిమనను ఆంగ్లేయునికి ప్రభుత్వము ప్రవాసశిక్ష విధించి యింగ్లాండున
కేగించెను. అపుడు బొంబాయి ప్రజలందు కోపాగ్ని ప్రజ్వరిల్లె నంత గాంధి
యిట్లొక ప్రకటన గావించెను. 22

**ఆ.** పూర్ణమౌనముద్ర ♦ బోలవెట్టి ప్రదర్శ,నములు సభలు ఖండ♦నములు మొరవ
ణులును ప్రజకునాయ♦కులయెడగల ప్రేమ, చాటగానుసతము ♦ శాంతినీతి. 23

### తిలక్ మరణము—1920

సీ. ఆగస్టు మొదటినా♦డారంభ మొనరింప, తలచె మోహనుడు స♦త్యాగ్రహమును
సింధుయాత్ర ముగించి ♦ చేరె బొంబాయికి, గాంధి జవ్హరులాలుఁ♦గలసినాడె
ఆనాటిముందు రే♦యందె చేరెను స్వర్గ,యాత్రకై తిలకుమ♦హాశయుండు
ప్రీతినాతనిశవ ♦ పేటికఁ దాల్చి, మోసెచౌపతికిని ♦ మోహనుండు
తే. తిలకుజన్మచే ద్విజుడైన ♦ కులము లేదు, ప్రజలనాయకులకటంచు ♦ బలికెగాంధి
వ్రాసెయంగిండియాయందు♦వ్యాసమొండు,తిలకుమహిమనుగూరిచి♦పలుకుచిట్లు,
మం. ప్రజలకెంతో ప్రీతి ♦ పాత్రుండతండు, పురుషసింహమతండు ♦ పోయెనుదివికి
మాతృదేశప్రేమె ♦ మతముగా వెలసె, చిత్తశుద్ధిని దృఢ♦చిత్తుడై సతము
అసమానధీశాలి ♦ యమలచరితుఁడు, సకలమ్ముమాతృ దే♦శమున కర్పించె
జన్మహక్కగు స్వరా♦జ్యంబు నాకంచు, ఎలుగెత్తి చాటెనెం♦దేగిన నెపుడు
ఆశించెఁ గనస్వరా♦జ్యముదాను బ్రతికి,యుండంగనేకటా ♦ వోయెనుదివికి
ఆతనిధైర్య సా♦హస మాతృదేశ, భక్త్యాదిసుగుణ ప్ర♦భావంబు గలిగి
కష్టించిత్వరలోనె ♦ గడియింపవలె స్వ,రాజ్యమాతని యాత్మ♦రాజిల్లశాంతి.31

---

# తప్పొప్పుల పట్టిక

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 2 | 4 | నిదె | నిండె |
| 5 | 2 | తెలయు | తెలియ |
| 8 | 29 | గస్తి | కస్తి |
| 10 | 10 | సన్నుత | సన్నుతి |
| 11 | 2 | శ్రవణస్వార్థ | శ్రవణుస్వార్థ |
| 11 | 13 | సుహాత్మ్మ | మహాత్మ్మ |
| 17 | 8 | శాసల | శాసను |
| 17 | 18 | దేకియుఁడా | దేనియుఁడా |
| 18 | 9 | నాసకి | నాసక్తి |
| 18 | 24 | ఆంగిపేయుఁడు | ఆంగిలేయుఁడు |
| 20 | 4 | మానుడెప్పాడి | మానుడెప్పా |
| 20 | 10 | మోహామందెదర | మోహానుందెదర |
| 21 | 7 | రతిర | మతిర |
| 22 | 6 | వెంచుకొనె | వెంచుకొనె |
| 23 | 11 | యమ్మతండు | యమ్మతనికి |
| 25 | 20 | అనుమతించెం | అనుమతించె |
| 26 | 15 | జిహ్వ | జిహ్వ |
| 31 | 7 | జోధింప | బోధింప |
| 33 | 18 | యుందూగార్య | యుందునగార్య |
| 34 | 6 | జనుద | జనుట |
| 37 | 7 | గోష్టి | గోష్ఠి |
| 38 | 3&7 | శ్రోత | శ్రోత్ర |
| 44 | 4 | గాధి | గాంధి |
| 46 | 14 | భంగపా | భంగపాటు |
| 49 | 8 | యశ్శ | యశ |
| 54 | 2 | పొలమందున్న | పొలముందున్న |
| 58 | 25 | నూత్న నాను | నూతనాను |
| 61 | 1 | బ్యూట్ | బూటు |
| 66 | 20 | నన్నింటికిని స్మేటి | నన్నింటికి స్మేటి |
| 67 | 26 | పానమ్మొకొాఱ | పానమ్మొకొరఱ |
| 69 | 21 | వరన | వర్తన |
| 73 | 20 | సత్యుక్తి | సత్యుక్తి |
| 76 | 8 | నేరరె | నేరరె |
| 76 | 18 | లోకాతీతమైన | లోకాతీతమ్మయిన |
| 77 | 31 | విదిస్ యూ | విదన్ యూ |
| 78 | 5 | హరిభద్రసూరి | హరిభద్రసూరి |
| 79 | 30 | సంతయు | సంతయును |
| 80 | 25 | భేదభావ | భావభేద |
| 81 | 1 | శాసనసభా | శాసనసభ్యా |
| 81 | 25 | మెదనిండుగా | మెడదనిండుగ |
| 90 | 2 | గాదంచు | గాదని |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 92 | 30 | రాయ్‌చంద్ | రాయచంద్ |
| 99 | 23 | గూళ్ళు | యిల్లు |
| 102 | 17 | లౌకక | లౌకిక |
| 102 | 30 | సుఫల | ఫల |
| 104 | 20 | ధీరుండం | ధీరుడం |
| 104 | 27 | బాలునెట్లు | బాలికలను |
| 104 | 32 | గోకేలుతనకు | గోకేలతనికి |
| 106 | 24 | చేతనే | చేతనా |
| 109 | 1 | ఆతుపాను | ఆతుపానున |
| 109 | 3 | రైకరంత్య | రైకకంత్య |
| 109 | 29 | లెప్పుడు | వెప్పుడు |
| 111 | 15 | గొనరుప | నొనరుప |
| 112 | 24 | వేడ | వెన్క |
| 113 | 21 | డిడెక్టపుల్ | డిటెక్టివుల్ |
| 114 | 5 | వెడలునప్పుడె | వెడలుమిప్పుడె |
| 120 | 4 | దీప్తినలన | దీప్తివలన |
| 120 | 27 | మెల్గాదు | మేల్గాదు |
| 121 | 2 | పరిణయమ్మొడేక | పరిణయమ్మండేక |
| 123 | 23 | కౌసల్యానం | సీతానం |
| 128 | 23 | జయమందున | జయమందునీ |
| 129 | 11 | యిండియును | యిండియును |
| 130 | 7 | లెప్టి సెంట్ | లెప్టి నెంటు |
| 130 | 8 | త్రోవ | త్రావ |
| 130 | 10 | చెన్నుదిరిగి | చెన్నుదరిగి |
| 130 | 20 | గాలిడనది | గాలిడినది |
| 137 | 18 | గోక్లే | గోక్లె |
| 139 | 23 | కృతజ్ఞాత | కృతజ్ఞత |
| 140 | 31 | కట | నకట |
| 140 | 31 | రాట్పురఘు | రాట్పురవు |
| 141 | 18 | ప్రజార మెప్పుడుక | పెదవారికై |
| 142 | 15 | సలికను | పలికను |
| 142 | 23 | ప్రయునింప | పయనింప |
| 142 | 31 | యచ్చమె | యిచ్చమె |
| 143 | 4 | ప్రసజల | ప్రజల |
| 143 | 5 | నడక | నడకకు |
| 143 | 9 | గోక్లె | గోక్లే |
| 144 | 3 | ప్రాతమున | ప్రాంతమున |
| 145 | 32 | గ్రహించుటంధి | గ్రహించుటందు |
| 146 | 7 | యొడవ | యొదవ |
| 146 | 18 | వతు | వతులు |
| 149 | 15 | డాక్టరుల | డాక్టరును |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 149 | 21 | విడియింపు | విధియింపు |
| 150 | 18 | ప్రాణమ్ములఖభయ | ప్రాణమ్ములకభయ |
| 151 | 7 | నధరోష్ట | నధరోష్ఠ |
| 151 | 9 | డచ్చెరువతడ | డచ్చెరువత |
| 151 | 15 | ప్రక్క | పక్క |
| 153 | 23 | యభ్ర | యబ్ర |
| 156 | 10 | భవిష్యజ్జీవి | స్వయంజీవి |
| 156 | 11 | మారబోచ్చె | మారజోచ్చె |
| 158 | 29 | గ్రహాబెట్టు | గ్రహంబెట్టు |
| 159 | 11 | నిర్మించి | నిన్మించి |
| 161 | 16 | యూనువదింప | యనువదింప |
| 161 | 23 | దెవుడు | దేవుడు |
| 162 | 28 | యధికార్ణ | యధికార్ల |
| 166 | 8 | సమంజము | సమాజసము |
| 167 | 18 | కలివతి | కలివ |
| 168 | 1 | నిరీతి | నిరతి |
| 169 | 26 | కాగ్రమించి | కాగ్రహించి |
| 175 | 2 | సమర్థుండ | సమర్థుడ |
| 175 | 8 | ఫోనిక్స్య | ఫోనిక్స |
| 176 | 32 | నాత్మడాత్మ | నాతడాత్మ |
| 178 | 4 | ఐరోపియనులతోటి | ఐరోపియనుజనుల |
| 179 | 6 | రుజూలకా | రుజలకా |
| 180 | 25 | బింగిలీ | బింగ్లి |
| 180 | 28 | పలికే | పలికె |
| 184 | 5 | సంగ్రకేతి | సంగకేతి |
| 186 | 7 | నియమమున | నియమము |
| 188 | 27 | శారీరిక | శారీరక |
| 189 | 25 | యొసంగకా | యొసంగకా |
| 190 | 22 | గౌంవించి | గౌరవించి |
| 191 | 10 | దీన | దీని |
| 191 | 10 | ద్రధిమ | ద్రఢిమ |
| 191 | 27 | విస్మృతి | విస్తృతి |
| 192 | 16 | నొకదేకా | నొకందేకా |
| 194 | 7 | కంత | నంత |
| 194 | 9 | చేయ | చేయు |
| 195 | 27 | తప్పకయే | తప్పకయా |
| 195 | 27 | మెలయు | మొలయు |
| 198 | 18 | యుందమాం | యుందముం |
| 201 | 4 | గాత్రిల | గాత్రుల |
| 201 | 11 | వాదము | వాదముల |
| 201 | 16 | పశ్చాత్పుడు | పశ్చాత్తప్తుడు |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 204 | 12 | తని | తన |
| 204 | 19 | సలహానుచు | సలహాయనుచు |
| 204 | 21 | పాది | పాడి |
| 208 | 23 | సరియే...సల్పుదువే | సరియొ...సల్పుదువే |
| 208 | 27 | కన్గొచును | కన్గొనుచును |
| 209 | 25 | మరొకండు | మరొండు |
| 212 | 25 | నన్య | నవ్య |
| 213 | 12 | ప్రభుత్వము | ప్రభుత్వమా |
| 213 | 19 | రాబ్య | రాజ్య |
| 213 | 25 | బంకేగుద | బందికేగుద |
| 216 | 27 | యద | యది |
| 220 | 12 | ప్రకిటించి | ప్రకటించి |
| 220 | 22 | బోల్గొనిరి | బాల్గొనిరి |
| 223 | 12 | మరునాదే | మరునాడే |
| 224 | 6 | గాంధిని | గాంధియు |
| 224 | 11 | నరయ | నరయు |
| 224 | 18 | బంచిన | బఠించిన |
| ,, | 31 | తెలియకనే | తెలియకనేను |
| 228 | 20 | కనుకనుకమ్ను | కనుకమున్ను |
| 232 | 22 | మందిత | మండిత |
| 233 | 19 | శాపురి | ఆపురి |
| 234 | 28 | విషయమున | విషయము |
| 237 | 26 | పురమంది | పురవది |
| 238 | 27 | ననుకొన్న | ననుకొనని |
| 240 | 4 | సేళ | వేళ |
| 241 | 7 | సెంటల | సెంటుల |
| 241 | 24 | వచ్చినను | వచ్చిన నను |
| 243 | 31 | కష్టముల్ | కష్టములం |
| 244 | 7 | కుక్లా | కుక్లా |
| 244 | 26 | సనును | సమను |
| 250 | 9 | దొక్క | నొక్క |
| 252 | 6 | నుందెవని | నుండెనని |
| 252 | 22 | వలయించి | అలయించి |
| 253 | 1 | లొప్పమి | లొప్పమిని |
| 255 | 30 | భాయ్‌చేసు | భాయ్‌చేయు |
| 258 | 17 | ప్రభుత్వము | ప్రభుత్వము |
| 259 | 12 | వృత్తు రాజ్యా | వృత్తు రాజ |
| 260 | 30 | సంతృప్తి | తృప్తికి |
| 262 | 4 | చాల×టుచు | చాలగచాటుచు |
| 265 | 21 | యాతని | యాతన |
| 267 | 27 | డొకనాడు | డొక్కదినమ్ము |